స్వము నాకు భారతదేశమే ప్రసాదించెను. కనుక నేనామెను వరించి తిని. ఆమె ప్రపంచమునకొక సందేశము నీయగలదని నా పరమ విశ్వాసము. ”

ఈ వాదము మమ్ము కదల్చివేసెను. కాని మాకు, జాతీయ కాంగ్రెసుకు దౌర్జన్యరాహిత్య మొక మతము లేక వేదవాక్కు-కాలేదు; కాజాలదు. అది కొన్ని ఫలితముల నీయగల యొక పద్ధతి, యొక నీతి. ఆ ఫలితములవలననే దానిమంచిచెడుగులను మనము చివర వరకు గుర్తింపవలసియుండును. వ్యక్తులు దానిని మతముగ, నిర్వివాద మైన సిద్ధాంతముగ భావించుకొనవచ్చును. కాని యే రాజకీయ సంస్థయు నదిరాజకీయముగనే యుండునంతవర కట్లుచేయజాలదు.

చౌరీచౌరాయు, తత్ఫలితములు దౌర్జన్యరాహిత్య పద్ధతిని పరీక్షింప నవకాశమిచ్చెను. గాంధీజీ సాత్విక నిరోధము నాపివేయుట కిచ్చిన కారణములే సరియైనవైనచో మన శత్రువు లెప్పుడు పోరాట మును నిలిపివేయుటకు తగిన పరిస్థితులను సృష్టింప శక్తిగలిగియుందు రనియే మేము భావించితిమి. ఇది యసహాయోద్యమ దోషమా ? లేక గాంధీజీ దానికిచ్చు నర్థములోనున్న దోషమా ? ఇంతకు నతడే యీ యుద్యమప్రదాత, నిర్మాత కనుక నేది దాని స్వరూపమో, యేది కాదో నిర్ణయింపగల యుత్తమ న్యాయాధికారి మరెవరుకలరు ? అతడు లేనిదే మన యుద్యమ మెక్కడ ? చాల వత్సరములైన తరువాత 1930 శాసనోల్లంఘనోద్యమమునకు కొంచెము ముందు గాంధీజీ యీ విషయమును స్పష్టపరచెను. అచ్చటచ్చట క్వచితుగా బయలుదేరు దౌర్జన్యమువలన నుద్యమము నాపివేయకూడదని యతడు చెప్పెను. అట్టి విధిలేని సంభవమువలన నది పనిచేయ జాలనిచో నది యన్నిపరిస్థితులకు తగిన యాదర్శపద్ధతి కాజాలదు. గాంధీజీ దీని నంగీకరింపడు. అతనిదృష్టిలో నీ పద్ధతి సరియైనదగు టచే నన్నిపరిస్థితులకు తగియుండి, వ్యతిరేక వాతావరణములో కూడ తగ్గుస్థాయిలోనైన పనిచేయగలిగి యుండవలెను. దౌర్జన్యరాహిత్య

కలాపము కెక్కువ యవకాశమిచ్చిన యీ యర్థము గాంధీజీ మనః పరిపాకజనితమో కాదో నేను చెప్పజాలను.

యథార్థముకు చాలమంది యట్లూహించినను, 1922 ఫిబ్రవరిలో 'సాత్వికనిరోధము నాపివేయుటకు చౌరీచౌరా యొక్కటియే కారణముకాదు. దానితో కుండనిండెను. గాంధీజీ తఱచు ఆంతరంగిక ప్రబోధమునుబట్టియే నడుచుచుండును. ప్రజలతో కలిగిన సన్నిహిత, చిరపరిచయముచే నతడు ప్రజ లెట్లు భావింతురో, యేమిచేతురో, ఏమిచేయగలరో గ్రహింపగల యొక నూతనశక్తి నార్జించెను. అతడీ యాంతరంగిక ప్రబోధానుసారము తన కర్తవ్యమును నిర్ణయించుకొని తన నిర్ణయమున కాశ్చర్యచకితులు, క్రోధపూరితులునగు తన తోడి నాయకుల సంతృప్తికొరకు కారణములను చూపయత్నించును. ఇవి, చౌరీచౌరా సందర్భములోవలె, యంత తృప్తికరముగా నుండవు. మన యుద్యమ మా సమయమందు (పైకి యుత్సాహశక్తులు దేశమంతటను వెల్లివిరియుచున్నను) ముక్కముక్క లగుచుండెను. శిక్షణము, క్రమము నశించుచుండెను. నాయకులందరు జయిలులో నుండిరి; తమంత తాము నడుపుకొని పోగలశక్తి, శిక్షణలను, ప్రజ లింకను పొందియుండలేదు. ఊరు పేరు లేనివాడైనను సరే కాంగ్రెసు కమిటీని వశపరచుకొనవచ్చును. యథార్థము కనేకమంది దుర్మార్గులు, ప్రభుత్వ ఏజెంటులతో సహా, ముందుకువచ్చి కొన్ని స్థానిక కాంగ్రెసు, ఖిలాఫతు సంఘములను వశపరచుకొనిరి. వారిని నిరోధించుటకు మార్గమేమియు లేదు.

అట్టిపోరాటములో నిట్టి కథలు కొంతవరకు జరుగక తప్పవు. జయిలుకు పోవుటలో నాయకులు ముందు నాయకత్వము వహించి తక్కినవారికి యుద్యమమును విడువక తప్పదు. ఈ పనులను చేయవలెననియు, వీనిని చేయరాదనియు, ప్రజలకు శిక్షణనిచ్చుటయే మనము చేయదగిన పని. 1930 వచ్చుసరికి మనము ప్రజల కనేక సంవత్సరము లట్టి శిక్షణ నొసంగితిమి. కనుకనే 1930, 32ల లోని శాసనోల్లంఘనోద్యమము లెక్కుడు క్రమసిద్ధిగను, శక్తివంతముల్లు

గను నుండెను. 1921, 22 లలో నిది లేకుండెను. ప్రజల యుద్రే కోత్సాహముల వెనుక నిదియేమియు లేకుండెను. ఉద్యమ మాపి వేయబడనిచో నచ్చటచ్చట ననేకచోట్ల దౌర్జన్యములు జరిగియుండు ననుటకు సందేహములేదు. ప్రభుత్వము దీనిని రక్తపాతముతో నణచివేసి భయంకర పరిపాలనను స్థాపించెడిది. దానితో ప్రజలలో భీతావహము కలిగి యవినీతి సంభవించెడిది. బహుశః యీ కారణ ములే గాంధీజీ మనస్సులో పనిచేసెను. ఈ విషయములను, దౌర్జన్య రాహిత్య శాస్త్రావశ్యకతను గుర్తించినచో గాంధీజీ నిశ్చయమే సరియైనది. మాలిన్యము నాపివేసి యతడు పునర్నిర్మాణము చేయ వలసి వచ్చెను. కనుక 1921లో సాత్విక నిరోధము నాపివేయుట యుక్తమే కావచ్చును.

కాని యొక మహోద్యమము నీ విధముగా హఠాత్తుగా కట్టి పెట్టుట దేశములో మరియొక విషాదమునకు సాయపడి యుండవచ్చును. రాజకీయ పోరాటములో నచ్చటచ్చట జరుగు వ్యర్థదౌర్జన్య మాపి వేయబడెను. కాని యణచివేయబడిన దౌర్జన్యమునకు మరియొక మార్గముండవలెను. తరువాత సంవత్సరములలో నిది కులకక్షలకు దోహదమునిచ్చెను. వివిధసంఘములలోని కులకక్ష ప్రేరకులు అసహాయోద్యమమునకు, శాసనోల్లంఘనమునకు కలిగిన ప్రజామోద ముచే శవాకారములవలె పడియుండిరి. ఇప్పుడు వారు పైకిలేచిరి. గూఢచారి యేజెంటులు, కులకక్షలను పెంచి ప్రభుత్వమెప్పను బడయదలచినవారు దీనికి పూనిరి. మాప్లా విప్లవము, అసామాన్య క్రూరపద్ధతులచే దాని నణచివేయుట కులకక్ష ప్రేరక పిశాచముల కవకాశము నిచ్చెను. శాసనోల్లంఘన మాపివేయబడక యీ యుద్యమము ప్రభుత్వముచే నణచివేయబడినచో కులద్వేషములు కులపోరాటములు నంత చెలరేగకుండెడివి.

శాసనోల్లంఘన మాపివేయబడక పూర్వము మరియొక విధ మగు ఫలితము నిచ్చినను యిచ్చునట్టి విశేష మొకటి తటస్థించెను. శాసనోల్లంఘనముయొక్క మొదటి ధాక ప్రభుత్వమును గజగజ

లాడించెను. అప్పుడే రీడింగుప్రభువు, వైస్రాయి, తాను విభ్రాంతి నొందినట్లు బహిరంగసభలో చెప్పెను. వేల్సు యువరాజు హిందూ దేశములో నుండుటచే ప్రభుత్వబాధ్యత మరింత హెచ్చెను. 1921 డిసెంబరులో ప్రజా నిర్బంధములు ప్రారంభమైన వెంటనే, కాంగ్రెసుతో రాజీచేసుకొనుటకు, ముఖ్యముగా యువరాజు కలకత్తాకు పోవనున్న సందర్భమున, ప్రభుత్వము ప్రయత్నించెను. జయిలులో నున్న దేశబంధుదాసుకు, బంగాళాప్రభుత్వ ప్రతినిధులకు మధ్య కొంత రహస్య సంభాషణ జరిగెను. చిన్న రౌండుటేబిలు సమావేశము కాంగ్రెసు, ప్రభుత్వములమధ్య జరుగవలెనని సూచింపబడెను. కరాచీ జయిలులోనున్న మౌలానా మహమ్మదాలీ యీ కాన్ఫరెన్సులో నుండవలెనని గాంధీజీ పట్టుబట్టుటచే నిది వీగిపోయెను. ప్రభుత్వ మందుల కొప్పుకొనలేదు.

చిత్తరంజనదాసు గాంధీజీ యభిప్రాయముతో నీ విషయములో నేకీభవింపక తాను జయిలునుండి వచ్చినతరువాత గాంధీజీని బహిరంగముగ విమర్శించి యతడు తప్పుచేసెననెను. మాకు, జైలులోనుండుటచే, యదార్థములు తెలియకపోవుటచే మే మెట్టినిర్ణయము చేయజాలకపోతిమి. కాని యీ స్థితిలో నట్టి కాన్ఫరెన్సువలన నెట్టిలాభము కలుగనట్లే కాన్పించెను. యువరాజు కలకత్తాను సందర్శించుకాలము నెట్లో గడపుకొనుటకే ప్రభుత్వ మీ యెత్తు యెత్తెను. ప్రధానసమస్య లట్లే యుండెడివి. తొమ్మిదేండ్లు గడచినతరువాత మనజాతియు, కాంగ్రెసుయు అనేకరెట్లు బలపడినను, యెట్టిఫలితము లేనియట్టి కాన్ఫరెన్సు జరిగెను. దీనిసంగతి యటుండ మహమ్మదాలీ యుండవలెనని గాంధీజీ పట్టుబట్టుట కేవలము సమంజసమనియే నా యభిప్రాయము. కాంగ్రెసు నాయకుడుగనేకాక ఖిలాఫతునాయకుడుగ కూడ నీతనిరాక చాల యవసరము. సహచరుని విడిచివేసెడి యే పద్ధతియు, నీతియు నెప్పుడును క్రమమైనది కానేరదు. అతనిని ప్రభుత్వము జయిలునుండియే విడిచిపెట్టినపు డింక కాన్ఫరెన్సువలన నెట్టి లాభము కలుగజాలదని స్పష్టమగుచునే యుండెను.

మాతండ్రి, నేనూ చెరియారు నెలలు వేరు వేరు కోర్టులచే శిక్షింపబడితిమి. ఆ విచారణలు కేవలము నాటకములు అయినను మే మందులో పాల్గొనలేదు. మాయుపన్యాసములలోను యితరచర్యల లోను మమ్ము శిక్షించుటకు తగినంతసరుకు లేకపోలేదు. కాని మాపై ప్రయోగింపబడిన నేరములు మాత్రము నవ్వుపుట్టింపక మానవు. తండ్రిగారు కాంగ్రెసు వాలంటీరుదళములో సభ్యుడని, దానిని రుజువుచేయుటకు హిందీసంతకముతోనున్న యొకఫారము దాఖలు చేయబడెను. సంతకము మాతండ్రిదేయైనను, అత డంతకు పూర్వ మెన్నడు హిందీలో సంతకము చేయకపోవుటచే, నతని హిందీ సంత కము నేకొద్దిమంది మాత్రమో యానవాలుపట్టగలరు. ఒక చింకి గుడ్డలవాడు సంతకమును రుజువుచేయుటకువచ్చి (యతనికి పోట్టకోసి నను అక్షరముముక్క రాదు) కాగితమును చేతపుచ్చుకొని పరీక్షించు వానివలె నటించి సంతకమును తిరుగవేసి చూచుచుండెను. నాకుమార్తె (అప్పటికి నాలుగేండ్లు) విచారణకాలమందు తండ్రిగారియొద్దనేయుండి యీ వినోదము చూచుచుండెను.

హర్తాళము చేయవలసినదని నోటీసులు పంచిపెట్టినట్లు నా మీద కేసు తేబడెను. లా ప్రకార మది యప్పట్లో నేరముకాదు. ఇప్పుడు, మనకు డొమినియను పరిపాలన కరతలామలకము చేయబడి నది. కనుక నిది నేరమేకావచ్చును. ఎట్లైనను నేను శిక్షింపబడితిని. మూడు నెలలయిన తరువాత నేను నా తండ్రితోను తదితర మిత్రుల తోను జయిలులోనుండగా నొకడు వచ్చి, శిక్షలను తనిఖీచేయు అధి కారి నే నక్రమముగా శిక్షింపబడితినని కనిపెట్టెననియు నాశిక్ష రద్దు చేయబడుటచే నేను వెళ్ళిపోవలసియుండునని చెప్పెను. నా తరఫున నెవరును పనిచేయకపోయినను, యిది యట్లు జరిగెనా యని నే నాశ్చర్యపడితిని. శాసనోల్లంఘన మాపివేయబడుటచే తనిఖీచేయుజడ్జీ లకు చురుకుపుట్టెను. నా తండ్రిని విడిచివెళ్ళుట నాకు విచారకరము గనే యుండెను. వెంటనే నేను అహమ్మదాబాదు వెళ్ళి గాంధీజీని చూడవలెననుకొంటిని. నే నచ్చటకు వెళ్ళులోపల గాంధీజీ నిర్బంధింప

బడుటచే, నే నతనిని సబర్మతి జయిలులో చూచితిని. అతని విచారణ కాలమందు నేను దగ్గరనే యుంటెని. ఆ విచారణ మా జన్మలో మాకు మఱపుకురాదు. న్యాయమూర్తి ఒక ఆంగ్లేయుడు. అతి మర్యాదగను, సవిచారముగను ప్రవర్తించెను. కోర్టులో గాంధీజీ యిచ్చిన స్టేటుమెంటు అద్భుతముగ నుండెను. మేము భావోద్రేక పూరితులమై తిరిగి వచ్చితిమి.

నేను అలహాబాదు తిరిగివచ్చితిని. కాని స్నేహితులును, సహచరులును, జయిలులోనుండుటచే నొంటరినైతిని. కాంగ్రెసు వ్యవహారములు సక్రమముగా నుండకపోవుటచే నేను దానికి పూనుకొని ముఖ్యముగా విదేశవస్త్ర బహిష్కారమును సాగించితిని. శాసనోల్లంఘనమాగినను యదిమాత్ర మాచరణలో నేయుండెను. అలహాబాదులోని విదేశవస్త్ర వ్యాపారులందరు విదేశబట్టల నిక దిగుమతి చేయమనియు, కొనమనియు ప్రమాణపత్రములను వ్రాసియిచ్చి దీని కొక సంఘము నేర్పరచిరి. సంఘకట్టుబాటులకు వ్యతిరేకముగ నడచినచో జుల్మానా విధింపబడునను సూత్రమున్నను పెద్దపెద్ద వర్తకులు దీనికి భిన్నముగా విదేశబట్టలను దిగుమతి చేయసాగిరి. ప్రమాణమును పాటించువారి కిది కష్టముగ నుండినను వారెట్టి చర్యను తీసుకొనజాలకుండుటచే మేము పికెటింగుచేయ నిశ్చయించితిమి. పికెటింగు పేరుచెప్పినతోడనే జుల్మానాలు చెల్లింపబడి క్రొత్తప్రమాణపత్రములు తీసుకొనబడెను. జుల్మానా లన్నియు బట్టల వర్తక సంఘమునకు జమకట్టబడెను.

రెండుమూడు రోజులయినతరువాత మరికొంతమంది సహచరులతో నేను మరల నరెస్టుకాబడితిని. అక్రమముగా భయపెట్టితిమనియు, నిర్బంధించి డబ్బు తీసుకొంటిమనియు మాపై నేరము మోపబడెను. నాపై మరికొన్ని నేరములును, రాజద్రోహము కూడ మోపిరి. నేను వాదించక కోర్టులో నొక పెద్ద స్టేటుమెంటు యిచ్చితిని. చివరకు మూడు నేరములకు మొత్తముమీద యిరువది యొక్క మాసములు శిక్షించిరి. ఇది నా రెండవ శిక్ష. ఆరువారములు బయటనుంటినో లేదో, నేను తిరుగ నా జయిలు ఆశ్రమమునకు పోతిని.

# 13

## ల క్నో జి ల్లా జ యి లు

1921 భారతదేశములో రాజకీయ నేరములకు ఖయిదు సంభవించుట క్రొత్త విషయముకాదు. ముఖ్యముగా బంగాళావిభజనమయినతరువాత నిరంతర జన ప్రవాహ మెప్పుడును జయిలుకు పోవుచునేయుండెను. విచారణ లేకుండగనే ప్రవాస శిక్షలు కూడ నుండెను. అప్పటికి భారతనాయక శిఖామణియగు లోకమాన్య తిలకుకు వృద్ధాప్యములో నారువత్సరములు శిక్ష విధింపబడెను. యీ ప్రవాస జయిలు శిక్షావిధానము యుద్ధమువలన మరింత వృద్ధియై యావజ్జీవశిక్షలకు, నురిశిక్షలకు కారణమైన కుట్రనేరములు మరింత తఱచయ్యెను. ఆలీసోదరులు, అబ్దుల్ కలమ్ అజాదుగారలు యుద్ధకాలపు ప్రవాసితులలో నుండిరి. యుద్ధము ముగియుటతోడనే పంజాబులోని సైనికశాసనము చాలమందిని తన పొట్టబెట్టుకొనెను. కాని రాజకీయ నేరములకు ఖైదుచేయబడుట తరచయినను యింతవరకది బుద్ధి పూర్వకముగ వరింపబడలేదు. అది యొకరు పనిచేయుచుండనా పని సందర్భములోనో లేక నే గూఢచారి యతనిపై కన్ను వేయుట చేతనో సంభవించుచుండెడిది. దానిని తప్పించుకొనుటకు కోర్టులలో వాదించుకొనెడివారు. దక్షిణాఫ్రికా సత్యాగ్రహోద్యమములో గాంధీజీయు, నతని వేలకొలది యనుచరులు మరియొక మార్గమును చూపించిరి.

అయినను 1921లో కారాగారమగమ్య ప్రదేశముగ నుండెను. క్రొత్త ఖయిదీని కబళించిన యీ ఇనుపద్వారముల వెనుక నేమిజరిగెడిదో యెవరికెరుక! అందలి నివాసులందరు ముచ్చులనియు, నుపద్రవకరులైన నేరస్థులనియు, సాహసికులనియు మే మూహించితిమి. జయిలనిన ఒంటరితనము, అవమానము, బాధ, కష్టములు – ఈయన్నింటిని మించి ముందేమి రానున్నదోయను భయము, 1920 లగాయితు

వేలకువేలు జయిలుకు పోవుచుండుటచే మేము క్రమముగా దాని కలవడి జయిలనిన నప్రయత్నముగా కలుగుచుండు నసహ్యాత్తా ద్వేషములు తగ్గుచుండెను. కాని ముందుగా నెంతటి మానసికసిద్ధి కలిగియున్న వానికైనను యినుప ద్వారములను దాటుటతోడనే మొట్టమొదట కలుగు నుద్రేకము మానదయ్యెను. నాటి లగాయితు నేటివరకు మూడువందల వేలమంది స్త్రీ పురుషులు రాజకీయ నేరముల కా యినుపకవాటములను దాటిరి. ఇందులో వేలకొలది యనేకసార్లు వచ్చుచు పోవుచుండుటచే లోపల నేమిజరుగునదియు బాగుగ గ్రహించియే యుందురు. వారచ్చటి విపరీత జీవితముకు, తిండిలోను, పనిలోను, మార్పు అనున దెంతమాత్రము లేని నిర్జీవ జీవితముకు, సాధ్యమగునంతవర కలవాటుపడిపోవుటకే ప్రయిత్నించిరి. అలవాటుపడిరి. అయినను మే మచ్చటకు క్రొత్తగా పోయినపు డెల్ల కొంచె మా ప్రాతయుద్రేకము, పటపటాంగము, నాడీ వేగము నుండకతప్పదు. విశాల ప్రపంచమును, పచ్చికబయిళ్ళను, జనసంఘములను, బండ్లవేగములను, బంధుజనులను, మిత్రబృందమును కడ సారి చూడవలెనని మా నేత్రము లప్రయత్నముగా వెనుకకు తిరిగి చూచును.

నేను మొదటిసారి జయిలులోనున్న కాలము నాకు జయిలు అధికారులకు కూడ నుద్రేకభరితముగ నుండెను. ఈ క్రొత్తరకపు ఖయిదీని చూచుటతోడనే జయిలు అధికారులు సగము స్తంభించి పోయిరి. దినదినాధికమగుచున్న వారి సంఖ్యాబల మపరిమితముగా నుండి పాత జయిలు సాంప్రదాయముల నన్నింటిని తుడిచివేయు మహా ప్రవాహమువలె కాన్పించెను. ఈ క్రొత్త యతిథి మరింత కొరకరానికొయ్య. ఇతడన్ని తరగతులనుండియు వచ్చుచు మధ్య తరగతినుండి హెచ్చుగా వచ్చుచుండెను. వీరందరు మామూలు ఖయిదీలకంటె కేవలము భిన్నమైన వారగుటచే వారిని చూచినట్లు వీరిని చూచుటకు వీలులేదు. దీని నధికారులు గ్రహించిరి. కాని వారి కేమిచేయుటకు తోచకుండెను. ఇతడు సామాన్య ఖయిదీ

సాధువు కాడు; వినయవిధేయతలుకలవాడు కాడు. జయిలులో నున్నను సంఖ్యాబల మతనికి పెట్టనికోటవలె నుండెను. బయట జరుగుచున్న యాందోళనము, లోపల జరుగుచున్న దానిని పరీక్షించు చున్న ప్రజల శ్రద్ధయు దీనికి మరింత దోహదము నిచ్చెను. మా కిట్టి కొద్ది యహంభావదృష్టియున్నను మేము సామాన్యముగా జైలు అధికారులకు తోడ్పడుచునేయుంటిమి. మా సహాయమే లేనిచో జయిలు అధికారుల కష్టములు పెరుమాళ్ళకే యెఱుక. జయిలరు తఱచు మాదగ్గరకువచ్చి వాలంటీరు లున్నచోటుకు వెళ్ళి వారిని శాంతపరచుమని కోరెడివాడు.

మా యంతట మేము జయిలుకు వెళ్ళితిమి, చాలమంది వాలంటీర్లు అనాహూతముగా జయిలులోనికి చొరబడిరి; కనుక తప్పించుకొని పారిపోదురను భయ మెంతమాత్రము లేకుండెను. ఎవనికైనను వెళ్ళిపోవలెనని కోరికయున్నచో క్షమార్పణ చెప్పిన చాలును. లేదా ముం దట్టి పనిచేయనని వ్రాతమూలము చాలును. పారిపోవుటకు ప్రయత్నించుటకంటె వేరు యపకీర్తిలేదు. అది రాజ కీయములనుండి తొలగుటయే యగును. లక్నో జయిలు సూపరింటెం డెంటు దీనిని బాగుగ గ్రహించి జయిలరుతో కాంగ్రెసుఖయిదీలను బయటకుపోవునట్లు చేయగలిగినచో నతనికి ఖానుబహాదరు బిరుదము నీయవలసినదని ప్రభుత్వమునకు శిఫార్సు చేసెదనని చెప్పెడివాడు.

జయిలులో, లోపలగాయున్న యొకయావరణలో, పెద్దకొటూ రులలో నా సహచరఖయదీలు చాలమంది యుండెడివారు. మాలో పదునెనిమిదిమంది బట్టలనేత నేసెడి యొకపాతపాకలో నుంచబడితిమి. దానిముందొక విశాలస్థలము కలదు. మాతండ్రి, నేను, నాపెత్తండ్రి బిడ్డ లిరువురు—మా నలుగురకు 20 యడుగుల పొడుగు, 16 అడుగుల వెడల్పుగల యొక చిన్న పాక ప్రత్యేకముగ నిచ్చిరి. ఒక కొటూరు నుండి మరియొక కొటూరునకు పోవుటకు మాకు తగినంత స్వేచ్ఛ యిచ్చిరి. బయటనుండి మమ్ము చూచుటకు వచ్చు బంధువులతో తరుచు మాట్లాడుట కవకాశ మిచ్చిరి. వార్తాపత్రికలు వచ్చుచుండు

టచే, క్రొత్త నిర్బంధములను, ఉద్యమాభివృద్ధిని చదువుచు నుత్సాహ భరితుల మగుచుండెడివారము. వాదోపవాదములు, సంభాషణలు చాలాకాలము పట్టుచుండుటచే నాకు చదువుకొనుటకు, మరే ప్రయోజనమైన పనిచేయుటకు తీరిక యుండెడిదికాదు. నేను ప్రాతఃకాలము లందు మా పాక నతిశుభ్రముగ తుడిచి కడిగివేసెడివాడను. తండ్రిగారి బట్టలను, నా బట్టలను శుభ్రముగా నుతికెడివాడను. తరువాత నూలు వడికెడివాడను. అది శీతకాలము. మొదటి కొలదివారములు మా వాలంటీర్లకు, వారిలో చదువురానివారికి పాఠములను చెప్పనిచ్చిరి. హిందీ, ఉరుదూ మొదలగు ప్రాథమిక విషయములను బోధించెడివారము. సాయంకాలము చేతిబంతియాట యాడెడివారము. కాని క్రమముగా నిరోధములు హెచ్చుజొచ్చెను. మా యావరణ దాటి వాలంటీర్లను చూచుటకు బయటకు పోనిచ్చెడివారుకారు. పాఠశాలయు తరగతులు నిలచిపోయెను. అప్పుడే నన్ను విడిచిపెట్టిరి.

నేను మార్చి మొదటివారములో వెళ్లి తిరిగి ఏప్రిల్‌లో వచ్చితిని. నేను వచ్చుసరికి పరిస్థితులన్నియు పూర్తిగా మారిపోయెను. తండ్రిగారిని నైనిటాలు జయిలుకు మార్చిరి. అతడు వెళ్ళుటతోడనే క్రొత్తనియమముల నమలుపరచిరి. నేతశాలలో నుంచబడిన ఖయిదీలందరు కొటారులలోనికి మార్చబడిరి. ప్రతి కొటారు జయిలులో నొక జయిలువంటిది. కొటారునకు కొటారునకు నెట్టి సంబంధము లేకుండచేసిరి. బంధుదర్శనము ఉత్తరములు నెలకొక్కసారియే జరుగవలెననిరి. భోజన మతిముక్తసరి చేయబడెను.

నా కొటారులో సుమారేబదిమంది యుండిరి. మేము క్రిక్కిరిసి యుంటిమి. మా బిచానాలకు మూడునాలుగడుగుల దూరము మాత్రమే యుండెను. నా కొటారులో నున్నవారందరు నాకు పరిచయులు. చాలమంది స్నేహితులు. కాని రాత్రింబవళ్లు 'మరుగు' అనునది లేక యసహ్యముగ నుండెను. అస్తమానము చూచినవారినే చూచుట, ఒకేమాదిరి చిన్న పేచీలు, గిల్లికజ్జాలు — వీనిని తప్పించుకొనుట కెట్టి ప్రశాంతాగారము లేకపోవుట. మేము బహిరంగము

గనే బట్టల నుతికెడివారము; కసరత్తుకొరకు కొటూరుచుట్టు పరు గెత్తెడివారము. సహేతుకముగా మాట్లాడుశక్తి తగ్గువరకు సంభాషించుచు, వాదించుకొనుచుండెడివారము. నిత్యపేలవ సంసారజీవితమే నూరురెట్లు పెంచబడినట్లుండెను. అన్ని తరహాల మనుష్యులము, అన్ని యభిరుచులు కలవారము నచ్చట జేరితిమి. అది మా యందరకు బాధాకరముగనే యుండెను. నే నేకాంతవాసముకొఱకు వాచిపోతిని. తరువాత సంవత్సరములలో జయిళ్ళలో నేకాంతవాస మెక్కువయై బాధపడి మంచి సావాసము కావలెనని కోరెడివాడను. అప్పుడు 1922 నాటి లక్నోజిల్లా జయిలుజీవితము జ్ఞాపకము వచ్చెడిది. మొత్తము మీద వ్రాసికొనుటకు, చదువుకొనుటకు నవకాశమున్నచో నేకాంత వాసమునే నేను కోరెడివాడను.

నా సావాసకాండ్రందరు నసాధారణ బుద్ధిమంతులగుటచే నానందముగనే యుండెడిది. కాని యొకేజీవితము విసుగుదలగానుండి మే మేకాంతమును కోరుచుండెడివారము. నేను నా కొటూరునువిడిచి పెట్టి బయట యావరణలో నొంటరిగా కూర్చొని మేఘావృతమైన యాకాశమువంక తదేకదృష్టితో చూచుచుండెడివాడను. నే నెండకు, వర్షముకు నోర్చి వీలైనంతవరకు చాలకాల మక్కడనే గడపెడి వాడను. నే నాప్రశాంతప్రదేశమున పవళించి, గగనవీధులను, వీనీలనీరదశ్యామమును పరీక్షించుచు, మున్నెన్నడు నెరుంగని ట్లా యద్భుత చిత్రవిచిత్ర వర్ణసౌందర్యము నాస్వాదించితిని.

మా కాల మపుడు భోగ్యముకాక భారముగ నుండెడిది. కాని చలిచలి ముందుకు పోవుచుండు నా యమృత రసభరిత మేఘపంక్తిని చూచి యానందించుటలో గడుపుకాల మతి సంతోషావహముగ స్వేచ్ఛాప్రదముగ నుండెడిది. ఒక క్రొత్త విషయమును కనుకొను టలో కలిగెడి యానందము, నిర్బంధమునుండి తప్పించుకొంటినను భావము నాకు కలిగెను. ఆ ప్రత్యేక వర్షాకాలమట్లు నన్నేల యాకర్షించెనో చెప్పజాలను. దానికి పూర్వాపరము లట్టియనుభవము నాకు కలుగలేదు. పర్వతాగ్రములనుండియు, సముద్రతీరములనుండియు నే

ననేకసార్లు సూర్యోదయ సూర్యాస్తమయములను వీక్షించి, యా బంగరుతోయముల జలకమాడి, జగత్ప్రాణుని మాహాత్మ్యమున కచ్చెరువందితిని. కాని యంతటితో నితరకార్యములలో మగ్నుడ నగుచుంటిని. కాని జయిలులో సూర్యోదయ సూర్యాస్తమయములను చూచుటకు మేము నోచుకొనలేదు. ఉదయమున నెప్పుడో ప్రచండ భానుడు మా సంరక్షకులైన జయిలుగోడలను దాటివచ్చును. మా కంటి కెట్టివర్ణములు కానరావు. ఎట్టి యందచందములు లేని యా మట్టిగోడలను, ఆ బారకీచులను చూచుచుండుటచే మా కండ్లు కాయలుకాచి నిస్తేజములయ్యెను. అవి రంగులకొరకు, వెలుతురు, నీడలకొరకు తపించుచుండ ప్రావృట్కాలమేఘరాజి చిత్రవిచిత్రాకారములతో, వర్ణములతో నాట్యమాడుచురాగా నే నత్యాశ్చర్యానందమగ్న మానసుడనై సమాధిస్థితిని పొందుచుంటిని. ఒక్కొక్కప్పుడా మేఘములు విచ్ఛిన్నమగుచుండ వానిమధ్య ననంతనభోభాగమో యనునట్టు లగాధనీలద్యుతి మెఱయుచుండెను.

క్రమముగా మా మీద నిర్బంధము హెచ్చెను. కఠినచట్టము లమలుజరుపబడెను. మన యుద్యమ లోతుపాతులు తెలియుటచే ప్రభుత్వము తమ్మెదిరింప సాహసించినందులకు వారిధాక ననుభవింప వలెననిరి. క్రొత్త చట్టముల నమలుపరచుటలో రాజకీయ ఖైదీలకు జయిలు అధికారులకు సంఘర్షణ మేర్పడెను. చాల నెలలవరకు మేము బంధుసందర్శనము చేయ నిరాకరించితిమి. మాలో నేడుగురను నన్ను, పురుషోత్తమదాసు టాండను, మహాదేవ దేశాయి, జార్జిజోసెఫ్, బాలక్రిష్ణశర్మ, దేవదాసుగాంధి మొదలగువార్లను, తక్కిన జయిలుతో సంబంధములేని మారుమూలకు త్రోసివేసిరి.

మమ్మొక చిన్నయావరణలో నుంచిరి. అచ్చట కొన్ని కష్టము లున్నను మొత్తముమీద నాకు బాగుగనేయుండెను. అంత క్రిక్కిరిసి యుండకపోవుటచే నాకు కొంత శాంతి, మరుగు యుండెను. చదువు కొనుటకు నితరపనులు చేసికొనుటకు నవకాశముండెను. మా కితర

ఖయిదీలతోను, యితర ప్రపంచముతో నెట్టిసంబంధము లేకుండెను. రాజకీయఖయిదీల వార్తాపత్రికల నాపివేసిరి.

కాని బయటనుండి యేవో కొన్ని వార్తలు వచ్చుచునే యుండెడివి. నెలనెలకువచ్చు యుత్తరములు, బంధుసందర్శనములు కూడ కొద్దివార్తలను తెచ్చెడివి. బయట యుద్యమము సన్నగిలినట్లు కాన్పించెను. ఆ సంధిసమయము దాటిపోవుటతోడనే విజయ మంత కంతకు వెనుకకుపోయెను. కాంగ్రెసులో రెండు చీలికలేర్పడెను. మార్పు కావలెనను పక్షము, మార్పు కూడదను పక్షము. మొదటి పక్షమునకు చిత్తరంజనదాసు, మా తండ్రి నాయకులై కాంగ్రెసు నూతన రాష్ట్రీ, కేంద్రశాసనసభా యెన్నికలకు నిలిచి, సాధ్యమైనచో వానిని పట్టుకొనవలెననిరి. రెండవదానికి సి. రాజగోపాలాచారి నాయకుడై కాంగ్రెసువిధానములో నెట్టిమార్పు యుండరాదనిరి. అప్పుడు గాంధీజీ జయిలులోనుండెను. అధికారముకొరకు ప్రాకులాడుటచే వచ్చు తగాదాలచేతను; కుట్రలచేతను, మనల నెంతయో ముందుకు గొనిపోయిన మహోన్నతాశయములు తుడిచివేయ బడుచుండెను. ఉత్సాహోద్రేకములు వెల్లివిరియు కాలములోనే ఘనకార్యములు, సాహసకార్యములు జరుగగలవు. కాని వేడితగ్గినతరువాత జరుగనేరవని మేము గుర్తించితిమి. భవిష్యత్తు అంధకారముగ నుండెను. అది యెట్లు జరుగనున్నను మా జీవితములలో చాలాభాగము జయిళ్ళలోనే గడుపవలసియుండునని యనుకొంటిమి. ఈవిధముగ మేము మాట్లాడుకొనెడివారము. జార్జిజోసెఫ్‌తో జరిగిన సంభాషణలో మే మీ పర్యవసానమునకే వచ్చితిమి. అప్పటినుండి జోసెఫ్ మనకు చాలదూరమగుటయేకాక మనకార్యములనుకూడ తీవ్రముగ విమర్శింప నారంభించెను. లక్నోజిల్లాజయిలులో సివిలువార్డులో, నొక శరత్కాల సంధ్యాసమయమున జరిగిన యీ సంభాషణ మతనికి జ్ఞాపకమున్నదో లేదో నేను చెప్పజాలను; మేము కసరత్తు, దినచర్య మొదలగు వాటి కభ్యాసపడితిమి. కసరత్తునకు మా యావరణచుట్టు పరుగెత్తెడివారము. లేదా మాలో నిద్దరము

మా దొడ్డిలోనున్న నూతిలోనుండి యొక పెద్ద తోటబాల్చీతో యెద్దులవలె నీరు లాగెడివారము. ఈవిధముగా మా యావరణలో నున్న యొక చిన్నకూరగాయలతోటకు నీరు పెట్టెడివారము. మాలో చాలమంది ప్రతిదినము కొద్దిగా వడికెడివారు. కాని యధ్యయన మును నేను ప్రధానవృత్తిగా పరిగణించి యెప్పుడు చదువుచుండెడి వాడను. సూపరింటెండెంటు యెప్పుడు మమ్ము చూడవచ్చినను నేను చదువుచునే యుండెడివాడను. ఆ దొరగారి కీవిద్యావ్యాసంగము భర్జించలేదు. దానిని విమర్శించుచు నతడొకసారి తనవిద్య పన్నెం డవయేటనే సమాప్తమయ్యెనని సెలవిచ్చెను. నిశ్చయముగా నీవిద్యా భావమే యా యాంగ్లసైనికధైర్యరాశి కెట్టికష్టమైన యాలోచనలను రాకుండచేసెను! బహుశః మా రాష్ట్రములోని జయిళ్ళయిన్స్పెక్టరుజనరలు హోదాకుగూడ నితని నదియే తీసికొనిపోయి యుండ వచ్చును. శీతకాలదీర్ఘనిశలు, వినీలభారతాకాశము మమ్ము నక్షత్ర పంక్తి కాకర్షించెను. కొన్ని పటములసహాయముతో మేము వాటి ప్రదేశములను కనుగొంటిమి. ప్రతిరాత్రి మేము వాటికొరకు వేచి యుండి చిరమిత్రులను చూచు నానందముతో వాటికి స్వాగత మిచ్చెడివారము.

మే మిట్లు కాలముగడుపుచుండ దినములు, వారములు, మాస ములునయ్యెను; ఒక నిత్యాజీవితమునకు మే మలవడితిమి. కాని బయట ప్రపంచములో భారమంతయు తల్లులపయిన, భార్యలపయిన, సోదరీ మణులపయిన పడెను. చిరవియోగమువలన వారు విసుగుచెందిరి. వారి ప్రియులందరు జయిళ్ళలోనుండ, వారిస్వేచ్ఛయే వారికొక కళం కముగ తోచెను. మా మొదటి నిర్బంధమయినతోడనే పోలీసులు అలహాబాదులోని మాయింటిని — ఆనందభవనమును తఱచు సంద ర్శింప నారంభించిరి. నాతండ్రిగారికి, నాకు, విధింపబడిన జుల్మానా లను వసూలుచేయుటకు వారు వచ్చెడివారు. జుల్మానాలను చెల్లింప రాదని కాంగ్రెసు విధించెను. కనుక పోలీసులు ప్రతిదినమువచ్చి చిన్న చిన్న కర్రసామాగ్రి తీసికొనిపోయెడివారు. ఇందిర నా నాలు

గేండ్లకూతురు, పోలీసుల యీ నిరంతరదాడిని సహింపక తన యసహ్యతను వారికెరిగించెను.

జయిలులో రాజకీయ ఖయిదీలు మామూలు ఖయిదీలతో కలియకుండుటకు సర్వవిధముల తంటాలుపడెడివారు. రాజకీయఖయిదీలకు ప్రత్యేకజయిళ్ళ నేర్పాటుచేసెడివారు. కాని పూర్తిగా విడదీయుట యసంభవమయ్యెను. మేము వారితో తఱచు కలిసెడివారము. వారిద్వారా ప్రత్యక్షముగ జయిలునిజపరిస్థితులు తెలిసికొనెడివారము. అవినీతి, సాంకర్యము, దౌర్జన్యము – ఇదియే జయిలుకథ. భోజన మతి యేహ్యము. నే ననేకసారులు దానిని తినవలెనని చూచి తిని. కాని యది తిన నర్హముగాకుండెను. సాధారణముగా జయిలు యుద్యోగులు పూర్తిగా నసమర్థులు. వారికి తక్కువజీతముల నిచ్చెడువారు. కాని ఖయిదీలనుండి, వారిబంధువులనుండి డబ్బు గుంజుకొనుటకు వారి కనేకావకాశములు కలవు. జయిలరుకు నతని సహకారులకు, వార్డరులకు ననేక బాధ్యతలు, ధర్మములు నుండుడచే వాని నెవడైనను సమర్థతతోను, ఆత్మశుద్ధిగను నెరవేర్చుట యసంభవమే. మా రాష్ట్రములలోని జయిళ్ళలో జయిలు పరిపాలనావిధానమునకు ఖయిదీలను సంస్కరించి, వారికి మంచివృత్తులను నేర్పుటకు నెట్టిసంబంధము లేదు. ఖైదులో పనిచేయించుట ఖయిదీని బాధించుటకే! అతడు భయభ్రాంతుడై యడుగులకు మడుగులొత్తుచుండవలెను. అతడు జయిలుపేరువినిన భయభ్రాంతుడై నేరముచేసి తిరిగి జయిలుకు రాకుండ నుండవలెననియే దానియుద్దేశ్యము. ఈమధ్య కొద్దిమార్పులు రాజకీయ ఖయిదీలు చేసిన యాందోళన వలన జరిగెను. ఆహారము, దుస్తులు కొంచెము నయమయ్యెను. అసహాయోద్యమమువలన వార్డరుల జీతములుకూడ హెచ్చింపబడెను. పిల్లలకు, పిన్నవయసు ఖయిదీలకు వ్రాత, వాచకము నేర్పుటకు కొద్దిపాటి యేర్పాటులు గావింపబడెను. కాని యీ మార్పులు మంచివేయైనను అసలు సమస్య యథాప్రకారముగనే యున్నది. వెనుకటి జయిలుతత్త్వముమాత్ర మట్లే నిలిచి

యుండెను. మామూలు ఖయిదీలకొరకేర్పడిన యీ చట్టములను, నియమములను కొంచెమించుమించు రాజకీయఖయిదీలందరు సహింప వలసివచ్చెను. వారికి ప్రత్యేకసౌకర్యములు, ఆదరణ లేవు. కాని వారు తెలివిగలవారగుటచే వారిబత్తెములనుండి డబ్బులాగుట యంత సులువుగా జరుగుటకు వీలులేకుండెను. ఈ కారణముచే జయిలు అధికారులకు వీరనిన సహజముగా కన్నెఱ్ఱ. ఏ కారణముచేతనైన నెవరైన జయిలునియమముల నుల్లంఘింపవలసివచ్చెనా వానిచావు మూడినదన్నమాటే! అట్టినియమభంగమునకే ఆజాద్ అను పదిహేను పదహారేండ్ల కుఱ్ఱవానికి కొరడాదెబ్బలశిక్ష విధింపబడెను. అతని యొంటిమీఁది బట్టలన్నియు తీసివేయబడి యతఁడొక ముక్కోణమునకు కట్టివేయబడెను. ఒక్కొక్కదెబ్బ యతనియొడలు మీఁదపడి యెఱ్ఱటి తట్టు తేలుచుండ నతఁడు "మహాత్మా గాంధీకిజై" అని యరచుచుండెను. అతఁడు స్పృహతప్పి పడిపోవువరకు నతని యొంటిమీఁద పడిన ప్రతి దెబ్బయు "మహాత్మా గాంధీకిజై" తో మేళవించుచుండెను. తరువాత కొంతకాలమున కా పిల్లవాఁడే ఉత్తరహిందూదేశములోని టెర్రరిస్టు సంఘముల కొక నాయకుఁడయ్యెను.



# 14

## తిరిగి బయటపడితిని

జయిలులో స్త్రీలకంఠధ్వని, పిల్లల నవ్వులు వినరావు. మన కక్కడ వినబడు ధ్వనులు చాల కటువుగ నుండును. కంఠధ్వనులు పరుషముగ భయజనకముగ నుండును. ఇక భాష కేవలము పశుప్రాయము—చాలవరకు బూతులు. ఒకసారి నాకొక క్రొత్త కొఱత హఠాత్తుగా జ్ఞప్తికి వచ్చెను. లక్నోజయిలులో నేడెనిమిదిమాసము లుండినను నాకు కుక్కఅఱపు యెప్పుడు వినిపించలేదు.

1923 జనవరి నెలాఖరున లక్నోజయిలో నున్న రాజకీయ ఖయిదీలనందరిని విడిచివేసిరి. విడుదలను గురించి ముందుగా పుకారు లేమియు లేకపోవుటచే మే మాశ్చర్యపడితిమి. స్థానికశాసనసభలలో రాజకీయఖయిదీలను విడుదలచేయవలెనను తీర్మానము గావింపబడెను. కాని ప్రభుత్వకార్యనిర్వాహకవర్గ మట్టితీర్మానములను సాధారణముగా పెడచెవినిబెట్టుదురు. కాని ప్రభుత్వమువారిదినములు బాగుండెను. కాంగ్రెసు ప్రభుత్వమునకు వ్యతిరేకముగా నేమియు చేయుట లేదు. కాంగ్రెసువారు తమలోతాము కొట్లాడుకొనుచుండిరి. జయిలులో పెద్దనాయకులెవరు లేరు. కనుక మంచిదేయని వారు మమ్ము విడిచివేసిరి.

జయిలుద్వారములను దాటుటతోడనే కొంతయుల్లాసము, స్వేచ్ఛ యెప్పుడు కలుగుచుండును. మంచిగాలి, విశాలమైదానములు రహదారితో గూడుకొనిన వీధులు, పాతస్నేహితులను కలుసుకొనుట ఇవన్నియు కొంత యుల్లాసము పుట్టించును. మే ముత్సాహముతో పొంగితిమి, కాని యిది యెంతకాలము? కాంగ్రెసు పరిస్థితులేమియు బాగుండలేదు. ఆదర్శములు పోయి పన్నుగడలు వచ్చెను. ఏమాత్ర మాత్మవిచారము గలవారికైన రాజకీయములనిన యేవగింపుకలిగించు మామూలుపద్ధతులచే, కాంగ్రెసును వశపరచుకొనుట కనేకముఠాలు ప్రయత్నించుచుండెను.

నేను శాసనసభా ప్రవేశ వ్యతిరేకిని. ఇది చివరకు మన లక్ష్యమును తుడిచివేయునట్లు నాకు కాన్పించెను! కాని దేశములో మరియొక రాజకీయవిధాన మేదియు లేదు. మార్పు కూడదనువారు 'నిర్మాణ కార్యక్రమము' ను సమర్థించిరి. అనగా సంఘసంస్కారము. దీనిసుగుణమేమన నిది కాంగ్రెసు సేవకులకు ప్రజాసంబంధము కలిగించును. కాని రాజకీయములు – రాజకీయకర్మ కావలెననువారి నిదెట్లు తృప్తిపరుపగలదు? ప్రత్యక్షపద్ధతి యొకసారి విఫలమైనతరువాత కొంత శాసనసభాట్టహాసముండక తప్పదు. ప్రభుత్వతో డ్పాటుకు, నిర్మాణమునకుగాక ప్రభుత్వమును ప్రతిఘటించుటకు, ధిక్కరించుటకు దీనిని మా తండ్రి, చిత్తరంజనదాసు నడిపిరి.

జాతీయపోరాటమును సాగింపవలెననియే శాసనసభాప్రవేశము నెప్పుడు చిత్తరంజనదాసు సమర్థించుచుండెను. మా తండ్రికిగూడ కొంచెమించుమించుగ నట్టిభావమే యుండెను. కాని 1920 లో నతడు తన దృక్పథమును గాంధీజీకి లోబరచెను. అతడు యావచ్ఛక్తిని పోరాటములో వినియోగింప నెంచెను. అప్పుడు గాంధీజీ సిద్ధాంతమును పూర్తిగ నంగీకరించు టొక్కటియే దానికి మార్గమయ్యెను. సిన్ఫినులవలె పార్లమెంటులో ప్రవేశించి కామన్సుసభకు హాజరు కాకుండ నుండవలెనని చాలమంది యువకులకుండెను. నేను 1920 వేసవిలో గాంధీజీ నీ పద్ధతి కంగీకరింపమంటిని. కాని యట్టివిషయములలో నత డచలుడు. మహమ్మదాలీకూడ బహిష్కారపద్ధతి కిష్టపడలేదు. ఇతరు లెట్లు భావించిననేమి ? చివరకు గాంధీజీవాక్యమే వేదవాక్యము. అత డుద్యమజనకుడు. కనుక చిన్నవివరముల కతనికి తగినంతస్వేచ్ఛ నీయవలెనని మే మనుకొంటిమి. ఓట్లు నీయకుడు, పోలింగులకే వెళ్ళకుడు అను దాని నర్థముచేసికొనునట్లు సిన్ఫినుపద్ధతిని ప్రజ లర్థముచేసికొనజాలరని యతని వాదన. ఎన్నుకొనబడి సభలకు పోకుండుట ప్రజలలో గందరగోళమునకు కారణమగును. ఒకసారి కౌన్సిలులోనికి పోయినతరువాత నది వారినాకర్షించుననియు, వారిక బయటకు రారనియు, వారిని బయటకు రప్పించుటకు మన

యుద్యమములో తగినంతశిక్షణ, బలము లేవనియు, శాసనసభల ద్వారా ననేక ప్రత్యక్షాప్రత్యక్షమార్గముల ప్రభుత్వమెప్పులకు హోదాలకు దాసులగుట సంభవింపవచ్చుననియు నతడు చెప్పెను.

ఈ వాదములో బలమెంతయో కలదు. స్వరాజ్యపార్టీ శాసనసభలకు వెళ్లినపు డిందులో చాల ముచ్చట్లు జరిగెను. అయినను 1920 లో కాంగ్రెసు శాసనసభలను పశపరచుకొనుటకు పూనుకొనినచో నేమయ్యెడిదో చెప్పజాలము. ఖిలాఫతుకమిటీ బలముకూడ నుండుటచే రాష్ట్రసభలలోను, కేంద్ర అసెంబ్లీలలోను యెన్నుకొనబడు సీట్లు కాంగ్రెసుకే చేకూరెడివనుటలో నెట్టి సందేహము లేదు. నేడు (ఆగష్టు 1934) అసెంబ్లీకి కాంగ్రెసుసభ్యులను నిలుపుటకొక పార్లమెంటరీబోర్డు స్థాపింపబడెను. కాని 1920 లగాయతు నేటివరకు మన సాంఘిక, రాజకీయచీలికలను పెంచుట కనేక కారణము లేర్పడెను. కనుక రాబోవు యెన్నికలలో కాంగ్రెసు కెట్టివిజయము కలిగినను అది 1920 నాటి విజయముతో సరిపోజాలదు.

నేను జయిలునుండి వచ్చుటతోడనే, రెండుపక్షములవారిమధ్య రాజీకుదుర్చుటకు తోడ్పడితిని. కాని లాభము లేకపోయెను. చివరకీ రెండుపక్షముల రాజకీయములతోను నేను విసుగుచెందితిని. రాష్ట్రీ కాంగ్రెసుకమిటీ సెక్రటరీనగుటచే నేను కాంగ్రెసుసంస్థను చక్కబెట్ట పూనుకొంటిని. గతసంవత్సరమంతయు తలక్రిందులగుటచే, చేయవలసినదెంతయో యుండెను. నే నెంత కష్టపడినను లాభము లేకపోయెను. నాకేమియు తోచకుండెను. ఇంతలోనే మరియొక క్రొత్త రంగము తయారయ్యెను. నేను విడుదలయైన కొద్దివారములకే నన్ను అలహాబాదు మున్సిపల్ చైర్మన్ పదవిలోనికి గెంటిరి. ఈ యెన్నిక చాల హఠాత్తుగా జరుగుటచే నిది జరుగుటకు 45 నిమిషములకు పూర్వ మెవరును నా పేరు సూచించి యుండలేదు.

చిత్రముగా నాసంవత్సరమున దేశమంతట ప్రధాన కాంగ్రెసు నాయకులు మున్సిపాలిటీల కధ్యక్షులైరి. చిత్తరంజనదాసు కలకత్తాకు మొదటి మేయరు. విఠల్‌భాయిపటేలు బొంబాయి కార్పరేషను

శీలము, ఆశయములు, వాని నమలుపఱుపగల శక్తిసామర్థ్యములుకల నీవంటివారే రాష్ట్రవిద్యావిధాత యగుననుకొనుము! నీ వద్భుత కార్యములు చేయజాలవా? తానీమధ్యనే గవర్నరును చూచె ననియు, నా విధానము నమలుజరుపుటకు నాకు సంపూర్ణస్వేచ్ఛ యివ్వబడుననియు చెప్పెను. అప్పు డతడు చాలదూరము పోవునట్లు గ్రహించి తా నధికారరీత్యాగాక, తనంత తానే యీ సూచన చేసినట్లు చెప్పెను.

సర్ గ్రింవుడ్ రాజకీయ, ద్రావిడ ప్రాణాయామసూచన నాకు నవ్వుపుట్టించెను. నేను ప్రభుత్వముతో మంత్రిత్వరీత్యా సంపర్కము కలిగించుకొనుట యనూహ్యమేకాక, నా కేహ్యముగకూడ నుండెను. నిర్మాణ కార్యక్రమముకొరకు నేను పరితపించుచుంటిని. నాశము చేయుట, ఆందోళనచేయుట, సహాయముచేయకుండుట మానవుల సామాన్యధర్మములు కావు. కాని యట్టి నిర్మాణభూమికి చేరుటకు ముందు మనలో చాలామంది మన జీవితములను, శక్తిసామర్థ్యము లను, మన సమస్తమును, యీ జీవిత ఎడారులలో పోరిపోరి, యలసి సొలసి పోగొట్టుకొనవచ్చును; నిర్మాణమును మన బిడ్డలో, మన బిడ్డల బిడ్డలో చేయవలసియుందురు.

ఆ రోజులలో నధమపక్షము సంయుక్తరాష్ట్రములలో, మంత్రు లతిచౌక. అసహాయోద్యమకాలములో పనిజేసిన లిబరలు మంత్రు లిరువురు రాజీనామా యిచ్చిరి. కాంగ్రెసుయుద్యమ మతితీవ్రముగా నున్న రోజులలో ప్రభుత్వమువారు లిబరలుమంత్రులను కాంగ్రెసుపై ధ్వజమెత్తుట కుపయోగించుకొనిరి. వా రప్పుడు ప్రభుత్వ కార్య నిర్వాహకవర్గముచే గౌరవింపబడిరి, పూజింపబడిరి. ప్రభుత్వమును కాంగ్రెసు ఒక్కుమ్మడిగా నెదుర్కొనుటచే నా గండమును కాచు కొనుటకు ప్రభుత్వము తమ కిచ్చిన గౌరవమే యని యనుకొనక, పాప మా మంత్రు లది తమదే యనుకొనిరి; తమ హక్కే యను కొనిరి. ఆ పోరాటము తగ్గుటతోడనే ప్రభుత్వదృష్టిలో మంత్రుల విలువకూడ పడిపోయెను. ప్రభుత్వము మునుపటి గౌరవ, మర్యాద

లను చూపించుట మానివేసెను. దీనివలన మంత్రులకు కోపము వచ్చెను. వారి కోపతాపముల నెవరు లెక్కపెట్టకపోవుటచే వారు రాజీనామా యివ్వవలసివచ్చెను. అప్పుడు క్రొత్త మంత్రులకొరకు వలవేయ నారంభించిరి. ఇది వెంటనే జయప్రదము కాలేదు. శాసన సభలోనున్న కొద్దిమంది లిబరలుసభ్యులను, తమతోడివారి నట్లుమా నుషముగా త్రోసివేసిరను సానుభూతిచే నూరకొనిరి తక్కిన వారిలో చాలమంది జమీందారులు, సామాన్యచదువు చదివిన వారుకూడ లేరు. కాంగ్రెసు శాసనసభలను బహిష్కరించుటచే, నానాగోత్రములవారు నందులో చేరిరి.

ఈ ప్రతిఘటనలో కొంత న్యాయమున్నది. రాజకీయములను గురించి, సాంఘికవిషయములను గురించి యెట్టి విశాలదృష్టియు లేక లిబరలు మంత్రులు చాల సంకుచితబుద్ధితో నుండిరి. కాని యది వారి వంధ్యాసిద్ధాంతదోషము. కాని వారు తమ నిత్యకృత్యముల నాత్మ శుద్ధితో నెరవేర్చెడివారు. వారితరువాత నుద్యోగములోనికి వచ్చిన వారిలో కొందరు జమీందారులు. వారి విద్య అత్యల్పము. వారి నక్షరజ్ఞు లనదగును. భారతీయులు కేవలమసమర్థులని చాటుటకే గవర్నరు వీరిని పట్టుకొని యీ యున్నతపదవులలో పెట్టినట్లు కాన్పించును. "లక్ష్మీకైకసాధ్యమేదియు లేదని ప్రజలు చెప్పుకొనుటకే యది నిన్ను పైకి తెచ్చెను" అను వాక్యము వీరికి బాగుగ వర్తించును. చదువున్ననేమి, లేకున్ననేమి ! ఈ మంత్రులకు జమీందారీ వోటు కలదు. వారు పెద్దపెద్ద ఉద్యోగస్థులకు విందులు చేయగలరు. మలమలమాడు రైతులనుండి పిండబడిన ధనము కింతకంటె యోగ్య మైన ప్రయోజన మేదికలదు ?

# 15

## సందేహము - సంఘర్షణ

నన్ను బాధించు సమస్యలను మరుచుటకై నే ననేక కార్యము లలో నిమగ్నుడనైతిని. కాని నన్నవి వీడకుండెను. అవి నన్ను బాధించుచుండ వాటికి తగిన సమాధానములు వచ్చెడివికావు. నా సందేహములనుండి తప్పించుకొనుటకే నే నిప్పుడు కార్యాచరణకు గడంగితిని. కాని 1920-21 లలో నిది సంపూర్ణముగ నా యాత్మనే వ్యక్తముచేసెను. నేను నన్ను రక్షించుచుండెడి యావరణలోనుండి బయటకువచ్చి భారతరంగములు, బయట ప్రపంచమును చూచితిని. అంతకుమునుపు నేను గుర్తించని యనేకమార్పులు, క్రొత్త భావ ములు, క్రొత్త సంఘర్షణలు తలయెత్తెను. నాకు వెలుతురుకన్న అంధకారమెక్కువయ్యెను. గాంధీజీ నాయకత్వముపై నా విశ్వాస మెప్పటివలెనుండెను. కాని నే నతని విధానములోని కొన్ని భాగముల నెక్కువవిమర్శగా పరీక్షింప నారంభించితిని. అతడు జయిలులోనుండు టచే నే నతని సలహా తీసుకొనజాలకపోతిని. కాంగ్రెసు పక్షములు రెంటిలో నేదియు నన్నాకర్షింపలేదు. కౌన్సిలుపక్షమువారు సంస్క రణ, చట్టవిధానమంత్రములకు తిరిగిరి. ఇవి యంధకార వీధులలోని కొకగంతు. మార్పుకూడదనువారు మహాత్ముని ప్రియశిష్యు లనుకొన బడిరి. కాని చాలమంది గొప్పవారి శిష్యులవలెనే వీరును యుప దేశములోని పదములనే తీసికొని వాటిసారమునకు ప్రాధాన్యత నీయ లేదు. వారిలో చైతన్యతలేదు. కొంచె మించుమించు వా రాచర ణలో సంఘసంస్కర్తలుకాని స్వరాజ్యపార్టీ పార్లమెంటరీయెత్తులలో మునిగియుండ వీరికి ప్రజలతో సంబంధ ముండెడిది.

నేను జయిలునుండి వచ్చుటతోడనే దేశబంధుదాసు నన్ను స్వరాజ్యపార్టీకి మార్చవలెనని యత్నించెను. నే నతని వాదమునకు లొంగలేదు. నా తండ్రి స్వరాజ్యపార్టీ నాయకుడైనను నన్నెప్పుడు తన మతములోనికి త్రిప్పుకొనవలెనని యత్నింపలేదు. నే నందులో

చేరిన యతడు చాల సంతసించెడివాడు, కాని యత డా విషయము పూర్తిగా నాకే వదలివేసెను.

ఈ కాలములో మా తండ్రికి దాసుగారికి చాలమైత్రి కలిగెను. అది రాజకీయ సహచర్యముకంటె చాల గొప్పది. వారి యన్యోన్యత స్నేహభావము చూచినపుడు నా కాశ్చర్యమువేసెడిది. ఏలనన వయసు ముదిరిన తరువాత పెద్దస్నేహము కుదురుట యరుదు. మా తండ్రికి చాలమంది పరిచయులుండిరి; వారితో కులాసాగా నవ్వుచు సరససల్లాపములు చేయుచుండెడివాడు. కాని స్నేహ విషయమై యతడు జాగ్రతగ నుండుటయేకాక వయసు మీరిన తరువాత స్తనశల్య పరీక్ష చేయుచుండెడివాడు. కాని వీ రిరువుర మధ్య యీ యడ్డంకులన్నియు నశించి యొకరి నొకరు హృదయ పూర్వకముగా ప్రేమించుకొనిరి. నా తండ్రి తొమ్మిదేండ్లు పెద్దవా డైనను యతనికంటె బలిష్ఠుడు, ఆరోగ్యవంతుడు. ఇద్దరు గొప్ప లాయర్లు. చాల పేరు ప్రఖ్యాతులను బడసినవారైనను వారిలో చాల భేదములుండెను. దాసుగారు లాయరేకాక కవి. అతనిలో కవి కుండెడి భావోద్రేకముకలదు. అతడు తనభాషలో చక్కని కవిత్వము వ్రాసెను. అతడు మంచివ్యక్తి. మతస్వభావముకలవాడు. మా తండ్రి యెక్కువ యనుభవజ్ఞుడు, ఉద్రేకము లేనివాడు. వ్యవహారత, మత వాసన లేనివాడు. అత డెప్పుడు యోధుడు. కొట్టుటకు, పడుటకు సిద్ధము. అత డెవరిని మూర్ఖులని యనుకొనెనో వారిని విడిచిపెట్టడు. వ్యతిరేకము సహింపడు. ఇట్లు మా తండ్రి, దాసుగారు కొన్ని విషయములలో భేదించినను నొక పార్టీని నడుపుటకు చక్కగాకుదిరిరి. ఒకరిలోటుల నొకరు తీర్చివేసిరి. వారి పరస్పరవిశ్వాస మద్భుతము. కనుక వారొకరితో నొకరు ముందుగ నాలోచింప నక్కరలేకుండ నొకరిపేర నొక రెట్టి స్టేటుమెంటు, లేక ప్రకటననైన నివ్వవచ్చు ననుకొనిరి.

ఈ వ్యక్తిగత సంబంధమే స్వరాజ్యపార్టీకి దేశములో బల మును, పేరుప్రతిష్టలను చిరస్థాయిత్వమును కలుగచేయుటకు చాల

వరకు పనిచేసెను. శాసనసభలద్వారా వ్యక్తిగతముగా ముందుకు పోవచ్చునని దూరిన స్వలాభపరు లిందులోనుండుటచే మొట్టమొదట నుండియు చీలుట కిందులో నవకాశములుండెను. ప్రభుత్వముతో సహకారము చేయవలెనను నిజమైన మితవాదులు కొందరుండిరి. ఎన్నిక లగుటతోడనే యీ స్వభావము పైకుబుకుటచే వెంటనే నాయకులు వీరిని గర్హించిరి. మా తండ్రి 'దుష్టాంగమును ఖండించివేసెదను' అని చెప్పి యట్లే చేసెను.

1923 లగాయతు నా కుటుంబములో నాకెక్కుడు శాంతియు, సంతోషము కాన్పించెను. నా కుటుంబ సంబంధములలో నే నదృష్టవంతుడనగుటచే, వారు చిక్కులలోను కష్టకాలములోను, నన్ను శాంతపరచి నా కాశ్రయము నిచ్చెడివారు. నా భార్య యద్భుత ప్రవర్తనకు 1920 లగాయతు నే నామె కెంత ఋణపడియుంటినో నేను గ్రహించితిని. ఆమె యభిమానరాశి, చురుకుపాలు కలది. అయినను నా చేష్టల నన్నింటిని సహించుటచేయేగాక నా కామె సంతోషమును, ఆత్మశాంతిని చేకూర్చుచుండెడిది. 1920 లగాయతు మా జీవితపద్ధతిలో కొంతమార్పు కలిగెను. అది చాల నిరాడంబరముగనుండెను. చాలమంది నౌకరులు తగ్గించబడిరి. అప్పటికి ప్రధాన సుఖముల కేమియుకొఱత లేకుండెను. కొంతయనవసరమైన వాటినివదల్చుకొనుటకు, కొంత ప్రస్తుతఖర్చులకు డబ్బుకొఱకు, గుఱ్ఱములు, బండ్లు మా క్రొత్త జీవితవిధానము కనవసరమైన గృహసామగ్రి మొదలగు నవెన్నియో అమ్మివేయబడెను. కొంతసామగ్రి పోలీసులు తీసుకొని పోయి యమ్మివేసిరి. తోటమాలీలు, కరసామగ్రి లేకపోవుటచే మా తోట పాడయిపోయెను. ఇంటి యందచందములు తగ్గిపోయెను. మూడేండ్లవరకు యింటిని తోటను మేము శ్రద్ధగా చూడలేదు. దండిగ ఖర్చుపెట్టుకొను నలవాటు కలవాడగుటచే తండ్రిగారికి ఖర్చు తగ్గించుట కిష్టములేదు. కనుక నతడు తన తీరికకాలములో కొంతడబ్బు సంపాదింపవలెనని యింటివద్దనే ప్లీడరుసలహా యిచ్చుచుండెడివాడు. అతనికంత తీరికలేకపోయినను బాగుగనే సంపాదించెడివాడు. ఆర్థిక

ముగా తండ్రిగారిమీద నాధారపడుట నాకు కష్టముగ, నసంతుష్టిగ
నుండెను. నేను ప్రాక్టీసు మానినది లగాయితు స్వంతసొమ్ము నా
కేమియు లేకుండెను. నా భార్య, నేను చాల స్వల్పమే ఖర్చుపెట్టెడి
వారము. మే మంతకొద్దితో కాలక్షేపము చేయగలుగుట నాకే
యాశ్చర్యమయ్యెను. 1921 లో నే నీవిషయము కనుగొని చాల
తృప్తినొందితిని. ఖద్దరుబట్టలకు, మూడవతరగతి రైలుప్రయాణము
నకు నంతసొమ్మవసరములేదు. అప్పుడు మేము మాతండ్రియొద్దనే
యుండుటచే ననేక యితర గృహఖర్చులున్న సంగతి నే నెరుగనైతిని.
ఎట్లైనను డబ్బుండదనుభయము నన్నెప్పుడు బాధించలేదు. అవసర
మున్నచో నేను కావలసినంత సంపాదింపగలిగెడివాడను. మేము
స్వల్పముతో నే కాలము గడుపగలము.

మేము మా తండ్రి కంత భారముగ నుండెడివారముకాము.
అట్టి సూచన వినినచో నతని కెంతయో బాధకలిగెడిది. అయినను
నేను నాస్థితితో తృప్తిపొందక మూడేండ్లీ సమస్యనుగురించి యాలో
చించి విఫలుడనైతిని. కావలెనన్న నాకు మంచి లబ్ధిగలకృషి దొరకక
పోదు. కాని యట్టి కృషికి బూనినచో నేను చేయుచుండిన దేశసేవ
మానివేయవలెను. లేదా కొంతకాలమునైన నందుకు వినియో
గింపవలెను. ఇంతవరకు నేను నా కాలమునంతను కాంగ్రెసు, మున్సి
పల్ సేవలకే వినియోగించుచుంటిని. డబ్బుచేసికొనుటకు నే నీపను
లను మానివేయుట నా కయిష్టముగా నుండెను. పెద్దపెద్ద వర్తక
కంపెనీలనుండి వచ్చిన లాభదాయకములగు నవకాశములను త్రోసి
వేసితిని. బహుశః వారు నా సమర్థతకుగాక నా పేరు తమ స్వార్థము
కొరకుపయోగించుకొనుటకే యంత పెద్దజీతముల నిచ్చెదమనిరి.
పెద్ద పరిశ్రమలతో నే నీవిధముగా సంబంధముపెట్టుకొనుట కిచ్చగింప
లేను. ఇక న్యాయవాదవృత్తికి బోవుట యసూహ్యాము. దానిని
గురించి తలచినకొలదియు నది నా కయిష్టమయ్యెను.

1924 లో కాంగ్రెసు కార్యదర్శులకు జీతముల నీయవలెనను
సూచన వచ్చెను. నే నొక కార్యదర్శిని. ఇది నాకు బాగుగనే

కాన్పించెను. పొట్టగడచుటకైనను, యేమియు నివ్వకుండ యెవనిని తనకాలమునంతను సేవచేయవలసినదనుట తప్పిదమని నాకు తోచెను. లేకపోయినచో నితరమార్గములద్వారా డబ్బువచ్చువానిని చూడ వలెను. అంత తీరుబడికలవాని నెల్లప్పుడు రాజకీయముగా విశ్వసించు టకు వీలులేదు. పనికి వారిని బాధ్యులనుచేయుటకు వలనుపడదు. కాంగ్రెసు హెచ్చుజీతముల నీయజాలదు. మన జీతములు చాల తక్కువ. పబ్లిక్ నిధులనుండి జీతమును తీసుకొనరాదను దురభిప్రాయ మొకటి భారతదేశములో కలదు. నే నట్లుచేయరాదని మా తండ్రియే తీవ్రముగా ప్రతిఘటించెను. నాతోడి కార్యదర్శి చాల డబ్బునిక్క చ్చిలోనుండి కూడ జీతము తీసికొనుట గౌరవభంగమని తలంచు చుండెను. కాని యెట్టి గౌరవభంగము లేక జీతముతీసికొన సిద్ధముగా నున్న నేనుకూడ జీతములేకుండగనే పనిచేయవలసివచ్చెను. ఒక్క సారియే నేను తండ్రిగారితో నీవిషయము గురించి చెప్పి డబ్బుకొరకతనిమీద నాధారపడుట నా కిష్టములేదంటిని. ప్రజాసేవ చేయకుండ నేను నా కాలమునంతను స్వల్పధనార్జనకొరకు వినియోగించుట కేవలము మూర్ఖత్వమని యతడనెను. నాకు నా భార్యకు నొక్కవత్సరముకు కావలసినదాని నతడు కొద్దిరోజులలో సంపాదింపగలననెను. ఈ వాదము బలీయముగనే యున్నను నా కంత తృప్తిగలేకుండెను. అయినను నే నతనిప్రకారమే నడచితిని.

1923 ప్రారంభమునుండి 1925 చివరవరకు కుటుంబవ్యవహారములతోను, డబ్బు చిక్కులతోను మాకు సరిపడెను. ఈలోపల రాజకీయములు మారుచు నా కిష్టములేకపోయినను నే నఖిలభారత కాంగ్రెసులో బాధ్యతగల పదవి వహించితిని. 1923 లో నొకచిత్రమైన స్థితి యేర్పడెను. గత వత్సర గయాకాంగ్రెసుకు చిత్తరంజన దాసు అధ్యక్షుడయ్యెను. కనుక నతడే 1923 లో నఖిలభారత కాంగ్రెసు కమిటీ చైరుమనుగ నుండును. కాని యీ కమిటీలో స్వరాజ్యపార్టీ నీతికి; నతనికి వ్యతిరేకమైనవారికి మెజారిటీ యుండెను. 1923 లో బొంబాయిలో జరిగిన కమిటీ మీటింగులలో పరిస్థితులు

విషమించెను. దాసుగారు చైరుమను పదవికి రాజీనామా యిచ్చెను. రెండుపక్షముల మధ్యనున్న యొక చిన్న మధ్యపక్షము కార్య నిర్వాహకవర్గమయ్యెను. ఈ కార్యనిర్వాహకవర్గముకు కమిటీలో సరియైన బలము లేదు. ముఖ్య రెండు పక్షములలో నేదో యొకదానిపై నిది యాధారపడెను. ఒకదానితో కలసినచో నిది మరియొకదాని నోడింప గలదు. డాక్టరు అన్సారీ క్రొత్త అధ్యక్షుడయ్యెను. నేనొక కార్యదర్శిని.

మా కిరుప్రక్కలనుండియు కష్టములే సంభవించెను. నోఛేం జర్లకు కోటయైన గుజరాతు కేంద్ర కార్యాలయమువారి యాజ్ఞలను కొన్నింటిని తిరస్కరించెను. ఆ వత్సరమే వేసవిలో జాతీయజెండా సత్యాగ్రహము జరుగుచున్న నాగపురములో మరియొక కమిటీ మీటింగు జరిగెను. ఆ దురదృష్ట మధ్యపక్షమునకు చెందిన మా కార్యనిర్వాహకవర్గ మంతటితో నంతరించెను. అది యెవరికి ప్రాతి నిధ్యము వహింపక కాంగ్రెసులో నిజమైన పలుకుబడికలవారిపై నధి కారము చెలాయింపవచ్చెను కనుక శాస్తి జరిగెను. గుజరాతుచూపిన యవిధేయతకు దానిమీద విశ్వాసరాహిత్యముకు యత్నింపగా నది విఫలమగుటచే మేము రాజీనామా యిచ్చితిమి. నే నతిసంతోష ముతో రాజీనామా యిచ్చి పీడవదలినట్లు భావించితిని. పార్టీ యెత్తులు, జిత్తులు కొద్దికాలపు టనుభవమే – నాకు బాధకలిగించెను. కొంత మంది ప్రధాన కాంగ్రెసునాయకుల పన్నుగడకు నే నాశ్చర్యపడితిని.

ఈ సభలో చిత్తరంజనదాసు నన్ను 'ఉద్రేకశూన్యుడవు' అని నిందించెను. అది యుక్తమే కావచ్చును. అది మనము పోల్చు దాని ప్రమాణమునుబట్టి యుండును. నాస్నేహితులలోను సహచరుల లోను చాలమందితో నన్ను పోల్చినచో నేను ఉద్రేకములేని వాడనే. అయినను భావము, ఉద్రేకము, కోపము మొదలగునవి నన్ను ముంచునేమో లేక నేను వానిచే నీడ్వబడుదునేమో యని నే నెప్పుడు భయపడుచునే యుందును. ఉద్రేకములేకుండుటకే నే ననేక వత్సరములు సాధనచేసితిని. నే నిందులో పొందిన జయము కేవలము బాహ్యమనియే నా భయము.

# 16

## నాభాలో నౌకకథ

స్వరాజ్యపక్షమువారికి, నోఛేంజర్లకు ద్వంద్వయుద్ధము జరిగి క్రమముగా స్వరాజ్యపక్షము గెలుపొందుచుండెను. 1923 శరత్కాలములో ఢిల్లీలో జరిగిన "ప్రత్యేక కాంగ్రెసు"లో స్వరాజ్యవాదులకు మరికొంత జయము కలిగెను. ఈ కాంగ్రెసు అయిన వెంటనే నాకొక యపూర్వానుభవము తటస్థించెను.

సిక్కులకు, ముఖ్యముగా అకాలీలకు, పంజాబు ప్రభుత్వముతో తఱచు సంఘర్షణ జరుగుచుండెను. గురుద్వారములలో మహంతుల యవినీతి హెచ్చుగానుండుటచే మత సంస్కారోద్యమ మొకటి బయలు దేరి, యవినీతిపరులగు మహంతులను తీసివేసి గురుద్వారములను పవిత్రపరచి, వాటి యాస్తులను జాగ్రత్త పెట్టుటకు సంకల్పించెను. ఇందులో ప్రభుత్వము జోక్యము కల్పించుకొనుటచే సంఘర్షణ మేర్పడెను. గురుద్వారోద్యమము కొంతవర కసహాయోద్యమ ప్రబోధమువలననే కలిగెను. అకాలీల పద్ధతులుకూడ దౌర్జన్య రాహిత్యతత్త్వమునే యనుకరించెను. చాల సంఘటనలు సంభవించెను. కాని వాటిలో గురుకాభాగు పోరాటము ముఖ్యమైనది. అందులో వందలకొలది సిక్కులు, చాలమంది సైనికులుగ పనిచేసిన వారు, పల్లెత్తుమాటాడకుండ, చేయి యెత్తకుండ, తమ స్థానమునుండి తమధర్మమునుండి యొక్కయడుగైనను కదపకుండ పోలీసులు వారిని పశువులను మోదునట్లు మోదుచుండ, నగ్నిపరీక్షనిచ్చిరి. ఈ ధైర్య స్థైర్యములను, ఈ సాహసమును, పట్టుదలను చూచి భారతదేశము నిర్ఘాంతపోయెను. ప్రభుత్వమువారు గురుద్వార కమిటీ యక్రమ సంఘమని ప్రకటించిరి. ఈ పోరాటము కొన్ని వత్సరములు జరిగి చివరకు సిక్కులకే జయముచేకూరెను. సహజముగా కాంగ్రెసుకు

దీనియందు సానుభూతికలిగి కొంతకాల మీ యుద్యమమును పరీక్షించుట కమృతసరములో నొక ప్రత్యేకోద్యోగినికూడ నుంచెను.

ఇప్పుడు నేను చెప్పబోవు కథకు నీ సిక్కుల ఉద్యమముకు సంబంధము లేకపోయినను యీ యుద్యమ ప్రబోధమువలననే యిది సంభవించెననుటకు సందేహము లేదు. పంజాబులోని నాభా, పాటియాలా మహారాజు లిరువురకు (రెండును సిక్కు సంస్థానములే) పరస్పర విరోధముండి పోరాడుకొనుచుండ భారతప్రభుత్వము నాభా మహారాజును సింహాసనమునుండి తొలగించిరి. నాభాసంస్థానమును పరిపాలించుట కొక బ్రిటిషు యేజెంటును నియమించిరి. సిక్కు లీ కార్యమును గర్హించి నాభాలోను, బయటను ఆందోళనము చేయుచుండిరి. ఈ సందర్భములో నాభాలోనే 'జయితో' యనుచోట జరుగుచున్న యొక మతయుత్సవమును క్రొత్తపరిపాలకు డాపివేసెను. ఇది న్యాయముకాదని చెప్పుటకు నాపివేయబడిన యుత్సవము సాగించుటకు, సిక్కులు జయితోకు, జాతాలను పంప నారంభించిరి. పోలీసు లీ జాతాల నాపి, చావబాది, నిర్బంధించి మూరుమూలనున్న దోవ తెన్ను లేని యే యడవిలోనో విడిచిపెట్టి వచ్చెడివారు. ఈ కథ నంతను నేను మొదటినుండియు వినుచుంటిని. ఢిల్లీ ప్రత్యేక కాంగ్రెసు అయినతోడనే మరియొక జాతా పోవుచున్నదనియు నచ్చటకువచ్చి జరుగుచున్నదంతయు చూడవలసినదనియు నన్నాహ్వానించిరి. నే నతిసంతోషముతో నంగీకరించి, గిద్వానీ, సంతానము గార్లతో బయలుదేరితిని. జాతా కాలినడకనే బయలుదేరెను. మే మొకబండిలో బయలుదేరి జాతా జయితోకు జేరు సమయమునకే చేరుకొంటిమి. మేము దూరమునుండి జాతాను పరీక్షించుచుంటిమి. జాతాను పోలీసు లాపివేసిరి. నాభా సంస్థానములో కాలుపెట్టరాదని పెట్టినచో వెనుకకుతిరిగిపోవలసినదని యింగ్లీషు పరిపాలకుని సంతకముతో నా కొక హుకుము జారీచేయబడెను. గిద్వానీ, సంతానము గార్లమీదకూడ నిట్టి నోటీసు జారీచేయబడెను. నాభా ప్రభుత్వముకు వారి పేర్లు తెలియకపోవుటచే పేర్లుదహరింపకుండనే నోటీ

సుల నిచ్చిరి. మేము జాతాలో పాల్గొనుటకు రాలేదని ప్రేక్షకులముగా వచ్చితిమని నాభా చట్టములను వేటిని మేము భంగము చేయదలచుకొనలేదని చెప్పితిమి. మే మిదివరకే నాభా రాష్ట్రములోనికి ప్రవేశించుటచే, ప్రవేశింపకూడదను సమస్య కవకాశమే లేదు. మే మకస్మాత్తుగా మాయమైపోగలశక్తి మాకు లేదు. జయితోనుండి బయలుదేరుబండి చాల గంటలకుగాని బయలుదేరదు. కనుక నంతవరకైన మే ముండెదమంటిమి. మమ్ము వెంటనే అరెస్టుచేసి తీసికొనిపోయిరి. మమ్ము తీసికొనిపోయిన తరువాత జాతాను మామూలు ప్రకారము సన్మానించిరి.

పగలంతయు నిర్బంధించి సాయంకాలము మమ్ము స్టేషనుకు నడిపించి తీసికొనివెళ్ళిరి. సంతానముగారి యెడమచేతికి, నా కుడిచేతికి కలిపి యినుపబేడీలు తగిలించి వానికొక గొలుసుకట్టి పోలీసు గొలుసు చేతపుచ్చుకొని మమ్ము నడిపించుచుండెను. గిద్వానీగారినట్లే ప్రత్యేకముగా నడిపించిరి. జయితో వీధులలో మమ్మీవిధముగా నడిపించుట గొలుసుకట్టి కుక్కనుతీసికొని వెళ్లువిధమును నాకు జ్ఞప్తికి తెచ్చెను. మొట్టమొదట మేము కొంచె ముద్రేకపడితిమి. కాని వెంటనే యీ హాస్యమును మే మానందించితిమి. మందగమనముతో పోవు క్రిక్కిరిసియున్న యొక మూడవతరగతి రైలుబండిలో నెక్క మధ్య నొకసారి మారుచు, కొంతసేపు నాభా జయిలులో గడుపుచు, మే మా రాత్రి నెట్లో గడిపితిమి. ఇంతకాలము, మరునాడు మధ్యాహ్నము నాభాజయిలుకుమమ్ము వప్పగించువరకు నా జంటబేడీలు, బండగొలుసు, మాకు సహచారిగ నుండెను. రెండవవాడు తోడ్పడనిదే మేము కదలుటకు వీలులేదు.

నాభా జయిలులో మా ముగ్గురిని యనారోగ్యము, యపరిశుద్ధము నగుయొక చిన్నగదిలో కుక్కిరి. అది తేమగనుండి పైకప్పు మా చేతి కందుచుండెను. రాత్రి మేము నేలమీదనే పడుకొనగా నొక ఎలుక నా ముఖముమీదనుండి పరుగెత్తుటచే నే నులిక్కిపడి లేచితిని. రెండు మూడురోజులయిన తరువాత మమ్ము కోర్టుకు తీసి

కొనివెళ్ళిరి. అక్కడ తల్లక్రిందులు విచారణతంతు దినదినము జరుగుచుండెను! ఆ మేజిస్ట్రేటు లేక జడ్జి యెంతమాత్రము చదువు రానివాడు. అతని కింగ్లీషు రాదు సరికదా కోర్టుభాషయైన ఉర్దూ కూడ వ్రాయజాలడని నాకు సందేహము తోచెను. మే మతని నొక వారము రోజులు పరీక్షించి చూచినను నత డొక పంక్తియైన వ్రాయ డయ్యెను. అతడు వ్రాయవలసివచ్చినచో కోర్టు రీడరును వ్రాయ మనెడివాడు. మేము చిన్న చిన్న దరఖాస్తులను పెట్టితిమి. అతడు మేము చూచుచుండగా వాటిమీద నెట్టి యార్డరులను వేయలేదు. అతడు వాటినట్లేయుంచి మరునాడు వాటిమీద మరియొకరిచే సముజాయిషీ వ్రాయించి పట్టుకొని వచ్చెడివాడు. మే మిదివరలో వాదించుకొనెడివారము కాము; అసహాయోద్యమరోజులలో వాద నను మానివేయుటచే వాదించుకొనుట తప్పుగా కాన్పించెను. కాని నేను జరిగిన సంగతులను తెలుపుచు నొక పెద్ద స్టేటుమెంటు, నాభా పద్ధతులను గురించి నా స్వంత యభిప్రాయములను వ్రాసియిచ్చితిని.

మా కేసు చాల చిన్నవిషయమైనను రోజులు గతించిపోవు చుండెను. అకస్మాత్తుగా నొక మార్పు కలిగెను. ఒక మధ్యా హ్నము కోర్టు ముగిసిన తరువాత మమ్మచ్చటనే యుంచి సాయం కాలము యేడుగంటలకు మమ్మొక గదిలోనికి తీసికొనిపోయిరి. అచ్చట నొక బల్లదగ్గర నొక మనిషి కూర్చొనెను; మరికొందరు సమీపములో నుండిరి. మమ్ము జయితోలో నరెస్టుచేసిన పోలీసు ఉద్యోగి లేచి యొక స్టేటుమెంటు యిచ్చుచుండెను. మే మెచ్చట నుంటిమి? ఏమి జరుగుచున్నది? అని నే నడిగితిని. అది కోర్టు గది యనియు కుట్రనేరముకు మేము విచారింపబడుచున్నామనియు నాకు బదులుచెప్పిరి. ఇంతవరకు నాభా సరిహద్దులనుదాటి యాజ్ఞోల్లంఘ నము చేసినందుకు విచారింపబడితిమి. ఇది వేరుకేసు. మొదటి కేసులో నారుమాసములకంటె నెక్కువ శిక్షకు వీలులేకపోవుటచే నది చాలదని మరియొక నేరము కనిపెట్టుచుండిరి. కుట్రనేరముకు ముగ్గురు చాలరు. కనుక మాతో నెట్టి సంబంధములేని మరియొకని

నరెస్టుచేసి విచారణకు తెచ్చిరి. ఈ దురదృష్టవంతు డొక సిక్కుమత స్థుడు. ఇతనిని మే మెరుగము. కాని మేము జయిల్లోకు వెళ్ళినపు డితనిని పోలములలో చూచితిమి.

కుట్రనేరము నింత నిర్లక్ష్యముగ విచారణచేయ ప్రారంభించుట లాయరునైన నా కాశ్చర్యము కలిగించెను. కేసు పూర్తిగా నబద్ధపు కేసు. ఏమైనను మర్యాదకైన కొంత తతంగముండవలెను. జడ్జితో మేము మా కేవిధమైన నోటీసులేదనియు, మేము వాదించుట కేర్పాట్లు చేసికొనియుందుమనియు చెప్పితిమి. ఇట్లు చెప్పినను యతనికి చీమకుట్టినట్లయిన లేకుండెను. అది నాభాపద్ధతి! మా కొక లాయరు కావలెనని నేను సూచించితిని. నాభాచట్టముల ప్రకారము దీనికి వీలులేదని యతడనెను. నాభాపద్ధతులు మాకు మరింత యర్థమగుచుండెను. కొంత విసుగుదలతో మేము విచారణలో పాల్గొనమనియు తన యిష్టమువచ్చినట్లు చేయవచ్చుననియు జడ్జితో చెప్పితిమి. కాని నేను వీనిని పూర్తిగా పాలింపజాలకపోతిని. మమ్ము గురించి చెప్పు పచ్చికల్లలను విని యూరుకొనలేక నప్పుడప్పుడు సాక్షులను గురించి మా యభిప్రాయము క్లుప్తముగ విషయముకు సంబంధించి వెలిబుచ్చెడివాడను. జరిగిన విషయములను గురించి వ్రాతమూలకముగా మేమొక స్టేటుమెంటు కూడ యిచ్చితిమి. ఈ రెండవ జడ్జి మొదటివానికంటె చదువుకొన్నవాడు, తెలివైనవాడు.

ఈ రెండు కేసులు నీ విధముగా సాగుచుండెను. మేము ప్రతిదినము కోర్టు కెప్పుడు వెడుదుమాయని, జయిలు దుర్గంధమైనను తప్పునని చూచుచుండెడివారము. ఈలోగా నా పరిపాలకుని తరపున జయిలు సూపరింటెండెంటు వచ్చి మేము నాభా వీడిపోయెదమని వ్రాతమూలకముగా క్షమార్పణ యిచ్చినచో మాపై కేసులు తగ్గింపబడునని చెప్పెను. మేము క్షమార్పణ చెప్పుకొనవలసినదేదియు లేదనియు మా కాయనయే క్షమార్పణ నీయవలసియున్నదనియు మే మేమియు వ్రాసి యిచ్చువారము కామనియు చెప్పితిమి. మా అరెస్టు జరిగిన పదిహేను రోజులకు రెండు విచారణలు పూర్తియయ్యెను. ఈ

కాలమంతయు మేము వాదింపనే లేదు. కనుక నిది ప్రాసిక్యూషను సాక్ష్యముకే పట్టెను. చాలకాలము, మధ్యమధ్య ఆపివేయుటతో సరిపోయెను. ఏమాత్రము సందేహమువచ్చినను వాయిదా వేయుట లేదా, ఈ రంగము వెనుకనున్న యధికారితో బహుశః - ఇంగ్లీషు పరిపాలకునితో - సంప్రదింపులతో సరిపోయెను. ప్రాసిక్యూషను పూర్తి యైనతరువాత చివరరోజున మేము మా స్టేటుమెంటులను వ్రాసి యిచ్చితిమి. మొదటికోర్టు లేచి కొద్దికాలములోనే తిరిగివచ్చి ఉర్దూలో వ్రాయబడిన పెద్ద జడ్జిమెంటు కట్టను తీసికొనివచ్చెను. ఈ పెద్ద జడ్జిమెంటు ఆ స్వల్పకాలములో వ్రాయబడజాలదు. మా స్టేటు మెంటుల నీయకపూర్వమే యది తయారుచేయబడెను. జడ్జిమెంటు చదువలేదు. నాభారాష్ట్రమును వీడ నిరాకరించినందు కారునెలలు వర్ధింపబడెనని ముక్తసరిగా చెప్పిరి. కుట్రకేసులోకూడ ఆ రోజుననే పదునెనిమిదిమాసములో లేక రెండేండ్లో విధించిరి. మొత్తముమీద మాకు రెండేండ్లో లేక రెండున్నరయేండ్లో విధింపబడెను.

మా విచారణకాలమంతటు భారతసంస్థానపరిపాలన లేక భారత సంస్థానములోని బ్రిటిషుపరిపాలనలోని యదార్థములనుగురించి కొంత వరకు ప్రకటించు ననేక చిత్రవిచిత్ర సంగతులు జరిగెను. ఆ విధాన మంతయు నొక నాటకము కనుకనే కోర్టులోనికి పత్రికాప్రతినిధులను యితరులను రానీయలేదు. పోలీసులు వారి యిష్టమువచ్చినట్లు చరించెడివారు. వారు తఱచు మేజిస్ట్రేటును లేక జడ్జిని నిర్లక్ష్యము చేయుటేగాక నతనియాజ్ఞల నుల్లంఘించెడివారు. పాపమా మేజిస్ట్రేటు దీనిని నోరెత్తకుండ సహించెను. కాని నే మెల సహింపవలెను? చాలసార్లు నేను లేచి పోలీసు లుచితముగా ప్రవర్తింపవలెనని, మేజిస్ట్రేటు ఆజ్ఞలను శిరసావహింపవలసియుండునని గట్టిగా చెప్పవలసి వచ్చెను. ఒక్కొక్కప్పుడు పోలీసు లమర్యాదగా కాగితములను లాగివేయుచుండగా మేజిస్ట్రేటు యేమియు చేయలేక తెల్లబోయి చూచుచుండ, తనకోర్టులో తానే క్రమమును నిలుపుకొనలేక పోవుటచే, నతని పనిని మేము చేయవలసివచ్చెడిది! పాప మా

మేజిస్ట్రేటుస్థితి చాల విచారకరముగ నుండెను. అతడొకవంక పోలీసు లకు భయపడుచుండెను. మరియొకవంక మమ్ముచూచే భయపడు చుండెను. ఏలనన, మా అరెస్టులనుగురించి వార్తాపత్రికలు గగ్గోలు చేసెను. కొంచెమించుమించు ప్రధాన కాంగ్రెసునాయకులలో నెన్న బడు మాబోంట్లగతి యిట్లున్నపుడిక సామాన్యులగతి యెట్లుండును?

ఈ స్వదేశ సంస్థానముల సంగతి మా తండ్రికి తెలియును. కనుక నత డీ యనుకొనని నిర్బంధమున కుద్రేకపడెను. మేము నిర్బంధింపబడిన సంగతి మాత్రమే తెలిసెను. కాని తక్కిన వివరము లేమియు పత్రికలలో పడలేదు. అత డా వేడిలో వైస్రాయికి నా వార్త తెలియుటలేదని తంతి నిచ్చెను. నాభాలో నన్నతడు చూచు టకు వీలులేదనిరి. చివరకు జయిలులో చూడవచ్చుననిరి. నేను వాదించుకొనుటలేదు. కనుక నతడు మాకు చేయునదేమియు లేక పోవుటచే నే నతనిని వెళ్లిపోవలసినదని బ్రతిమాలితిని. అతడు కపిల దేవ మాలవ్యాను, ఒక మంచివకీలును స్థితిగతులను పరీక్షించుచుండ వలసినదని నియమించి వెడలిపోయెను. నాభాకోర్టుల కొద్ది యనుభ వమువలన కపిలదేవుని న్యాయజ్ఞానమెంతయో యభివృద్ధియై యుండ వలెను. పోలీసు లతనిచేతిలోనున్న కొన్ని కాగితములను బహిరంగముగా కోర్టులో లాగికొన యత్నించిరి.

కొంచెమించుమించు భారతసంస్థానము లన్నియు వెనుకపడి యున్నట్లు జగద్విఖ్యాతమే. అవి సమర్థత, యుదారత లేని వ్యక్తిగత నిరంకుశత్వములు. ప్రపంచమునకెప్పుడు తెలియరాని వింతలెన్నియో యచ్చట జరుగుచుండును. అయినను వారియసమర్థతయే కొన్ని విధముల దుర్మార్గమును తగ్గించి ప్రజలదుఃఖభారమును కొంతవరకు తేలికపరచును. ఏలనన ఈ యసమర్థతయే కార్యనిర్వహణములో గూడనుండుటచే నిరంకుశత్వము, అన్యాయముకూడ నంతశక్తివంత ములుగానుండవు. అంతమాత్రముచే నిరంకుశత్వము సహ్యము కానే రదు. కాని యది యంత ప్రబలదు; విస్తరించదు! భారతసంస్థానము ప్రత్యేకు బ్రిటిషుప్రభుత్వాధికారము క్రిందకే వచ్చినయెడల నీ కాస్త

లాభముకూడా పోవును. రాజ్యాధికారము లెప్పటివలెనే యుండును. నిరంకుశత్వము చెక్కుచెదరదు. పాతచట్టములు పాతవిధానములు పనిచేయుచునే యుండును. వ్యక్తిస్వేచ్ఛ, సభలను జరుపుకొను స్వేచ్ఛ, అభిప్రాయములను వెలిబుచ్చు స్వేచ్ఛ — ఈ యన్నిటిమీద నిర్బంధములన్నియు మామూలుగనే యుండును. ఒక్క మార్పుమాత్రమే చేయబడును. ఈమార్పుతోనే రంగమంతయు మారిపోవుచున్నది. కార్యనిర్వాహణము బలీయమై పటుత్వముగా పని చేయుటచే దుర్బలత్వముచే సడలియున్న పైపాశములన్నియు నొక్క సారి బిగియును. కొంతకాలమయినతరువాత బ్రిటిషుపాలన కొన్ని పాత యాచారములను, పద్ధతులను మార్చవచ్చును. మార్చెదరు. ఏలనన యట్టివి పటుత్వమైన పరిపాలనకు, వర్తకప్రాబల్యముకు నడ్డంకులు. కాని మొట్టమొదటమాత్రము వారు ప్రజలను లొంగదీసుకొనుటకు వాటి నుపయోగించుకొనెదరు. ప్రజలిప్పుడు సామంతరాజ్యములకు నిరంకుశత్వమునకుతోడు వాటి నతికఠినముగా నమలుపఱుపగల కార్యనిర్వాహక వర్గమునుకూడ సహింపవలెను.

నాభాలో నేను కొంతవరకు దీనిని చూడగలిగితిని. ఈ సంస్థాన మొక బ్రిటిషు పరిపాలకునిక్రింద నుండెను. ఒక్క భారత ప్రభుత్వముకు తప్ప నత డెవరికి జవాబు చెప్పనక్కరలేని నిరంకుశుడు. అయినను మా కతిసామాన్య హక్కులనుకూడ తిరస్కరించి, మాటిమాటికి నాభాచట్టములక్రింద విధానముక్రింద నది యుక్తమే యని చెప్పుచుండిరి. మే మీ విధముగ నాధునిక నిరంకుశయంత్రము యొక్కయు, సంస్థాన ప్రభుత్వముయొక్కయు, ఢాక నెదుర్కొనవలసి వచ్చెను. మా కా రెంటివలన కలుగవలసిన లాభములు శూన్య మగుచు నష్టములుమాత్రమే సంక్రమించెను. ఈ విధముగా మా విచారణ పూర్తియయి మేము శిక్షింపబడితిమి. ఓర్పులో నేము న్నదో మాకు తెలియదు. కాని దీర్ఘశిక్షయను గట్టివిషయము నాకు కొంత శాంతినిచ్చెను. మేము జడ్జిమెంటునకళ్ళ నడుగగా దరఖాస్తు పెట్టుకోవలెననిరి,

ఆ సాయంకాలమే సూపరింటెండెంటు జయిలుకువచ్చి నాభా పరిపాలకుడు క్రిమినలు ప్రొసీజరుకోడ్ క్రింద మా శిక్షల నాపివేసిన ట్లొక ఆర్డరు చూపించెను. ఎట్టిషరతును కోరబడలేదు. కనుక ఆర్డరు ప్రకారము మా శిక్షలాఖరయ్యెను. ఆ పరిపాలకుడే యిచ్చిన మరి యొక ఆర్డరుప్రకారము మేము నాభా వీడిపోయి ప్రత్యేక యనుజ్ఞ లేనిదే తిరిగి రాకూడదనిరి. నేనీ రెండు ఆర్డర్ల నకళ్ళను అడుగగా నిచ్చుటకు వీలులేదనిరి. మమ్మప్పుడు స్టేషనుకు తీసికొనివెళ్లి యచ్చట విడిచిపెట్టిరి. మేము నాభాలో నెవరిని యెరుగము. రాత్రియగుటచే పట్టణద్వారములన్నియు బంధింపబడెను. అంబాలా కొకబండి పోవు చుండగా మేము దానినెక్కితిమి. అచ్చటనుండి నేను ఢిల్లీకి, నలహా బాదుకుపోతిని. ఆ రెండు ఆర్డరులను, రెండుజడ్జిమెంటులను పంపించ వలసినదని అలహాబాదునుండి నే నా పరిపాలకునకు వ్రాసితిని. అతడు వాటిని పంపుటకు వీలులేదనెను. నేను అపీలు చేయవలసియుండునని చెప్పినను కూడ నతడు పెడచెవినిబెట్టెను. ఈ శిక్షలింకను నా మీద నట్లెయుండి నాభాప్రభుత్వముకాని బ్రిటిషుప్రభుత్వముకాని తలచు కొనినపుడు పైకి వచ్చినను రావచ్చును.

మేము ముగ్గురము విడువబడితిమి. కుట్రకేసులో మాతో గుదిగుచ్చబడిన యానాల్గవ సిక్కుముద్దాయిగతి యేమయ్యెనో నా కిప్పటికి తెలియలేదు. బహుశః అతనిని విడిచియుండరు. అతనికి పలుకుబడిగల స్నేహితులు, ప్రజాందోళన లేకపోవుటచే సామాన్యు లందరివలెనే యతడు సంస్థానకారాగారవిస్మృతిలో మునిగిపోయెను. మే మతనిని మరచిపోలేదు. మేము చేయగలిగినది చేసితిమి; కాని యది ఎంతయో లేదు. గురుద్వారకమిటీవా రతనికేసులోకూడ శ్రద్ధతీసికొనిరనియే నా విశ్వాసము. అతడు 'కొమగటమారు' లోని వారిలో నొకడనియు చాలాకాలము జయిల్లోనుండి యంతక్రితమే వచ్చెననియు మేము వింటిమి. అట్టివానిని పోలీసులెట్లు విడిచిపెట్టి యూరుకొనగలరు? కనుక వారతనిని మాపై జమాయించబడిన కేసులో కుక్కిరి; మేము ముగ్గురము నాభా జయిలునుండి మాతో

టైఫసు క్రిమిని మూటగట్టుకొని వచ్చితిమి. నేను మూడు నాలుగు వారములు మంచము పట్టితిని. తక్కినవారిద్దరు చాలకాలమునకు తీవ్ర జ్వరబాధితులైరి.

ఈ నాభాకథకు మరియొక పిల్లకథకూడ కలదు. గిద్వానీ కాంగ్రెసు ప్రతినిధిగా నమృతసరములోనుండిన సిక్కుగురుద్వార కమిటీతో సంబంధము కలిగియుండెను. కమిటీవారు 500 మందిగల యొక ప్రత్యేకజాతాను జయితోకు పంపిరి. వారితో గిద్వానీ ప్రేక్షకుడుగా వెళ్ళెను. అతడు నాభారాష్ట్రములోనికి ప్రవేశించు నుద్దేశ్యముతో వెళ్ళలేదు. నాభాసరిహద్దు పోలీసులు జాతాపై తుపాకులను పేల్చుటచే ననేకమంది గాయపడిరి. కొంతమంది చనిపోయిరి. దెబ్బలు తినినవారికి సహాయముచేయుటకు గిద్వానీ వెళ్ళగా పోలీసులతనిపై బడి యతనిని తీసికొనిపోయిరి. అతనిపై కోర్టులో నెట్టిచర్యయు తీసికొనబడలేదు. అతని నొక సంవత్సరమువరకు జయిలులోనుంచి యారోగ్యమంతయు పూర్తిగా చెడినతరువాత విడిచిపెట్టిరి.

గిద్వానీ నరెస్టుచేసి యంతకాలముంచుట కార్యనిర్వాహకాధికారమును కేవలము దుర్వినియోగపరచుటగా నాకు దోచెను. నేను పరిపాలకునికి వ్రాసి గిద్వానీ నన్నేల నిరోధించిరని యడిగితిని. అనుజ్ఞ లేనిదే నాభారాష్ట్రమును ప్రవేశింపరాదను ఆర్డరు నుల్లంఘించుటచే నతడు నిర్బంధింపబడెనని యతడు వ్రాసెను. నేనిది న్యాయవిరుద్ధమని సవాలుచేసి, దెబ్బలు తిననవారికి సహాయము చేయువానిని నిర్బంధించుట యుచితము గాదనియు, వారి ఆర్డరును నాకు పంపుటకుగాని, ప్రకటించుటగాని చేయవలెననియు కోరితిని. అత డందులకు నిరాకరించెను. నేను నాభా వెళ్ళవలెననుకొంటిని. మిత్రధర్మమిదియేయని నే ననుకొంటిని. కాని చాలమంది స్నేహితుల సలహావెనుక నేను శరణుగొని దుర్బలత్వమును దాచుకొనుటకు వానినొక వ్యాజముగా నుపయోగించితిని. నాభాజయిలుకు తిరిగిపోవుట కిష్టము లేకపోవుట చేతను, దుర్బలత్వముచేతను నే నాగిపోతిని. స్నేహితుని యీ విధముగా విడుచుట నాకెప్పుడును లజ్జాస్పదముగనుండెను. తఱచు మన మందరము పరాక్రమముకంటె వివేకమునే యెక్కువగ గణింతుము,

# 17

## కాకినాడ - మహమ్మదాలీ

1923 డిసెంబరులో కాంగ్రెసు కాకినాడలో జరిగెను. దానికి మహమ్మదాలీ యధ్యక్షుడు. అతడు దీర్ఘోపన్యాసము నిచ్చెను. అది చదువతగినది. అతడు మహమ్మదీయులలోని రాజకీయ భావాభివృద్ధిని, కులతత్త్వభావాభివృద్ధిని వివరించి, 1908 లో ఆగాఖాను యాధిపత్యమున వైస్రాయివద్దకు వెళ్ళిన ముస్లిం రాయబారము ప్రభుత్వముచేతనే నడుపబడెనని చూపించెను.

నా కిష్టము లేకపోయినను, అతని యధ్యక్షకాలములో కార్యదర్శిగా నుండవలసినదని మహమ్మదాలీ నన్ను ప్రోత్సహించెను. భవిష్యద్విధానము నాకు స్పష్టముగా లేనపుడు కార్యనిర్వాహక బాధ్యత వహించుట నాకిష్టము లేకుండెను. కాని నే నతనిని నిరాకరింపజాలకపోతిని. మరియొక కార్యదర్శి క్రొత్త యధ్యక్షునితో నావలె సామరస్యముగ పనిచేయజాలక పోవచ్చునని మే మిరువుర మనుకొంటిమి. అతనికి గాఢమైన 'ఇష్టానిష్టములు' కలవు. అదృష్టవశాత్తు అతని 'ఇష్టములు' నావియు నొక్కటియే యయ్యెను. మమ్ము ప్రేమపాశము పరస్పర గౌరవాతిశయము బంధించెను. అతడు గాఢమతాభినివేశము కలవాడు. నేను కాను. కాని యతని విశ్వాసము, నపరిమితశక్తి, కుశాగ్రబుద్ధి నన్నాకర్షించెను. అతనిలో మంచిహాస్యమున్నది కాని యొక్కొక్కప్పు డతని వేళాకోళము బాధ కలిగించుచుండుటచే చాలమంది స్నేహితుల నతడు పోగొట్టుకొనెను. ఫలితమెట్టిదైనను నతడు తెలివిమైన యాక్షేపణను దాచుకొనజాలడు.

మాకు స్వల్ప భేదాభిప్రాయములున్నను మేమా వత్సరము బాగుగనే గడపితిమి. అఖిలభారత కాంగ్రెసుకమిటీ ఆఫీసులో నే నొక మార్పు తెచ్చితిని. అందు సభ్యులపేర్ల చివరనో మొదటనో మహాత్మా, మౌలానా, పండిత్, షేక్, సయ్యద్, మున్షి, మౌల్వీ,

శ్రీయుత, శ్రీ, మిస్టర్, ఎస్క్వైరు అను బిరుదులు గౌరవపదము లెన్నియో యుండెడివి. వీటిని నేను తీసివేసితిని. మహమ్మదాలీ నాకొక క్రోధపూరిత తంతిపంపి నేను మామూలుపద్ధతి మార్చరాదని ముఖ్యముగా గాంధీజీ నెప్పుడు మహాత్మాయనియే పిలువవలెనని 'ప్రెసిడెంటు' హోదాతో నాజ్ఞాపించెను.

'సర్వశక్తివంతుడు' అను మరియొక విషయమును గురించి తఱచు మాకు వాదము పడుచుండెడిది. కాంగ్రెసు తీర్మానములలో కూడ ప్రార్థన పేరిటనో కృతజ్ఞతను తెలుపుటకో మహమ్మదాలీ భగవంతుని పేరు తెచ్చుచుండెడివాడు. నే నది కూడదనెడివాడను. నేను మతహీనుడనని యతడనెడివాడు. కాని పైకట్లు ప్రవర్తించుచున్నను నేను యదార్థ మతస్వభావము కలవాడనని యతడు తరువాత చెప్పుచుండెడివాడు. అతని స్టేటుమెంటులో నెంతయో సత్యము కలదని నే నాశ్చర్యపడెడివాడను. అది బహుశః మతము, మత విషయము అనువాటి యర్థముపై నాధారపడియుండును.

మతచర్చ మమ్మిద్దరను రెచ్చగొట్టుననియు, నే నతనికి కష్టము కల్గింపవచ్చుననియు నతనితో వాదించెడివాడను కాను. ఏ సిద్ధాంతమునైన గట్టిగా నమ్మినవారితో వాదించుట చాల కష్టమైన విషయము. చాలమంది మహమ్మదీయులతో దీనిని వాదించుట మరింతకష్టము. వారిమార్గము ముక్కుకు సూటియైన సూచీముఖమార్గము. విశ్వాసి కుడియెడమలకు తప్పరాదు. హిందువులలో నట్లుకాదు. ఆచరణలో వారు చాల సనాతనులుగ నుండవచ్చును. కాలవిరుద్ధములైన, ఉపద్రవకరమైన, వినాశకరమైన యాచారముల ననుష్ఠింపవచ్చును, అనుష్ఠించుచున్నారు. అయినను సాధారణముగా వారు మతమును గురించి యెట్టి నూతన భావములనైన చర్చించుటకు సంసిద్ధులు. ఆధునిక ఆర్యసమాజికులలో నీ విశాలత లేదని నా యభిప్రాయము. మహమ్మదీయులవలెనే వారును, ముక్కుకు సూటియైన తమ స్వంత సూచీముఖ మార్గమునే యవలంబింతురు. బుద్ధిమంతులైన హిందువులలో కొంత వేదాంత సంప్రదాయ ముండుటచే నది

మతసమస్యను శాస్త్రరీత్యా చర్చించుట కవకాశము నిచ్చుచున్నది. హిందూసంఘములోనికి వచ్చుపరస్పరాచార, అభిప్రాయ భేదములే కొంత దీనికి కారణమని నా యభిప్రాయము. హిందూమతము మతమే కాదనికూడ తఱచు చెప్పబడుచుండెను. అయినను దానిలో నెంతటి యద్భుతమైన పట్టుదల, జిగి కలదు! ఎన్నియవాంతరములనైన దాటి జీవింపగల యెంతటి యద్భుతశక్తికలదు! చార్వాకునివలె నిరీశ్వర వాదియైన వానినికూడ హిందువుకాడని యనుట కెవరును సాహ సింపరు. హిందూమతము తనబిడ్డల నాశ్లేషించి యుండును. నేను బ్రాహ్మణుడను కనుక మతమునుగురించి సాంఘికాచారములను గురించి నేనేమి చెప్పిన నేమి యాచరించిననుకూడ బ్రాహ్మణుడనే. భారత ప్రపంచముకు నేను 'పండిత' యిత్యాదినే యగుదును. ఒక సారి స్విడ్జర్లండులో నేనొక తురుష్క పండితుని కలుసుకొంటిని. నన్నతనికి ముందుగ పరిచయపరచు నుత్తరములో పండిత జవహ ర్లాలు నెహ్రూ' అని యుండెను. నన్ను చూచుటతోడనే యతనికి కొంత యాశ్చర్యము, నాశాభంగము కలిగించెను. 'పండిత' యను శబ్దమువలన నతడొక వయసుమీరిన వృద్ధపండిత శ్రేష్ఠుని చూడబోవు చున్నట్లు భావించెనని నాతో చెప్పెను.

కనుక నేను మహమ్మదాలీ మతమును గురించి చర్చింపలేదు. కాని యతడూరుకొను స్వభావము కలవాడుకాదు. నే నతనిని ఢిల్లీలో చూడబోయినపుడు నన్ను మతమునుగురించి చర్చింప నిర్బంధిం చెను. 'నేను మతపిచ్చకలవాడనని నీ వనుకొందువు. నే నట్టివాడను కానని రుజువుచేసెదను' అని యతడనెను. మతమునుగురించి యతడు చాల పుస్తకములు నతిశ్రద్ధతో చదివినట్లు చెప్పి యనేకమతపుస్తక ముల బీరువాలను చూపించెను. తన యధ్యయన ఫలితముగా కొరా నులో నున్నదంతయు నూటికి తొంబదియేడువంతులు పూర్తిగా హేతుబద్ధమైనదని కనుగొనెననియు కొరానుతో సంబంధము లేకుం డగనే దీనిని రుజువు చేయవచ్చుననియు నతడు నాతో చెప్పెను. తక్కిన మూడువంతులు నతనిహేతువు కంగీకృతము కాకపోయెను.

కాని తొంబదియేడుపాళ్ళు హేతుబద్ధముగనే యున్నకొరాను తక్కిన మూడుపాళ్ళుకూడ యుక్తముగనే యుండి యతని హేతుజ్ఞానమేతప్పు కాగూడదా ? చివర కత డా తీర్మానమునకే వచ్చి కొరానును నూటికి నూరుపాళ్ళు అంగీకరించెను.

ఇందలి తర్క మంత తేలికయైనదికాదు. అయినను నేను వాదింపదలచుకొనలేదు. కాని తరువాత కథ నిజముగా నాకాశ్చర్యము కలిగించెను. తెలిసికొనవలెననెడి విశాలబుద్ధితో నెవరైన కొరాను చదివినచో దానిసత్యము నొప్పుకొనక తప్పదని తాను రూఢిగా చెప్పగలనని యతడనెను. బాపు (గాంధీజీ) దానిని శ్రద్ధగా చదివెననియు ఇస్లాంయొక్క సత్యము నతడు గ్రహించియుండక తప్పదనియు నభిమానముచేతనే దానినతడు ప్రకటించుటలేదనియు నతడు నాతో చెప్పెను. ఈ వత్సరమైత్రి గడచినతరువాత మహమ్మదాలీ కాంగ్రెసునుండి మెల్లగా జారిపోవ నారంభించెను. లేక నతడట్లు కాంగ్రెసే అతనినుండి జారిపోయెను. ఈ విధానము కొంత నెమ్మదిగనే జరుగుటచే నతడు చాలవత్సరములు కాంగ్రెసుకు హాజరయి దాని కమిటీమీటింగులలో ప్రధానపాత్ర వహించుచుండెను. కాని; నానాటికి చీలిక పెద్దదగుచు మార్గములు భేదించుచుండెను. దీని కేప్రత్యేకవ్యక్తీ, వ్యక్తులు బాధ్యులుకారు. దేశములోనున్న కొన్ని పరిస్థితులే దీనికి కారణము. కాని యీఫలితము చాల దురదృష్టమైనది. అది మా కందరకు బాధగనేయుండెను. ఏలన, సాంఘిక సమస్యలను గురించి యెట్టి యభిప్రాయ భేదములున్నను, రాజకీయములలో నెట్టి భేదాభిప్రాయము లేదు. భారత స్వాతంత్ర్యమున కతడు దోసిలొగ్గెను. ఈ సమాన రాజకీయదృష్టియుండుటచే సాంఘికముగగూడ మా కతనితో పరస్పరాంగీకృత సమాధానము కుదిరెడిది. సాంఘిక ప్రయోజన సాధకులమని నటించు యభివృద్ధి వ్యతిరేకులకు నితనికి రాజకీయసామ్య మేమియు లేదు.

1928 వేసవిలో నతడు యూరపు వెళ్ళుట హిందూదేశ దురదృష్టము. సాంఘిక సమస్యను పరిష్కరించుటకపుడు గొప్పప్రయత్నము

జరిగి కొంచెమించుమించు విజయవంత మగుచుండెను. అప్పుడిచ్చట మహమ్మదాలీ యున్నచో పరిస్థితులు మరొకవిధముగ నుండెడివి. అతడు తిరిగివచ్చుసరి కంతయు భిన్నమగుటచే నతడు రెండవ పక్షమున జేరెను. 1930 లో శాసనోల్లంఘన మతితీవ్రముగా నున్నసమయమున వేలకొలది జనులు జయిలులో నుండగా మహమ్మదాలీ కాంగ్రెసు తీర్మానమును నిర్లక్ష్యముచేసి రౌండు టేబిలు సభకు హాజరయ్యెను. అది నాకు బాధకలిగించెను. అది యతనిహృదయములో నతనికే యసుఖముగా నున్నట్లు లండనులోని యతని చర్యలవలన ద్యోతకమగుచుండెను. తన యదార్థస్థానము హిందూదేశ పోరాటములో నున్నట్లతడు భావించెను. హిందూదేశము తిరిగి వచ్చియుండినచో నతడు పోరాటములో కురికెడివాడని నా నమ్మకము. చాల వత్సరములనుండి వ్యాధి యతనిని బాధించుచుండెను. తగినంత విశ్రాంతి ఔషధసేవ చేయవలసియుండగా నమోఘఫలితమును సాధించవలెననెడి విచారమే యతని మృత్యువుకు కారణమయ్యెను. నైనీజయిలులో నాకతనిమృత్యువార్త యశనిపాతమువలె వినవచ్చెను.

1929 లాహోరు కాంగ్రెసులో నే నతనిని కడసారి కలుసుకొంటిని. అతడు నా యధ్యక్షోపన్యాసములో కొన్ని భాగములతో తృప్తిచెందక తీవ్రముగా విమర్శించెను. కాంగ్రెసు చాల ముందుకు పోవుచున్నట్లు, రాజకీయముగా ముందంజవేయుచున్నట్లు నతడు కనుగొనెను. అతడు స్వయముగా ముందంజవేయు స్వభావము కలవాడగుటచే తాను వెనుకబడి యితరులు ముందుకు పోవుట కిష్టపడడయ్యెను. “జవహర్, నా భరతవాక్యము వినుము! నీ ప్రస్తుత సహకారులు నిన్ను విడిచిపెట్టుదురు! మంచి విషమసమయమున వారు నీ విధికి నిన్ను విడిచివేతురు. నీ కాంగ్రెసు మనుష్యులే నిన్నురికంబముల కెక్కింతురు” అని యతడు నన్ను గట్టిగా మందలించెను. ఎంతటి నిష్ఫ్రుకారెడి జ్యోతిషము!

కాకినాడ కాంగ్రెసులో నఖిలభారత సేవాదళ పునాదులు వేయబడెను. అందుకు పూర్వము జయిలుకు పోవుటకు పనిచేయుటకు

తగు సంస్థలు లేకపోలేదు. కాని మంచిశిక్షణ, సంఘీభావము లేకుండెను. కాంగ్రెసుయొక్క సామాన్యాధిపత్యముక్రింద జాతీయసేవచేయు నొక యావద్భారత సుశిక్షితసైన్యము తయారుచేయవలెనని డాక్టరు హార్డికరు భావించెను. అతడు నాతోడ్పాటు కోరుటచే నతిసంతోషముతో నే నందుల కొప్పుకొంటిని. కాకినాడలో నిది ప్రారంభింపబడెను. ఈ సేవాదళమునకే కాంగ్రెసునాయకులనుండి వచ్చిన వ్యతిరేక భావములు మా కాశ్చర్యము గొల్పెను. ఇది కాంగ్రెసులో మిలిటరీశాఖ స్థాపించుటయనియు, నుపద్రవకరమైన తప్పుడుత్రోవ యనియు కొందరనిరి. మిలిటరీశాఖ నాగరికాధికారమును తలక్రిందులు చేయునేమొ ! పైనుండి వచ్చుయాజ్ఞలను శిరసావహించుటొక్కటే వాలంటీర్లకు కావలసిన శిక్షణయని మరికొంతమంది యనిరి. అంతకు మిసహా యిక వాలంటీర్లు అడుగుతో నడుగైన వేయనక్కరలేదు. సుశిక్షితులైన వాలంటీర్లను తయారుచేయవలెననెడి భావము కాంగ్రెసు సిద్ధాంతమైన దౌర్జన్యరాహిత్యమునకు వ్యతిరేకమని కొందరి మనస్సులో నుండెను. ఎట్లైనను హార్డికరు యీ పనికి బూనుకొని యనేకవత్సరముల కృషిద్వారా మన సుశిక్షితులైన వాలంటీర్లు యెక్కువ పటుత్వము దౌర్జన్యరాహిత్యము చూపగలరని ప్రదర్శించెను.

నేను కాకినాడనుంచి తిరిగి వచ్చుటతోటనే 1924 జనవరిలో మరొక చిత్రమైన యనుభవము కలిగెను. నేను కేవలము జ్ఞాపకమును బట్టి వ్రాయుచుండుటచే తేదీలు కలగాపులగము కావచ్చును. అలహాబాదులో గంగాతీరమున కుంభమేళ లేక అర్థ కుంభమేళ జరుగుచుండెను. లక్షలకొలది జనులు త్రివేణి - గంగా, యమునా, సరస్వతి కలియుచోట స్నానముచేయుటకు వత్తురు. గంగాగర్భము సుమారొక మైలుకలదు; కాని శీతకాలములో నది లోపలికి పోవుటచే పెద్ద పెద్ద యిసుక తిప్పలు బయటపడి యాత్రికులకు పాకలు, పందిళ్ళు వేయుటకు చాల వీలుగా నుండును. ఈ గర్భములోనే గంగ తఱచు తన మార్గమును మార్చుకొనుచుండును. 1924 లో గంగాప్రవాహము, త్రివేణిలో యాత్రీకులు స్నానముచేయుట కుపద్రవకరము

గనే యుండెను. ఒకేసారి స్నానముచేయువారిని నియమించి యుప ద్రవమును చాలవరకు తగ్గించవచ్చును.

పర్వదినములలో గంగలో స్నానముచేసి పుణ్యము మూట గట్టుకొనవలెనను నుద్దేశ్యము నా కెప్పుడు లేకపోవుటచే నే నీసమ స్యలో నెంతమాత్రము శ్రద్ధతీసికొనలేదు. త్రివేణిలో స్నానము చేయరాదని స్థానికప్రభుత్వము నిషేధించుటచే పండిత మదన మోహన మాలవ్యాకు ప్రభుత్వముకు చర్చ జరుగుచున్నట్లు పత్రిక లలో చూచితిని. మతప్రకారము త్రివేణిలో స్నానముచేయవలసి యున్నదని మాలవ్యాజీ దీని కభ్యంతరపెట్టెను. ఉపద్రవములు, జన నష్టము లేకుండచేయుట ప్రభుత్వ ధర్మమేకాని యది తన సహజధోర ణిలో నా పనిని చాల కర్రపడివాటముగ నుద్రేకజనకముగ ప్రారం భించెను.

కుంభదినమున నేను ప్రాతఃకాలముననే, స్నానముచేయుటకు గాక, మేలాను చూచుటకు, నదికివెళ్ళి యచట మాలవ్యాజీ స్నానము చేయుట కనుజ్ఞనీయవలసినదని జిల్లామేజిస్ట్రేటుకు మర్యాదగా వ్రాసి పంపెనని తెలిసికొంటిని. మేజస్ట్రేటు అనుజ్ఞను నిరాకరించెను. దాని మీాద మాలవ్యాజీ సత్యాగ్రహము చేయుటకు నిశ్చయించి రెండు వందలమందితో త్రివేణికి బయలుదేరెను. దీనిని చూచుటకు నేను నా వేడిలో సత్యాగ్రహజట్టులో చేరితిని. ప్రజలు త్రివేణికి పోకుండ మైదానములో నొక పెద్ద యడ్డంకి కల్పింపబడెను. మే మీా యడ్డంకి దగ్గరకు పోవుసరికి పోలీసులు మమ్మాపివేసి మా దగ్గరున్న నిచ్చె నను లాగికొనిరి. దౌర్జన్యరాహిత్య సత్యాగ్రహులము కనుక మే మచ్చట నిసుకలో శాంతముగా కూర్చుంటిమి. ఇట్లు గంట తరువాత గంట గడచిపోవుచుండెను. భాస్కరుడు ఆకసమున ప్రచండ కిరణము లతో వెలుగొందుచుండెను. ఇసుకతిన్నెలు చుట్టున మండుచుండెను. మా కడుపులు మాడుచుండెను. ఒకవంక పదాతులు, మరియొక వంక గుఱ్ఱపుదళము మమ్ము కాచియుండెను. చివరకు మే మందరము చాల విసిగి యేదో యొకటి చేయవలెననుకొంటిమి. అధికారులుకూడ చాల విసిగి దానిని త్వరితము చేసిరి. గుఱ్ఱపుదళము కాజ్ఞ యిచ్చుట

తోడనే వారు గుఱ్ఱముల నెక్కిరి. వారు మాపైకురికి మమ్ము తరిమి వేయవచ్చుచున్నట్లు నాకు తట్టెను. గుఱ్ఱపుదళముచే తరుమగొట్టబడుట నా కిష్టములేకుండెను. అంతేకాక నచ్చట కూర్చుండుటతో కూడ మేము విసుగుచెందితిమి. కనుక దగ్గరనున్న వారితో గోడలను దాటిపోవుదమని సూచించి నేను పై కెక్కితిని. వెంటనే పదులు యిరువదులు చొప్పున పై కెక్కిరి. కొంతమంది కట్టిన గెడలను నూడబెరికి దోవచేసిరి. ఎవరో నా కొక జాతీయజెండా యిచ్చిరి. దానిని నేను కూర్చొన్నచోట నొక గెడకు కట్టితిని. నేను కొంచెము దేశికడి ప్రజలు పై కెక్కుచుండుటను త్రోసుకొని ముందుకు వచ్చుటను, పోలీసులు వారిని త్రోసివేయుచుండుటనుచూచి యానందించుచుంటిని. గుఱ్ఱపుదళము నిరపాయకరముగనే పనిచేసెను. వారు కఱ్ఱలను విసరుచు ప్రజలను వాటితో గెంటుచుండిరి. కాని యెవరికి హానికలుగ జేయలేదు.

చివరకు నే నవతలప్రక్కకు దిగి చాల వేడిగా నుండుటచే స్నానముచేయ నిశ్చయించితిని. నేను తిరిగి వచ్చుసరికి మాలవ్యాజీ మొదలగువా రెప్పటివలెనే యచ్చటనే కూర్చొనియుండిరి. కానిగుఱ్ఱపుదళము, పదాతులు కలసి సత్యాగ్రహులకు గోడకు మధ్యనిలచిరి. నేను మరల మాలవ్యాజీవద్దకు వచ్చి కూర్చుంటిని. మరికొంతసేపు మేమట్లు కూర్చుంటిమి. వ్యవహారము స్తంభించెను. మాలవ్యాజీ యాందోళనపడసాగెను. అతడు భావోద్రేకము నణచుకొనుచున్నట్లు కాన్పించెను. హఠాత్తుగా నత డాశ్చర్యముగ పోలీసుల మధ్యనుంచియు గుఱ్ఱములమధ్యనుంచియు దూరివెళ్లెను. అట్లు చేయగలుగుట యాశ్చర్యమే కాని వృద్ధుడై, దుర్బలశరీరుడైన మాలవ్యాజీ యట్లు చేయుట మహాద్భుతవిషయము. మేముకూడ నతని ననుకరించితిమి. మమ్ము వెనుకకు నెట్టివేయుటకు కొంతసేపుయత్నించి పోలీసు లూరకొనిరి. మరికొంతసేపటికి వారువెళ్లిపోయిరి. ప్రభుత్వము మాపై చర్య తీసికొనెదరని మే మూహించితిమి. కాని యట్టిదేదియు జరుగలేదు. బహుశః ప్రభుత్వము మాలవ్యాజీమీద నెట్టిచర్య తీసికొన నిచ్ఛగింపలేదు. కనుక నీ చిన్న చేపకూడ దాటిపోయెను.

# 18

## మా తండ్రి - గాంధీజీ

1924 లో గాంధీజీకి జయిలులో చాల జబ్బుచేసినట్లు శస్త్రము చేసినట్లు హఠాత్తుగా వార్తలే తెంచెను. భారతదేశమంతయు నొక్క సారి విచారసాగరమున మునిగిపోయెను. భయభ్రాంతులమై మేమూపిరి పీల్చుట మాని ముందేమి జరుగునోయని నిరీక్షించుచుంటిమి. కాని గండము దాటెను. తోడనే మూలమూలలనుండి జన ప్రవాహ మతనిని చూచుటకు పూనా బయలుదేరెను. అత డింకను ఆస్పత్రిలో ఖయిదీగ నుండెను. కాని కొంతమంది స్నేహితు లతనిని చూడవచ్చు ననిరి. తండ్రిగారు నేను నతనిని ఆస్పత్రిలో చూచితిమి. అప్పటి కతడు తన యారువత్సరముల శిక్షలో రెండువత్సరముల శిక్ష ననుభవించెను. అతడు వ్యాధినుండి కోల్కొనుచుండుటచే ప్రభుత్వ మతని మిగత శిక్షాకాలమును రద్దుచేసి విడిచివేసిరి. అతడు బొంబాయితీరముననున్న జుహూలో విశ్రాంతి తీసుకొనుటకు వెళ్లెను.

మా కుటుంబముకూడ జుహూ వెళ్లి యచ్చట సముద్రతీరమున ఒక చిన్నకుటీరములో బస చేసెను. మేము కొన్నివారము లచ్చట గడిపితిమి. చాలాకాలమునకు నేను మరల నా కత్యంతప్రీతికరమైన యీత, పరుగెత్తుట, స్వారిచేయుట మొదలగు వినోదములతో సముద్రతీరమున విహరించితిని. కాని మేము వినోదముకొఱకు వచ్చు టకుపోలేదు. తండ్రిగారు గాంధీజీకి స్వరాజ్యపార్టీవారి స్థితిని తెలిపి, ప్రత్యక్షసహాయము కాకపోయిన నతని యాశీర్వాదమునైన పొంద కోరెను. నన్ను బాధించుచున్న కొన్ని సందేహములను తీర్చుకొన వలెనని నే నాతురతతో నుంటిని. అతనిభవిష్యద్విధాన మెట్లుండునో నేను తెలిసికొన గోరితిని.

జుహూ సంభాషణలు, స్వరాజ్యపక్షముకు సంబంధించినంత వరకు గాంధీజీని జయించుటలోగాని, కొంచెమైన నతనికి నచ్చ చెప్పుటలోగాని యెట్టిఫలితము పొందలేదు. ఎంత మిత్రసంభాషణము

యెంతటి మర్యాద ప్రవర్తన యున్నను చివరకు రాజీమాత్రము కుదరలేదు. అట్లు భేదించుటకే యొప్పుకొని వారట్లే ప్రెస్సులకు స్టేటుమెంటుల నిచ్చిరి.

నేనుగూడ కొంచె మాశాభంగముపొంది, జుహూనుండి తిరిగి వచ్చితిని. గాంధీజీ నా సందేహములలో నొక్కదాన్నైనను తీర్చలేదు. అతడు భవిష్యత్తును చూడ నిరాకరించెను. దూరస్థవ్యాప్తిగల ప్రోగ్రాము నతడు వేయకుండెను. మే మోర్పుతో ప్రజా 'సేవ' చేయవలెను. కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమమును, సంఘసంస్కార విధానమును ఆచరించి తీవ్రకార్యక్రమముకొరకు వేచియుండవలెను. అట్టి సమయ మేతెంచినను చౌరిచౌరావంటి మరియొక యవాంతర మేదైన వచ్చిన మన యుద్యమ మాగిపోదా? అనునదే యదార్థ సమస్య. దానికి గాంధీజీ యప్పుడేమియు సమాధానము చెప్పలేదు. గమ్యస్థానమునుగురించికూడ నతడు నిర్ధారణ లేకయుండెను. కాంగ్రెసు యధావిధిగా దాని నప్పట్లో ప్రకటింప నవసరము లేకపోయినను, మనస్సులలోనైన మనం దేనినిసాధింపగోరుచున్నామో స్పష్టముగ నుండవలెనని మేము కోరితిమి. మనము స్వాతంత్ర్యమును, కొంత సాంఘికమార్పును కోరుచున్నామా లేక మన నాయకు లంతకంటె చాల తక్కువకే రాజీపడెదరా? కొద్దినెలలకు పూర్వమే నేను మా రాష్ట్ర సభాధ్యక్షోపన్యాసములో స్వాతంత్ర్యమును గురించి నొక్కి చెప్పితిని. నేను నాభానుండి వచ్చినతరువాత 1923 శరత్కాలములో నీ సభ జరిగెను. నేను నాభా జయిలునుండి సంపాదించి తెచ్చిన జ్వరముతో మంచముమీద నుండియే నా యుపన్యాసమును వ్రాసి పంపితిని.

కాంగ్రెసులో స్వాతంత్ర్యసమస్యను గురించి స్పష్టపరుపవలెనని మాలో కొంద రాశించుచుండ, మన లిబరలు మిత్రులు మనలనుండి జారిపోయి సామ్రాజ్యాధికార ప్రతిభావిశేషములో బహిరంగముగ నోలలాడుచుండిరి. శాస్త్రిగారు సామ్రాజ్య రాయబారి యయ్యెను. సర్ తేజిబహదూర్ సప్రూ 1923 లో లండనులో జరి

గిన సామ్రాజ్యసభలో "సామ్రాజ్యమునకు సామ్రాజ్యహోదాను కల్పించినది నాదేశమేయని నేను సగర్వముగా నుడువుచున్నాను" అని వ్రాసెను. ఈ లిబరలు నాయకులకు మనకు మహోదధి యడ్డ మున్నట్లుండెను. వారి ప్రపంచము వేరు మనప్రపంచము వేరు. వారి భాష వేరు. మన భాష వేరు. మన కలలకు వారి కలలకు సామ్యమే లేదు. ఇట్టిస్థితిలో మన గమ్యస్థానమును గురించి మనము స్పష్టముగ నిర్వివాదముగ నుండనక్కరలేదా ?

కాని యిట్టియాలోచన లప్పుడు కొద్దిమందికే గలవు. చాల మందికి నిర్ధారణయనిన యిష్టములేకుండెను. ముఖ్యముగా జాతీయోద్యమములో కొంత యస్పష్టత, రహస్యములుండును. 1924 మొదటి నెలలో ప్రజాదృష్టి యంతయు శాసనసభలలోను అసెంబ్లీల లోనుగల స్వరాజ్యపార్టీవారిపై బడెను. "లోపలనుండి ప్రతిఘటించెదము' శాసనసభలను బ్రద్దలుచేసెదము" అని బడాయికొట్టిన యీ బృందము లేమిచేసియున్నవి? కొన్ని శుభచిహ్నములు కాన్పించెను. అసెంబ్లీ సాంవత్సరిక బడ్జెటు త్రోసివేయబడెను. భారత స్వాతంత్ర్య పరతులనుగురించి నిర్ణయించుటకు రౌండుటేబిలు చర్చ కావలెనను తీర్మానమొకటి చేయబడెను. దేశబంధుదాసు నాయకత్వముక్రింద బెంగాలుశాసనసభలో సప్లయిలతీర్మాన మోడింపబడెను. వైస్రాయి గవర్నరు రెండుబడ్జెటులను ధృవపరచుటచే నవి చట్టములయ్యెను. శాసన సభలలో కొన్ని యుపన్యాసములు, కొంత యుద్రేకము, స్వరాజ్యవాదులలో తాత్కాలిక విజయోత్సాహము, పత్రికలలో పెద్దపెద్ద శీర్షికల మినహా మరేమియులేదు. వారిక నేమిచేయగలరు ? వారీయెత్తులనే తిరిగితిరిగి వేయగలరు. కాని వానిలోని వింత తగ్గిపోయెను. ఉద్రేకము మాయమయ్యెను. బడ్జెటులను వైస్రాయి లేక గవర్నరులు ధృవపరచుచుండ ప్రజాహృదయము దానికలవాటుపడిపోయెను. తరువాతమెట్టు శాసనసభలలోనున్న స్వరాజ్యవాదుల కతీతమైనది. అది శాసనసభల బయటనే జరుగవలెను,

1924 సంవత్సరముమధ్య అహమ్మదాబాదులో అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగు జరిగెను. ఈ సభలో గాంధీజీకి స్వరాజ్య వాదులకు నకస్మాత్తుగా నొక సంఘర్షణ జరిగెను. దీనిని గాంధీజీయే ప్రారంభించెను. అతడు కాంగ్రెసు సభ్యత్వపురూల్సు మార్చివేసి, వోటు అర్హతను మార్చి కాంగ్రెసు చట్టములోనే ప్రధానమార్పు చేసెను. ఇంతవరకు కాంగ్రెసు చట్టముయొక్క ప్రధాన సూత్రము నంగీకరించి నాలుగణాలు చెల్లించినవాడు సభ్యుడుకావచ్చును. నాలు గణాలకు బదులు తాను స్వంతముగా వడికిన వడుకునూలు నీయవలె నను షరతును పెట్టవలెనని యతడు చూచెను. వోటుహక్కు నిది చాల సంకుచితపరచుచున్నది. కనుక అ. భా. కాం. కమిటీ దీనిని చేయజాలదు. తన కభ్యంతరముగా కాన్పించినపుడు గాంధీజీ యెప్పుడు చట్టములలోనుండు శబ్దములను లెక్కచేయడు. మన చట్టము నిది భంగపరచుచున్నదని నే ననుకొని నా కార్యదర్శి పదవికి రాజీ నామా యిచ్చితిని. కాని మరికొన్ని కారణములచే నేను దాని నుప సంహరించుకొంటిని. అ. భా. కాం. కమిటీలో నీ తీర్మానమును మా తండ్రి, దాసుగారు తీవ్రముగా నెదిరించి తమ యసమ్మతిని తెలుపుటకు వోటింగుముందు తమ యనుచరులతో సభనుండి బయటకు వెళ్ళిపోయిరి. అప్పుడుకూడ తీర్మానము నెదిరించు వారు కొందరు సభలోనే యుండిరి. తీర్మానము నధిక సంఖ్యాకు లామోదించిరి. కాని చివరకది తగ్గించుకొనబడెను. స్వరాజ్యవాదులు వెళ్ళిపోవుటచేతను, మా తండ్రి, దాసుగారు, యీ విషయములో నెంతమాత్రము సడలకపోవుటచేతను గాంధీజీ చాల బాధపడెను.

ఆ తీర్మానము తీవ్రముగా నెదిరింపబడునని తెలిసియు నతడు వడుకునూలు వోటింగు అర్హతనే యంతగా నేల సమర్థించెనో నా కర్థముకాలేదు. బహుశ కాంగ్రెసులో తన ఖాదీ నిర్మాణ కార్య క్రమమునందు నమ్మకముకలవారిని మాత్రమే యుంచి తక్కినవారిని తరిమివేయవలెనని, లేదా దాని కంగీకరించుచున్నట్లు చేయవలెనని యత డనుకొనెను. అధిక సంఖ్యాకు లతనిపక్షముననే యున్నను తన

పట్టుదల తగ్గించుకొని యతడితరులతో రాజీపడెను. ఈ సమస్య సందర్భములో నతడు తరువాత మూడు నాలుగు మాసములలో ననేకసార్లు మారెను. అతడు నే నెక్కడనుంటిని ? నే నెచ్చటకు పోవలెను ? అను స్థితిలోనుండెను. అతని కట్టిస్థితి యెన్నడు నుండదని నే ననుకొనుటచేతనే నాకది యాశ్చర్యము కలిగించెను. ఆ సమస్య యంత గొప్పదికాదు. పనిచేయుట వోటింగు అర్హతగ నుండవలె నను భావము చాల యవసరమే. కాని దాని కా సంకుచితరూపము నిచ్చుటచే దానియర్థము కొంత తగ్గెను.

అపరిచిత విషయములలో నడుచుటచే గాంధీజీకి కష్టములు కలిగెనని నేను నిశ్చయించుకొంటిని. అతడు తన ప్రత్యేక సత్యాగ్రహరంగములో నసమానుడు; అతని బుద్ధివైశద్య మతనిని ధర్మ మార్గముననే నడుపుచుండెను. స్వాయముగ తాను పనిచేయుచు నితరులచే ప్రశాంతముగ పనిచేయించు నతడు ప్రజలలో సంఘ సంస్కారమును కలుగజేయగలడు. అతడు యుద్ధముచేయగలడు. లేదా ప్రశాంతముగ నుండగలడు. కాని మధ్యరకపు వ్యవహార మతనికి పనికిరాదు. శాసనసభలలోనుండి పోరాడెదము. ప్రతి ఘటించెదమను స్వరాజ్యపార్టీ విధాన మతనికి చప్పగనుండెను. శాసనసభలలోనికి వెళ్ళదలచినచో ప్రతిఘటించుటగాక మంచి శాసనములను గావించుటకు ప్రభుత్వమునకు తోడ్పడుటకే వెళ్ళవలెను. అట్లు చేయుట కిష్టములేనిచో బయట నుండవలెను. స్వరాజ్యవాదు లీ రెండింటిలో దేనిని చేయరైరి. అట్టివారితో నతడేమి చేయవలెను ?

చివర కతడు వారితో సమాధానపడెను. వెనుకటి పాంలా సభ్యత్వమును తీసివేయలేదు. దానికి ప్రత్యామ్నాయముగా వడుకు నూలు యివ్వవచ్చుననిరి. తనమట్టుకు తాను దూరముగనుండి శాసన సభలలో స్వరాజ్యవాదుల కృషి నత డాశీర్వదించెను. అతడు రాజకీయములనుండి విరమించెననిరి. అధికారులు ప్రభుత్వమువారు నతని పలుకుబడి నశించుచున్నదనియు, నతడు తన శక్తి నంతను కోల్పోయెననియు విశ్వసించిరి. దాసు, నెహ్రూలు, గాంధీజీని

వెనుకకు తరిమివేసిరనిరి. రాజకీయరంగమును వారాక్రమించినట్లు కాన్పించెను. ఈ పదిహేనువత్సరములలో నిట్టి విమర్శ లనేకసార్లు చేయబడుటయు, భారత ప్రజాహృదయ మెంతమాత్రము మన ప్రభుత్వమునకు తెలియదని ప్రతిసారియు జగద్విదిత మగుటయు మన మెరిగిన విషయమే! భారత రాజకీయరంగమునకు వచ్చినది లగాయతు ప్రజలకు సంబంధించినంతవరకు గాంధీజీ పలుకుబడి యప్రతిహతముగనే యుండెను. ఇంతేకాదు! అతని పలుకుబడి యంతకంతకు హెచ్చుచుండెను. ఇంకను హెచ్చుచున్నది. మానవ స్వభావము దుర్బలమగుటచే వారతని యాశయములను నెరవేర్చ జాలకపోవచ్చును. కాని వారి హృదయము లెప్పుడు నతనిని ప్రేమించుచుండెను. తగినపరిస్థితులు, కారణములు సహాయపడినపుడు వారొక్కసారిగా పైకిలేచెదరు. లేనపుడు వారెచ్చటనో పడియుండె దరు. నాయకుడు ప్రజోద్యమమును గారడివానివలె శూన్యము నుండి సృష్టింపడు. పరిస్థితులేర్పడినపు డతడు వాటి నుపయోగించు కొనును. అట్టి పరిస్థితుల నతడు తయారుచేయవచ్చును. కాని వాటిని సృష్టింపజాలడు.

విద్యాధికులలో గాంధీజీ పలుకుబడి తగ్గినమాట నిజము. ముందుకుపోవు వీరావేశముకూ వారతనిని ననుసరింతురు. కాని యుద్య మము వెనుకకు తగ్గినపుడు వారతనిపై కారములు మిరియములు నూరుదురు. అయినను వారిలో నధికసంఖ్యాకు లతనికి జోహారుల నర్పింతురు. మరియొక పటుతరకార్యవిధాన మేదియు లేకపోవుటయే దీనికి కొంత కారణము. లిబరలుపక్షము, రెస్పాన్సిలిష్టులు మొదలగు వారిని మనము లెక్కింపనక్కరలేదు. ప్రభుత్వమును భయపెట్టుటకు దౌర్జన్యము చేయవలెనని విశ్వసించెడివా రాధునిక ప్రపంచములో హద్దులను మీరినవారు. వారి పద్ధతులు నిష్ప్రయోజనములు, ప్రాచీనములు. సామ్యవాదపద్ధతి యింకను తెలియరాదు; కాంగ్రెసు లోని పైతరగతులవారి కది భయజనకముగ నుండెను.

1924 లో కొద్దికాలము మాతండ్రికి, గాంధీజీకి రాజకీయముగ దూరమైనను, త్వరలోనే వారిమైత్రి మరింత యధికమయ్యెను. వారిలో వారికెట్టి భేదాభిప్రాయములున్నను వా రొండొరుల నెక్కుడుగా ప్రేమించి గౌరవించుకొనెడివారు. వారంతగా దేనిని గౌరవించిరి? గాంధీజీ వ్రాతలనుంచి తీయబడిన "భావతరంగములు" అను చిన్నపుస్తకముకు పీఠిక వ్రాయుచు తండ్రిగారు కొంత సూచననిచ్చిరి.

"ఋషులను గురించియు, మానవాతీతులను గురించియు నేను వింటిని; కాని నేనెన్నడు నట్టివారిని కలుసుకొనలేదు; అట్టివారు నిజముగా నుందురనికూడ విశ్వసింపకపోతిని. నేను మానవులను, మానవవిషయములను విశ్వసింతును. ఈ ప్రతిలో కూర్చబడిన 'భావతరంగములు' మానవసంభవములు, మానవవిషయములు. అవి విశ్వాసము, శక్తి యను మానవుని రెండు ప్రధానలక్షణములను తెలుపుచున్నవి. "ఇదంతయు మనల నెచ్చటకు గొంపోవుచున్నది" అని విశ్వాసముగాని, శక్తిగాని లేనివారు ప్రశ్నింతురు. "జయలక్ష్మికి లేక మృత్యుసదనముకు" అను సమాధానము వారి కర్థముకాదు. ఈలోపల నొక నిరాడంబరమూర్తి యప్రతిహతమైన విశ్వాసశక్తుల మీాద ... నమ్రముగా నిలచి మాతృదేశ పాదారవిందములకడ నాత్మార్పణ మొనర్పుడు, చిత్రవధల ననుభవింపు డను మహత్తర సందేశమును తన ప్రజల కిచ్చుచుండెను. ఆ సందేశము లక్షలకొలది ప్రజల హృదయములలో ప్రతిధ్వనించుచుండెను ... " "మనలో చక్రవర్తు లెందరులేరు? విషయములను జయించిన విషయాధిపతు లెందరులేరు" అను స్విన్బరను వాక్యములతో నతడు దానిని ముగించెను.

గాంధీజీ మహాత్మునివలె, ఋషివలెగాక నతడు మానివునివలెనే యభినందించెను. స్వయముగ శక్తివంతుడు యితరులకు మోకరించని వాడు నగుటచే నతడు గాంధీజీ యాత్మశక్తిని మెచ్చుకొనెను. ఈ మైదడుగుల మనిషిలో, యీ దుర్బల శరీరునిలో నెంతటి మహాబల వంతులకైన లొంగని వజ్రశక్తికలదు. గొప్ప ముఖలక్షణములాలేవు!

మొలగుడ్డ, నగ్నశరీరము ! అట్టి యితనిలో ననేకమందిచే హృదయ పూర్వకముగ జోహారు లొనరింపచేయు నమోఘశక్తి కలదు. అతడు బుద్ధిపూర్వకముగ వినమ్రుడైనను అత్యంతశక్తివంతుడు, ప్రతిభాశాలి; అది యతనికి తెలియును. ఒక్కొక్కప్పు డత డాజ్ఞలనిచ్చును; అధికారమును చెలాయించును. అవి శిరసావహింపబడును. అతని గంభీర ప్రశాంత నేత్రము లెవనినైనను కదలనీయక నెమ్మదిగ నంతరంగ పరిశోధనచేయును. స్పష్టము, నిర్మలము నగు యతని కంఠధ్వని హృదంతరాళముల ప్రవేశించి భావోద్రేకము కలిగించును. సభా మంటపమున నొకడున్నను, వేలున్నను, అతని మోహనశక్తి వారిలో ప్రవేశించి ప్రతివాడు నతనితో నైక్యభావము నొందును. బుద్ధిని పూర్తిగ నిర్లక్ష్యము చేయకపోయినను ఈ భావమునకు బుద్ధితో సంబంధములేదు. బుద్ధి హేతువులకు నిశ్చయముగా రెండవ స్థాన మీయబడును. ఈ యద్భుత 'మంత్రశక్తి' వక్తృత్వముచేత గాని, లలితపద ప్రయోగముచేతగాని సంభవించినది కాదు. భాష నిరాడంబరముగ విషయబద్ధముగనుండి, పొల్లుపద మొక్కటియు మచ్చుకైన కానరాదు. అతని యనన్యనిష్కాపట్యత, వ్యక్తిత్వము మనలను వశపరచుకొనెను. అతనిలో నద్భుత యంతశ్శక్తులున్నట్లు కాన్పించును. అతనినిగురించి యట్టి సాంప్రదాయముకూడ బయలు దేరుటచే నది మంచి వాతావరణము కలిగించుటకు తోడ్పడు చుండెను. ఈ సాంప్రదాయము నెరుగనట్టియు, తన పరిసరములతో సామరస్యము లేనట్టియు, క్రొత్తవాడీ మంత్రమునకు కట్టుబడక పోవచ్చును. లేదా అంతగా కట్టుబడకపోవచ్చును. అయినను ప్రతిఘటించువారి నోడించుట లేదా నిరాయుధులనుచేయుట గాంధీజీయొక్క గొప్పశక్తులలో నొకటి.

గాంధీజీ ప్రకృతి సౌందర్యము నానందించినను కర్తృక వస్తువు లలో నతనికి సౌందర్యము కానరాదు. తాజమహాలు అతనికి నిర్బంధ పరిశ్రమ ఫలము కాని యంతకంటె వేరుకాదు. అతనికి యాఘ్రాణశక్తి చాల తక్కువ. అయినను తన స్వాంతవిధమున నత

డొక జీవితకళను కనుగొని తన జీవితమునంతను నొక కళగాచేసెను. అతని హావ, భావములన్నియు, తళుకు బెళుకులు లేక యర్థవంత ములు, శోభాసమన్వితములు. అతనిలో చిరుబురులు, చికాకు, చిందర వందరలు మొదలగున వేవియులేవు. ఆత్మశాంతి పొందిన వాడై దాని నితరులకు వెదజల్లుచు జీవిత దుస్సహామార్గముల నత డవలీలగా నడచిపోవుచుండును. మా తండ్రికి నితనికి నెంత భేదము కలదు ! అతనిలోకూడ నాత్మశక్తి, రాజఠీవి లేకపోలేదు. పై స్విన్బరను వాక్యము లతనికిని వర్తించును. అతడున్న యే సభలో నైనను విధాయికముగా కేంద్ర మతడేయగును. పంక్తిలో నత డే మూల కూర్చొనినను చివరకదియే శీర్షమగును. అతనిలో నమ్రత వినయము లేవు. అతనితో భేదించువాని నతడెంతమాత్రము విడిచి పెట్టడు. బుద్ధిపూర్వకముగా నధికారగర్వము గలిగిన యతడు గొప్ప భక్తిని, తీవ్రవ్యతిరేకమునుకూడ సృష్టించుకొనును. అతనివద్ద తటస్థ భావమనునది పనికిరాదు. అతనిని ప్రేమింపనైన ప్రేమింపవలె లేదా ద్వేషింపవలెను. విశాలమైన నుదురు, బిగింపబడిన పెదవులు, భల్లూ కపుపట్టు సూచించు గడ్డము — ఇటలీ వస్తు ప్రదర్శనశాలలలోని రోమనుచక్రవర్తుల విగ్రహములను మఱపించును. మా దగ్గరనున్న యతని చిత్రమును చూచి యిటలీలోని చాలమంది స్నేహితు లీ పోలికను గురించియే శ్లాఘించిరి. చివర సంవత్సరములలో ముఖ్య ముగా నతనితల రజిత శిరోజశోభల నీనునపు డతనిలో నొకవింత శోభ, యొక గొప్పదనము కాన్పించెను. నే నతనియెడల పక్షపాత ముగ నుండవచ్చును. కాని దుర్బలత్వము, నల్పత్వములతో నిండి యుండిన యీ ప్రపంచములో నా కట్టి యుదార విగ్రహము కాన రాలేదు. అతనికున్న యా గొప్పదనముకొరకు నా యద్భుతశక్తి కొరకు నా చుట్టుప్రక్కల వెదకి వ్యర్థుడనైతిని.

గాంధీజీ 1924 లో స్వరాజ్యపార్టీతో కుస్తీపట్టు సమయమున మా తండ్రి ఫొటో యొకటి నే నతని కిచ్చితిని. అందులో మాతండ్రికి మీసములులేవు. అదివరకు గాంధీజీ మా తండ్రి నెప్పుడు మీసకట్టు

తోనే చూచెను. ఈ ఫోటోను చూచుటతోడనే యతడుతటాలున లేచి దానిని చాలసేపు చూచెను. మీసములు లేకపోవుటచే ముఖము యొక్కయు గడ్డముయొక్కయు కాఠిన్యత బయటపడెను. అతడు చిరునవ్వుతో తాను దేనితో పోరుచున్నదియు నిప్పుడు తెలిసికొంటినని చెప్పెను; అయినను ఆ ముఖము నేత్రయుగ్మముచేతను, నిరంతర మందస్మిత జనిత రేఖా లావణ్యముచేతను మార్దవము నొందెను. అప్పుడప్పుడు కండ్లు ప్రకాశించు చుండెను. తండ్రిగా రసెంబ్లీ కార్యక్రమమును తీపినీటి కెదురెక్కు చేపవలె పూనుకొనిరి. అతని న్యాయ చట్టసంబంధమైన శిక్షణ కిది యెంతయు తగియుండెను. సత్యాగ్రహము దాని సంతతి కంటె నత డీక్రీడాసూత్రముల నెరుంగును. అతడు తన పార్టీని కఠిన శిక్షణలో నుంచుటయేగాక నితర వ్యక్తులను బృందములను కూడ తనకు తోడ్పడ పురికొల్పెను! కాని యతడు తనతోడివారితోనే బాధలు పడవలసివచ్చెను. స్వరాజ్యపార్టీ మొదటిరోజులలో నోఛేంజర్లతో పోరాడవలసి వచ్చి బలము చేకూర్చుకొనుట కనేకమంది యవకతవక మనుష్యులను జేర్చుకొనెను. తరువాత యెన్నికలు వచ్చెను. వీటికి ధనము కావలసి వచ్చెను. అది ధనవంతులనుండి రావలెను. కనుక నీ ధనవంతులను జోకొట్టవలెను. కొంతమందిని స్వరాజ్యపార్టీ అభ్యర్థులుగా నుండ గోరిరి. "ఒకరినుండి యొకరిని కాపాడెదమని వాగ్దానము చేయుచు బీదలనుండి వోటులను, ధనవంతులనుండి ధనమును సంపాదించు సాధువైన కళయే రాజకీయములు" అని యొక యమెరికాసామ్యవాది చెప్పుచున్నాడు.

మొదటినుంచియు నీ కూటములన్నియు పార్టీని దుర్బలపరచెను. అసెంబ్లీలోను శాసనసభలలోను పనిచేయుట కితర మితవాద పక్షములతో రాజీలు నిత్యావసరములయ్యెను. కనుక నితరులపై ధ్వజమెత్తుట యట్టి సూత్రములు పనికిరావయ్యెను. క్రమముగా పార్టీ శిక్షణలోను పార్టీపటిమలోను బలము తగ్గెను. అందులోని దుర్బలురు సమయానుకూల స్వాపాపములు చిక్కులను కల్పింప నారంభించిరి.

"లోపలనుండి ప్రతిఘటించెదము" అను నాశయముతో స్వరాజ్య వాదులు శాసనసభపై దాడివెడలిరి. కాని యీ క్రీడ కిద్దరుండవలెను. ప్రభుత్వము స్వరాజ్యవాదులలోనే చీలికలను, వ్యతిరేకభావములను కల్పించి తా నింపులో పాల్గొన నిశ్చయించెను. గొప్పయుద్యోగము లను, అనేక మోహములను ప్రభుత్వమెప్పులను, దుర్బలసోదరుల ముందర పడవేసిరి. వారు వాటి నెత్తుకొనుటయే చేయవలసినపని. వారి శక్తిసామర్థ్యములు, వారి రాజకార్యదురంధరత్వము పొగడ బడుచుండెడివి.

కనుక స్వరాజ్యవాదుల సామాన్యనీతి తగ్గెను. అచ్చటచ్చట వ్యక్తులు వ్యతిరేక పక్షముకు జార నారంభించిరి. మాతంగ్రడి 'దుష్టాం గమును ఖండించెదను' అని యుఱుముచు, గర్జించుచుండెడివాడు. కాని దీనివలన లాభములేకపోయెను. కొంతమంది స్వరాజ్యవాదులు మంత్రులైరి. కొంతమంది రాష్ట్రములలో యెగ్జిక్యూటివు కౌన్సిల ర్లయిరి. కొంతమంది 'రెస్పాన్సివిష్టులు' లేక 'రెస్పాన్సివు కో ఆప రేటర్లు' అను ప్రత్యేక బృందముగ నేర్పడిరి. మొట్టమొదట లోక మాన్యతిలక్ యీపదమును, మరియొక ప్రత్యేక పరిస్థితులలో నుప యోగించెను. ఇప్పుడు దీనిభావము 'ఒడుపు దొరికెనా నీవొక పద విని స్వీకరించి హాయిగా ననుభవింపుము' అయ్యెను. ఇట్టివారున్నను స్వరాజ్యపక్షము సాగెను కాని మాతంగ్రడి దాసుగారు దీనితో విసిగిరి. దీనికితోడు త్తరహిందూదేశములో హిందూముస్లిము తగాదాలు రెచ్చి తఱచు కొట్లాటలలోనికి దిగెను.

1924 డిసెంబరులో కాంగ్రెసు బెల్గాములో జరిగెను. గాంధీజీ యధ్యక్షత వహించెను. చాలకాలమునుండి శాశ్వతముగ నధ్యక్షాతీతు డైన యతడధ్యక్షుడగుట తల్లక్రిందులు వ్యాపారముగ నుండెను. అతని యధ్యక్షోపన్యాసము నాకు రుచింపలేదు. అది యెంతమాత్రము నుత్తేజ కరముగలేదు. గాంధీజీ ప్రోత్సాహముచే నన్ను తిరిగి అ. భా. కాం. వర్కింగు కార్యదర్శిగా నెన్నుకొనిరి. నాకిష్టములేకపోయినను నేను శాశ్వత కార్యదర్శి నగుచుంటిని.

1925 వేసవిలో మా తండ్రి యుబ్బసముతో బాధపడెను. అతడు హిమాలయములలోని డాల్హౌసీకి కుటుంబముతో వెళ్ళెను. నే నచ్చట కొంతకాల ముంటిని. మేము డాల్హౌసీనుండి హిమాలయములలోనున్న చాంబాకు వెళ్ళితిమి. అక్కడనుండగా నొకనాడు చిత్తరంజనదాసు చనిపోయినట్లు తంతివార్త వచ్చెను. ఆ వార్త వినుటతోటనే దుఃఖాక్రాంతుడై మా తండ్రి చాలసేపు నోటమాట రాక కూర్చునియుండెను. అది యతనికొక పెద్ద గొడ్డలిపెట్టు. అతని నట్టిస్థితిలో నే నెన్నడు చూడలేదు. అతని కత్యంతమిత్రుడు సహచరుడు నైనవాడు భారమునంతను నతనిపై విడిచి వెళ్ళిపోయెను. ఆ భార మంతకంతకు పెరుగుచుండుటయేగాక వారిరువురకు విసుగుదల కలిగించెను. దాసుగారి ఫరిద్పూరు కాంగ్రెసు ఉపన్యాసము విసుగుదల కలిగినవాని యుపన్యాసమును బోలియుండెను. మరునాడే మేము చాంబాదాటి తిరిగి డాల్హౌసీకి, యచ్చటనుండి అలహాబాదు కలకత్తాలకు ప్రయాణమైతిమి.

19

## కులతత్త్వ ప్రాబల్యము

నాభా జయిలునుంచి వచ్చినతరువాత నేను మంచముపట్టితిని. నా కది యొక క్రొత్తయనుభవము. దుర్బలత్వముచే జ్వరముచే నే నెన్నడు మంచము పట్టియుండ లేదు. నే నారోగ్యవంతుడనని నాకు కొద్ది గర్వము కూడ కలదు. హిందూ దేశములో సాధారణముగా నభినయింపబడు రోగిష్టితనము, రోగిష్టి పద్ధతి యనిన నాకు మంట. నా యౌవనము, శరీరపాటవము నా కనుభవయోగ్యమయ్యెను. కాని యీ వ్యాధి తగ్గినతరువాత నేను కొంతకాలము మంచముమీదనే యుండవలసివచ్చెను. ఈ కాలములో నేను నా పరిసరములకు నా నిత్యకార్యములకు నుదాసీనుడనై యుంటిని. నేను చెట్లను వేరుచేసి కట్టును మాత్రమే చూడగలిగినట్లు భావించెడివాడను. నా మనస్సు వెనుకటికంటె నిర్మలముగ, ప్రశాంతముగ నున్నట్లు కాన్పించెను. గొప్పవ్యాధిచే బాధపడినవారందరికి నిది సామాన్యమేయని నా యుద్దేశ్యము. కాని నా కిది యొక యాధ్యాత్మికానుభవమువలెనుండి యెంతయో మంచిచేసెను. నే నుద్రేకపూరిత రాజకీయములనుండి యుత్థితుడనై నన్ను కార్యాచరణకు పురిగొల్పిన లక్ష్యమును, ఆశయములను మరింత స్పష్టముగా చూడగలిగితిని. కాని యిట్లు స్పష్టమయినకొలది మరికొన్ని ప్రశ్నలుదయించుచు నేను వాటికి సరియగు సమాధానముల నీయజాలకపోవుచుంటిని. అప్పటి నా యను భవమును గురించి నే నంతగా వ్రాయజాలను. ఆ భావమును నేను చులకనగా వ్యక్తముచేయజాలను.

హిందూ ముస్లిము తగాదాలు ముఖ్యముగా నుత్తరహిందూ దేశమున నధికమగుచుండెను. పెద్ద పట్టణములలో చాలచోట్ల నిర్దా క్షిణ్యమగు కొట్లాటలు జరిగెను. క్రోధము అవిశ్వాసము ప్రబలిన కొలది పోట్లాటలకు మనము మున్నెన్నడు కని విని యెరుగని నూతన కారణములు బయలుదేరుచుండెను. పూర్వము గోవధ తగాదాలకు

కారణమగుచుండెను. మొహరము రామలీలలవంటి పండుగ లొకే సారి వచ్చిపడినపు డట్టితగాదాలు వచ్చుచుండెడివి.

మసీదులవద్ద సంగీతము, వాయిద్యములు యిప్పుడు క్రొత్త తగాదాకు కారణమయ్యెను. తమ ప్రార్థనల కివి యడ్డంకులని ముస్లిములు వీటి కభ్యంతరపెట్టిరి. ప్రతి పట్టణములోను చాల మసీదు లున్నవి వారు రోజుకయిదుసార్లు ప్రార్థింతురు. కనుక నుత్సవములకు (శ్రాద్ధ, వివాహాదిక) ధ్వనులకు లోటులేకుండుటను పోట్లాటల కవకాశము లెప్పుడును గలవు; ముఖ్యముగా సాయంకాల ప్రార్థన కాలమున నివి పనికిరావనిరి. ఈ కాలముననే హిందూదేవాలయములలో పూజలుచేయుచు జేగంటలు వాయించుచుందురు. దీనిని ఆర్తీ యందురు. కనుక ఆర్తీ నమాజుయుద్ధము లిప్పుడు ప్రాముఖ్యత వహించెను. పరస్పరభావములపట్ల గౌరవము కొద్దిపాటి సర్దుబాటు చేసికొనిన నమసిపోవలసిన సమస్య నిరంతర ద్వేషమునకు కొట్లాటలకు కారణమగు టాశ్చర్యకరము. కాని మతద్వేషముల కాలోచన, హేతువు, సర్దుపాటు యవసరములేదు. ఇది నొకరిపై నొకరిని పురిగొల్పు అధికారములోనున్న మూడవపక్ష మున్నపు డిది రాజుట యతి సులభము.

కాని యీ కొట్లాటల కనవసర ప్రాముఖ్యత యివ్వబడుచున్నది. చాల పట్టణములు, పల్లెలు నిట్టి కొట్లాటలు లేకుండ సుఖజీవనము చేయుచున్నవి; వార్తాపత్రికలు ప్రతి చిన్న పోట్లాటను గోరంతలు కొండంతలు చేయును. దీనిని పైనున్న కులనాయకులు పెంచుచు తమకులము కెక్కువ రాజకీయ హక్కులు కావలెనని బిగియుచుందురు.

కాంగ్రెసుకు దీనివలన కష్టము తటస్థించెను. చాలమంది కాంగ్రెసువారు జాతీయ బురఖాలోనున్న కులనాయకులు. కాని కాంగ్రెసు యీ కులనాయకుల కెంతమాత్రమూ స్థానమీయలేదు. కనుక నిరుతెగల యతివాదులు కాంగ్రెసును దూషింపనారంభించిరి. గాంధీజీ చిరకాలము క్రిందటనే కులసమస్యను పరిష్కరించుట కొ

పరిణాళిక నేర్పరచెను. అవి యధికసంఖ్యాకుల యుదారతవలనను; సోదరభావములవలనను తీరగలవని యతని యభిప్రాయము. ముస్లిములు దేని నడిగినను యిచ్చి వేయవలెననియే యతడనెను. వారితో బేరములు వలదనియు వారిని పైవిధమున పూర్తిగా జయింపవలెననియు నతడనెను. తక్కినవారు దేని నిజప్రయోజన మెంత కలదో యావంతయు నెరుగకపోయినను ప్రతిదాని కొనుగోలు ధర తెలిసినవారివలె నంతబేరమే కావలెనని పట్టుబట్టిరి. వస్తుధర వారికి తెలియును. కాని కొనబడిన వస్తు వెట్టిదో వారెరుగరైరి!

ఇతరులను చులకనగా విమర్శింపవచ్చును; నిందించవచ్చును. మన యభీష్టము లీడేరకపోవుట కేదియో కారణము దొరకవచ్చును. మనము ప్రభుత్వముమీద కులనాయకులమీద నింద వేసెదము. వారు కాంగ్రెసును నిందింతురు. బ్రిటిషుప్రభుత్వ మెప్పుడును మనలో చీలికల నేర్పరచియే పాలించెను, పాలించుచున్నది, పాలించును. సామ్రాజ్యము లెప్పుడు నట్లేచేయును. మనము దానిని నిందించిన లాభములేదు. దానిని నిర్లక్ష్యముచేసి, దానికి తగిన కట్టుదిట్టములు చేసికొనలేకపోవుట మనలోపముకాని మరియొకరిదికాదు.

మన మీలోపము నెట్లు తీర్చుకొనగలము? ఇది బేరముల చేత నెంతమాత్రము కుదురునదికాదు. మన మెంత బేరమాడినను మనకంటె నెక్కువకు బేరమాడి, బేరమాడుటయేకాక దానిని కార్యరూపమునబెట్టగల ప్రభుత్వములేదా? ఒక సామాన్య జాతీయదృష్టి సాంఘికదృష్టి లేనిచో సామాన్యశత్రువుపై సమష్టిపోరాట మెట్లుజరుగగలదు? మనము ప్రస్తుతమున్న రాజకీయ, ఆర్థిక పునాదుల నట్లేయుంచి యచ్చటచ్చట నతుకులను మెత్తులను పెట్టుట సంస్కరించుట లేక 'భారతీయ పరము చేయుట' వలన లాభమేమి? మనలక్ష్య మప్పుడు పంపకములలోనికి దిగును. అధికారములోనున్న మూడవ పక్ష మప్పుడు విధాయకముగా ప్రధానపాత్రధరించి తనదత్తపుత్రులకే వరముల నిచ్చును. ప్రస్తుతరాజకీయ, సాంఘిక పునాదులకు కేవల భిన్న

మగు నూతనపునాదులమీదనే మనము స్థిరమైన సమిష్టిపోరాటము నడుపగలము.

కాని కొంచెం మించుమించు మన నాయకులందరు ప్రస్తుత సంకుచిత రాజకీయ సాంఘిక పునాదులలోనే గుడిగుడి గుండా రాగము తీయుదురు. వారిదృష్టి యెంతసేపు సంస్కరణయుతముగాని విప్లవయుతముగాదు. కాని హిందూదేశములో రాజకీయ, సాంఘిక, ఆర్థికసమస్య లేవియైనను సంస్కరణ పద్ధతులచే తృప్తికరముగా పరిష్కరింపబడుకాలము గతించెను. అవి విప్లవముచేతనే సాధింపబడవలెను.

మన స్వాతంత్ర్య పోరాటములో స్పష్టమైన లక్ష్యములు, ఆశయములు లేకపోవుటచేతనే కులతత్వములు పెచ్చుపెరిగెను. ప్రజలకు స్వరాజ్య పోరాటముకు తమ నిత్యజీవితములోని బాధలకు స్పష్టమైన సంబంధమేమియు కానరాదు! తాత్కాలి కోత్సాహములో వారొక్కక్కప్పుడు బాగుగనే పోరాడెడివారు. కాని దానివెనుక తగినంత హేతుబలము లేకపోవుటచే యుద్యమము వెనుకకు తగ్గిన కాలములో కులనాయకులు వారిని మతము పేరిట తమ ప్రయోజనములకొరకు కుపయోగించుకొనెడివారు. హిందువులలోను మహామ్మదీయులలోను కూడ బూర్జువాతరగతులవారు ప్రజాసామాన్యమునకు చివరకు మధ్యతరగతులలోని క్రింది తరహావారికి కూడ నెంత మాత్రము సంబంధములేని కోరికలకొరకు హక్కులకొరకు పవిత్రమైన మతము పేరిట ప్రజానుభూతి బడయుట చోద్యముగ నుండును. ఏ కులముతరపున తీసికొనిరాబడు ప్రతి కులహక్కు, కోరిక మనము పరిశీలించి చూచినను చివర కది యుద్యోగవాంఛతప్ప మరియొకటి కాదు. ఈ యుద్యోగము లతిస్వల్పముగనుండి మధ్యతరగతులలోని పైతరహావారికి పోవును. శాసనసభలలో నెక్కువ స్థానములు ప్రత్యేకస్థానములు కావలెనను కోరికకూడ నిట్టిదే. ఇది పెద్ద రాజకీయాధికారము నిచ్చునది యని చెప్పబడును. ఇట్టివి జాతీయాభివృద్ధికి, జాతీయమైక్యతకు భంగకరములు. ఇవి యా యా కులములలోని యే

కొద్దిమంది పైతరగతులవారికో యుపకరించును గాని కులముకంతకు, ప్రజలకందరకు నుపకరించు ననుట వట్టికల్ల. ఈ గొడ్డుపోతు కోరికలను మతోద్రేకముతో లంకెపెట్టి యదార్థమును మరుగుపరుచుచున్నారు.

ఈవిధముగా రాజకీయాభివృద్ధిభంజకులు కులనాయకత్వము పేరిట రాజకీయరంగములో తిరిగి ప్రవేశించిరి. కులాభిమానముకంటె రాజకీయాభివృద్ధి ధ్వంసముచేయుటయే వారిసంకల్పమని వారి నడకలే విశదముచేయగలవు. ఒక్క రాజకీయముగనే వారు మనకడ్డము తగులవచ్చునని మన మనుకొనవచ్చును. కాని యీ సందర్భములో వా రెంతదూరమైనను పోవుచుండుట కడు విచారకరము. ముస్లిము కులనాయకులు భారతజాతీయతను, భారతస్వాతంత్ర్యమును యెంత మాత్రము లెక్కచేయనట్లే కాన్పింతురు. హిందూ కులనాయకు లెప్పుడు పైకి జాతీయతపేరిటనే మాట్లాడినను ఆచరణలో దాని వంకపోరు! వా రెట్టి ప్రయోజనకరమగు కార్యమును చేయుట కసమర్థులగుటచే ప్రభుత్వమునకు సాగిలబడి చివరకు దానినికూడ వ్యర్థముగనే చేసిరి. ఉభయులు 'సామ్యవాదమును' అట్టి 'యుపద్రవ' యుద్యమములను ఖండింతురు. పెట్టుబడిదారుల ప్రయోజనములకు సంబంధించినంతవర కుభయులు నేకగ్రీవముగనే యుందురు.

కాంగ్రెసులో చాలమంది ముస్లిములు కలరు. భారతదేశమంతట పేరెన్నిక పొందినవారు, సమర్థులు చాలమంది కాంగ్రెసు ముస్లిములు కలసి 'జాతీయ ముస్లిముపక్షము' స్థాపించి ముస్లిముకుల నాయకుల నెదిర్చిరి. మొదట వారికి కొంతజయము చేకూరి చదువుకొనిన ముస్లిములలో చాలమంది వారితరపునయున్నట్లే కాన్పించిరి. కాని వారందరు మధ్యతరగతులలో పైతరహాకు చెందినవారగుటచే వారి వారి యుద్యోగములను వ్యాపారములను చూచుకొని ప్రజాసామాన్యముతో సంబంధము పోగొట్టుకొనిరి. నిజముగా వారు తమ ప్రజలవద్దకు పోనేలేదు. వా రేసభలోనో కూర్చుని వారిలో వారు కొన్ని యేర్పాటులను రాజీలను కుదుర్చుకొను చుండెడివారు.

ఈ యాటలో వారికంటె కులనాయకు లెక్కువ దిట్టలగుటచే వారి నొకచోటునుండి మరియొకచోటుకు తరుముచు చివరకు వా రెట్టి సూత్రములతో బయలుదేరిరో యట్టిసూత్రములనే విడచిపెట్టులాగున చేసిరి. చివరకు వా రొక్క సమిష్టి ఎన్నికలను సూత్రముకు దిగివచ్చి దానినైనను కాపాడుకొనజాలకపోయిరి.

ముస్లిము జాతీయవాదుల పతనము విచారకర కథనము. దానికి చాల వత్సరములుపట్టెను. ఈ వత్సరము (1934) తో దాని చివరయధ్యాయము ముగిసెను. 1923 వత్సరములోను, తరువాతను వారు చాల బలముగనుండి నాయకులను తీవ్రముగ నెదిర్చిరి. చాల సారులు గాంధీజీ ముస్లిముకులనాయకుల కోరికల నంగీకరించుటకు తయారయ్యెను. కాని ముస్లిము జాతీయవాదులే దీనిని వల్లకాదనిరి.

కులసమస్యలను పరస్పరసంభాషణలవలనను, చర్చలవలనను కుదుర్చుకొనుట కనేక ప్రయత్నములు జరుపబడెను. ఈ 'ఐకమత్య సభ'లో ముఖ్యమైనదానిని మహమ్మదాలీ 1924 లో ఢిల్లీలో గాంధీజీ 21 దినము లుపవాసమున్న కాలములో జరిపెను. ఈ సభలకు చాలమంది సదభిప్రాయములతోను, శ్రద్ధాభక్తులతోను వచ్చి సమన్వయముకొరకు చాల పాటుపడిరి. కొన్ని పవిత్ర తీర్మానములు గావింపబడెను. కాని ముఖ్యసమస్య పరిష్కరింపబడలేదు. గొప్ప సమస్యల నధికసంఖ్యాకుల వోటులతో గాక పవిత్రమైన యైక్యబుద్ధితోనే సమన్వయపరచవలెను. కాని యన్నిసంఘములలోను అతివాదులు కలరు. వారిప్రకారము పరిష్కారమనగా నందరు తమ యభిప్రాయములకు లొంగిపోవుటయే. నిజముగా కొంతమంది ముఖ్యకులనాయకుల కెట్టిపరిష్కారము నవసరములేనట్లే తోచును. వారిలో చాలమంది రాజకీయాభివృద్ధికి విముఖులు. కనుక రాజకీయ పరివర్తనము కోరువారికి సమన్వయ మెట్లు సంభవించును?

సిక్కులు తమ హక్కులను కోరుచుండిరి. పంజాబులో నీవిధముగా త్రివిధ సంగ్రామ మేర్పడెను. ఒక సంఘము మరియొక సంఘమును చూచి భయపడుచుండుటచే ద్వేషములు పెరుగుచుండెను.

కొన్ని రాష్ట్రములలో వ్యావసాయిక తగాదాలు – వంగదేశములో హిందూ జమీందారులు ముస్లిము రయితాంగం – కులసంబంధమైన బురఖాలో కాన్పించెను. పంజాబు సింధులలో ధనవంతులు వడ్డీ వ్యాపారస్థులు సాధారణముగ హిందువులు. ముస్లిము వ్యవసాయ దారులు ఋణగ్రస్తులు. దారిద్ర్యముచే పీడింపబడు ఈ ఋణగ్రస్తులకు రక్తమును పీల్చెడి ఋణదాతలమీదగల ద్వేషమంతయు కులద్వేష ముకు దోహదము నిచ్చుచుండెను. సాధారణముగా ముస్లిములు బీద వారగుటచే కులనాయకులు వారి బీదతనముచే ధనవంతుల్పై కలిగిన ద్వేషమును కులప్రయోజనములకు వినియోగించుకొనెడివారు. దీని చేతనే ముస్లిము కులనాయకులు కొంత ప్రజాప్రాతినిధ్యము కలవారై కొంత బలము సంపాదింపగలిగిరి. హిందూకులనాయకులు ధనవంతు లైన వడ్డీవ్యాపారస్థులకును, ఉద్యోగస్థులకును ప్రతినిధులైరి. వీరివెనుక హిందూప్రజల బలమంతగాలేదు. కనుక నీ సమస్య యార్థికసమస్యతో మిళితమగుచుండెను. ఇది రానురాను కలవారికి, లేనివారికి పోరాట ముగా మారవచ్చును. కాని యంతవరకు అన్నికులములకు చెందిన ప్రస్తుత కులనాయకులందరు నేకమయి తమ భేదభావములను సమన్వయ పరచికొని లేనివారిపై కొక్కుమ్మడిగా నురుకుదురు. ప్రస్తుత పరిస్థితు లలోకూడ మూడవపక్షము లేకపోయినచో రాజకీయ పరిష్కారము కుదురు టంత ఘనకార్యముకాదు.

1924 లో ఢిల్లీ యైకమత్యసభ యైనదో లేదో యప్పుడే అలహాబాదులో హిందూముస్లిము పోరాటములు చెలరేగెను. మేము వెంటనే అలహాబాదు వెళ్ళితిమి. అది యంతతీవ్రముగా పరిణమింపక పోయినను దానితరువాత కలిగిన ద్వేషములు, కోర్టువ్యాపారములు చాలకాల ముండెను. ఆ వత్సరమే రామలీల యుత్సవసందర్భములో నచ్చట మరియొక సంఘర్షణ జరిగెను. మసీదులవద్ద వాయిద్యాదు లను నిషేధించుటచే నిప్పటి కెనిమిది వత్సరములనుండి అలహా బాదులో రామలీలోత్సవములను జరుపుటయే మానివేసిరి. నా చిన్న తనములో నేను వాటినెంతయో యానందముతో ననుభవించెడి

వాడను ! అది హిందూ యుత్సవమైనను బహిరంగమున జరుగుటచే ననేకమంది ముస్లిములుకూడ నందులో పాల్గొనుచుండిరి. ప్రతిచోట సంతోషముతో నిర్విచారము తాండవమాడు చుండెడిది. వర్తకము విజృంభించెడిది. నేను పెద్దవాడనైన తరువాత దీనిని చూచితిని. అప్పటికి నా యభిరుచులన్నియు మారుటచే నా కంత యుత్సాహము లేకపోయెను. కాని ప్రజ లీ యుత్సవములను, తమాషాలను చూచి తమ దుఃఖములను, కష్టములను, శ్రమలను మరచిపోయెడివారు. ఇప్పటి కేబది సంవత్సరములనుండి అలహాబాదులోని బాలబాలిక లీ సంతోషమునకు, నీమాత్రపు దైనందిన శ్రమజనిత దుఃఖోపశమన మునకు నోచికొనరైరి. ఇదంతయు స్వల్ప పేచీలకొఱకు ! మతము మతతత్త్వము దీని కుత్తరవాది యగుచున్నది. ఆహా ! వా రెంత సంతోషశూన్యులు ! ఎంతటి సంతోషసంహారకులు !

# 20

## మున్సిపలు కార్యనిర్వహణము

నేను అలహాబాదు మున్సిపలు పని రెండేండ్లు సాగించితిని. నా చైరుమను పదవికి పరిమితి మూడేండ్లు. రెండవయేడు ప్రారంభ మగుటతోడనే నా బాధ్యత తొలగించుకొన జూచుచుంటిని. నా కా పనియందు శ్రద్ధకలిగి నా కాలమును, బుద్ధిని దానికి వినియోగించితిని. నేను దానిని జయప్రదముగ నెరవేర్చి నా సహచరులందరి యామోదము బడసితిని. రాష్ట్రప్రభుత్వముగూడ నాపైనున్న రాజకీయ ద్వేషమును తగ్గించుకొని, నా మున్సిపలు కార్యములను కొన్నింటిని మెచ్చుకొనిరి. అయినను యదార్థప్రయోజనముల నిచ్చెడివాటిని వేటిని చేయకుండ నా చేతులు బంధింపబడెను ; అభ్యంతరములు, నడ్డంకులు కల్పింపబడెను.

అది యొకరు బుద్ధిపూర్వకముగ కల్పించు యభ్యంతరము కాదు. అందరు నాకు మనఃపూర్వకముగ సహకారముచేసిరి. కాని యొకప్రక్క ప్రభుత్వయంత్రము, మరియొకవంక ప్రజలయొక్కయు, మున్సిపలు సభ్యులయొక్కయు నుదాసీనత కలవు. ప్రభుత్వముచే తయారుచేయబడిన మున్సిపలు పరిపాలన యను యుక్కుచట్టము గొప్ప యభివృద్ధిని నూతన మార్పులను చేయనీయదు. మున్సిపాలిటీ యెప్పుడు ప్రభుత్వముమీద నాధారపడునట్టి యార్థిక నీతియే దానికి ప్రసాదింపబడెను. మున్సిపలు చట్టముల ప్రకారము నూతన పన్ను విధానములు సాంఘికాభివృద్ధి పనికిరావు. చట్టము ప్రకారము చేయదగినవాటికి గూడ ప్రభుత్వామోద ముండవలెను. మార్కండే యాయుర్దాయ ముండి, యెడతెగని యోర్పుగలవా డున్నచో నీ యామోదముకొర కెదురు చూచుచుండవచ్చును. జాతీయ సాంఘిక నిర్మాణములకు సంబంధించిన వ్యవహారము వచ్చినపుడు ప్రభుత్వయంత్ర మెంత నెమ్మదిగ, నెంతకష్టముగ, నెంత యసమర్థముగ నడిచెడిదో చూచిన నా కాశ్చర్యము వేసె

డిది. కాని రాజకీయ శత్రువు నణచవలసివచ్చినపుడు మాత్రము వారిలో నా మందగమనము, అసమర్థత మాయమగును.

రాష్ట్రప్రభుత్వములోని స్థానిక స్వపరిపాలనశాఖ కొకమంత్రి యధిష్ఠానదేవతగానుండును. కాని సాధారణముగా నీ మంత్రిశేఖరునకు మున్సిపలు వ్యవహారములు మరేయితర ప్రజావ్యవహారములు తెలియవు. నిజమున కతనిలెక్కయే లేదు. శాశ్వతమైన ఐ. సి. యస్. యుద్యోగులచే నడుపబడు యతనిశాఖయే యతనిని నిర్లక్ష్యము చేయును. ప్రభుత్వమనగా ముఖ్యముగా పోలీసు ధర్మము, శిక్షించుట యను గొప్ప భారతోద్యోగుల భావములే వీరికిని పట్టుబడును. అధికార గర్వము, అధికారపెత్తనము వెలిగింపవలెనను భావమే వీరికి కాన్పించును. కాని ప్రజాబాహుళ్యముకు చెందు సాంఘికసేవ చేయవలెననెడి యవసర మెంతమాత్రము వీరికి కాన్పించదు. ప్రభుత్వ మెప్పుడు మున్సిపాలిటీలకు ఋణదాతలు. కనుక పోలీసు ధర్మమైన తరువాత వారికి ఋణదాత ధర్మమే ముఖ్యము. ఋణ వాయిదాలు సరిగా చెల్లింపబడుచున్నవా? మున్సిపాలిటీలో తగినంత ధనమున్నదా లేదా? అది దివాలాతీయదు కదా! ఈ ప్రశ్న లవసరమైనవే యైనను మున్సిపాలిటీలు విద్య, పారిశుధ్యము నను ప్రయోజనకరములగు ధర్మములను కొన్నింటిని నెరవేర్చవలసి యున్నదనుసంగతి సామాన్యముగా మరచిపోబడుచున్నది. అది రొక్కము తీసికొని తిరిగి వాయిదాలప్రకార మిచ్చివేయుట కేర్పడిన సంస్థకాదు. భారతమున్సిపాలిటీలో సాంఘికసేవావకాశములే చాలతక్కువ; డబ్బునిక్కచ్చి యున్నచోట దీనికిని నాస్తిచెప్పుదురు. అందులో మొదట సాధారణముగా విద్యకే యెక్కువ దెబ్బతగులును. పాలకజాతివారికి మున్సిపలు పాఠశాలలతో సంబంధములేదు. వారిబాలురు మంచిస్థితిలో నుండు ప్రయివేటుబడులకు పోదురు.

భారతదేశ పట్టణములను మనము రెండుభాగములుగా విభజింపవచ్చును. సందులతోను గొందులతోనుకూడి క్రిక్కిరిసియుండు ప్రధాన నగరము. రెండవది విశాలమైన భవనములు, సుందర కుట్టీ

రములు, తోటలు ప్రాకారములుగల యుద్యోగస్థుల శ్రేణులు. ఈ యుద్యోగ శ్రేణులతోనే ఇంగ్లీషు వ్యాపారస్థులు ఇంగ్లీషు యుద్యోగులు, మధ్యతరగతులలోని పైతరహాకు చెందిన భారతీయులు, యితర వృత్తులవారు భారతోద్యోగస్థులు మొదలగువా రుందురు. మున్సిపాలిటీకి వచ్చు రాబడిలో హెచ్చు మొత్త ముద్యోగస్థుల శ్రేణులనుండిగాక ప్రధాన నగరమునుండియే వచ్చును. కాని ప్రధాన నగరముకంటె నీ శ్రేణులకే యెక్కువ మొత్తము వెచ్చింపబడును. విశాలమైన యీ శ్రేణుల కెక్కువ రోడ్లు కావలెను. దానితో నెక్కువ మరమ్మతులు, తుడుచుట, నీళ్ళు చల్లుట, దీపములు వెలిగించుట, మురుగుకాలవలు, నీటిసప్లయి, పారిశుద్ధ్యము ఇట్టివనేకములు కావలెను. నగరభాగ మెప్పుడు నిర్లక్ష్యము చేయబడును; ఇక పట్టణము లోని బీదప్రాంతములసంగతి చెప్పనక్కరలేదు. వాటికి మంచిరోడ్లు లుండవు. ఇరుకుసందులలోను గొందులలోను దీపములుండవు. సరియైన మురుగుకాలువలు పారిశుధ్యముగా వుండవు. వారీబాధల నన్నింటిని యనుభవింతురు. వారికష్టములను చెప్పుకొననైన చెప్పుకొనరు. చెప్పుకొనిరో వినువా రెవరు? 'పెద్దనోరు చిన్ననోరు' గలవారందరు నుద్యోగశ్రేణులలోనే యుందురు.

ఈ భారమును కొంత సమము చేయుటకు కొన్ని యభివృద్ధులను కలిగించుటకు భూముల విలువమీద నే నొకపన్ను వేయనెంచితిని. నే నీ సూచన చేయుటతోడనే జిల్లా మేజిస్ట్రేటు యిది భూమిశిస్తుపద్ధతికి చట్టములకు వ్యతిరేకమనెను. అట్టిపన్ను శ్రేణులలోని భవనముల యజమానులపైననే యెక్కువగా పడియుండెడిది. కాని ప్రభుత్వము బీదలమీదపడు ప్రత్యక్షపన్నులను, వస్తువులపై సుంకములను జంకుగొంకులులేకుండ నామోదించును. అవి ధరలను పెంచును; వర్తకము నణచును; బీదలపై నెక్కువభారము పడును.

ఈవిధముగా మున్సిపలు చైరుమనుగా నే నొకవంక కనబడని పెత్తనము వెలిగించు ప్రభుత్వ యంత్రముతోను (ఇది యజగళము వలె కదలదు. నూతనమార్గములను త్రొక్కదు) తత్తుల్యముగనే

కదలని నా సహచర సభ్యులతోను మెలగవలసివచ్చెను. ఇందులో కొంతమంది యుత్సాహపరులున్నను మొత్తముమీద వారు మార్పుకు, మంచికి యంత సుముఖులుకారు. పాతమార్గములు మంచివేకదా, సంశయాస్పదమగు క్రొత్త యనుభవములేల ? చివరకీ యుత్సాహవంతులు నిర్వీర్యమగు దినచర్య కలవాటుపడి క్రమముగా నల్లమందుభాయిలై పోయిరి.

ప్రతివత్సరము వార్తాపత్రికలు ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వ తీర్మానములు మున్సిపాలిటీలను స్థానికసంస్థలను విమర్శించుచు వాటి లోటుపాటుల నెత్తిపోడుచును. దీనినుండి భారతదేశముకు ప్రజా స్వామికసంస్థలు పనికిరావను. సారాంశము తీయబడుచున్నది. వారి లోపములు స్పష్టములేయైనను వారెట్టి సంకుచిత యుక్కచట్టములో పనిచేయవలసి యున్నారో గమనించువారెవరును లేరు. ఇది నిరం కుశత్వముకాదు. ప్రజాస్వామికముకాదు. ఇది యారెంటియొక్కయు సంకరము. దీని కారెంటి లోపములు కలవు. కేంద్రప్రభుత్వముకు కొంత యధికారము పెత్తనము నుండవచ్చును. కాని యా కేంద్ర ప్రభుత్వము ప్రజాస్వామికము, ప్రజా యవసరములను గుర్తెరుంగు నది యైనపుడు స్థానిక ప్రజాసంస్థకు సరికాదు. ఇట్లు కానినాడు రెంటికి సంఘర్షణ తప్పదు. లేదా కేంద్రప్రభుత్వముకు లొంగక తప్పదు. ఈ విధముగా కేంద్రాధికారము బాధ్యతాయుత అధికారమును చలాయించును. ఇది చాల యసంతృప్తికరమైనవిషయము. దీనివలన నిజమైన ప్రజాధికారము నశించును. మున్సిపలుబోర్డు సభ్యులుకూడ తమరి నెన్నుకొను ప్రజలవైపుగాక నెక్కువగా కేంద్రప్రభుత్వ ప్రసాదముకొరకే చూచుచుందురు; ప్రజలుకూడ బోర్డును మరచిపోవు దురు. నిజమైన సాంఘికసమస్య లెన్నడు బోర్డుకు రాజాలవు. అవి దానిధర్మముక్రిందకు రాకుండుటయే దీనికి కారణము. పన్ను వసూలు చేయుటయే దాని ప్రధాన ధర్మము.

స్థానిక సంస్థల వోటింగు అర్హతకూడ చాల సంకుచితముగనే యున్నది; దానిని చాలవరకు పెంచి యెక్కువమందికి వోటింగుహక్కు

కలుగచేయవలెను. బొంబాయి కార్పొరేషనువంటి గొప్ప కార్పొరేషనుకూడ చాల సంకుచితమైన వోటింగు పద్ధతిచేతనే యెన్నుకొనబడినదని నేను భావించెదను. కొంతకాలముక్రిందట వోటింగు అర్హత నెక్కువమందికి కలుగచేయవలెనను తీర్మానము కార్పొరేషనులోనే యోడింపబడెను. చాలమంది సభ్యులు తమస్థితితో తృప్తిపడి దానిని మార్చుటకు పోగొట్టుకొనుటకు నిష్టపడరైరి.

కారణము లేవియైనను మన స్థానికసంస్థలంత జయప్రదమైనవి సమర్థమైనవికావు. అట్లున్నను వాటిని ప్రజాస్వామిక పరిపాలన యభివృద్ధిలోనున్న దేశములలోని కొన్ని మున్సిపాలిటీలతో పోల్చవచ్చును. సాధారణముగా నవి నీతిబాహ్యములుకావు; అసమర్థతయే వాటికున్నలోపము; బంధువుల కుద్యోగము నిచ్చుటయే వాటికున్న దుర్బలత్వము. వాటిలక్ష్యము లన్నియు సరియైనవికావు. ఇవి యన్నియు సహజములు. ఏలనన ప్రజాస్వామికము జయప్రదము కావలెనన్న దానివెనుక వివేకముగల ప్రజాభిప్రాయము బాధ్యత యుండవలెను. దానిబదులు మన కెక్కడ చూచిన నధికార ప్రాబల్యము, ప్రజాస్వామికముకు కావలసిన సమర్థత లేకపోవుటయు కాననగును. ప్రజాసామాన్యముకు విద్యనిచ్చు పద్ధతి లేదు. వివేకవంతమగు ప్రజాభిప్రాయమును నిర్మించు యత్నములు లేవు. కనుక విధాయకముగా ప్రజాదృష్టి వ్యక్తులమీద కులతత్త్వముల మీద తదితర స్వల్పసమస్యలమీద పడును.

మున్సిపలు పరిపాలనలో 'రాజకీయములు' లేకుండ చేయుటకే ప్రభుత్వ మందులో ముఖ్యముగా శ్రద్ధతీసికొనును. జాతీయోద్యమముతో సానుభూతిచూపు తీర్మానము చేసినచో ప్రభుత్వము గుడ్లెఱ్ఱచేయును. జాతీయ వాసనగల పాఠ్యపుస్తకములను మున్సిపలు పాఠశాలలలో పెట్టనీయరు. జాతీయనాయకుల పటములనుకూడ నచ్చట పెట్టనీయరు. జాతీయపతాకము నచ్చటనుండి పీకివేతురు. లేదా మున్సిపాలిటీని రద్దుచేసెదరు. చాల రాష్ట్రప్రభుత్వములు మున్సిపలు సంస్థలనుండియు స్థానికసంస్థలనుండియు కాంగ్రెసువారిని తరిమివేయు

యితర సమస్యలమీదకు మఱలింపవచ్చుననుకొంటిని. కనుక నేను కమిటీయొక్కపని కభ్యంతరముకల్గింపక చేయగలిగినసహాయముచేసితిని.

జయము కరతలామలకమైనట్లే కాన్పించెను. ఒకటి రెండు విషయములుమాత్రమే మిగిలెను. ఇందులో నిజముగా ముఖ్యమైనది పంజాబు. ఇచ్చట హిందూ, ముస్లిము, సిక్కు సమస్యకలదు. కమిటీ వారు పంజాబుసమస్యను తమనివేదికలో నొకనూతనదృక్పథమునుండి వీక్షించి తమ సూచనలను కులములకు సంబంధించిన లెక్కలద్వారా సమర్థించిరి. కాని యిది యంతయు వృధయయ్యెను. భయము, అవిశ్వాసము యుభయపక్షములవారిని యావరించెను. ఆ స్వల్పదూర మును తరించుటకు కావలసిన యా చిన్ని యడుగే పడదయ్యెను.

అఖిలపక్ష సభ తమకమిటీయొక్క నివేదికను చర్చించుటకు లక్నోలో సమావేశమయెను. తిరిగి మాలో కొంతమందికి సందిగ్ధా వస్థవచ్చెను. కులపరిష్కారమునకు మే మడ్డము తగులువారము కాము. కాని స్వాతంత్ర్య సమస్యమీద మే మెంతమాత్రము లొంగ దలచుకొనలేదు. ఈ సమస్య విడిచివేయవలసినదని మేము కోరితిమి. దీనివలన కాంగ్రెసు తన స్వాతంత్ర్య తీర్మానమును విడనాడనక్కర లేదు. మితవాదులు తమ డొమినియను పరిపాలననే ప్రేమించుకొన వచ్చును. కాని మా తండ్రి నివేదికను పూర్తిచేయవలెనని కూర్చొ నెను. అతడు లొంగలేదు. బహుశః ఆ పరిస్థితులలో నత డింకొక లాగున చేయజాలడు. అప్పుడు కాన్ఫరెన్సులోని స్వాతంత్ర్యపక్షము వారు దానితరపున నన్ను స్వాతంత్ర్యలక్ష్యము తగ్గించు దేనితో నైనను మా కెట్టి సంబంధము లేదను స్టేటుమెంటు నీయమనిరి. కాని మేము వారి కాటంకమువచ్చువారముకామని స్పష్టపరచితిమి. మేము కులతత్త్వములకు సంబంధించిన స్టేటుమెంటు కడ్డము పోదలచు కొనలేదు. అంత పెద్దసమస్య సందర్భముల మే మవలంబించిన మార్గ మంత పటుత్వమైనదికాదు. అది వ్యతిరేక భావసూచకము. ఆ రోజుననే మేము భారతస్వాతంత్ర్యమును స్థాపించే మాదృక్పథము కొక కార్యరూపము నిచ్చితిమి.

అఖిలపక్ష సమావేశము నాకు మరియొక యాశ్చర్యము కలిగించెను. అది, అయోధ్య తాలూకుదార్ల ప్రోత్సాహమువలన, నూతన చట్టములోని ప్రధాన హక్కులకు మరియొకపరతు జేర్చెను. దాని ప్రకారము తాలూకుదారుల తాలూకాలలో వారికన్న సంపూర్ణాధికారములకు పూచీ యివ్వబడెను. ఆ చట్టమంతయు స్వంత ఆస్తుల పునాదులమీదనే నిలుపబడెననుమాట వాస్తవమే! కాని పెద్దపెద్ద సంస్థానములకు సంబంధించిన యాస్తిహక్కులలో చట్టములోనుండి యెన్నటికి తీసివేయకూడదని రాజ్యాంగ చట్ట పునాదులు వేయుట నాకు దౌర్జన్యముగా కాన్పించెను. కాంగ్రెసు నాయకులు సంతకంటె నెక్కువగా కాంగ్రెసువారు కానివారు తమ స్వజనములోని వారైన సామ్యవాదులనుగాక, జమీందారుల 'కంపెనీ'నే ప్రోత్సహించుచున్నట్లిది విదితము చేయుచున్నది. చాలమంది నాయకులకు మాకు మధ్య చాలదూరమున్నట్లు స్పష్టమయ్యెను. ఇట్టి పరిస్థితులలో నేను కాంగ్రెసు కార్యదర్శిగానుండుట చాల వికృతముగానుండెను. భారతస్వాతంత్ర్య సంఘమును స్థాపించినవారిలో నొకడనను మిషతో నేను రాజీనామా యిచ్చితిని. వర్కింగు కమిటీ దీనికొప్పుకొనక కాంగ్రెసు నీతితో నెట్టి సంఘర్షణములేకుండ మా సంఘము కార్యములను నెరవేర్చుకొనవచ్చునని నాకును సుభాష్ చంద్రబోసుకును (అతడు కూడ రాజీనామా దాఖలు చేసెను) చెప్పిరి. కాంగ్రెసు యిదివరకే స్వాతంత్ర్యముకొరకు ప్రకటించెననుట వాస్తవము. తిరిగి నేను దీని కంగీకరించితిని. నా రాజీనామా నుపసంహరించుకొనుటకు నన్ను బుట్టలోవేయు టెంత సులభమో! యాశ్చర్యమగును! ఇది చాల సార్లు జరిగెను. ఉభయులలో నెవరును త్రెంచివేసికొనుటకు నిజముగా నిష్టపడక పోవుటచే, నట్లుజరుగకుండ ప్రతి సాకును మే మాశ్లేషించుచుంటిమి.

గాంధీజీ యీ అఖిలపక్ష సభలోగాని, కమిటీ మీటింగులలోగాని పాల్గొనలేదు. అతడు లక్నో కాన్ఫరెన్సుకు రానైన రాలేదు. ఈలోపల "తిరిగి పొండు" అను కేకలతో గూడిన గుంపులు నల్ల

జెండాలు వెంట తీసుకుచుండ సైమను కమీషను సంచారము సాగించు చుండెను. అచ్చటచ్చట పోలీసులకు గుంపులకు చిన్న చిన్న కలహములు కలుగుచుండెను. లాహోరులో పరిస్థితులు విషమించెను. అకస్మాత్తుగా దేశమంతటను క్రోధానల మలముకొనెను. లాలాలజపతిరాయి సైమను కమీషను ప్రతికూల ప్రదర్శనములో నాయకత్వము వహించెను. వేలకొలది ప్రజలముందర నతడు రోడ్డు ప్రక్క నిలిచియుండగా నొక యాంగ్ల యువకపోలీసుయుద్యోగి వానిపై బడి, వాని వక్షస్థలము మీద కమిచీతో మోదెను. ప్రజలుకాని, లాలాజీకాని దౌర్జన్యపద్ధతుల నవలంబించుట కెట్టిప్రయత్నము చేయలేదు. అట్లు ప్రశాంతముగ నతడచ్చట నిలిచియుండగా నతనిని, యతని సహచరులు ననేకమందిని పోలీసు వారు చావబాదిరి. ఈ వీధులలోని ప్రదర్శనములలో పాల్గొను వారెవ రైనను పోలీసులతో సంఘర్షణ వచ్చునను సంగతి గుర్తెరుగవలెను. మన ప్రదర్శనము లెప్పుడును ప్రశాంతములైనవే యైనను లాలాజీ సంగతి తెలిసి యతడు మనఃపూర్వకముగనే దీని ననుభవించెను. అయినను, ఆ నిర్హేతుకమైనదాడియు, నందులో చూపబడిన యనవసర పశుత్వము భారతప్రజల కొక యశనిపాతమువలె నుండెను. అవి మేము పోలీసు లాఠీప్రయోగముల కలవడని రోజులు. అనవసర పశుత్వమువలన మా యభిమానము మొద్దుబారిపోయి యుండలేదు. మా నాయకరత్నము, పంజాబు కేసరి యట్లుచూడబడుట ఘోరముగా కాన్పించెను. దేశమంతట ముఖ్యముగా నుత్తర హిందూ దేశములో నిర్వీర్యమగు క్రోధము ప్రబలెను. ఆహా! మే మెంత యసహాయులము! మా నాయక శిఖామణుల యభిమానధనమును రక్షింపనైన రక్షింప జాలని మే మెట్టి నీచులము!

వక్షస్థలముమీద తగులుటచే లాలాజీకి తగిలిన శరీర గాయములు తీవ్రముగనే యుండెను. అతడు చాల కాలమునుండి హృద్రోగముచే బాధపడుచుండెను. బహుశః మంచి యారోగ్యముగల యువకున కవి యంతప్రమాదము కాకపోవచ్చును. లాలాజీ యువకుడుకాడు. ఆరోగ్యవంతుడు కాడు. కొద్ది వారములకే సంభవించిన యతని

మృత్యువుకు నీ శరీర గాయముల కెట్టిసంబంధము కలదో నిశ్చితముగా
చెప్పుట కష్టమే. అతని డాక్టర్లు మృత్యువు నీ గాయములు త్వరితము
చేసెనను నభిప్రాయ మిచ్చిరి. కాని యీ శరీర గాయముల వెనుక
నున్న మానసికాందోళనమే లాలాజీ నెక్కువగా బాధించెననుటలో
నా కెట్టి సందేహము కాన్పించదు. అతడు తనకు కలిగిన పరాభవము
కుగాక తనను కొట్టుటలో భారతజాతికంతకు కలిగిన పరాభవాగ్నికే
కుమిలిపోయెను.

ఈ జాతీయ పరాభవాగ్నియే భారత హృదయమును
దహించుచుండెను. లాలాజీయొక్క మృత్యువు వెంటనే సంభవించు
టచే దానికి విధాయికముగా పోలీసు దౌర్జన్యమే కారణమనిరి. విచా
రము కోపమునకును, క్రోధమునకును తావిచ్చెను. ఈ విషయమును
మనము బాగుగా గుర్తించవలెను. తరువాత జరిగిన సంభవములను
కొంతవరకైన మన మప్పుడే యర్థముచేసికొనగలము. భగత్సింగు
కథయు నుత్తర హిందూదేశములో నతని కకస్మాత్తుగా వచ్చిన
యద్భుత పేరుప్రఖ్యాతులును మనకు దీనివలననే యర్థముకాగలవు.
వ్యక్తులను, కార్యములను; కార్యముల నుద్భవింపజేసిన మూలము
లను వాని వెనుకనున్న కారణములను నర్థముచేసికొనకుండ గర్హిం
చుట సులభము, మౌర్ఖ్యము. ఇంతకుపూర్వము భగత్సింగు పేరు
ప్రఖ్యాతులుకలవాడు కాడు. దౌర్జన్యము చేసినందువలనగాని; భయ
పెట్టుటవలనగాని యతని కాపేరుకలుగలేదు! హిందూదేశములో టెర్ర
రిస్టు లప్పుడప్పుడు గత ముప్పది సంవత్సరములనుండియు, కాన్పించు
చునేయుండిరి. వంగదేశములో నెప్పుడో, మొట్టమొదటి రోజులలో
తప్ప; వారిలో నొక్కనికిని భగత్సింగుకు కలిగిన పేరుప్రఖ్యాతులలో
నొక్క శతాంశమైనను లేదు. ఈ యదార్థము నెవరును కాదన
జాలరు. దీని నొప్పుకొని తీరవలెను. మరియొక విషయమేమన
టెర్రరిజము అప్పుడప్పు డుబుకుచుండినను భారతయువకులకు దాని
యందు యదార్థమైన ప్రేమలేదు. పదిహేను సంవత్సరముల నిరంతర
దౌర్జన్యరాహిత్య ప్రచారము భారతదేశ పునాదులను మార్చి

వేసెను. ప్రజల నది టెర్రరిజముపట్ల మరింత యుదాసీనులను, విముఖులను చేసెను. టెర్రరిష్టులు సాధారణముగా వచ్చుచుండు మధ్యతరగతులలోని క్రింది తరహావారును, విద్యాధికులును దౌర్జన్య పద్ధతులకు వ్యతిరేకమైన కాంగ్రెసు ప్రచారమువలన పూర్తిగా మారి పోయిరి. విప్లవము కావలెనని కోరువారిలోని యుత్సాహవంతులు, ఆలస్యము నొల్లనివారు విప్లవము టెర్రరిజమువలన రాదనియు, నది పాతగిలిన వ్యర్థప్రయత్నమనియు, నది యధార్థమైన విప్లవకార్యముల కడ్డుతగులుననియు గ్రహించిరి. భారతదేశములోను యితరచోట్లను టెర్రరిజము నశించుచున్నది. అది ప్రభుత్వ వత్తిడిచేతగాక (అది దానిని యణచవచ్చును, బిరడా వేయవచ్చును. కాని, నశింపు చేయజాలదు) దానిలోనున్న మూలకారణములచేతను, ప్రపంచ పరిస్థితులచేతను నశించును. టెర్రరిజము సాధారణముగా దేశము లోని విప్లవోద్యోగ శైశవ సూచకము. ఆ యంతరువు దాటును. దానితో టెర్రరిజముకూడ నొక ప్రధాన విధానముగ నంతరించును. స్థానిక కారణములచేత వ్యక్తుల నణచుటచేత నది యప్పుడప్పుడు పొడకట్టవచ్చును. నిశ్చయముగా భారతదేశ మీ యంతరువును దాటును. ఈ మధ్యేమధ్యే సంభవములు కూడ క్రమముగా నశించును. భారతదేశ ప్రజలందరు దౌర్జన్యపద్ధతులను విశ్వసించుట మానివేసిరని దీని యర్థముకాదు. వారు చాలవరకు వ్యక్తిగత దౌర్జన్యమును, టెర్రరిజమును విశ్వసించుట మానివేసిరి. ఇతరదేశము లన్నింటిలో నవసరమైనట్లె యిచ్చటను స్వాతంత్ర్య సంపాదనకొరకు సక్రమమైన దౌర్జన్యపద్ధతు లవసరమగుకాలము వచ్చునని విశ్వసించువారు చాలమంది లేకపోలేదు. అది యిప్పుడప్రస్తుత సమస్య. కాలమే దానిని పరీక్షింపగలదు. దానికి టెర్రరిష్టు పద్ధతులతో సంబంధము లేదు.

కనుక భగత్సింగుకు టెర్రరిష్టు కార్యముచే పేరు కలుగలేదు. అతడు తాత్కాలికముగ లాలాలజపతిరాయియొక్కయు, తద్వారా జాతి యొక్కయు గౌరవమును రక్షింపవచ్చినట్లుండెను. అత డొక చిహ్న

మయ్యెను; కార్యము మరువబడెను. చిహ్నముమాత్రమే మిగిలెను. కొద్ది నెలలలో పంజాబులోని ప్రతిగ్రామము తక్కువ స్థాయిలో నుత్తర హిందూస్థానమంతయు నతని నామముతో మారుమ్రోగెను. అతనిని గురించి యసంఖ్యాకమగు గీతములు బయలుదేరెను. అతడు సాధించిన పేరు ప్రఖ్యాతులు అద్భుతములు.

సైమను కమిషను ప్రహారణమయిన కొద్ది రోజులకు లజపతి రాయి ఢిల్లీలో జరిగిన అ. భా. కాం. కమిటీకి హాజరయ్యెను. అతనియొంటిమీద గాయము లింకను కాన్పించుచుండెను. అతడింకను దెబ్బల ఫలితముగా బాధపడుచుండెను. ఆ సభ లక్నో అఖిలపక్ష సభ తరువాత జరిగెను. స్వాతంత్ర్య సమస్య ఏదో యొక రూపమున చర్చకు వచ్చెను. సందర్భ మెట్టిదో నాకు జ్ఞప్తిలేదు. కాని కాంగ్రెసు రాజకీయ సాంఘిక నిర్మాణములలో తీవ్రమైన మార్పులను తెచ్చెడి విప్లవ దృక్పథమునో లేక సంస్కరణ విధానమను లక్ష్యమునో - రెంటిలో దేనినో యొకదానిని నిశ్చయించుకొనవలసిన సమయము వచ్చినదని నేను విపులముగ మాట్లాడితిని. ఆ నా యుపన్యాసమునకు ప్రాముఖ్యత లేదు. లాలాజీ కమిటీలో దానికి ప్రత్యుత్తరమిచ్చుచు దానిలో కొంతభాగమును విమర్శింపకపోయినచో నేను దానిని మరచియుండెడివాడను. బ్రిటిషు లేబరుపార్టీ నుండి మనమేమియు నాశింపరాదని యతడు మందలించెను. నాకు సంబంధించినంతవరకా మందలింపుయవసరము. ఏలనన నేను బ్రిటిషు అధికార లేబరునాయకత్వమునుచూచి పొంగువాడను కాను.

లాహోరు తిరిగి వెళ్ళుటతోడనే లాలాజీ అ. భా. కాం. కమిటీలో నేనిచ్చిన యుపన్యాసమునకు, మరల దానికి సంబంధించిన యనేక సమస్యలనుగురించి తన వారపత్రికయైన 'ప్రిజ' లో వ్రాయదొడగెను. మొదటి వ్యాసముమాత్రమేవచ్చెను. రెండవ వ్యాసము తరువాత వారములో వచ్చులోపల నతడు చనిపోయెను. అసంపూర్తియైన యతని యీ మొదటి వ్యాసము (బహుశః అదియే నతడు ప్రచురణకిచ్చిన కడసారి వ్రాత) నన్ను విచారమున ముంచెను.

# 25

## లాఠీచార్జీల యనుభవము

లాలా లజపతిరాయి దెబ్బలతో చనిపోవుటచే సైమనుకమిషను బహిష్కరణము మరింత తీవ్రమయ్యెను. లక్నో కాంగ్రెసు కమిటీ దాని నాహ్వానించుటకు గొప్పప్రయత్నములను చేసిరి. చాల రోజులుముందుగనే ప్రచారముకొరకు నసలు ప్రదర్శనముకు సంసిద్ధం చేయుటకు బ్రహ్మాండమైన యుత్సవములు, సభలు, ప్రదర్శనములు చేయబడుచుండెను. నేను లక్నో వెళ్ళి వీటిలోకొన్నింటిని చూచితిని. చాల సక్రమముగ, ప్రశాంతముగ, జయప్రదముగ జరుగుచున్న ఈ ప్రదర్శనములచే ప్రభుత్వముకు కళ్ళుకుట్టి వారు వీటి కభ్యంతరము లను కల్పింప నారంభించి, కొన్ని ప్రాంతములలో నుత్సవములను జరుపగూడదని నిషేధించిరి. ఈ సందర్భములోనే నా కొక క్రొత్త యనుభవముకలిగెను. నా శరీరము పోలీసు కమిచీదెబ్బలను, లాఠీ ప్రహారణములను చవిజూచెను.

రహదారీ కడ్డమను నెపమున యుత్సవములను నిషేధించిరి. అట్టిదోషము కలుగకుండుటకు మేము పదునారుమంది చొప్పున విడివిడిగా విజనముగానుండు వీధులనుండి సభాప్రదేశమునకు పోవ నిశ్చయించితిమి. శాస్త్రరీత్యా యిది యాజ్ఞోల్లంఘనమే యగును. ఏలనన జెండాయు, పదునారుమంది జనము నొక యుత్సవమగును. నేనిట్టి పదునారుమందిగల యొక యుత్సవము నడిపితిని. తరువాత గోవిందవల్లభపంతు యాధిపత్యమున మరి పదునారుమంది వచ్చిరి. మా యుభయులకు చాల యెడముండెను. మేము రెండువందల గజ ములు దూరము వెళ్ళితిమో లేదో మా వెనుక గుఱ్ఱపుడెక్కల మ్రోత వినిపించెను. ఆ రోడ్డున జనములేరు. మేము వెనుకకు తిరిగి చూచునరికి కొంతమంది యశ్వారూఢులైన పోలీసులు వాయువేగ మున మా పైకి వచ్చుచుండిరి. వారు క్షణికములో మాపైకి వచ్చు టచే నా దాడికి పదునారుమందిగల మా చిన్నదళము విడిపోయెను.

వెంటనే పోలీసులు పెద్ద కమిచీలతో మా వాలంటీర్లను మోదనారంభించిరి. సహజముగా వారు ప్రక్కతోవల శరణుజొచ్చిరి. కొందరు చిన్న చిన్న దుకాణములలో ప్రవేశించిరి. పోలీసులు వారిని వెంబడించి బాదమోదిరి. గుఱ్ఱములు మాపై బడవచ్చినపుడు నా బుద్ధి గూడ సహజముగా రక్షణ నన్వేషించెను. ఆ దృశ్యము కడు దీనమైనది. కాని, మరియొక యూహ న న్నచ్చోట నుండి కదలనీయలేదు. నే నా మొదటదాడికి నిలువగలిగితిని. రోడ్డుమధ్య నే నొక్కడనే యున్నట్లు నే నకస్మాత్తుగా తెలిసికొంటిని. నాకు కొద్ది గజములదూరములో నన్నివైపులను పోలీసులు వాలంటీర్లను కొట్టుచుండిరి. పోలీసుల కంతగా కాన్పించకుండుటకు నే నప్రయత్నముగా రోడ్డు ప్రక్కకు మెల్లగా జారనారంభించితిని. కాని తిరిగి నాలో నేను తర్కించుకొని యీ విధముగా జారిపోవుట నాకు తగదని నిశ్చయించుకొంటిని. ఈ తర్కముకంతకు కొద్ది సెకనులుపట్టెను. కాని నాలో జరిగిన ఆ యాంతరంగిక పోరాటము, ఆ నిశ్చయము కళ్ళకు కట్టినట్లు నా స్మృతిపథమున నిలిచియుండెను. నేను భీరువువలె ప్రవర్తించుట సహింపజాలని నా యభిమానధనము చేతనే యానిశ్చయము కలిగెను. అయినను భీరధీరత్వములమధ్య నెంతయో యెడములేక పోవుటచే నే నటు వాలినను వాలి యుండెడివాడను. నే నట్లు నిశ్చయించితినో లేదో యప్పుడే యొక యశ్వారోహుడైన పోలీసు తన పొడుగైన క్రొత్త కమిచీని విసురుకొనుచు చటచట నామీదకువచ్చెను. నే నతనిని ముందుకు పొమ్మని నా తలను తప్పించుకొంటిని. తలను ముఖమును రక్షించుకొనుట కిది మరియొక ప్రయత్నము. అతడు నా వీపుమీద 'ఛెళ్ళుమను' రెండు దెబ్బలను తగిలించెను. నాకు రిమ్మెత్తెను. శరీరమంతయు కంపించెను. కాని నే నింకను నా కాశ్చర్యము, తృప్తియు కలుగునట్లు నిలిచియే యుంటిని. తరువాత పోలీసుదళమును మా మార్గమున కడ్డముగా నిలబెట్టిరి. వాలంటీర్లు తిరిగి కలుసుకొనిరి. వారి శరీరము రక్తసిక్తమయ్యెను. కొంతమంది బుర్రలు పగిలెను. గోవింద వల్లభపంతు తన పరివారముతో మమ్ము కలుసుకొనెను. వారికికూడ

ప్రహారణములు తగిలెను. మే మందరము పోలీసుల యెదుట నేలమీద కూర్చుంటిమి. మే మట్లు చీకటిపడువరకు కూర్చుంటిమి. ఒక ప్రక్క గొప్ప గొప్ప ప్రభుత్వోద్యోగులు కూడిరి. మరియొకవంక వార్తలు ప్రబలినకొలది ప్రజలు గుంపులుగూడ నారంభించిరి. చివర కధికారులు మమ్ము మామూలు మార్గమున పోవుటకంగీకరించిరి. మాపై దాడి వెడలి మమ్ముబాదిన పోలీసులు ముందు అంగరక్షకులుగ నడచుచుండ మే మా మార్గముననే వెళ్ళితిమి.

దీనివలన నెక్కుడు ఫలితము కలుగుటచే నీ నీ చిన్నవిషయ మునుగురించి యింతవివరముగా వ్రాసితిని. లాఠీ దెబ్బల కాగగలి గితినను యుత్సాహములో నేను నా శరీరబాధను పూర్తి గామరచి పోతిని. ఈ కథ యంతయు జరుగుచుండగా, నా మనస్సు అతి నిర్మలముగా నుండుటయు, నా భావములను నేను బుద్ధి పూర్వకముగ పరీక్షించుకొనుచుండుటయు, నా కాశ్చర్యముగ నుండెను. మరునాటి యగ్ని పరీక్ష కీ నాందీయుత్సవము నా కెంతయో తోడ్పడెను. మరునాడే సైమను కమిషను రావలసిన దినము; మా ప్రదర్శనము జరుగుదినము.

అప్పుడు మా తండ్రి అలహాబాదులోనుండెను. నాపై పోలీసులు దాడివెడలినవార్త వినినచో నతడు మాకుటుంబము చిరాకుపడుదురను భయము నాకుండెను. కనుక నే నంతయు బాగుగనేయున్నదనియు, నతడు విచారపడనవసరములేదనియు రాత్రి టెలిఫోనులో చెప్పితిని. కాని యతడు చికాకుపడి, నిద్రపట్టక, రాత్రి పన్నెండుగంటలకు లక్నో వచ్చుటకు నిశ్చయించుకొనెను. ఆఖరురైలు దాటిపోవుటచే నతడు మోటారులో పయనమయ్యెను. త్రోవలో నతనికొక యవాంతరము కూడ తటస్థించెను. చివర కత డలసి సొలసి నూట నలుబదియారు మైళ్ళు ప్రయాణముచేసి లక్నోకు ప్రాతఃకాల మయిదుగంటలకు చేరు కొనెను. మే మప్పుడే యుత్సవములో పాల్గొనుటకు స్టేషనుకు బయలు దేరుచుంటిమి. మేముచేసిన ప్రయత్నములకంటె గత సాయంకాలపు సంభవములే లక్నో నంతను మేల్కొలిపెను. సూర్యోదయము కాక

పూర్వమే వేలకొలదిజనము స్టేషనుకు చేరిరి. పట్టణములోని వివిధ భాగములనుండి యసంఖ్యాకమగు చిన్న చిన్న యుత్సవములు బయలు దేరెను. కాంగ్రెసుఆఫీసునుండి యనేకవేలమంది నలుగురు చొప్పున బారులు తీరి పోవు ప్రధానయుత్సవము బయలుదేరెను. మే మీ ప్రధాన యుత్సవములో నుంటిమి. మేము స్టేషనుకు వెళ్ళుటతోడనే పోలీసులు మమ్మాపివేసిరి. స్టేషనుముందర చతురపుమైలుదూరము విశాలమైన బహిరంగప్రదేశముండెను. మే మీ మైదానమునకొక వైపున బారులుతీరి నిలిచితిమి. ముందుకు త్రోసికొనిపోవు యత్న మేమియు లేక నచ్చటనే మా యుత్సవ మాగిపోయెను. ఆ ప్రదేశము మామూలు పోలీసులతోను, గుఱ్ఱపు పోలీసులతోను, మిలిటరీతోను నిండియుండెను. ఆ యుత్సవము చూడవచ్చిన యభిమానుల సంఖ్య యంతకంతకు హెచ్చెను. వీరిలోచాలమంది యిద్దరు ముగ్గురు చొప్పున మైదానములో సర్దుకొనిరి. దూరములో నడుచుచున్న సమూహ మొకటి మా కకస్మాత్తుగా కాన్పించెను. అది యా ప్రదేశమునంతను కప్పివేయుచుండిన రెండుమూడు శ్రేణుల యాశ్వికదళము. వారు మాపై బడుటకు దౌడుమీదవచ్చుచు, మైదానములో నచ్చటచ్చట చెల్లాచెదరుగానున్న వారిని మోదుచు, గుఱ్ఱములతో త్రొక్కు- కొనుచు వచ్చుచుండిరి. స్వారిచేయుచువచ్చిన యాశ్వికుల దాడి చూచుట కందముగనే యుండెను. కాని త్రోవలో నిరపరాధులు, యుత్సవమును చూచుటకువచ్చినవారు గుఱ్ఱపు డెక్కలక్రిందబడి నలుగుచుండిరి. దాడిచేసిన యీ దళముల వెనుక నీ ప్రజలు నేల మీద పడియుండిరి. కొందరు లేవలేని స్థితిలోను, కొందరు బాధచే మూల్గుచు మైదానమంతయు నొక యుద్ధరంగమువలె నుండెను. ఆశ్వికులు క్షణికములో మాపైకి వచ్చిరి. మొదటి దళ మప్పుడే యుత్సవములోపాల్గొను జనసమూహముపై బడెను. నేము కదలలేదు; మా స్థలములను వీడలేదు. కనుక గుఱ్ఱములు చివర నిముసమున తటా లున ఆగి వెనుక కాళ్ళపై నిలిచి ముందరి డెక్కలనెత్తి గాలిలో మా శిరములపై తాండవమాడుచుండెను. తరువాత నాశ్వికులు మామూలు

పోలీసులుకూడా మమ్ము లాఠీలతోను, పొడుగుపాటి కమిచీలతోను మోద నారంభించిరి. అది శివతాండవమువలె నుండెను. గతసాయం కాలముండిన యా నిర్మలదృష్టి నాకు లేకపోయెను. నే నున్నచోట నుండి యొక్క యంగుళ్మైనను ముందువెనుకలకు పోరాదనిమాత్రమే గ్రహించితిని. ఆ దెబ్బలచే నేను సగము గ్రుడ్డివాడనైతిని. ఒక్కొ కపుడు కొద్దికోపము దెబ్బకుదెబ్బ తీయవలెననుకోరిక నన్నావహించు చుండెను. నా యెదుటనున్న పోలీసుయుద్యోగిని గుఱ్ఱముమీదనుండి పీకివేసి నే నా గుఱ్ఱము నెక్కుట యొక ఘనకార్యము కాదనుకొంటిని. కాని యొక న్యాయమునకు కట్టుబడుటయు, చిరశిక్షణయు నన్ను మందలించెను. ముఖముమీద దెబ్బపడకుండ తప్పించుకొనుటకుతప్ప నేను చేయైనను యెత్తలేదు. ఇంతేగాక మే మేమాత్రము దౌర్జన్య మునకు గడంగినను మాలో ననంఖ్యాకులను కాల్చుటయు పేల్చుటయు జరుగునని నే నెరుగుదును.

యుగములవలె కాన్పించిన యీ కొద్దినిముషములైనతరువాత మా పంక్తి నెమ్మదిగా నడు గడుగు చొప్పున విడిపోకుండగనే త్రోవయిచ్చుచుండెను. దీనిమూలమున నేను కొంత యొంటరి నైతిని. మరింత దెబ్బల వర్షము కురియ నారంభించెను. అకస్మాత్తుగా వెనుకనుండి నన్నెవరో పట్టుకొని మోసికొనిపోయిరి. నా సహ చరులలో కొందరు యువకులు నాపై గొప్పదాడి రానున్నదని భావించి నన్ని సూక్ష్మమార్గమున రక్షింప నిశ్చయించిరి.

యుత్సవములలో పాల్గొనుచున్నవారు తిరిగి మా మొదటి పంక్తికి నూరడుగుల దూరములో నిలువబడిరి. పోలీసులుకూడ వెను కకుతగ్గి మాకు యేబదియడుగులదూరములో నుండిరి. ఈ కష్టముకు కారణమైన సైమనుకమిషను అరమైలుపైగానున్న స్టేషనునుండి రహస్యముగా జారిపోవు సమయమున మే మీవిధముగా నుంటిమి. అయినను వారికి నల్లజెండాలు తప్పవయ్యెను. తరువాత మేము పెద్ద యుత్సవముతో కాంగ్రెసుఆఫీసుకువచ్చి యచ్చటనుంచి విడిపోతిమి. నేను నాకొరకు కాతురతతో నున్న తండ్రిగారియొద్దకు వెళ్ళితిని. తాత్కాలికావేశము తగ్గిపోవుటచే నాశరీరమంతయు బాధింపనారం

భించి యలసట హెచ్చుచుండెను. నా శరీరములో నొప్పిపెట్టని భాగమేదియు కాన్పించదయ్యెను. ఒడలునిండ గాయములు, కవ్రుకు దెబ్బలు మొదలగువాని చిహ్నములుండెను. అదృష్టవశాత్తు నాకు మర్మస్థానములలో మాత్రము దెబ్బలు తగులలేదు. నా స్నేహితులు చాలమందికంతటి యదృష్టము పట్టలేదు. వారికి చాల గాయములు తగిలెను. నా ప్రక్కనిలిచిన గోవిందవల్లభపంతు ఆరడుగుల చిల్లర యెత్తుకలిగి యుండుటచే దెబ్బలకు మరింత గురియయ్యెను. అప్పుడు తగిలిన గాయములచే నతడు చాలకాలము వరకు నడుము యెత్తలేక, నే పనియు చేయజాలకయుండెను. నా శరీరస్థితియు, సహనశక్తియు బాగుండెనను మరింతగర్వముతో నేను బయటపడితిని. కాని దెబ్బల కంటె మాపై దాడి వెడలిన యా పోలీసులయొక్క, ముఖ్యముగా నుద్యోగస్థులయొక్క ముఖములను నేనెన్నటికిని మరువజాలను. నిజమైన దెబ్బలను చాలవరకు యూరపియను సార్జంటులే కొట్టిరి. భారత పోలీసులు నుద్యోగస్థులు కొంచెము తేలికపద్ధతుల నవలంభించిరి. ఆహా! ఆ ముఖములు ద్వేషముతో, రక్తపిపాసతో నిండి, యేమంతయైన సానుభూతికి మానవలక్షణములు లేక కొంచె మించుమించు పిచ్చి యెత్తినట్లుండెను. బహుశః ఆ సమయమున మా ముఖములును చూచుటకంత ద్వేషపూరితముగనే యుండవచ్చును. తటస్థముగా నుండి నంతమాత్రమున మేము మా శత్రువులపట్ల ప్రేమపూరితులమై యుండలేదు. మా తాటస్థ్యము మా ముఖముల యందచందములను వృద్ధిచేయలేదు. అయినను మాలో క్రోధములేదు ; వ్యక్తిగతమైన పోరాటముకాని, ద్వేషముకాని లేదు ; రెండు బలీయమైన వింత శక్తులకు మే మా సమయమున ప్రతినిధులమైతిమి. అవి మా బుద్ధులను, మా హృదయములను జయించి మా కోరికలను, రాగములను ఉద్రేకపరచి మమ్ము గ్రుడ్డియుపకరణములుగా చేసికొనెను. మే మెందుకు పోరాడుచుంటిమో, నే మెచ్చటకు పోవుచుంటిమో తెలియకుండగనే గ్రుడ్డిగా పోరితిమి. కార్యోద్రేకము మమ్మెల బంధించెను. కాని, యదిగతించుటతోడనే యిదియంతయు దేనికొరకు ? దేనికొరకు ? యను ప్రశ్న యుదయించెను.

# 26

## ట్రేడు యూనియను కాంగ్రెసు

ఆ వత్సరము సైమనుకమిషను బహిష్కారణము, అఖిలపక్ష శాసనసభ దేశములో రాజకీయముగ ప్రసిద్ధిచెందెను. కాని నా ప్రత్యేకశ్రద్ధ, కార్యాసక్తి యితరత్రయుండెను. కాంగ్రెసు కార్యదర్శి నగుటచే నే నా సంస్థను పరీక్షించుచు దానిని బలపరచుట కెక్కుడుగా పనిచేయుచుంటిని. ప్రజల దృష్టిని సాంఘిక, ఆర్థిక మార్పుల వైపు మరలించుటయే నా ప్రధానాశయము. స్వాతంత్ర్యమును గురించి మద్రాసులో మే మార్జించిన స్థానము కట్టుదిట్టము చేసికొన వలసియుండెను. ముఖ్యముగా నఖిలపక్షసభ మమ్ము వెనుకకు లాగు చుండుటచే నిది మరింత యవసరమయ్యెను. ఈ లక్ష్యముతో నేను చాలవరకు తిరిగి యనేక ప్రధానసభలలో నుపన్యసించితిని. 1928 లో నేను నాలుగు రాష్ట్రసభలలో—పంజాబు, దక్షిణమున మలబారు, ఢిల్లీ, సంయుక్తపరగణాలలో నధ్యక్షత వహించితిని. వంగ, బొంబాయిలలో ననేక యువజనసభలకు, విద్యార్థుల సభలకు కూడ నధ్యక్షత వహించితిని. అప్పుడప్పుడు సంయుక్తపరగణాలలో గ్రామ సీమలకు వెళ్ళితిని. తఱచు పారిశ్రామిక కూలీలకుకూడ నుపన్యసించు చుంటిని. స్థానికపరిస్థితులనుబట్టి రూపము భేదించుచుండినను, సభలలో నున్న సభ్యులనుబట్టి ప్రాముఖ్యత హెచ్చించబడుచున్నను మొత్తము మీాద నా యుపన్యాసముల సారాంశ మొక్కటిగనే యుండెను. ప్రతి చోట నేను రాజకీయ స్వాతంత్ర్యమునుగురించి, సాంఘిక స్వాతంత్ర్య మునుగురించి చెప్పుచు మొదటిది రెండవదానిని సాధించుట కొక సోపానమని చెప్పుచుంటిని. నేను సామ్యవాదభావములను వ్యాప్తి చేయ కోరితిని. జాతికి వెన్నెముకవంటివారైన కాంగ్రెసు సేవకులు, విద్యాధికులు నతి సంకుచిత జాతీయభావములనే కలిగియుండుటచే ముఖ్యముగ వారిలోనే యీా భావములను వ్యాప్తిచేయకోరితిని. వారి యుపన్యాసములు ప్రాచీన యౌన్నత్యమును పొగడుచుండెను. పర

ప్రభుత్వముచే మనకు దాపరించిన ఆర్థిక, ఆధ్యాత్మిక కష్టములను మన ప్రజల వివిధబాధలను పరప్రభుత్వమువలన కలుగు నవమాన ములను, జాతీయగౌరవ స్వాతంత్ర్యవాంఛ, మాతృ పాదారవిందముల కడ నాత్మార్పణ మొనరింపవలసిన యావశ్యకత మొదలగు విషయ ములనుగురించి చెప్పుచుండెను. ఆవిషయము లందరకు సుబోధకము లైన ప్రతి భారతహృదయము నట్టి భావములతోనే స్పందించు చుండెను. నాలోనున్న జాతీయభావముకూడ నుద్దీపితమయ్యెను. కాని వాటిలోని సత్యమున కెట్టిభంగము కలుగకపోయినను నిరంతర మా పాటనేపాడుచుండుటచే నవి పేలవమగుచు నితరసమస్యలను గురించియు మనపోరాటములోని ప్రధానాంశములను గురించియు యోచించుట కడ్డు తగులుచుండెను. అవి కేవల ముద్రేకమును పెంచుచుండెనేకాని యాలోచనను వృద్ధిచేయుచుండుటలేదు.

భారతదేశమునకు సామ్యవాదమును తెచ్చుటలో నేను ప్రథ ముడనుగాను. నిజముగా నేను వెనుకపడియుండి, యనేకమంది యీ సందేశమును నాకంటె ముందు ఘోషించియుండ నెమ్మదిగా యడుగ డుగుచొప్పుననే బాధతో ముందుకు నడచితిని. పనివాండ్ర ట్రేడు యూనియను ఉద్యమాశయములలో నిశ్చయముగా సామ్యవాద పర ముగనేయుండెను. యువజనసంఘములు చాలవరకు నట్లేయుండెను. నేను యూరపునుండి 1927 డిసెంబరులో తిరిగి వచ్చునసరి కస్పష్టము గజిబిజిగనుండిన సామ్యవాదము భారతదేశ వాతావరణములో నొకభాగమైపోయెను. అంతకుముందును చాలమంది సామ్యవాదులు చెల్లాచెదురుగనుండిరి. వారు చాలవరకు గాలిమేడలను కట్టు చుండిరి. మార్క్సుసిద్ధాంతము వారి నంతకంత కాకర్షించుచుండెను. కొద్దిమంది నూటికి నూరువంతులు మార్క్సు శిష్యుల మనుకొనిరి. అమెరికా, యూరపులలోవలెనే యిచ్చట సోవియటు యూనియనులో జరిగిన యభివృద్ధులవలన, ముఖ్యముగా నయిదు సంవత్సరముల ప్లానువలన నీభావము బలీయమయ్యెను.

ప్రధాన కాంగ్రెసు ఆఫీసులు చేతిలోనున్న కాంగ్రెసుముఖ్యులలో నొకడనగుటయే నేను సామ్యవాది నగుటలో నున్న ప్రాముఖ్యత. ఈవిధముగనే యోచింప నారంభించిన కాంగ్రెసు ముఖ్యులింకను కలరు. సంయుక్తపరగణాల రాష్ట్రకాంగ్రెసు కమిటీలలో నిది బాగుగ విదితమయ్యెను. ఈ కమిటీలలో మేము 1926 లోనే తేలికయైన సామ్యవాద ప్రోగ్రాము నొకదానిని వేయుటకు యత్నించితిమి. మారాష్ట్రము జమీందారులయొక్కయు, తాలూకుదారుల యొక్కయు రాష్ట్రము. మేము మొట్టమొదట భూమిసమస్య నెదుర్కొనవలసియుండెను. వర్తమాన భూపద్ధతి పోవలెననియు ప్రభుత్వము వ్యవసాయదారులకు మధ్య నెవరునుండరాదనియు మేము ప్రకటించితిమి. వాతావరణమింకను సట్టిభావముల కలవడకపోవుటచే మేము కొంత జాగ్రతగనే పోవలసియుండెను.

మరుసంవత్సరము, 1929 మా కాంగ్రెసుకమిటీ మరియొక యడుగు ముందుకుపోయి సామ్యవాదపద్ధతిమీాద అ. భా. కాం. కమిటీకొక సూచనచేసెను. ఈ రెండవ కమిటీ ఆ సంవత్సర వేసవిలో బొంబాయిలో కలుసుకొని మా రాష్ట్రకమిటీ తీర్మాన పీఠిక నవలంబించి మొత్తము తీర్మానము వెనుకనున్న సామ్యవాద సూత్రము నంగీకరించెను. మా రాష్ట్ర తీర్మానములోని వివరమైన ప్రణాళిక నాలోచించుటకు మరియొక తేదీకి వాయిదా వేసిరి. చాలమంది అ. భా. కాం. కమిటీలోను మా రాష్ట్ర కమిటీలోను అంగీకరింపబడిన ఈ తీర్మానములను మరచి సామ్యవాద విషయము గత సంవత్సర కాంగ్రెసులో నకస్మాత్తుగా వచ్చినట్లూహించుచుందురు. కాని అ. భా. కాం. కమిటీ ఆ తీర్మానమును బాగుగ యోచించకుండ నామోదించిరనుట సత్యము. బహుశః చాలమంది సభ్యులు వారేమిచేయుచుండిరో గుర్తింపలేరు. భారత స్వాతంత్ర్య లీగు యొక్క మా రాష్ట్రశాఖ స్పష్టముగా సామ్యవాదపరముగనుండ మిశ్రమ సంస్థయైన కాంగ్రెసు కమిటీకంటె మరికొంతముందుకు వెళ్ళెను. స్వాతంత్ర్యసంఘలక్ష్యములలో నొకటి సాంఘిక స్వేచ్ఛ

యనుట సత్యము. మేము భారతదేశమంతట ఈ లీగును బలీయమైన సంస్థగాచేసి తద్వారా స్వాతంత్ర్య, సామ్యవాద ప్రచారములను చేయ నెంచితిమి. దురదృష్టవశాత్తు, నా కాశాభంగము కలుగునట్లు, ఈ లీగు మా రాష్ట్రములో కొంతవరకుతప్ప యెప్పుడు వృద్ధిచెందలేదు. దేశములో దీనికి తగినబలము లేకపోయెను. మాలో చాలమంది కాంగ్రెసులోకూడ చాల ప్రధానులము, కాంగ్రెసు సిద్ధాంతములో నైనను, స్వాతంత్ర్య తీర్మానము నవలంబించుటచేతను, వారెల్లప్పుడు కాంగ్రెసుసంస్థ ద్వారముననే పనిచేయగలరు. లీగును మొట్టమొదట స్థాపించినవారిలో కొందరికి దానినొక గొప్పసంస్థగా చేయవలెనను శ్రద్ధలేదు. వారు దానిని కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గము మీద నొత్తిడి కలుగజేయు నొక పరికరముగను, కాంగ్రెసు వర్కింగు కమిటీ యెన్నికలలో నుపయోగించుకొను పరికరముగను చూచిరి. కనుక స్వాతంత్ర్యలీగు కృశించెను. కాంగ్రెసు తీవ్రరూపమును దాల్చిన కొలది యది శక్తివంతులనందరను తనలోనికి లాగుకొనుటచే లీగు దుర్బలమయ్యెను. 1930 లో శాసనోల్లంఘనము వచ్చుటతోడనే లీగు కాంగ్రెసులో కలసిపోయి యంతరించెను.

1928, 1929 లలో నా అరెస్టు వదంతులు బయలుదేరెను. పత్రికల సూచనలలోను స్నేహితుల రహస్యమందలింపులలోను యెంతసత్యమున్నదో నాకు తెలియదు. కాని యీ మందలింపుల వలన నా కది సమీపించుచున్నట్లే తోచెడిది. నేను దీనిని లెక్క చేయలేదు. ఎప్పుడు అరెస్టు వచ్చినను నేను దానిని సామాన్య విష యమువలెనే చూచితిని. కనుక నరెస్టు వదంతులవలన లాభములు లేకపోలేదు: అవి నా నిత్య జీవితమునకు కొంత యుద్రేకము, పట్టు సమకూర్చెను. 1928—1929 సం॥లలోనే నాకు చాల సావకాశము దొరికెను. 1930 ఏప్రిల్ వరకు నా అరెస్టు రాలేదు. తరువాత ఖయిదు వెలుపలనున్న నా స్వల్పకాలములో స్థిరత్వము లేకపోయెను. నేను మాయింట కొద్ది కాలము చూచిపోవుటకు వచ్చినయొక క్రొత్త వానివలె మెలిగెడివాడను; లేదా రేపేమి రానున్నదో యను

సందేహ మనస్కుడనై తిరుగుచు జయిలు పిలుపుకొరకెప్పుడు నెదురు చూచుచుండెడివాడను.

1928 అంతమున కలకత్తా కాంగ్రెసు సమీపించుచుండెను. మా తండ్రి దానికధ్యక్షుడు. అత డఖిలపక్ష సభా వ్యవహారములలో నిమగ్నుడై దానికొరకు తన నివేదికను తయారుచేసి కాంగ్రెసుచే నామోదింప జేయగోరెను. ఇది నా కిష్టము లేదని యత డెరుగును. స్వాతంత్ర్యసమస్యమీద రాజీపడుటకు నే నంగీకరించువాడను కాను. ఇది యతని కోపకారణము. మే మీ విషయమునుగురించి యంతగా చర్చించుకొనెడివారము కాము. కాని మాలో మానసిక పోరాటము చెరియొకవైపు లాగవలెనను ప్రయత్నము ఉండెడిది. అభిప్రాయ భేదములు మా కింతకుపూర్వము తఱచు కలుగుచుండెను. అవి ప్రధానమైనవే యగుటచే మేము వేరు వేరు రాజకీయ కక్షలలో నుండెడివారము. కాని యింతటి తీవ్రత యెన్నడు కలుగలేదు. ఇది మా ఇద్దరకు విచారముగనే యుండెను. కలకత్తాలో పరిస్థితులు విషమించెను. కాంగ్రెసులో తనమాట నెగ్గనిచో ననగా అఖిలపక్ష నివేదికయొక్క తీర్మానమునకు మెజారిటీ లేకపోయినచో తాను కాంగ్రెసు అధ్యక్షతను వహింపనని మాతండ్రి తెలిపెను. అదిచాల సహేతుకము, చట్టబద్ధము. అయినను యెదిరిపక్షములో చాలమంది కిది విషాదజనకముగ నుండెను. ఈ విషయము నింతతీవ్రస్థితికి తెచ్చుటకు వారికిష్టములేదు. విమర్శించుట, గర్హించుటయేగాని బాధ్యతను వహించుటకు వెనుకకు తగ్గుట తఱచుగా నొక యభ్యాస మయ్యెను. నావను నడుపవలసిన భారము మనపై వేసికొనకుండ విమర్శవలన నెదుటిపక్షము మనకు లాభకరమగు విధమున తన పద్ధతిని మార్చుకొనునను యాశ యెప్పుడు నుండును. ప్రస్తుత భారత ప్రభుత్వమువలె మనకు బాధ్యులు కాకుండ, కదల్చుటకు వీలులేని బాధ్యతారహితమైన కార్యనిర్వాకవర్గ మున్నప్పుడు మనము చేయగలిగినది విమర్శయే! ఆ విమర్శ ఖండనరూపముననే యుండి తీరును. అయినప్పటికి వ్యతిరేక విమర్శ పటుతరముగ నుండవలెనని

దానివెనుక నవకాశము వచ్చుచో సంపూర్ణాధికారము, బాధ్యత వహింపగల మానసిక యత్నము, సంసిద్ధత యుండవలెను. ఆ యధికారము ప్రభుత్వమునకు సంబంధించిన నాగరిక, సైనిక, ఆంతరంగిక, వైదేశిక శాఖ లన్నిటిమీద నుండవలెను. లిబరలుపక్షమువారివలె సైన్యములో కొంత బాధ్యతయే కావలెనని కోరుట మన యసామర్థ్యము నొప్పుకొనుటయే యగును; విమర్శలోని సారమును తీసివేసినట్లే యగును.

ఇట్టివిమర్శలు, గర్హించుటలు, వానివలన సహజముగా సంభవించు ఫలితములకు వెనుకాడుటలు గాంధీజీ విమర్శకులలో తఱచు జరుగుచుండెను. అతని యనేకచర్యలందు హితవులేనివారు కాంగ్రెసులో ననేకులుగలరు. వారు వానిని తీవ్రముగ ఖండింతురు. కాని వారతనిని కాంగ్రెసునుండి తరిమివేయ సంసిద్ధులుకారు. దీని నర్థము చేసికొనుట సులభమే కాని యిది యేపక్షమునకు యోగ్యముకాదు. కలకత్తా కాంగ్రెసులో నిట్టికష్టములే సంభవించెను. ఉభయపక్షముల మధ్య రాయబారములు జరిగెను. ఒక రాజీసూత్రము కుదిరెనని ప్రకటించిరి. కాని చివరకిది హుళ్ళక్కియయ్యెను. అనంతయు గందరగోళముగ నవినీతికరముగ నుండెను. చివరకు కాంగ్రెసుయొక్క ప్రధానతీర్మానము అఖిలపక్ష సభయొక్క నివేదిక నామోదించుచు, బ్రిటిషు ప్రభుత్వము సంవత్సరములోగా దాని కంగీకరింపనిచో స్వాతంత్ర్య తీర్మానమునకు మరలునని తెలియచేసెను. ఈ తీర్మానము స్వాతంత్ర్య ఆదర్శమునుండి క్రిందకు దిగినమాట సత్యము. ఏలనన అఖిలపక్షనివేదిక పూర్తియైన డొమినియను పరిపాలననైనను కోరలేదు. అయినను అది యోగ్యమైన తీర్మానము. ఏలనన నది చీలిక లేకుండ చేసి 1930 లో ప్రారంభమైన పోరాటమునకు కాంగ్రెసు నేకీముఖముచేసెను. బ్రిటిషుప్రభుత్వ మొక సంవత్సరములో అఖిలపక్ష సభాచట్టము నామోదించరనుమాట నిశ్చయము. ఇక పోరాటము తప్పనిసరి. దేశ పరిస్థితులనుబట్టి గాంధీజీ నాయకత్వము లేనిదే యెట్టిపోరాటము సఫలము కాజాలదు.

నేను బహిరంగ కాంగ్రెసులో, నిండు హృదయముతో కాక పోయినను, తీర్మానము నెదిరించితిని. అయినను నన్నే తిరిగి కార్య దర్శిగా నెన్నుకొనిరి. ఏమిజరిగినను సరే నేను కార్యదర్శిపదవి నంటి పెట్టుకొనియుంటిని. కాంగ్రెసు ప్రపంచములో నేను సుప్రసిద్ధ 'బ్రే' పట్టణ బిషప్పువలె నుంటిని. కాంగ్రెసుసింహాసనముపై నే యధ్య క్షుడు కూర్చొనినను కాంగ్రెసు సంస్థ కంతకు నేనే కార్యదర్శిగా నుంటిని.

కలకత్తా కాంగ్రెసుకు కొద్దిరోజులు పూర్వము బొగ్గుగనుల కేంద్రమయిన జారియాలో అఖిలభారత ట్రేడ్ యూనియను కాంగ్రెసు జరిగెను. నేను మొదట రెండురోజులు దానిలో పాల్గొని తరువాత కలకత్తా వెళ్ళిపోతిని. అదియే నా మొదటి ట్రేడు యూని యను కాంగ్రెసు. వ్యవసాయకులలోను, పనివాండ్రలోను నేను కల్పిం చుకొనిన జోక్యములే నాకు ప్రజలలో కొంతపలుకుబడి కలిగించినను కేవలము పైవాడను. సంస్కరణవాదులకు నతివాదులకు గల పాత పోరాటము జరుగుచునేయుండెను. ప్రధానహంశము లేవియన నేదో నొక యింటరునేషనలుకు సామ్రాజ్య వ్యతిరేక లీగుకు నఖిల పసిఫిక్ యూనియనుకు దీనినొక యంగముగా జేర్పించుట; జినీవాలో జరుగు ఇంటర్ నేషనల్ లేబరు ఆఫీసు కాన్ఫరెన్సుకు ప్రతినిధులను పంపుట. ఈ సమస్యలకంటె ముఖ్యమైనది యీ కాంగ్రెసులోని రెండు పక్షములవారికి దృక్పథములోగల గొప్పభేదము. పాత ట్రేడు యూని యను గ్రూపువారు రాజకీయములలో మితవాదులు. పారిశ్రామిక విషయములలో రాజకీయముల జోక్యమును వారు విశ్వసింపరు. వారు పారిశ్రామిక కార్యములనే విశ్వసింతురు. అవికూడ జాగ్రత్తగ జరుగ వలె నందురు. పనివాండ్ర పరిస్థితులు క్రమముగ మెల్లగ బాగుపడు టయే వారి లక్ష్యము. ఈ గ్రూపునాయకుడు యన్. యమ్. జోషి. ఇతడే తఱచు జినీవాకు భారత లేబరుప్రతినిధిగా వెళ్లెడివాడు. రెండవ గ్రూపు యింతకంటె నతివాదులు. రాజకీయ కార్యములను వారు విశ్వసింతురు. వారు బహిరంగముగ తమ విప్లవదృక్పథమును తెలిపిరి.

ఎట్టి అధికారము లేకపోయినను దానిపై కొందరు కమ్యూనిష్టులకు, కమ్యూనిజముకు చేరికయైనవారికి పలుకుబడి కలదు. ఈ గ్రూపువారు బొంబాయిలోని నేత పారిశ్రామిక పనివాండ్రను పట్టుకొనిరి. వీరి నాయకత్వము క్రిందనే బొంబాయిలో నేతపనివాండ్ర గొప్పసమ్మె కొంతవరకు జయప్రదముగ జరిగెను. బొంబాయిలో గిర్నీ కామ్‌ఘర్ యూనియను అను నొక శక్తివంతమైన నేతపనివాండ్ర క్రొత్త యూనియను బయలుదేరి లేబరుపరిస్థితుల కాధిపత్యము వహించెను. ఈ విప్లవ గ్రూపువారి పలుకుబడిక్రిందనున్న మరియొక బలీయమైన యూనియను జి. ఐ. పి. రైల్వే యూనియను. ట్రేడు యూనియను కాంగ్రెసు పుట్టినదిలగాయతు దాని కార్యనిర్వాహకత్వము, ఆఫీసు జోషీ చేతిలోను అతని సహచరుల చేతులలో నుండెను. ఈ యుద్యమమును లేవదీయుటకు జోషీయే బాధ్యుడు. విప్లవ పక్షమువారికి సామాన్యులందరిమీద నెక్కువ పలుకుబడియున్నను పయినుండి నీతిని మార్చుటకు తగిన సావకాశము లేవియు లేవు. ఈ స్థితి యసంతృప్తిగనుండెను. ఇది నిజపరిస్థితులను తెలుపకుండెను. అసంతృప్తియు, సంఘర్షణము బయలుదేరెను. ట్రేడు యూనియను కాంగ్రెసులో నధికారమును లాగుకొనవలెనను కోరిక విప్లవపక్షము వారికి కలిగెను. చీలిక కలుగునేమో యను భయముచే విషయములను విషమ పరిస్థితికి తీసుకొనుపోవుట కిష్టము లేకుండెను. హిందూదేశములో ట్రేడుయూనియను యుద్యమ మింకను బాల్యావస్థలోనుండెను. అది దుర్బలముగనుండి చాలవరకు పనివాండ్రుకాని నాయకులచే నడుపబడుచుండెను. అట్టిపరిస్థితులలో నెప్పుడును పయివారికి పనివాండ్రను కొల్లగొట్టు స్వభావముండును. ఇది భారత ట్రేడు యూనియను కాంగ్రెసులో విదితమయ్యెను. కాని జోషీ సంవత్సరముల తరబడి పనిచేసి మంచి శ్రద్ధగలిగిన ట్రేడుయూనియనిష్టు అని రుజువయ్యెను. అతనిని రాజకీయముగ మితవాది, వెనుకబడినవాడు అని యనువారు కూడ భారత లేబరు యుద్యమము కతడు చేసిన సేవను గుర్తించెదరు.

మితవాదులలోగాని, యతివాదులలోగాని, యెవరిని గురించియు మన మిట్లు చెప్పుటకు వీలులేదు.

జారియాలో నా వ్యక్తిగత సానుభూతి విప్లవపక్షము వైపుననే యుండెను. కాని క్రొత్తవాడనగుటచే ట్రే. యూ. కాంగ్రెసు యొక్క యీ గృహకల్లోలములకు దూరముగ నుండవలెనని నిశ్చయించు కొంటిని. నేను జారియా వీడినతరువాత ట్రేడు యూనియన్ కాంగ్రెసు సాంవత్సర యెన్నికలు జరిగెను. మరు వత్సరమునకు నన్ను అధ్యక్షు నిగా నెన్నుకొనిరి. విప్లవపక్ష యభ్యర్థి నోడించుటకు బహుశః నా కెక్కువ సావకాశము లున్నవని యనుకొని మితవాదపక్షమువారు నన్ను పెట్టియుందురు. ఎన్నిక తేదీని నేను జారియాలోనే యుండినచో విధాయకముగా పనివాండ్రలో నొకడైన యభ్యర్థి కనుకూలముగా నా పేరు నుపసంహరించుకొనెడివాడను. క్రొత్తవానిని, పనివాండ్ర తెగకు చెందనివానిని అకస్మాత్తుగా నధ్యక్షపదవిలోనికి త్రోయుట నా కయుక్తముగా కాన్పించెను. భారతదేశములో ట్రేడు యూనియను యుద్యమము శైశవావస్థలో నున్నదనుట కిదియే చాలును.

1928 లేబరు తగాదాలతోను, సమ్మెలతోను నిండియుండెను. 1929 కూడ నట్లే వెళ్ళెను. ఈ సమ్మెలలో తీవ్రవాదులు, బొంబాయి నేతపనివాండ్రు నాయకత్వము వహించిరి. వంగదేశపు నారమిల్లు లలో పెద్ద సమ్మె జరిగెను. జెమ్షడ్‌పురపు యినుపపనులలోను, రైల్వేలలోను కూడ సమ్మెలు జరిగెను. జెమ్షడ్‌పురపు తగరపు పనులలో ననేకమాసము లొక ధైర్యమైన దీర్ఘపోరాటము జరిగెను. గొప్ప ప్రజా సానుభూతి యున్నను శక్తివంతమైన యా కంపెనీ పని వాండ్రను నిలిపివేసెను.

మొత్తముమీద రెండు సంవత్సరములును పారిశ్రామిక యసం తృప్తితో నిండియుండి లేబరుపరిస్థితు లధ్వాన్న మగుచుండెను. యుద్ధానంతర వత్సరములు హిందూదేశములో పరిశ్రమలకు పర్వదిన ములు. అమితమగు లాభములు సంపాదింపబడెను. అయిదారు సంవ త్సరములవరకు నారమిల్లులు లేక ప్రతిమిల్లులలో సాంవత్సరిక డివి

డెండులు నూటికి నూరు నూటయేబదికూడ మించిపోయెను. గొప్ప లాభములన్నియు యజమానులకు, వాటాదారులకు వెళ్ళెను. పని వాండ్రు యథాప్రకారముగ నేయుండిరి. సాధారణముగ కూలి యేమా త్రము హెచ్చినను ధరవరలలోను ఆ హెచ్చుయుండుటచే వారికది యథాప్రకారమే యయ్యెను. త్రుటికాలములో లక్షలకు లక్షలు లాభములు చేసికొనబడుచుండు యీ రోజులలోకూడ చాలమంది పని వాండ్రతిదరిద్రమగు గుడిసెలలో నివసించుచుండిరి. వారి స్త్రీలకు కట్ట వస్త్రములైనను లేకయుండెను. బొంబాయిలోని పరిస్థితులు దీనముగ నుండెను. కాని కలకత్తాలోని మహాసౌధాంతరసీమల కొక గంట ప్రయాణములోనున్న నారపనివాండ్రస్థితి మరింత యధ్వాన్నముగ నుండెను. అర్ధనగ్న శరీరులైన స్త్రీలు, యెట్టి సంస్కారము లేనివారు గ్లాస్గో, డండీలకు, భారతదేశములోని కొద్దిమంది కోటీశ్వరులకు నిరంతర ధనప్రవాహము పంపుటకే తృషితముకే పని చేయుచుండిరి.

పనివాండ్రదుస్థితిలోనేయుండి లాభమేమియు ననుభవింపక యున్నను లాభసాటి సంవత్సరములలో పరిశ్రమ కెంతమాత్రము లోటులేకుండెను. కాని యీ మంచిదినములు పోయి పెద్దలాభములను చేసికొనుట కంత సులభముకానపుడు భారమంతయు పనివాండ్ర మీదనే పడెను. వెనుకటి లాభములను మరచిపోయిరి. అవి తిని వేయబడెను. ఇప్పుడు లాభములు తగినంత రాకపోయినచో పరిశ్రమ లెట్లు సాగగలవు ? కనుక పారిశ్రామిక యసంతృప్తి, లేబరు కష్టములు ప్రభుత్వమును, యజమానులనుకూడ భయపెట్టిన బొంబాయిలోని యఖండ సమ్మెలు, లక్ష్యములలోను, సంఘటనములోను లేబరు యుద్యమము స్వశక్తిని గ్రహించుచు, తీవ్రము, యుపద్రవకరము నగు రూపములను దాల్చుచుండెను. రాజకీయోద్యమముకూడ తీవ్రముగా నభివృద్ధిచెందుచుండెను. ఈ రెండును సంబంధములేక ప్రత్యేకములే యైనను యివి కొంతవరకు జోడింపబడుచుండును. ప్రభుత్వ భవిష్యత్తు తృప్తికరముగ కాన్పించలేదు.

1929 మార్చి మాసములో ప్రభుత్వము విప్లవపక్ష ప్రధానులను నిర్బంధించి సక్రమమైన లేబరుసంస్థపై అకస్మాత్తుగాపడెను. బొంబాయి గిర్నీ కామ్‌ఘర్ యూనియను నాయకులను, వంగ, పంజాబు, సంయుక్తపరగణాలలోని నాయకులను నిర్బంధించిరి. వీరిలో కొందరు కమ్యూనిష్టులు, కొందరు వారికి చేరికయైనవారు, కొందరు కేవలము ట్రేడుయూనియనిష్టులు, నాలుగున్నర సంవత్సరములవరకు సాగింపబడిన ప్రఖ్యాత మీరటుకుట్రకేసు కిదియే ప్రారంభము.

మీరటు కేసు ముద్దాయిలతరపున మాతండ్రి యాధిపత్యమున నొక డిఫెన్సు కమిటీ యేర్పడెను. అందు డాక్టరు అన్సారీ మొదలగు కొంతమంది సభ్యులముగ నుంటిమి. మాపై కఠినమైనభారముపడెను. డబ్బు పోగుచేయు టంతసులభమైన పనికాదు. ధనవంతులకు సామ్యవాదులయెడల, కమ్యూనిష్టుల యెడల, లేబరు ఆందోళనపరులందు నెక్కువ సానుభూతిలేదు. లాయర్లు తమసేవకొరకు కెవరిరక్తమునో యొకరి రక్తమును పిండకతప్పదు. మా కమిటీలో కొందరు గొప్ప లాయర్లు మా తండ్రి మొదలగువారు కలరు. సలహా చెప్పుటకు, మామూలుగా మార్గముచూపుటకు వారెప్పుడును సిద్ధముగనేయుండిరి. దానివలన మా కంత ఖర్చులేదు. కాని, వారు మీరటులో నెలల కొలది యొకేసారి కూర్చొనజాలరు. మేము కలిసికొనిన యితర లాయర్లు యీ కేసును వీలున్నంతవరకు డబ్బుసంపాదించుట, కొక సాధనగా చూచుకొనిరి.

మీరటు కేసుకాక యం.యస్. రాయి మొదలగువారి డిఫెన్సు కమిటీలతో కూడ నాకు సంబంధముండెను. ప్రతిసందర్భములో నేను నా స్వంతవృత్తికి చెందినవారి ధనపిపాస కాశ్చర్యపడితిని. 1919 లోని మార్షల్‌లా రోజులలో మొట్టమొదట నాకిట్టియాశ్చర్యము కలిగెను. తనవృత్తిలో గొప్పపేరుపొందిన లాయరొకడు సైనికశాసనమున కాహుతియైనవారియొద్ద పూర్తిఫీజుకావలెనని రొక్కించెను. అది చాల హెచ్చుమొత్తము. వారిలో నొక తోడి లాయరుకూడ నుండెను. అతనికి ఫీజుచెల్లించుటకు వీరిలోచాలమంది యప్పుచేయవలసివచ్చెను.

లేదా ఆస్తి నమ్మివేసిరి. నా తరువాత యనుభవములు మరింత బాధకరముగనుండెను. మే మతిదర్రిద్రులైన పనివాండ్రనుండి డబ్బుడబ్బు చొప్పున వసూలుచేసి లాయర్లకు పెద్దపెద్ద చెక్కులను చెల్లించితిమి. అది నా కయిష్టముగనుండెను. ఇంతకు చేసిన పనియంతయు వ్యర్థముగ కాన్పించెను. రాజకీయ నేరము, లేబరు నేరము మనము వాదించినను, వాదింపకున్నను ఫలిత మొక్కటియే. మీరటు కేసు వంటి కేసులో ననేకసందర్భములనుబట్టి వాదము కావలెననుటలో సందేహము లేదు.

మీరటు డిఫెన్సు కమిటీకి ముద్దాయిలతో ననేకచిక్కులు తటస్థించెను. వీరిలో ననేకరకముల మనుష్యులుండిరి; డిఫెన్సువిధానములో ననేకరకములుండెను. వీరిలో సామరస్యమనునది యెంత మాత్రము లేకుండెను. కొన్ని నెలలయినతరువాత మేము క్రమమైన కమిటీని కట్టిపెట్టి వ్యక్తిగతముగా సహాయము చేయుచుండెడివారము; రాజకీయపరిస్థితులు మా దృష్టి నెక్కుడుగా నాకర్షించుచుండెను. 1930 లో మే మందరము జయిలులో నుంటిమి.

# 27

## ఆకాశములో నుఱుములు

1929 కాంగ్రెసు లాహోరులో జరుగనుండెను. పదివత్సరము లయినతరువాత నది తిరిగి పంజాబుకు వచ్చెను. ప్రజల మనస్సులు పదివత్సరములపూర్వపు 1919 నాటి సంభవములవైపు తిరిగెను. జలియనువాలాబాగు, అవమానభరితమైన సైనికశాసనము, అమృతసరపు కాంగ్రెసు, అసహాయోద్యమ ప్రారంభము – ఈ పది వత్సరములలో ననేకములు జరిగి, భారతదేశ వైఖరి మారిపోయెను. రాజకీయతీవ్రత హెచ్చుచుండెను. సంగ్రామవాతావరణము త్వరిత ముగా నభివృద్ధిగాంచుచుండెను. రాబోవు సంగ్రామఛాయలు దేశ ముపై బడెను. ఏ కొద్దిమందికో తప్ప అసెంబ్లీసభ, రాష్ట్రసభలు రుచింపకుండెను. నిరంకుశము, అధికారయుతము నగు ప్రభుత్వమున కొక వేషమువలెనుండి, యవి 'నిత్యవిధులను' జరుపుచుండెను. కొంతమందికిది భారతదేశపు 'పార్లమెంటు' సభ్యుల అలవెన్సులని చెప్పుకొనుట కొక సాకుగనుండెను. 1928 లో సైమనుకమిషను బహిష్కరణ తీర్మానమును చేయుటతో నసెంబ్లీసభ తుదిసారి ప్రజల నాకర్షించెను.

తరువాతకూడ ప్రభుత్వమునకు, నధ్యక్షునకు నొక పోరాటము జరిగెను. అసెంబ్లీ స్వరాజ్యపార్టీ యధ్యక్షుడైన విఠల్భాయిపటేలు స్వతంత్రుడగుటచే కోమల ప్రభుత్వగాత్రమున కొకముల్లువలెనుండెను. అతని రెక్కలను ఛేదించుటకు యత్నములు జరిగెను. ఇట్టి సంభవము లప్పుడప్పు డాకర్షించుచుండినను ప్రజాహృదయము బయటజరుగు విష యములపై కేంద్రీకరింపబడెను. మాతండ్రికి కౌన్సిలుపనితో పూర్తిగా ముఖము మొత్తెను. శాసనసభలవలన నా స్థితిలో నంతకంటె నెక్కు వేమియు లభింపజాలదను తన యభిప్రాయము నత డనేకసారులు వెల్లడించెను. అవకాశము దొరికినచో వాటినుండి బయటపడవలెనని యత డనుకొనుచుండెను. అతని బుద్ధి చట్టబద్ధము. అతడు న్యాయ

పద్ధతులకు, విధానమునకు నలవడెను. కాని భారతదేశములో చట్ట బద్ధమగు పద్ధతులనబడునట్టివి వ్యర్థములనియు నిరుపయోగములనియు నతడు పరిస్థితుల ప్రాబల్యముచే కనుగొనెను. భారతదేశములో చట్టమే లేదనియు, ఆర్డినెన్సులు మొదలగువాని రూపములో నొక వ్యక్తి యిచ్ఛానుసారముగనో లేక నొక నిరంకుశవర్గము యిచ్ఛ ననుసరించియో, న్యాయము లకస్మాత్తుగా గారడివాని టోపీలోనుండి యూడిపడు మెముకలవలె పుట్టుచుండునపుడు న్యాయపరిపాలనయే లేదనియు నతడు తన న్యాయబుద్ధికి నచ్చ చెప్పుకొనుచుండును. ఆచారములచేత, స్వభావముచేత నతడు విప్లవకారు డెంతమాత్రము కాడు. మధ్యతరగతి ప్రజాస్వామిక మనునది యున్నచో నతడు విధాయికముగా నట్టిచట్టమునకు మూలవిరాట్టువలె నుండెడివాడు. కాని పరిస్థితులనుబట్టి భారతదేశములో బూటకపు పార్లమెంటు నాటకముతో చట్టబద్ధమగు నాందోళన జరిపెదమను భాష యతని కంతకంతకు కోపము కలిగించుచుండెను.

కలకత్తాకాంగ్రెసులో వహించిన పాత్రకుమినహా గాంధీజీ రాజకీయములకు దూరముగనేయుండెను. కాని పరిస్థితు లతని కెప్పటి కప్పుడు ద్యోతకమగుచునేయుండెను. కాంగ్రెసునాయకు లతనిసలహా తఱచు తీసికొనుచునేయుండిరి. కొన్నివత్సరములనుండి యతనిప్రధాన కార్యక్రమము ఖాదీప్రచారము. ఈ లక్ష్యముతో నతడు యావద్భా రతము విశేషసంచారము గావించెను. అతడు వరుసగా ప్రతిరాష్ట్ర మునకు పోయి ప్రతిజిల్లాను, యేమాత్రమైనను పేరుగల ప్రతిపట్ట ణమును, మారుమూలలనున్న గ్రామసీమలను చూచెను. ప్రతిచోట వేలు, లక్షలు జనము నత డాకర్షించెను. అతనిప్రణాళికను నడుపు టకు ముందుగా ననేకమంది పనిచేయవలసివచ్చెను. ఈవిధముగా నత డనేకసారులు భారతదేశమును తిరిగి దక్షిణమున కన్యకుమారి మొదలు యుత్తరమున హిమాచలమువరకు, తూర్పుకనుమలు మొదలు పశ్చిమ సముద్రమువరకు గల విశాల భారతదేశమున ప్రతి

చిన్న ప్రాంతమును చూచెను. అతనివలె భారతదేశమును మానవ మాత్రుడెవడు తిరిగియుండలేదని నా యభిప్రాయము.

పూర్వకాలమున దిమ్మరీడులగు యాత్రీకులు నిరంతరము ప్రయాణము చేయుచుండెడివారు. కానివారి ప్రయాణసాధనము లతి మందములగుటచే యావజ్జీవముచేసిన ప్రయాణములు రైలుమీద, మోటారుమీద చేయు నొక సంవత్సర ప్రయాణముకు సరికావు. గాంధీజీ రైలుమీద, మోటారుమీద వెళ్ళుటయేగాక కాలినడక గూడ సాగించెను. ఈ విధముగా నతడు భారతదేశముయొక్క నసమాన జ్ఞానము సంపాదించెను. కోట్లకొలది ప్రజ లతనిని చూచి యతనితో స్వయముగా సంపర్కము కలిగించుకొనిరి.

1928 మండువేసవిలో నతడు సంయుక్తపరగణాలకు ఖాదీ ప్రచారమునకు వచ్చి యనేక వారము లచ్చట సంచారముచేసెను. నే నతనితో నప్పుడప్పుడు కొద్దిరోజులు వెళ్ళెడివాడను. ఇదివరకు నా కనుభవమున్నను నే నత డాకర్షించు మానవసముద్రమును చూచి యాశ్చర్యపడెడివాడను. గోరకపూర్వంటి తూర్పుజిల్లాలలో నిది మరింత యద్భుతమయ్యెను. ఆ జనసమూహము మిడుతల దండు వలె నుండును. మేము గ్రామసీమలలో తిరుగునపుడు ప్రతి కొద్ది మైళ్ళకు పదివేలు, పాతిక వేలు జేరుచుండెడివారు. ఆ రోజులలోని ప్రధానసభకు లక్షమందిపైగా వచ్చెడివారు. ఏ కొద్ది పట్టణముల లోనోతప్ప దూరశ్రవణ యంత్రములు లేవు. ఇంతమందికి వినిపించు టసాధ్యము. బహుశః వారేమియు వినుటకు రాలేదు. 'మహా త్ముని' చూచుటతో వారు సంతోషించెదరు. గాంధీజీ సాధారణ ముగ అనవసర శ్రమలేకుండ కొద్దిగనే మాట్లాడెడివాడు. లేనిచో గంటలకొలది రోజులకొలది నీ పద్ధతిని నడుపుట దుస్సాధ్యము.

యు. పి. ప్రచారమంతట నే నతనితో నుండలేదు. నావలన నతనికి ప్రత్యేక ప్రయోజన మేమియు లేదు. నేను ప్రయాణము చేయు పార్టీసంఖ్యను పెంచుటలో నర్థములేదు. సమూహములలో నుండుటకు నా కభ్యంతరములేదు. కాని త్రోపులను పడుటకు,

రాపుడు ననుభవించుటకు, కాళ్లు నలుగగొట్టించుకొనుటకు, తగినంత యుత్సాహము కాన్పించదు. నాకు చేయవలసిన యితరపని యెంతయో యుండెను. అది రాజకీయపరిస్థితులు విషమించుచున్న సమయము. వానితో పోల్చిన నాకు స్వల్పవిషయముగా కాన్పించిన ఖాదీకి బంధింపబడియుండుట నా కిష్టములేదు. కొంతవరకు నేను గాంధీజీయొక్క, రాజకీయములకు సంబంధించిన మధ్యే మధ్యే వ్యాపారములకు, కోపము వెలిబుచ్చెడి వాడను. అతనియాలోచన వెనుక నున్న పునాది నా కెన్నటికి నర్థముకాలేదు. ఆ రోజులలో నతడు ఖాదీపనికొరకు ధనము వసూలు చేయుచుండెను. దరిద్రనారాయణుల కొరకు 'దరిద్రులయొక్క నారాయణుడని' లేక 'దరిద్రులలో నివసించెడి నారాయణుని' కొరకు డబ్బు కావలెనని యతడు తరచు చెప్పుచుండెడివాడు. దానిని గృహపరిశ్రమలకు వినియోగించి బీదలకు పనికల్పించుట కతడుద్దేశించెను. కాని యీ పదము వెనుక దారిద్ర్యమును కీర్తించు భావము కాన్పించును. భగవంతుడు ప్రత్యేకముగ దరిద్రులకు ప్రభువు. వారతని ముద్దుబిడ్డలు. ప్రతిచోట సాధారణముగ నుండు మతదృష్టి యిదియే యని నేను భావించెదను. నేను దీనిని మెచ్చుకొనజాలను. నాదృష్టిలో దారిద్ర్య మసహ్యమైనది. దానితో పోరి దానిని చీల్చి చెండాడవలసినదేకాని దాని నెంతమాత్రము ప్రోత్సహింపరాదు. ఈ దృష్టి విధాయకముగ దారిద్ర్యమును సహించి దాని నుత్పత్తి చేసిన పద్ధతిపై దాడితీయును. దీనికి సిద్ధపడినవారేదోవిధముగ దానిని సమర్థించ జూతురు. వారు లేమిని దారిద్ర్యమును చూడగలుగుదురు. కాని జీవితావసరములలో పుష్కలముగా నిండియుండు ప్రపంచచిత్రమును చూడజాలరు. బహుశః వారి ప్రకారము బీదసాద లెప్పుడు మనలో నుందురు.

గాంధీతో దీనిని గురించి నే నెప్పుడు చర్చించినను అతడు ధనవంతులు తమధనమును ప్రజల ధర్మనిధిగా భావింపవలెనను. ఇది యెప్పుడో తాతలనాటి దృష్టి. దీనిని మనము తరచుగా హిందూదేశములోను మధ్యయుగపు యూరపులోను చూచెదము.

ఇట్లు జరుగుట సంభవమని, సాంఘిక సమస్యను పరిష్కరించుట కిదియే విధమని సహేతుకముగా మనమెట్లు భావింపగలమో నా కెంత మాత్రము నర్థముకాలేదు. అసెంబ్లీసభ నేను పైన చెప్పినట్లు నిద్ర మత్తు వ్యాపారమగుచుండెను. దాని నిప్పచ్చర వ్యాపారములో నెవరును శ్రద్ధవహించుట లేదు. భగవత్సింగు, బి. కె. దత్తులు ప్రేక్షకుల గేలరీలనుండి రెండు బాంబులను అసెంబ్లీహాలు నేలమీదకు విసిరినపుడది యొకనాడు దద్దరిల్లెను. ఎవరికి గట్టిదెబ్బలు తగులలేదు. బహుశః ముద్దాయిలు తరువాత చెప్పినట్లు, ఆ బాంబుల చప్పుడు చేయుటకు, కదలిక కలిగించుటకు నుద్దేశింపబడెను, కాని బాధించుట కుద్దేశింపబడలేదు.

అట్లే యసెంబ్లీలోను బయటకు వారు కదలికను కలిగించిరి. టెర్రరిష్టుల యితరచర్య లింత నిరుద్రవకరముగ లేవు. లాలాలజపతి రాయిని కొట్టిన యింగ్లీషు పోలీసుఆఫీసరును లాహోరులో వేల్చి చంపిరి. వంగదేశములోను, ఇతరచోట్లను టెర్రరిష్టుచర్యలు తిరిగి తలయెత్తినట్లు కాన్పించెను. కుట్రనేరము లనేకులపై మోపబడెను. డిటెన్యూలసంఖ్య త్వరలో హెచ్చిపోయెను. లాహోరు కుట్రకేసులో కోర్టులో పోలీసులచే నసాధారణ రంగములు ప్రదర్శింపబడెను. దీని వలన నీ కేసు ప్రజాహృదయమును చాలవర కాకర్షించెను. కోర్టు లోను, ఖయిదులోను తమయెడల చూపబడిన యవమానుషములను నిరసించుటకు చాలమంది ఖయిదీలు నిరశనదీక్షబూనిరి. అది యెట్లు ప్రారంభమయ్యెనో నాకు జ్ఞప్తిలేదు; కాని చివర కీ సమస్య ఖయిదీలపట్ల ముఖ్యముగా, రాజకీయఖయిదీలపట్ల చూపబడు యమానుష సమస్యగా తేలెను. ఈ నిరశనదీక్ష వారములకొలది సాగుచు దేశములో నుద్రేకము కలిగించెను. ముద్దాయిల శరీరదుర్బలతచే వారిని కోర్టుకుతీసికొనిపోవుటకు వీలులేకుండెను. విచారణలకు తఱచు వాయిదాలుపడుచుండెను. అందుచే భారతప్రభుత్వము ముద్దాయిలు, వారి తరపు ప్లీడర్లు యక్కరలేకుండగనే కోర్టువిచారణ జరుపవచ్చునను

శాసనమును ప్రవేశపెట్టెను. ఖయిదులో చూపబడవలసిన విధాన మునుకూడ వారే యోచించవలెను.

నిరశనదీక్ష మాసము జరిగెను. నేను లాహోరులో నుండుట సంభవించెను. ఖయిదులోనున్న కొంతమందిని చూచుటకు నా కనుజ్ఞ యిచ్చుటచే నే నా యవకాశము వినియోగించుకొంటిని. నేను భగత్సింగును చూచుట కదియే మొదటి పర్యాయము. జతీన్‌దాసు మొదలగువారిని చూచితిని. వారందరు చాల దుర్బలముగనుండి మంచము పట్టిరి. వారితో నెక్కువగా మాట్లాడుటకు వీలులేకుండెను. భగత్సింగు ముఖకమల మతిప్రసన్నముగ, బుద్ధివైశద్యము ప్రకటించునదిగ, నతి నిర్మలముగ, ప్రశాంతముగ నుండెను. అందులో క్రోధమెంతమాత్రము కాన్పించుటలేదు. అత డతిసాధువు. అతి సాధువుగ మాట్లాడెను. కాని నెలరోజులనుండి యుపవసించువా డాధ్యాత్మికముగ, శాంతముగ కాన్పించు ననుకొనెదను. జతీన్‌దాసు మరింత శాంతముగ, సుకుమారబాలికవలె మార్దవముగ, సాధువుగ కాన్పించెను. నేను చూచినపు డతడమిత బాధపడుచుండెను. తరువాత నతడు యుపవాసఫలితముగ నరువదియొకటవ దినమున దివంగతుడయ్యెను. 1907 లో లాలాలజపతిరాయితో ప్రవాసమున కంపబడిన తన పినతండ్రియగు సర్దారు అజిత్సింగును చూడవలెనని లేదా యతని వార్తనైన వినవలెనని భగత్సింగు తపించుచున్నట్లు కాన్పించును. అనేక వత్సరము లతడు విదేశములలో ప్రవాసిగా నుండెను. అతడు దక్షిణమెరికాలో స్థిరవాసర మేర్పరచుకొనినట్లు స్పష్టముగు రిపోర్టులుకలవు. కాని యతనినిగురించి నిజమేదియు తెలియునని నే ననుకొనను. అతడు జీవించినది లేనిది కూడ తెలియదు.

జతీన్‌దాసు మృత్యువు దేశమంతట నుద్రేకము కలుగజేసెను. అది రాజకీయ ఖయిదీల నెట్లుచూడవలెనను సమస్యను ముందుకు తీసికొనివచ్చెను. ఈ విషయమునుగురించి యోచించుట కొక కమిటీ ప్రభుత్వముచే నియమింపబడెను. ఈ కమిటీచర్చల ఫలితముగా ఖయిదీలను మూడు తరగతులుగా విభజించు క్రొత్తసూత్రములు సృజింపబడెను. స్థితిగతులను చక్కబరచుట కేర్పడిన యీ క్రొత్తసూత్ర

ముల వలన లాభమేమియు లేకపోయెను. స్థితిగతు లెప్పటివలెనే యత్యంత యసంతృప్తిగ నుండెను.

గ్రీష్మ, వర్షఋతువులు క్రమముగ నాకురాలుకాలములోనికి జొరబడినతోడనే రాష్ట్రకాంగ్రెసు కమిటీలు లాహోరుకాంగ్రెసు ప్రెసిడెంటు నెన్నుకొను సన్నాహములో నుండెను. ఈ యెన్నిక దీర్ఘ కాలము పట్టుచు ఆగష్టు లగాయతు అక్టోబరువరకు జరుగుచుండెను. 1929 లో గాంధీజీ ఐక్యకంఠముతో నధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. రెండవసారి యతనిని కాంగ్రెసు అధ్యక్షునిగా నుంచుటలో కాంగ్రెసు యధికారపరంపరలలో నతనికి మరింతయౌన్నత్యమేదియు గలుగదు. చాలవత్సరములనుండి యత డధ్యక్షాతీతుడుగ నుండెను. పోరాటము సన్నిహితముగా నుండుటచే దాని నతడు నడిపింపక తప్పదు. కనుక నీ సమయమున కాంగ్రెసు కతడే యధ్యక్షుడుగా నుండుట మంచిదని సాధారణముగా భావింపబడెను. ఇంతేగాక నధ్యక్షతకు తగినంత పేరుప్రఖ్యాతులు కలవాడు మరియొకడు లేడు.

కనుక రాష్ట్రకమిటీలు గాంధీజీని యధ్యక్షునిగా సూచించెను. కాని యతడు దానిని తిరస్కరించెను. అతడు గట్టిగా వలదని చెప్పినను అతనితో వాదించి యొప్పించవచ్చునను యాశ కాన్పించెను. తుదిపరిష్కారము చేయుటకు లక్నోలో అ. భా. కాం. కమిటీసభ జరిగెను. చివరనిమిషమువరకు నత డొప్పుకొనుననియే మే మంద రము భావించితిమి. అత డెంతమాత్రము నిచ్చగింపక చివరనిమిషములో నా పేరు సూచించెను. అతని తుదితిరస్కారమునకు అ. భా. కాం. కమిటీ తెల్లబోయి యిట్టిచిక్కుస్థితికి తేబడినందుకు కొంత యాగ్రహము పొందెను. ఎవరు దొరకనందున వైరాగ్యము చెంది చివరకు నన్నే యెన్నుకొనిరి.

ఆ యెన్నికచే నాకు కలిగిన చికాకు, హైన్యభావము నా కెన్నడు కలుగలేదు. నాకు గలిగిన గౌరవమును నేనుగుర్తింపకపోలేదు. అది యసామాన్య గౌరవము. మామూలు పద్ధతిగా నెన్ను కొనబడినచో నే నానందించెడివాడను. నేను సింహద్వారమున రాలేదు. ప్రక్క గుమ్మమునైననురాలేదు. అకస్మాత్తుగా నే నొక

దిడ్డివాకిలినుండి యూడిపడి సభ్యులు నివ్వెరపడి యొప్పుకొనునట్లు చేసితిని. వారు గంభీరవదనముతో దానిని కప్పిపుచ్చి తప్పునిసరియగు మాత్రవలె నన్ను దిగమ్రింగిరి. నా యభిమానమున కిదియొక చురక వలెనుండి నేనీ గౌరవమును తిరిగి యిచ్చివేయవలె ననుకొంటిని. అదృష్టవశాత్తు నేనట్లు వెలితికాకుండ నిరోధించుకొని విచార హృదయముతో మెల్లగా జారితిని.

బహుశః యీ నిశ్చయమునకు మా తండ్రి పరమానంద భరితుడయ్యెను. నా రాజకీయము లతనికి పూర్తిగా గిట్టవు. కాని యతడు నన్నెక్కుడుగ ప్రేమించుటచే నా కేమంచి సంభవించిన నత డానందపడుచుండును. తఅచుగా నతడు నన్ను విమర్శించుచు నాతో కొంచెము కటువుగా మాట్లాడును. కాని మర్యాద దక్కించుకొన దలచువాడెవడు నతనిసమక్షమున నన్ను దూషింపజాలడు.

నా యెన్నిక నా కొక గొప్ప గౌరవమును, గొప్ప బాధ్యతను తెచ్చిపెట్టెను. తండ్రి వెనుక నే కుమారు డధ్యక్షపీఠమునకు వచ్చుట సామాన్యవిషయము. కాంగ్రెసు అధ్యక్షులలో నే నందరికంటె పిన్నవయస్కుడనని తఅచు చెప్పబడుచుండెను. ఇది నిజముకాదు. గోఖ్లేకును నదియే వయస్సని నే ననుకొనెదను. మౌలానా అబుల్ కలాం అజాదు నలుబది వత్సరములలోపుననే యధ్యక్షుడయ్యెను. గోఖ్లే ముప్పది వత్సరములు నిండినతోడనే పెద్ద రాజకీయవేత్తలలో నొకడుగా పరిగణింపబడెను. అబుల్ కలాం అజాదు తనవిశేషపాండిత్యా నుగ్గడించుటకు తగిన పూజ్యవయోదృష్టిని సాధించెను. రాజకీయ విశారదత్వము నా గుణములలో నొకటిగా నెప్పుడు పరిగణింపబడలేదు. విశేషపాండిత్యము కలదని నన్నెవరు దూషింపలేదు. కనుక నాతల నెరసినను, దృష్టిదోషమబ్బినను వయసుమీరినవాడనను నింద నాకు తప్పిపోయెను.

లాహోరు కాంగ్రెసు సమీపించెను. ఈ లోపల పరిస్థితులు వానిలోనున్న యంతశ్శక్తులచే ప్రచలితమగుచు క్రమముగా ముందుకు పరుగిడుచుండెను. వ్యక్తులు తా మెంత పటాటోపము బూనినను చాల యల్పమైన పాత్రనే వహింపగలరు. నిర్దాక్షిణ్యాముగ చలిచలి

ముందుకుబోవు మహాయంత్రములో మన యొక యల్పభాగ మను భావము తోచుచుండెను. విధిప్రేరితమగు నిట్టి ప్రవాహాభివృద్ధి నరికట్ట తలంచి ప్రభుత్వమువా రొకయడుగు ముందుకువేసిరి. వైస్రాయియైన ఇర్విన్ ప్రభువు, రౌండుటేబిలు సమావేశము జరుగనున్నదను నొక ప్రకటన గావించెను. ఆ ప్రకటన వలలో పడవేయుటకు దగిన పదజాల ముతో నిండియుండెను. దానికెంత యర్థమునైనను చెప్పుకొనవచ్చును. లేదా యది శుష్కముగావచ్చును. రెండవ యర్థమే న్యాయమని మాలో చాలమంది యనుకొంటిమి. ఒకవేళ దానిలో నేదియైన యున్నను అది మనము కోరుదానికి దగ్గరకాదు. వైస్రాయి ప్రకటన జరిగినదో, లేదో యప్పుడే 'కొంపమునిగిపోయినట్లు' ఢిల్లీలో 'నాయ కులసభ' యొకటి యేర్పాటు గావింపబడెను. అన్నివర్గముల మను ష్యులకు యాహ్వానము లంపబడెను. గాంధీజీ, మోతిలాల్జీ, విఠల్‌భాయి పటేల్ (యింకను అసెంబ్లీ యధ్యక్షుడు) గార్లును, తేజబహాదరు సప్రూవంటి మితవాద నాయకులు మొదలగు నితరులు నచ్చట నుండిరి. కొన్ని షరతులకు లోబడి వైస్రాయిప్రకటన నంగీకరించుట కొక సమిష్టి తీర్మానము గావించుకొనబడెను. ఇవి చాల ప్రధానమైన వనియు ముఖ్యముగా నెరవేర్పబడవలయు ననియు జెప్పబడెను. ప్రభుత్వ మీ షరతుల కొప్పుకొననిచో తోడ్పాటుగావింపబడుననిరి. ఈషరతులు * చాలగట్టివి. వీటివలన నెంతయో భేదము కలిగెడిది.

మితవాద యతివాద పక్ష ప్రతినిధులందరు నిట్టి తీర్మానమున కంగీకరించు టొకవిజయము. కాంగ్రెసు కిది యొకపతనము. సామా

---

* ఈ షరతు లేవియనిన :

1. జరుగబోవు కాన్ఫరెన్సులో జరుపబడు చర్చలన్నియు భారతదేశ మునకు సంపూర్ణ డొమినియను పరిపాలన పునాదిమీదనే యుండవలెను.

2. కాన్ఫరెన్సులో కాంగ్రెసువారి ప్రాతినిధ్య మెక్కువగా నుండవలెను.

3. రాజకీయ ఖయిదీల నందరిని విడిచిపెట్టవలెను.

4. ప్రస్తుత పరిస్థితులలో సాధ్యమగునంతవరకు నిప్పటినుండియు భారత ప్రభుత్వము డొమినియను ప్రభుత్వ పద్ధతులమీదనే నిర్వహింపబడవలెను.

న్యాంగీకార ప్రమాణదృష్టిలో నిది ఘనమైనది. కాని యిందులో నొకయుచ్చు అమర్చబడినది. ఈ షరతు లర్థమును రెండు దృక్పథములతో చూడబడెను. కాంగ్రెసువారు వీనిని ప్రధానముగా నెంచిరి. ఇవి నెరవేరనిచో తోడ్పాటు యసంభవమనిరి. వారి కవి కనీసపుకోరికలు; తరువాత జరిగిన కాంగ్రెసువర్కింగుకమిటీ మీటింగులో నిది స్పష్టము చేయబడెను. అందులో నిదియైనను ముందు కాంగ్రెసు జరుగబోవు తేదీలోపల జరుగవలెననిరి. మిత వాదులకవి గరిష్టకోరికలు. వారు వాటి నట్లుప్రకటించెదరేకాని యవి ప్రసాదింపబడనిచో తోడ్పాటు నిరాకరింతుమనుపట్టుదల లేదు. ప్రధానములని చెప్పబడుచున్నను వారిషరతులు నిజముగా షర తులుకావు.

కనుకనే తరువాత మేమందరము జయిళ్ళలో నుండగా, నీ షరతులలో నేదియు నెరవేర్చకపోయినను, మమ్ముల ననేకమందిని జయిళ్ళలో నింపియుంచినను, మా జయిలుకు మన మితవాద, రెస్పాన్సివిష్టుమిత్రులు సంపూర్ణ సహకారము గావించిరి.

ఇట్లుజరుగునని మాలో చాలమందిమి యనుకొంటిమి. కాని యీ సమిష్టికార్యమువలన కాంగ్రెసువారెట్లు కొంతవరకు నిరోధము చూపగలిగిరో యట్లే లిబరలుపక్షమువారు తదితరులు నెట్టిపరిస్థితుల లోనైనను విచక్షణరహితముగా ప్రభుత్వమునకుచేయు సహకారతత్వ మును కొంతవరకు మార్చుకొనెదరనునాశ కొంతయుండెడిది. ఈ రాజీ తీర్మానమున కెంతమాత్రము నిష్టపడని మాలో కొందరము మా కాంగ్రెసులో నెట్టిచీలికలు కలుగకుండుటకే దీని కంగీకరించితిమి. మహాసంగ్రామమురానున్న తరుణమున కాంగ్రెసులో చీలికలను ప్రోత్స హింపజాలము. ప్రభుత్వము మనషరతుల కొప్పుకొనదనుసంగతి సువిదితం కనుక నిది మనస్థితిని బలపరచి మనలోని కుడిపక్షమువారిని మనవైపు త్రిప్పుకొనుట కతిసులభమైనపద్ధతి. కొద్దివారములలో నంతయు తేలి పోవనున్నది. డిసెంబరుమాసము, లాహోరు కాంగ్రెసు సమీపించెను.

అయినను మాలో కొంతమంది కా సమిష్టిప్రకటన చేసు మాత్రవలె నుండెను. స్వాతంత్ర్యవాంఛను భావములోనైన కొంచెము సేపైన విరమించుట పొరబాటు, యుపద్రవకరము. అనగా ఏది యుక్తికి సంబంధించినది. అది బేరమాడదగినదిగా తలంపబడెనుగాని ప్రధాన మైనది యనియు నదిలేనిదే మన మెప్పుడు తృప్తినొందజాలమనియు తలంపబడలేదు. కనుక నేను సందేహించి ప్రకటనమీద సంతకము చేయలేదు. (సుబాసుబోసు చేయనని ఖండితముగా చెప్పెను) కాని నేను మెత్తపడితిని. ఐనను నేను చాల బాధతో వచ్చి మరునాడే నా కాంగ్రెసుయధ్యక్షతకు రాజీనామా యివ్వ సంకల్పించితిని. నే నీ సంగతి గాంధీజీకి తెల్పితిని. గాంధీజీయొక్క యోదార్పు యుత్తరము మూడుదినముల తీవ్రయోచన నన్ను శాంతపరచెను.

లాహోరుకాంగ్రెసుకు కొంచెముముందు ప్రభుత్వముకు కాంగ్రెసుకుమధ్య సమాధానముకు కడపటి యత్నము జరిగెను. వైస్రాయి ఇర్విను ప్రభువుతో సమావేశ మేర్పాటుచేయబడెను. ఈ సమావేశకారకులెవరో నాకు తెలియదు, కాని విఠల్‌భాయిపటేలు ప్రధానకారకుడని నే నూహించెదను. కాంగ్రెసు దృక్పథమును తెల్పుటకు గాంధీజీ, మా తండ్రి యుండిరి. జిన్నా, సర్ తేజబహ దరుసప్రూ, విఠల్‌భాయిపటేలుగార్లు కూడ నుండిరి. చివరకు సమా వేశమువలన నేమియు జరుగలేదు. వారికి సామ్యమెచ్చుట లేకుండెను. ప్రధానపక్షములైన కాంగ్రెసు ప్రభుత్వములమధ్య నెంతయో దూర ముండెను. కనుక కాంగ్రెసు కిక ముందుకుపోవుటొక్కటే మార్గము. కలకత్తాలో నిచ్చిన సంవత్సరగడువు గతించుచుండెను. కాంగ్రెసు లక్ష్యము స్వాతంత్ర్యమని శాశ్వతముగా ప్రకటింపవలెను. దానిని సాధించుటకు తగుపోరాటయత్నములను గావింపవలెను.

లాహోరుకాంగ్రెసుకుముందు తుదివారములో మరియొక రంగములో నేనొక ముఖ్యవిధిని నెరవేర్చవలసి యుండెను. అఖిల భారత ట్రేడు యూనియను కాంగ్రెసు నాగపురములో జరుగు

చుండెను; నేను దాని కధ్యక్షతవహింపవలసియుండెను. ఒకేవ్యక్తి కొద్దివారముల గడవులో జాతీయకాంగ్రెసుకు, ట్రేడు యూనియను కాంగ్రెసుకు నధ్యక్షతవహించుట యసాధారణ విషయము. నే నీ రెండుసంస్థలకు మధ్య సంధానకర్తగనుండి యొకరి నొకరిదరి జేర్చ వలెనని యాశించితిని. జాతీయకాంగ్రెసును మరింత సామ్యవాదపర ముగ, మరింత బీదలపరము, సక్రమమైన కట్టుదిట్టములుగల లేబరును జాతీయపోరాటములో జేరునట్లు చేయవలెనని యాశించితిని. బహుశః యీయాస పడియాస. జాతీయత జాతీయతగా నుండుట మానవుడే సామ్యవాదపరముగ బీదలపరముగ నుండగలదు. కాని జాతీయ కాంగ్రెసుయొక్క దృక్పథ మెంత ధనాఢ్యులపరముగనున్నను దేశములో విప్లవశక్తి చూపగల పటుత్వపక్ష మది యొక్కటియేయని నేను గ్రహించితిని. కనుక లేబరు దానికి తోడ్పడవలెను. అది తన వ్యక్తిత్వమును, యాశయములను స్పష్టముగ కట్టుదిట్టముగ నుంచు కొని కాంగ్రెసుతో సహకార మొనర్చి దానిపై పలుకుబడి సంపా దించవలెను. పరిస్థితులు, ప్రత్యక్షకార్యములో పాల్గొనుట విధాయిక ముగ కాంగ్రెసునే మరింత విప్లవయాశయములకు, సాంఘిక, ఆర్థిక సమస్యలకు తరుమునని నే నాశించితిని. ఈమధ్య కొద్దివత్సరముల నుండి కాంగ్రెసు రైతుకు గ్రామమునకు సుముఖముగా వృద్ధిచెందు చుండెను. ఈ యభివృద్ధియే సాగుచుండినయెడల నది కొంతకాల ములో గొప్ప రైతుసంస్థ కాగలదు. లేదా రైతులప్రాబల్యముగల యొక సంస్థ కాగలదు. మా యు. పి. జిల్లా కాంగ్రెసుకమిటీలలో నాయకత్వము మధ్యతరగతి విద్యాధికులచేతులలోనున్నను నిది వరకే రైతు ప్రాతినిధ్యము బలీయముగ నుండెను.

ఈవిధముగా గ్రామమునకు పట్టణమునకు నిరంతర పోరాట మున కవకాశముండెను. జాతీయకాంగ్రెసుకు ట్రే. యూ. కాంగ్రె సుకు గల సంబంధ మీ పోరాటముపై నాధారపడియుండును. కాని యిది యిప్పటిసంగతికాదు. ప్రస్తుతము జాతీయకాంగ్రెసు మధ్య

తరగతులవారిచే నడుపబడుచు పట్టణముల వశములో నుండెను. భారతస్వాతంత్ర్యసమస్య తేలసంతవరకు దానిని జాతీయతయే రాజ్యముచేయును. జాతీయభావమే దేశములో నత్యంత శక్తివంత మైనది కాగలదు. అయినను కాంగ్రెసును క్రమశిక్షణగల లేబరుసమీపమునకు తెచ్చుట యావశ్యకముగా నాకు తోచెను. యు. పి. లో మేము రాష్ట్ర ట్రే. యూ. కాం. శాఖనుండి రాష్ట్రకాంగ్రెసుకమిటీకి ప్రతినిధులనుకూడా నాహ్వానించితిమి. చాలమంది కాంగ్రెసునాయకులు లేబరువ్యవహారములలో ముఖ్యపాత్రవహించిరి. కాని లేబరులోని యతివాదులు జాతీయకాంగ్రెసుపట్ల విముఖముగ నుండిరి. వారు దానినాయకులను నమ్మకుండిరి. దాని యాశయములు ధనాఢ్యులవనియు, నభివృద్ధి నరికట్టుననియు వారు భావించిరి. కాంగ్రెసు జాతీయసంస్థ.

1929 లో భారతదేశములోని ట్రేడుయూనియనులు విట్లీకమిషను యను లేబరు రాయల్ కమిషనుసమస్యమీద నాందోళనపడసాగెను. ఎడమపక్షమువారు దానిని బహిష్కరింపవలెననిరి. కుడిపక్షమువారు సహకారముచేయవలెననిరి. కుడిపక్షములోని నాయకులకు కొందర కందులో సభ్యత్వమునిచ్చుటచే స్వార్థము పనిచేసెను. ఈ విషయములో, యనేక యితర విషయములలోవలె, నా సానుభూతి యెడమపక్షమువైపున యుండెను. మనము ప్రత్యక్షపోరాటమును జరుపుచున్న సమయమున లేక జరుపనున్న సమయమున ప్రభుత్వ కమిషనులతో సహకారముచేయుట విరుద్ధముగ కాన్పించెను.

నాగపుర ట్రే. యూ. కాంగ్రెసులో విట్లీకమిషను బహిష్కరణసమస్యయే ప్రధానసమస్య. దీనిలోను, వివాదములోనున్న యితరవిషయములలోను యెడమపక్షమువారికే విజయము కలిగెను. ఈ కాంగ్రెసులో నేను చాల యప్రధానుడను. లేబరురంగములోనికి క్రొత్తగా వచ్చినవాడనగుటచే నేను తడవుకొనుచు సందేహించుచుంటిని. సాధారణముగా నే నతివాదులకు సుముఖముగనే

నా యభిప్రాయములను ప్రకటించితిని. కాని నే నెవరితోను కలిసి పోకుండ నిష్పక్షపాతమైన యుపన్యాసకునివలె నుంటిని. కాని శాసించు యధ్యక్షునివలె నుండలేదు. ట్రే. యూ. కాం. విభజనమును, క్రొత్త మితవాదసంస్థను నిర్మించుటను నే నొక ప్రేక్షకునివలె చూచుచుంటిని. కుడిపక్షములవారు విడిపోవుట యుక్తముకాదని నేను భావించితిని. యెడమపక్షనాయకులు కొందరు వారిని త్వరితపరచి విడిచిపోవుట కన్ని సాకులకు నాస్కారమిచ్చిరి. ఈ రెండుపక్షములకు మధ్య నొకపెద్ద మధ్యపక్ష మసహాయముగ నుండెను. బహుశః సరియైన నాయకత్వ మున్నచో వారీ యిరుపక్షములవారిని నిరోధించి ట్రే. యూ. కాం. విడిపోకుండ చేయగలిగెడివారు. ఒకవేళ విడిపోవుటయే తటస్థించినను యంతటి దుష్ఫలితము లుండెడివికావు.

కనుక భారతదేశములో ట్రేడుయూనియను యుద్యమమునకు గొప్ప నష్టము సంభవించి యది యిప్పటికిని కోల్కొనలేదు. ప్రభుత్వ మిదివరకే లేబరుయుద్యమములోని యతివాదపక్షముల మీద ధ్వజమెత్తెను. దాని ప్రథమఫలితమే మీరటుకేసు. ఇది సాగుచునే యుండెను. యజమానులు కూడ తమ లాభములకొరకు పోరుట కిదియే సమయమనుకొనిరి. 1929-30 శీతాకాలములో ప్రపంచ ఆర్థికమాంద్యము ప్రవేశించెను. ఒకవంక దీనిచే బాధ పడుచు, నన్నివైపులనుండియు పోట్లుపడుచు, ట్రేడుయూనియను అతిదీనస్థితిలోనుండ, భారతపనివాండ్రస్థితి చాల దుర్భరముగ నుండెను. వారిస్థితి నానాటికి దిగజారుచుండ, చేయునదిలేక వా రసహాయులై చూచుచుండిరి. ట్రే. యూ. కాం. లో మరియొకటి రెండువత్సరములలో మరియొకచీలిక బయలుదేరెను. ఈవిధముగా హిందూదేశములో సిద్ధాంతరీత్యా మితవాదబృందము, ప్రధాన ట్రే. యూ. కాం. కమ్యూనిష్టుపక్షము అను మూడు ట్రేడు యూని యను ఫెడరేషను లేర్పడెను. ఆచరణలో నివియన్నియు దుర్బలముగ నిర్వీర్యముగనుండెను. వాటి పరస్పరపోరాటములు పనివాండ్ర

కందరకు కంటకముగనుండెను. 1930 లగాయతు నేను తరుచు జయిలులోనుండుటచే నాకు దీనితో సంబంధము లేకపోయెను. నే నప్పుడప్పుడు కొద్దికాలము వెలుపలనున్నప్పుడు సంఘీభావప్రయత్న ములు జరుగుచుండెనని వినుచుంటిని. అవి జయప్రదముకాలేదు. రైల్వేపనివాండ్రు తమవైపుననుండుటచే మితవాదవర్గమునకు బలము చేకూరెను. ప్రభుత్వము వారిని గుర్తించి, జనీవాలోని లేబరు కాన్ఫ రెన్సుకు వారుచేసిన సూచనల నామోదించుటచే వారి కితరగ్రూపుల వారికంటె సౌకర్యమొకటి చేకూరెను. జనీవాను సందర్శించవలె ననెడి యుబలాటము కొంతమంది లేబరునాయకుల నటు లాగివేసెను. వారు తమతో తమయూనియనులను తీసికొనివెళ్ళిరి.

# 28

## స్వాతంత్ర్యము - తరువాత

లాహోరుకాంగ్రెసు నా స్మృతిపథమున నెప్పుడు నవనవలాడు చుండును. నే నందులో ప్రధానపాత్రధారి నగుటచే నది సహజము. కొంచెముసేపు నే నా రంగస్థలకేంద్రము నాక్రమించితిని. ఆ దినము లలో నాలో నుత్పన్నమైన యుత్తుంగభావముల నొక్కొక్కప్పుడు నేను తలచుకొన నుత్సహింతును. లాహోరు ప్రజలు నా కొసగిన యాహ్వానమును నే నెన్నడు మరువజాలను. ఆ యపరిమితోత్సాహము నా వ్యక్తికొరకుగాక నొక యాశయము, నొక చిహ్నము కొరకని నే నెరుగుదును. అయినను, అనేకవేలమంది దృష్టిలోను, హృదయములలోను, కొద్దికాలమైనను, నొక పట్టి చిహ్నమగుట స్వల్పవిషయముకాదు. నే నపరిమితానందభరితుడనై, నా శరీరమును మరచినట్లయ్యెను. కాని నా స్వవిషయము లంత ముఖ్యములుకావు. గొప్పసమస్యలు పరిష్కరింపబడనున్నవి. ఆ వాతావరణమంతయు నుత్సాహపూరితముగ, శ్రద్ధాభరితముగనుండెను. మా నిశ్చయములు కేవల విమర్శలు, వ్యతిరేకాభిప్రాయ ప్రకటనలుగాక దేశము నొక్క సారిగా కదల్చివేసి యనేక లక్షలమంది జీవితములను మార్చివేయు కార్యాచరణ కాహ్వానములగుచుండెను.

మనకు, మన దేశమునకు దూరభవిష్యత్తులో నేమిరానున్నదో యెవరును జోస్యము చెప్పజాలరు. కాని సమీపభవిష్యత్తుమాత్రము స్పష్టముగనే యుండెను. అది మనకు, మనప్రియజనులకు పోరాటము, బాధ సమర్పించుచున్నది. ఈ భావము మా యుత్సాహములను శాంతపరచి మా బాధ్యతల నెక్కువగా గుర్తుకుదెచ్చెను. మే మిచ్చు ప్రతి వోటు సుఖమునకు, భోగములకు, గృహసౌఖ్యములకు, స్నేహితు లకు తుది సందేశము. అది యేకాకులైపోవుటకు శరీరమానసిక బాధలకు నాహ్వానము.

స్వాతంత్ర్యమునుగురించిన ప్రధానతీర్మానము, స్వాతంత్ర్య పోరాటముకొరకు చేయవలసిన కార్యక్రమములను నేకగ్రీవముగ నామోదింపబడెను. సవరణరూపమున నిచ్చిన యొక చిన్న సమస్య మీద నిజమైన వోటింగు జరిగెను. ఈ సవరణ యోడింపబడెను. వోటింగు లెక్కలు ప్రకటింపబడెను. ప్రధానతీర్మాన మామోదింపబడెనని డిసెంబరు 31వ తేదీ రాత్రి 12వ గంట మ్రోగుచుండ, పాతసంవత్సరముపోయి క్రొత్తసంవత్సర ముదయించువేళ ప్రకటింపబడెను. ఈవిధముగా కలకత్తా కాంగ్రెసులో నీయబడిన సంవత్సర గడువు గడచినతోడనే క్రొత్తనిశ్చయము గావింపబడి, సంగ్రామ సన్నాహములు ప్రారంభమయ్యెను. చక్రములు చలనములో పెట్టబడెను. కాని మే మెట్లు ప్రారంభింపవలెనో, ఎప్పుడు ప్రారంభింపవలెనో తెలియక నంధకారములో పడియుంటిమి. వ్యూహమును పన్నుటకు, నిర్వహించుటకు అ. భా. కాం. కమిటీవారి కధికారమిచ్చిరి. కాని నిజనిశ్చయము గాంధీజీ చేతిలోనే యుండెనని యందరకు తెలియును.

లాహోరు కాంగ్రెసుకు సమీపసరిహద్దురాష్ట్రములనుండి యనేకమంది ప్రజలు వచ్చిరి. ఈ రాష్ట్రమునుండి కాంగ్రెసుసభలకు వ్యక్తిగతముగా ప్రతినిధు లెప్పుడు వచ్చుచునేయుండిరి. కొన్నిసంవత్సరములనుండి ఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్ హాజరగుచు మా చర్చలలో పాల్గొనుచుండెను. శ్రద్ధాన్వితులగు యువకులనేకమంది మొదటిసారి లాహోరులో నఖిలభారత రాజకీయతరంగసంపర్కము ననుభవించుటకు సరిహద్దులనుండి వచ్చిరి. వారి యకల్మషహృదయము లాకర్షింపబడెను. వారు స్వాతంత్ర్యపోరాటములో భారతదేశమంతటిలో నైక్యమైతిమను భావముతో మరలివెళ్ళి దానికొరకు త్సాహప్రపూరితులయి యుండిరి. వారు నిరాడంబరులు; కాని కార్యశూరులు; భారతదేశములోని తదితర రాష్ట్రములవారందరికంటె తక్కువ జల్పమతులు; వృథావాగ్వాదము చేయరు. వారు తమప్రజల నైక్యము చేయు నారంభించి నూతనభావములను వెదజల్లుచుండిరి. వారికి

జయము చేకూరెను. భారతపోరాటములో చిట్టచివర చేరిన, సరిహద్దు రాష్ట్ర స్త్రీపురుషులు 1930 లగాయతు ప్రధానపాత్ర ధరించిరి.

లాహోరు కాంగ్రెసు యాజ్ఞల ప్రకారము మాతండ్రి అసెంబ్లీలోను శాసనసభలలోను గల కాంగ్రెసుసభ్యులను తమ స్థానములకు రాజీనామా యీయవలసినదని తెలిపెను. వారిలో చాలమంది మొత్తముగా లేచివచ్చిరి. కొద్దిమంది యట్లుచేయుటకు తిరస్కరించిరి. ఇంకను భవిష్యత్తు మా కస్పష్టముగనే యుండెను. కాంగ్రెసుసభలలో జూపబడిన యుత్సాహమెంతయున్నను కార్యక్రమములోనికి దిగినపుడు దేశమెంతవరకు తోడ్పడునో యెవరికెరుక? మే మొక నిశ్చయమునకు వచ్చితిమి. వెనుకకు మరలుట యసంభవము. దేశము యొక్కనాడి మాకింకను తెలియకుండెను. మా యుద్యమము నారంభించుటకు కొంతవరకు దేశయుత్సాహమును పరీక్షించుటకు జనవరి 26 వ తేదీ స్వాతంత్ర్య ప్రమాణములను తీసికొన నిశ్చయింపబడెను.

కనుక, మా విధానమును గురించి సందేహములు బాధించుచుండ యుత్సాహముచేతను, జయప్రదమగు నేదోయొక్క కార్యము నాచరింపవలెనను కోరికచేతను మేముపరిస్థితులకొరకు వేచియుంటిమి. జనవరి మొదటివారములో నేను అలహాబాదులోనుంటిని. మా తండ్రి చాలవరకు నితరప్రాంతములలోనే యుండెను. అవి మాఘమేలా దినములు. బహుశః అది ప్రత్యేక కుంభసంవత్సరమయియుండుటచే లక్షల కొలది యాత్రికులు అలహాబాదు, లేక పవిత్ర ప్రయాగతీర్థమునకు నిరంతరప్రవాహమువలె వచ్చుచుండిరి. వారిలో రయితులు, కూలివాండ్రు, దుకాణదార్లు, చేతిపనివాండ్రు, వర్తకులు, వ్యాపారస్తులు, యితరవృత్తులలోనివారు, పీరువారననేల యన్ని బాపతులవారు నుండిరి. నిజముగా నది హిందూదేశముయొక్క యొక ప్రధానలక్షణము. నదికిపోవుచు వచ్చుచుండు యీ నిరంతర జనప్రవాహమును, గుంపులను పరీక్షించునపుడు సత్యాగ్రహమునకు, పరిశాంతమగు ప్రత్యక్ష కార్యాచరణకు పిలుపువచ్చినపుడు వీ రెట్లు ప్రవర్తింతురా

యని నేనాశ్చర్యపడుచుండెడివాడను. వీరిలో నెంతమందికి లాహూరు నిశ్చయములు తెలియును? ఎంతమంది వానిని లక్ష్యముచేతురు? భారతదేశములోని మూలమూలలనుండియు ననేక వేల సంవత్సరముల నుండి వారిని, వారివారిని పవిత్రగంగాతోయములలో స్నానము చేయ తీసికొనివచ్చిన యావిశ్వాస మెంత యద్భుత శక్తివంతముగ నుండెను! ఈ యద్భుతశక్తిలో కొంత వారు తమదుస్థితిని పోగొట్టు కొనుటకు రాజకీయ, ఆర్థిక కార్యాచరణవైపు త్రిప్పజాలరా? లేక వారిమనస్సులు మతసాంప్రదాయములతో, మత సింగారములతో నిండి యితరయాలోచనలను చొరనీయవా? ఈ యితరయాలోచన లిదివరకే యచ్చటనుండి యుగయుగములనాటి స్థబ్ధత్వమును కదల్చు చుండెనని నే నెరుగుదును. ప్రజల యస్పష్టకోరికలలోనియు, యాశ యములలోనియు నీ చలనమే గత పది పన్నెండువత్సరముల ప్రబోధ ములకు కారణమై భారతదేశముఖమునంతను మార్చివేసెను. ఆ కోరిక లచ్చటనున్న సంగతియు, వాటివెనుక బ్రహ్మాండమైనశక్తి యున్నసంగతియు నిస్సంశయము. అయినను సందేహాము వచ్చు చుండెను. ప్రశ్నలుదయించుచుండెను. వీటికి సమాధానము వెంటనే రాకుండెను. ఈ భావము లెంతవరకు వ్యాపించెను? వాటివెనుక నెంత బలముకలదు? సక్రమమైన పని జరుగుటకు, చిరసహనమునకు శక్తి యెంత కలదు?

మా యింటికి యాత్రీకులెందరో గుంపులు గుంపులుగా వచ్చు చుండిరి. అదియొక యాత్రాస్థలమగు భారద్వాజమనుచోట నుండెను. అచ్చట పూర్వకాలమున నొక ప్రాచీన విశ్వవిద్యాలయ ముండెడిది. పర్వదినములలో ప్రాతఃకాలము మొదలు సాయంత్రమువరకు నెడ తెరపిలేకుండ ప్రేక్షకులు మమ్ముచూడవత్తురు. వారిలో చాలమంది వేడుకకొరకు వత్తురనుకొనెదను. వారు వినిన ప్రఖ్యాతపురుషులను ముఖ్యముగా, మాతండ్రిని చూడవలెననుకోరిక యొకటి యుండెను. కాని వచ్చినవారిలో చాలమందికి రాజకీయపరిజ్ఞానము కలదు. కాంగ్రెసు యేమిచేయుచున్నది? యేమి నిశ్చయించినది? ముందేమి

జరుగనున్నది ? యను ప్రశ్నలను వారడుగజొచ్చిరి. తమ నిజార్థిక కష్టములు వారిని వేధించుచునే యుండుటచేత వాటినిగురించి తా మేమిచేయవలెనో వారు తెలిసికొనగోరిరి. మన రాజకీయ కేకలు వారికి బాగుగా తెలియును. కనుక దినమంతయు మా యిల్లు వారి కేకలతో ప్రతిధ్వనించుచుండెను. నేను యిరవైమంది, యేబదిమంది, నూరుమంది యొకొక్క గుంపుగా వచ్చినపుడు వారి కేదియో చెప్పి పంప నారంభించితిని. కాని చివరకిది యసాధ్యమగుటచే నొక్క నమస్కారముచేసి పంపుచుంటిని. దీనికిని యొకయంత ముండవలెను. నేను దాగుటకు ప్రయత్నించితిని. అది నిష్ఫలమయ్యెను. కేకలు అంతకంత కధికమై మిన్ను ముట్టుచుండెను. ఇంటి వరండాలన్నియు మమ్ము చూడవచ్చిన ప్రేక్షకులతో నిండిపోయెను. ప్రతి తలుపుదగ్గర ప్రతి కిటికీదగ్గర మమ్మన్వేషించు నేత్రపుంజములు గుమిగూడెను. పని చేసికొనుటకు, మాట్లాడుటకు, తినుటకు, మరేది చేయుటకు నసాధ్యమయ్యెను. ఏమిచేయుటకు తోచక చికాకు, కోపము వచ్చుచుండెను. కాని తరతరములనుండి గర్భదారిద్యమును, బాధలను అనుభవించుచు, సహచరభావము, సానుభూతి తప్ప మరేమియు కోరక కృతజ్ఞతను, ప్రేమను మనపై ప్రవహింపచేయ నచ్చినవారిని తిరస్కరించుటెట్లు ? వారుచూపు యపరిమితశక్తి, ప్రేమలముందర వినమ్రులము, భయకంపితులము గాకుండనుండుట యసాధ్యమయ్యెను.

అప్పుడు మాయింట మాతో నొక ప్రియస్నేహితురాలుండెను. ఆమెతో నెట్టి సంభాషణయైనను జరుపుట తఱచు కష్టమగుచుండెను. బయట జేరుగుంపుల కేకొద్దియో చెప్పివచ్చుటకు నేను ప్రతియైదు నిమిషములకు నయిటికిరావలసివచ్చుచుండెను. ఈ మధ్య కేకలు, చప్పట్లు వినవచ్చుచుండెను. నా దుస్థితి యామెకు వినోదము కలిగించెను. ఆమె ప్రజలలో నాకుగల పలుకుబడికి కొంచె మాశ్చర్య పడెను. ఆమె యకస్మాత్తుగా నావైపు తిరిగి నేనీ వీరపూజ నెట్లు భావించెదనని ప్రశ్నించెను. నేను దానికి గర్వింపలేదా; నేను బదులు చెప్పుటకుముందు కొంచెము సందేహించితిని, నన్ను చాల వ్యక్తిగత

మైన ప్రశ్న వేసి కంగారుపెట్టిన ట్లూమె దీనివలన గ్రహించి క్షమార్పణ కోరెను. ఆమె నన్నెంతమాత్రము కంగారుపెట్టలేదు. కాని నా కది కఠినప్రశ్నగా కాన్పించెను. నా మనస్సు చెదరిపోయి నా భావములను చేష్టలను విమర్శించుకొన నారంభించితిని. అవి చాల మిశ్రమములై యుండెను.

నాకు ప్రజలలో సామాన్యపలుకుబడి గలమాట సత్యము. విద్యార్థికులు నన్ను మెచ్చుకొనెదరు. యువకులకు, యువతులకు నే నొక చిన్నవీరుడను. వారిదృష్టిలో పూర్వగాథలనాటి కీర్తిపుంజములు నాచుట్టు నలముకొనెను. నన్నుగురించి యనేకగీతములు వ్రాయబడెను. అసంభవములు, పరిహాసాస్పదములునగు ననేక కథలు బయలుదేరెను. నా శత్రువులుకూడ నన్నుగురించి మంచివాక్యములను చెప్పుచు సమర్థతతో విశ్వాసముతో నేను కొఱవడనని మెహార్భానీగా యొప్పుకొనుచుండిరి.

ఎట్టి చలనము, నెట్టివికారముపొందకుండ పైపొగడ్తలనన్నిటిని దాటగల వాడొక ఋషికావలెను; లేదా మానవాధముడైన రాక్షసుడు కావలెను. నేనీ రెండు జాతులకు చెందనివాడను. అవి నా తలకెక్కి కొంచెము మత్తుగలుగచేసి నాకు శక్తిని, విశ్వాసమును కలుగచేసెను. నా పద్ధతులలో నేను కొంచెము నిరంకుశుడనైతిని. ఒక ఛాయ డిక్టేటరునైతిని. అయినను నా యహంకారమంత మితిమీరినదని నే ననుకొనను. నా శక్తిసామర్థ్యములనుగురించి యుక్తజ్ఞానము కల్గియుండి నేను వాటినిగురించి వినమ్రుడనుగా నుండలేదు. కాని వాటిలో నద్భుతమేమియు లేదని నేను బాగుగ నెరుగుదును. నా లోటుపాటులు నాకు బాగుగ తెలియును. ఆత్మపరీక్ష చేసికొను నా యభ్యాసము నే నెట్టితొట్రుపాటుపడకుండ కాపాడి నాకు సంబంధించిన సంభవముల నుదాసీనతతో చూడగలుగుటకు తోడ్పడెను. పేరుప్రఖ్యాతులు తఱచుగా యవినీతిపరుల చెలికత్తెలని పబ్లికు జీవితానుభవమువలన నాకు తెలిసెను. అవి సుగుణసంపత్తికి బుద్ధివిశేషముకు విధాయిక చిహ్నములుకావు. కనుక నాకు కలిగినప్రఖ్యాతి

నా తప్పిదములకా ? లేక నా శక్తిసంపదలకా ! నే నెందుకు ప్రఖ్యాతి కెక్కితిని? బుద్ధివిశేషమునకుగాదు. ఏలనన నది యసాధారణమైనది కాదు. అథవా కీర్తిని సాధించునంతటిది కాదు. త్యాగములనిపిలువబడు వానికినిగాదు. ఏలనన భారతదేశములో మనయెదుటనే వందలు, వేలు యింతకంటె ననంతమగు బాధల ననుభవించి చివరకు ప్రాణ త్యాగముకూడ చేసిరి. నేను వీరుడననుకీర్తి కేవలము కల్పితము. వీరుడనను భావము నా కెంతమాత్రము లేదు. సాధారణముగా వీర దృక్పథము లేని నాటకాభినయము నాకు మూర్ఖముగా కాన్పించును. అద్భుతగాథల సందర్భములో నే నందరికంటె హాస్యుడనగు మానవు డను. నాకు కొంత శరీర మానసిక ధైర్యస్థైర్యములున్నమాట వాస్త వము! బహుశః అభిమానమే, గర్వమే దానికి పునాది. అదినాకును, నా గ్రూపునకును, నా జాతికిని చెందె దేనికిని లొంగనిచ్చగింపని యభిమానము.

నా ప్రశ్నకు తృప్తియైన సమాధానము లేదు. నే నపుడు మరి యొకవిధమగు పరిశోధన నారంభించితిని. మాతండ్రి నేను భారత దేశమునుండి ప్రతివారము మా దుస్తులను ప్యారిసు లాండ్రీకి పంపి యిస్త్రీ చేయించుకొందుమను నొక యభూతగాథ కల్పింపబడెను. మే మనేకసార్లు దీనిని ఖండించినను యీ గాథ పెరుగుచునే యుండెను. ఇంతకంటె వికృతము మూర్ఖము నగుదానిని నే నూహింపజాలను. ఇట్టి స్వర్థవేషభాషలలో మరియు మూర్ఖుడున్నచో మూర్ఖశిరోమణి బహుమతికి నానామమే ప్రత్యేకముగ నుదహరింపదగియుండును. వేల్సుయువరాజుతో నేను పాఠశాలలో చదివితినను మరియొక చిత్రగాథ, యెన్నిసారులు కాదనినను, చెప్పబడుచుండును. యువ రాజు 1921 లో హిందూదేశము వచ్చినపుడు నన్నుగురించి యడిగె నని యాకథ చెప్పును. నే నప్పుడు జయిలులో నుంటిని. యదార్థ ముకు నే నతనితో పాఠశాలలో చదివియుండ లేదు. నే నింతవర కెప్పుడు నతనిని కలిసికొన లేదు. అతనితో సంభాషించి యుండ లేదు.

ఈ గాథలమీద, నిటువంటి గాథలమీద నా పలుకుబడి లేక పేరు ప్రఖ్యాతులు నాధారపడియుండెనని నా యభిప్రాయము కాదు. వాటి కింతకంటె గట్టిపునాదులే యుండవచ్చును. కాని, యీ కథల వలన విశదమైనట్లు పైకట్టడము మాత్ర మిట్టియాడంబర వర్ణనలతో నలంకరింపబడెననుటకు సందేహములేదు. అధమము గొప్ప గొప్ప వారితో తిరుగుచు, భాగ్యభోగముల ననుభవించుచు తరువాత దానినంతను సన్యసించిరనుభావము కలదు. సన్యాస మెప్పుడు భారత హృదయము నాకర్షించెను. కీర్తి కిదియొక పునాదియగుట నా కెంత మాత్రము నచ్చదు.

నేను క్రియారహిత సుగుణ సంపత్తికంటె కార్యాచరణతో గూడిన సుగుణసంపత్తినే యభినందించెదను. త్యాగముకొరకే చేయ బడు త్యాగ, సన్యాసములను నే నంగీకరింపజాలను. మరియొక దృష్టిలో మానసిక, ఆధ్యాత్మికశిక్షణయనుదృష్టిలో – నేను వాటిని గౌరవించెదను. యోగ్యమైన శరీరారోగ్యములను కలిగియుండవలె ననిన క్రమజీవితము, నిరాడంబర జీవితము ముఖ్యావసరములు. గొప్ప గొప్ప సాహసకార్యములను నిర్వహింపబూనినవారికి కష్టసహిష్ణుత, పట్టుదలయుండు టత్యవసరము. కాని సన్యాసజీవితముపట్ల జీవితమునే తిరస్కరించుపట్టున నాకు ప్రీతి, మోహములేదు. నేను నిజముగా గౌరవించినదానిని దేనిని బుద్ధిపూర్వకముగ విడిచిపెట్టలేదు. కాని గౌరవములు మారుచుండును. నా స్నేహితురాలు నన్నడిగిన ప్రశ్న కింకను ప్రత్యుత్తరము రానేలేదు. ప్రజల యీ వీరపూజవలన నేను గర్వముచెందలేదా? నాకది యెంతమాత్రము నిష్టములేక దానినుండి పారిపోగోరితిని. కాని నేను దానికలవాటుపడవలసివచ్చెను. అది యెంతమాత్రము లేనప్పుడు నాకు కొఱతగనే యుండెడిది. కాని, మొత్తముమీద ప్రజలు నా యాంతరంగిక కోరికను దేనినో తీర్చెడి వారు. నేను వారి నొప్పించి కార్యరంగములోనికి దింపగలనను భావము నాకు వారి మనోహృదయములపై నొక యధికారభావ మును కలిగించెను. ఇది కొంతవరకు నా యధికారేచ్ఛను తృప్తిపర

చెను. వానిమట్టుకు వారు నాపై, కనపడని నిరంకుశత్వమును చెలా యించెడివారు. ఏలనన వారి విశ్వాస ప్రేమలు నా యంతరంగమును కదల్చి భావతరంగముల నుద్రేకింపచేసెడివి. నే నెంత వ్యక్తిత్వమును నమ్మినవాడ నైనను యొకొక్కప్పుడు వ్యక్తిత్వపుహద్దులు నశించినట్లు కాన్పించి, యొంటరిగా నున్న నేను రక్షించుకొనుట కంటె నీ దుఃఖభాగులగు ప్రజలతో నిడుమల గుడుచుచుండుటయే మంచిదని భావించెడివాడను. కాని, యీ హద్దు లంత చులకనగా నశించునవికావు. నేను వాటిపై నెక్కి నా కర్థముకాని యీ స్థితి నాశ్చర్యచకిత నేత్రములతో తొంగిచూచెడివాడను.

గర్వము శరీరముమీద క్రొవ్వువలె కాన్పించకుండ పొర మీద పొర పెరుగుచుండును. కాని, ఈ నిత్యాభివృద్ధిని దీనిని పొందు వ్యక్తి గుర్తించనేరడు. అదృష్టవశాత్తు ఈ పిచ్చిప్రపంచంలో సంభవించు కఠినసంఘర్షణలు దాని యుద్ధృతమును తగ్గించును. లేక దానిని పూర్తిగ నాశన మొనరించును. గత కొద్ది సంవత్సరములనుండి హిందూదేశములో మన కట్టి కఠినసంఘర్షణలకు లోటులేకుండెను. మనకు జీవితమను పాఠశాల కష్టసముద్రమయ్యెను. బాధలవంటి కఠినపాఠము వేరొకటి యుండజాలదు. మరియొక విధముగ గూడ నే నదృష్టవంతుడను. నా కుటుంబము, నా బంధువులు, స్నేహితులు, సహచరులు—అందరు మానసికముగ నేనట్టి తొట్రుపాటు పొంద కుండ, యౌచిత్యము వీడకుండ చేసి నా కెంతయో తోడ్పడిరి. మున్సిపాలిటీలు, స్థానికసంస్థలు యిచ్చు వినతిపత్రములు, యుత్సవములు, యూరేగింపులు మొదలగునవి నా నరములకలసటను కలిగించి నా లోని హాస్యరసమును, సత్యసంధతను పరీక్షించుచుండెను. ఉత్ప్రేక్షపూరితము, నలంకారపదభూయిష్టము నగు భాష యుపయోగింపబడుచుండెను. వారి వినయవిధేయతలను, భయభక్తులను చూచు నపుడు నే నా మహాసభలోనివారిని కంగారుపరచి వారి ముఖ లక్షణములలోని మార్పులను వీక్షింపవలెన నెడి కుతూహలముతో నవ్వవలెననియో, నాలుక చాపి వెక్కిరింపవలెననియో, లేక తల్ల

క్రిందులుగా నిలువవలెననియో యవశ్యముగా నొక బుద్ధి పుట్టు చుండెడివి. అదృష్టవశాత్తు నా కీర్తికి భంగము కలుగకుండ, భారత దేశములో ప్రజాసేవయెడలగల యుచితమర్యాద చెడకుండ, నేనిట్టి పిచ్చికోరికను అణచివేసి, సాధారణముగ నుచిత మర్యాదతోనే మెలగెడివాడను. కాని యెల్లప్పుడు నిట్లు జరుగలేదు. అసాధారణముగ విసిగించిన యుత్సవములలోనో, లేక జనసమూహముగల సభలలోనో కొంతప్రదర్శనము చేసెడివాడను. మమ్మాహ్వానించుటకు చేయబడిన యుత్సవమును నే నకస్మాత్తుగా వీడి, నా భార్యనో లేక మరియొక రినో యుత్సవములో, నే మోటరుమీదనో, గుఱ్ఱపు బండిమీదనో కూర్చుండబెట్టి గుంపులో కలసిపోయెడివాడను.

ఈ విధముగా భావముల నణచుకొని బహిరంగములో యుక్తముగా ప్రవర్తించుటకు చేయు నిరంతరప్రయత్నము విసుగుకలిగింపక మానదు. దీనిసామాన్య ఫలిత మేమనిన బహిరంగయుత్సవములలో నిది మూతిబిగింపుకు, విచారకలుషితమగు దృష్టికి కారణమగును. బహుశః యీ కారణముచేతనే యొక హిందీమాసపత్రికలోని యొక వ్యాసములో నేను హిందూవితంతువువలె నుందునని వర్ణింపబడితిని. నాకు పూర్వపక్షి హిందూవితంతువులనిన యెంత యభిమాన మున్నను యిదియొక వజ్రపాతమువలె నుండెను. నిశ్చయముగా వ్యాసకర్త నాకున్నవని యతడనుకొనిన సాధుసంపత్తితో గూడిన వైరాగ్యతత్త్వము, సన్న్యాసము, ముఖమున చిరునవ్వైనను యెరుగని కార్యతత్పరత సుగుణములను పొగడనెంచెను. నాకు కార్యరూపమును, తీవ్రమును నగు సుగుణసంపత్తియు మందహాస, హాస్యరసములును కలవని నే నాశించితిని. గాంధీజీ యొకసారి తనలో హాస్యరసమే లేనిచో నాత్మహత్య చేసికొనెడివాడనని యొక పత్రికా ప్రతినిధితో చెప్పియుండెను. నే నంతదూరము పోజాలనుగాని హాస్యము, వినోదము లేనిచో జీవితము నాకు దుర్భరముగా నుండెడిది.

నా కీర్తియు, లలితపదభూయిష్టము, నుత్ప్రేక్షసమన్వితము నగు వినతిపత్రములు మా బంధుజనులలోను, మా మిత్రగణములోను

నిందలకు కారణమగుచుండెను. జాతీయోద్యమములో ప్రధానులైన వారియెడల సాధారణముగ నుపయోగింపబడు బిరుదులు, పెద్దపెద్ద సమాసపదములు, యుత్ప్రేక్షలు మొదలగువానిని నా భార్య నా చెల్లెండ్రు, తదితరులు యేరి యగౌరవముగా నాపై విసురుచుండెడివారు. నన్ను 'భారతభూషణ' అనగా 'భారతరత్నము' 'త్యాగమూర్తి' అనగా 'మూర్తిభవించిన యీ త్యాగదేవతా' యని సంబోధించెడివారు. వారి యీ వేళాకోళము నాకు కొంత శాంతినిచ్చెడిది. నేనెచ్చట నతియోగ్యముగా మెలగవలెనో యట్టిబహిరంగసభలలోని జిగి క్రమముగా సడల నారంభించెను. నా చిన్నకూతురుకూడ నీ వినోదములో జేరెడిది. మా తల్లి మాత్రమే నాయెడల నిష్కపటముగానుండి తన ప్రియపుత్రునిపైన నెవరెట్టి వేళాకోళము, నింద మోపినను యొప్పుకొనెడిదికాదు. తండ్రిగారి కిది వినోదముగనుండెను. అతడు తన సానుభూతిని యర్థజ్ఞానమును అతిశాంతముగ వ్యక్తముచేసెడివాడు. కాని, యీ మూకల కేకలు, విసుగు జనింపక చేసెడి బహిరంగ తంతులు, అంతులేనితర్కములు, రాజకీయ దుమారము, నన్ను బాహ్యముగనే స్పృశించుచుండెను; నా నిజసంఘర్షణ నా యంతరంగముననే యుండెను. నాలో నంతర్గర్భితముగానున్న యాశయములు, కోరికలు, భక్తితాత్పర్యములు వెలుపలిపరిస్థితులతో తలపడుచుండెను. నా యాంతరంగికతృష్ణ చల్లారలేదు. నేను వివిధశక్తులు తమతమ యాధిపత్యములకొరకు పోరాడు రంగస్థలమునైతిని. నేను దీనినుండి తప్పించుకొనజూచితిని. నేను సామరస్యమును, సమన్వయమును పొంద యత్నించితిని. ఈ యత్నములోనే నేను కార్యోన్ముఖుడనగుచుంటిని. అది నాకు కొంతశాంతిని సమకూర్చెడిది. బాహ్యసంగ్రామము ఆంతరంగిక సంగ్రామజనిత శ్రమను పోగొట్టెడిది.

నే నిచ్చట జయిలులో కూర్చొని దీనినంతను యెందులకు వ్రాయుచున్నాను? జయిలోనున్నను బయటనున్నను యిదియే పరిశోధన. నాకు కొంతశాంతిని, యాత్మతృప్తిని ప్రసాదించుననుయుద్దేశ్యముతో నేను నా భూతభావములను అనుభవములను వ్రాయుచుందును.

# 29

## శాసనోల్లంఘన ప్రారంభము

1930 జనవరి 26; స్వాతంత్ర్యదినము. అది తటిల్లతవలె దేశముయొక్క యపరిమితోత్సాహవిశ్వాసముల మనకు వెలిబుచ్చెను. ఎట్టియుపన్యాసములు, యెట్టిప్రోత్సాహములు లేకుండగనే ప్రతిచోట వేనకువేలు సభలుజరిగి శాంతముగ, పవిత్రభావప్రపూరితముగ స్వాతంత్ర్యప్రమాణములు గైకొనబడెను. ఆ మహాసభలలో నొకవిధమగు భావప్రకోపము ద్యోతకమగుచుండెను. ఈ యుత్సవము గాంధీజీకి తగినప్రోత్సాహము నిచ్చెను. ప్రజానాడిని గుర్తెరింగిన యతడు కార్యాచరణకు కాలము పండెనని గ్రహించెను.

తరువాత నొకటితరువాత నొకటిగ ననేక సంఘటనలు, తుదియంకమునకు గొనిపోవు నాటకమునవలె సంభవించెను. శాసనోల్లంఘనము సమీపించి వాతావరణమంతయు నుత్సాహపూరితమగుచుండ మా భావములు 1921-22 నాటి యుద్యమమువైపు వెనుకకు తరలెను. చౌరీచౌరా దైనతరువాత నది యకస్మాత్తుగా నాపివేయబడిన విధానము జ్ఞప్తికివచ్చెను. దేశ మిప్పుడు యెక్కువ శిక్షణము నొందెను. సంగ్రామస్వభావ మతిస్పష్టముగ గుర్తింపబడెను. యుద్ధశాస్త్రము కొంతవరకు తెలిసిపోయెను. గాంధీజీ దౌర్జన్యరాహిత్యము విషయమై యతిశ్రద్ధగ నున్నట్లందరకు విదితము. బహుశః పదిసంవత్సరముల క్రితము కొంతమంది మనస్సులలో నున్నట్లిప్పుడు దీనినిగురించి యెట్టి సందేహము లేదు. ఇది యంతయు నిజమేయైనను దౌర్జన్యమెచ్చటను జరుగకుండ నుండునని మన మెట్లు నిశ్చయముగ చెప్పగలము? అట్టిదేదియైన సంభవించినచో మనశాసనోల్లంఘనోద్యమముపై దానికెట్టి సంబంధముండును? వెనుకటివలె నది యకస్మాత్తుగా నిలిపివేయబడునా? ఈ ప్రశ్న చాలబాధకరముగ నుండెను.

గాంధీజీకూడ యీ ప్రశ్నను గురించి తన నిజధోరణిలో యోచించుచునే యుండెను. అతనిని బాధించుచుండిన సమస్య మరి

యొకవిధముగనుండెనని నేను మా పరస్పర సంభాషణలవలన తెలిసి కొంటిని.

మంచిమార్పు, శ్రేయస్సుకలుగజేయుటకు దౌర్జన్యరాహిత్య పద్ధతి యొక్కటే యితనికి మంచిపద్ధతి. దానిని యుచితముగా నడిపి నచో నది యెన్నటికిని వ్యర్థముకానేరదు. అదిపనిచేయుటకు, జయిం చుటకు ప్రత్యేక ప్రసన్న పరిస్థితులుండవలెననియు, బాహ్యపరిస్థితులు దానికి సరిపడనిచో దాని నుపయోగింపకూడదనియు, వేరుగ చెప్ప వలెనా ? అనగా దౌర్జన్యరాహిత్యపద్ధతి యన్నిపరిస్థితులకు పనికిరాదని సర్వకాల సర్వావస్థలయందు నుపయోగించునది ప్రమాదరహితమైనది కాదని సారాంశము. గాంధీజీ యీ సారాంశమును సహింపజాలడు; అది ప్రమాద రహితమని, విశ్వముకంతకు వర్తించు పద్ధతియని గాంధీజీ దృఢవిశ్వాసము. కనుక బాహ్యపరిస్థితులు ప్రసన్నముగనుండక పోయినను దౌర్జన్యమధ్యమునను అది విధాయకముగ పనిచేసితీరవలెను. పరిస్థితులు మారుచుండిన యెడల దానికనుగుణముగ పనిచేయు విధాన మును మార్చుకొనవచ్చును. కాని దాని నాపి వేయుటకు యీ పద్ధ తియే వ్యర్థమని యొప్పుకొనినట్లగును.

బహుశః యతని మనస్సు యీ విధమున యోచించెను. కాని యతనిభావములను నేను చెప్పజాలను. అతని దృష్టిలో నేదియో కొంత మార్పు కలిగినట్లు, శాసనోల్లంఘనము అచ్చటచ్చట బయలుదేరు దౌర్జన్యములచే నాపివేయబడ నక్కరలేదనియు నతడు మాకు కొంత సూచనచేసెను. దౌర్జన్యము యుద్యమములో నొకభాగమే యైనచో నది శాంతియుత శాసనోల్లంఘనము కాజాలదు. అప్పుడు దానిని విరమించ వలసి యుండును. ఈ సందేహావిచ్ఛేదము మాలో చాలమందికి తృప్తి కరముగనుండెను. దీనినెట్లు ప్రారంభించవలెను ? అను పెద్ద సమస్య మమ్మిపుడు బాధింపదొడగెను. జయప్రదముగ నుండుటకు మే మెట్టి విధమగు శాసనోల్లంఘనము ప్రారంభింపవలెను? పరిస్థితుల కేది తగి యుండును ? ప్రజల కేది యంగీకారముగ యుండును ? అప్పుడు ' మహాత్ముడు ' మార్గమును చూపెను.

ఉప్పు అకస్మాత్తుగా మహామంత్రమయ్యెను. దాని కద్భుతశక్తి కలిగెను. ఉప్పుపన్నుపై ధ్వజమెత్తవలెననిరి. ఉప్పు చట్టములను ముక్కలు చేయవలెను. మేమాశ్చర్యపడితిమి. ఎక్కడిజాతీయ సంగ్రామము ! ఎక్కడి మామూలు ఉప్పు ! ఈ రెంటికి నెక్కడి సంబంధము! మరియొక యాశ్చర్యకరమగు విషయమేమన గాంధీజీ తన 'పదకొండు షరతులను' ప్రకటించెను. మనము స్వాతంత్ర్యమును గురించి మాట్లాడుచుండ నొక రాజకీయ సాంఘిక సంస్కరణల జాబితాను తయారుచేయుటలో నర్థమేమున్నది ? గాంధీజీ యీపదము నుపయోగించునపుడు మనము దీని నుపయోగించిన యర్థములోనే యుపయోగించెనా ? లేక మేము వేరువేరు భాషమాట్లాడుకొంటిమా ? పరిస్థితులు ముంచుకొనివచ్చుచుండుటచే మాకు వాదెంచుకొనుటకు కాలము లేకపోయెను. భారతదేశములో నవి రోజురోజు మా కండ్లముందర రాజకీయముగ పరుగెత్తుచు భయంకరమగు నార్థికమాంద్యము దాని నలముకొనెను; ధరలు పడిపోవుచుండెను. నగరవాసులు దీనికి సంతసించిరి. కాని వ్యవసాయదారు, కవులుదారు యీదృశ్యమును భయోత్పాతముతో గమనించుచుండెను.

తరువాత గాంధీజీ వైస్రాయితో నుత్తరప్రత్యుత్తరములు జరుపుటయు, సబర్మతి యాశ్రమమునుండి దండయాత్రను ప్రారంభించుటకు సంభవించెను. ప్రజలీయాత్రచేయు యాత్రికుల యదృష్టములను దినదినము వినుచుండినకొలది దేశములో నుద్రేకము హెచ్చుచుండెను. మా మీదకు వచ్చుచున్న సంగ్రామమునకు తుది సన్నాహములుచేయుటకు అహమ్మదాబాదులో అ. భా. కాం. కమిటీ మీటింగు జరుపబడెను. సంగ్రామనాయకు డచ్చటలేడు. అతడప్పుడే తనయాత్రీకులదండుతో సముద్ర తీరమునకు చలచల నడచిపోవుచుండెను. వెనుక ముఖము పెట్టుట కతడు తిరస్కరించెను. నిర్బంధములు వచ్చుచో నేమిచేయవలెనను విషయమై అ. భా. కాం. కమిటీవారు నిశ్చయించిరి. కమిటీ సమావేశమగుటకు వీలులేనిచో దాని తరఫున పనిచేయుట కధ్యక్షున కెక్కుడు యధికారముల నిచ్చిరి. అతడు

నిర్బంధింపబడిన కమిటీసభ్యుల స్థానములకు క్రొత్తవారిని పేర్కొన వచ్చును. తన తరువాత తన స్థానమునకు అతడే యొకనిని నియమింప వచ్చును. ఇట్టి యధికారములనే స్థానిక రాష్ట్రకాంగ్రెసు కమిటీలు తమ యధ్యక్షుల కిచ్చెను.

ఈ విధముగ 'డిక్టేటరు'లనబడువారు వర్ధిల్లి, కాంగ్రెసుపక్ష మున సంగ్రామ మారంభమయ్యెను. భారతదేశ శక్రటరీలు, వైస్రా యిలు, గవర్నరులు మొదలగువా రాశ్చర్యముతో చేతులుచాచుచు "అయ్యో యికనేమున్నది! కాంగ్రెసుకు చేటుకాలము దాపురించినది! ఎంత క్రూరత్వమోయిపుడు! చాటనారంభించిరి. ఏలనన కాంగ్రెసు డిక్టేటరు పదవులను విశ్వసించెనట! అప్పుడప్పుడు భారతదేశ మిత వాద పత్రికారాజములుకూడ మాకు ప్రజాస్వామిక సుగుణసంపత్తుల నుపదేశించుచుండెను. మేము దీనినంతను మానముగ వినుచుంటిమి. ఇంతకంటె మొండికెత్తిన మోసము వేరొండు యుండబోదు. ఆర్డినెన్సు చట్టములచే ప్రతి నాగరికధర్మము నణచివేసి భారత దేశమును బలవంతముగ నిరంకుశత్వముతో పాలించు ప్రభుత్వమువా రిట్లు ప్రజాస్వామికనుగురించి కపటభక్తితో బ్రువ్వుచుందురు. మామూలు పరిస్థితులలోనైనను హిందూదేశములో ప్రజాస్వామిక ఛాయ యెచ్చటనున్నది? బ్రిటిషుప్రభుత్వము తన యధికారమును, భారతదేశములో తమకున్న ప్రయోజనములను రక్షించుకొనుజూచుట సహజనే యనుటకు సందేహములేదు. తన యధికారమును ధిక్క రించినవారిని యణచివేయవచ్చును. కాని ఇదియంతయు ప్రజా స్వామిక పద్ధతియని యదిచేయుసమర్థన చరిత్రాత్మకమై భవిష్య త్సంతతిచే పరీక్షింపబడుగాక!

తన ధర్మములను మామూలుగ నెరవేర్చుకొనుట కసాధ్య మగు స్థితిని కాంగ్రెసు యెదుర్కొనవలసియుండెను. దాని నక్రమ సంఘముగ ప్రకటించిరి. సలహాలకు, కార్యాచరణకు దానికమిటీలు కలుసుకొనుటకు వీలులేకుండ చేయబడెను. మా పోరాటమును సుత రాము బహిరంగముగ నుంచదలచితిమి, మేము రహస్యమును ప్రోత్స

హింపలేదు. కేంద్రములలోను, రాష్ట్రములలోను, స్థానికముగను నున్న నాయకులు నిర్బంధింపబడుట నిశ్చయము. అప్పుడు నడుపువారెవరు ? మా కొక్కటే మార్గముండెను. యుద్ధముచేయుచున్న సైన్యములో, దెబ్బలుతిన్న సేనాధిపతులకు బదులు క్రొత్తవారి నేర్పరచునట్లు, మేమును క్రొత్తసేనాధిపతుల నేర్పరచుటకు సన్నాహము చేసితిమి. యుద్ధరంగ మధ్యమున కూర్చొని మేము కమిటీసభలను జరుపజాలము. నిశ్చయముగా నే మొక్కొక్కప్పు డట్లే చేసితిమి. కాని దాని యుద్దేశ్యమును, విధాయిక ఫలితమును, కమిటీయంతయును నిర్బంధింపబడుటయే యైయుండును. యుద్ధరంగము వెనుక భద్రముగా కూర్చొను సామాన్య యుద్యోగ లెవరును మాకు లేరు. ఇంకను దూరమున మరింత భద్రముగ కూర్చొను నాగరికమంత్రివర్గమును లేదు. మా సామాన్య యుద్యోగులు, మంత్రివర్గములు మా సంగ్రామతత్త్వమునుబట్టి గుండుదెబ్బల కెదురు నిలువవలెను. వారందరు మొట్టమొదటనే నిర్బంధింపబడిరి. ఇంతకు మేము మా 'డిక్టేటరు'ల కిచ్చిన యధికారమెట్టిది ! సంగ్రామమును నిర్వహించు జాతీయ చిహ్నములుగా నియమింపబడుట వారికొక గౌరవము. కాని వారికి గల యదార్థాధికారము తమ్ముతాము జయిలుకు 'శాసించుకొనుటయే' తాము ప్రాతినిధ్యమువహించు కమిటీ బలవంత శాసనములచే పని చేయుటకు వీలులేనపుడే వారు పనిచేయగలరు. ఎప్పుడు, యెచ్చట నీ కమిటీ సమావేశముకలిగినను దానితో 'డిక్టేరు' తనకున్న వ్యక్తిగత యధికారము కోల్పోవును; అతడు లేక నామె యేప్రధాన సమస్యను, సూత్రములను స్పృశింపజాలరు. ఉద్యమములోని చిన్న చిన్నవియు బాహ్యములునగు హంశములను 'డిక్టేటరు' మార్చగలడు. కాంగ్రెసు "డిక్టేటరుపదవులు" నిజముగా జయిలు సోపానములు. దినదినము యీ విధానము సాగుచుండెను. క్రొత్తవారు దెబ్బలుతినినవారి స్థానము నలంకరించెడివారు.

కనుక మేము, మా తుదిసన్నాహములను గావించుకొని అహమ్మదాబాదులో అ. భా. కాం. కమిటీ సభ్యులవద్ద సెలవుతీసికొం

టిమి. ఏలనన మేమెప్పుడు కలుసుకొనెదమో యెట్లు కలుసుకొనె దమో అసలు కలుసుకొనెదమో లేదో యెవరికీ తెలియదు. అ. భా. కాం. కమిటీయొక్క క్రొత్త యాదేశముల ప్రకారము స్థానిక పర్పా టులకు తుదిసంస్కారముల నిచ్చుటకు మేము మా మా తావులకు పోతిమి. సరోజినీదేవి చెప్పినట్లు జయిలుయాత్రకు దంతధావన సామగ్రి వగైరాలను మూటగట్టితిమి. త్రోవలో మేము – మాతండ్రి నేను, గాంధీజీని చూడబోతిమి. అతడు తన యాత్రీకుల దండుతో జంబుసరములో నుండెను. మే మతనితో కొద్దిగంటలకాలము గడిపి తిమి. తరువాత నతడు లవణ సముద్రయాత్రలోని ముందుమజిలీకి తన సైన్యముతో చలచల బయలుదేరెను. చేత దండముబూని తన యనుచరుల కగ్రేసరుడై, నిశ్చయమగు నడకతో, ప్రశాంతము, నిర్భయమునగు దృష్టితో నడచుచుండ నతనిని నేను కడసారి చూచి తిని. ఆ దృశ్య మద్భుతము. భావోద్రేకపూరితము.

జంబుసరములో గాంధీజీ సలహాతో మాతండ్రి అలహాబాదులో నున్న తన భవనమును దేశమునకిచ్చివేయుటకు నిశ్చయించి దానికి "స్వరాజ్యభవనము" అను నూతన నామకరణము చేసెను. అతడు అలహాబాదు చేరుటతోడనే యీ ప్రకటన గావించి వెంటనే దానిని కాంగ్రెసువారికిచ్చివేసెను. ఆ పెద్దభవనములో నొకభాగము ఆస్ప త్రిగా మార్చబడెను. అప్పుడు న్యాయవిధానములను జరుపుటకు తగిన సావకాశములేకపోవుటచే సంవత్సరము ఆరుమాసములైనతరు వాత నతనియిష్టానుసారము నే నా యాస్తి కొక ధర్మకర్తృత్వము నేర్పాటుచేసితిని.

ఏప్రిల్ మాసము వచ్చెను. గాంధీజీ సముద్రతీరము జేరెను. ఉప్పుచట్టములపై దాడివెడలి శాసనోల్లంఘనమును ప్రారంభించుట కాజ్ఞలకొరకు మేము వేచియుంటిమి. కొన్ని నెలలనుండి మేము మా వాలంటీర్లకు శిక్షణ గఱపుచుంటిమి. కమలయు, కృష్ణయు (నాభార్యయు చెల్లెలు) వారిలోజేరి, దీనికొరకు పురుషవేషము వేసికొనిరి. వాలం టీర్లకు ఆయుధములు, చివరకు కర్రలులేవు. వారు తమపని నెక్కువ

సమర్థతతో నెరవేర్చుటకు, జనసమూహమును నియమించుటకు తగి యుండుటకే శిక్షింపబడుచుండిరి. ఆరవ యేప్రిల్ జాతీయవారములో మొదటిదినము. అది ప్రతిసంవత్సరము 1919 లో జరిగిన సంభవముల జ్ఞాపకార్థము సత్యాగ్రహదినము లగాయతు జలియనువాలాబాగు దినమువరకు జరుపబడుచుండెను. ఆదినమున గాంధీజీ దండీ సముద్రతీర మున ఉప్పుచట్టములను భంగముచేయు నారంభించెను. మూడునాలుగు రోజులైనతరువాత సర్వ కాంగ్రెసు సంఘములు సట్లుచేసి తమ ప్రాంత ములో శాసనోల్లంఘన మారంభింపవచ్చునను యనుజ్ఞ యీయబడెను.

అకస్మాత్తుగా నొక జలాశయము వెల్లువయైనట్లు కాన్పించెను. దేశమంతట నుప్పుపంటయే ప్రధానవిషయమయ్యెను. ఉప్పుతయారు చేయుట కనేక వింతపద్ధతు లవలంభింపబడెను. మాకు దానిగురించి యేమియు తెలియదు. కనుక మాకవకాశము కలిగినంతవరకు మేము దానిగురించి చదివితిమి. దానిని తయారుచేయు కరపత్రములను వేసి తిమి. మేము కొన్ని కుండలను, మూకుళ్ళను పోగుచేసి చివరకు కొంత యుప్పనెడి పదార్థమును తయారుచేసితిమి. గొప్పవిజయము బడసి నట్లు మేము దీనితో నూరేగి తఱుచు చాల విపరీతధరల కమ్మివేసెడి వారము. పదార్థము మంచిదా చెడ్డదాయను ప్రశ్నయే లేదు. దుష్ట మగు నుప్పుచట్టమును భంగపరచుటయే ప్రధానవిషయము. నే మిందులో తయారుచేసినయుప్పు నికృష్టమైనదైయైనను విజయముబడసి తిమి. ప్రజల యపరిమితోత్సాహమును దవానలమువలె విజృంభించు చున్న యుప్పుచేయువిధమును చూచినను గాంధీజీ మొదటసూచించి నపుడు సందేహించిన మేము చాల సిగ్గుపడితిమి. ప్రజలనుద్రేక పరచి వారిని సక్రమముగ ప్రవర్తింపచేయగల యతని యద్భుతశక్తికి మే మాశ్చర్యపడితిమి.

నేను మధ్యపరగణాలలోని రాయపూరులో నొక కాన్ఫరె న్సుకు బయలుదేరి వెళ్ళుచుండగా ఏప్రిల్ 14 వ తేదీని నిర్బంధింప బడితిని. ఆ రోజుననే నా కేసు విచారించి ఉప్పుచట్టముక్రింద నా కారు మాసములు విధించిరి. నేను నిర్బంధింపబడవచ్చునని ముందు

గనే నాస్థానే గాంధీజీని కాంగ్రెసు ప్రెసిడెంటుగ పేర్కొంటిని. కాని యతడు దానిని తిరస్కరించునేమోయను భయముచే రెండవపేరు మా తండ్రిది, సూచించితిని. నేననుకొనినట్లే గాంధీజీ యంగీకరింప లేదు. కనుక తండ్రిగారే తాత్కాలికాధ్యక్షులైరి. అతడు చాల యనారోగ్యముగనుండెను. అయినను అతడత్యుత్సాహముతో నుద్యమము లోనికురికెను. ఆ మొదటి మాసములలో నతని పటుతరమగు నేతృత్వము, క్రమశిక్షణను పాలించుట యుద్యమమున కెంతయో లాభదాయకమయ్యెను. ఉద్యమము చాల వృద్ధిపొందెను. కాని యతనికున్న యారోగ్యము శరీరదార్ఢ్యము క్షీణించిపోయెను.

ఆ రోజు లుద్రేకము పుట్టించు వార్తలతో నిండియుండెను. ఉత్సవములు, లాఠీచార్జీలు, కాల్పులు నిరంతర హర్తాళములు పెషావరుదినము, గఢ్వాలీదినము, మొదలగు ప్రత్యేక యుత్సవములు ప్రళయముగా నుండెడివి. తాత్కాలికముగ విదేశవస్త్రబహిష్కరణము, సమస్త బ్రిటిషు వస్తువులబహిష్కరణము పూర్తియయ్యెను. వృద్ధురాలగు నా మాత, నా చెల్లెండ్రు, యుద్యమములోని కురికి ప్రచండమార్తాండ మధ్యందినమున తీవ్రకరోష్ణములో, విదేశ వస్త్ర దుకాణములవద్ద నిలచి పికెటింగు చేయుచున్నారను వార్త నన్ను కలచివేసెను. కమలకూడ నట్లే చేసెను. కాని యామె యంతటితో నూరుకొనలేదు. అనేకవత్సరములనుండి యామెను బాగుగ నెరుగుదు ననుకొనిన నాకు మహదాశ్చర్యము కలుగునట్టి యుత్సాహముతోను కృతనిశ్చయముతోను ఆమె అలహాబాదు పట్టణము లోను, జిల్లాలోను, పనిచేయ నారంభించెను. ఆమె తన యనారోగ్యమును మరచిపోయి పగలంతయు సూర్యరశ్మిలో పనిచేయుచు నద్భుత కార్యశూరత్వమును చూపెను. నేను దీనిని గురించి జయిలులో ముఖావముగ వింటిని. తరువాత మా తండ్రి నన్నచ్చట కలుసుకొనినపుడు కమలకృషినిగురించి యతడెంత మెచ్చుకొనునదియు, ముఖ్యముగ నామెయొక్క కార్యశూరత్వమును గురించియు నాకు స్వయముగా తెలిపెను. నా తల్లియు చిన్నపిల్లలు నెండలో

పనిచేయుట కలతడెంతమాత్రము యిష్టపడెడివాడుకాడు. కాని యెప్పు డైనను కొంచెము మందలించుటతప్ప యతడు వారితో నెట్టి జోక్యము కల్పించుకొనలేదు. ఆ మొదటిరోజులలో మాకుచేరినవార్త లన్నిటికంటె గొప్పవార్త పెషావరులో య్రేపిల్ 23 వ తేదీన జరిగిన సంభవములు. తరువాత నిట్టివే సరిహద్దు రాష్ట్రమంతట జరిగెను. భారతదేశములో మరెచ్చటనైనను మరఫిరంగుల జాజ్వల్యమాన దవానలము ముందర నత్యద్భుతముగా ప్రదర్శింపబడిన యీ ప్రశాంతము, శిక్షాయుతధైర్యసాహసములు దేశమునంతను కంపించియుండెడివి. సరిహద్దురాష్ట్రములలో దానికి మరియొక ప్రాముఖ్యత కలదు. ధైర్య సాహసములకు పేరెన్నికపొందిన పఠానులు శాంతస్వభావులు కారు. వారి కట్టి పేరు లేదు. ఈ పఠానులు భారతదేశములో నసమాన యుదాహరణము చూపిరి. సరిహద్దు రాష్ట్రములలోనే గఢ్వాలు సైనికులు నాగరిక ప్రజలపై తుపాకులను కాల్చవలసినదను యాజ్ఞలను తిరస్కరించిరి. నిరాయుధులగు ప్రజలపై కాల్చుటకు సైనికునికుండు సహజమగు నయిష్టతచేతను, నిస్సందేహముగ ప్రజల యెడల గల సానుభూతిచేతను వారు కాల్చుటకు తిరస్కరించిరి. కాని తన యధికారుల యాజ్ఞలను ధిక్కరించుటకు సైనికున కొక్క సానుభూతి మాత్రమే చాలదు. దానిఫలిత మతనికి తెలియును. బహుశః గఢ్వాలీలు బ్రిటిషుప్రభుత్వము కూలిపోవుచున్న దను దుర్భ్రమచేత నిట్లుచేసియుందురు. అట్టిభావ ముత్పన్నమైనప్పుడే సైనికుడు తన సానుభూతి ప్రకారము యభిరుచుల ప్రకారము చేయ సాహసించును.

ఆ రోజులలో ననేక వింతవిషయములు జరుగుచుండెను. కాని, జాతీయోద్యమములో స్త్రీలు తీసికొనినభాగము నిస్సందేహముగ నద్భుతముగ వారు తమ గృహాంతరసీమల నుండి యసంఖ్యాకముగ తరలివచ్చి, సంగ్రామరంగ మధ్యమున కురికిరి. విదేశవస్త్ర దుకాణములవద్ద, కల్లుదుకాణములవద్ద పికెటింగుచేయుట వారిప్రత్యేక హక్కు. అన్నిపట్టణములలోను కేవలము స్త్రీలు మాత్రమే గల బ్రహ్మాండమగు

యుత్సవములు జరుపబడెను. సాధారణముగ పురుషులపట్టుదలకంటె స్త్రీలపట్టుదలయే నిర్వక్రమముగనుండెను. రాష్ట్రములలోను స్థానిక ప్రాంతములలోను తఱుచు వారే "డిక్టేటరు" లగుచుండిరి.

ఉప్పుచట్టమును పగులగొట్టుట యొకకార్యము మాత్రమే. శాసనోల్లంఘన మితరరంగములకు ప్రాకెను. వైస్రాయి వివిధ ఆర్డినెన్సులను జమాయించి, యనేక కార్యములను నిషేధించుటచే నిది మరింత సుకరమయ్యెను. ఈ ఆర్డినెన్సును, నిషేధములు పెరిగినకొలది వాటిని భంగపఱచుట కవకాశములు వృద్ధియగుచుండెను. ఆర్డినెన్సులు వేటిని ఆపివేయ తలపెట్టెనో వాటిని చేయుటయే సాత్త్వికనిరోధము. ప్రజలు కాంగ్రెసు ఆరంభము చేయుటయే తడవు, ప్రభుత్వదృష్టిలో నొక ఆర్డినెన్సు పనిచేయనిచో వైస్రాయి క్రొత్తఆర్డినెన్సులను తయారుచేయును. కాంగ్రెసు వర్కింగుకమిటీసభ్యులు చాలమంది నిర్బంధింపబడిరి. కాని క్రొత్తసభ్యులను జేర్చుకొనుచు సమితి నిరంతరాయముగా పనిచేయుచునే యుండెను. ప్రతి ప్రభుత్వఆర్డినెన్సుకు వర్కింగుకమిటీయొక్క బదిలీతీర్మానము, దాని నెదుర్కొనుటకు తగినయాదేశములతో చేయబడుచుండెను. ఒక్కమినహాయింపుతప్ప యీ యాదేశములన్నియు భారతభూమియందంత నద్భుతమగు నైక్యబుద్ధితో నిర్వహింపబడెను. ఆ మినహాయింపు పత్రికాప్రచురణముకు సంబంధించినదై యుండెను. ముద్రణ ఆర్డినెన్సును జారీచేసి, పత్రికలయొద్ద జామీనుకోరినపుడు వర్కింగుకమిటీవారు జాతీయపత్రికల నట్టిజామీను యీయవలదనియు దానికిబదులు పత్రికలనాపివేయవలసినదనియు నాదేశించిరి. పత్రికాధికారుల కిది యొక గుటకదిగని మాత్రయయ్యెను. ఏలనన యిప్పుడే ప్రజలలో వార్తలకెక్కువ తృష్ణ బయలుదేరెను. అయినను పత్రికలలో నత్యధికసంఖ్య—కొన్ని మితవాదపత్రికలుతప్ప—ప్రచురణ నాపివేసెను. దీనివలన ననేక వదంతులు బయలుదేరెను. కాని వారట్లు చాలకాలముండజాలక పోయిరి. మితవాదపత్రికలు వ్యాపారమును లాగివేయుటచూడ వారికి

కోపము కలుగుచుండెను. కనుక చాలమంది తిరిగి ప్రచురణ నారంభించిరి.

గాంధీజీ మే 5 వ తేదీని నిర్బంధింపబడెను. అతని నిర్బంధమైన తరువాత పశ్చిమతీరముననున్న యుప్పుకొఠారములపై గొప్ప గొప్ప దాడులు బయలుదేరెను. ఈ దాడులసందర్భములో పోలీసుల యత్యాచారములు హృదయవిదారకముగనుండెను. అద్భుతమగు హర్తాళములు, వుత్సవములు, లాఠీచార్జిలు—వీటితో గూడిన బొంబాయి నగర మప్పుడు రంగస్థలమయ్యెను. లాఠీచార్జిలలో దెబ్బలుతినిన వారికి సేవచేయుట కత్యావసరమగు ఆస్పత్రులు స్థాపింపబడెను. అద్భుతవిశేషము లనేకములు బొంబాయిలో సంభవించెను. మహాపట్టణమగుటచే ప్రచురణ కనేక సౌకర్యము లచ్చట నుండెను. అట్టి ప్రాముఖ్యతయేగల సంభవము లనేకములు చిన్నపట్టణములలోను జరిగెను.

జూను మాసాంతమున మా తండ్రి బొంబాయి వెళ్ళెను. అతనితో మా తల్లి, కమల వెళ్ళిరి. వారి కద్భుతమగు నాహ్వానము లొసంగబడెను. వారచ్చటనుండగా భయంకర లాఠీచార్జిలు జరిగెను. బొంబాయిలో నివి యతిసామాన్యములు. పదిహేనురోజు లయిన తరువాత నచ్చట నొక యసామాన్యమగు నగ్నిపరీక్ష భళ్ళున తెల్లవారువరకు జరిగెను. వేలకొలది జనసమూహము, వర్కింగుకమిటీ సభ్యులు, మాలవ్యాజీ మొదలగువారు మార్గము కడ్డముగానిలచిన పోలీసులకెదుట రాత్రియంతయు గడిపిరి. బొంబాయినుండి తిరిగి వచ్చునపుడు తండ్రిగారిని జూను 30 వ తేదీని నిర్బంధించిరి. అతనితో సయ్యదు మహమ్మదుకూడ నుండెను. వారు వర్కింగు కమిటీయొక్క తాత్కాలికాధ్యక్షుడు, శక్రటరీ లగుటచే నిర్బంధింపబడి చెరి యారుమాసములు శిక్షింపబడిరి. నాగరికజనులను కాల్చవలసినదని పోలీసులు, సైనికులు నాజ్ఞాపింపబడినపుడు వారు చేయవలసిన ధర్మములనుగురించి మాతండ్రి జారీచేసిన స్టేటుమెంటుకే యతడు నిర్బంధింపబడెను. స్టేటుమెంటు న్యాయశాస్త్రమునకు సంబంధించిన విష

యము. ఈ హంశమునుగురించి ప్రస్తుత బ్రిటిషు యిండియను లా యెట్లున్నదో యది వివరించెను. అయినప్పటికి నది యుద్రేకకరమైన దని యుపద్రవకరమైనదని తలంపబడును.

బొంబాయి పోవుటవలన తండ్రిగారికి చాల శ్రమకలిగెను. ప్రాతఃకాలము మొదలు రాత్రి చాల ప్రొద్దుపోవువరకు నతడు పని చేయుచునేయుండెను. ప్రతిముఖ్యనిశ్చయమునకు నతడు బాధ్యత వహించవలసి యుండెను. అతడు చాలకాలమునుండి యస్వస్థతగ నుండెను. కాని యిప్పుడతడు శ్రమచెంది తనడాక్టర్ల ప్రత్యేకసలహా వలన తక్షణమే సంపూర్ణ విశ్రాంతిని తీసికొనవలెనని నిశ్చయించెను. అతడు ముసోరీ వెళ్ళుట కేర్పాటుచేసికొని ప్రయాణసన్నాహములు గావించెను. కాని ముసోరీ వెళ్ళవలెననుకొనిన తేదీ కొకరోజుముందర నతడు నైనీ సెంట్రలు జయిలులో మా కొఠారము ముందర ప్రత్యక్షమయ్యెను.

# 30

## నైనీ జైలులో

ఏడు వత్సరముల తరువాత తిరిగి జయిలుకు వెళ్లుటచే జయిలు జీవితానుభవములను నేను కొంతవరకు మరచిపోతిని. నేను రాష్ట్రములోని పెద్దజయిళ్ళలో నొకటియగు నైనీ సెంట్రల్ జయిలులో నుంటిని. ఒంటరిగా నన్నొక్కనినే యుంచుట నాకు క్రొత్త యనుభవము. 2200 లేక 2300 మంది ఖయిదీలుగల పెద్దయావరణకు సంబంధములేకుండ నే నొక 100 అడుగుల వైశాల్యముగల యావరణలో నుంచబడితిని. దానిచుట్టు యెత్తుగల గుండ్రనిగోడ యుండెను. దానిమధ్య నాలుగుగదులుగల యందచందములులేని కొంపయొకటి యుండెను. అందులో నాకు రెండు వరుసగదుల నిచ్చిరి. ఒకటి స్నానమునకు పాకీదొడ్డికి, రెండవది నా యునికికి. తక్కిన రెండును కొంతకాలము కాళీగనే యుంచబడెను.

బయట నే నతియుద్రేకపూరితము, విరామరహితము నగు జీవితమును గడిపినతరువాత నిపుడు కొంత యొంటరితనమును, స్వాస్థ్యమును అనుభవించితిని. నేను బాగుగ నలసిపోవుటచే రెండు మూడు రోజులు మస్తుగ నిద్రించితిని. వేడిగాడ్పు లప్పుడే ప్రారంభ మగుటచే నా గదికి పెద్ద యావరణకు మధ్యగల చిన్న సందులో రాత్రులందు నన్ను ఆరుబయట పరుండనిచ్చిరి. నేను దాని నెత్తుకొనిపోదుననియో లేక బహుశః దానినొక నిచ్చెనక్రింద నుపయోగించి గోడనెక్కి పోవుదుననియో నా పరుపును గట్టిగా గొలుసులతో కట్టివేసిరి. రాత్రి యంతయు వింతధ్వనులతో మ్రోగుచుండెడిది. ఖయిదీఓవరుశీర్లు ప్రధానగోడలను కాపాడుచు తరుచు నొకరినొకరు వివిధస్థాయిలలో సజ్జాపుల నందించుచు నొక్కొక్కప్పుడు దూరమున నుండివచ్చు గాలిహోరువంటి ప్రతిధ్వనిని కలుగచేసెడివారు. రాత్రి కాపలాదార్లు కొఠారములలో తమయొద్దిలోనున్న ఖయిదీలను పైకి బిగ్గరగా లెక్కించుచు నంతయు బాగుగనేయున్నది యను కేకలు

వేయుచుండెడివారు. రాత్రియనేకసారు లేజయిలు యధికారియో గస్తీతిరుగుచు మా యావరణకువచ్చి ఫ్యాక్టరీలోనున్న వార్డరును కేకలు వేయుచు పరిశోధించుచుండెడివాడు. నా యావరణ తక్కిన వాటికి కొంతదూరములో నుండుటచే నీ ధ్వను లస్పష్టముగనుండి మొట్టమొదట నా కాగోల యర్థమయ్యెడిదికాదు. ఒక్కొక్కప్పుడు నేనొక యరణ్యసమీపమున నున్నట్లు, మృగములు తమ పొలముల లోనికి రాకుండ రయితులఱచుచున్నట్లు భావించెడివాడను. ఒక్కొక్కప్పుడరణ్యము నక్తంచరమృగజాలము నిశీథతాండవము చేయుచున్నట్లు తోచెడిది.

చతురస్రమగు గోడలకంటె వక్రమగుగోడ నిర్బంధము నెక్కుడుగ జ్ఞప్తికి తెచ్చుట యథార్థమా లేక నా యూహయా? యను నాశ్చర్యము కలిగెడిది. మూలలు కోణములు లేకపోవుట నిర్బంధ భావము నధికము చేయుచుండెను. పగలు ఆగోడ గగనసీమను గూడ నాక్రమించి దానిలో నొక చిన్నతునకను మాకు ప్రదర్శించుచుండెను. "ఖయిదీలు గగనమని పిలుచు యా చిన్ని వినీలసీమను రాజితకాంతుల నీను తెలిచాపలతో పరుగులెత్తు మేఘపంక్తిని" నేను కాయలుకాచిన నేత్రములతో చూచుచుండెడివాడను. రాత్రులందు ఆ గోడ నన్ను మరింత యావరించుటచే నే నొక నూతియడుగున పడిపోయినట్లుండెడిది లేదా నేను చూచిన నక్షత్రకాంతిచే రాజిల్లెడి యా యాకాశభాగము యదార్థమై కృత్రిమ గ్రహసందోహములో నొక భాగమువలె కాన్పించెడిది.

నా కొఠారుకు, యావరణకు జయిలులో (కుత్తాఘర్) కుక్కయిల్లు అను ప్రసిద్ధనామము కలదు. ఇది దానికిగల పాతపేరేకాని నాకు సంబంధించినదికాదు. ఈ చిన్ని కొఠారము మొట్టమొదట, తక్కిన వాటితో జోక్యములేకుండ, ప్రత్యేకముగ నుపద్రవకరులైన ఖయిదీల నితరులతో నెట్టి సంబంధములేకుండ నుంచుటకై నిర్మింపబడెను. తరువాత నిదిరాజకీయ ఖయిదీలకొరకు, డెటిన్యూలకొరకు ప్రత్యేకింపబడెను. ఈ యావరణముకు ముందర కొంతదూరములో, నొక కట్టడ

ముండెను. నాకొట్టులోనుండి నేను దానిని మొట్టమొదట చూచి నప్పుడు నా కాశ్చర్యము కలిగెను. అదియొక పెద్ద పంజరమువలె నుండెను. దానిలో జనము గిరగిర తిరుగుచుండిరి. అది మనుష్యులచే నడుపబడు నీటికుళ్ళాయి యని నేను తరువాత తెలిసికొంటిని. ఒక్కొక్కసారి పదునారుమంది దానికి పనిచేయవలెను. మనము ప్రతిదానికి నలవడునట్లే నేను దానికలవడితిని. కాని మానవశక్తి నీవిధముగ నుపయోగించుట యతిమూర్ఖ్యము, నవనాగరికము. నేను దానిని సమీపించి నప్పుడెల్ల నాకు జంతుప్రదర్శనశాల జ్ఞప్తికివచ్చును.

కొన్నిరోజులవరకు నన్ను నా యావరణముదాటి పైకి పోనిచ్చెడివారుకారు. తరువాత నింకను చీకటియుండగనే ప్రాతఃకాలమున నొక అరగంటసేపు ప్రధానగోడక్రింద నడచుటకు, పరుగెత్తుటకు నా కనుమతి నిచ్చిరి. తక్కిన ఖయిదీలెవరు నన్ను కలుసుకొనుటకు, చూచుటకు వీలులేకుండుటకే నా ప్రాతఃకాల సమయము నిర్ణయింపబడెను. నా కా విహారము ప్రీతికరముగనుండి నా శ్రమను పోగొట్టుచుండెడిది. నాకు దొరికిన యీ కొద్దికాలములో సాధ్యమైనంత బహిరంగ వ్యాయామమును పొందవలెనని పరుగెత్తనారంభించి క్రమముగ రోజుకు రెండుమైళ్ళువరకు పరుగెత్తెడివాడను.

నేను ప్రతిదినము ప్రాతఃకాలమున నాలుగుగంటలకు, మూడున్నరగంటలకుకూడ లేచుచుండెడివాడను. రాత్రి చాలసేపు చదువుకొనుటకు తగినదీపము లేకుండుటచే నేను పెందలకడనే నిద్రించెడివాడను. నేను నక్షత్రములను ప్రీతితో పరీక్షించుచుండెడివాడను. బాగుగా తెలిసిన యొక్కొక్క నక్షత్రస్థానమునుబట్టి నాకు సరిగా ప్రొద్దు తెలియుచుండెడిది. నేను పరుండిన చోటునుండి గోడమీదనుండి తొంగిచూచు ధృవనక్షత్రమును చూడగలిగెడివాడను. అది యెప్పుడు నచ్చటనే యుండుటచే నా కమితానందదాయకముగ నుండెడిది.

నెలవరకు నా కితరస్నేహితు లెవరు లేకుండిరి. కాని నే నొంటరిగ లేను. నాతో నొకవార్డరు, ఖయిదీ ఓవరుశీర్లు, వంటచేసి

పెట్టుఖయిదీ, తొడుచువాడు నా యావరణలోనుండిరి. అప్పుడప్పుడు యేదో పనిమీద నితరఖయిదీలు, చాలమంది ఖయిదీ ఓవరుసీర్లు— సి. ఓ. లు. దీర్ఘశిక్షల ననుభవించువారు - వచ్చెడివారు. యావజ్జీవ ఖయిదీలు సామాన్యముగ నుండెడివారు. సాధారణముగా యావజ్జీవశిక్ష యిరువదిసంవత్సరములతో లేక నింకను తక్కువకాలముతో నంతమయ్యెడిది. కాని యిరువది సంవత్సరములుపైగా జయిలులో నున్నవా రనేకులు గలరు. నైనీలో నే నొక యద్భుత హాంశమును చూచితిని. ఖయిదీల దుస్తులమీద భుజములసమీపమున చిన్నకఱ్ఱ బిళ్ళలు తగిలించబడియుండెను. అవి వారి శిక్షలనుగురించి, విడుదల తేదీని గురించి తెలుపును. ఒక ఖయిదీయొక్క బిళ్ళమీద నతడు 1996 లో విడుదలయగునని నేను చదివితిని. అతడు 1930 నాటి కప్పుడే యనేక సంవత్సరములు జయిలులో గడిపెను. అత డప్పుడు నడివయస్సులో నుండెను. బహుశః యతని కనేకశిక్షలు విధింపబడి యవియన్నియు కూడబడెను. మొత్తము డెబ్బదియైదు సంవత్సరము లయ్యెను.

ఈ "యావజ్జీవఖయిదీల"లో చాలమంది వత్సరములకొలది యొక్క శిశువునుగాని, స్త్రీనిగాని, చివరకు మృగములనుగాని చూడరు. బాహ్యప్రపంచముతో వారికెట్టి సంపర్కము లేక మానవ సంబంధము లన్నియు నశించును. భయము పగదీర్చుకొనుట ద్వేషము మొదలగు క్రోధపూరితభావములు వారి నావరించి యుండును. వారు ప్రపంచములో మంచిని, దయను, సంతోషమును మరచిపోదురు. చెడుగులోనే మునిగి తేలుచు క్రమముగ ద్వేషము యొక్క తీవ్రతగూడ నశించి జీవితము నిర్వీర్యమయి, యంత్రము వంటి గాడిదమోతమాత్రమే వారికి మిగులును. యంత్రములవలెనే వారు దినములను యీడ్చుచు నెట్టిభావములు లేక నుండెదరు. అప్పుడప్పుడు ఖయిదీలశరీరములను తూచుచు లెక్కవేయుచుందురు. కాని భయంకరమగు యీ నిర్బంధవాతావరణములోపడి శుష్కించి యెదుగుబొదుగులులేక కృశించిపోవు మనస్సును, ఆత్మను తూచు

కెట్లు ? మరణదండనము పనికిరాదని ప్రజలు వాదించుచుందురు. వారి వాదములు నాకెంతయు సమ్మతమేకాని జయిలులో నా జీవాంతము దుర్భరబాధ ననుభవించుటను నేను చూచునపుడు వ్యక్తిని నెమ్మదిగా ముక్కముక్కలుగా చంపుటకంటె మరణశిక్ష విధించుటయే మంచిదని నేను భావింతును. ఈ 'యావజ్జీవఖయిదీ'లలో నొకడు నాయొద్దకువచ్చి "యావజ్జీవఖయిదీలమైన మాగతి యేమగును ? స్వరాజ్యము మమ్మీ నరకమునుండి తప్పించునా ?" యని ప్రశ్నించెను.

ఈ యావజ్జీవ ఖయిదీలెవరు ? వీరిలో చాలమంది మూకుమ్మడి కేసులలో యేబదిమంది నూరుమంది చొప్పున శిక్షింపబడియుందురు. వీరిలో కొంతమంది బహుశః దోషులుందరు. కాని శిక్షింపబడిన వారిలో నెక్కువమంది నిజముగా దోషులని నేను తలంపను. ఇట్టికేసులలో ప్రజల నిరికించుట చాల సులభము. క్రొనుతరపున సాక్ష్యము చెప్పువాడును, కొద్ది యానవాలుపట్టుటయు నుండిన చాలును. ఈ రోజులలో దోపిడీలు హెచ్చుచుండుటచే ఖయిదీలు సాలీనా వృద్ధియగుచున్నారు. ప్రజలు కష్టపుమంటచే మాడునపుడు వారికనేమి చేయగలరు ? జడ్జీలు, మేజస్ట్రేటులు నేరములు వృద్ధియగుచున్నవని గర్జింపవచ్చును. కాని వాటికి మూలములగు నార్థిక కారణములయెడల వారంధప్రాయులుగ నున్నారు.

ఏ భూమితగాదా మూలముననో గ్రామములోని రయితాంగములో నొకకొట్లాట బయలుదేరును. లాఠీలు గిరగిర తిరుగును. ఎవడో యొకడు చనిపోవును. ఫలితము, చాలమంది జీవితపర్యంతము లేక చాలకాలము జయిలులోనుందురు. తఱచు యీ విధముగా నొక కుటుంబములోని పురుషులందరు జయిలులోనుండుట తటస్థించి స్త్రీలు వారికర్మముకు విడిచిపెట్టబడుదురు. ఇందులో నొక్కటియు నేరముచేయు జాతికాదు. సాధారణముగ వారు శారీరకముగ, మానసికము సామాన్యగ్రామవాసికంటె నుత్తములైన యువకులు. కొద్ది

శిక్షయు, యితరవిషయముల మీాదను, వృత్తులమీాదను కొంత శ్రద్ధయు నున్నచో వీరు దేశమున కలంకారములుగ నుండెడివారు.

భారతదేశఖయిదులలో సంఘమునకు చేటు తెచ్చెడివారు, జాతికి యుపద్రవకారులును నైన నేరస్థులు లేకపోలేరు. కాని నిస్సందేహముగ విశ్వసింపదగిన యనేకమంది పిల్లలను, యువకులను నేను జయిలులోచూచి యాశ్చర్యపడితిని. నిజమైన నేరస్థులు నూటికెందరుకలరో నేరములు చేయుజాతికి చెందనివారెందరుకలరో నాకు తెలియదు. జయిలుశాఖలోనివారైనను, యీ భేదమునుగురించి యూహించనైన యూహించి యుండరు. ఈ విషయమునుగురించి న్యూయార్కులోని సింగుసింగు జయిలువార్డెనుఅయిన లూయీలాస్ అనునతడు కొన్ని చక్కని యంకెలను తెలియజేసెను. అతడు తనజయిలుజనాభాలో తా నెరిగినంతవరకు నూటికి యేబదిమంది యెంతమాత్రము నేరముచేయువలెనను చింతలేని వారనియు, పాతికమంది పరిస్థితులవలన, వాతావరణమువలన యీడ్వబడినవారనియు, మిగత పాతికమందిలోను సగముమందిమాత్రమే తీవ్రమగు సాంఘిక యాతతాయులనియు లెక్క తేల్చెను. యదార్థమైన నేరస్వభావ మెట్టిదుభివృద్ధియు లేని పల్లెలందుగాక నాధునిక నాగరిక రంగస్థలములగు పట్టణములయందే యెక్కువ విజృంభించుచున్నసంగతి మనకందరకు తెలిసినవిషయమే. అమెరికను దేశపు దోపిడీలు జగద్విఖ్యాతిగాంచెను. సింగుసింగుజయిలుకు యధమాధములగు నేరస్థులు వత్తురని ప్రసిద్ధి. అయినను దానివార్డెనుయొక్క లెక్కప్రకారము ఖయిదీలలో నూటికి $12\frac{1}{2}$ మంది మాత్రమే నిజముగ చెడ్డవారు. హిందూదేశపుజయిళ్ళలో నీసంఖ్య యింతకంటె చాల తక్కువయని నిరాక్షేపణగ చెప్పవచ్చును. మరింత యదార్థజ్ఞానముగల ఆర్థికనీతి, యెక్కువవిద్య, యెక్కువవృత్తులు త్వరలో మన జయిళ్ళను ఖాళీచేయగలవు. కాని, దీనిని జయప్రదముగ చేయవలెననిన మన సాంఘిక నిర్మాణమునకంతకు చెందిన ప్రధానమార్పు లెన్నియో కావలెను. అది జరుగనప్పుడు బ్రిటిషుప్రభుత్వ మిప్పుడుచేయునది

యొక్కటియే జరుగుచుండును. పోలీసుబలమును వృద్ధిచేయుచుండుట భారతదేశములోని జయిళ్ళను పెద్దవిచేయుచుండుట. భారతదేశములో జయిళ్ళకు పంపబడువారిసంఖ్య భయంకరముగ నుండును. అఖిలభారత ఖయిదీలసహాయకసంఘ కార్యదర్శి యీమధ్య ప్రకటించిన రిపోర్టులో నొక్క బొంబాయిరాష్ట్రములోనే 1933 లో 1,28,000 మంది జయిళ్ళకు పంపబడిరని వ్రాసెను. వంగరాష్ట్రములో నా సంవత్సరములోనే 1,24,000 మంది పంపబడిరి. అన్నిరాష్ట్రముల లోని యంకెలు నాకు తెలియవు. కాని రెండు రాష్ట్రములలోనే 2,50,000 మించినపుడు మొత్తము అఖిలభారతసంఖ్య పదిలక్ష లగుటలో నాశ్చర్యముండదు. ఇది శాశ్వత జయిలుజనాభాకాదు. చాల మందికి కొద్దికొద్ది శిక్షలే యుండును. శాశ్వతజనాభా యింతకంటె చాలతక్కువగనే యుండినను నది చాల గొప్పసంఖ్యయే యగును. భారతదేశములోని కొన్ని పెద్దరాష్ట్రములు ప్రపంచములోనికెల్ల పెద్దజయిలు పరిపాలనకు ప్రసిద్ధిచెందెను. ఈ సందేహాస్పదగౌరవము పొందువాటిలో యు. పి. కూడ కలదు. ఇది వెనుకబడిన లేక నభివృద్ధి భంగకరమగు ప్రభుత్వములలో నొకటి. ఖయిదీ యొకవ్యక్తియని, మానవుడని భావించుటకు, నతనిమనస్సు నభివృద్ధిచేయుటకు, కాపాడుటకు నీషణ్మాత్రప్రయత్నము గావింపబడదు. యు. పి. ప్రభుత్వము తమ ఖయిదీలను భద్రపరచుటకుమాత్రమే ప్రసిద్ధికెక్కెను. పారిపోవు ప్రయత్నములే చాలస్వల్పము. వేయిమంది కొక్కడయిన పారిపోగలుగుచున్నాడని నే ననుకొనెను.

జయిళ్ళలోనున్న మరియొక విచారకరవిషయ మేమనిన వాటిలో పదిహేనుసంవత్సరములు దాటిన పిల్లలనేకమంది కలరు. వారిలో చాలమంది బుద్ధిమంతులు. వారి కవకాశమే యున్నచో సులభముగ యోగ్యులయ్యెడివారు. వారికి చదువను, వ్రాయను నేర్పుటకు కొంత ప్రారంభము, చాలకాలముగడచినతరువాత చేయబడెను. కాని యిది యెంతమాత్రమును చాలదు. మరియు నిందులో పటుత్వము లేదు. ఆటపాటలకు యవకాశములు లేవు. ఏవిధమగు

వార్తాపత్రికలు యివ్వరు. పుస్తకములను చదువనీయరు. పన్నెండు గంటలకుపైగా ఖయిదీలందరు తమ కొఠారములలోనో లేక గదులలోనో తీరికగల దీర్ఘసాయం సమయములందు నిర్బంధింపబడుదురు.

మూడు నెలలకొకసారి మాత్రమే బంధువులు దర్శింపవచ్చును. అట్లే యుత్తరములను వ్రాయవచ్చును. ఎంతవికృతమగువ్యవధి? అయినను చాలమంది కీలాభముకూడ చేకూరదు. వారికి చదువు రానిచో (చాలమంది చదువురానివారే) వారే జయిలు అధికారి దయాధర్మము మీదనో యాధారపడవలెను. అతడు తనకిదివరకే యున్న పనిని పెంచుకొనుటకిష్టములేక సాధారణముగ దీని నెగురగొట్టును. ఒకవేళయుత్తరమున్వ్రాయుచో, చిరునామా సరిగనీయబడకపోవుటచే నది చావు ఉత్తరముల ఆఫీసుకుచేరును. బంధుదర్శనములు మరింత కష్టతరము. తప్పనిసరిగ నేజయిలు అధికారినో తృప్తిపరచినగాని, సాధారణముగ నవి సంభవింపవు. తఱచు ఖయిదీలను వివిధజయిళ్ళకు బదిలీచేయుచుందురు. అప్పుడు బంధువులు వారి నానవాలు పట్టజాలరు. తమ బంధువులతో సంవత్సరములకొలది యెట్టి సంబంధములేని ఖయిదీల ననేకమందిని నేను చూచితిని. మూడు నెలలు దాటినతరువాత జరిగెడి బంధుదర్శనములు చాల యసాధారణముగ నుండెడివి. కొంతమంది ఖయిదీలు వారిబంధువులు నొకగోడ కిరువంకల నుందురు. వారందరు నొక్కసారిగ మాట్లాడయత్నించెదరు. బంధుదర్శనమువలన కలుగవలసిన కొద్దిపాటి మానవస్పర్శ, కేకలుచేతను, అఱపులచేతను పూర్తిగా నశించిపోవును. చాలకొద్దిమంది ఖయిదీలకు, వేయింటికే యొక్కనికో, మంచియాహారములను యెక్కువ యుత్తరములను యెక్కువ బంధుదర్శనముల రూపమున నెక్కువ సౌకర్యములను కలుగచేసెడివారు. గొప్పరాజకీయ సాత్త్వికనిరోధోద్యమసమయమున వేలకొలది జనులు జయిళ్ళను నింపినపుడు ప్రత్యేకతరగతి ఖయిదీల సంఖ్య కొద్దిగ పెరిగెడిది. అప్పటికి నిది చాలతక్కువ. రాజకీయఖయిదీలలో

నూటికి 95 మంది స్త్రీపురుషులు, మామూలువిధముననే చూడబడు దురు. వారికి సౌకర్యములుకూడ నుండవు.

కొందరువ్యక్తులు, విప్లవకార్యములకు యావజ్జీవము లేక దీర్ఘ కాలము శిక్షింపబడినవారు దఱచు చాలకాలమువరకు నొంటరిగా నుంచబడుదురు. యు. పి. లో నిట్టివారినందరిని ఆచారవశముగా నొంటరికొట్టులలో పారవేయుచుందురు. మామూలుగా నీ యొంటరి కొట్టులు జయిలులో చేసిన నేరములకు ప్రత్యేకశిక్షకొరకు నియమింప బడును. కాని యీ వ్యక్తుల సందర్భములో సాధారణముగా చిన్న పిల్లలు – జయిలు వారినడక మార్గదర్శకముగ నుండినను–యొంటరిగ నుంచబడుదురు. కోర్టువారి శిక్షకుతోడు జయిలుశాఖవారు యెట్టి కార ణములను లేకుండ మరియొక భయంకరశిక్ష వేతురు. ఇది చాల యసా ధారణము, న్యాయవిరుద్ధము. కొద్దికాలమైనను యొంటరినిర్బంధము ననుభవించుట దుర్భరము. దానిని సంవత్సరములకొలది పెంచుట భయంకరమైన విషయము. మనస్సును నెమ్మదిగ, నిరంతరాయముగ పిచ్చి పట్టువరకు పాడుచేయుటయే దీనిఫలము. వెఱ్ఱిచూపు, భయ పెట్టబడిన జంతువాలకము తయారగును. అది యాత్మను డిగ్రీడిగ్రీ చొప్పున చంపుట, దానిని నెమ్మదిగా చెక్కు–చెక్కులుగా కోయుట, ఒకవేళ యట్టిమనిషి జీవించియున్నను, వికృతమానవుడై యీ ప్రపంచములో నుండతగనివాడగును. ఈ మనిషి యే నేరమైనను, యే దోషకార్యమునైనను చేసెనా? యను ప్రశ్న యెప్పుడు కలుగు చునేయుండెను. హిందూదేశములోని పోలీసుపద్ధతులు చిరకాలము నుండి సందేహాస్పదములు, రాజకీయ విషయములలో నివి మరింత యధికము. ద్విగుణము. యూరపియను లేక యురేషియను ఖయిదీలు వారి దోషము లెట్టివైనను, వారిబ్రతుకు యెట్టిదైనను, సరాసరి పెద్ద తరగతులలో నుంచబడుదురు. వారికిమృష్టాన్నము, తేలికపని, యెక్కువ యుత్తరములు, బంధుమిత్ర సందర్శనములు మొదలగునవి చేకూ రును. వారము వారము ఘాదిరీవచ్చుచుండుటచే నతనికి బాహ్య ప్రపం చముతో సంపర్కముండును. అతడు మంచిమంచి చిత్రములుగలవి దేశ

పత్రికలను, నచ్చువృత్తించెడు పత్రికలను చదువుచు నవసరమైనపుడు వారి కుటుంబములతో నుత్తర ప్రత్యుత్తరములను జరుపును.

ఈ యూరపియను ఖయిదీల కిట్టిసౌకర్యము లున్నందుల కేవ మును కుక్షించుటలేదు. ఏలనన నవి తక్కువగనేయున్నవి. కాని యితముల సంపర్కములో — స్త్రీలేమి, పురుషులేమి నెట్టిమానవ ప్రమాణము నెంతమాత్రమును పరిగణింపకపోవుట కొంచెము బాధ కరముగనే యుండును. ఖయిదీ యొక మానవుడుగ భావింపబడక పోవుటచే నతనికి లేక యామె కెన్నడు నట్టిమర్యాద చూపింపబడదు. ప్రభుత్వనిర్బంధ విధానముయొక్క యమానుష ప్రదర్శనము జయిలులో మనకు కాన్పించును. అది యనాలోచితముగ, నిర్లక్ష్యముగ పనిచేయుచు దానిచేతికి చిక్కు ప్రతిదానిని నలిపివేయు దయా శూన్యమగు యంత్రము. ఈ యంత్రమును ప్రస్ఫుటము చేయుటకే జయిలుచట్టము లుద్దేశపూర్వకముగ నిర్మింపబడెను. అభిమానమున్న స్త్రీ పురుషులకు ప్రాప్తమయినపు డీ యాత్మశూన్య పరిపాలన బుద్ధి జాడ్యమును, మనోవ్యధను కలిగించును. దీర్ఘకాల శిక్ష ననుభవించు వారొకొక్కప్పుడు తమ వ్యర్థజీవితమునకు భగ్నహృదయములై, చిన్న పిల్లలవలె వెక్కివెక్కి యేడ్చుటను నేను కండ్లారజూచితిని. ఆ వాతావరణములో మచ్చునకైనను కానరాని యొక సానుభూతివాక్యము, ఒక్క ధైర్యవచనము వారి ముఖమండలము నకస్మాత్తుగా సంతోష కృతజ్ఞతతో నింపివేసెడిది.

అయినను ఖయిదీలలోనే భూతదయాళుత్వ సౌహార్ద్రములకు సంబంధించి గుండెను కరగించునిట్టి కథనములు సంభవములు నెన్నియో కలవు. ఒకసారి జయిలు కలవాటుపడిన యొక గ్రుడ్డి ఖయిదీ పదమూడు సంవత్సరములైన తరువాత విడువబడెను. ఇంత దీర్ఘకాలము గతించిన తరువాత నతడు యెట్టియాస్కారము లేకుండ నమిత్రమగు ప్రపంచములోనికి బోవుచుండెను. అతనితోడి ఖయిదీ లతనికి కొంత సహాయము చేయగోరిరి. కాని వారంతగా చేయజాలక పోయిరి. జయిలు ఆఫీసులో దాచుకొనబడిన తనమట్టు నొకడు

యిచ్చెను. మరియొక డింకొక వస్త్రము నిచ్చెను. మూడవ ఖయిదీ కొకనికి యొక క్రొత్త చెప్పులజోడు ఆ యుదయముననే వచ్చెను. అతడు సగౌరవముగా దానిని నాకు చూపించెను. జయిలులో నది యొక గొప్పసొత్తు. కాని చాలకాలమతని సహచరుడుగానున్న యీ గ్రుడ్డిఖయిదీ కాలిజోడు లేకుండా వెళ్ళుట నతడుచూచి తన సరిక్రొత్త జోడు నతనికి హృదయపూర్వకముగ నిచ్చివేసెను. బయటకంటె జయిలులోనే యెక్కువ దయకలదని నే నప్పుడనుకొంటిని.

ఆ వత్సరము 1930 అద్భుతమగు రంగములతో నుత్తేజకరములగు సంభవములతో నిండియుండెను. జాలినంతను మేల్కొలిపి యుత్సాహపూరితులను చేయగలుగు గాంధీజీ యద్భుతశక్తి యాశ్చర్యజనకముగనుండెను. దానిలో నేదో కొంత మంత్రశక్తి యున్నట్లుండెను. 'అతడు మట్టిముద్దలనుండి వీరాగ్రేసరుల నుద్భవింపజేయగల శక్తికలవాడు' అని గాంధీజీనిగురించి గోఖ్లే యుపయోగించిన పదములు మా కందరకు జ్ఞప్తికివచ్చెను. శాంతియుతశాసనోల్లంఘనము జాతీయపరమావధిని సాధింపగల కార్యక్రమమే యని ఋజువగుచున్నట్లు కాన్పించెను. మనము జయమును పొందబోవుచున్నారమను యచంచల విశ్వాసము దేశములో బయలుదేరెను. మన మిత్రులు శత్రువులు కూడ నిట్లేతలంచిరి. ఉద్యమములో నుత్సాహముతో పనిచేయుచున్నవారిలో నొక నూతనోద్రేకము బయలుదేరి, యిది కొంతజయిలులోనికి గూడ ప్రాకెను. మామూలు ఖయిదీలు "స్వరాజ్యము వచ్చుచున్నది" అని చెప్పుచు దానిచే తమకు కొంత లాభము చేకూరగలదను స్వార్థచింతతో దానికొరకు కాతురతతో నెదురుచూచుచుండిరి. జయిలువార్డర్లు, బజారులలోని సంభాషణలనన్నింటిని వినుచు స్వరాజ్యము సమీపస్థమయినట్లే భావించుచుండిరి. చిన్నచిన్న జయిలు ఉద్యోగులు కొంచెము భయపడసాగిరి. జయిలులో మాకు దినపత్రికలు లేవు. ఒక హిందీవారపత్రిక మాకు కొన్ని వార్తల నిచ్చుచుండెడిది. ఈ వార్తలే తరచు మాయూహలను రగుల్కొలుపుచుండెడివి. నిత్యలాఠీచార్జీలు, అప్పుడప్పుడు కాల్పులు,

షోలాపూరు సైనిక శాసనము, జాతీయజెండాకు పదేసి వత్సరములు శిక్షలు. మన ప్రజలను ముఖ్యముగా స్త్రీలనుచూచి మేము గర్వించెడి వారము. నాతల్లి, భార్య, చెల్లెండ్రు, బంధువర్గములోనివారు, స్నేహితు రాండ్రు మొదలగువారి కార్యోత్సాహముచే నాకు ప్రత్యేకానందము కలుగుచుండెడిది. నేను జయిలులోనుండి వారికి దూరముగ నున్నను ఒక మహోద్యమములో సహచరులమైతిమను నూతన భావముచే మేము మరింత స్నేహితులమైతిమి. మాకుటుంబము మరింత పెద్ద బృందములో కలిసిపోయినట్లు కాన్పించెను. అయినను దాని పాతవాసనలు స్నేహము, బాంధవ్యము చెక్కుచెదరక నిలిచియుండెను; కమల యొక్క శక్తి, యుత్సాహము, శరీరదుర్బలత్వమును జయింప గలుగుట నా కాశ్చర్యముగనుండెను. నిరంతరము పనిచేయుచుండినను కొంతకాలమైన యామె స్వస్థముగనుండెను.

బయట ననేకమంది యుపద్రవములను బాధలను పొందుచుండ జయిలులో వారికంటె నే నెక్కువసుఖముగ కాలక్షేపము చేయుచున్నానను భావము నన్ను బాధింపదొడగెను; నేను బయటకు పో గోరితిని. కాని యది యసంభవమగుటచే నే నెప్పుడును పనిచేయుచు నా జయిలు జీవితమును కఠినమొనర్చుకొంటిని. నా స్వంతరాట్నము మీద నేను రోజుకు మూడునాలుగు గంటలు వడికెడివాడను. మరి రెండు మూడుగంటలు జయిలు అధికారులను ప్రత్యేకముగ నడిగి నేను నవారునేత నేసెడివాడను. నా కీ పనులు చాల ప్రీతిగ నుండెడివి. ఎక్కువ శ్రద్ధ యక్కరలేకుండ శ్రమనీయకుండ నవి నాకు పనికల్పించెడివి. అవి నా మనస్తాపమును చల్లార్చుచుండెడివి. నే నెక్కువగా చదువుచుండెడివాడను. తక్కిన కాలములో యిల్లు శుభ్రపరచుకొనుట బట్ట లుతుకుకొనుట మొదలగు పనులలో నుండెడివాడను. 'నాకువిడిఖయిదు' అగుటచే నేను పై పనులను స్వంతముగా కోరుకొని చేయుచుండెడి వాడను.

జయిలులోని నా నిత్యకృత్యములతోను, పైనజరుగుచున్న సంభవములను గురించిన యోచనలతోను నైనీ జయిలులో నేను నా

రోజులను వెళ్ళబుచ్చుచుంటిని. భారతదేశ జయిలు నిర్వహణ విధానమును పరిశీలించినపుడు నాకది భారతదేశములోని బ్రిటిషు ప్రభుత్వముకు తగియున్నట్లే కాన్పించెను; ప్రభుత్వపరికరములలో గొప్ప పటుత్వమున్నది. ఇది దేశములోని మానవసంపద నెంతమాత్రమును లక్ష్యముచేయక దేశముమీద ప్రభుత్వాధికారమును మాత్రము వృద్ధి చేయును. బయటకు జయిలు సమర్థతతో పరిపాలింపబడుచున్నట్లు కాన్పించవలెను. కొంతవరకు నిది సత్యమే! కాని యచ్చటకువచ్చిన దురదృష్ట మానవుల నభివృద్ధిపరచి వారికి సహాయము చేయుటయే జయిలుయొక్క ప్రధానోద్దేశ్యమను సంగతి నెవరును గుర్తించినట్లు కాన్పించదు. వారిని ఛేదించుడు! వేధించుడు! ఇదియే యాశయము. వారు జయిలును విడిచివెళ్ళునరికి వారిలో నావంతయు యుత్సాహము లేకుండ నుండవలెను. జయిలు యెట్లు నియమింపబడుచున్నది? ఖయిదీ లెట్లు అదుపులో నుంచబడి శిక్షింపబడుచున్నారు? చాల వరకు ఖయిదీల సహాయము తోడనే యిది జరుగుచున్నది. వారిలో కొంతమంది ఖయిదీవార్డర్లు (సి. డబ్ల్యూలు) లేక ఖయిదీ ఓవరు సీర్లు (సి. ఒ. లు)గ చేయబడుదురు. భయముచేతను బహుమతులును, ప్రత్యేక తగ్గింపులును (వారిశిక్షలో) దొరుకుననునాశతో వీ రిట్లు చేయుదురు. జీతములు తీసికొని పనిచేయు ఖయిదీలుకాని వార్డర్లు తక్కువగనుందురు. జయిలులో జరుగు కాపలా చాలవరకు ఖయిదీ వార్డర్లచేతను సి. ఒ. ల చేతను జరుపబడును. ఖయిదులో గూఢచారితనము ప్రబలముగనుండును. ఖయిదీలే గూఢచారులుగ నుండ ప్రోత్సహింపబడుదురు. ఖయిదీలలో నెట్టికలయిక సమిష్టి కార్యము జరుగనీయరు. ఇది సులభగ్రాహ్యము. ఏలనన వారిని చీల్చియుంచుటచేతనే వా రదుపులో నుంచబడుచున్నారు. బయట, మన దేశపరిపాలనలోగూడ నీ పద్ధతియే పయికంతగా కాన్పించక పోయినను, మరింత పెద్దయెత్తుమీద నడచుచున్నది. కాని యచ్చట నున్న సి. డబ్ల్యూలేక సి. ఒ. లు వేరు విధమున నుందురు. వారికిగొప్ప గొప్పబిరుదులుండును. వారియుద్యోగదుస్తులు యెక్కువ పటాటోప

ముగ నుండును. వారివెనుక జయిలులోవలెనే, రక్షకభటులు విచ్చు కత్తులతో నెప్పుడు సిద్ధముగ నుందురు.

ఆధునిక ప్రభుత్వమునకు జయిలెంత ముఖ్యమైనది, యెంత యవసరమైనది! అధమము ఖయిదీ యిట్లు భావింప మొదలిడును. జయిలులోని ప్రధానధర్మములు, పోలీసు, సైన్యములవుందర ప్రభుత్వము యొక్క వివిధపరిపాలనాధర్మములు నిమిత్తమాత్రములుగ కాన్పించును. ప్రభుత్వమును గుప్పిటలో నుంచుకొనువర్గమువారి యిచ్ఛను చలాయించు నిర్బంధపరికరమే నిజముగ ప్రభుత్వమగుచున్నదను మార్క్సు యొక్క సిద్ధాంతము జయిలులోనున్నవారికి బాగుగ నర్థము కాగలదు. ఒకనెలవరకు నేను నా కొఠారములో నొంటరిగనుంటిని. తరువాత నర్మద ప్రసాదసింగు వచ్చెను. అతనిరాక నాకు ముదావహముగ నుండెను. తరువాత రెండున్నర నెలలకు 1930 జూను ఆఖరు రోజున మా చిన్నయావరణ మసాధరణమగు నుద్రేకమున కాకరమయ్యెను. తలవనితలంపుగా మా తండ్రియు, డాక్టరు సయ్యదుమహమ్మదుగార్లు నచ్చుటకు ప్రాతఃకాలముననే వచ్చిరి. వారా యుదయముననే నిద్రించుచుండ నానందభవనములో నిర్బంధింపబడిరి.

# 31

## ఎఱవాడలో రాయబారము

మా తండ్రిని నిర్బంధించుటతో లేక కొంచెము ముందుగ కాంగ్రెసు వర్కింగుకమిటీ యక్రమసంఘముగ ప్రకటింపబడెను. దీనివలన బయట నొక నూతనపరిస్థితి యేర్పడెను. సభ జరుగుచుండ గనే కమిటీసంతయు నొక్కసారిగ నిర్బంధింపబడును. తాత్కాలి కాధ్యక్షుల కిచ్చిన యధికారముక్రింద వెంటనే క్రొత్తసభ్యులు జేర్చ బడుచుందురు. ఈవిధముగ ననేకమంది స్త్రీలు తాత్కాలిక సభ్యు రాండ్రయిరి. కమల వారిలో నొకతె.

తండ్రిగారు జయిలుకు వచ్చుసరికి చాలా యనారోగ్యముగ నుండిరి. అచ్చటనున్న పరిస్థితు లతని కెంతమాత్రము సరిపడలేదు. ప్రభుత్వమువారు వీనిని బుద్ధిపూర్వకముగ కల్పించలేదు. అతనికి కలుగు నసౌఖ్యములను తగ్గించుటకు వారు చేయగలిగినదంతయు చేయుటకు సిద్ధముగనే యుండిరి. కాని నైనీజయిలులో వారంతగా చేయజాలకపోయిరి. నా కొఠారులోని నాలుగు చిన్నగదులలోను యిప్పుడు మమ్ము నలుగురను క్రుక్కిరి. తండ్రిగారిని వేరొకచోట మరింత విశాలమైనప్రదేశములో నుంచెదనని జయిలు సూప రింటెండెంటు సూచించెను. కాని మాలో కొంతమంది యతనికి స్వయముగ సేవచేయుటకు వీలుగానుండుటకు మే మొకచోటనే యుండగోరితిమి.

వర్షకాలమప్పుడే ప్రారంభమగుచుండెను. పైకప్పులోనుండి వర్ష మచ్చటచ్చట కురియుచుండుటచే గదులలోకూడ పూర్తిగ పొడిగ నుండుట యసంభవముగనుండెను. రాత్రివేళ నతనిప్రక్క నెచ్చటవేయుట యనున దొక నిరంతరసమస్య యగుచుండెను. ఒక్కొక్కప్పు డతనికి జ్వరము వచ్చెడిది. చివరకు మా గదిదగ్గర మరియొక విశాలమగు వరండా నిర్మింపబడెను. ఈ వరండా బాగుగనే యుండెను. కాని

యిది తయారయిన వెంటనే మాతండ్రి విడిచివేయబడెను. మేము దీనిలాభమును బాగుగపొందితిమి.

జూలై మాసాంతమున ప్రభుత్వమునకు, కాంగ్రెసునకు మధ్య సర్. తేజబహదూర్ సప్రూ, యం. ఆర్. జయకరుగార్లు రాయబారములను నడుపుచున్నట్లు వదంతులు బయలుదేరెను. తండ్రిగారికి ప్రత్యేక ప్రసాదముగా పంపబడుచుండెడి యొక వార్తాపత్రికలో నేమిా విషయములను చదివితిమి. వైస్రాయియైన యిర్విను ప్రభువునకును, సప్రూ, జయకరులకును మధ్యజరిగిన యుత్తర ప్రత్యుత్తరములను కూడ నీ పత్రికలో చదివితిమి. తరువాత నీ 'సంధిచేయువారు' గాంధీజీని సందర్శించిరని వింటిమి. ఇట్లు పూనుకొని వచ్చుటకు వారి నేదిప్రోత్సహించెనో, లేక వారు దేనికొరకు ప్రయత్నించుచుండిరో మా కిసుమంతయు తెలియదు. తండ్రిగారు తమనిర్బంధమునకు కొద్దిరోజులుపూర్వము బొంబాయిలో నిచ్చిన యొక చిన్న స్టేట్‌మెంటు తమ కిట్టిప్రోత్సాహము నిచ్చెనని తరువాత వారు మాకు చెప్పిరి. మాతండ్రిగారితో సంప్రదించినమిాదట స్లోకోంబు నాకు దీనిని వ్రాసిరి. మాతండ్రి దీనినామోదించెను. ప్రభుత్వము కొన్నిషరతుల కంగీకరించినచో కాంగ్రెసు శాసనోల్లంఘనమును ఆపివేయుట కవకాశము లుండునని ఈ స్టేటుమెంటు భావించెను. అది నిర్దిష్టములేని తాత్కాలిక వ్యవహారము. తండ్రిగారు గాంధీజీని, నన్ను సంప్రదించుట కవకాశమున్నగాని ఈ నిర్దిష్టములేని షరతు యోచింపబడ నేరదని యది స్పష్టపరచెను. ఆ వత్సరము నేను కాంగ్రెసుప్రెసిడెంటు నగుటచే నాపేరుకూడ జేరెను. తండ్రిగారు నిర్బంధింపబడిన తరువాత, నైనీజయిలులో నా కీ సంగతిచెప్పిరి. తొందరలో తానట్టి యనిర్దిష్ట స్టేటుమెంటు నిచ్చితిననియు, దాని కపార్థములు కల్పింపబడవచ్చుననియు నతడు సవిచారముగ తెల్పిన సంగతి నాకు జ్ఞప్తియుండెను. దీనికి నిజముగా నపార్థము కల్పింపబడెను.

గాంధీజీయొద్ద చీటితీసికొని సప్రూ, జయకర్లు జూలై యిరువదియేడవ తేదీ హఠాత్తుగా మా జయిలులో ప్రవేశించిరి. ఆ దినము మరునాడు నేను వారితో దీర్ఘసంభాషణలను జరిపితిమి. తండ్రిగారప్పుడు జ్వరముతో నుండుటచే నివి చాల యలసట కలిగించెను. మా సంభాషణలు, వాగ్వాదములు తిలఘాతకురాలి చక్రభ్రమణము వలె తల తోక లేకుండ నొకరికొకరి కర్థముకాని భావములోను, భాషలోను జరిగెను. రాజకీయదృష్టిలో మా కంతగొప్ప భేదముండెను. ప్రభుత్వముకు, కాంగ్రెసుకు మధ్య సంధిజరుగుట కావంతయు నవకాశము లేదని మాకు విశదమయ్యెను. వర్కింగుకమిటీ సహచరులతో ముఖ్యముగా గాంధీజీతో, మొదట సంప్రదించకుండ నేమెట్టిసూచనను చేయనిరాకరించితిమి. గాంధీకికూడ నీయర్థమువచ్చునట్లు వ్రాసిపంపితిమి.

పదకొండురోజులయిన తరువాత ఆగష్టు యెనిమిదవ తేదీని డాక్టరు సప్రూ వైస్రాయి ప్రత్యుత్తరముతో మమ్ముచూచుటకు తిరిగివచ్చిరి. మేము యరవాడ వెళ్ళుటకు వైస్రాయి కభ్యంతరము లేదు. కాని బయటనుండి ప్రభుత్వముతో నింకను తీవ్రముగ పోరుసల్పుచున్న వల్లభాయిపటేలు, అబ్దుల్ కలాం అజాదు మొదలగు వర్కింగుకమిటీ సభ్యులను కలుసుకొనుటకు వైస్రాయియు, నతని కౌన్సిలుసభ్యులును అంగీకరింపజాలరని చెప్పి, యీ పరిస్థితులలో యరవాడ వెళ్ళుట కిచ్ఛగింతురా యని సప్రూగారు మమ్మడిగిరి. గాంధీజీ నెప్పుడైనను చూడబోవుటకు మాకెట్టి యభ్యంతరములేదనియు నుండజాలదనియు నే మితరసహచరులను కలుసుకొనుటకు వీలులేకపోవుటచే నేమెట్టి తుదినిర్ణయము చేయజాలమనియు నతనితో చెప్పితిమి.

ఆనాటి పత్రికయే (లేక పూర్వపురోజుపత్రిక) బొంబాయిలో భయంకరమగు లాఠీచార్జి జరిగెనని వల్లభాయిపటేలు, మాలవ్యాజీ, సదర్ షెర్వానీ మొదలగువారు వర్కింగుకమిటీయొక్క తాత్కాలిక సభ్యులుగనో, శాశ్వత సభ్యులుగనో, నిర్బంధింపబడిరని తెలిపెను.

వీని వలన పరిస్థితులేమియు చక్కబడలేదనియు నీ స్థితిని వైస్రాయికి స్పష్టముగ నెరింగింపవలసినదనియు మేము సప్రూగారితో చెప్పితిమి. ఏది ఎట్లున్నను గాంధీజీని సాధ్యమైనంత త్వరలో కలుసుకొనుటలో నుపద్రవమేదియు లేదని సప్రూగారనిరి. మేము యరవాడ వెళ్ళవలసి వచ్చినచో నైనీ జయిలులోనున్న డాక్టరు సయ్యదు మహమ్మదు, కాంగ్రెసు శెక్రటరీ యగుటచే మాతో కూడ రావలసియుండుననీ మే మిదివరకే సప్రూగారితో చెప్పియుంటిమి. రెండు రోజులయినతరువాత మేము ముగ్గురము ఆగష్టు పదియవ తేదీని ప్రత్యేకరైలుబండిలో నైనీ నుండి పూనా తీసికొనిపోబడితిమి. మా రైలు పెద్దస్టేషనులవద్ద ఆగక ప్రక్కనున్న చిన్నచిన్న స్టేషనులవద్ద ఆగుచుండెను. అయినను ఈవార్త వాయువేగమున ప్రసరించి జనులు గుంపులు గుంపులుగ ప్రతి స్టేషనుకు మా బండి యాగినను, ఆగకపోయినను రాదొడగిరి. పదకొండవ తేది రాత్రి ప్రొద్దుపోయినతరువాత పూనా సమీపమున నున్న కిర్కి చేరితిమి.

గాంధీజీయున్న కొఠారములోనే మమ్ముంచెదరనియు లేదా యతనిని వెంటనే చూతుమనియు మే మనుకొంటిమి. యరవాడ జయిలు సూపరింటెండెంటు యిట్టియేర్పాటు చేసెను. కాని నైనీనుండి మాతో వచ్చిన పోలీసు యుద్యోగి తెచ్చిన సందేశము ప్రకారమతడు చివరనిమిషములో తనయేర్పాటులను మార్చుకొనెను. సూపరింటెండెంటు కలనల్ మార్టినుగారు రహస్యమును దాచిపెట్టిరి. కాని తండ్రిగారు వేసిన యుక్తిప్రశ్నలవలన మేము మొట్టమొదట సప్రూజయకరుల సమక్షముననే గాంధీజీని కలుసుకొనవలెననుభావము స్పష్టమయ్యెను. మేము ముందుగా కలుసుకొనినచో మా దృష్టి మరింత బిరబిగియుననియు లేదా మేమంతకు మునుపటికంటె గట్టిపడుదుమనియు వారు భయపడిరి. కనుక నా రాత్రియు మరునటి రాత్రింబవళ్ళును మమ్ము వేరొక ప్రత్యేక కొట్టులోనుంచిరి. తండ్రిగారి కిది చాల కంపరముగనుండెను. నైనీ నుండి యింతదూరము నతడెవరిని కలుసుకొనుటకు వచ్చెనో యట్టిగాంధీజీని కలుసుకొననీయక యాశాభంగ

మొనరించుట మనోవ్యధగ నుండెను. పదమూడవ తేదీ యుదయము సప్రూ జయకర్లు వచ్చిరనియు, గాంధీజీ జయిలు ఆఫీసులో వారిని కలుసుకొనెననియు మమ్మచ్చటకు రాగోరిరనియు వర్తమానము వచ్చెను. తండ్రిగారు వెళ్ళుటకు నిరాకరించి, యనేక సమాధానములు క్షమార్పణలు చెప్పినమీదట మొదట గాంధీజీ నొక్కనినే చూచు షరతుమీద దీని కంగీకరించెను. తరువాత మా యందరికోరికపయి నన్ను యరవాడకు తీసికొనిరాబడిన వల్లభాయిపటేలు, జయరామదాసు దౌలత్ రామ్‌గార్లను, యెదుట స్త్రీల జయిలులో నుంచబడిన సరోజినీ దేవిని, మా కాన్ఫరెన్సులో కలియనిచ్చిరి. ఆ సాయంత్రము మా తండ్రిని, నన్ను, సయ్యదు మహమ్మదును గాంధీజీ యావరణలోనికి మార్చిరి. తరువాత మేము యరవాడలో నున్నంతకాలము అచ్చటనే యుంటిమి. వల్లభాయిపటేల్ జయరామ్‌దాస్ దౌలత్ రామ్‌గార్లు కూడ నచ్చటనే, యా కొద్దిరోజుల సలహా సంప్రదింపుల కొరకు నుంచబడిరి.

సప్రూజయకరులతో మా కాన్ఫరెన్సులు మూడురోజులు జరిగెను. మా యభిప్రాయములను వెల్లడించుచు శాసనోల్లంఘన మాపివేసి, ప్రభుత్వముతో సహకార మొనర్చుటకు మా కనీసపు షరతులను తెలుపు యుత్తరములను మార్చుకొంటిమి. ఈ యుత్తరములు తరువాత పత్రికలలో ప్రకటింపబడెను ♦

ఈ కాన్ఫరెన్సుల పరిశ్రమవలన తండ్రిగారికి హఠాత్తుగా 16వ తేదీన చాల హెచ్చు జ్వరము తగిలెను. దీనిచే మా ప్రయాణ మాలస్యమయ్యెను. మేము 19వ తేదీరాత్రి తిరిగి ప్రత్యేక రైలులో నైనీ పయనమైతిమి. బొంబాయి ప్రభుత్వమువారు తండ్రిగారి సుఖ ప్రయాణమున కన్ని యేర్పాటులను గావించిరి. యరవాడలోనున్న కొద్ది రోజులలోకూడ నతని సౌఖ్యములనుగురించి ప్రత్యేకశ్రద్ధ తీసికొనబడెను. యరవాడలో మేము దిగిన నాటిరాత్రి జరిగిన యొక చిన్న వినోద విషయము నాకు జ్ఞాపకమున్నది. సూపరింటెండెంటు అగు

♦ కనీసపు షరతులను తెల్పు యుత్తరములు రెండవ అనుబంధములో కలవు.

కల్నల్ మార్టిన్‌గారు మా తండ్రిగారి కెట్టియాహారము ప్రీతిగ
నుండునో ప్రశ్నించెను. తండ్రిగారు తనకు సరసమైన తేలిక యాహా
రము కావలెనని చెప్పుచు ప్రాతఃకాలము ప్రక్కనుండి లేచుట
తోడనే తీసికొను తేనీరు లగాయతు రాత్రి భోజనమువరకు నతనికి
కావలసిన వివిధోపహారములను వివరించిచెప్పెను. తండ్రిగా రతినిరా
డంబరముగ నమాయికముగ నిచ్చిన జాబితాలో తేలికయైన యాహా
రములే యున్నమాట నిశ్చయము. కాని యది దర్పముగనుండెను.
తండ్రిగారు విశ్వసించినట్లే సెవాయిహోటలులోగాని, రిట్జులోగాని
యది నిరాడంబరము, సామాన్యమైన యాహారముగనే భావింప
బడును. కాని యెఱవాడజయిలులో నిది వింతగ, ననుచితముగ,
దూరవిషయముగ కాన్పించెను. తండ్రిగారు తన యాహారముకొరకు
కావలసిన విలువయైన వివిధవస్తువులను వివరించుచుండ కల్నల్
మార్టినుగారి ముఖలక్షణములను నేను, మహామ్మదు వినోదముగ
పరిశీలించుచుంటిమి. అతడు భారతనాయకులలో నత్యుత్తముడు,
కీర్తివంతుడు నగువానిని చాలకాలమునుండి తనరక్షణలో నుంచు
కొనెను. అతనికి కావలసిన యాహారమంతయు మేకపాలు, ఖర్జూరపు
కాయలు, బహుశః అప్పుడప్పుడు నారింజకాయలు. ఇప్పు డతని
యొద్దకువచ్చిన క్రొత్తజాతి నాయకుడు విడ్డూరమైనవాడు.

మేము పూనానుండి నైనీ తిరిగి వెళ్ళునపుడు మరల పెద్ద
స్టేషనులలో నాగకుండ మూలమూలప్రదేశములలో నాగుచుంటిమి.
గుంపులు వెనుకటికంటె నధికమయి ప్లాటుఫారములను నింపుచు,
రైల్వేలైను పొడుగునను, ముఖ్యముగా వార్ధా, ఇటార్సీ, సాహా
న్పూరులలో, తేనెపట్టులవలె మూగుచుండిరి. అపాయములు కొంచె
ములో దాటిపోవుచుండెను. తండ్రిగారిస్థితి యంతకంత కధ్వాన్న
మగుచుండెను. అతని స్వంతడాక్టర్లు, రాష్ట్రప్రభుత్వముచే నియమింప
బడిన డాక్టర్లు ననేకమంది యతనిని పరీక్షించిరి. అతనికి జయిలు
అధమాధమగు ప్రదేశమని స్పష్టమయ్యెను. అచ్చట నతనికి యుచిత
మగు వైద్యసహాయము లభింపదు. అయినను పత్రికలలో నొక

స్నేహితుడు అనారోగ్యకారణముచే నతనిని విడిచిపెట్టవలెనని సూచించినపు డతనికి కోపము కలిగెను. తాను చేసినట్లే ప్రజలు భావింతురని యతని భయము. ప్రత్యేక పక్షపాతదృష్టితో తనను విడిచిపెట్టవలదనికూడ నతడు ఇర్విన్‌ప్రభువుకు తంతిపంపెను. కాని, యతనిస్థితి దినదినము పాడగుచుండెను. అతిత్వరితముగ నతనిబరువు తగ్గుచు నతనియాకారము మిగిలెను. సెప్టెంబరు 8వ తేదీని సరిగా పదివారములు జయిలు జీవితమయినతరువాత నతనిని వెడచిపెట్టిరి.

అతడు వెళ్ళిపోవుటతోడనే మా కొఠారము నిస్తేజము, నిర్జీవము నగు ప్రదేశమయ్యెను. అతడు మాతో నుండునపుడు మా కెంతయో పనియుండెడిది. అతనిసౌఖ్యమును పెంచుటకు మే మందరము-నర్మదాప్రసాదు, మహమ్మదు, నేను-చిన్న సేవలను చేయుచు మాదినముల నీ సంతోషావహమగు సేవతో నింపెడివారము. నేను నవారునేత మానివేసితిని. కొద్దిగా నూలు వడికెడివాడను. పుస్తకములను చదువుటకు నా కంతతీరికయుండెడిదికాదు. ఇప్పు డతడు వెళ్ళిపోవుటతోడనే మేము తిరిగి అయిష్టముగను, సంతోషశూన్యముగను మామూలునిత్య కృత్యములకు దిగితిమి. తండ్రిగారి విడుదలతో దినపత్రికకూడ నాపివేయబడెను. నాలుగైదు రోజులయినతరువాత మా బావమఱది రంజిత యస్. పండిట్ నిర్బంధింపబడి మా కొఠారముకే పంపబడెను. ఒక నెల యయినతరువాత, అక్టోబరు 11వ తేదీని, నా యారు మాసముల శిక్షాకాలము పూర్తియగుటచే నన్ను విడిచిరి. సంగ్రామ మింకను జరుగుచుండుటచేతను, తీవ్రతరమగుచుండుటచేతను నా కంత స్వేచ్ఛయుండదని నే నెరుగుదును. 'సంధికారకుల' ప్రయత్నములు వ్యర్థమయ్యెను. నన్ను విడిచిపెట్టినరోజుననే మరియొకటి రెండు ఆర్డినెన్సులను విడిచిపెట్టిరి. నేను బయటపడుటకు సంతోషించి నాకు దొరకు కొద్దిగడువులోనే గట్టికృషిచేయుట కాతురపడుచుంటిని.

కమల యప్పుడు యలహాబాదులో కాంగ్రెసుసేవలో మగ్నురాలైయుండెను. తండ్రిగారు ముస్సోరిలో నౌషధసేవ చేయుచుండిరి. నాతల్లియు చెల్లెండ్రు ఆయనతో నుండిరి. నేను అలహా

బాదులో నొకటెన్నర రోజులు చకచకపనిచేసి కమలతో ముస్సోరి వెళ్ళితిని. గ్రామసీమలలో పన్నుల నిరాకరణోద్యమమును ప్రారంభింప వచ్చునా కూడదా యను గొప్పసమస్య మమ్మెదుర్కొనెను. శిస్తులను పన్నులను చెల్లింపవలసిన సమయమాసన్నమయ్యెను. వ్యవసాయ దినుసుల ధరలన్నియు విపరీతముగా పడిపోవుటచే నెట్లైనను పన్నులు చెల్లుట చాలకష్టతరముగనుండెను. ప్రపంచ ఆర్థిక మాంద్య మిప్పుడు హిందూ దేశములో స్పష్టముగ కాన్పించుచుండెను.

శాసనోల్లంఘనములో నొకభాగమును, స్వతంత్రముగ దాని నిజపరిస్థితినిబట్టియు పన్నుల నిరాకరణము ప్రారంభించుట కది దివ్యమైన శుభముహూర్తము. భూఖామందులు సేద్యముచేయు వ్యావసాయకులుగూడ నా సంవత్సరాదాయమునుండి పూర్తి పన్నులు చెల్లించుట యసాధ్యముగ నుండెను. దాచుకొనిన ద్రవ్యమైనను న్నచో వారు దానిని కక్కవలెను లేదా ఋణముచేయవలెను. జమీందారులకు సాధారణముగ వెనుక నేదోకొంతయుండును. లేదా వారెక్కువసుల భముగా నప్పుచేయగలరు. ఎప్పుడు దరిద్రము, కరవుచేత బాధపడు వ్యవసాయదారు వెనుక నేమియునుండదు. అట్టిపరిస్థితులలో ప్రజాస్వామిక దేశములో లేక వ్యవసాయదారులకు క్రమమైన సంస్థలు మంచి పలుకుబడి యున్నచోట వారిదగ్గర నెక్కువగా వసూలు చేయగలుగుట కేవల మసాధ్యము. హిందూదేశములో వారి పలుకుబడి, దేశములో కొన్నిచోట్ల కాంగ్రెసువారి కండగానున్నచోట్లతప్ప, యత్యల్పము. పరిస్థితులు దుర్భరమగుచో వ్యావసాయిక తిరుగుబాటు కలుగునను నిరంతరభయము మాత్రము కలదు. కాని వారనేక పురుషాంతరములనుండి చెప్పుకొనకుండ నెట్టిదుస్థితినైన దిగమ్రింగుచుండుట కలవాటుపడిరి. ఆ సమయములో గుజరాతులోను, మరికొన్ని ప్రాంతములలోను పన్నుల నిరాకరణోద్యమ మభివృద్ధిలో నుండెను. కాని యవియన్నియు శాసనోల్లంఘనములోని భాగములు; కేవల రాజకీయోద్యమములు. ఇవి రైతువారీపద్ధతిగలప్రాంతములు; రైతులే ప్రత్యక్షముగ ప్రభుత్వముతో సంబంధము కలిగియుందురు. వారి

పన్నుల నిరాకరణము వెంటనే ప్రభుత్వమునకు నష్టము కలిగించెను. సంయుక్తపరగణాలసంగతి వేరు. మాది జమీందారీ తాలూకుదారీ ప్రాంతము. వ్యవసాయదారులకు, ప్రభుత్వముకు మధ్యనిచ్చటమధ్యవర్తి మరిగొకడుండును. వ్యవసాయదారులు శిస్తులను చెల్లించుట మాని వేసినచో జమీందారులకు దెబ్బతగులును. ఈ విధముగ తరగతులకు చెందిన సమస్యకూడ బయలుదేరెను. కాంగ్రెసు మొత్తము మీద, కేవలము జాతీయసంస్థ. ఇందులో చాలమంది మధ్యరకము జమీందారులు, కొద్దిమంది పెద్దజమీందారులు కలరు. తరగతుల మధ్య పోరాటము జమీందారులకు కోపము కల్గించు విషయమును పురస్కరించుకొని వచ్చుటకు దానినాయకు లత్యంతభయపడుచుండిరి. కనుక వారు శాసనోల్లంఘనమారంభమైన మొదటి యారుమాసములలోను. పరిస్థితులు దీని కెంతయు ననుకూలముగనున్నట్లు నాకు కాన్పించినను గ్రామములలో పన్నుల నిరాకరణోద్యమము ప్రోత్సహింపరైరి. ఈ విధముగగాని మరేవిధముగగాని తరగతులలోని సమస్యలను లేవదీయుటకు నేను వెరువలేదు. కాని కాంగ్రెసు, దానిస్థితినిబట్టి, తరగతులమధ్య పోరాటమును ప్రోత్సహింపజాలదని నేను గుర్తించితిని. అయినప్పటికి, యది జమీందారులను రయితులనుగూడ పన్నుల నీయవలదని ప్రోత్సహింపవచ్చును. సామాన్యజమీందారు ప్రభుత్వము కీయవలసిన కట్టుబడిని బహుశః చెల్లింపవచ్చును. కాని యది యతని దోషమేయగును.

అక్టోబరులో నేను జయిలునుండి బయటకు వచ్చుసరికి రాజకీయ ఆర్థికపరిస్థితులు రెండు గ్రామములలో పన్నుల నిరాకరణమును వాంఛించుచున్నట్లు నాకు కాన్పించెను, వ్యవసాయదారుల ఆర్థిక కష్టములు తేటతెల్లముగ నేయుండును. రాజకీయముగ, మన శాసనోల్లంఘన కార్యక్రమమింకను ప్రతిచోట విజృంభించుచున్నను, కొంచెము చప్పబడుచుండెను. జనులు కొద్దికొద్దిగ, నొక్కొక్కప్పుడు గుంపులుగ, జయిలుకు వెళ్ళుచునేయుండిరి. కాని వాతావరణములోని వేడిచల్లారెను. హర్తాళములతోను, యుత్సవములతోను, పట్టణములు, మధ్యతరగతులవారు కొద్దిపాటివిసిగిరి. ఉత్తేజముకలిగించున దేదియో

యొక్కటియుండవలెను. క్రొత్తరక్తము పొంగవలెను. రయితులనుండి కాక నిది మరెచ్చటనుండిరాగలదు ? అచ్చట మనకు కావలసినంత జనస్తోమతకలదు. మరియునది ప్రజాసామాన్య ప్రయోజనములకు చెందిన ప్రజల యుద్యమము. నా దృష్టిలో నతిముఖ్యమైన సాంఘికసమస్యలను లేవదీయవలెను.

అలహాబాదులోనున్న రోజున్నరలో నా సహచరులు, నేను దీనినిగురించి చర్చించితిమి. స్వల్పగడువులో మేమచ్చట మా రాష్ట్రి కాంగ్రెసువర్కింగుకమిటీ సభనుజరిపి, చాలాకాలము తర్జనభర్జనచేసిన తరువాత శాసనోల్లంఘనమున కనుజ్ఞయిచ్చుటకు నిశ్చయించి యేజిల్లాయయినను దానిని నడిపించుకొనుట కధికారమిచ్చితిమి. రాష్ట్రిములో నెచ్చటను మేమే దానిని ప్రకటింపలేదు. తరగతులమధ్య పోరాటము లేకుండచేయుటకు కార్యనిర్వాహకవర్గమువారు దీనిని జమీందారులకు రయితులకుగూడ వర్తింపచేసిరి. ప్రధానమగు సమాధానము రయితులనుండియే వచ్చునని మే మెరుగుదుము.

ముందడుగు వేయుట కిట్టి యనుజ్ఞ బడసినతరువాత మా అలహాబాదు జిల్లాయే మొట్టమొదటియడుగు వేయగోరెను. యీ నూతనోద్యమమున కొకవికాసము కలుగజేయుటకు వారమురోజులయిన తరువాత బాధ్యతగల రయితు మహాసభ నొకదానిని జరుపుటకు మేము నిశ్చయించితిమి. జయిలునుంచి వచ్చిన ప్రథమదినముననే నేను తృప్తికరమగు పనిచేసితినని భావించితిని. దీనికితోడు అలహాబాదు పట్టణములో నే నొక పెద్ద బహిరంగసభలో దీర్ఘముగ నుపన్యసించితిని. ఈ యుపన్యాసములకే తరువాత నేను తిరిగి శిక్షింపబడితిని.

తరువాత అక్టోబరు పదమూడవతేదీని కమల నేను తండ్రిగారితో మూడురోజులుగడుపుటకు ముస్సోరీవెళ్ళితిమి. అతడు కొంచెమారోగ్యముగనున్నట్లు కాన్పించెను. సుగుణముగనుండెనని వ్యాధి తగ్గుచున్నదని భావించి నే నందుకు సంతసించితిని. ప్రశాంతమును, సంతోషప్రదమునగు ఆ మూడుదినములు నా కెప్పుడు జ్ఞప్తియందుండును. స్వగృహ మెంత సౌఖ్యదాయకము ! నా కుమార్తె ఇందిర, నా చెల్లెండ్రు – ముగ్గురు ఆడుబిడ్డలు నచ్చటనేయుండిరి. నేను పిల్ల

లతో నాపక్కనె నడిచివాడను. ఒక్కొక్కప్పుడు మే మందరమును యింటిచుట్టు సతిదర్పముగా నొక పెద్ద యుత్సవము జరిపెడివారము. అందరిలో చిన్నదియగు మూడు నాలుగేండ్లబిడ్డ మా జెండాకీర్తన యగు, 'జెండా ఊంచా రహే హమారా' (మా జెండా గగనమార్గమున నెగురును గాక) యను కీర్తనమును పాడుకొనుచు యుత్సవమును నడుపుచుండెడిది. మృత్యుదంష్ట్రికరాళములను తెరచుకొని వచ్చిన యీ వ్యాధి మా తండ్రిని నాయొద్దనుండి యపహరించుటకు ముందు నే నతనితో నా మూడుదినముల నే గడిపితిని. నేను వెంటనే నిర్బంధింపబడుదునని పసిగట్టి, బహుశః నన్నింకను మరికొంచెము చూడనెంచి, మా తండ్రి యలహాబాదు తిరిగివచ్చుటకు హఠాత్తుగా నిశ్చయించుకొనెను. 19 వ తేదీన అలహాబాదులో జరుగనున్న రయితు మహాజనసభ కందుకొనుటకు కమల నేను పదిహేడవ తేదీని ముస్సోరినుండి దిగితిమి. తండ్రిగారు, తక్కినవారితో, మరునాడు వచ్చుట కేర్పాటు గావించుకొనిరి.

మా గృహోన్ముఖప్రయాణము కొంత యుద్రేకజనకముగ నుండెను. నేను డేరాడూను విడుచుచుండగా 144 వ శెక్షను నాపైన నమలుజరుపబడెను. లక్నోలోకూడ నాపై మరియొక ఆర్డరు 144 వ శెక్షను క్రింద బనాయింపబడెనని వింటిని. వేలకొలది జనము మూగుటచే పోలీసుఆఫీసరు దానిని నా కందజేయజాలక పోయెను. మున్సిపాలిటీవారు నా కొక వినతిపత్రము సమర్పించిరి. తరువాత మోటారులలో మేము అలహాబాదు వెళ్ళితిమి. త్రోవలో ననేకమంది రయితు మహాజనుల కుపన్యసించుటకు అనేకచోట్ల నాగుచు 18 వ తేదీ రాత్రికి అలహాబాదు చేరుకొంటిమి.

19 వ తేదీ యుదయము నాపై మరియొక ఆర్డరు (144 వ శెక్షను క్రింద) సిద్ధమయ్యెను. ప్రభుత్వమువారు నన్ను వెంటాడించుచున్నారను సంగతి విదితమగుచునే యుండెను. నే నిక కొన్నిగంటలలో నుంటిని. నేను తిరిగి నిర్బంధింబడులోపల కిసాను సభకు హాజరు కావలెనను నత్యంతతో నుంటిని. మేము దీనిని ప్రతినిధుల రహస్య

సమావేశమేయని ప్రకటించి యల్లే పరాయివారినెవరిని దానిలోనికి రానీయలేదు. అది యలహాబాదు జిల్లాకు కూలంకషమైన ప్రాతినిధ్యమును వహించెను. నాకు జ్ఞప్తియున్నంతవర కందులో 1600 మంది ప్రతినిధులుండిరి. జిల్లాలో పన్నుల నిరాకరణమును ప్రారంభించుట కత్యుత్సాహముతో సభలో తీర్మానింపబడెను. మా ప్రధాన నాయకులలో మాత్రము కొంత సందేహముండెను. ఇట్టి సాహసకార్యము జయప్రదమగునా యను సందేహము. ఏలనన పెద్దజమీందారుల పలుకుబడి, యధికారము ప్రజలను భయోత్పాతములో ముంచివేయు నంత యధికముగా నుండెను. ప్రభుత్వమువారు వారి కండగనుండిరి. రయితులు యీ ధాక కాగగలరా? కాని హాజరయిన పదునారు వందలమంది రైతుప్రతినిధులలోను సందేహము సంశయము యానంతయు లేదు. అథమము అది పయికి కాన్పించలేదు. ఆ సభలో మాట్లాడినవారిలో నేనొకడను. దీనివలన బహిరంగసభలో మాట్లాడ కూడదని నాపై జారీచేయబడిన 144 వ సెక్షనును ధిక్కరించితినో లేదో నాకు తెలియదు.

తరువాత నేను నా తండ్రిని తక్కిన కుటుంబమును తీసుకొని వచ్చుటకు స్టేషనుకు వెళ్ళితిని ఆనాడు బండి యాలస్యమయ్యెను. వారు వచ్చుటతోడనే రయితులకు పట్టణవాసులకు సంబంధించిన యొక సభలో నుపన్యసించుటకు నేను వారిని విడిచి వెళ్ళితిని. కమలయు నేనును చాల డస్సిపోయి యా సభనుండి రాత్రి యెనిమిదిగంటలకు తిరిగి వచ్చుచుంటిమి. నేను తండ్రిగారితో మాట్లాడవలెనని కుతూహలపడుచుంటిని. అతడు తిరిగివచ్చినతరువాత మేము తిన్నగా మాట్లాడుకొనకపోవుటచే నతడు నా కొర కెదురు చూచుచుండునని నే నెరుగుదును త్రోవలో మా మోటరు మా యింటికి కనుచూపు మేరలో నాపివేయబడెను. నన్ను నిర్బంధించి యమునాతరంగిణిని దాటించి నైనీలో నా మామూలుబసకు తీసికొనిపోయిరి. మా కొర కెదురు చూచుచున్న కుటుంబమునకీ క్రొత్త సమాచారము తెల్పుటకు కమలయొక్కతెయే ఆనందభవనమునకు వెళ్ళెను. సరిగా 9గం.లు కొట్టుసరికి నేను నైనీజయిలు సింహద్వారమును తిరిగి ప్రవేశించితిని.

## సంయుక్తరాష్ట్రములలో పన్నుల నిరాకరణము

ఎనిమిదిరోజుల తరువాత నేను తిరిగి నైనీజయిలులో నా యెప్పటి పాతకోఠాములో సయ్యదు మహమ్మదు, నర్మదా ప్రసాదు, రంజిత్ పండిట్ గార్లను కలుసుకొంటిని. కొన్నిరోజులయిన తరువాత నేను విడువబడిన మరునాడు అలహాబాదులో నేనిచ్చిన యుపన్యాసములోని యనేకభాగముల కనేకచార్జీలు తయారుచేసి జయిలులోనే నన్ను విచారణచేసిరి. నేను వాదించుకొనక కోర్టులో నొక చిన్న స్టేటుమెంటు నిచ్చితిని. 124 ఎ సెక్షనుక్రింద రాజద్రోహమునకు నాకు 18 మాసములు కఠినవరకము 500 రూపాయలు జుల్మానా విధించిరి. 1882 లోని యుప్పుచట్టముక్రింద నారుమాసములు రు 100 లు విధించిరి. 1930 లోని యూరవ ఆర్డినెన్సుక్రిందకూడ నారుమాసములు, 100 రూపాయిలు విధించిరి. చివర రెంటిని యేకకాలమందే యనుభవింప వలెను. కనుక మొత్తము రెండుసంవత్సరములు కఠినవరకము, జుల్మానాలు చెల్లింపనందుకు మరియైదుమాసములు అనుభవింపవలెను. ఇది నా కయిదవపర్యాయము. అయిదవశిక్ష.

నన్ను తిరిగి నిర్బంధించుటయు, శిక్షించుటయు శాసనోల్లంఘనోద్యమ స్వభావమును తాత్కాలికముగా కొంత మార్చగలిగెను. అది మరికొంత యుత్సాహమును, శక్తిని ప్రదర్శించెను. దీనికి చాల వరకు తండ్రిగారే కారకులు. నా నిర్బంధమునుగురించి కమల చెప్పినపు డతనికి కొంచెము విచారముకలిగెను. వెంటనే యతడు కోలుకొని తన ముందరనున్న బల్లగుద్ది తానిక వ్యాధిగ్రస్తుడుగ నుండ జాలనని గర్జించెను. అతడారోగ్యవంతుడుగనుండి వ్యాధికి లొంగక వీరకార్యమును చేయబోవుచుండెను. అది ధైర్యమైన నిశ్చయమే, కాని లోపలనుండి యతనిని తినివేయుచున్న యీ విషవ్యాధిని జయించి నశింపుచేయుట కెట్టి యిచ్ఛాశక్తియు చాలదయ్యెను. కాని యతనిని చూచినవారాశ్చర్యపడునట్లు కొద్దిరోజు లతనిలో గొప్ప

మార్పు కలిగెను. అతడు యఱవాడలోనున్నదిలగాయితు, కొన్ని మాసములనుండి యుమ్మిలో రక్తము కక్కుచుండెను. అతడిట్లు నిశ్చయించిన వెంటనే యకస్మాత్తుగా రక్తముపడుట మానివేసెను. కొన్ని రోజులవరకు నది మరల కాన్పించలేదు. దానికతడు చాల సంతసించి నన్నుచూచుటకు జయిలుకు వచ్చినపు డీవిషయము సగర్వముగా నా కెఱింగించెను. కాని దురదృష్టవశాత్తు అది కొద్దికాలమే యట్లుండి తరువాత రక్తము మరింత జోరుగా పడనారంభించెను. వ్యాధి తిరిగి తలయెత్తెను. ఈ మధ్యకాలములో నతడు తన వెనుకటిశక్తితో పని చేసి దేశమంతట శాసనోల్లంఘనమునకు కొంత వికాసము కలిగించెను. వివిధప్రాంతములనుండి వచ్చినవారితో నతడు సంప్రదించి వారికి వివరములగు నాదేశములనిచ్చి పంపించెను. దేశమంతట జరుపగలందుల కతడొక యుత్సవ దినమును నిశ్చయించెను. ఆరోజున నాసేతుహిమాచల పర్యంతము బహిరంగసభలలో నేనిచ్చిన యుపన్యాసములలోని నేరములని యెంచబడిన భాగములు చదువబడెను. ఆ దినమున ననేక లాఠీ ఛార్జీలు, యుత్సవములను, సభలను బలవంతముగా తరిమివేయుట మొదలగునవి జరిగెను. ఆ యొక్క రోజున దేశమంతట నయిదువేల మంది నిర్బంధింపబడినట్లు మదింపు వేయబడెను. అదియెంత యసామాన్యమగు జన్మదినోత్సవము !

వ్యాధిగ్రస్తుడై ఈ బాధ్యతను వహించుటయు, తనశక్తిని ధారపోయుటయు తండ్రిగారి కనర్థదాయకముగ నుండెను. పరిపూర్ణ విశ్రాంతి తీసికొనవలసినదని నే నాయనను ప్రార్థించితిని. అతని కట్టి విశ్రాంతి హిందూదేశములో కలుగుట యసంభవమనియు, నతని మనసు యెప్పుడును, సంగ్రామమునిూదనే లగ్నమయి యుండుననియు, విధాయికముగ ప్రజలు సలహాకొఱకతనియొద్దకు వెళ్ళుచుందురనియు నేనే గుర్తించితిని. కనుక రంగూను, సింగపూరు, డచ్చియిండీసువైపు కొద్దికాలము సముద్రయానము చేయవలసిదని నేను సూచించితిని. అతనికది బాగుగనే కాన్పించెను. ప్రయాణములో నతనితో నొక డాక్టరు స్నేహితుడుకూడ నుండుట కేర్పాటు

గావింపబడెను. ఈ యుద్దేశ్యముతోనే నతడు కలకత్తా వెళ్ళెను. కాని యతని స్థితి దిగజారుచుండుటచే నతడిక ముందుకు పోజాలక కలకత్తా సమీపమున యేడువారములుండెను. కమలతప్ప తక్కిన కుటుంబము యావత్తు అతని కలుసుకొనెను. కమల చాలకాల మలహాబాదులోనే యుండి కాంగ్రెసుసేవ చేయుచుండెను.

పన్నుల నిరాకరణోద్యమముతో గల సంబంధమునుబట్టియే బహుశః నా పునర్నిర్బంధ మంతత్వరితము చేయబడెను. నిజమునకు యుక్తప్రతినిధులింకను అలహాబాదులో నుండగనే, కాన్ఫరెన్సు అయిన వెంటనే, పన్ను ఆరోజుననే నిర్బంధించుటకంటె మరేదియు నా యుద్యమమున కంతటిశుభము చేకూర్పజాలకపోయెడిది. దీని వలన వారియుత్సాహ మినుమడించెను. వారు కాన్ఫరెన్సులోని తీర్మానములను జిల్లాలోని గ్రామగ్రామమునకు తీసికొనిపోయిరి. పన్నుల నిరాకరణము ప్రారంభించినట్లు రెండురోజులలో జిల్లా యంతయు ప్రాకిపోయెను. ప్రతిచోట ప్రజలు దీనియెడల నుత్సాహపూరితులై యుండిరి.

ఆ రోజులలో వార్తల నందచేయుట మాకున్న కష్టములలో ప్రధానకష్టము. మే మేమిచేయుచుంటిమో, ప్రజ లేమిచేయగోరుచుంటిరో వారికి తెలుపుట కష్టముగనుండెను, జుల్మానాలను వేయుదురనియు, నణచివేయుదురనియు భయపడి వార్తాపత్రికలు మా వార్తలను ప్రకటింపకుండెను. అచ్చుఆఫీసులు మా కరపత్రములను, నోటీసులను ముద్రింపవు. ఉత్తరములు, టెలిగ్రాములు పరీక్షింపబడుచు తరుచు ఆపివేయబడుచుండెను. స్వయముగ వార్తల నందచేయువారికి కట్టలనిచ్చి పంపించుటొక్కటే నమ్మకమైన పద్ధతి. వీరి నప్పుడప్పుడు నిర్బంధించుచుండెడివారు. ఇది చాల వ్యయకరము. దీనికెక్కువ క్రమశిక్షణ కావలసియుండెను. మొత్తముమీద నిది కొంతజయప్రదముగనే సాగింపబడెను. రాష్ట్ర కేంద్రములతోనే నిరంతర సంబంధముండెడిది, పట్టణములలోనే నెట్టి వార్తలనైనను వ్యాపింపజేయుట యంతకష్టమైన పని కాదు. ఈ యక్రమవార్తాపత్రి

కలుగను వచ్చుచుండెడివి. ప్రజలు వాటికొరకెప్పుడు నెదురుచూచు చుండెడివారు. పట్టణములలో టముకు వేయుట యొకవిధము. సాధారణముగా దీనివలన టముకు వేయువాడు నిర్బంధింపబడుచుండెను. ప్రతివాడు అరెస్టు అగుటకు సంసిద్ధముగా నుండుటచే దీనినెవరును లక్ష్యముచేయలేదు. ఈ పద్ధతులన్నియు పట్టణములకు సరిపడెను. కాని గ్రామములలో నివి యంత సులభముగా పనిచేయవు. వార్తల నందించువారిమూలమునను, సైక్లోస్టైలు నోటీసులమూలమునను ముఖ్యమైన గ్రామకేంద్రములతో కొంతసంబంధముండెను. కాని యది తృప్తికరముగలేదు. దూరగ్రామములకు మా సందేశములు చేరుటకు చాలకాలము పట్టెడిది.

అలహాబాదులోని కిసాను కాన్ఫరెన్సు కీ కష్టము తొలగిపోయెను. జిల్లాలోని ప్రతి ముఖ్య గ్రామమునుండియు దానికి ప్రతినిధులు వచ్చిరి. వారు తమతమ గ్రామములకు తిరిగివెళ్ళునపుడు నా నిర్బంధమును గురించి కాన్ఫరెన్సులోని క్రొత్తతీర్మానములను గురించి వార్తలను ప్రజలకందజేసిరి. ఆ పదునారువందలమందియు పన్నులనిరాకరణమును బోధించు యుత్సాహపూరిత ప్రచారకులయిరి. కనుక నీ విధముగ నుద్యమప్రారంభవిజయము నిశ్చయమయ్యెను. ఆ ప్రాంతములోని రయితులందరు మొత్తంమీద ప్రారంభములో పన్నులను చెల్లింపరనుట కెట్టి సందేహము లేదు. తగినంత భయమును కలిగించినగాని వారసలే చెల్లింపరు. ప్రభుత్వ, జమీందారీ దౌర్జన్య, భయోత్పాతములముందర, వా రెంతవరకు నిలువగలరో యెవరును చెప్పజాలరు.

మేము జమీందారులను, రయితులనుకూడ చెల్లింపవలదంటిమి. సిద్ధాంతరీత్యా ఇది యొక తరగతికి సంబంధించిన సందేశము కాదు. ఆచరణవచ్చుసరికి చాలమంది జమీందార్లు తమ రెవిన్యూ చెల్లించిరి. జాతీయపోరాటముయెడ సానుభూతికలవారుకూడ కొందరు చెల్లించిరి. వారిమీద నెక్కువ వత్తిడిచేయబడెను. వా రెక్కువ

నష్టము పొందుదురు. అయినను వ్యవసాయదారులు చెల్లింపక పన్నుల నీయలేరు. కనుక మా ఉద్యమము ఆచరణలో శిస్తులనిరాకరణ నోద్యమ మయ్యెను. అది అలహాబాదుజిల్లానుండి రాష్ట్రములోని మరి కొన్నిజిల్లాలకు ప్రాకిపోయెను. చాలజిల్లాలలో దానిని శాస్త్రీయముగ నమలుపరుపలేదు. లేక ప్రకటింపలేదు. కాని రయితులు శిస్తులను చెల్లింపలేరు. లేక చాలమంది ధర లమితముగా పడిపోవుటచే యెంత మాత్రము చెల్లింపజాలకుండిరి. ప్రభుత్వము పెద్ద జమీందారులు చాల నెలలవరకు తిరుగుబాటుచేసిన రయితాంగమును భయపెట్టుట కెట్టి తీవ్రచర్యను తీసికొనలేదు. శాసనోల్లంఘనముతో గూడిన రాజ కీయసంగ్రామ మొకవంక, వ్యావసాయకదుర్భిక్షము తెచ్చిపెట్టిన యార్థికమాంద్య మొకవంక నుండుటచే వారికి మనస్థైర్యము చిక్క లేదు. ఈ రెండు నొకదానిలో నొకటి కలిసిపోయెను. ప్రభుత్వ మెప్పుడు రయితాంగ తిరుగుబాటుకు భయపడుచుండెను. లండనులో రౌండు టేబులు కాన్ఫరెన్సు జరుగుసమయమున హిందూదేశములో తమ కష్టములను పెంచుకొనుటకు, మరింత యుద్భృత 'బల' ప్రదర్శనము చేయుటకు ప్రభుత్వము పూనుకొనలేదు.

యు. పి. లోని పన్నుల నిరాకరణోద్యమమువలన యు. పి, కి. సంబంధించినంతవర కొక సుగుణము కలిగెను. అది మన సంగ్రామ మునకు నూతనోత్తేజము చేకూరుటయేగాక దానికి మరింతవిశాలము, శాశ్వతమునగు పునాదియేర్పడెను. మన పట్టణప్రజలకు అలసట, విసుగు దల జనించినను, మధ్యతరగతి ప్రచారకుడు చప్పబడినను యు. పి. లో నీ యుద్యమ మెప్పటివలె బలముగనుండెను, దానికి మున్నెన్నడు కలుగని బలముకూడ కలిగెనని చెప్పవచ్చును. ఇతరరాష్ట్రములలో నిచ్చట జరిగినంతమార్పు జరుగకపోవుటచే, పట్టణములే వీనిని నడు పుచు మధ్యతరగతులవారి యలసటచే నుద్యమ మంతకంతకు క్షీణించు చుండెను. ఉద్యమములో మొదటినుండియు ప్రధానపాత్ర వహించిన బొంబాయివంటి మహానగరముకూడ కొంచెము చప్పబడుచుండెను.

అచ్చట, మరియితరచోట్ల నధికారధిక్కారము, నిర్బంధములు సాగు చునేయుండెను. కాని యిదియంతయు కొంతకృత్రిమముగ కాన్పించెను. ఉత్సాహశక్తి నశించెను. ఇదియంతయు సహజము. ఏలనన నొక విప్లవస్థాయిలో ప్రజలను చిరకాలముంచుట యసాధ్యము. సాధారణముగా నిది కొన్నిరోజులుమాత్రమే సాధ్యమగును. కాని శాసనోల్లంఘనములో దీనిని నెలలవరకుసాగించు యద్భుతశక్తికలదు. తరువాతకూడ కొంచెము తక్కువస్థాయిలో నది దీని నెంతకాలమయినను నడుపగలదు.

ప్రభుత్వ నిర్బంధము లధికమయ్యెను. ఇంతవరకు నాశ్చర్యముగా పనిచేసిన స్థానిక కాంగ్రెసుకమిటీలు, యువజనసంఘములు నక్రమ సంఘములుగ ప్రకటింపబడి యణచివేయబడెను. జయిళ్ళలోని రాజకీయ ఖయిదీల యాదరణ యధ్వాన్నముగనుండెను. జయిలునుండి విడుదలచేయగుటతోడనే ప్రజలు తిరిగి రెండవశిక్ష ననుభవించుటకు జయిలుకు సిద్ధమగుచుండుట ప్రభుత్వమునకు మరింత కన్నెఱ్ఱగా నుండెను. శిక్షింపబడినను మోకరించని యీ ధిక్కారము పాలకులనైతికాధిక్యతకు భంగము కలిగించెను. జయిలునియమముల నుల్లంఘించిరనుకారణమున నవంబరు లేక డిశంబరు ప్రథమవారములో (1930) యు. పి. జయిళ్ళలో కొందరిని కొరడాలతో మోదిరి. ఈ వార్త నైనీజయిలులో మాకుచేరి మమ్ము కొంత కలతపెట్టెను. అప్పటినుండియు దీనికి మే మలవడిపోతిమి. అధమాధముడగు మొండికెత్తిన నేరస్తుని విషయములోగూడ కొరడాదెబ్బలు అనవసర శిక్ష యనియే నా యభిప్రాయము. యువకులు, అభిమానధనులు అగు వారికి, నియమముల నుల్లంఘించిరను సాంకేతిక నేరముల కీ శిక్ష కేవలము క్రౌర్యము. మా బారకాసులో నలుగురము దీనినిగురించి ప్రభుత్వమునకు వ్రాసితిమి. రెండువారములవరకు మా కెట్టి సమాధానము రాకపోవుటచే నీ క్రౌర్యమునకు గురియైన వారియెడల సానుభూతి చూపుటకు, కొరడాదెబ్బలశిక్షను నిరసించుటకు మే మొక మార్గము త్రొక్కనిశ్చయించి మూడు శుష్కోపవాసములను 72 గంటలు చేయ

సంకల్పించితిమి; ఉపవాసములు చేయుట కిదియొక లెక్కకాదు. కాని మాలో నెవరము నుపవాసముల కలవాటుపడలేదు. మే మీ పరీక్ష తాళగలమో లేదో మాకే తెలియదు. నేనిరువదినాలుగుగంటలకు మించి యుపవాసము చేసి యెరుగను.

ఎట్టికష్టము లేకుండగనే మేము మా యుపవాసము నిర్వహించితిమి. అది నేను భయపడినంతటి యగ్నిపరీక్ష కాదని, ఆ యుపవాస కాలములో పరుగెత్తుట, గంతులిడుట మొదలగువానిని నే నతిమూర్ఖముగ నడిపితిని. అది నాకెంత మంచిచేసినట్లు తోచదు. ఆ మూడు రోజులలోను మే మందరము నేడెనిమిది పౌనులబరువు తగ్గితిమి. ఇది, నైనీజయిలులో గతమాసములో మే మందరము కోల్పోయిన పదిహేనులగాయితు యిరువదియారు పౌనులమీద కొసరు. మా యుపవాసములతో సంబంధము లేకుండా కొరడాశిక్షలపై తీవ్ర వ్యతిరేకాందోళన బయట జరుగుచుండెను. తరువాత యు. పి. ప్రభుత్వమిక ముందెన్నడు నట్టికొరడాశిక్షల నీయవలదని జయిలుశాఖ నాజ్ఞాపించినని విశ్వసించెదను. కాని యీ యాజ్ఞలు చిరస్థాయిగా నుండునవి కావు; అట్లుండ లేదు. సంవత్సరములతరువాత యు. పి. జయిళ్ళలోను యితరరాష్ట్రములలోను కొరడాశిక్షల కెట్టికొదువ లేకుండెను.

అప్పుడప్పుడు కలుగుచుండు యిట్టివిపత్తులు తప్ప మేము జయిలులో ప్రశాంత జీవితము గడిపితిమి; వాతావరణము మనోజ్ఞముగ నుండెను; అలహాబాదులో శీతకాల మతిసుఖదాయకము. రంజిత పండిట్ మా బార్కునకొక మేరువువంటివాడు. అతడు తోటలను పెంచుటలో నారితేరెను. ఆ మా బోడి యావరణమంతయు వెంటనే పుష్పభరితమై రంగులతో నేత్రపర్వ మొనర్చుచుండెను. అతడా చిన్నపీలికలోనే కొద్దిలో గోల్ఫుబంతి త్రోవ నేర్పాటు చేసెను.

మేము నైనీజయిలులోనుండగా నెత్తిమీదినుండి పోవు వాయువిమానములు మాకొక వినోదముగనుండెను. ప్రాక్పశ్చిమ

ములకుపోవు మహావాయుమార్గములకలహాబాదు రేవుస్థలం ఆస్ట్రేలియా జావా. ఫ్రెంచిఇండోచైనా మొదలగు చోట్లకుపోవు పెద్ద పెద్ద విమానములన్నియు నైనీయొద్ద సరిగా మా తలలపైనుండి పోవుచుండును. బటేవియానుండి వచ్చి పోవుచుండెడి డచ్చిదేశపు లైనరులన్నిటికంటె గొప్పవి. ఒకొ్కక్కప్పుడు మేమదృష్టవంతులమైనచో, ఇంకను చీకటియుండి నక్షత్రములు కాన్పించుచుండగనే యా శీతకాల ప్రభాత సమయములయందే విమానమో మాకు కాన్పించుచుండెడిది, అది దీపములతో దేదీప్యమానముగ ప్రకాశించుచుండెడిది, రెండుకొనలను రెండు రక్తారుణదీపము లుండెడివి. ఉషఃకాల వినీలాకాశవీథి నది పయనమగునప్పు డాదృశ్య మతిమనోహరముగ నుండెడిది!

మరియొక జయిలు నుండి పండిత మదనమోహనమాలవ్యా కూడ నైనీజయిలుకు మార్చబడెను. అతనిని ప్రత్యేకముగ నుంచిరి. కాని మే మతనిని నిత్యము చూచుచుండెడివారము. బహుశః నేను బయటనున్నప్పుడుకంటె జయిలులోనే యతని నెక్కువగ చూచితిని. అత డతియుత్సాహవంతుడైన చెలికాడు. చైతన్యభరితుడు. యావనోత్సాహముతో ప్రతి విషయమందు శ్రద్ధతీసికొనువాడు. రంజితు సహాయముతో నతడు జర్మనుభాష నేర్చుకొన నారంభించెను. అతడద్భుతమగు జ్ఞాపకశక్తి చూపెను. కొరడాదెబ్బల వార్త వచ్చినప్పుడతడు నైనీజయిలులోనే యుండెను. అతనియొడలు జలదరించెను. అతడు వెంటనే రాష్ట్రతాత్కాలిక గవర్నరుకు వ్రాసెను. తరువాత నతనికి జబ్బుచేసెను. జయిలులో నతడు చలిని భరించలేకపోయెను. అతనివ్యాధి ముదిరెను. అతనిని పట్టణములోనున్న ఆస్పత్రికి మార్చి శిక్ష పూర్తికాకమునుపే విడిచిపెట్టిరి. అదృష్టవశమున నతనికాస్పత్రిలో స్వస్థత చేకూరెను.

1931–జనవరి యొకటవ తేదీ–ఇంగ్లీషు సంవత్సరాది పండుగ–కమల నిర్బంధము. నేను సంతోషించితిని. ఏలన యామె తన చెలికత్తెలతో జయిలుకు పోవలెనని తహతహలాడుచుండెను. ఆమె, నా

చెల్లెలు, మరియు నేకమంది స్త్రీలు పురుషు లేయైన చో చిరకాలము క్రింద టనే నిర్బంధింపబడి యుండెడివారు. కాని యూసమయమున ప్రభుత్వము సాధ్యమైనంతవరకు స్త్రీలను నిర్బంధించుట కిష్టపడకపోవుటచే వారింతకాలము మిగిలియుండిరి. ఇప్పటికి యామెకోర్కె నెరవేరెను! దీని కామె యెంతయో యానందించియుండునని నేననుకొంటిని కాని యామె యనారోగ్యస్థితికి నేను భయపడుచుంటిని. జయిలు పరిస్థితు లామెకు మరింత బాధ కలిగింపవచ్చునని నా భయము. ఆమె నిర్బంధింపబడినపు డొక పత్రికా ప్రతినిధి యామె సందేశమునర్థించెను. ఆ వేడిలో నామె యనాలోచితముగ తన నిజస్వభావమును తెలుపు నొక చిన్న సందేశమునిచ్చెను. 'నా కిపు డపారమగు సంతోషము కలుగుచున్నది. నా భర్త పదకమలముల ననుసరించినందులకు నే నెంతయు గర్వించుచున్నాను. ప్రజలు మన జెండా నెగురవేసియుంచెదరని నే నాశించెదను.' బహుశః ఆమెకొంచెము యోచించినచో నావిధముగ చెప్పియుండెడిది కాదు. వలనన నామె స్త్రీల హక్కుల కొరకు పురుషుల నిరంకుశత్వము నెదుర్చు యోధగా భావించుకొను చుండెడిది. కాని యా నిమిషమందా భారతసతీత్వము పైకుబుకుటచే పురుషుని నిరంకుశత్వము మఱచిపోబడెను.

మా తండ్రి కలకత్తాలో నుండెను. అతని కెంతమాత్రము స్వస్థత చేకూరలేదు. కాని కమల నిర్బంధము, శిక్ష వినుటతోడనే యాతడు కంపించి యలహాబాదు తిరిగివచ్చుటకు నిశ్చయించెను. మా చెల్లెలు కృష్ణను వెంటనే యలహాబాదు పంపించి కొద్దిరోజు లయిన తరువాత నతడు తక్కిన కుటుంబముతో వచ్చెను. జనవరి 12 వ తేదీ యతడు నన్ను చూచుటకు వచ్చెను. అతనిని చూచి నాకు కలిగిన విచార మతనికి తెలియనట్లే కాన్పించెను. కలకత్తాలో నున్నప్పటికంటె తా నిపుడారోగ్యముగ నున్నట్లతడు నాకు చెప్పెను. అతనిముఖ ముబ్బియుండెను. ఇది తాత్కాలిక కారణజనితమని యతనిభావము.

అతని యీ ముఖము నన్ను విడిచిపెట్టలేదు. అందతనిపోలికయే లేదు. అతని కపాయము రానున్నదనుభయము నాలో తొలిసారి ప్రవేశించెను. ఆరోగ్య, బలము లతనిసొత్తులని నే నెప్పుడు భావించు చుండెడివాడను. అతనికి, మృత్యువువచ్చునని నేను చింతింపజాల కుంటిని. అత డెప్పుడు మృత్యుభావమును నిర్లక్ష్యముచేయుచు, దానిని పరిహాసముచేయుచు చిరకాలము జీవింపదలచుకొంటిననని చెప్పుచుండెడివాడు. తరువాత నతని బాల్యస్నేహితుడెవ్వడైన చని పోయినచో నత డొంటరిగనున్నట్లు, తా నొక్కడే క్రొత్తవారిమధ్య విడువబడినట్లు భావించుట నేను కనిపెట్టితిని. మృత్యుసూచనకూడ కాన్పించెడిది. కాని సాధారణముగ నీ కలుషభావము మాయమయి పొంగి పొరలుచుండు నతనియుత్సాహసంపద విజృంభించుచుండెడిది. అతనికుటుంబములోని మే మందరము మూర్తీభవించిన యతని గుణ గణములచేతను, విశాలప్రేమచేతను, బంధింపబడితిమి. అతడులేని ప్రపంచము నూహించుట మాకు దుర్ఘటముగనుండెను.

అవి మొదటి రౌండు టేబిలుకాన్ఫరెన్సు తుదిదినములు. చివర చేసిన సూచనలు, ప్రగల్భములు మాకు కొంచెము వినోదముగనే యుండెను. ఆ యుపన్యాసములు, ఆ శ్రీరంగనీతులు, ఆ చర్చలు అసత్యములుగ వ్యర్థములుగ కాన్పించెను. కాని యొక్కసత్యము మాత్ర మాచంద్రార్కముగనిలబడెను. మన భరతమాత దుర్భరాగ్ని పరీక్ష కాహుతియగుచున్న సమయమున, మన పురుషులు, నారీ రత్నములు సత్యద్భుతముగ ప్రవర్తించినపుడుకూడ మనపోరాటమును నిర్లక్ష్యముచేసి, తమ నైతికబలము నెదిరిపక్షమున కర్పించు దేశస్థులు కొందరున్నారనుసంగతి విదితమయ్యెను. జాతీయత యను మోస భూయిష్ఠమగు నాచ్ఛాదనక్రింద పరస్పరవిరుద్ధములగు నార్థిక ప్రయోజనము లెట్లుపనిచేయుచున్నదియు, నీ జాతీయత పేరనే పెట్టుబడిదారులైనవారు వీటిని భవిష్యత్తుకుకూడ దాచియుంచు కొనుట కెట్లుయత్నించుచున్నదియు, మును పెన్నడు విశదము కాన ట్లిప్పుడు స్పష్టమయ్యెను. రౌండుటేబిలుసభ యీ పెట్టుబడి

దాసుల సమూహము. వారిలో చాలమంది పోరాటము నెదిర్చిరి. కొంతమంది కిక్కురుమనకుండ చూచుచుండిరి. అయినప్పటికి వారప్పుడప్పుడు "కళ్ళప్పగించి యూరకచూచువారుకూడ ప్రేరకులే" యను నామెత జ్ఞప్తికి తెచ్చుచుండిరి. కాని లండను కనుసైగచేయుట తోడనే యీ నిరీక్షణ హఠాత్తుగా పలాయనమయ్యెను. వారు తమ తమ ప్రత్యేకప్రయోజనములను భీమాచేయించుకొనుటకు, యింకను లభ్యమగు దోళ్ళదోపుడు బేరములో పంచుకొనుటకు గుభాలున బయలుదేరిరి. కాంగ్రెసు అంతకంత కెడమగుచున్నదని ప్రజలకు దానిపై పలుకుబడి యంతకంతకు హెచ్చుచున్నదని గుర్తించి మరింత త్వరితముగ నీ పటాలాలు లండనులో బారులుతీరెను. హిందూదేశములో పెద్ద రాజకీయమార్పు కలిగినచో ననేకవిధములగు ప్రజ లధికారమునకు వత్తురనియు వారికి ప్రాధాన్యత కలుగుననియు, వారు విధిగ విప్లవకర సాంఘికమార్పులను ప్రోత్సహించెదరనియు, తమ ప్రయోజనముల కది యరిష్టమనియు భావింపబడెను. హిందూదేశములోని స్వలాభపరులుకూడ నీ యవకాశమునుండి వెనుకకుజారిరి. ప్రస్తుత సాంఘికనిర్మాణమును పెట్టుబడిదారులను రక్షించుటకు బ్రిటిషువారిచ్చట నుండవలెననియే వారికోరిక. డొమినియనుపరిపాలన కావలెనని పట్టుబట్టుటలోనున్న భావార్థమిదియే. గ్రేటుబ్రిటనుతో రాజీకి ప్రధానభాగముగా హిందూదేశమునుండి వెంటనే యాంగ్ల సైన్యము వెడలిపోవలెననియు, భారతసైన్యము భారతప్రజాస్వామిక వశములో నుండవలెననియు నేను నొక్కిచెప్పినప్పుడొక సుప్రసిద్ధ భారతలిబరలునాయకుడు నాపై మండిపడి, బ్రిటిషుప్రభుత్వము దీనికొప్పుకొనిననుకూడ తాను తన శక్తికొలది దీని నెదిర్చెదనని సెలవిచ్చెను. ఎట్టిజాతీయస్వాతంత్ర్యమునకైనను ప్రధానమగు నీ ప్రాతిపదిక యవసరమని తాను తలంచెమగనుక నతడు దాని నెదిర్చెను. విదేశీయులు దాడివత్తురనుభయము దీనికి కొంతకారణమనియు బ్రిటిషు సైన్యము మనల నట్టిదాడినుండి కాపాడవలెనని యతడు కోరుచున్నాడనియు ననుకొనవచ్చును. దాడివచ్చుగాక! రాకపోవుగాక! మగతన

మున్న యేభారతీయునికైన బయటవాని రక్షణకోరుట యనుభావము హేయముగనుండును. కాని భారతదేశములో బ్రిటిషువారుండవలెనని కోరుటకు యదార్థకారణ మిదియని నేను తలంపను. భారతీయులకు వ్యతిరేకముగా నిష్కళంకమైన భారతప్రజాస్వామికమునకు వ్యతిరేకముగా, ప్రజలయభివృద్ధికి వ్యతిరేకముగా భారత పెట్టుబడిదారుల ప్రయోజనములను కాపాడుటకే బ్రిటిషువారు కోరబడుచుండిరి. కనుక రౌండుటేబిలు సభలోని భారతప్రతినిధులలోని నభివృద్ధి నిరోధకులు, కులతత్త్వవాదులు మాత్రమేకాక నభివృద్ధివాదులు జాతీయవాదులు అని పిలుచుకొనువారుకూడ తమకు బ్రిటిషు ప్రభుత్వమునకు మధ్య చాలసామ్యమున్నదని కనుగొనిరి. స్వాతంత్ర్యపోరాటములో జయిలుకు వెళ్ళినమమ్ము; మమ్ము బంధించినవారితో చేతులుకలిపి బారులుతీరి నీతులు సెలవిచ్చువారినికూడ జాతీయత యిముడ్చుకొనునెడల నట్టి జాతీయతక్రిందకురానిదేముండును! ఇంకొకరకపు జాతీయధీరులున్నారు. వీరిపలుకు గంగాప్రవాహము. వీరన్నివిధముల స్వదేశీని ప్రోత్సహింతురు. స్వరాజ్యసార మచ్చటనేయున్నది. త్యాగముచేసియైనను దీనిని సాధించవలెను. అదృష్టవశాత్తు యీ యుద్యమములో వీరికెట్టి త్యాగములేదు. అది వారివ్యాపారములను వృద్ధిచేసెను. వేలకొలది జయిళ్ళకు పోయినపుడు లాఠీకి గురియైనపుడు వీరుతమఖజానా పెట్టెలయొద్ద తాపీగా సొమ్ములెక్కించుకొనుచుండిరి. తరువాత తీవ్ర జాతీయత కొంచెము సాహసముగా కాన్పించినపుడు వీరు తమ యుపన్యాసముల లోని జోరుతగ్గించి యతివాదులను నిరసింపనారంభించి, యెదిరిపక్షముతో నొడంబడికలు సంధులు చేసికొనిరి.

రౌండుటేబిలు కాన్ఫరెన్సును మేము నిజముగా గుర్తింపలేము; లక్ష్యముచేయలేదు. పోరాటమంతయు నిచ్చటనే మన పట్టణము లందు, పల్లెలందు కలదు. మా పోరాటము త్వరలోనేయంతమగు నను భ్రమకూడ మాకు లేదు; ముందురానున్న యుపద్రవముల భీతియులేదు. 1930 నాటిసంభవములు జాతీయశక్తిసంపదలందు ధైర్య

స్థైర్యమునందు మాకు దగినవిశ్వాసముకలిగించెను. ఆ విశ్వాసముతోనే నేము భవిష్యత్తు నెదుర్కొంటిమి.

డిసెంబరు లేక జనవరి ప్రారంభములో జరిగిన యొకవిషయము మాకు చాలబాధ కలిగించెను. శ్రీనివాసశాస్త్రిగారు లండన్ లోని నుపన్యసించుచు భారతదేశ శాసనోల్లంఘనములో జయిలుకు పోవువారిని దూషణగా మాట్లాడెను. ఆ యుపన్యాసము ముఖ్యముగా నాసమయము మమ్ము చాలబాధించెను. మాకు, శ్రీనివాసశాస్త్రిగారికి రాజకీయములలో చాల వ్యత్యాసమున్నను మే మాయనను గౌరవించితిమి.

రామ్సేమాక్డొనాల్డు తన మామూలు సౌభ్రాతృత్వపు పలుకులతో రౌండు టేబిలుసభ ముగించెను. తన దుష్టపద్ధతులను మాను కొని యీ యానందకూటములో జేరవలెనని కాంగ్రెసును హెచ్చరించుభావ మందులో ద్యోతకమగుచుండెను. సరిగా నా సమయమునకే 1931 జనవరి 15వ తేదీ ప్రాంతమున అలహాబాదులో కాంగ్రెసు వర్కింగుకమిటీ సమావేశమయ్యెను. ఇతర విషయములతోపాటు ఈ యుపన్యాసము హెచ్చరిక చర్చింపబడెను. నే నప్పుడు నైనీజయిలులోనుంటిని. నేను విడుదలయైనతరువాత నీ విషయము తెలుసుకొంటిని. తండ్రిగారు కలకత్తానుండి యప్పుడే తిరిగివచ్చిరి. అతనికి చాల సుస్తిగానున్నను సభ్యులందరు తనప్రక్కచుట్టు చేరి యీ విషయము నచ్చటనే చర్చింపవలెనని యతడు పట్టుపట్టెను. శాసనోల్లంఘనమును విరమించి మాక్డొనాల్డు కొక సూచన యీయవలసినదని కొందరనిరి. తండ్రిగారికి దీనివలన చాల యుద్రేకముకలిగెను. అతడు తటాలున లేచి ప్రక్కమీద కూర్చుని జాతీయలక్ష్యము చేకూరువరకు తాను రాజీపడజాలననియు, తానొక్కడే మిగిలియున్నను పోరాటము నడిపెదననియు గర్జించెను. ఈ యుద్రేక మతనికి చాల

హానికరమయ్యెను. జ్వరము వెంటనే పొంగుటచే డాక్టర్లచ్చటనున్న వారందరిని పంపివేసి యతని నొక్కనిని విడిచిపెట్టిరి.

చాలవరకు కతనిపట్టుదలచేతనే వర్కింగుకమిటీవారు రెట్టిరాజీలేని యొక తీర్మానము చేసిరి. ఇది ప్రకటింపబడక పూర్వము సర్ తేజ్ బహదరుసప్రూ, శ్రీనివాసశాస్త్రిగార్లయొద్దనుండి తండ్రిగారికొక కేబిలు వచ్చెను. వారిరువురువచ్చి చర్చించువరకు నెట్టినిశ్చయము చేయవలదని తండ్రిగారిద్వారా వారు కాంగ్రెసును కోరిరి. వారప్పుడే మార్గములోనుండిరి. వర్కింగుకమిటీ తీర్మాన మొకటి యదివరకే చేయబడెననియు, కాని సప్రూ శాస్త్రిగార్లువచ్చి చర్చించువరకు నది ప్రకటింపబడదనియు జవాబు యివ్వబడెను.

జయిలులోనున్న మాకేవిషయములేవియు తెలియవు. కాని యేదోకొంత 'కుంభకోణము' జరుగుచున్నదని తెలిసి మేము బాధపడితిమి! జనవరి 26 వ తేదీ! స్వాతంత్ర్య ప్రథమవార్షికదినము! ఈ యుత్సవ మెట్లు జరుపబడును! అను భావములే మమ్మావహించెను. ఈ యుత్సవము జరుపబడెననియు, దేశమంతట బహిరంగ సభలు జరుపబడెననియు, నా సభలో స్వాతంత్ర్యతీర్మాన మామోదింపబడెననియు వింటిమి. ఈ యుత్సవ మతిచమత్కారముగ జరుపబడెను. వార్తాపత్రికలు, అచ్చుఆఫీసులు లభ్యము కావయ్యెను. పెలి గ్రామములు, పోస్టుఉత్తరములు చేరకుండెను. అయినను దేశమంతట నన్ని రాష్ట్రభాషలలోను నొకే యర్థమిచ్చు తీర్మానము పట్టణముల లోను, పల్లెలలోను, నేకకాలమందు చేయబడెను. ఈ సభలన్నియు చాలవరకు శాసనమును ధిక్కరించియే జరుపబడి పోలీసులచే బలవంతముగా తరిమివేయబడెను.

భూతభవిష్యద్వత్సరములను గురించి చింతించుచు నైనీజయిలులో నుండగా జనవరి 26 వచ్చెను. మా తండ్రిగారిస్థితి చాల కష్టముగా నున్నదనియు నే నింటికి వెళ్ళవలెననియు నకస్మాత్తుగా నా

కా ప్రాతఃకాలమున నెవరో చెప్పిరి. నన్ను విడిచిపెట్టనున్నట్లు తెలిసి కొంటిని. నాతో రంజితుకూడ వచ్చెను.

ఆ సాయంత్రమే భారతదేశ వివిధ జయిళ్ళనుండి యనేకమంది విముక్తులైరి. వీరందరు కాంగ్రెసువర్కింగుకమిటీ సభ్యులు. వారి స్థానీయులు. మే మందరము కలుసుకొని పరిస్థితులను యోచించుటకు ప్రభుత్వము మా కొక యవకాశము నిచ్చుచున్నది. ఆ సాయంకాల మెట్లయినను నన్ను విడిచెడివారే. తండ్రిగారిస్థితివలన నేను మరికొన్ని గంటలు ముందు విముక్తుడనైతిని ! 26 రోజులు జయిలుజీవిత మనుభ వించినతరువాత కమలకూడ యా దినమే లక్నో జయిలునుండి విముక్త బడెను. ఆమెకూడ వర్కింగుకమిటీ సభ్యురాలు.

# 33

## తండ్రిగారి నిర్యాణము

నేను తండ్రిగారిని రెండువారములైన తరువాత కలుసుకొంటిని. జనవరి 12 వ తేదీని ఆయన నన్ను నైనీలో కలుసుకొనినప్పు డతని రూపము నాకు భయంకరముగనుండెను. ఇప్పుడది మరింత చెడి పోయెను. ముఖము మరింతయుబ్బిపోయెను. మాటాడుటకూడ కొంత కష్టముగనేయుండెను. అతడు మనసులోనున్నది చెప్పలేకపోవు చుండెను. కాని యతని వెనుకటి యిచ్ఛాశక్తిమాత్రము కొరవడలేదు. ఇదియే మనశ్శరీరములను రెంటిని పట్టియుంచి పనిచేయించుచుండెను. అతడు రంజితును, నన్ను చూచి సంతోషించెను. ఒకటిరెండు రోజు లయిన తరువాత రంజితును నైనీజయిలుకు తీసికొనిపోయిరి. ఇది తండ్రిగారికి కష్టముగనుండెను. అతడు నిరంతరము రంజితుకొరకు ప్రశ్నించుచుండెను. భారతదేశములోని యనేకచోట్లనుండి తన్ను చూచుట కనేకమంది వచ్చుచుండగా తనయల్లుని యేలదూరము చేయవలెనని యతడనుచుండెడివాడు. ఈ పలవరింతవలన డాక్టర్లకు విసుగు కలుగుచుండెను. దానివలన నతనికే సుగుణము కలుగుట యునులేదు. డాక్టర్ల సూచనలచే మూడునాలుగు రోజులయిన తరువాత యు. పి. ప్రభుత్వమువారు రంజితును విడిచిపెట్టిరి.

జనవరి 26 వ తేదీనే, నన్ను విడిచిపెట్టినరోజుననే, గాంధీజీని కూడ విడిచిపెట్టిరి. అతనిని అలహాబాదులో నుంచవలెనని నే నాతుర పడుచుంటిని. అతని విడుదలనుగురించి నేను తండ్రిగారికి చెప్పినప్పు డతడుకూడ గాంధీజీని చూడగోరెను. మరునాడే గాంధీజీ బొంబాయి నుండి బయలుదేరి రాత్రి ప్రొద్దుపోయినతరువాత అలహాబాదు చేరెను. తండ్రిగా రతనికొరకెదురుచూచుచు మేల్కొనియేయుండిరి. అతనిసమక్షము, కొద్దిమాటలు తండ్రిగారి కద్భుత మనశ్శాంతి కలిగించెను. అతనిరాకవలన మా తల్లికికూడ నూరట, శాంతి చేకూరెను.

విడిచిపెట్టబడిన వర్కింగుకమిటీ సభ్యులందరు, సభయొక్క యాదేశముల కెదురుచూచుచుండిరి. వారిలో చాలమంది తండ్రిగారి కొరకావేదనపడుచు అలహాబాదు రావలెననుకొనుచుండిరి. కనుక అలహాబాదులోనే వెంటనే సభకావింప నిశ్చయింపబడెను. రెండు రోజులయినతరువాత ముప్పది, నలుబదిమంది వచ్చిరి. వారిసభలు స్వరాజ్యభవనములో జరిగెను. ఆ సభలకు నే నప్పుడప్పుడు వెళ్ళు చుంటిని. కాని నేను వాటిలో నెట్టిముఖ్యభాగము తీసికొనజాలక పోతిని. అచ్చట జరిగిన తీర్మానములుకూడ నా కిప్పుడెంతమాత్రము జ్ఞాపకము లేవు. అవి శాసనోల్లంఘనమును విరమింపరాదనియే తీర్మానించెనని నేననుకొనెదను.

వచ్చినపాతస్నేహితులు సహచరులు చాలమంది క్రొత్తగా జయిలునుంచి వచ్చి మరల వెంటనేపోవుటకు సిద్ధపడుచున్నవారు తండ్రిగారిని చూడగోరిరి. వా రాఖరిచూపుచూచి, కడసారి సెలవు గైకొనవచ్చిరి. వా రిద్దరుముగ్గురుచొప్పున యుదయ, సాయంకాలముల యందు వచ్చుచుండిరి. తన పాతసహచరులను గౌరవించుటకు పడక కుర్చీలో కూర్చొనెదనని తండ్రిగారు పట్టుబట్టిరి. అతడందులో నొక ముద్దవలె, నోటమాట లేకుండ కూర్చొనెను. ముఖముమీద కాన్పించిన యుబ్బువలన నెక్కువమాట్లాడుట కవకాశము లేకుండెను. కాని యొక పాతస్నేహితుని తరువాత మరియొకడు, నొకసహచరుని తరువాత మరి యొకడు వచ్చి వెళ్ళుచుండ నతనినేత్రములు ప్రకాశించుచు వారిని గుర్తించుచుండెను. అతని శిరము కొంచెము వంగెడిది. చేతులు నమస్కారపూర్వకముగ కలుసుకొనెడివి. అతడంతగా మాట్లాడలేకపోయి నను కొద్దిమాటలు చెప్పెడివాడు. అప్పుడుకూడ నతని పూర్వపు హాస్యము ద్యోతక మగుచుండెను. అతడక్కడ మృత్యుఘాతము నొంది, శరీరబలముడిగిన యొక వృద్ధమృగరాజమువలె కూర్చొనెను. కాని యతని రాజఠీవి, రాజదర్పము తరుగలేదు. నే నతనిని పరీక్షించిచూచునప్పు డతనిలో నేమిభావములు కలుగుచున్నవో కదా? యని యాశ్చర్యపడెడివాడను. అతనికి మన కార్యక్రమములో

నుత్సాహము నశించెనా ? అతడు తఱచు తనలోతానే పోరుచుండెను. అతనివశమునుండి జారిపోవనుంకించుచున్న విషయముల నతడు జయింప యత్నించుచుండెను. చివరకు నీ పోరాటము జరుగుచునే యుండెను. అతడు తన పట్టువీడలేదు. అప్పుడప్పుడు మాత్రో నతడతి స్పష్టముగ మాట్లాడుచుండెడివాడు. గొంతుబాధచే నతడు చెప్పు నది మన కర్థముకాకుండినపుడుకూడ కాగితములమీదవ్రాసి తన భావములను వెల్లడించెడివాడు.

అతడు తన యింటిప్రక్కనే జరుగుచుండిన వర్కింగుకమిటీ సభ లలో నెట్టిశ్రద్ధ తీసికొనలేదు. పదిహేనురోజుల క్రిత మవి యతని కుద్రే కము కలిగించెను. ఇప్పుడు తాను వాటికి చాలదూరములో నున్నట్లు భావించుచుండెను. "మహాత్మాజీ ! నేను త్వరలో వెళ్ళిపోవుచు న్నాను. స్వరాజ్యము చూచుటకు నే నిచ్చట నుండజాలను. కాని నీవు దానిని జయింతువని నే నెరుగుదును. త్వరలోనే నీ కది హస్త గతమవును" అని యతడు గాంధీజీతో ననెను.

ఇతరపట్టణములనుండి రాష్ట్రములనుండి వచ్చినవారు చాల మంది వెడలిపోయిరి. గాంధీజీ, దగ్గరబంధువులు, కొద్దిమంది ప్రియ మిత్రులు, నతని చిరమిత్రులు, సుప్రసిద్ధడాక్టరునైన డాక్టరు అన్సారీ, బిధానుచంద్రరాయి, జీవరాజమెహతాగార్లు మిగిలిరి. ఫిబ్రవరి నాల్గవ తేదీ యుదయ మతనికి కొంచెము సుళువుగనున్నట్లు కాన్పించెను. ఈ యవకాశము గైకొని యతనిని లక్నో తీసుకొనివెళ్ళుటకు నిశ్చ యించిరి. అలహాబాదులో లేని ఎక్సరేచికిత్స కక్కడ అవకాశము లుండెను. ఆ రోజుననే మోటారులో నతనిని తీసికొనివెళ్ళితిమి. గాంధీజీ మొదలగువారు చాలమంది మాతోకూడ వచ్చిరి. మేము చాల నెమ్మదిగనే వెళ్ళినను అతని కలసట కలిగెను. మరునాడలసట తగ్గుచున్నట్లు కాన్పించెను. అయినను కొన్ని యశుభలక్షణము లుండెను. మరునాడు ప్రాతఃకాలమున, ఫిబ్రవరి యారవతేదీని, నే నతని ప్రక్కనుండి పరిశీలించుచుంటిని. రాత్రి యతడు చాలబాధపడ

విశ్రాంతి లేకయుండెను. అతని ముఖము శాంతినొందినట్లు, పోరాట చిహ్నములేవియు లేనట్లు నే నకస్మాత్తుగా కనుగొంటిని. అతడు నిద్రించెనని నే ననుకొని దానికి సంతసించితిని. కాని మా తల్లి చూపులు నిశితములగుటచే నామె కెవ్వున కేక వేసెను. నే నామె వైపు తిరిగి, యతడు నిద్రించెను కనుక నిశ్శబ్దముగ నుండుమని బ్రతిమాలుకొంటిని. కాని యా నిద్ర యతని చిరనిద్ర, దానినుండి లేచుట యనునది యికనుండజాలదు.

ఆ రోజుననే మే మతని శవమును మోటారులో నలహాబాదు తీసుకొనివచ్చితిమి. నే నందులో కూర్చుంటిని. రంజితు దానిని నడిపించెను. తండ్రిగారికిష్టుడగు హరియును స్వంతనౌకరుకూడ నుండెను. మా వెనుక మా తల్లి, గాంధీజీ, కమల గల మరియొక మోటారు వచ్చెను. తరువాత తక్కిన కారులు వచ్చెను. ఆ రోజంతయు తల దిమ్ముగానుండి యేమిజరుగుచుండెనో నాకు తెలియకుండెను. వరుసగా జరుగుచుండిన సంభవములును, పెద్దగుంపులు నాలోచనకు వీలులేకుండ చేసెను. కొద్దికాలములో లక్నోలో వేలకొలది జేరిరి. శవముప్రక్కన కూర్చుని అలహాబాదు పరుగులో జేరుకొంటిమి. శవము జాతీయపతాకముతో చుట్టబెట్టబడెను. పైన నొక జాతీయపతాకము యెగురుచుండ నలహాబాదు చేరితిమి. మైళ్ళకొలది బారులుతీరి జనులతనిని స్మరింపవచ్చిరి. ఇంటియొద్ద కొన్ని శ్రాద్ధవిధులుండెను. తరువాత పెద్ద జనప్రవాహముతో గంగానదికి ప్రయాణమైతిమి. నదియొడ్డున ఆ శీతాకాలదినము, నగ్నిజ్వాలలు పైకెగయుచు నతని దగ్గరబంధువులమైన మాకు హిందూదేశములోని కోట్లకు ప్రియతమమైన యా శరీరమును దహించివేసెను. గాంధీజీ జనసమూహమునకు కంటతడిపెట్టు కొద్దివాక్యములను చెప్పెను. తరువాత మే మందరము నింట్లకుపోతిమి. మే మొంటరిగా విచారగ్రస్తులమై తిరిగి వచ్చునరికి నక్షత్రములు గగనవీధి కెగబ్రాకి ప్రకాశమానముగ వెలుగొందుచుండెను.

మా తల్లికి నాకు వేలకొలది సానుభూతియుత్తరములువచ్చెను. ఇర్విను దంపతులుకూడ మా తల్లికి యుదారసందేశము పంపిరి. ఈ యద్భుతమగు సానుభూతి ప్రేమ మా బాధ కొంత తగ్గించెను. కాని దుఃఖములను, విచారములను నద్భుతముగ పోగొట్టగల గాంధీజీ సమక్షమే యన్నిటికంటె నెక్కువగా మాతల్లిని, కుటుంబమును మా జీవితములలోని యీ విషమావస్థలోనుండి తరింపజేసెను. మా తండ్రి గతించెనని గుర్తించుట నాకు కష్టముగనే యుండెను. మూడు మాసములైనతరువాత నేను నా భార్యతోను, కుమార్తెతోను సింహళ ములో నుంటిని. మేము నువరాఎలియా యనుచోట ప్రశాంతము, విశ్రాంతియుతము నగు కొద్దిరోజులు గడుపుచుంటిమి. ఆ ప్రదేశము నా కెంతయు నాహ్లాదకరముగనుండెను. అది తండ్రిగారికి చాల బాగుగ నుండునని నా కకస్మాత్తుగాతట్టెను. అతనికొరకెందుకు పంపకూడదు; అతడు చాలయలసియుండును. కనుక విశ్రాంతియతనికి శ్రేయస్కరము. నే నతని కలహాబాదు టెలిగ్రాము యిచ్చుటకుకూడ సిద్ధమైతిని.

# 34

## ఢిల్లీ సంధి

మా తండ్రిపోయిన గంటలోనే రౌండుటేబిలు కాన్ఫరెన్సు నొక్క భారతసభ్యుల గుంపు బొంబాయి రేవులో కాలుపెట్టెను. శ్రీనివాసశాస్త్రి, సప్రూ మరికొందరు సరాసరి అలహాబాదు వచ్చిరి. గాంధీజీ కొంతమంది వర్కింగుకమిటీ సభ్యులు సదివరకే యచ్చట నుండిరి. మా యింటివద్ద కొన్ని ప్రయివేటుసభలు జరిగెను. వాటిలో గుండుబల్లసభ చరిత్ర వినిపింపబడెను. ప్రారంభములోనే యొకచిన్న విషయము జరిగెను. శాస్త్రిగారయాచితముగ తనంతటతానే యెడింబరోలో తాను చెప్పినదానికి విచారము వెలిబుచ్చుచు నతడెప్పుడు తన పరిసరములకు లోబడిపోవుననికూడ చెప్పెను. అతనితో నతని యత్యధిక పదగుంభనముకూడ పసగెత్తుచుండును.

రౌండుటేబిలుప్రతినిధులు సభనుగురించి మేమెరిగినదానికంటె నెక్కువేమియు మాకు తెలుపలేదు. తెరచాటు కుట్రలనుగురించి వారేమేమియో వెళ్ళబుచ్చిరి. ఫలానాప్రభువుగారిట్లుచెప్పిరి. లేక యొక "సర్"గారు రహస్యముగా నట్లుచేసిరి. భారతదేశ లిబరలు మిత్రులు సిద్ధాంతములకు యదార్థములకు ప్రాముఖ్యత నీయక పెద్ద యుద్యోగస్తులకును వారితో సల్పు రహస్యసంభాషణలకు, గుసగుసలకు నెక్కువప్రాధాన్యతయిత్తురు. లిబరలునాయకులతోడి మాయిష్టాగోష్ఠి వలన నెట్టిఫలితము కలుగలేదు. ఆర్.టి.సి. తీర్మానముల కావంతయు విలువలేదని స్థిరపడిపోయెను. గాంధీజీవైస్రాయిని దర్శించుట కంగీకరించెను. దానివలన ఫలితము నతడపేక్షించెనని నేననుకొనను. అయినను, అతడు తనమార్గమును వీడి శత్రువును కలుసుకొని యతనితో దేనినైనను చర్చించుటకెల్లప్పుడు సిద్ధపడును. తన సత్యమునుగురించి పరిపూర్ణవిశ్వాసము కలవాడై యతడు యెదరపార్టీవాని నొప్పింప కోరును. అతడెప్పుడు నాధ్యాత్మికపరిణామమునే కోరుచు క్రోధము, అవిశ్వాసము మొదలగునడ్డంకులను నాశనముచేసి యెదుటివాని ప్రేమను

మృదుభావములను చూఱగొనజూచును. ఈ మాన్పు కలిగినచో విశ్వాసము కుదురుట సులభమని యతడెరుగును. లేక విశ్వాసము కలుగక పోయినను శతృత్వములో యున్న తీవ్రత యణగిపోవును. పోరాటములోని ద్వేషము నశించును. శత్రువులతో తన స్వంతవ్యాపారములలో నత డనేకవిజయములను బడసెను. కేవలము వశీకరణశక్తిచేతనే యతడు తన శత్రువును జయించుచుండుటాశ్చర్యము. అనేకమందివిమర్శకులు దూషకులు నతనియాకర్షణశక్తిచే మోహితులై యతనిని భూషించుచుండిరి. ఒకవేళ విమర్శవిరమింపబడకపోయినను అందులో నవహాస్యము మచ్చునకైన కాన్పించెడిదికాదు.

ఈ శక్తి నెరిగిన గాంధీజీ యెప్పుడు తనతో భేధించువారిని కలుసుకొన నుత్సహించును. కాని స్వవిషయములలో చిన్నవిషయములలో వ్యక్తులతో వ్యవహరించుట వేరు. జయభేరిప్రయోగించు సామ్రాజ్యతత్త్వప్రతినిధియగు బ్రిటిషుప్రభుత్వమువంటి యవ్యక్తరూపముతో వ్యవహరించుట వేరు. దీనిని గుర్తించి గాంధీజీ పెద్దయాశలను పెట్టుకొనకుండగనే వెళ్ళెను. శాసనోల్లంఘనోద్యమమింకను జరుగుచునేయుండెను. ప్రభుత్వముతో సంభాషణలు జరుగుచుండుటచే దాని తీవ్రతమాత్రము తగ్గెను. వెంటనేదర్శనమున కేర్పాట్లుగావింపబడెను. కొద్దిరోజులయిన తరువాత మమ్మందరను ఢిల్లీరమ్మనిరి. మే మచ్చట మూడువారము లుండి ప్రతిరోజు కలుసుకొనుచు నలసటవచ్చునరకు చర్చించుచుంటిమి. గాంధీజీ ఇర్విన్ప్రభువుతో తఱచు మాట్లాడుచుండెను. కాని యొకొక్కప్పుడు మూడునాలుగురోజు లెడముండెడిది. భారతప్రభుత్వము యిండియాఆఫీసుతో సంప్రదించుచుండుటచే నీ యాలస్యము జరిగెడిది. ఒకొక్కప్పుడు చిన్నవిషయము, కొన్ని మాటలుకూడ వ్యవహారమున కడ్డమువచ్చుచుండెడివి. శాసనోల్లంఘనమును 'నిలుపు చేయుట' అను పదము వాటిలో నొకటి. గాంధీజీ మొదటినుండి చివర వరకు శాసనోల్లంఘనము శాశ్వతముగా నాపివేయబడజాలదని, యదియొక్కటే ప్రజలకున్న యాయుధమని స్పష్టపరచుచుండెను. అయినను అది కొంతకాలము నిలుపుచేయబడవచ్చును. ఇర్విన్ప్రభు

ఏ పదము కర్థ్యాంతరము చెప్పి యిది శాశ్వతము కావలెననెను. గాంధీజీ దీని కొప్పుకొనలేదు. చివరకు 'విరమింపబడెను' అనుపదము ప్రయోగింపబడెను. కల్లుదుకాణములవద్ద, విదేశవస్త్ర దుకాణముల వద్ద పికెటింగును గురించి చాల రాద్ధాంతసిద్ధాంతములు జరిగెను. మా కాలము చాలవరకు సంధికొరకు కావలసిన తాత్కాలిక ఏర్పాటులను చర్చించుటకే వినియోగింపబడెను. ప్రధానవిషయములను మూలకు త్రోసిరి. తాత్కాలికసంధి చేకూరి, యనుదినము జరుగుచుండిన పోరాటము విరమింపబడిన తరువాత, ప్రసన్నపరిస్థితులలో నీ ప్రధానవిషయములను గురించి యోచింపవచ్చు ననుకొనిరి. ఈ సంభాషణలు శాంతిని చేకూర్చుననియు, దానితరువాత ప్రధానవిషయములనుగురించి సంప్రదింపులు జరుగుననియు నేమనుకొంటిమి.

ఆ రోజులలో ఢిల్లీ నానారకములవారి నాకర్షించుచుండెను. విదేశ పత్రికారచయితలు, ముఖ్యముగా అమెరికావారు, చాలమంది యుండిరి. నేను మేమియు చెప్పకుండుటచే వారికి మాపయి విసుగు జనించెను. గాంధీ, ఇర్విన్ సంభాషణలనుగురించి మాయొద్దకంటె క్రొత్త ఢిల్లీ సెక్రటేరియటు ఆఫీసునుంచియే వారి కెక్కువవార్తలు వచ్చెడివని వారు మాతో చెప్పుచుండెడివారు. ఇదిసత్యము. గొప్పగొప్ప హోదాలలోనివారెందరో గాంధీకి నమస్కరింప త్వరపడుచుండిరి. ఏలనన గాంధీజీనక్షత్ర మిప్పు డత్యుచ్చదశలో లేదా? గాంధీజీకి, కాంగ్రెసుకు నింతవరకు చాలదూరమునుండి తరచు వానిని నిందించిన వారిపుడు క్షమార్పణకొరకు త్వరపడుచుండిరి. కాంగ్రెసురోజులు బాగున్నట్లు కాన్పించెను. ఏమో! ముందేమి రానున్నదో! కాంగ్రెసుతోను దాని నాయకులతోను చెలిమిచేసుకొనుటయే మంచిది. సంవత్సరములో వారిలో మరియొక మార్పుకలిగెను. వారు కాంగ్రెసును దానిపనులను నోటినిండ తిట్టనారంభించి దానితో తమకెట్టి సంబంధము లేదనిరి.

కులతత్వవాదులుకూడ పరిస్థితులవలన గడబిడపడసాగిరి. రాజ్యపరిపాలనలో వెనుకపడిపోదు రేమో యని గుంజాటనపడ

సాగిరి. కనుక చాలమంది 'మహాత్మా' దగ్గరకువచ్చి, కులసమస్య మీద రాజీపడుటకు తమ కెట్టియభ్యంతరము లేదనియు సతము పూను కొనుచో సమాధానమున కెట్టి కష్టము నుండజాలదనియు సెలవిచ్చిరి. గాంధీజీ మేమునివసించు డాక్టరు అన్సారీయింటికి నిరంతర జనప్రవాహము పెద్దహోదాలవారు కొద్దితరహాలవారు రాదొడంగిరి. మా తీరిక కాలములో మేము వారిని శ్రద్ధతో పరీక్షించుచుంటిమి. కొన్ని వత్సరములనుండి గ్రామ, పట్టణములలో కల బీదలతోను, జయిళ్ళ లోను, బయటగలవారితోను మాకు సంబంధము లేర్పడెను. గాంధీజీని చూడవచ్చిన శ్రీమంతులు మానవస్వభావ ద్వితీయపక్షమును ప్రద ర్శించిరి. ఇది చులకనగా మారిపోవు పక్షము. అధికార విజయములను వా రెచ్చటనైన పసిగట్టుచో తటాలునవచ్చి ప్రవాలెదరు. వారు తమ మందస్మితములతో దాని నాహ్వానము చేతురు. వారిలో చాలమంది బ్రిటిషుప్రభుత్వ ప్రధాన స్తంభములు. భారతదేశములో నే ప్రభుత్వము రాజ్యమునకు వచ్చినను వీరు వారికి కూడ తత్తుల్యముగనే ప్రధాన స్తంభములుగ నుందురు.

ఆ రోజులలో కొత్త ఢిల్లీలో గాంధీజీతో నేను తరుచు ప్రాతర్విహారములలో జేరుచుండెడివాడను. సాధారణముగ నతనితో మాట్లాడుట కదియే సమయము. పగటిభాగమంతయు విభజింపబడి ప్రతినిమిషము నొక్కొక్క వ్యక్తికో, లేక పనికో వినియోగింపబడును. ఒక్కొక్కప్పుడీ ప్రాతర్విహారముకూడ దూరమునుండివచ్చిన యే దర్శనాభిలాషికో, లేక స్వవిషయములో నాలోచింపవచ్చిన యే స్నేహితునికో యిచ్చివేయబడును. మేము భూత, భవిష్యత్, వర్త మానములను గురించి మాట్లాడితిమి. కాంగ్రెసు భవిష్యత్తును గురిం చిన యతని యభిప్రాయ మొకటి నా కాశ్చర్యము కలిగించెను. స్వాతంత్ర్యము లభించుటతోడనే కాంగ్రెసు దానంతటది యాగి పోవునని నే నూహించితిని. కాంగ్రెసు సభ్యులు ప్రభుత్వము క్రింద నెట్టిజీతభత్యములను తీసికొనునుద్యోగము చేయరాదను చట్టము నది యామోదింపవలెనని యతడనెను. అట్టి యధికారము కోరునతడు

కాంగ్రెసునుండి వెడలిపోవలెను. అతడు ఏని నెట్లు సమర్థించెనో నాకిప్పుడు జ్ఞాపకము లేదు. ఇది చాల యసాధారణభావము. దీనిని నేరవేరము చేసికొనుట కష్టసాధ్యము. దీనివలన నసంఖ్యాకములగు కష్టములు సంభవించును. అట్టిసభను యే పెట్టుబడిదారులో తమస్వార్థములకొరకు కొల్లగొనెదరు. సంభవాసంభవములసంగతి యటుంచి నచో దీనివలన గాంధీజీ భావముల వెనుకనున్న యాంతర్యము మన కర్థము కాగలదు. కొన్నియుద్దేశ్యములను పురస్కరించుకొని రాజకీయ, ఆర్థిక నిర్మాణములను పునస్సృష్టి చేయవలెనను భావములతో రాజకీయాధికారమును పొందవలెననెడి యాధునిక పార్టీసిద్ధాంతముల కిది కేవలము వ్యతిరేకము.

గాంధీజీ ప్రజాస్వామికభావము నిస్సంశయముగ నాధ్యాత్మికమైనది. దానికి మామూలుగ వాడబడుసంఖ్యతోను, మెజారిటీతోను ప్రాతినిధ్యముతోను సంబంధము లేదు. అది త్యాగముమీద, సేవ మీద నిర్మింపబడును. అది నైతికశక్తినే యుపయోగించును. ఈ మధ్య నొక స్టేటుమెంటులో ♦ ప్రజాస్వామ్యవాది నతడు నిర్వచించెను. 'పుట్టుకచేత నేను ప్రజాస్వామ్యవాదిని' అని యతడనును. "మానవజాతిలోని గర్భదరిద్రులతో పూర్తిగ నైక్యమగుట, వారికంటె నెక్కుడుగా జీవింపవలెనను కోరిక లేకపోవుట, దానికి తగినట్లు బుద్ధిపూర్వకముగా నాస్థితిని పొందుటకు శక్తికొలది పనిచేయుట ఇవి ప్రజాస్వామ్యవాదికి లక్షణములైనచో నే నట్టివాడనే" ప్రజాస్వామ్యమును గురించి యతడింకను యిట్లు చెప్పెను.

"కాంగ్రెసుకు కలిగిన ప్రజాస్వామ్యలక్షణము, పలుకుబడి ప్రతి వత్సరము కాంగ్రెసు సభలకు వచ్చు ప్రతినిధులసంఖ్యచేత ప్రేక్షకుల సంఖ్యచేత నేర్పడలేదని యది నిరంతరాభివృద్ధిగా చేసిన సేవచేతనే యేర్పడెనని మనము గుర్తించెదముగాక! పాశ్చాత్య ప్రజాస్వామికము, యిదివరకే వ్యర్థమయ్యెనని రుజువుకానిచో, నిప్పుడు పంచాగ్నిహోత్రములమధ్య నున్నది భారతపుణ్యభూమియే, ప్రత్యక్ష

♦ 1934 సెప్టెంబరు 17వ తేదీ

యుదాహరణ పూర్వకముగ దాని విజయమునుచూపి, యదార్థ ప్రజాస్వామ్యశాస్త్రమును వెలుగొందచేయుగాక! అవినీతి, మోసము ప్రజాస్వామిక ఫలితములు కాకూడదు. నేడవి నిస్సందేహముగ ప్రస్ఫుటమగుచున్నవి. సంఖ్యయే ప్రజాస్వామికమునకు నిజమైన పరీక్ష కాదు. ఏకొద్దిమందియో తాము ప్రాతినిధ్యము వహించు ప్రజ యొక్క యాంతర్యమును, కోరికను యాశయములను ప్రతిబింబింప చేయుట యదార్థ ప్రజాస్వామికమునకు వ్యతిరేకముకాదు. దౌర్జన్య పద్ధతులచే ప్రజాస్వామ్యము పరిణామమును పొందజాలదని నేను చెప్పగలను. ప్రజాస్వామ్యతత్త్వమును బాహ్యమునుండి యెక్కించుటకు వీలులేదు; అది యంతరంగ జనితము."

అతడు చెప్పినట్లు నిశ్చయముగా నిది పాశ్చాత్య ప్రజాస్వామికముకాదు. కాని దీనికి కమ్యూనిస్టుల ప్రజాస్వామిక భావములకు కొంతపోలికకలదు. ఏలనన అందులోకూడ కొంత యాధ్యాత్మిక వాసన కలదు. కొద్దిమంది కమ్యూనిస్టులు ప్రజల యదార్థావసరములకు, కోరికలకు ప్రతినిధులమని చెప్పెదరు. ప్రజ వారిదృష్టిలో నొక యాధ్యాత్మిక భావమగును. దీనికే ప్రతినిధులమని వారుచెప్పెదరు. అయినను యీ పోలిక చాలస్వల్పము. ఇది చాలదూరము పోజాలదు. దృష్టిలోను, విషయగ్రహణములోను, ముఖ్యముగా పద్ధతులలోను, దౌర్జన్యములోను, వారికి గొప్ప భేదములు కలవు.

గాంధీజీ ప్రజాస్వామ్యవాది యైనను కాకపోయినను భారత వ్యావసాయిక ప్రజకు ప్రతినిధియగుట నిస్సంశయము. ఆ కోట్లకొలది ప్రజలవ్యక్తావ్యక్త కోరికలతనిలో మూర్తీభవించెను. అది ప్రాతినిధ్యముకంటె కొంచెమధికమేయగును. అతడు సామాన్య వ్యవసాయకుడుకాడు. అతినిశితమైన కుశాగ్రబుద్ధి, మృదులములైనభావములు, పరిపక్వ సంస్కారము, విశాలదృష్టి, దయాళుత్వముకలవాడు. అయినను ముఖ్యముగా సన్యాసి. అతడు తనరాగములను, ఉద్రేకములను అణచివేసి, వానిని పునీతమొనర్చి యాధ్యాత్మిక వీథులకు త్రిప్పెను. సూదంటురాయివలె నతడు మనుష్యులనాకర్షించును. అతడు భయ

భక్తులను వినయ విధేయతలను స్నేహములను పురిగొల్పును. ఇది యంతయు వ్యాపారాయమైన కల్పితమైనది. అతనితో పోలిక లేనిది. అయినను అతడు పెద్దరయితు. రయితులవలెనే యతడు విషయములను చూచును. రయితులవలెనే జీవితములోని కొన్ని యంశములపట్ల సంధుడుగ నుండును. కాని భారతదేశము రయితుదేశము కనుక నతడు తనభారతదేశమును బాగుగ నెరుగును. దాని యెంత చిన్నకదలికనైన నతడు బాగుగ పసికట్టును. అది యెట్టి స్థితినైన నతిసూటిగ స్వభావసిద్ధముగ గ్రహించి మంచి యవకాశము దొరికిన సమయములో పని చేయును.

ఆహా! బ్రిటిషుప్రభుత్వముకేగాక తనప్రజలకు నతి సన్నిహిత సహచరులకుగూడ నతడెంతటి దుర్గ్రాహ్యుడు! బహుశః ప్రతిదేశములో నతడీరోజులలో వింతవస్తువగును. భారతదేశమింకను అతని నిగ్రహించి నట్లు కాన్పించదు. లేదా పాపమును, మోక్షమును, దౌర్జన్యరాహిత్యమును గురించి మాట్లాడు మతప్రవక్తనది యభినందించును. అపార త్యాగములచేతను, కఠిన తపస్సుచేతను 'పుణ్యాపర్వతమును' సృజించి కొంతమంది చిన్నదేవతలరాజ్యములను భయపెట్టి పాతుకొనిన పరిపాలననుకూలద్రోసిన సన్యాసులకథలనేకములు భారతపురాణములలో కలవు. ఒకయనంతయాధ్యాత్మిక ప్రవాహమునుండి వెల్లివిరియు గాంధీజీ యాత్మశక్తిని నేను వీక్షించునపుడీపురాణకథలు తరచు నా మనస్సులోనికి వచ్చుచుండెడివి. నిశ్చయముగా నతడు ప్రపంచసామాన్య టంకసాలలో తయారైనవాడు కాడు. అతడు వేఱొకయసాధారణ జాతిలో ముద్రింపబడెను. తఱచు అతని కన్నులనుండి మ మ్మగ్రాహ్యమైనదేదియో చూచుచుండెడిది.

హిందూదేశము, పట్టణ, నూతనపారిశ్రామిక హిందూదేశము కూడ వ్యవసాయపోకడలను కలిగియుండెను. కనుక నది తన యీ కుమారుని తనవలెనేయుండి తనవలెనుండనివానిని, మహానాయకునిగ చేయుటెంతయు సహజము. అతడు పురాణస్మరణములను సగము మరచిపోబడినవాటిని త్రవ్విపైకితీసి యామెకు తన నిజాత్మయొక్క

తళుకులను కనపరచెను. వర్తమాన యంధకారబంధురమగు మఖ
ములో నలిగి యామె నిరర్థక భూత, భవిష్యత్కాలలతో శాంతినొం
దుటకు ప్రయత్నించెను. కాని యతడామెమనస్సున కాశను,
పూర్తిగ చితుకకొట్టబడిన శరీరముకు బలమును, శక్తిని ప్రసాదిం
చెను. భవిష్యత్తు మోహజనకముగ కాన్పించెను. జానస్‌వలె నది
రెండు ముఖములతో భూత భవిష్యత్తులను చూడ నారంభించి
రెంటిని మిళితము చేయజూచెను. జోడింపజూచెను.

మాలో చాలమంది యీ వ్యవసాయకదృష్టితో సంబంధము
త్రెంచుకొంటిమి. పూర్వకాలపుభావములు, ఆచారములు, మతములు
మాకు విదేశీయములయ్యెను. మే మాధునికులమను నామకరణము
పెట్టుకొంటిమి. అభివృద్ధి, పారిశ్రామికమయము చేయుట, జీవితప్రమా
ణము నున్నతిచేయుట, సామ్యముచేయుట మొదలగు భావములతో
మేము భావించుచుంటిమి. వ్యవసాయకుని దృష్టి యరిష్టదాయకమని
మేము భావించితిమి. కొంతమంది సామ్యవాదమును, కమ్యూనిజ
మును అభిమానించితిమి. రాజకీయముగ మేము గాంధీజీతో నెట్లు
సంపర్కము పెట్టుకొనగలిగితిమి ? చాలమంది యతని ప్రియశిష్యుల
మెట్లయితిమి ? ఈ ప్రశ్నలకు సమాధానమిచ్చుట చాలకష్టము.
గాంధీజీ నెరుగనివాని కే సమాధానము తృప్తికరముగ నుండజాలదు.
వ్యక్తిత్వమనిర్వచనీయమైనది. అది మనుష్యులయాత్మల నాకర్షించు
నొక వింతశక్తి. అతనిలో నిది యపారముగకలదు. అతనిదగ్గరకు
పోవు ప్రతివానికి తఱచుగా నతడు వివిధదృక్కులలో కాన్పించును.
అతడు ప్రజల నాకర్షించును. కాని తుదకు మానసిక విశ్వాసమువారి
నతనియొద్దకు తెచ్చికట్టివేయును. అతని జీవిత వేదాంతముతో వా
రేకీభవింపరు. అతని యనేకాదర్శములతో కూడ వా రేకీభవింపరు.
తరచతడు వారికగ్రాహ్యుడు. కానియతడు సూచించిన కార్యము
నేత్రగోచరమైనది. దానిని బుద్ధిచే గ్రహింపవచ్చును. గుర్తింప
వచ్చును. శుష్కరాజకీయములు దోహదముచేసిన నిర్జీవసాంప్ర
దాయానంతర మేకార్యమునకైనను స్వాగతముండెడిది. ధైర్యోపే

తము, జయప్రదము, నైతికశక్తివిరాజితము నగుకార్యమును త్రోసి వేయుట కెవరితరము? బుద్ధిని, భావప్రపంచములుకూడ నది ముంచి వేసెను, క్రమక్రమముగా నతడు తన కార్యపాటుత్వమునుగురించి మమ్మొప్పించెను. అతని వేదాంతమును మే మంగీకరింపకపోయినను మే మతని ననుసరించితిమి. కార్యమును, దాని వెనుక నున్న భావమును విడదీయుట బహుశః సరియైనపద్ధతికాదు. ఇది తరువాత మానసిక పోరాటమును చిక్కులను తెచ్చిపెట్టెను. గాంధీజీ, ప్రధానముగా కర్మ వీరుడు. మారుచెందుచుండు పరిస్థితుల నతిసూక్ష్మముగా గ్రహించువాడు కనుక మాకు యుక్తమని తోచిన మార్గమున నడుచునని మే మవ్యక్తముగ నాశించితిమి. ఏమయిన నతడు నడుచుబాట యింతవరకు సక్రమముగ నుండెను. ముందెప్పుడో విడిపోవలసివచ్చునని దాని నిప్పుడే తల పెట్టుట యుక్తము; అవ్యక్తము.

ఇదంతయు మాకు మనోనిశ్చయము, అకలంకత, యేర్పడ లేదని తెలుపును. మే మెక్కువ తార్కికులము కావచ్చును. కాని గాంధీజీ మాకంటె భారతదేశము నెక్కువగ నెరుగునని మే మెప్పుడును భావించెడివారము. అట్టి యద్భుత భక్తివిశ్వాసములను సంపాదించిన వానిలో ప్రజల యభీష్టాశయములను నెరవేర్చునదేదియో యుండ వలెను. మేమతని నొప్పింపగలిగినచో నీప్రజలనందరను త్రిప్పివేయవచ్చు నని భావించితిమి. అతని నొప్పించుట సాధ్యముగనే కనిపించెను. ఏలనన అతనిదృష్టి వ్యవసాయక దృష్టియేయైన జన్మతః తిరుగుబాటుదారు, గొప్పమార్పులను తెచ్చిపెట్టు విప్లవకారుడు. జయాపజయముల కత డెంతమాత్రము లక్ష్యముచేయడు.

స్థబ్దులు. నిరాధారులు నయిన మనప్రజల నత డెంతయాశ్చర్యముగ శిక్షించెను. దారిద్ర్యముచేతను, ద్రవ్యముచేతను నాశపెట్టి యుత డెట్లు చేయలేదు. అతని సాధుదృష్టి. మృదువచనము నంతకంటె నతని నిజోదాహరణములుయివియే యతని పరశువేది. 1918 నాటి సత్యాగ్రహదినములలో బొంబాయినివాసియగు ఉమరసోభాని యతనికి ప్రియమైన 'బానిసబోధకుడు' అని పేరిడుట నాకు జ్ఞాపక

మున్నది. తరువాత గడచిన పన్నెండు సంవత్సరములలో నెంతయో జరిగెను. ఈ మార్పులు చూచువరకు మరి జీవించలేదు. కాని యెక్కువ యసంతృప్తవంతులమయిన మేము 1931 వ సంవత్సరములోని మొదటినెలలనుంచి సంతోషోత్సాహ తరంగములతో వెనుకకు చూచితిమి. 1939 మా కొక వింత సంవత్సరము ! గాంధీజీ తన మోహనాస్త్రముచే మన దేశము నొక్కసారిగా మార్చివేసినట్లు కాన్పించెను. బ్రిటిషు ప్రభుత్వమును జయించితిమనుకొనిన మూర్ఖు లెవరును లేరు. మన యుత్సాహభావమునకు ప్రభుత్వముతో నెట్టి సంబంధమును లేదు. మనము మన ప్రజలు నారీమణులు మనయువకులు మన బాలురు యుద్యమములో చూపిన ధైర్యసాహసములకు గర్వించి తిమి. అదియొక యాధ్యాత్మిక విజయము. అది సర్వులకు సర్వకాల ములకు నమూల్యమైనది. కాని పరాధీనులను, అణగద్రొక్కబడిన వారము నగు మనకది మరింత యమూల్యమైనది. దీనిని పోగొట్టున దేదియు జరుగకూడదని మే మాతురపడితిమి.

స్వయముగ నాయెడల గాంధీజీ యెప్పుడు నసాధారణ దయ గౌరవము చూపెను. మా తండ్రిని ర్యాణ మతనిని నాకు మరింత సామీప్యమునకు తెచ్చెను. నేను చెప్పినదాని నత డెప్పుడు నతి యోర్పుతో విని నా కోర్కెలను తీర్చుట కన్నియత్నములనుచేసెను. నేను మరికొంతమంది సహచరులముకలసి యతనిని సామ్యవాద మార్గములోనికి మార్చగలుగుదుమని నే ననుకొంటిని. అతని కది వచ్చినచో క్రమముగా మారెదనని యతడేయనెను. ప్రస్తుత పరి పాలన క్రమములోని దౌర్జన్యము, అన్యాయము, వ్యయము, దుఃఖము మొదలగు వాటినుండి తప్పించుకొనుటకు నాకు వేరు మార్గము కాన్పించకపోవుటచే నతడు విధాయకముగ సామ్యవాద మూలసూత్రము నంగీకరించునట్లు కాన్పించెను. అతడు పద్ధతులలో భేదింపవచ్చును. కాని యాదర్శముతో భేదింపడని నే నప్పు డను కొంటిని. కాని గాంధీజీ యాదర్శములకు సామ్యవాదలక్ష్యమునకు ప్రధానభేదములే యున్నట్లు నే నప్పుడు గ్రహించితిని.

1931 ఫిబ్రవరి ఢిల్లీకథకు వృత్తము. గాంధీయిర్విన్ సంభాషణలు కొంతవరకు నడిచినడిచి హఠాత్తుగా నాగిపోయెను. చాలరోజులవరకు వైస్రాయి గాంధీజీకొరకు కబురుపంపలేదు. మా కంతయు భగ్నమయి నట్లేతోచెను. వర్కింగుకమిటీ మెంబర్లు తమతమ రాష్ట్రములకు వెళ్ళుటకు సిద్ధమయిరి. విడిపోవుటకు పూర్వము ముందు కార్యక్రమమును గురించియు, శాసనోల్లంఘనమునుగురించియు మేము సంప్రతించితిమి. భగ్నమయినసంగతి నిశ్చయమయినతోడనే తిరిగి కలుసుకొనుటకు, సంప్రతించుటకు నవకాశముండదని మేము భావించితిమి. నిర్బంధములు చెలరేగునని ప్రభుత్వము కాంగ్రెసుపై తీవ్రముగ దాడి సలుపునని యది నే మింతవరకు చవిచూచిన దానికంటె ఘోరముగు నని యనుకొంటిమి. ఆఖరుసభ యనుకొనినసభలో మేము కలుసుకొంటిమి. ఉద్యమమును నడుపుట కనేక తీర్మానములు చేసితిమి. ఒక తీర్మానమునకు కొంత ప్రాధాన్యతకలదు. ఇంతవరకు ప్రతి తాత్కాలికాధ్యక్షుడు తాను నిర్బంధింపబడినచో తన స్థానము కొరకని పేర్కొనుచుండెను. ఖాళీయయిన స్థానములలో వర్కింగుకమిటీ సభ్యులను పేర్కొనుచుండెను. స్థానీయముగ వచ్చిన వర్కింగుకమిటీలు పనిచేయకుండెను. అవి యే విషయములోను క్రొత్తగా జోక్యము తీసికొనజాలవు. వారు జయిలుకుమాత్రమే పోగలరు. ఇట్లు నిరంతరము స్థానీయులను పెట్టుచుండుపద్ధతి సాహసమైనది. ఇది కాంగ్రెసును తప్పుమార్గములో పెట్టవచ్చును. దానివలన కొన్ని యుపద్రవములున్నవి. కనుక ఢిల్లీలోని వర్కింగుకమిటీలో తాత్కాలికాధ్యక్షులను పేర్కొనుట, స్థానీయసభ్యులను పేర్కొనుట పనికిరాదని తీర్మానింపబడెను. మొదటి కమిటీలోని మెంబరు, మెంబర్లు పయినున్నంతసేపు వారే పూర్తికమిటీవలె పనిచేతురు. వారందరు జయిలులోనుండుచో పనిచేయు కమిటీయే యుండదు. కాని నే మప్పుడు వర్కింగుకమిటీ యధికారములు దేశములోని ప్రతిమనిషిలోను స్త్రీలోను నిలిచి యుంచునని గంభీరముగాచెప్పి పోరాటము నప్రతిహతముగ సాగింపవలసినదని హెచ్చరించితిమి.

ఈ తీర్మానము యుద్ధమును సాగించుటకు కాక ధైర్యమైన ప్రోత్సాహము. ఇందులో రాజీ కెంతమాత్రము చోటులేదు. కాంగ్రెసు యొక్క ముఖ్యస్థానములో కూర్చొని దేశమంతటితోను సంపర్కము కలిగియుండుట నిరంతర సందేశములనుపంపించుట దుర్ఘటమగుచున్న దను సంగతికూడ యిది గుర్తించెను. ఇది తప్పనిసరి. మన సేవకు లలో చాలమంది పేరు ప్రఖ్యాతులుగల స్త్రీలు, పురుషులు గలరు. వారు బహిరంగముగనే పనిచేతురు. వారెల్లప్పుడు నిర్బంధింపబడ వచ్చును. 1930 వ సంవత్సరములో సందేశములను తీసికొనివెళ్ళుటకు నివేదికలను పట్టుకొనివచ్చుటకు తనిఖీచేయుటకు రహస్యవార్తా ప్రచారశాఖయొకటి నిర్మింపబడెను. ఇది బాగుగనే పనిచేసెను. రహస్యవార్తలను తెచ్చుశాఖను జయప్రదముగ నడిపింపగలమని యిది రుజువుచేసెను. కాని కొంతవరకిది మన బహిరంగయుద్యమమునకు సరి పడలేదు. గాంధీజీ దీనికి వ్యతిరేకి. ప్రధానస్థానమునుండి సందేశములు రానపుడు పనినినిర్వహించుబాధ్యత స్థానికప్రజలమీద పెట్టకతప్పదు. లేనిచో వారు పైనుండి యాదేశము వచ్చునని యసహాయులై చూచుచు నూరకొనెదరు. సాధ్యమైనపు డాదేశములు పంపబడుచుండెను.

కనుక మేమీ తీర్మానమును, యితరతీర్మానములను నామోదించి వెళ్ళిపోవుటకు మూటలుకట్టితిమి. అప్పుడే యిర్విన్ ప్రభువువద్ద నుండి మరియొక పిలుపువచ్చెను. సంభాషణలు తిరిగి ప్రారంభ మయ్యెను. మార్చి 4 వ తేదీ రాత్రి రెండుజాములవరకు మేము వైస్రాయి యింటివద్దనుంచి రావలసిన గాంధీజీకొరకు వేచియుంటిమి. అతడు రెండుగంటలకు తిరిగివచ్చి మమ్ము నిద్రనుండి లేపి సమాధానము కుదిరెనని చెప్పెను. మేము ముసాయిదా చూచితిమి. నేను చాలవరకు షరతుల నెరుగుదును. అవి యనేకసారులు చర్చింపబడెను. కాని మొట్టమొదటనేయున్న రెండవషరతు, రక్షణలు మొదలగువాటికి సంబంధించినది, నా కాశ్చర్యము కలిగించెను. నేను దాని కెంతమాత్రము సుముఖుడను కాను. నే నప్పుడేమియు చెప్పలేదు. మే మందరము నిద్రించితిమి. చెప్పవలసిన దేదియును లేదు.

జరగవలసినపని జరిగిపోయెను. మన నాయకుడు మాటయిచ్చెను. మన మతనితో నేకీభవింపకపోయినను మన మేమి చేయగలము? అతనిని త్రోసివేయవలెనా? అతనితో త్రెంచుకొనవలయునా? మన అభిప్రాయభేదమును ప్రకటింపవలెనా? అది యొకవ్యక్తికి కొంత యాత్మతృప్తినీయవచ్చును. కాని తుదినిశ్చయము నదియేమియు చేయజాలదు. తాత్కాలికముగనైనను శాసనోల్లంఘనము సమాప్త మయ్యెను. ప్రభుత్వము గాంధీజీయొక్క సమాధానమున కిదివరకేయంగీకరించెనని ప్రకటింపగలిగినపుడు వర్కింగుకమిటీకూడ నిప్పుడు దానిని నడిపింపజాలదు. మా యితర సహచరులవలెనే నేనును శాసనోల్లంఘనము నాపివేసి ప్రభుత్వముతో తాత్కాలిక సంధిచేసికొనుటకు సంపూర్ణముగా నిచ్ఛగించుచుంటిని. మా సహచరులను తిరిగి జయిలుకు పంపించుట మా కెవరికి సులభవిషయముకాదు. ఇదివరకే జయిలులో నున్న యనేకవేలమంది నచ్చటనేయుంచుటకు మేము కారకులము కాజాలము. మాలో చాలమంది జయిలులోనుండుటకు తగుశిక్ష పొంది, యచ్చట జరుపవలసిన నిత్యవిధులనుగురించి పరిహాసముగా మాట్లాడినను జయిలు రాత్రిందివములు గడుపుటకు సంతోషప్రదమైన ప్రదేశముకాదు. ఇదిగాక మూడువారముల గాంధీజీ యిర్విన్ సంభాషణలవలన సమాధానము చేకూరునని దేశము భావించుచుండెను. చివరికది భగ్నమగుట ప్రజలకాశాభంగమగును. కనుక వర్కింగుకమిటీలోని మే మందరము మా ప్రధానస్థితికి భంగము గలుగకుండ పద్ధతిని, తాత్కాలిక సమాధానమునకు ప్రసన్నముగనే యుంటిమి.

గొప్పవాదముకు తావిచ్చిన యనేకాంశములతో నా కంత ప్రసక్తిలేదు. అన్నిటికంటె రెండువిషయములలో నా కెక్కువ శ్రద్ధయుండెను. ఒకటి మన స్వాతంత్ర్యలక్ష్య మెప్పుడు నేవిధముగను చెక్కుచెదరకుండవలెను. రెండవది యు. పి. లో నున్న వ్యవసాయదారులస్థితి నీ సమాధానము బాధించకూడదు. మా పన్నుల నిరాక

రణము లేక శిస్తులనిరాకరణ మింతవరకు చాల జయప్రదముగనుండెను. కొన్నిప్రాంతములలో చిల్లిగవ్వ టింగునబోణీకాలేదు. రయితు లందరు నుత్సాహభరితులైయుండిరి. ప్రపంచవ్యవసాయ పరిస్థితులు, ధరలు మునుపటికంటె నధ్వాన్నముగ నుండెను. మా పన్నుల నిరాకరణము రాజకీయము నార్థికముకూడ నైయుండెను. ప్రభుత్వముతో తాత్కాలిక సమాధానము కుదురుచో శాసనోల్లంఘనము విరమింపబడును. పన్నుల నిరాకరణమునకు రాజకీయకారణము తగ్గిపోవును. కాని యార్థికసమస్య యేమగును? విపరీతమగు ధరలవ్యత్యాస మేమగును? ప్రభుత్వ డిమాండును చాలమంది రయితులు చెల్లింపజాలరు. గాంధీజీ యీ విషయమును యిర్విన్ ప్రభువుకు స్పష్టపరిచెను. పన్నుల నిరాకరణము విరమింపబడును. కాని వారిశక్తికిమించి చెల్లింపవలసిన దని మేము రయితులకు చెప్పజాలమని యతడు నిష్కర్షగా చెప్పెను. ఈ విషయము రాష్ట్రమునకు చెందినది కనుక భారత ప్రభుత్వముతో వివరముగా చర్చించుటకు వీలులేకపోయెను. రాష్ట్రప్రభుత్వ మీ విషయమును గురించి మాతో సంప్రతించెదరని, రయితుల దుఃఖములను బాపుటకు వారి యధికారములోనున్నంతయు చేసెదరని మాకభయహస్తమిచ్చిరి. అది యస్పష్టమైనబాస. కాని యా పరిస్థితులలో నంతకంటె నిశ్చయమైన వాగ్దానమును పొందుట కష్టము కనుక నీ విషయమిట్లు తాత్కాలికముగ పరిష్కారమయ్యెను. ఇక మనలక్ష్యమునకు చెందిన ప్రధానసమస్య మిగిలెను. సమాధానములోని రెండవపరతులో నిదికూడ భగ్నముగావింపబడినట్లు నాకు కన్పించెను. దీనికొరకేనా మనప్రజ లొకవత్సర మంత ధైర్యస్థైర్యములతో పోరాడిరి ? మన ధైర్యవచనములు, క్రియలు దీనితో సమాప్తము చెందవలెనా? ఈ విధముగ నా మార్చి రాత్రియంతయు దీర్ఘాలోచనాతత్పరుడనయి యుంటిని. అమూల్యమయిన దేదియో పోయినట్లు నది యిక పునర్లభ్యము కానట్లు నా హృదయములో నొక శూన్యత యేర్పడెను.

# 35

## కరాచీ కాంగ్రెసు

నా జిజ్ఞాస గాంధీజీ కెట్లో తెలిసెను. మరునాడు ప్రాతఃకాలమున నన్నతడు తనతో షికారునరమ్మనెను. మేము చాలసేపు మాట్లాడితిమి. ప్రధానమైనదేదియు పోలేదనియు నెట్టి సిద్ధాంతమును జారవిడువలేదనియు నన్నత డొప్పింపయత్నించెను. సమాధానములోని రెండవపరతు కతడు మన స్వాతంత్ర్యకోరికకు సరిపడునట్లొక చిత్రమైన యర్థము తీసెను. అందులోని "భారత ప్రయోజనముల కొరకు" అను మాటలమీద నతడెక్కువగా నాధారపడెను. ఆయర్థము నాకు 'బలవంత గ్రాహ్యార్థముగా' కాన్పించెను. అది నాకు నచ్చలేదు. కాని యతని సంభాషణ నాకు కొంత యుపశాంతిగా నుండెను. అగ్రిమెంటు గుణావగుణములటుండ నమ్మాశ్చర్యచకితులనుచేయు నతని విధానము నాకు భయంకరముగ నున్నదని నే నతనితో చెప్పితిని. అతనిలో నగ్రాహ్యమయిన దేదియో యుండెను. పదునాలుగు సంవత్సరము లతని కత్యంత సన్నిహితుడనై యుండినను నా కది యిసుమంతయు నర్థముకాలేదు. అదియే నాకు భయము కొల్పుచుండెను. తనలో నగ్రాహ్యమయిన దేదియో యున్నదని యతడే యొప్పుకొని దానికి తానేమియు చెప్పజాలననియు నది యెచ్చటకు తీసికొనిపోవునో జోస్యము చెప్పజాలననియు చెప్పెను.

ఒకటి రెండురోజు లేమిచేయుటకుతోచక నేను మనశ్శాంతి లేక యిటునటు తిరిగితిని. అప్పు డా యగ్రిమెంటు నెదిరించవలెనని, అడ్డుపెట్టవలెనని నాకు లేదు. ఆ స్థితి దాటిపోయెను. నేను చేయగలిగిన దంతయు వ్యవహారములో దాని నంగీకరించుచు నామనః దానితో సంబంధములేదని యనుకొనుటయే! అది నా వ్యక్తిగత యహంకారమునే తృప్తిపరచునుగాని పెద్దసమస్య నెట్లు చక్కబరచగలదు? చేసిన దానిని సంతోషపూర్వకముగ నంగీకరించి గాంధీజీవలెనే దాని

కత్యంత ప్రసన్నమగు యర్థమునే యేల చెప్పుకొనగూడదు? అగ్రి మెంటు జరిగినవెంటనే పత్రికాప్రతినిధుల కతడీ యర్థమునే స్పష్ట పరచి మేము పూర్తిగా స్వాతంత్ర్యమునే సమర్థించుచున్నామని చెప్పెను. అతడెట్టి పొరబాటభిప్రాయములు కలుగకుండ నీ యంశమును యిర్విన్‌కు స్పష్టపరచెను. కాంగ్రెసుతరఫున ఆర్. టి. సి. కి ప్రతి నిధిని పంపవలసియున్నచో నీ షరతులమీదమాత్రమే పంపెదమనియు, నీ హక్కుకొరకు వాదించెదమనియు నతడతనితో చెప్పెను. ఇర్విన్‌ప్రభు వీ యధికారము నంగీకరింపడు. కాని కాంగ్రెసుకు దానినిగురించి వాదించుటకు హక్కుకలదని గుర్తించెను.

కనుక నేను మానసిక పోరాటముతోను, శరీరబాధతోను అగ్రిమెంటు నంగీకరించుటకు, హృదయపూర్వకముగ పనిచేయుటకు నిశ్చయించితిని. నాకు మరియొక మధ్యమార్గమేమియు కాన్పించ లేదు.

గాంధీజీ యిర్విన్‌ప్రభువుతో నగ్రిమెంటుకు రాకముందు తరు వాత శాసనోల్లంఘన ఖయిదీలనేగాక తదితర రాజకీయ ఖయి దీలనుకూడ విడుదలచేయవలసినదని కోరెను. మొదటివారు అగ్రి మెంటు షరతుప్రకారము విడుదల యగుదురు. కాని విచారణ చేసినతరువాత శిక్షింపబడినవారు, విచారణచార్జీ, శిక్షలేకుండగనె యుంచబడినవారు వేలకొలదికలరు. ఈ డెటెన్యూలలో చాలమంది యనేక సంవత్సరము లీవిధముగనే యుంచబడుటచే భారతదేశ మంతట ముఖ్యముగా దీనిచే నెక్కువగా బాధపడుచున్న వంగదేశ ములో, విచారణలేకుండ ఖయిదుచేయుపద్ధతిపై కల్లోలము హెచ్చు చుండెను. పెంగ్విన్ ద్వీపప్రధానివలె భారతప్రభుత్వము రుజువు లేవియు నుత్తమరుజువులు కాజాలవని విశ్వసించిరి. డెటెన్యూలు దౌర్జన్యయుతమగు తిరుగుబాటుదారులు లేదా దాని సంయుక్తులైన వారు గాంధీజీ, అగ్రిమెంటుషరతులేగాక, వంగదేశములోని రాజ కీయ యుద్రేకమును తగ్గించి యెక్కువసుముఖవాతావరణమును కలిగించుటకు వారిని విడుదలచేయవలసినదని కోరెను. కాని ప్రభు త్వమువారు దీని కొప్పుకొనలేదు. భగత్సింగు మరణశిక్షను మార్చ

వలసినపని గాంధీజీ చేసిన వాదననుకూడ ప్రభుత్వ మంగీకరింపలేదు. దీనికి అగ్రిమెంటుకు సంబంధమేమియు లేదు. భారతదేశమంతయు నీ విషయమై గగ్గోలుగానుండుటచే నతడు దీనిని ప్రత్యేకముగా కోరెను. అతని కోరిక వ్యర్థమయ్యెను.

భారతదేశ టెర్రరిష్టుసంఘ చిత్తవృత్తిని తెలుపుచున్న సంఘటన యొకటి నాకు జ్ఞాపకమున్నది. ఇది నా విడుదలయైన వెంటనే జరిగెను. ఒక క్రొత్తవ్యక్తి నన్ను చూచుటకువచ్చెను. అతడు తనపేరు చంద్ర శేఖర అజాదు అని చెప్పెను. నే నతని నెప్పుడు చూడలేదు. కాని, పది సంవత్సరములక్రిత మతడు పాఠశాలనుండి విరమించి యన్. సి. ఓ. లో జయిలుకు వెళ్ళినట్లు వింటిని. అతడప్పుడు పదిహేను సంవత్సరములవాడు. జయిలు నియమము నుల్లంఘించెనని యతనిని కొరడాలతో బాదిరి. తరువాత నతడు టెర్రరిస్టుగా మారి యుత్తర హిందూదేశములో నొక నాయకుడయ్యెను. ఈ చరిత్ర నేను కర్ణా కర్ణిగ వింటిని. నే నీ వదంతులలో నెట్టిశ్రద్ధ తీసికొనలేదు. నే నతనిని చూచి యాశ్చర్యపడితిని. కాంగ్రెసుకు ప్రభుత్వమునకు రాయబారము జరుగుచున్నను వదంతులు విని యితడు నన్ను చూడవచ్చెను. సమా ధానము కుదిరిన తమసంఘమును కేమైన శాంతిచేకూరునా? యని యడుగుటకతడువచ్చెను. వారింకను న్యాయబాహ్యులుగనే భావింప బడి యట్టి యాదరణనే పొందుదురా? తలదాచుకొనుటకు చోటు లేకుండ తరుమగొట్టబడుదురా? ఉరికంబము లెప్పుడు వారికొరకెదురు చూడవలసినదేనా? లేక ప్రశాంతమగు వృత్తుల నవలంబించుటకు సావకాశములున్నవా? కేవల టెర్రరిస్టు పద్ధతులవలన లాభములేదని, వాటివలన నెట్టిమంచి చేకూరలేదని గ్రహించితిమని యతడుచెప్పెను. అయినను భారతదేశము కేవలము శాంతిపద్ధతులచేతనే స్వాతంత్ర్య మును బడయగలదనునమ్మక మతనికిలేదు. భవిష్యత్తులో నెప్పుడో యొకప్పుడు దౌర్జన్యము రావచ్చుననియు, కాని యది టెర్రరిజము కాదనియు నతడుచెప్పెను. కనుక నతడు భారతస్వాతంత్ర్యమునకు సంబంధించినంతవరకు ప్రస్తుత టెర్రరిజము పనికిరాదనెను. కాని

ప్రశాంతముగా నివసించుటకెట్టి యవకాశము కలుగజేయకుండ "నన్నెల్లప్పుడు తరుమగొట్టుచున్నప్పుడు నేనేమిచేయవలెను" అని యతడడిగెను. ఈ మధ్య జరిగిన టెర్రరిస్టుచర్యలు చాలవరకు ఆత్మ రక్షణకొరకు చేయబడినవే యని యతడు చెప్పెను.

టెర్రరిజములో విశ్వాసము నశించుచున్నదని అజదు ద్వారా విని నేను చాలసంతోషించితిని. ఈ విషయములో నాకు తరువాత మరింత నమ్మకము చిక్కెను. అది యొకసంఘముయొక్క భావముగా ననుభవములో సంతరించెను. అచ్చటచ్చట వ్యక్తులకు సంబంధించి యేదో యొక ప్రత్యేకకారణముచేత ప్రతీకారముకొరకవి జరుగు చుండును. అనగా పాతటెర్రరిస్టులు వారి నూతన సహాధ్యాయులు, స్వాతంత్ర్యరాహిత్యతత్త్వమును స్వీకరించిరని, బ్రిటిషుపరిపాలన నభినం దించువారైరని దీని యర్థముకాదు. వారు టెర్రరిజము నిదివరకు వలె భావించుటలేదు. చాలమందికి ఫ్యాసిజము వాసనలున్నట్లు నాకు తోచెను.

నేను చంద్రశేఖర అజదుకు నా రాజకీయతత్త్వము బోధించి, నా దృక్పథముకు మార్చుకొనఁ జూచితిని. కాని "నేనిప్పుడేమి చేయ వలెను" అని యతడడిగిన ప్రధానప్రశ్నకు నేను నిరుత్తరుడనైతిని. అతనికి అతనివారికి శాంతియుండు సూచనలులేవు. భవిష్యత్తులో టెర్రరిష్టు చర్యలు జరుగకుండ తనపలుకుబడిని వినియోగించవలసిన దని, వాటివలన పెద్దసమస్యకు తనసంఘముకుకూడ నపకారము కలుగు నని నేను చెప్పితిని. రెండుమూడు వారములైనతరువాత గాంధీయిర్విన్ సంభాషణలు జరుగుచుండగా, చంద్రశేఖరఅజదును అలహాబాదు పోలీసులు కాల్చి చంపివేసిరని నేను ఢిల్లీలో వింటిని. ఒక మైదాన ములో పగటివేళ నతడు గుర్తింపబడి పెద్ద పోలీసుదళముచే చుట్టి వేయబడెను. ఒక చెట్టుచాటునుండి యతడు తన్ను రక్షించుకొనఁ జూచెను. ఇరుపక్షముల తుపాకికాల్పులు చెలరేగెను. అతడు చంప బడులోపల నొకరిద్దరు పోలీసులను గాయపరచెను.

తాత్కాలికసమాధానము కుదురుటతోడనే నేను ఢిల్లీనుండి లక్నో వెళ్ళితిని. దేశమంతట శాసనోల్లంఘనమాపివేయుటకు కొన్ని యేర్పాటులను వెంటనే చేసితిమి. కాంగ్రెసుసంస్థలన్నియు మా నూతన సందేశముల నమలుజరిపెను. మా సైన్యములో చాల యసంతృప్తి చెందినవారు 'కాలుదువ్వు' వారు చాలమంది కలరు. వారి పాతచర్యలను మానివేయునట్లు బలవంతపరచుటకు మా కెట్టిసాధనములు లేవు. కాని యెంతమంది విమర్శించినను నాకు తెలిసినంతవరకొక్క మినహాయింపుకూడ లేకుండ ఆ గొప్పసంస్థ యాచరణలో నీ నూతనవిధానము నవలంబించెను. మా రాష్ట్రములో కొన్నిప్రాంతములలో పన్నులనిరాకరణ తీవ్రముగ జరుగుచుండుటచే నచ్చట నేమి జరుగునాయని నేను ప్రత్యేకదృష్టితో చూచుచుంటిని. శాసనోల్లంఘనఖయిదీల విడుదల మేము మొట్టమొదట చూడవలెను. ప్రతి నిత్యము వీరు వేలకొలది విడువబడిరి. కొన్నిరోజులయినతరువాత పేచీలున్నల కొద్దిమందిమాత్రమే జయిలులోనుండిరి. తమతమ గ్రామములకు, పట్టణములకు పోయినప్పుడు ప్రజలు వీరిని సహజముగ బహూకరించిరి. తోరణ అలంకారములు, విందులు, యుత్సవములు. యూరేగింపులు, సభలు, యుపన్యాసములు, వినతిపత్రములు కోలాహలముగ జరుపబడెను. ఇవియంతయు సహజముగ జరుగునని యనుకొనవలసినదే. కాని పోలీసులాఠీ చెలరేగి మీటింగులను, యుత్సవములను బలవంతముగా చెదరగొట్టిన భీభత్సమునుండి యిదియొక ఆకస్మికమార్పు. పోలీసువారికిది కొంత కన్నెర్రగానుండెను. బహుశః జయిలులోనుంచి వచ్చినవారిలో చాలమంది విజయోత్సాహముతోనుండిరి. విజయమునొందితి మనుకొనుట కెట్టికారణములేదు. కాని జయిలునుండి బయటపడుట యెప్పుడు నుత్సాహోద్రేకమును పుట్టించును. అందులో సంఘమంతయు నొక్కసారి విడుదలయైనప్పు డిక యుత్సాహమునకు మేరయుండదు.

నే నీ విషయము నిచ్చట చెప్పవలసివచ్చెను. ఏలనన తరువాత కొన్ని నెలలకు ప్రభుత్వమువారి 'విజయోత్సాహ' పాపమునకు

తప్పుపట్టుకొని దీనిని మనపై నొకచార్జిగా బనాయించిరి! అధికార పూరిత వాతావరణములో పెరిగి, యెప్పుడు నందములోనే నివసించుచు ప్రభుత్వమనిన సైన్యమే యనుభావములోనుండి, ప్రజలలో నెట్టి ప్రేమ్మ యాధారములు లేనివారికి తమ గౌరవమని తాము భావించు నది సన్నగిలుటకంటె బాధకరమగునది వేరొండుయుండబోదు. నే నెరిగి నంతవరకు నే మెచరము యీ విషయము నావంతయు భావింపలేదు. సిమ్లాపర్వతములలోనున్న ప్రభుత్వాధికారులు లగాయితు క్రింద మైదానములోనున్న వారివరకు ప్రజల యీ తిరస్కార భావమునకు కోపముతోను, గర్వభంగమైనదను భావముతోను కుతకుతలాడు చున్నారను సంగతి మే మాశ్చర్యముతో వింటిమి. ప్రభుత్వాభి ప్రాయములను వ్యక్తపరచు పత్రికల కిప్పటికి నాదృష్టి పోలేదు.

కాంగ్రెసు నాయకులకు బ్రిటిషు ప్రభుత్వమును 'ఓడించితి'మను భావములేదు. కాని ప్రజల త్యాగములకు, ధైర్యసాహసములకు మాలో విజయోత్సాహముండెను. 1930 లో దేశము చేసినదానికి మాకు కొంత గర్వముండెను. అది మా యాత్మగౌరవము నభివృద్ధి చేసి మాకు విశ్వాసము చేకూర్చెను. మా చిట్టి వాలంటీరుకూడ భావ ప్రపూర్ణుడై యెడలువిరిచి శిరము పైకెత్తెను. ప్రపంచదృష్టి నాకర్షిం చిన యీ మహాప్రయత్నము బ్రిటిషు ప్రభుత్వముపై చాల యొత్తిడి కలిగించెననియు, మమ్ము మా గమ్యస్థానము తీసికొనివెళ్ళుననియు కూడ మేము భావించితిమి. దీనికి, ప్రభుత్వము నోడించుటకు సంబంధ మేమియు లేదు. మాలో చాలమంది ఢిల్లీ సంధివలన ప్రభుత్వముదే పయిచేయియైనట్లు పూర్తిగా గ్రహించితిమి.

యు. పి. లో మేము వ్యావసాయక సమస్య నెదుర్కొనవలసి యుండెను. బ్రిటిషు ప్రభుత్వముతో సాధ్యమైనంతవరకు తోడ్పడు టయే మన ప్రస్తుతనీతి. కనుక మేము వెంటనే యు. పి. రాష్ట్ర ప్రభుత్వముతో సంపర్కము పెట్టుకొంటిమి. పన్నెండుసంవత్సరముల నుండి మనకు వారితో నెట్టి యధికార సంబంధములేదు. వ్యావసా యిక సమస్యను చర్చించుటకు నేను రాష్ట్రాధికారులను చూచితిని.

ఈ విషయము గురించి నేము దీర్ఘ యుత్తరప్రత్యుత్తరములను జరిపితిమి. మా రాష్ట్ర కాంగ్రెసుకమిటీ మా ముఖ్యనాయకులలో నొకడైన గోవిందవల్లభ పంతును రాష్ట్రప్రభుత్వముతో సంపర్కముకలిగి యుండు ప్రత్యేకోద్యోగిని నియమించెను. వ్యావసాయక దుస్థితిలోని సత్యములును, వ్యవసాయ దినుసులధర లద్భుతముగా పడిపోవుటయు, సామాన్యరయితు చెల్లింపవలసిన పన్ను చెల్లింపలేని దుస్థితిలోనుండుటయు నంగీకరింపబడెను. ఎంతరెమిషను యివ్వవలె ననునదియే సమస్య. ఈ విషయములో రాష్ట్రప్రభుత్వమే దారిచూపవలెను. సామాన్యముగ ప్రభుత్వమువారు భూస్వాములతోనే వ్యవహరించుచుండిరి. వారి రైతులతో ప్రభుత్వము కెట్టి ప్రత్యక్ష సంబంధము లేదు. భూస్వాములే పన్నులను తగ్గించుటో, కొట్టివేయుటో చేయవలెను. కాని ప్రభుత్వము తమకు రావలసిన రెవిన్యూలో కొంత తగ్గించుకొనినగాని జమీందారులేమియు తగ్గించరైరి. సాధారణముగా వారు తమ రయితుల కెట్టి రెమిషనులను యిచ్చుటకు శ్రద్ధవహించరు.

రాష్ట్రకాంగ్రెసుకమిటీవారు రయితులతో పన్నుల నిరాకరణ మాపివేయబడినదని, వారు చెల్లింపగలిగినంతవరకు పన్ను చెల్లింపవలెనని చెప్పిరి. కాని వారి ప్రతినిధులుగా వారితరఫున కమిటీవారెక్కువ రెమిషనులను కోరిరి. చాలకాలమువరకు ప్రభుత్వమువారెట్టి చర్యను తీసికొనలేదు. బహుశః గవర్నరు సర్. మాల్కొము హైలీ సెలవుమీదనో లేక ప్రత్యేకపనిమీదనో యుండుటచే నీ యాలస్యము జరిగియుండవచ్చును. చురుకుదనము, దూరదృష్టిగలచర్య యత్యావశ్యకమయి యుండెను. తాత్కాలిక గవర్నరు, అతని సహాయులు మాటయిచ్చుటకు సందేహించి వేసవిలో సర్. మాల్కొముహైలీ వచ్చువరకు దీని నాపుచేయ నిశ్చయించిరి.

ఈ నిశ్చయము, ఆలస్యము, కష్టస్థితిని మరింత యధ్వాన్నమొనర్చెను. దీనివలన రయితులబాధ ద్విగుణమయ్యెను.

ఢిల్లీసంధి యగుటతోడనే నాయారోగ్యముచెడెను. జైలులో కూడ నేను అస్వస్థతగనే యుంటిని. తరువాత తండ్రిగారి మరణమువలన కలిగిన విచారము, వెంటనే ఢిల్లీరాయబారములో కలిగిన పరిశ్రమ నా శరీరారోగ్యమును కృంగదీసెను. కరాచీ కాంగ్రెసునాటికి నేను కొంచెము తేరుకొంటిని.

కరాచీ హిందూదేశమునకు పశ్చిమోత్తరముగా చాలదూరములోనున్నది. అది తక్కినదేశముతో కొంతవరకెడారిప్రదేశమువలన వేరుచేయబడుచున్నది. కాని యది భారతదేశములోని వివిధప్రాంతములనుండి యనేకవేలమందిని నాకర్షించి దేశములోని యప్పటి యుద్రేకమును యదార్థముగ వెలిబుచ్చెను. భారతదేశములో జాతీయోద్యమము దినదినాభివృద్ధియగుచున్నదను తృప్తియొకటి కలిగెను. ఇంతవరకు తన కెట్టి దుర్భరకష్టములువచ్చినను వాటిని యథాయోగ్యముగ తరించి, యుక్తమైన త్యాగముచే తనయునికిని ధన్యముగావించుకొనిన కాంగ్రెసుసంస్థయందు గౌరవము, ప్రజలయందు విశ్వాసము, హద్దులనుమీరని యుత్సాహము ద్యోతకమగుచుండెను. కాని ముందున్న భయంకర సమస్యలపట్ల నుపద్రవములపట్ల విపరీతమగు బాధ్యత కలదనుభావముకూడ పీడించుచునేయున్నది—మన మాటలు, తీర్మానములు జాతీయప్రయాణములో జరుపవలసినచర్యలకుపోద్ఘాతములు. కనుక వాటిని తేలికగనుచ్చరించుటకు తీర్మానించుటకు వీలులేదు. ఢిల్లీసంధి యంత యామోదకరముగలేదు. అది మనల ననేకరకములైన రాజీలకు దింపునేమో యను భయముకూడ కలదు. అది యొకవిధముగ దేశసమస్యలలోని స్పష్టతను తీసివేసినట్లు కాన్పించెను. కాంగ్రెసుజరుగుసమయముననే మరియొక విషాదము—భగత్సింగుయొక్క యురి – సంభవించెను. ఈ భావము ముఖ్యముగా నుత్తరహిందూదేశములో నుండెను. కరాచీ, యుత్తరమున నుండుటచే, పంజాబునుండి యనేకమంది ప్రజల నాకర్షించెను.

వెనుకటి కాంగ్రెసులకంటె కరాచీకాంగ్రెసు గాంధీజీకి వ్యక్తిగత విజయమని చెప్పకతప్పదు. గుజరాతులో జయభేరి మ్రోగించిన

నాయకుడను బిరుదుగాంచి, భారతదేశములో పేరెన్నికపొందిన వారిలో నొకడు మహాశక్తివంతుడునగు సర్దారు వల్లభాయిపటేలు అధ్యక్షుడైనను మహాత్ముడే యీరంగమును పాలించెను. అబ్దుల్ గఫర్ ఖాన్ యాధిపత్యమున సరిహద్దునుండి కాంగ్రెసుకు 'యర్ర చొక్కాల' పటాలమొకటి వచ్చెను. ఈ 'యర్రచొక్కాల' వారి కీర్తి దేశమంతట ప్రాకుటచే వారెచ్చటకు పోయినను అభినందింప బడుచుండిరి. 1930 ఏప్రిల్ లగాయితు, యెంత ప్రకోపింపబడినను, వారసాధారణము శాంతియుతమునగు ధైర్య, సాహసములను ప్రదర్శించుటచే హిందూదేశమంతయు వారిసాహసమును వేనోళ్ళ కొనియాడెను. 'యర్ర-చొక్కాలు' అను పేరుచే కొంతమంది యన్యాయముగా, వారు కమ్యూనిస్టులనియు, లేక లేబరుపార్టీలో నెడమపక్షము వారనియు భ్రమించుచుందురు. నిజమునకు వారిపేరు "ఖుదాయీ ఖిద్మత్ గార్". ఈ సంస్థ కాంగ్రెసులో చేరెను. తరువాత 1931 లో నది కాంగ్రెసులో నొకభాగమయ్యెను. వారు ధరించు పూర్వకాలపు యర్రటిదుస్తులచే వారిని యర్ర-చొక్కాలవారందురు. వారి ప్రణాళికలో నార్థికనీతి యేమియు లేదు. అది జాతీయ, సంఘసంస్కారములకు సంబంధించి యుండెను.

కరాచీలోని ప్రధానతీర్మానము ఢిల్లీసంధికి, రౌండు టేబిలు కాన్ఫరెన్సుకు సంబంధించినది. నేను దానిని వర్కింగుకమిటీలో నామోదించితిని. కాని గాంధీజీ నన్ను దానిని బహిరంగ కాంగ్రెసులో ప్రతిపాదింపమనినప్పుడు సందేహించితిని. అది నాకసాధ్యమయ్యెను. మొదట నేను తిరస్కరించితిని కాని యిది దుర్బలము నసంతృప్తికరము నైనస్థితి. నేను దానికి వ్యతిరేకిని కావలెను. లేదా దానిని సమర్థించవలెను. ఊగిసలాడుటయు, ప్రజలను సందేహ మనస్కుల చేయుటయు యుక్తముకాదు. చివరనిమిషములో బహిరంగ కాంగ్రెసులో తీర్మానము నిక ప్రవేశపెట్టుటకు సిద్ధముగానున్న సమయములో నేను దానిని ప్రతిపాదించుటకు నిశ్చయించుకొంటిని. నా యుపన్యాసములో నామహాసభలో నేను నాభావముల నతినిర్మొగమాటముగ

విశదీకరింప యత్నించితిని. నేను దానిని మనఃపూర్వకముగ సంగీక రించుటకుగల కారణములను చెప్పి, వారినిగూడ దాని కంగీకరింపవలసిన దని కోరితిని. ఆ క్షణములో నిచ్చిన యీ యుపన్యాసము హృదయ కుహరమునుండివచ్చి, యెట్టియలంకారములు, లలితపదజాలము లేక జాగ్రతగ తయారుచేయబడిన నా యితర యుపన్యాసములకంటె యెక్కువ విజయము బడసెను.

నే నితర తీర్మానములమీదగూడ, ముఖ్యముగ భగత్సింగు తీర్మానముమీద, ప్రధానహక్కులను గురించిన తీర్మానముమీద, ఆర్థికనీతిమీద మాట్లాడితిని. ముఖ్యముగా చివర తీర్మానమందు నా కెక్కుడు శ్రద్ధకలిగెను. ఇంతవరకు కాంగ్రెసు, గృహపరిశ్రమ లకు, సామాన్యముగ 'స్వదేశీ'కి సంబంధించినంతవరకుతప్ప, కేవల జాతీయపద్ధతులను యోచించెనుగాని యార్థికసమస్యలను తలపెట్ట లేదు. కరాచీ తీర్మానములో నది సామ్యవాదమువైపు కొక యడుగు, చాలచిన్న యడుగు, ముందుకు వేసెను. అది ప్రధానపరిశ్రమలను, సేవ లను జాతీయపరము చేయవలెననెను. బీదలమీద భారముతగ్గించి ధనవంతులమీద దానిని హెచ్చించు ననేక యితర విధానములను సూచించెను. ఇది యెంతమాత్రము సామ్యవాదముకాదు. పెట్టుబడి దారుల ప్రభుత్వ మీ తీర్మానములోనున్న ప్రతిదానిని సులభముగా నంగీకరింపవచ్చును.

అతిమాంద్యము, పేలవమునగు నీ తీర్మానమే భారతప్రభుత్వ పెద్దలను గుడ్లెఱ్ఱజేయునట్లు చేసెను. బహుశః వారు, దొంగతనముగా కరాచీ వచ్చి కాంగ్రెసు నాయకులను పాడుచేసిన బోల్షివిక్కుల 'యఱ్ఱ బంగారమును' గూడ వర్ణించియుందురు. ఒక విధమగు రాజ కీయ యంతఃపురములో జీవించుచు, బాహ్యప్రపంచముతో నెట్టి సంబంధము లేక, రహస్యవాతావరణముచే చుట్టివేయబడిన వారి గ్రహణబుద్ధి యద్భుత కథలను, కట్టుచరిత్రలను వినుటకు కుతూహల పడును. తరువాత నీ కథలు, వారి భక్తగణములో చేరిన వార్తాపత్రిక లలో రహస్యరీతిని చిన్నచిన్న వార్తలుగావచ్చుచు తెరతీసివేసినచో

సంకను అనేకములు విశదముకాగలవను సూచనకూడ చేయబడును. కరాచీ తీర్మానములోని ప్రధానహక్కులు మొదలగువాటికి సంబంధించిన విషయములను గురించి క్రొన్ని కథలు సృష్టింపబడెను. ఈ తీర్మానమునుగురించిన ప్రభుత్వాభిప్రాయ మిదియే. ఒక రహస్యవ్యక్తి, కమ్యూనిస్టుసంబంధి, యీ తీర్మానమును వ్రాసెనని, దాని నతడు కరాచీలో నామీద పారవేసెనని దానిమీద 'నీ తీర్మానము నంగీకరించవలెను లేదా ఢిల్లీ సంధిసమస్యమీద నేను ఢీకొనెదనని, నేను గాంధీజీ కొక సంగ్రామసందేశమును బంపితినని యీ కథ బ్రువ్వెను. గాంధీజీ బంచముగా దీని నంగీకరించి యదివరకే విసిగియున్న విషయనిర్ణయసభచేతను, చివరరోజున బహిరంగ కాంగ్రెసుచేతను బలవంతముగా దీనికొప్పించెనట.

ఆ 'రహస్యవ్యక్తి' యెవరో యింతవరకు నెచ్చటను నుదహరింపబడలేదు. కాని యీ వ్యక్తి యెవరో స్పష్టముగా గ్రహించు సూచన లనేకములు చేయబడెను. రహస్యపద్ధతులు, ద్రావిడప్రాణాయామపద్ధతి నాకు చేతగావు. కనుక నీవ్యక్తి యం. యన్. రాయివలె కాన్పించుననని నేను నిర్మొగమాటముగ చెప్పవచ్చును. కాని యం. యన్. రాయిగాని 'కమ్యూనిస్టువాసన' గల మరేవ్యక్తిగాని నిరపరాధమైన యీ కరాచీ తీర్మానమును గురించి యెట్లు భావించునో తెలిసికొనుట సిమ్లా, ఢిల్లీలలోని యీ పెద్దల కొక పాఠముగ వినసొంపుగ నుండగలదు. అట్టి వాని దృష్టిలో యీ తీర్మాన మతి హేయముగ నుండునని వినుట వీరి కాశ్చర్యముగ నుండవచ్చును.

గాంధీగారితో గత పదిహేడు వత్సరములనుండి నా కత్యంత పరిచయము కలదు. నే నతనికి సందేశములను పంపుట లేక నతనితో బేరములాడుట యనుభావము దురూహ్యము. మేము పరస్పరము సమాధానపడవచ్చును. లేదా యొక సమస్యమీద విడిపోవచ్చును. కాని మా పరస్పరసంబంధములలో బేరములకెన్నడు నాస్కారముండదు.

కాంగ్రెసు కీ తీర్మానము క్రొత్తగాదు. యు. పి. రాష్ట్రకాంగ్రెసుకమిటీ యీవిషయమై యాందోళన చేయుచునేయుండెను.

అది అ. భా. కాం. కమిటీచేత సామ్యవాదతీర్మానము నంగీకరింప చేయుటకు యత్నించుచుండెను. 1929 లో అ. భా. కాం. కమిటీ యీ సూత్రము నంగీకరించునట్లుది కొంతవరకు చేయగలిగెను. తరువాత శాసనోల్లంఘనము వచ్చెను. 1931 ఫిబ్రవరి, మార్చి మాసములలో నేను గాంధీజీతో ఢిల్లీలో నీ విషయమును కదిపితిని. ఆర్థిక విషయ తీర్మానముండవలెననుభావము నత డాహ్వానము చేసెను. ఈ విషయమును కరాచీలో తీసికొనిరావలసినదనియు, దీనికి సంబంధించిన తీర్మానము వ్రాసి తన కచ్చట చూపవలసినదనియు నతడు చెప్పెను. కరాచీలో నే నట్లుచేసితిని. అత డనేకమార్పులు, సూచనలుచేసెను. వర్కింగుకమిటీలో పెట్టుటకు పూర్వము మే ముభయులము దానిలోని పదముల కంగీకరింపవలెనని యతడనెను. నే ననేక చిత్తులను వ్రాయవలసివచ్చుటచే కొద్దిరోజు లాలస్యమయ్యెను. మా కనేక యితరవిషయములుకూడ నుండెను. చివరకు మే మిరువురము నొక ముసాయిదా నంగీకరించి దానిని వర్కింగుకమిటీ ముందరను విషయనిర్ణయసభలోను తెచ్చితిమి. విషయనిర్ణయ కమిటీ కది క్రొత్త విషయ మనుసంగతి పూర్తిగా నిజము. కొంతమంది సభ్యుల కది యాశ్చర్యము కలిగించెను. అయినను అది కమిటీలోను కాంగ్రెసులోనుకూడ సులభముగనే యామోదింపబడెను. అందులో నుదహరింపబడిన సూత్రముల ప్రకారము దానిని స్పష్టపరచి విపులము చేయుట కది అ. భా. కాం. కమిటీవారు కీయబడెను. నే నీ తీర్మానమును వ్రాయునపుడు నా డేరాలోనికి నన్ను చూడవచ్చిన యనేకమందితో దీనినిగురించి చర్చించితిని. కాని యం. యన్. రాయికీ తీర్మానముతో నెట్టిసంబంధములేదు. అతడు దీనిని నిరసించుననియు, పరిహాసము చేయుననియు నాకు బాగుగ తెలియును.

కరాచీ వచ్చుటకు కొద్దిరోజులు పూర్వము అలహాబాదులో నేను యం. యన్. రాయిని కలుసుకొంటిని. అతడొక సాయంకాలమకస్మాత్తుగా మా యింటికి వచ్చెను. అతడు భారతదేశములో నున్నాడను భావము నాకు లేకపోయినను, 1927 లో నే నతనిని

మాస్కోలో మాయటచే వెంటనే యానవాలుపట్టితిని. అతడు నన్ను కరాచీలోకూడా చూచెను. కాని నే మయిదునిముషములకంటె నెక్కువగ కలిసియుండలేదు. గత కొద్దిసంవత్సరములనుండి రాయి నన్ను రాజకీయముగ నిరసించుచు నెంతయో వ్రాసెను. అత డనేకసారులు నాకు కొంచెము బాధకలిగించెను; మా కిద్దరకు గొప్ప భేదముకలదు. కాని యతడు నన్నాకర్షించెను. తరువాత నతడు నిర్బంధింపబడి చిక్కులలో పడినప్పుడు నేను చేయగలిగిన సహాయము చేసితిని. అతని యద్భుతబుద్ధివిశేషము నన్నాకర్షించెను. అత డందరిచే విడిచిపెట్టబడి యేకాకియగుటచేకూడ నా మనసు ద్రవించెను. బ్రిటిషు ప్రభుత్వము సహజముగ నతనిని ద్వేషించుచుండిరి. జాతీయభారతదేశము కతని యందుమోహము లేదు. భారతదేశములో కమ్యూనిస్టులనబడువా రత నిని ద్రోహియని నిరసించిరి. అనేకవత్సరములు రష్యాలో జీవించి కోమింటర్నులతో చిరసహకారము సలిపి అతడు వారిని విడిచి పెట్టెను. బహుశః విడిచిపెట్టునట్లు చేయబడెను. ఇది యెందుచేత జరిగెనో నాకు తెలియదు. అతని ప్రస్తుతాభిప్రాయములెవ్వియో, సనాతన కమ్యూనిష్టులతో నతనికిగల భేదాభిప్రాయము లెవ్వియో నా కిప్పటికి తెలియవు. కాని యట్టివ్యక్తిని ప్రతివాడు విడిచి వేయుటకు నాకు బాధకలిగించుటచే, నేను నా యలవాటుకు వ్యతిరేక ముగ డిఫెన్సుకమిటీలో చేరితిని. 1931 లోని వేసవి లగాయతు నేటి వరకు (మూడేండ్లకుపైన) నతడస్వస్థుడై జయిలులో నొంటికొట్టులో నున్నాడు. కరాచీ సభ ముగియులోపల క్రొత్త వర్కింగుకమిటీని యెన్నుకొనవలసియుండెను. దీనిని అ. భా. కాం. కమిటీవారు ఎన్ను కొనెదరు. కాని యీ వత్సర అధ్యక్షుడు సూచించుపేరులనే అ. భా. కాం. కమిటీవారంగీకరించు యాచార మొకటి యేర్పడెను. కరాచీలో జరిగిన వర్కింగుకమిటీయెన్నికవలన నే నెవరము నూహింపని కష్ట మొకటి యేర్పడెను. అ. భా. కాం. కమిటీలోని కొందరు ముస్లిము సభ్యులు యీ యెన్నిక కభ్యంతరపెట్టిరి. బహుశః వారు తమవర్గ ములోనివారి నెవరిని యెన్నుకొనకపోవుటచే చిన్నబుచ్చుకొని యుండ

వచ్చెను. పదిహేనుగురు సభ్యులుగల అఖిలభారతకమిటీలో నన్నితర వాళ్లప్రాతినిధ్యము కుదురుట యసంభవము. అసలుతగాదా పంజాబుకు సంబంధించిన స్థానికపేచీ. ఫలితమేమనగా నెన్నికను నిరసించిన వర్గమువారు క్రమముగా పంజాబులోని కాంగ్రెసుపార్టీనుండి చీలి 'అహ్రారుపార్టీలో' చేరిరి. పంజాబులో చాల పలుకుబడి యుత్సాహము కల కొందఱు కాంగ్రెసుముస్లిములు దీనిలోచేరిరి. ఇది చాల మంది పంజాబు ముస్లిముల నాకర్షించెను. ఇది ముఖ్యముగా, మధ్య తరగతులలోని క్రిందితరగతులకు చెందినవారికి ప్రాతినిధ్యము వహించెను. దీనికి ముస్లిము ప్రజలతో ననేక సంబంధములుండెను. పయి తరగతులవారికి చెంది కూలిపోవుచున్న ముస్లిము కులతత్త్వప్రధానమైన సంస్థలకంటె నిది చాల బలవత్తరమైన సంస్థ. అహ్రారులు కులతత్త్వమువైపు మొగ్గనారంభించిరి. కాని ముస్లిము ప్రజలతో వారికి సంబంధముండుటచే నది సజీవమగు సంఘమయి యస్పష్టమయిన యార్థికదృష్టి కలిగియుండెను. వారు తరువాత భారతసంస్థానములలో ముఖ్యముగా కాశ్మీరములో, ముస్లిము ఆందోళనలో ప్రధానస్థానము వహించిరి. ఇచ్చట ఆర్థిక యనర్థములు, కులతత్త్వములు కలగాపులగము చేయబడెను. కాంగ్రెసునుండి అహ్రారు పార్టీ నాయకులు కొందఱు జారిపోవుట పంజాబులోని కాంగ్రెసుకు తీరనినష్టమయ్యెను. కాని కరాచీలో మా కీసంగతి తెలియదయ్యెను. ఈ జ్ఞానము క్రమముగా నంకురించెను. వర్కింగు కమిటీ యెన్నికవలన కలిగిన కోపముచేతనే వారు జారిపోలేదు. అది వాయుగతిని తెలుపు నొక తృణము. యదార్థకారము లంతర్గర్భితముగ నుండెను.

కరాచీలో నుండగనే కాన్పూరు హిందూముస్లిము కలహావార్తలు మాకు చేరెను. ఉద్రేకపూరితులగు ప్రజలు తమకు సహాయముచేయ యత్నించుచుండిన గణేశశంకర విద్యార్థిని చంపివేసిరను వార్తకూడ వెంటనేవచ్చెను. భయంకరము, పశుప్రాయము నగు ఆ కలహములు దేశారిష్టములు. గణేశజీయొక్క మృత్యువే, మరేదియు చేయజాలనట్లు, దీనిని ఋజువుచేయుచున్నది. ఆ కాంగ్రెసు మహా

ములోనున్న వేలకొలది ప్రజ లతని నెరుగుదురు. యు. పి. నివాసుల కును మా కందరకు నతడు ప్రియతమమైన మిత్రరత్నము, సహచరుడు. మొక్కవోని ధైర్యసాహసము, దూరదృష్టి జ్ఞానప్రపూర్ణమగు నాలోచన, నిరంతరోత్సాహము, ఉద్యోగమును, కీర్తిని, ప్రకటనను నిరసించుచు ప్రశాంతముగ పనిచేయు కర్మవీరత్వము. ఆహా యెన్ని గుణములు! తా నమితముగా ప్రేమించి, సేవించిన యుద్యమముకొర కతడు తన యౌవ్వనగర్వములో తన యసువుల నర్పించెను. పాపిష్టిచేతు లతనిని చంపివేసెను. కాన్పూరు పట్టణము, రాష్ట్రము సప్రకాశమానశోభతో వెలిగిన యొక రత్నమును పోగొట్టుకొనెను. ఈ వార్తవినబడుటతోడనే కరాచీలోని యు. పి. గుడారము లంధకారబంధురములయ్యెను. ఒక తేజస్సు గతించినట్లు కాన్పించెను. అయినను మృత్యువు నతినిర్భయముగా నెదుర్కొని యశఃకాంతులతో చనిపోయిన గర్వ మతనికుండెను.

# 36

## దక్షిణదేశసంచారము

డాక్టర్లు నన్ను విశ్రాంతి తీసికొనవలసినదని బలవంతపరచుటచే నేను సింహాళములో నొకమాసము గడుప నిశ్చయించితిని. భారతదేశ మెంత విశాలమైనదైనను నాకు నిజమైనమార్పుకు మానసిక విశ్రాంతికి తగినయవకాశము లిచ్చుటలేవు. ఏలనన నే నెచ్చటకు వెళ్ళినను రాజకీయ సహాధ్యాయులు నన్ను కలుసుకొందురు. దానితో మామూలు సమస్యలన్నియు నన్ను వేధించును. సింహాళము హిందూదేశమున కందుబాటులోనున్న యతిసమీపదేశము. కనుక కమలయు నిందిరయు, నేనును సింహాళము వెళ్ళితిమి. 1927 యారంభమునుండి తిరిగివచ్చినతరువాత నే ననుభవించిన మొదటిసెలవుదిన మిదియే. నా భార్య, నా కుమార్తె నేను కలసి యెట్టివిచారములేకుండ ప్రశాంతముగ గడుపుట కదియే ప్రథమము. ఈ యనుభవమును నేను తిరిగి యనుభవించలేదు. ఇట్టిదెన్నడైనను తిరిగి కలుగునా యని నే నొక్కొక్కప్పు డాశ్చర్యపడుచుందును,

అయినను నువరాఎలియా యనుచోట రెండువారములుతప్ప సింహాళములో నిజముగా మాకెక్కువ విశ్రాంతిలేకుండెను. అచ్చట నన్నితరగతులవారు మాకపారమైన యాతిథ్యమునిచ్చిరి. మా యెడల సుహృద్భావముఁజూపిరి. ఇంతప్రేమ చూపగలుగుట మాకానందముగనేయుండెను. కాని యది తఱచు బాధాకరముగకూడ నుండెడిది. నువరాఎలియాలో కూలీజట్టులు, తేయాకుతోటలలోని పనివాండ్రు ఇతరులు ప్రతిదినము ననేకమైళ్ళ దూరమునుండి వచ్చుచు తమతో నడివిపువ్వులు, కూరగాయలు, యిండ్లలో తయారుచేయబడిన వెన్న మొదలగు బహుమతులను తెచ్చుచుండెడివారు. మేము సాధారణముగా సంభాషించుటకైనను వీలుండెడిది కాదు. మే మొకరినొకరము చూచి నవ్వుకొనుచుండెడివారము. వారు దారిద్ర్యములోనుండి మాకు తెచ్చియిచ్చుచుండెడి యీ

యమూల్య బహుమతులతో మా గృహము నిండుచుండెను. మేము వాటిని యచ్చటనున్న ఆస్పత్రికి, యనాథశరణాలయములకు పంపుచుండెడివారము.

నేను మా ద్వీపములోని యనేక సుప్రసిద్ధ దృశ్యములను, చరిత్రాత్మక శిథిలములను, బౌద్ధభిక్షుకులములను, సుందరారణ్యసీమలను చూచితిమి. అనురద్ధపురములోని బుద్ధవిగ్రహము మనోహరముగ నుండెను. ఒకసంవత్సర మయినతరువాత, నేను డేరాడూను జయిలులోనుండగా సింహళములోని యొకస్నేహితుడు నాకీ విగ్రహచిత్రము నొకదానిని పంపెను. నేను దానిని నా గదిలో నొక చిన్న బల్లమీద పెట్టితిని. అది నాకొక విలువైన స్నేహితుడయ్యెను. ఈ విగ్రహముయొక్క శక్తిసమన్విత ప్రశాంతముఖలక్షణములు నన్ను శాంతపరచి, నాకు శక్తినిచ్చి నా మనోవ్యాకులతను పోగొట్టుచుండెను.

బుద్ధుడు నన్నెప్పుడు నాకర్షించెను. ఈ యాకర్షణమునకు కారణములను నేను చెప్పజాలను. అది మతసంబంధమైనది మాత్రము కాదు. బౌద్ధమతముచుట్టు పెరిగిన సిద్ధాంతములతో నాకు ప్రసక్తి లేదు. అతని వ్యక్తియే నన్నాకర్షించెను. అట్లే జీససు వ్యక్తికూడ నన్నెక్కువగ నాకర్షించెను. బౌద్ధమఠములలో పూజింపబడు బౌద్ధభిక్షువులను నే నెందరినో చూచితిని. వారందరి ప్రధానలక్షణము శాంతి. యాత్మశాంతి, ప్రపంచ విచారములందనాసక్తత. సాధారణముగా వారిముఖములందు బుద్ధివికాసము భయంకర మానసిక సంగ్రామచిహ్నములు కాన్పించవు. వారికీ జీవితము మహాబ్ధిని జేరుటకు ప్రశాంతముగా మందగమనముతో ప్రవహించు నొక నదివలె నుండెను. నేను వారిని కొద్ది యీర్ష్యతో చూచితిని. ఒక యాశ్రమమునకు జేరవలెననెడి కనపడని కోరిక నాలో కలిగెను. కాని నా జాతక మట్టిదికాదు. దానిని తుపానుల మధ్య ఝంఝామారుతములమధ్య గడపవలెను. నాకెట్టి యాశ్రయము లేదు. నాకు బయట తుపాను లెంత భీభత్సముగనుండెనో

ద్యాంతరంగిక ప్రభంజనుడుకూడ నష్టియుండెను. భయంకర వీచికల నుండి నన్ను కాపాడుయాత్రయ మొకవేళ దొరికినను నేనచ్చట శాంతిని, సుఖమును పొందియుండగలనా ?

కొంచెము కాల మా యాత్రయము మనోజ్ఞముగ నుండెను; సుఖముగ పడుకొని, కలలనుగనుచు ప్రాణదాయకములగు నుష్ణదేశ వాయుప్రసారముల ననుభవింపవచ్చును. అప్పటి నాభావములకు సింహళదేశ మెంతయు తగియుండెను. ద్వీపసౌందర్యము నా కానందము కలిగించుచుండెను. మా విహారదినమును త్వరలోనే పసు గత్తెను. విచారముతో నేము సెలవుతీసుకొంటిమి. ఆ దేశము, ఆ ప్రజలు నా కనేకసారులు స్మరణకువత్తురు. జయిలులోని శూన్య దినములలో నా కవి సహవాసముగనుండెను.

సింహళమునుండి మేము సరాసరి కన్యాకుమారి దక్షిణాగ్రము చేరితిమి. అచ్చట చాల ప్రశాంతముగ నుండెను. తరువాత తిరువాన్కూరు, కొచ్చిన్, మలబారు, మైసూరు, హైదరాబాదు మొదలగు స్వదేశసంస్థానములను చూచితిమి. ఇందులో కొన్ని చాల యభివృద్ధి నొందెను. కొన్ని చాల వెనుకబడియుండెను. తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానములు విద్యావిషయములో బ్రిటిషుయిండియాకంటె చాల యభివృద్ధిలోనున్నవి. మైసూరు బహుశః పారిశ్రామికముగ నభివృద్ధిలో నుండెను. హైదరాబాదు పూర్తిగా పురాతన ఫ్యూడలు రాజ్యచిహ్నము. మాకు ప్రతిచోట ప్రజలు, అధికారులు కూడ నాదరాభిమానములను చూపిరి. కాని మారాకవలన ప్రజ లుపద్రవకరములగు నాలోచనలను చేతురేమోయను భయ మధికారుల కుండెను. మైసూరు, తిరువాన్కూరు లాసమయములో కొంత పౌరసత్వస్వేచ్ఛను, రాజకీయ కృషికి కొన్ని సావకాశములను కలిగించునట్లు కాన్పించెను. హైదరాబాదులో నీమాత్రముకూడ పూర్తిగా శూన్యము. మాకెంతయాదరణ చూపబడినను నా కుక్కిరిబిక్కిరి యైనట్లే యుండెను. తరువాత మైసూరు, తిరువాన్కూరు తా మది వరకు కలుగజేసిన కొద్ది సావకాశములను లాగివేసిరి.

మైసూరు సంస్థానములోని బెంగుళూరులో నొకమహాసభ జరిగెను. అప్పుడు నేనొక యినుపస్తంభముమీద జాతీయజెండా నెగరవేసితిని. నేను వెళ్ళిన కొద్దికాలముకే యీ స్తంభము ముక్కముక్కలుగ విరుగగొట్టబడెను. మైసూరు ప్రభుత్వమువారు జెండాను చూపుట నేరమని ప్రకటించిరి. నేను యెత్తినజెండా నీవిధముగ నిరాదరించి నిరసించుట నాకు బాధకరముగ నుండెను.

నేను తిరువాన్కూరులో కాంగ్రెసుకూడ అక్రమ సంఘమయ్యెను. శాసనోల్లంఘన మాపివేయబడిన తరువాత బ్రిటిషు ఇండియాలో నది సక్రమ సంఘమేయైనను అచ్చట నెవరును దానికి సామాన్య సభ్యులనుకూడ జేర్పించకూడదు. ఈవిధముగ మైసూరు తిరువాన్కూరులు మామూలు రాజకీయకృషిని నలిపివేయుచు తామిదివరకిచ్చిన కొద్దిసావకాశములను తిరిగి తీసికొనిరి. అవి వెనుకముఖముపట్టెను.

హైదరాబాదుకు వెనుకకు వెళ్ళవలసిన యవసరము, యిచ్చినవి తీసికొనవలసినవి యేమియు లేవు. అదెప్పుడు ముందుకు పోలేదు. అట్టి యవకాశముల నెన్నడు కలుగచేయలేదు. హైదరాబాదులో రాజకీయసభల నెన్నడు నెరుగరు. సాంఘిక మతవిషయిక సభలను కూడ ననుమానముతో చూచెదరు. వాటికొరకు ప్రత్యేక యనుమతి పొందవలెను. పేరుప్రఖ్యాతులుగల వార్తాపత్రికలేవియు నచ్చటలేవు. బయటనుండి దుర్మార్గక్రియలేవియు దేశములోనికి రాకుండుటకు భారతదేశములో నితరచోట్ల ప్రకటింపబడు యనేకపత్రికల నచ్చటకు రానీయరు. ఈ బహిష్కార మతికఠినమైనదగుటచే మితవాదపత్రికలు కూడ బహిష్కరింపబడును.

కొచ్చిన్‌లో మేము 'తెల్లయూదులు' అనబడువారుండు ప్రదేశము చూచితిమి. ఈచిన్న సంఘ మతిపురాతనమైనది. యసామాన్యమైనది. దానిసంఖ్య నానాటికి క్షీణించుచున్నది. కొచ్చిన్‌లో వారుండుస్థానము పురాతన జెరూసలెమును బోలియుండునని మాకు చెప్పిరి. నిశ్చయముగ దానికి పురాతనరూపముండెను.

మేము మలబారుతీరము పొడుగునను సిరియను క్రైస్తవులుండు పట్టణములనుగూడ చూచితిమి. క్రీస్తుతరువాత మొదటిశతాబ్దములోనే క్రైస్తవమతము హిందూదేశమునకు వచ్చెనను సంగతి యెవరును గ్రహించరు. యూరపు దానిని స్వీకరించుటకు చాల పూర్వమే యది దక్షిణహిందూదేశములో స్థిరవాస మేర్పరచుకొనెను. ఈ క్రైస్తవుల మతప్రధాని ఆంటియోకులోనో, సిరియాలో నెచ్చటనో యున్నను వారి క్రైస్తవమతము పూర్తిగా దేశీయము. దానికి బాహ్యసంబంధము లేవియు లేవు.

దక్షిణమున నెస్టోరియనుల సంఘముచూచి నేనాశ్చర్యపడితిని. వారు పదివేలమంది కలరని వారి మతగురువు నాకు చెప్పెను. నెస్టోరియనులు చాలకాలముక్రిందటనే యితరజాతులతో కలిసిపోయిరను నుద్దేశ్యముతో నేనుంటిని. వారు హిందూదేశములో నుండిరను సంగతి నాకు తెలియునే తెలియదు. కాని వారి కొకకాలమందు హిందూదేశములో చాలమంది శిష్యులుండిరనియు, వారుత్తరమున కాశీవరకు వ్యాపించిరనియు మాకు చెప్పిరి.

మేము హైదరాబాదు ముఖ్యముగా సరోజినీదేవిని, యామె కుమార్తెలైన పద్మజ, లీలామణులను చూచుటకే వెళ్ళితిమి. మే మచ్చట నుండగా వారియింటివద్ద ఘోషాస్త్రీల సభ జరిగెను. వారు కమలను చూచుటకు వచ్చిరి. ఆమె వారికొక యుపన్యాసము నిచ్చెను. అందులో నామె పురుషుడు తయారుచేసిన చట్టములు, ఆచారములు మొదలగువాటినుండి స్త్రీలు స్వేచ్ఛను బడయవలసిన యావశ్యకతను గురించి చెప్పియుండును. ఇది జరిగిన రెండుమూడు వారములైన తరువాత నొక చిన్నవిషయము జరిగెను. హైదరాబాదునుండి యొక భయవిహ్వలుడైన భర్త కమలకొక జాబు వ్రాయుచు నామె యచ్చటకు వచ్చినదిలగాయితు తన భార్య విపరీతముగా ప్రవర్తించుచున్నదనియు, తాను చెప్పినట్లు వినుచు తన యడుగులకు మడుగులొగ్గుటలేదనియు, వాదముచేయుచు నెదిరించుచున్నదనియు వాపోయెను.

బొంబాయినుండి సింహళమునకు వెళ్ళిన యేడువారములైన తరువాత నేను తిరిగి బొంబాయి చేరితిని. వెంటనే నేను కాంగ్రెసు రాజకీయ సుడిగుండములలోని కురికితిని. ప్రధానవిషయములను చర్చించుటకు వర్కింగుకమిటీసభ జరుగుచుండెను. హిందూదేశములో పరిస్థితులు అతిత్వరితముగ మారిపోవుచుండెను. యు. పి. వ్యావసాయిక పరిస్థితులు స్తంభించెను. సరిహద్దు రాష్ట్రములలో ఖాన్ అబ్దుల్ గఫర్ఖాన్ నాయకత్వముక్రింద 'యెఱ్ఱచొక్కా'ల వారి యుద్యమ మత్యంత ప్రబలమగుచుండెను. వంగదేశములో నత్యంత యుద్రేకము, అణచివేయబడిన క్రోధము, అశాంతి హెచ్చుచుండెను. నిత్యావంట యైన కులకలహములు, కాంగ్రెసు ప్రభుత్వముకు ననేక సమస్యలపై స్థానిక పేచీలు, దానితో ఢిల్లీసంధిని భంగపరచిరను పరస్పరాపవాద ములు బయలుదేరెను. తరువాత చర్విత చర్వణమైనప్రశ్న; రెండవ రౌండుటేబిలు సభలో కాంగ్రెసు ప్రాతినిధ్యము వహింపవలెనా? మహాత్మాగాంధీ యచ్చటకు వెళ్ళవలెనా?

# 37

## సంధికాలమున సంఘర్షణము

గాంధీజీ రౌండు టేబిలు సభకు లండను పోవలెనా యక్కర లేదా ? యను ప్రశ్న పదేపదే వచ్చుచుండెను. దీనికిసమిద్ధమగు ప్రత్యుత్తరము రాకుండెను. చివరనిమిషమువరకు వర్కింగు కమిటీకి, చివరకు గాంధీజీకి యేమియు తెలియదు. దీనికి జవాబనేకవిషయములమీద నాధారపడియుండెను. క్రొత్తసంభవములు పరిస్థితులలో నెల్లప్పుడు క్రొత్తమార్పులను తెచ్చుచుండెను. ఆ ప్రశ్నకు జవాబుకు నిజమైన క్లిష్టసమస్యలుండెను.

రౌండు టేబిలుసభ యిదివరకే చట్టస్వరూపము నేర్పాటుచేసెననియు, చిత్రముయొక్క ప్రధానలేఖలన్నియు చిత్రింపబడినవనియు నిక యీ చిత్రమును పూరించుటయే మిగిలియున్నదనియు బ్రిటిషు ప్రభుత్వముతరఫున, వారి స్నేహితులతరఫున మాకనేకసారులు చెప్పబడుచుండెను. కాని కాంగ్రెసు అట్లు చేయదలంచలేదు. దానికి సంబంధించినంతవరకీ చిత్రమంతయు మొట్టమొదటినుండియు క్రొత్త జవనిక మీదనే వ్రాయబడవలెను. లేక చిత్రింపబడవలెను. ఢిల్లీ సంధిప్రకారము ఫెడరలు విధానము, రక్షణలు కావలెనను భావము మామోదింపబడెననుట నిజము. భారతచట్టనిర్మాణసమస్యకు ఫెడరలు విధానమే చాల మంచితరుణోపాయమను విషయము మాలో చాలమందికి చాలకాలముక్రితమే తట్టెను. ఈ భావముకు నే మంగీకరించుటయన మొదటి రౌండు టేబిలు కాన్ఫరెన్సులో తయారుచేయబడిన ప్రత్యేక ఫెడరలు విధానమునే యంగీకరించుట కానేరదు. ఫెడరేషనుకు రాజకీయస్వాతంత్ర్యముతోను, సాంఘిక పరివర్తనముతోను విరోధమెంతమాత్రములేదు. రక్షణలను భావము నిందుతో జతపరచుట చాల క్లిష్టవిషయము. సాధారణముగ నవి యధికారమును చాలవరకుతగ్గించు నర్థమునే యిచ్చును. కాని 'భారతదేశ ప్రయోజనములకొరకు' అను విశేషణవాక్యము, మాకీ

కష్టమును కొంతవరకు పోగొట్టెను. కరాచీకాంగ్రెసు మన కంగీకార మగు చట్టనిర్మాణమునుగురించి స్పష్టపరచెను, అది దేశ సంరక్షణ మీదను, విదేశవ్యవహారములమీదను, ద్రవ్యనీతిమీదను. ఆర్థిక నీతిమీదను పరిపూర్ణాధికారము కోరెను. భారతదేశ ఋణములను కట్టుకొనుటకుపూర్వము విదేశఋణ సమస్యలు కూలంకషముగ పరీక్షింపవలెను. ప్రధానహక్కులకు సంబంధించిన తీర్మానములు కొన్ని రాజకీయ, ఆర్థికమార్పులనుకూడ సూచించెను. ఇదియంతయు రౌండు టేబిలుకాన్ఫరెన్సులో చేయబడిన చాలతీర్మానములకు, ప్రస్తుత భారతప్రభుత్వపరిపాలనా చట్టమునకు విరుద్ధము.

కాంగ్రెసు దృక్పథమునకు, బ్రిటిషుప్రభుత్వ దృక్పథమునకు చాలవ్యత్యాసముకలదు. అది యిప్పటిస్థితిలో తొలగిపోవు నను కొనుట కల్ల. రౌండుటేబిలుసభలో ప్రభుత్వమునకు, కాంగ్రెసుకు సమాధానముకుదురునని కొద్దిమంది కాంగ్రెసువారు భావించిరి. నిరంత రోత్సాహియైన గాంధీజీకూడ నెట్టివిశేషమునాశించలేదు. కాని యాత డెప్పుడు నిరాశచేసికొనక చివరవరకు ప్రయత్నించుటకు నిశ్చయించు కొనెను. మే మందరము జయముచేకూరినను చేకూరకపోయినను ఢిల్లీయగ్రిమెంటు ననుసరించి యత్నము సాగించవలసినదే యని భావించితిమి. కాని మేము రౌండుటేబిలులో పాల్గొనుటకు రెండు విషయములు మమ్మెదుర్కొనుచుండెను. రౌండుటేబిలు కాన్ఫ రెన్సులో మేము మాదృక్పథమును నిరాటంకముగ వాదించుట కవకాశములుండవలెను. భారతదేశ పరిస్థితులు రౌండుటేబిలు కాన్ఫ రెన్సుకు పోకుండ మా కాటంకములను కల్పించవచ్చును. ప్రభుత్వ ముతో సంఘర్షణ కలిగించుస్థితి రావచ్చును; లేక మేము తీవ్రనిర్బంధ ములకు గురికావలసిన పరిస్థితులేర్పడవచ్చును. హిందూదేశములో నిట్టిస్థితి యేర్పడి మా కొంపకే నిప్పంటుకొనినపుడు మా ప్రతినిధి యెవడైన నీయగ్నిహోత్రజ్వాలలను నిర్లక్ష్యముచేసి లండనులో చట్ట నిర్మాణము మొదలగు విషయములను గురించి శుష్కవాదములను చేయుట కేవల మప్రస్తుతమగును.

ఈ స్థితి వంగదేశములోను, యు. పి. లోను, సరిహద్దు రాష్ట్రములలోను ప్రధానముగ దేశమంతట నొకమోస్తరుగ కాన్పించెను. వంగదేశములో ఢిల్లీ అగ్రిమెంటువలన నెట్టిలాభము చేకూరలేదు. అచ్చట నుద్రేకము మరింత హెచ్చుగుచుండెను. శాసనోల్లంఘన ఖయిదీలు కొందఱు విడుదలబడిరి. కాని శాస్త్రరీత్యా శాసనోల్లంఘన ఖయిదీలుకాని రాజకీయఖయిదీలు వేలకొలది జయిళ్ళలో నుండిరి. డెటిన్యూలుకూడ జయిళ్ళలోను, లేక డెటిన్యూ మకాములలోను నుండిరి. 'రాజద్రోహాకరములగు' ఉపన్యాసములకు తదితర రాజకీయకృషికి క్రొత్తనిర్బంధములు జరుగుచునే యుండుటచే ప్రభుత్వదాడి యెంతమాత్రము సడలకుండ సాగుచునేయున్నదను భావము సామాన్యమయ్యెను. టెర్రరిజమువలన వంగదేశసమస్య కాంగ్రెసు కధికకష్టము కలిగించెను.

మామూలు కాంగ్రెసుకార్యక్రమముతోను, శాసనోల్లంఘనముతోను పోల్చి చూచినచో టెర్రరిస్టుకార్యములు వ్యాప్తిలోను, ప్రాధాన్యతలోను నతిస్వల్పములు. కాని యవి పెద్ద గందరగోళము కలుగచేయుచు దృష్టి నాకర్షించుచుండెను. కాంగ్రెసు యితరరాష్ట్రములలో పనిచేసినట్లిచ్చట పనిచేయుట కివియాటంకములుగనుండెను. ఏలనన టెర్రరిజము శాంతియుతమగు ప్రత్యక్ష కార్యములకు వ్యతిరేక వాతావరణము సృష్టించుచుండెను. ఇది ప్రభుత్వనిర్బంధముల నాహ్వానించుచుండెను. కాని యివి టెర్రరిస్టులమీద, టెర్రరిస్టులు కానివారిమీదకూడ నిష్పక్షపాతముగ పడుచుండెను.

టెర్రరిస్టుల కొర కుద్దేశింపబడిన ప్రత్యేకచట్టములను, ఆర్డినెన్సులను పోలీసులు స్థానికకార్యనిర్వాహణాధికారులు, కాంగ్రెసు వారిపట్ల, లేబరు వ్యవసాయక ప్రచారకులపట్ల, వారామోదింపజాలని పనులనుచేయు నితరులపట్ల వినియోగింపకుండుట దుస్సాధ్యమగుచుండెను. కనుక చార్జీ, విచారణ, శిక్ష లేకుండ ననేకవత్సరములుంచబడిన యనేకమంది డెటిన్యూల యదార్థనేరములు టెర్రరిజముకు సంబంధించక నితర రాజకీయకృషికి సంబంధించినవిగ

నుంచుట కవకాశములుకలవు. ఋజువు చేయుటకు, ఋజువుగాదని నిరూపించుటకు, వారి కెట్టియవకాశములు నీయబడలేదు. చివరకు వారు చేసిన పాపములేవియో వారికి తెలుపబడలేదు. బహుశః శిక్ష వేయుటకు తగినంతసాక్ష్యము పోలీసువారివద్ద లేకపోవుటచేతనే వారు కోర్టులో విచారణచేయబడలేదు. నేరస్థుడనబడిన వానిని తఱచు కోర్టువారు నేరములేదని విడిచివేయుచుండుటయు, వెంటనే వానిని పోలీసువారుపట్టుకొని డెటిన్యూక్రింద నుంచుటయు జరుగుచునే యుండును.

వంగదేశములోని చిక్కుసమస్య కాంగ్రెసువర్కింగుకమిటీ వారి నసహాయులను చేయుచుండెను. అది వారిని నిరంతరము వేధించుచుండెను. ఏదో యొకరూపమున వంగదేశవిషయ మెప్పుడు వర్కింగు కమిటీముందర వచ్చుచునేయుండును. వారు దానిని తమ శక్తివంచన లేకుండ సాధింప యత్నించుచుండిరి. కాని వారాసమస్యను నిజముగా పరిష్కరించుటలేదనుసంగతి వారికి తెలియును. కనుక వారు దుర్బలత్వముచే నచ్చటివిషయములను వాటికర్మమునకు విడిచివేసిరి. అట్టి పరిస్థితులలో వారిక నేమిచేయగలరో చెప్పుటయు కష్టముగనే యుండెను. వర్కింగుకమిటీవారి యీ యుదాసీనత వంగదేశములో తీవ్రముగ నిరసింపబడెను. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారును, యితరరాష్ట్రములవారును తమ్ము నిర్లక్ష్యము చేయుచున్నారను భావము వంగదేశములో బయలుదేరెను. కష్టకాలములో వంగదేశము విడిచివేయబడినట్లు కాన్పించెను. ఈ యభిప్రాయము కేవలము నిరాధారము. వంగదేశప్రజలపై భారతదేశమునకంతకు పరిపూర్ణాభిమానము కలదు. కాని యీ అభిమానమును యదార్థసహాయముగా మార్చుటెట్లో దానికి తెలియకుండెను. ఇంతేకాక భారతదేశములోని ప్రతిభాగము తనకున్న కష్టములతోనే బాధపడుచుండెను.

యు. పి. లో వ్యవసాయపరిస్థితు లధ్వాన్నమగుచుండెను. రాష్ట్రప్రభుత్వమువారీ సమస్యనుగురించి జాప్యముచేయుచు వున్నా,

రివిన్యూరిమిషనులను గురించిన నిశ్చయము నాలస్యముచేసి బలవంత
ముగా పన్ను వసూలుచేయ నారంభించిరి. వేలకొలది జప్తులు,
భూములనుండి రయితులను గెంటివేయుట మొదలగునవి జరుగుచుం
డెను. మేము సింహళములోనుండగనే బలవంతముగ పన్నులను
వసూలుచేయ ప్రయత్నించినపుడు రెండుమూడు వ్యావసాయక కల
హములు జరిగెను. అవి చిన్నవేయైనను దురదృష్టవశాత్తు భూ
ఖామందో లేక వారి ఏజంటో చనిపోవుట తటస్థించెను. యు. పి.
గవర్నరయిన సర్. మాల్కామ్‌హైలీతో వ్యవసాయపరిస్థితులను
గురించి చర్చించుటకు గాంధీజీ నైనితాలు వెళ్ళెను. దీనివలన మంచి
ఫలితమేమియు కలుగలేదు. ప్రభుత్వమువారు రిమిషనులను ప్రకటిం
చిరి. అవి అనుకొనినవాటికంటె చాల తక్కువగ నుండెను. పల్లెటి
ప్రాంతములవారిగోల నిరంతరాయముగా హెచ్చిపోవుచుండెను. భూ
ఖామందు, ప్రభుత్వమువారు కలిసి రయితు నెక్కువగ బాధించిరి.
వేలకొలది రయితులు తమ వ్యవసాయభూములనుండి గెంటివేయబడిరి.
వారికున్న కొద్దియాస్తులు లాగుకొనబడెను. దీని కితరదేశములలో
గొప్ప రయితువిప్లవము సంభవించెడిది. కాంగ్రెస్‌వారి యత్నముల
చేతనే ప్రజలు దౌర్జన్యకార్యములకు గడంగకుండిరని నా యభిప్రా
యము. కాని ప్రజలమీద మాత్రము కావలసినంత దౌర్జన్యము
చూపబడెను.

ఈ రయితాంగ తిరుగుబాటులోను, కష్టములలోను, నొక
సంతోషవిషయము కలదు. వ్యవసాయ ధర లమితముగా పడిపోవుటచే
బీద తరగతివారికందరికి రయితులతో సహా తత్పూర్వముకంటె
తినుట కెక్కువ యాహారముండెను.

వంగదేశములోవలెనే సరిహద్దురాష్ట్రములలోను ఢిల్లీసంధివలన
శాంతిచేకూరలేదు. అచ్చట నుద్రేకము శాశ్వతమైపోయెను. ప్రత్యేక
శాసనములు, ఆర్డినెన్సులుగలిగి చిన్న చిన్న నేరములకుగూడ పెద్ద
పెద్ద శిక్షలను విధించుచు ప్రభుత్వ మచ్చట నొక సైనిక వ్యాపార
మయ్యెను. ఈ పరిస్థితుల నెదుర్కొనుటకు అబ్దుల్ గఫర్ఖాన్ గొప్ప

యాందోళన లేవదీసెను. అతడు ప్రభుత్వమువారి కొరకు బూచివలె నుండెను. ఆరడుగుల మూడంగుళముల యీ జాతానుపేయుడు గ్రామగ్రామము కాలినడకను పోవుచు 'యెఱ్ఱచొక్కాల' కేంద్రములను స్థాపించుచుండెను. అతడు, అతని ప్రధానులు వెళ్ళినచోట్లనెల్ల 'యెఱ్ఱచొక్కాల' చిహ్నములతో రాష్ట్రమంతను 'ఖుదాయిఖిద్మత్‌గార్'ల శాఖలతో నింపివేసెను. వారు పరమశాంతులు అర్థములేని నిందారోపణలుతప్ప వారిపై నొక్క దౌర్జన్యనేరమైనను స్థాపింపబడలేదు. వారు శాంతమూర్తులైనను కాకపోయినను, వారివెనుక యుద్ధసాంప్రదాయములు, దౌర్జన్యసాంప్రదాయములు కలవు. వారు కలహమునకు కాలుదువ్వు సరిహద్దుల ప్రాంతమున నివసించుచున్నారు. భారతజాతీయోద్యమముతో సన్నిహితసంబంధముకలిగి సుశిక్షితమైన యీ యుద్యమాభివృద్ధి ప్రభుత్వమునకు కన్నెఱ్ఱగానుండెను. అది దౌర్జన్యరహితము, శాంతియుతమునగు యుద్యమమని ప్రభుత్వమెప్పుడు విశ్వసింపలేదని నేననుకొనెదను. ఒకవేళ వారట్లుభావించినను వారు దానిని భయముతోను, విసుగుదలతోను చూచి యుండెదరు. అది యత్యంత శక్తిసమన్వితమైనదిగ నుండుటచే వారు దానిని ప్రశాంతచిత్తముతో చూడజాలరు.

అబ్దుల్‌గఫర్‌ఖాన్ యీ మహోద్యమమునకు నిర్వివాద నాయకుడు. అతడు 'పఠానుల మానధనము' 'సరిహద్దుగాంధీ' యని పిలువబడ దొడగెను. ఎట్టికష్టములకు, ప్రభుత్వచర్యలకు వెరువక, ప్రశాంతముగను, భల్లూకపుపట్టుతోను చేయు నిరంతరకృషివలననే సరిహద్దురాష్ట్రములలో నతని కద్భుతమైన పలుకుబడి కలిగెను. అతడు రాజకీయవేత్తలనబడువారివంటి రాజకీయవేత్తకాడు. రాజకీయములలోని యుక్తులు, జిత్తులు నతనికి చేతగావు. అజానుబాహువు; మానసికముగ, శారీరకముగ స్థైర్యమైనవ్యక్తి, జల్పమును గడబిడను నిరసించువాడు, భారతస్వాతంత్ర్య చట్టముతోనే తన సరిహద్దురాష్ట్ర ప్రజల స్వేచ్ఛకొరకు నిరీక్షించువాడు. చట్టనిర్మాణములు, న్యాయశాస్త్ర సంబంధమైన ప్రగల్భములు మొదలగువానియందు శ్రద్ధలేని

వాడు. దేనిని సాధించుటకైనను కార్యతత్పరత్వ ముండవలెను. మహాత్మాగాంధీ శాంతియుతమగు యద్భుత కార్యక్రమము నొక దానిని బోధించెను. అది యతని నాకర్షించెను. కార్యమును సాగించుటకు సుశిక్షణము, కట్టుదిట్టమైన యేర్పాటులు కావలెను. కనుక నిక నెట్టివాదనయును, తాను చేయవలసిన యేర్పాటులకు సంబంధించిన చాదస్తపు సూత్రములను వ్రాయుటయు నక్కరలేకుండగనే యతడద్భుతవిజయముతో కార్యక్రమమును ప్రారంభించెను.

గాంధీజీయనిన యతని కత్యంత ప్రేమ. మొట్టమొదట నతని మొగమాటము వెనుకనుండవలెనను కోరికయు నతనిని గాంధీజీ దగ్గరకు పోకుండచేసెను. తరువాత వారనేక విషయములను చర్చించుటకు కలుసుకొనవలసివలసివచ్చెను. వారి సంబంధములు వృద్ధియయ్యెను. ఈ పఠాను దౌర్జన్యరాహిత్యమును సిద్ధాంతములో నెట్లొప్పుకొనునా యనునది యాశ్చర్యముగ నుండును. దాని నతడు విశ్వసించెను. కనుకనే యెంతటియుద్రేకము కలిగింపబడినను శాంతమును వీడకూడదను భావము నతడు తన ప్రజలలో నాటును. సరిహద్దురాష్ట్రప్రజలిక నెన్నటికి దౌర్జన్యమును సుతరాము అవలంబించరని చెప్పుట మూర్ఖత్వము. సామాన్యముగ ప్రతిరాష్ట్రప్రజలకు నిదియే వర్తించును. ప్రజలుద్రేకతరంగములచే రేగుచుందురు. అట్లు రేగిననాడు వారెట్లు ప్రవర్తించెదరో యెవరును జోస్యము చెప్పజాలరు. కాని 1930 లోను తరువాతను సరిహద్దురాష్ట్రప్రజలు చూపిన యాత్మనిగ్రహ మత్యద్భుతము.

అబ్దుల్ గఫర్ఖాన్ పేరు వినుటకుపూర్వము చాలాకాలముక్రితమే నే నతనిసోదరుడగు డాక్టరు ఖానుసాహెబును బాగుగ నెరుగుదును. నేను కేంబ్రిడ్జిలోనుండగా నతడు లండను సెంటుథామ్సు ఆస్పత్రిలో విద్యార్థి. తరువాత బారిస్టరు విడుదల నారగించుచున్నప్పుడు మే మత్యంతమిత్రులమైతిమి. లండనులోనుండగా మేమిరువురము కలుసుకొనని దినమొక్కటియు నుండెడిదికాదు. నేనతనిని యింగ్లండులో విడచిపెట్టి హిందూదేశము వచ్చితిని. చాల

కాల మతడు ఇంగ్లండులోనేయుండి యుద్ధసమయములో డాక్టరుగా పనిచేసెను. తరువాత నే నతనిని నైనీజయిలులో చూచితిని.

సరిహద్దు "యెఱ్ఱచొక్కాల" వారు కాంగ్రెసుతో సహకారము చేసిరి. కాని వారిసంస్థ ప్రత్యేకసంస్థ. అదియొక వింతస్థితి. అబ్దుల్ గఫర్ ఖాన్ యీ రెంటికి సంధానకర్త. 1931 సంవత్సరం వేసవిలో నీసమస్యను వర్కింగుకమిటీవారు సరిహద్దురాష్ట్ర నాయకులతో కలసి కూలంకషముగ చర్చించి "యెఱ్ఱచొక్కాల"ను కాంగ్రెసులో మిళితముచేయుటకు నిశ్చయించిరి. ఈవిధముగ "యెఱ్ఱచొక్కాల" యుద్యమము కాంగ్రెసులో నొకభాగమైపోయెను.

కరాచీకాంగ్రెసు యగుటతోడనే గాంధీజీ సరిహద్దురాష్ట్రముకు పోగోరెను. కాని ప్రభుత్వమువారు దీని నెంతమాత్రము ప్రోత్సహింపలేదు. తరువాత నెలలలో ప్రభుత్వాధికారులు 'యెఱ్ఱచొక్కాల' వారి చేష్టలనుగురించి పదేపదే ఫిర్యాదులు చేసినప్పుడు గాంధీజీ తాను స్వయముగ వెళ్ళి పరిస్థితులను చూడగోరెను. కాని ప్రభుత్వము దీని కొప్పుకొనలేదు. నేను వెళ్ళుటకుకూడ వీలులేదనిరి. ఢిల్లీ యొడంబడిక నిలిచియుండుటచే ప్రభుత్వకోరికకు వ్యతిరేకముగా సరిహద్దురాష్ట్రము పోవుట యుక్తముకాదని మే మనుకొంటిమి.

వర్కింగుకమిటీముందు మరియొకసమస్య కులసమస్య. ఇందులో క్రొత్తయేమియు లేదు. అది క్రొత్తరూపములతో, వింతవేషములతో మాత్రము తలయెత్తుచుండును. ఆ సమయమున రౌండు టేబిలు కాన్ఫరెన్సువలన దానికి లేనిపోని యాధిక్యత వచ్చెను. బ్రిటిషుప్రభుత్వము తక్కిన సమస్యలనన్నిటిని వెనుకబెట్టి యీ శిఖండిని ముందుకుత్రోయు చునుసంగతి తేటతెల్లము. కాన్ఫరెన్సు సభ్యులందరు కులప్రయోజనములకు నాయా తెగల ప్రయోజనములకు, ప్రాముఖ్యతనిచ్చుటకు, ప్రజలందరకు సంబంధించిన సామాన్యవిషయములను విడిచిపెట్టి యీ పెడత్రోవలను పట్టుటకు ప్రధానముగా నియోగింపబడిరి. జాతీయ ముస్లిము నాయకులలో నెవనిని పేర్కొనుటకు ప్రభుత్వ మంగీకరింపలేదు. కాన్ఫరెన్సు మొట్టమొదటలోనే, బ్రిటిషుప్రభుత్వ ప్రోత్సాహ

ముతో, కులసమస్యలలో చిక్కుకొనినచో యదార్థమైన రాజకీయ ఆర్థికసమస్యలను యుక్తముగా యోచించుటకు వీలుండదని గాంధీజీ భావించెను. ఈ పరిస్థితులలో నతడు కాన్ఫరెన్సుకు పోవుటయే వ్యర్థము. కనుక నతడు కులసమస్యలమీద ముందుగా నొక సమాధానము వారిలో వారికి కుదిరిననే లండనుకు పోయెదనని వర్కింగుకమిటీ కెరుకపరచెను. అతని సహజజ్ఞానము చాలన్యాయముగనేయుండెను. కాని వర్కింగుకమిటీవారతనిని త్రోసివేసి మనము కులసమస్యను పరిష్కరింపజాలకపోతిమను కారణముచేతనే యతడు సభకుపోవ నిరాకరింపరాదని తీర్మానించిరి. వివిధకులముల ప్రతినిధులతో సంప్రదించి యొక పరిష్కారముచేయుటకు వర్కింగుకమిటీవారు యత్నించిరి. ఇది యంతవిజయవంతము కాలేదు.

1931 వేసవిలో ననేక సమస్యలకుతోడు యీ పెద్దసమస్యలనుకూడ మేము యోచింపవలసి వచ్చెను. స్థానికాధికారులు ఢిల్లీ సంధిని భంగపరచుచున్నారను ఫిర్యాదులు మాకు వచ్చుచుండెను. వీటిలో నతిముఖ్యమైనవాటిని మేము ప్రభుత్వమునకు పంపితిమి. కాంగ్రెసువారు సంధిని భంగపరచుచున్నారని ప్రభుత్వము నేరారోపణలనుచేసెను. ఇట్లు చార్జీలు కౌంటరుచార్జీలు చేయబడెను. తరువాత నవి పత్రికలలో ప్రకటింపబడెను. దీనివలన కాంగ్రెసుకు ప్రభుత్వముకు గల సంబంధము చక్కబడలేదని వేరుగ చెప్పనక్కరలేదు.

అయినను స్వల్పవిషయములమీద బయలుదేరిన యీ సంఘర్షణకెక్కువ ప్రాధాన్యతలేదు. అతిప్రధానమైన పోరాటము రానున్నదని తెలుపుటయే దీని ప్రాముఖ్యత. ఈ పోరాటము వ్యక్తులమీద నాధారపడక మనజాతీయసంగ్రామ ప్రకృతినుండియు, వ్యవసాయముకు సంబంధించిన ఆర్థిక స్థైర్యభావమునుండియు బయలుదేరెను. అసలు పునాదులలోనే మార్పులేనిదే యది తీరునదికాదు, రాజీ పడునదికాదు.

మధ్యతరగతులలోని పెద్దతరహాకు చెందినవారాత్మాభివృద్ధిని ఆత్మప్రకటనమును కోరుటచేతనే మొట్టమొదట మనజాతీయోద్య

మము ప్రారంభమయ్యెను. దాని వెనుక రాజకీయ, ఆర్థిక పిపాస యుండెను. అది క్రమముగా మధ్యతరగతులలోని కేంద్రితమహావరకు ప్రాకి, దేశములో నొకగొప్పశక్తిగా పరిణమించెను. తరువాత నది గ్రామప్రజల నాందోళనపరచసాగెను. వారి దుఃఖమయమును, జీవితప్రమాణములో నధమాధమమునగు జీవితమునుగడుపుటగూడ కష్టతరమగుచుండెను. ప్రాచీన గ్రామ ఆర్థికవిధానము సర్వతోముఖ గ్రామ సౌభాగ్యము చేకూర్చెను. అది చాలకాలముక్రిందట నశించిపోయెను. వ్యవసాయ మునకు చేదోడువాదోడుగానుండెడి గృహోపపరిశ్రమలు కొంతవరకు ప్రభుత్వనీతిచేతను, యెక్కువగ విజృంభించుచున్న యంత్రపరిశ్రమల పోటీకి తాళలేకపోవుటచేతను నశించెను. భూమిమీదభారము దిన దినాభివృద్ధి యగుచుండెను. భారతపరిశ్రమ లతిమందగమనము చేయుచు నీలోటు కూడదీయజాలకుండెను. ఎట్టిపరికరములు లేక, నేమరుపాటుగనుండి, యమితభారముచే కృంగిన గ్రామము ప్రపంచ పణ్యారంగములోనికి విసరివేయబడి యిటునటు గిజగిజకొట్టుకొనెను. అది యసమానపరిస్థితులతో పోటీచేయవలెను. దానియుత్పత్తి విధానములు చాల వెనుకబడియుండెను. దానిభూవిభాగపద్ధతి, సేద్య భూమియొక్క పరిమితుల నంతకంతకుచీల్చివేయుచు, గొప్పయభివృద్ధి సాధ్యముకాకుండచేసెను. కనుక వ్యవసాయజాతులు, భూఖామందులు రయితులుకూడ ధరలు హెచ్చుగానున్న కొద్దికాలములలోతప్ప క్రిందకు దిగజారుచుండిరి. భూఖామందులు తమభారమును రయితుల మీద రుద్దవలెనని యత్నించిరి. రయితాంగము చిన్నచిన్న భూస్వాములు, వ్యవసాయముచేయు సేద్యగాండ్రు జాతీయోద్య మములోనికి దిగిరి. గ్రామములోనున్న భూములులేని వ్యవసాయ కూలీలు వేలకొలది యిందులో ప్రవేశించిరి. ఈ గ్రామములలోనున్న జాతులందరికి 'జాతీయత' లేక 'స్వరాజ్యము' భూవిభాగపద్ధతిలో ప్రధానమార్పు అను నర్థమునే కలుగజేసెను. అదియే వారిభార ములను లేకుండచేయును లేదా తగ్గించును. భూమిలేనివారికి భూమి

నిచ్చెను. రయితులు జాతీయోద్యమములోని మధ్యతరగతి నాయకులు నీ కోరికలను స్పష్టముగ ప్రకటింపజాలరైరి.

1930 శాసనోల్లంఘనోద్యమము, దానినాయకులకు తెలియకుండగనే ప్రపంచవ్యవసాయ, పారిశ్రామిక వస్తువులధరల మాంద్యముతో ప్రారంభమయ్యెను. గ్రామప్రజలీమార్పువలన తహతహలాడి కాంగ్రెసులోను, శాసనోల్లంఘనములోను చేరిరి. వారికి లండనులోను, లేక మరియొకచోటను తయారుచేయబడిన చట్టనిర్మాణముకాక భూవిభాగపద్ధతిలో, ముఖ్యముగా జమీందారీప్రాంతములలో, ప్రధానమగు మార్పులే కావలెను. నిశ్చయముగా జమీందారీపద్ధతి దానికాలము చెల్లినను జీవించుచున్నది. దానిలో స్థైర్య మెంతమాత్రము లేదు. బ్రిటిషుప్రభుత్వ మీ భూవిభాగపద్ధతిలో గొప్పమార్పులను చేయుటకు సాహసింపదు. అది 'రాయల్ అగ్రికల్చరల్ కమిషన్'ను యేర్పాటుచేసినపుడుకూడ కమిషన్ భూయాజమాన్యమునుగురించి భూమిపన్నుపద్ధతినిగురించి చర్చింపకూడదని నిషేధించెను. ఈ విధముగా **సంఘర్షణ** మప్పుడు హిందూదేశపరిస్థితుల ప్రకృతిలోనేయుండెను. దానిని రాజీలతోను, పదజాలముతో మంత్రించి మాయము చేయుటకు వలనుపడదు. అది యత్యంత ప్రధాన సమస్యయైన భూమిసమస్యయొక్క పరిష్కారమువలననే యంతరింపగలదు. బ్రిటిషుప్రభుత్వ సహాయముతో నీ పరిష్కారము జరుగుట యసంభవము. తాత్కాలికపద్ధతులవలన నీ దుఃఖముకొద్దికాల ముపశమింపవచ్చును. తీవ్రనిర్బంధములు దీనిని బహిరంగముగ వ్యక్తము చేయకుండ భయపెట్టవచ్చును, ఆపివేయవచ్చును. కాని యంతమాత్రముచే నీ సమస్య తీరునదికాదు.

బ్రిటిషుప్రభుత్వము భారతదేశములోని చిక్కులు చాలవరకు 'ఆందోళనపరులవలననే కలుగుచున్నవని భావించిరి. ఇదియొకపిచ్చియూహ. గత పదిహేనుసంవత్సరములనుండి భారతదేశ మొక మహా

నాయకుని కలిగియుండెను. లక్షలకొలది ప్రజల కతనియెడల ప్రేమ, పూజ్యభావముకూడ నుండెను. అతడనేకవిధముల తనభావములనే ప్రజలమీద చొప్పించుచున్నట్లు కాన్పించెను. అతడు భారతదేశ నవీనచరిత్రలో చాలప్రధానపాత్ర ధరించెను. అయినను అతని యాజ్ఞల నంధప్రాయముగ శిరసావహించినట్లు కాన్పించిన ప్రజలే యతనికంటె ముఖ్యమైనవారు. ప్రజలు ప్రధాననటకులు. వారివెనుక వారిని ముందుకు త్రోయుచు, వారిని సన్నద్ధముచేయుచు, వారి నాయకుని శంఖారావముల నాకర్ణించుటకు తయారుచేసిన గొప్ప చారిత్రక కారణములుండెను. ఈ చారిత్రక రంగమును, ఆర్థిక కారణములును లేనిచో యెట్టినాయకులు, నాందోళనపరులు వారిని కార్యరంగములోనికి దింపజాలరు. నాయకుడైన గాంధీజీ ప్రజానాడిని తన యాత్మప్రబోధముచే గ్రహింపగలడు. విజృంభించుటకు కార్యరంగములోనికి దుముకుటకు పరిస్థితులెప్పుడు పరిపక్వముగనుండునో గ్రహింపగలడు. ఇవి గాంధీజీకిగల ప్రధాన లక్షణములు.

1930 లో భారతదేశ జాతీయోద్యమము దేశములో విజృంభించుచున్న సాంఘికశక్తులకు సరిపడియుండెను. ఈ కారణముచే దానికొక గొప్పశక్తికలిగెను. అది క్రమముగ చరిత్రలో నభివృద్ధి చెందుచు దానికొక సత్యత్వముకలిగెను. కాంగ్రెసు ఆ జాతీయోద్యమమును వ్యక్తముచేసెను. ఈ శక్తియు నీ బలమును కాంగ్రెసుయొక్క గౌరవాతిశయమును పెంపొందించెను. ఇది పైకి కన్పించునదికాదు. దీనిని లెక్కించుటకు, నిర్వచించుటకు వలనుపడదు. అయినను యిది యెక్కువగనుండెను. నిశ్చయముగ రయితాంగము కాంగ్రెసువైపు మొగ్గెను. అది తన నిజశక్తిని దానికిచ్చెను. మధ్యతరగతులలోని క్రిందితరహావారి పోరాటములోని సైన్యమునకు వెన్నెముకలైరి. ఈ వాతావరణముచే క్షుభితులై పైతరగతి బూర్జువాలుకూడ కాంగ్రెసుతో స్నేహముచేసికొనుటయే తమకు భద్రమనుకొనిరి. భారతదేశములోని బట్టలమిల్లులలో నత్యధికసంఖ్య కాంగ్రెసు విధిం

చిన ప్రమాణపత్రములను వ్రాసియిచ్చిరి. కాంగ్రెసుకు తమపై కోపము తెప్పించుపనులను చేయుటకవి భయపడుచుండెను. లండన్‌లో మొదటి ఆర్. టి. సి. లో కూర్చుని పెద్దలు సునిశితమగు న్యాయ విషయములను తర్కించుచుండగా నిజమైన యధికారమంతయు నెమ్మదిగ, పైకికాన్పించకుండ, ప్రజాప్రతినిధియైన కాంగ్రెసుపరమగు చుండెను. ఈ భ్రాంతి ఢిల్లీ సంధియైన తరువాతకూడ 1930 లోను తరువాతను జరిగిన విషయములనుబట్టి పెరిగెను. నిశ్చయముగ ముందున్న కష్టములను, యుపద్రవములను యెక్కువగ గుర్తించిన వారు కాంగ్రెసునాయకులే. వారు వాటినెంతమాత్రము తృణీకరింప కుండుట కెంతయో జాగ్రత్తపడిరి.

దేశములో రెండు ప్రభుత్వములు వర్తిల్లుచున్నవనుభావము సహజముగ ప్రభుత్వముకు కోపము కలిగించుచుండెను. యదార్థముకు దీనికెట్టి యాస్కారము లేదు. పశుబలము పూర్తిగా ప్రభుత్వముకే యుండెను. కాని రెండుప్రభుత్వములున్నట్లు మానసికముగ భావింప బడెను. అధికారధూర్వహ ప్రభుత్వ మీస్థితిని భరింపజాలదు. వారు తరువాత ఫిర్యాదుచేసినట్లు గ్రామములలోని వాతావరణమే వారిని నిజముగా కలవరపెట్టెను. కనుక సంఘర్షణము తప్పనిసరియైనట్లు కాన్పించెను. ఏలనన కాంగ్రెసు ఐచ్ఛికముగ నాత్మహత్య చేసుకొనన నేరదు. ప్రభుత్వ మీ ద్వంద్వవాతావరణమును భరింపజాలదు. కనుక వారు కాంగ్రెసును నలిపివేయ సమకట్టిరి. రెండవరౌండుటేబిలు కాన్ఫరెన్సు మూలమున నీ పోరాట మాపుచేయబడెను. ఏ కారణము చేతనో బ్రిటిషుప్రభుత్వము గాంధీజీ లండను కాన్ఫరెన్సులో నుండ వలెనని గట్టిగ కోరుచుండిరి. కనుక దీనికడ్డంకులువచ్చు పనులను చేయకుండిరి.

అయినను సంఘర్షణభావము పెరుగుచుండెను. ప్రభుత్వ కాఠిన్యతను మేము గుర్తింపగలిగితిమి. ఢిల్లీసంధియైన వెంటనే ఇర్విన్ భారతదేశమును వీడెను. అతనిస్థానమున విల్లింగ్డను వైస్రాయిగా వచ్చెను. క్రొత్తవైస్రాయి చాలకఠినుడు, దయాదాక్షిణ్యములు లేని

వాడు. వెనుకటివానివలె రాజీల కంత సుముఖముగా నుండడనియు
నొక కథ బయలుదేరెను. మన రాజకీయవేత్తలు చాలమంది రాజ
కీయములను సిద్ధాంతములరీత్యాగాక వ్యక్తులరీత్యా యోజించుచుండు
'లిబరలు' యాచారమున కలవాటుపడిరి. బ్రిటిషుప్రభుత్వ సామ్రాజ్య
నీతి వైస్రాయిలయొక్క వ్యక్తిగతాభిప్రాయములపై నాధారపడి
యుండదని వీరు గ్రహింపరు. కనుక వైస్రాయిలుమారుటవలన నెట్టి
భేదము కలుగలేదు, కలుగజాలదు. కానిపరిస్థితులు వృద్ధిచెందు
చుండుటచే ప్రభుత్వనీతి క్రమముగా మారెను. సివిలు సర్వీసు పీఠ
స్థులు సంఘులను, కాంగ్రెసుతో వ్యవహరించుటకు అంగీకరింపలేదు.
వారు పొందినశిక్షణ, ప్రభుత్వమను యధికారము చెలాయించుటయని
వారికిగల భావములు దీనికి వ్యతిరేకము. సమానహోదాతో గాంధీజీ
వ్యవహరించుట కాంగ్రెసు పలుకుబడిని, గాంధీజీ గౌరవమును వృద్ధి
పరచెననుభావము వారికుండెను. కనుక నతనిగర్వము నణచివేయ
వలెను. ఇది చాల యవివేకమయిన భావము. కాని భారతదేశ
సివిలుసర్వీసువారిభావములలో నవనీత మేమియులేదు. కారణమేది
యైనను ప్రభుత్వమువారు వెన్నువిరిచి, పిడికిలిబిగించి యొకప్రాచీన
ప్రవక్తమాటలలో నిట్లు చెప్పుచున్నట్లు కాన్పించెను. 'నా చిన్న
వ్రేలు నా తండ్రి నడుముకంటె దళసరియైనది, అతడు మిమ్ము కొర
డాలతో మోదుచో నేను మీకు తేళ్ళను పట్టించెదను.'

కాని యాసమయ మింకను రాలేదు. వీలున్నచో కాంగ్రెసు
రెండవ రౌండుటేబిలుసభలో ప్రాతినిధ్యము వహింపవలసియుండెను.
వైస్రాయితోను, యితరఅధికారులతోను దీర్ఘసంభాషణలను జరుపు
టకు గాంధీజీ సిమ్లా రెండుసార్లు వెళ్లెను. వా రనేకహాంశములను
ముఖ్యముగా సరిహద్దులోని 'యఱ్ఱచొక్కాల' యుద్యమము, యు. పి.
లోని వ్యావసాయికోద్యమమును గురించి చర్చించిరి. వంగదేశ విష
యముకాక ప్రభుత్వము నెక్కువగా నీ రెండుసమస్యలు బాధించెను.

సిమ్లానుండి గాంధీజీ నాకొరకు పంపెను. నేను భారతప్రభు
త్వాధికారులలో కొంతమందిని చూచితిని. నేను యు. పి. ని గురిం

వాడు. వెనుకటివానివలె రాజీల కంత సుముఖముగా నుండడనియు నొక కథ బయలుదేరెను. మన రాజకీయవేత్తలు చాలమంది రాజకీయములను సిద్ధాంతములరీత్యాగాక వ్యక్తులరీత్యా యోజించుచుండు 'లిబరలు' యాచారమున కలవాటుపడిరి. బ్రిటిషుప్రభుత్వ సామ్రాజ్య నీతి వైస్రాయిలయొక్క వ్యక్తిగతాభిప్రాయములపై నాధారపడి యుండదని వీరు గ్రహింపరు. కనుక వైస్రాయిలుమారుటవలన నెట్టి భేదము కలుగలేదు, కలుగజాలదు. కానిపరిస్థితులు వృద్ధిచెందుచుండుటచే ప్రభుత్వనీతి క్రమముగా మారెను. సివిలు సర్వీసు పీఠస్థులు సంధులను, కాంగ్రెసుతో వ్యవహరించుటకు అంగీకరింపలేదు. వారు పొందినశిక్షణ, ప్రభుత్వమున యధికారము చెలాయించుటయందు వారికిగల భావములు దీనికి వ్యతిరేకము. సమానహోదాతో గాంధీజీ వ్యవహరించుట కాంగ్రెసు పలుకుబడిని, గాంధీజీ గౌరవమును వృద్ధిపరచెనను భావము వారికుండెను. కనుక నతనిగర్వము నణచివేయవలెను. ఇది చాల యవివేకమయిన భావము. కాని భారతదేశ సివిలుసర్వీసువారిభావములలో నవనీత మేమియు లేదు. కారణమేదియైనను ప్రభుత్వమువారు వెన్నువిరిచి, పిడికిలిబిగించి యొకప్రాచీన ప్రవక్తమాటలలో నిట్లు చెప్పుచున్నట్లు కాన్పించెను. 'నా చిన్న వ్రేలు నా తండ్రి నడుముకంటె దళసరియైనది, అతడు మిమ్ము కొరడాలతో మోదుచో నేను మీకు తేళ్ళను పట్టించెదను.'

కాని యాసమయ మింకను రాలేదు. వీలున్నచో కాంగ్రెసు రెండవ రౌండుటేబిలుసభలో ప్రాతినిధ్యము వహింపవలసియుండెను. వైస్రాయితోను, యితరఅధికారులతోను దీర్ఘసంభాషణలను జరుపుటకు గాంధీజీ సిమ్లా రెండుసార్లు వెళ్లెను. వా రనేకాంశములను ముఖ్యముగా సరిహద్దులోని 'యఱ్ఱచొక్కాల' యుద్యమము, యు. పి. లోని వ్యావసాయికోద్యమమును గురించి చర్చించిరి. వంగదేశ విషయముకాక ప్రభుత్వము నెక్కువగా నీ రెండుసమస్యలు బాధించెను.

సిమ్లానుండి గాంధీజీ నాకొరకు పంపెను. నేను భారతప్రభుత్వాధికారులలో కొంతమందిని చూచితిని. నేను యు. పి. ని గురించియే మాట్లాడితిని. మేము చాల నిర్మొగమాటముగ మాట్లాడుకొంటిమి. మా పరస్పరాభియోగముల వెనుకనున్న యదార్థస్పర్థలను గురించి చర్చించితిమి. 1931 ఫిబ్రవరిలో ప్రభుత్వము శాసనోల్లంఘనోద్యమమును మూడుమాసములలోనే క్షుణ్ణముగా నలిపివేయగలిగెనని చెప్పుదురు. వారు తమ నిర్బంధయంత్రమును పూర్తిచేసిరి. దానినొకత్రోవత్రోసిన చాలును; ఒక బొత్తాము నొక్కినచాలును. బలవంతముగా నొప్పించుటకంటె, వీలైనచో నంగీకారముతో కూడిన సమాధానమే మంచిదని వారు తలంచి, పరస్పరసంభాషణలను చేయ సంకల్పించిరి. అది చివరకు ఢిల్లీసంధిగా పరిణమించెను. సమాధానము కుదరనిచో బొత్తాము సిద్ధముగ నుండనేయున్నది. మేము తిన్నగా నడచుకొనకపోయినచో నతికాలములోనే యీ బొత్తాము నొక్కివేయబడునను సూచనకూడ చేయబడెను. ఇది యంతయు నమర్యాదగ, నిర్మొగమాటముగ చెప్పబడెను. మే మేమి చేసినను, యేమిచెప్పినను, మా సంబంధము లేకయే స్పర్థ విధాయకముగ సంభవించునని మా యుభయులకు తెలియును.



మరియొక గొప్పయధికారి కాంగ్రెసును పొగడెను. మేమప్పుడు రాజకీయములకు సంబంధించిన విశాలసమస్యలను చర్చించుచుంటిమి. రాజకీయముల నటుంచినచో కాంగ్రెసు దేశమునకు గొప్పసేవచేసెనని యతడనెను. భారతీయులు మంచిసంఘటకులు కారని సామాన్యముగా నొక యపవాదముకలదు. కాని 1930 లో విపరీతమైన కష్టములు, వ్యతిరేకతయున్నను, కాంగ్రెస్ అద్భుత సంఘటనశక్తి ప్రదర్శించెను.

గాంధీజీ మొదటి సిమ్లాప్రయాణము వలన రౌండుటేబిలు సభకు పోవువిషయమేమియు తేలలేదు. అతడు ఆగష్టుఆఖరున తిరిగి సిమ్లా వెళ్ళెను. అటోయిటో తుది నిర్ణయము చేయవలసియుండెను. భారతదేశము వీడుట కతడు నిశ్చయము చేసుకొనుట కష్టతరముగ నుండెను. వంగదేశములోను, సరిహద్దురాష్ట్రములోను, యు. పి. లోను కష్టములు రానున్నట్లతడు గ్రహించెను. భారతదేశములో శాంతియుండునను ధైర్యము చిక్కినకాని యతడు వెళ్ళదలచుకొన్న

లేదు. చిట్టచివరకు ప్రభుత్వముతో నొక సమాధానము కుదిరెను. అవి యొకవాగ్దానములోను, కొన్ని యుత్తరములలోను పొందు పరుపబడెను. ఆర్. టి. సి. ప్రతినిధులను తీసుకొనిపోవు స్టీమరుతో నతడుకూడ వెళ్ళుటకు చివరనిముషములో, నీపని జరుపబడెను. ఒక విధముగా చివరనిముషము దాటిపోయిన తరువాతనే యిది జరిగెను. సిమ్లానుండి కాల్కావరకు నొకప్రత్యేక రైలుబండి యేర్పాటు చేయబడెను. ఈ బండి సరాసరిపోవుటకు తక్కిన బండ్లన్నియు నాపి వేయబడెను. నే నతనితో సిమ్లానుండి బొంబాయివరకు వెళ్ళితిని. అప్పుట ఆగష్టు మాసాంతమున నితడు రత్నాకర పశ్చిమతీరములకు పయనమగుచుండ నొక సుప్రభాతమున నే నతనియొద్ద సెలవు తీసి కొంటిని. రెండుసంవత్సరములవరకు నాకదియే యతని తుది సందర్శనము.

# 38

## రౌండు టేబిలు కాన్ఫరెన్సు

హిందూదేశములోను, రౌండు టేబిలు కాన్ఫరెన్సులోను గాంధీ గారినెక్కువగా చూచితినని చెప్పుకొను నొక ఆంగ్లపత్రికారచయిత యిట్లు వ్రాయుచున్నాడు. "ముల్తాను స్త్రీమను" లోనున్న నాయకు లందరు కాంగ్రెసువర్కింగుకమిటీలో గాంధీగారిపై కుట్రలేవతీయ బడుచున్నదను సంగతి బాగుగ నెరుగుదురు. కాలము పక్వమైనపుడు కాంగ్రెసు అతనిని తరిమివేయునని వారెరుగుదురు. కాని కాంగ్రెసు గాంధీజీని తరిమివేయుటవలన బహుశః దానిలోని సగముమంది సభ్యులను తరిమివేయును. సర్. తేజబహాదరు సప్రూ, జయకరుగార్లు సగముమందినే లిబరలు ఉద్యమమున జేర్చుకొన గోరుచున్నారు. వారిభాషలో నతడు 'పిచ్చియెత్తినవాడు' అను విషయము వారెన్నడు దాచిపెట్టలేదు. తనతోపాటు పదిలక్షలమంది 'పిచ్చివాండ్రను' తీసికొని రాగల 'పిచ్చివానిని జయించుట లాభదాయకము.'

1931 లో లండనువెళ్ళిన సర్. తేజబహాదరు సప్రూ, జయ కరు, యితర ఆర్. టి. సి. సభ్యులు మొదలగువారి యభిప్రాయముల నిది యెంతవరకు తెలుపుచున్నదో నాకు తెలియదు. కాని భారత దేశ రాజకీయములలో నే కొద్దిపరిచయముకలవాడయినను, పత్రికా రచయిత యగుగాక లేక 'నాయకుడు' అగుగాక, నిట్టి వాఙ్మూలము నిచ్చుట నా కాశ్చర్య విషయముగ తోచుచున్నది. నేను దీనిని చదివి దిగ్భ్రమచెందితిని. నేనును దానినిగురించి యంతకుపూర్వము సూచనగనైనను విని యుండలేదు.

ఈ కుట్రదారులెవరు? వారేమిజేయబూనిరి? అధ్యక్షులైన వల్లభాయిపటేలు నేను వర్కింగుకమిటీలో నతివాదులలోని వార మని యెప్పుడెప్పుడు చెప్పబడెను. కనుక నీకుట్రచేయు నాయకులలో మమ్ము తప్పక లెక్కవేసియుందురని నే ననుకొనెదను. బహుశః భారతదేశమంతట వల్లభాయికంటె ఎక్కువభక్తుడైన సహచరుడు

గాంధీజీకి వేరొకడు లేడు. అత డతిశక్తివంతుడు. తన పనిలో భీష్మ ప్రతిజ్ఞ కలవాడు. అయినను గాంధీజీపట్ల స్వీయముగ నాతని యాదర్శముల యెడలను, నీతి యెడలను భక్తికలవాడు. అతనివలె నేనీ యాదర్శముల నంగీకరించితినని చెప్పుకొనజాలను. కాని నేను గాంధీజీతో నత్యంత సన్నిహిత సంబంధముగలిగి పనిచేసితిని. ఏ విధముగనైనను నతనిపై కుట్రచేయుట యనుభావము నాకు కంపరముగనుండును. ఇదియే వర్కింగుకమిటీకంతకు నన్వయించును. ఆ కమిటీ నిజముగ నితనిచేతనే సృజింపబడెను. కొద్దిమంది సహకారులతో నాలోచించి యతడు కమిటీని పేర్కొనెను. ఎన్నిక యొక ఆచారవ్యవహారము. ఆ కమిటీలో ననేక వత్సరములు పనిచేసినవారే వానికి వెన్నెముకవలె నుండిరి. వారు దాని శాశ్వతసభ్యులుగనే భావింపబడుచుండిరి. స్వభావములోను, దృష్టిలోను, వారిలో రాజకీయ భేదాభిప్రాయములు కలవు. కాని వత్సరముకొలది సాంగత్యమును, సమిష్టిగ భారములను సహించుటయు, సమానయుపద్రవముల నెదుర్కొనుటయు వారి నైక్యముచేసెను. వారిమధ్య స్నేహము, సహవాసము, పరస్పర గౌరవము వర్ధిపొందెను. వారి కలయిక బాహ్యమైనదికాదు. వారి కాంతరంగిక మైక్యతకలదు. ఒకరిపై నొకరు కుట్రపన్నుట యనుభావము నెవడును యూహింపజాలడు. గాంధీజీ మా కమిటీకధినాయకుడు. ప్రతివాడు త్రోవచూపుమని యతనికొరకెదురుచూచుచుండును. చాల వత్సరములనుండి యిది యట్లేయుండెను. 1930 లో మా కఖండవిజయము చేకూరినతరువాత 1931 లో నిది మరింత స్పష్టమయ్యెను.

వర్కింగుకమిటీలోని 'యతివాదులు' అతనిని 'తరిమివేయుటకు, ప్రయత్నించుటెందులకు? అతడు చాల రాజీపడు స్వభావముకలవాడనియు, కనుక నసర్థకమైనవాడనియు భావింపబడి యుండవచ్చును. కాని యతడులేనిదే పోరాటమెక్కడిది? శాసనోల్లంఘనము సత్యాగ్రహము యెక్కడివి? సజీవముగు నా యుద్యమములో నతడొక భాగము. నిశ్చయముగ నతడే యా యుద్యమము. ఆ పోరాటముకు

సంబంధించినంతవరకు సర్వము నతనిమీఁద నేయాధారపడియుండెను. జాతీయపోరాటము నిశ్చయముగ నతని సృష్టిగాదు. అది యేవ్యక్తిపైన నాధారపడ లేదు. దానిమూలము లతిగంభీరములు. శాసనోల్లంఘనము చిహ్నముగగల పోరాటములోని యీప్రత్యేకత స్వరూపము ముఖ్యముగ నతనిమీఁదనే యాధారపడియుండెను. అతనిని విడుట యనగా నా యుద్యమమును విడిచి క్రొత్త పునాదులమీఁద నూతనసృష్టిచేయుట. అట్టి విషయమెప్పుడైనను చాల కఠినమైనది. 1931 లో దానినిగురించి యోచించుటకే వీలులేదు.

అతనికొక చిన్న సూచనచేసిన చాలియుండగా మేము కుట్ర పన్నవలసిన యగత్యమేమి? అతఁడు తప్పుకొనెదనని యొక చిన్న సూచన చేసినంతమాత్రమున వర్కింగుకమిటీయు, దేశమంతయు నెప్పుడును దద్దరిల్లుచుండెను. అతఁడు మా పోరాటములో నొక భాగముగుటచే మమ్ము విడువవచ్చుననుభావమే మాకు దుర్భరముగ నుండెను. అతనిని లండను పంపుటకే మేము సందేహించితిమి. ఏలనన నతని భావములో భారతదేశ భారమంతయు మాపయి బడును. ఈస్థితిని నే మభిలషింపకుంటిమి. భారము నతనిమీఁద పడవేయుటకే నే మలవడితిమి. వర్కింగుకమిటీలోను బయటనుగల మాలో చాలామందికిని గాంధీజీకిని యత్యంతానుబంధ ముండుటచే మే మతఁడులేని తాత్కాలిక విజయముకంటె నతనితోడి యపజయమునే వాంఛించుచుంటిమి. గాంధీజీ 'పిచ్చివాఁడో' కాఁడో మన లిబరలు మిత్రులే నిశ్చయించెదరు గాక! అతని రాజకీయము లొక్కొక్కప్పుడు చాల యాధ్యాత్మికముగ గ్రహించుటకు కష్టముగ నుండుననుట కెట్టి సందేహము లేదు. కాని యతఁడు కార్యశీలుఁడని, అద్భుత ధైర్యము కలవాఁడని, తరుణోపాయము చూపగలవాఁడని ఋజువుచేసెను. 'పిచ్చితన'మిట్టియనుభవయోగ్యమగు ఫలితముల నిచ్చుచో బహుశః అది చదువుతోనే ప్రారంభమయి చదువుతోనే సమాప్తముచెందు నొక ప్రత్యేకకూటమితో నంతరించు 'అనుభవరాజకీయముల' కెంతమాత్రము తీసిపోవు

[illegible]వ్రాసెను. [illegible] 'పిబ్లియుత్తి'
వారే. వారికి రాజకీయములు [illegible]శాస్త్రము తెలియవు.
ఆహారము, తలదాచుకొనుటకు కొంప, కట్టుకొనుటకు బట్ట, మన్ను
కొనుటకు భూమి మొదలగు మానవావసరములనుగురించి మాత్రమే
వారు యోచింపగలరు. మానవనైజమును పరిశోధించుటలో శిక్షను
గఱచిన ప్రఖ్యాత విదేశపత్రికారచయితలు భారతదేశములో విప
రీత బుద్ధులగుదురు. ప్రాచ్యదేశము కేవలము భిన్నమైనదనియు,
దానిని మామూలు ప్రమాణములతో విమర్శించుటకు వీలు లేదనియు
బాల్యమందే వారికి పట్టింపబడిన భావముల ఫలితమా యిది? లేక,
ఇంగ్లీషువారి సంపర్కములో, వారిదృష్టిని నిరీక్షించి, వారి యభి
ప్రాయములను తికమకచేయునది సామ్రాజ్యానుబంధమా?

1931 లో గాంధీజీ యూరపు పయనమయిననాడే విఖ్యాత
వ్యాకను పత్రికారచయిత వ్రాసినవ్యాసము చదివితిని. ఆ వ్యాసము
హిందూదేశమునకు సంబంధించినది. అందులో నతడు 1921 నాటి
అసహాయోద్యమదినములలో వేల్సుయువరాజు హిందూదేశమును
దర్శించినపుడు జరిగిన యొక విషయము నుదహరించెను. మహాత్మా
గాంధీ యొకచోట యెట్టిప్రకటనయు లేకుండ యువరాజు మందిర
మునకు హఠాత్తుగ నాటకములోని పాత్రభావవలెవచ్చి, మోకరించి
యువరాజు పాదములుపట్టుకొని వెక్కి వెక్కి యేడ్చుచు నిర్భాగ్య
దేశమునకు శాంతిని ప్రసాదింపుమని యతనిని ప్రార్థించెననియు
నందులో వ్రాయబడెను. ఈ యద్భుతకథను నే మెవరమును,
గాంధీజీకూడ వినియుండలేదు. ఈ సంగతి నే నా పత్రికారచయితకు
వ్రాసితిని. అతడు విచారము తెలిపెను. కాని తనకది నమ్మదగిన
చోటునుండి వచ్చెనని వ్రాసెను. కేవలమసంభవమని దానిముఖము
మీదనే వ్రాసిపెట్టబడియున్న యీ కథను పరిశోధించుటకెట్టి
యత్నముచేయకయే యతడు విశ్వసించుట నా కాశ్చర్యముగ
తోచెను. గాంధీజీని, కాంగ్రెసును, భారతదేశమును గురించి యే
మాత్రము తెలిసినవాడు దీనిని విశ్వసింపజాలడు. ఈకథ యవిశ్వాస

నీయము, పరిహాసాస్పదము. ఇది తలక్రిందులుగా నిలిచి మహోద్వేగ పూర్వకముగా గాలితో కాళ్ళను ఘాడించుచున్న ముస్సోలినీదగ్గఱకువచ్చి క్యాంటర్బరీఆర్చిబిషప్ (మతగురువు) చెప్పినను మూర్ఖకథను బోలియున్నది.

ఒక వార్తాపత్రిక మరియొక వాతికథను తెల్పుచున్నది. గాంధీజీ యొద్ద లక్షలకొలది పౌనుల ధనరాసులున్నవనియు, వానినతడు రహస్యముగా స్నేహితులవద్ద దాచెననియు, కాంగ్రెసు యీధనముకొఱకు ప్రాకులాడుచున్నదనియు నీ కథ చెప్పుచున్నది. గాంధీజీ కాంగ్రెస్ సభ్యుడుగానుండుట మానివేసినచో నీ ధనరాసులు పోవునేమోయని భయపడుచున్నదట. ఈకథకూడ ననేకమభూతకల్పన. గాంధీజీయెప్పుడును స్వీయముగగాని, రహస్యముగగాని తనయొద్ద ధనము నుంచుకొనడు. అతడువసూలుచేసినదంతయు నేప్రజాసంస్థకో యిచ్చివేయును. అతని వైశ్యప్రకృతిచేనతడు లెక్కలనతిజాగ్రతగనుంచును. అతడుచేయు వసూళ్ళన్నియు బహిరంగముగతనిఖీచేయబడును. ఈవదంతిబహుశః 1921 లో వసూలుచేయబడిన కోటిరూపాయలకథమీద నాధారపడియుండెను. ఘనముగాకాన్పించు యీ మొత్తము భారతదేశమంతట పంచిపెట్టబడినచో నతిస్వల్పమేయగును. ఇది జాతీయ విశ్వవిద్యాలయములకు, పాఠశాలలకు, గృహపరిశ్రమలకు, (ముఖ్యముగా ఖద్దరు) అస్పృశ్యతానివారణకు, ననేక యితర నిర్మాణకార్యములకు వినియోగింపబడెను. ఇందులో చాలభాగము ప్రత్యేక కార్యముల కేర్పడెను. అవి యిప్పటికి నాయా పనులకు వినియోగింపబడు చున్నవి. వసూళ్ళలో మిగతసొమ్ము స్థానికకమిటీల కీయబడెను. అది కాంగ్రెసుసంస్థల నిర్మాణమునకు, రాజకీయప్రచారమునకు, ఖర్చు పెట్టబడెను. అసహాయోద్యమము తరువాత కొద్దిసంవత్సరములవరకు, కాంగ్రెసుప్రచారము దానివలననే నడుపబడెను. గాంధీజీ, దేశదారిద్ర్యముకూడ మన రాజకీయోద్యమము నత్యంతస్వల్పముతోనే నిర్వహించుకొనుటను బోధించెను. మాసేవచాలవరకు పూర్తిగా నైచ్ఛికమైనది. జీతములనిచ్చినచోట నది కేవలము కడుపుచిచ్చు చల్లార్చు

దిగ నుండెను. మాలో నుత్తములైన సేవకులకు కుటుంబములుగల విశ్వవిద్యాలయపు బి. ఏ. లకు యింగ్లండులోని యుద్యోగులకిచ్చు అలవెన్సుకంటె తక్కువ యివ్వబడెను. గత పదిహేను సంవత్సరముల నుండియు కాంగ్రెసు యుద్యమము నడుపబడినంత తక్కువ మొత్తముతో నెచ్చటను రాజకీయోద్యమము, లేబరుయుద్యమము పెద్ద యెత్తున నడుపబడెనని నేననుకొనను. ప్రతివత్సరము అన్ని కాంగ్రెసు నిధులు, లెక్కలు బహిరంగముగ తనిఖీచేయబడెను. కాంగ్రెసు అక్రమసంఘముగా ప్రకటింపబడిన శాసనోల్లంఘనదినములలోతప్ప యీ సొమ్ములో నేదియు రహస్యముగ నుంచబడలేదు.

గాంధీజీ కాంగ్రెసుయొక్క యేకైక ప్రతినిధిగా రౌండు టేబిలు కాన్ఫరెన్సుకు లండను వెళ్ళెను. చాలకాలము చర్చించిన తరువాత నిక నెవరిని ప్రతినిధిగ బంపకుండుటకే నిశ్చయించితిమి. భారతదేశములో నతి విషమసమయమున, విషయముల నతిజాగ్రతగ చేపట్టవలసిన యగత్యముకలిగినపుడు, మాలోని శ్రేష్ఠులందరు నిచ్చటనుండవలెనను కోరికయే దీనికి కొంతకారణము. ఆర్.టి.సి. లండనులో జరుగుచుండినను కేంద్రాకర్షకస్థానము భారతదేశమని మేము భావించితిమి. భారతదేశపరిస్థితులే విధాయకముగలండనులో ప్రతిబింబించుచుండెను. నే మనర్థములు జరుగకుండ చూచుకొనుచు మాసంస్థ నుచితస్థితిలో నుంచుకొనగోరితిమి. అయినప్పటికి నొక్క ప్రతినిధినే పంపుట కిదే యదార్థకారణముకాదు. మేము చట్టనిర్మాణములోని చిన్న చిన్న వివరముల నంతరములేకుండ చర్చించుటకే రౌండుటేబిలు సభలో జేరలేదు. ఆస్థితిలో మా కట్టివివరములతో పనిలేదు. బ్రిటిషుప్రభుత్వముతో ప్రధానవిషయములలోసమాధానము కుదిరినపుడే వాటినిగురించి యోచింపవలసియుండును. ప్రజాస్వామిక భారతదేశమున కెంతయధికారమునీయవలెను? యనునదియే సరియైన ప్రశ్న. తరువాత నే చిన్నచిల్లీడరయినను, ముసాయిదాను, వివరములను తయారుచేయనచ్చును. ఈ ప్రధాన విషయములను గురించి కాంగ్రెసు అభిప్రాయములు తేటతెల్లముగనే యున్నవి.

అందులో తర్కమున కెంతమాత్రము నావకాశము లేదు. మానాయకు డొక్కడే వెళ్ళి యా భావములను విశదము చేయుటయే గౌరవపద్ధతి. అతడు వాటికిగల ముఖ్యకారణములను, విధాయకతను చూపి, వీలైనచో, బ్రిటిషుప్రభుత్వము వాటినొప్పుకొనునట్లు చేయ యత్నించును. అది చాలకష్టమనుసంగతి, దుస్సాధ్యమనుసంగతి అప్పటిపరిస్థితులను బట్టి నే నెఱుగుదును. కాని మాకప్పుడిక మఱియొకమార్గ మేమియు లేకుండెను. నే మాస్థితి నతిగాఢముగా విశ్వసించి బాసచేసిన మా యాదర్శములను, సిద్ధాంతములను వీడజాలకుంటిమి. ఆప్రధానసూత్రములమీద నాధారపడిన సమాధాన మేదియైన యదృష్టవశమునకను గొనబడినచో తక్కినదంతయు సులభముగనే దాని ననుసరించును. అట్టి సమాధానమే కుదిరినచో గాంధీజీ కోండరినిగాని, వర్కింగు కమిటీ సభ్యులందరినిగాని లండను పిలిపించుటకు మాలో నే మేర్పాటుచేసికొంటిమి. అప్పుడు మేమందరము సమాధాన వివరములలో పాల్గొనవచ్చును. ఆ పిలుపుకు మేము సిద్ధముగనుండవలెను. అవసరమైనచో వాయుయానముకూడ చేయవలెను. ఈ విధముగ మేము పిలుపునిచ్చిన పదిరోజులలో నతనితో నుండగలము. మొదట ప్రధానవిషయములలో సమాధానమే కుదరనిచో తక్కిన సంఘవివరముల సమస్యయే యుండనేరదు. ఆర్. టి.సి.కి కాంగ్రెసు ప్రతినిధులదనముగా వెళ్ళవలసిన యవసరముండదు. కనుకనే మేము గాంధీజీ నొక్కనిని పంపుటకే నిశ్చయించితిమి. వర్కింగుకమిటీ సభ్యురాలగు సరోజినీదేవికూడ ఆర్. టి. సి. కి వెళ్ళెను. కాని యామె దానికి కాంగ్రెసు ప్రతినిధిగా వెళ్ళలేదు. భారత స్త్రీల తరపున ప్రతినిధిగా నామె యాహ్వానింపబడెను. ఆమె యట్లు వెళ్ళుటకు వర్కింగుకమిటీవా రనుమతించిరి.

కాని బ్రిటిషుప్రభుత్వమునకు మాయభీష్టములతో నేకీభవింపవలెనను యుద్దేశ్య మెంతమాత్రము లేదు. ప్రధానసమస్యల విచారణ కాలయాపనచేయుటయే వారినీతి. వారు స్వల్ప నిరర్థకవిషయములతో కాన్ఫరెన్సును విసిగింపదలచిరి. పెద్దవిషయములు రాచింప

బడినపుడుకూడ ప్రభుత్వమువా రాగవలసినదనిరి. వా రేమాట నీయక పూర్ణాలోచన చేసినతరువాత తమయభిప్రాయము తెలిపెద మని వాగ్దానముచేసిరి. వారొకటేపాట పాడిరి. ఒకేయాట నాడిరి! కులసమస్యయే వారి తురుపుముక్క. వారు దాని నెంతవరకుపయోగింపవలెనో యంతవరకు నుపయోగించిరి. కాన్ఫరెన్సులో నదియే రాజ్యముచేసెను.

కాన్ఫరెన్సులోని భారతసభ్యులలో నధికసంఖ్యాకులు, చాల మంది యిష్టముగను, కొద్దిమంది యిష్టముగను, యీ యధికార మంత్రాంగములో పడిపోయిరి. అది యొక నానాగోత్ర సంఘము. వారు తమకుతప్ప మరెవరికి ప్రతినిధులుకారు. కొంతమందిసమర్థులు, పూజ్యులు. చాలమంది యితరులవిషయమై యీ మాట చెప్ప జాలము. మొత్తముమీద వారు రాజకీయముగ, సాంఘికముగ, భారతదేశాభ్యుదయ భంగకరులగు ప్రతినిధులు భారతదేశములో నతిజాగ్రతపరులును, మితవాదులునైన భారత లిబరలు పక్షీయులీ బృందము ముంద రభివృద్ధివాదులుగ ప్రకాశించిరి. వారు భారతదేశ పెట్టుబడిదారుల ప్రతినిధులు. వారు బ్రిటిషు సామ్రాజ్యమునకు బంధింపబడి స్వాభివృద్ధికొరకు లేక రక్షణకొరకు వారివైపు చూచు చుందురు. కులసమస్యమీద 'మైనారిటీ' 'మెజారిటీ'సంఘములనుండి యతిప్రాముఖ్యమైన ప్రాతినిధ్యమువచ్చెను. వీరు పయితరగతులకు చెందిన మొండిపట్టుకలవారు. వీరిలోవీరికి సమాధానమెన్నడుకుదర దను సంగతి జగద్విఖ్యాతము. రాజకీయముగ వీరు పూర్తిగానభివృద్ధి భంగకారకులు. తమ కులాభివృద్ధి యొక్కటే వారి ప్రయోజనము. తమ కులాభీష్టములు నెరవేరువరకు తా మెట్టి యధిక రాజకీయ స్వాతంత్ర్యము నంగీకరింపజాలమని వారుచాటిరి. అది చాల యాశ్చ ర్యకర దృశ్యము. పరప్రభుత్వములోనున్న ప్రజ లెంత యధఃపతితు లగుదురో యది సవిషాదముగ స్పష్టముచేయుచున్నది. సామ్రాజ్య తంత్రములో వా రెట్టిసాచికలగుదురో యది విశదముచేయుచున్నది. మహారాజరాజశ్రీలు, ప్రభువులు, వీరాధివీర బిరుదాంకితులు, యితర

పెద్దపెద్ద బిరుదులుగల యీ మూక భారతప్రజలకు ప్రాతినిధ్యము వహింపజాలదనుట సత్యము. రౌండుటేబిలు కాన్ఫరెన్సు సభ్యులు బ్రిటిషుప్రభుత్వముచే పేర్కొనబడిరి. ప్రభుత్వమునకు సంబంధించి నంతవరకు నీ యెన్నిక బాగుగనే చేయబడెను. కాని బ్రిటిషుప్రభుత్వమువారు మనలనట్లుపయోగించుకొని కొల్లగొట్టుకొనగలవిషయ మొక్కటే మన దుర్బలత్వమును చాటుచున్నది; పెడమార్గమున బడి, యొకరి ప్రయత్నముల నొకరు భంగముచేయుట కెట్టి వింత సౌకర్యములున్నవో యది విదితము చేయుచున్నది. మన పయి తరగతులవారింకను మనసామ్రాజ్యపాలకులలక్ష్యము లోనేచుట్టుకొని పోయి వారిపాటనే పాడుదురు. దానిలోనుండి చూడలేకపోవుటచే వారట్లుచేయుచున్నారా? లేక దాని నిజభావమును గ్రహించియే భారతదేశ స్వేచ్ఛకు, ప్రజాస్వామికమునకు భయపడి,వారు దానిని బుద్ధిపూర్వకముగ స్వీకరించిరా?

ఈ స్వార్థపరుల సంఘమునకు-సామ్రాజ్యవాది, ఫ్యూడలిస్టు, ధనికుడు, పారిశ్రామికుడు, మతతత్పరుడు, కులాభిమాని-యగు ఆగాఖాన్, బ్రిటిషు యిండియా ప్రతినిధుల తరఫున నాయకుడగుట యెంతయు సమంజసముగ నున్నది. స్వయముగా కొంతవర కతనిలో నీ యన్ని ప్రయోజనములు మూర్తీభవించినవి. ఒకపురుషాంతరము నుండి బ్రిటిషుసామ్రాజ్యముతోను, బ్రిటిషుపరిపాలకులతోను సంపర్కముకలిగి, ప్రధానముగ యింగ్లండులోనే నివసించుచుండు యీ పురుషుడు మన నాయకుల ప్రయోజనములను, దృక్పథమును చక్కగా గ్రహించగలడు. వాటికొరకు వాదించగలడు. రౌండు టేబిలు కాన్ఫరెన్సులో నతడు యింగ్లీషు సామ్రాజ్యము తరఫున సమర్థుడైన ప్రతినిధిగ నుండెడివాడు.

ఆ కాన్ఫరెన్సులో మొగ్గుదల మనకు చాల వ్యతిరేకముగ నుండెను. మేము దానివలన నేమియు నాశించకపోయినను ఆ తంతు నాశ్చర్యముతోను, వసహ్యముతోను పరీక్షించుచుంటిమి. ఆర్థిక, జాతీయసమస్యలను పయిపయిన గోకుటకుచేసిన విచారభరిత,నిరర్థక

ప్రయత్నములను చూచితిమి. సంఘులు, పన్నాగములు, తంత్రాంగములు, మనదేశస్థులే కొంతమంది బ్రిటిషు కన్సర్వేటివ్ పార్టీలోని యత్యంత యభివృద్ధిభంగకారులైనవారితో చేతులుకలుపుట, చిన్న సమస్యలమీద ననంతముగా భాషించుట, కావలసినదానిని బుద్ధి పూర్వకముగ త్రోసివేయుట, పెద్దపెద్ద స్వప్రయోజనములుగల వారిచేతులలో కీలుబొమ్మలవలె నాడుచుండుట, పరస్పరజగడములు, మధ్యమధ్య విందులు, పరస్పరస్తోత్రములు మొదలగు నాటకమునంతను—మేము చూచితిమి. అదంతయు నుద్యోగములకొరకు ప్రాకులాడుట—పెద్దయుద్యోగములు, చిన్న యుద్యోగములు, హిందువులకు, ముస్లిములకు, సిక్కులకు, నాంగ్లోయిండియనులకును, యూరపియనులకును యుద్యోగములు, స్థానములు—కాని యన్ని యుద్యోగములును పయితరగతులకే. ప్రజలను చూచువా రెవరును లేరు. కొంగజపములు మెండుగనుండెను. వివిధబృందములవారు ఆకొన్నతోడేళ్ళవలె, క్రొత్త చట్టనిర్మాణములో కొల్లగొట్టబడు యామిషముకొరకు, పొంచి తిరుగాడుచుండినట్లు కాన్పించిరి. స్వేచ్ఛాభావమే పెద్దయెత్తున యుద్యోగవేటగా మారెను. అది 'భారతీయుల వశముచేయుట' యని పిలువబడెను; సైన్యము, సివిలుసర్వీసు మొదలగువాటిలో భారతీయుల కెక్కువ నుద్యోగము లిచ్చుటను గురించియు స్వాతంత్ర్యమును గురించియు యదార్థమైన స్వేచ్ఛను గురించియు, ప్రజాస్వామికమైన భారతదేశమునకు అధికారము నిచ్చివేయుటను గురించియు, భారతప్రజల నెదుర్కొనిన యత్యవసరము, ప్రధానమునగు నే యార్థిక సమస్యా పరిష్కారమును గురించియు నొక్కడును యోచింపలేదు. భారతదేశమంత వీరసంగ్రామము జరిపినది దీనికొరకేనా? త్యాగతత్త్వములచే పవిత్రమైన వాతావరణమును యీ దుమ్ము ధూళులతో నిండిన గాలికి బలివేయవలసినదేనా?

తళతళ ప్రకాశించుచు, జనాకీర్ణమైయున్న యీ మందిరములో గాంధీజీ యేకాకియై కూర్చొనెను. అతని వేషము, లేక

వేషములేకపోవుట, తక్కిన యందరనుండియు నతనిని వేరుచేయు చుండెను. కాని యతని భావములకు, దృష్టికి నతనిచుట్టునున్న వేషధారుల భావములకు, దృష్టికి నంతకంటె నెక్కువ భేదముండెను. ఆ కాన్ఫరెన్సులో నతనిస్థితి యసామాన్యమైనది. అతడు దానినెట్లు భరింపగలిగెనా యని మేము దూరము నుండియే యాశ్చర్యపడుచుంటిమి. కాని యత డద్భుతమైన యోర్పుతో దానిని సహించి సమాధానమున కేదోయొకమార్గము కనుగొనుటకు విడువకుండ ననేక ప్రయత్నములను చేసెను. అతడొక సూచన చేసెను. కులతత్వము రాజకీయపురోభివృద్ధితో తలపడు నను నిజము యెట్లుకప్పబడుచున్నదో యది వెంటనే బహిర్గతము చేసెను. కాన్ఫరెన్సులోని ముస్లింప్రతినిధులవలన చేయబడిన యనేక కులసంబంధములగు కోరిక లతనికిష్టములేదు. ఇందులో కొన్ని కోరికలు స్వాతంత్ర్యమునకు ప్రజాస్వామికమునకు నాటంకములని యతడు భావించెను. అతనియొక్క ముస్లిముజాతీయ సహచరులుకూడ నట్లే భావించిరి. అయినను, అచ్చటజేరిన ముస్లిం ప్రతినిధులందరు రాజకీయసమస్య (అనగా స్వాతంత్ర్యతీర్మానము) మీద తనతోను కాంగ్రెసుతోను కలిసివచ్చుచో నతనువాటినన్నిటిని, యెట్టివాదము, ప్రశ్నలేకుండగనే, యొప్పుకొనెదనని వాగ్దానముచేసెను.

అతడుచేసినవాగ్దానమును స్వంతజవాబుదారీమీద నేచేసెను. ఏలనన కాంగ్రెసు నతడు బంధింపజాలడు. కాని దాని నొప్పుకొనవలెనని తాను కాంగ్రెసును ప్రోత్సహించెదనని యతడు వాగ్దానముచేసెను. కాంగ్రెసులో నతనికిగల పలుకుబడి నెరిగినవారెవరు కాంగ్రెసుచే నతడు దీనికొప్పించజాలడని సందేహింపరు. అయినప్పటికి నీవాగ్దాన మంగీకరింపబడలేదు. నిశ్చయముగ ఆగాఖాను భారత స్వాతంత్ర్యముకొరకునిలుచునని యూహించుట కొంచెము కష్టమైన విషయము. నిజమైనకష్టము కులసంబంధమైనది కాదని యిదిస్పష్టము చేయుచున్నది. కాని కాన్ఫరెన్సులో కులసమస్యయే పెద్దదిచేయబడెను. రాజకీయాభివృద్ధి నాటంకపరచువారు కులసమస్యలచాటున

దాగొనిరి. బ్రిటిషుప్రభుత్వము కాన్ఫరెన్సుకు మనుష్యులను జాగ్రతగ నెన్నుకొని యీ యభివృద్ధిని భంగపరచువారిని ప్రోగుచేసెను. సభలో జరుగవలసిన విధానమును తమవశము నందుంచుకొని వారు కులసమస్యను ప్రధానసమస్యగ చేసిరి. ఈ సమస్యమీద నచ్చట జేరినవారిలో సమాధానము కలుగనేరదని స్పష్టమగుచునేయున్నది.

బ్రిటిషుప్రభుత్వము తనయత్నములో విజయమునొంది తన సామ్రాజ్యమును నిలుపుకొనుటకు తగినశరీరబలమునేగాక, సామ్రాజ్యసాంప్రదాయమును మరికొంతకాలము నిర్వహించుటకు తగినరాజనీతిని, యుక్తినికూడ కలిగియున్నదని ప్రకటనచేసెను. రౌండుటేబిలు కాన్ఫరెన్సు తమకు ప్రాతినిధ్యము వహింపకపోయినను, అది వారి శక్తికొక ప్రమాణముకాకపోయినను, భారతదేశప్రజలు విఫలులైరనియే చెప్పవలెను. దేనికొరకుపోవుచున్నారో దానినిగురించి వారి కొకలత్త్యశుద్ధి లేకపోవుటచేతనే వారు విఫలులైరి. వారినితప్పత్రోవనుపెట్టి పెడమార్గముపట్టించుటతిసులభము. తమయభివృద్ధి నాటంకపరచు స్వప్రయోజకులను త్రోసివేయుటకు తగినంతశక్తి కలవారమని తలంపకపోవుటచేతనే వారు విఫలులైరి. ఎక్కువ మతపిచ్చియుండుటచేతను, కులద్వేషములను సులభముగ రగుల్కొల్పుటకు వీలుండుటచేతను వారు విఫలులైరి. మొత్తముమీద విజయము పొందుటకు తగినంతశక్తి, యభివృద్ధి కలిగియుండకపోవుటచేతనే వారు విఫలులైరి.

ఈ రౌండుటేబిలు కాన్ఫరెన్సులో జయించితిమా లేదాయను ప్రశ్న లేదు. దానివలన నేమియు నాశింపబడలేదు. అయినను దీనికొక ప్రాముఖ్యతకలదు. తత్పూర్వపుకాన్ఫరెన్సు హిందూదేశములోగాని మరెచ్చటగాని యెవరిదృష్టినియాకర్షింపలేదు. అప్పుడు శాసనోల్లంఘనము ప్రపంచము నాకర్షించెను. ప్రభుత్వనియామకులై 1930 కాన్ఫరెన్సుకు వెళ్లినసభ్యులు నల్లజండాలు, వ్యతిరేక కేకలు, వెంటాడుచుండ సభలకు వెళ్ళుచుండెడివారు. 1931 లో నదియంతయు మారిపోయెను. కాంగ్రెసుప్రతినిధిగ గాంధీజీ లక్షలకొలదియనుచరులకు నాయకుడుగ

వెళ్ళుటచేతనే యీ మార్పుజరిగెను. ఇది యీ కాన్ఫరెన్సుకు గౌరవము నిచ్చెను. హిందూదేశము దీనిచరిత్ర నెక్కువశ్రద్ధతో పరీక్షించెను. కారణమేమయిన నపజయము భారతదేశమునకపకీర్తిని తెచ్చెను. గాంధీజీ దానిలో పాల్గొనవలెనని బ్రిటిషుప్రభుత్వమంత యాసక్తి నేలచూపెనో మే మిప్పుడ డర్థముచేసికొంటిమి.

పన్నాగములు, సమయానుకూల స్వాహాపరత్వము, వ్యర్థమగు వంకరటింకర తిరుగుళ్ళుగల యీ కాన్ఫరెన్సు భారతదేశముయొక్క యపజయము కానేరదు. అది విఫలమగుటకే నిర్మింపబడెను. దాని విఫలతకు భారతదేశప్రజలు బాధ్యులు కాజాలరు. కాని యది భారతదేశ నిజసమస్యలనుండి ప్రపంచదృష్టిని మరలించుటలో జయము గాంచెను. హిందూదేశములో నదిభ్రమను తొలగించెను. వ్యాకులతను, అవమానమును కలిగించెను. అభివృద్ధినాటంకపరచువారు తల యెత్తుట కది యాస్కారమయ్యెను. భారతదేశములో జరుగు పనుల వలననే ప్రజలకుజయాపజయములు కలుగగలవు. ఆరువేలమైళ్ళదూరమున లండనులో జరుగు మంత్రాంగములవలన శక్తివంతమగు జాతీయోద్యమ మంతరింపజాలదు. జాతీయత మధ్యతరగతులవారియొక్కయు రయితులయొక్కయు నిజావశ్యకతను తెలుపుచున్నది. వారు తద్వారా తమసమస్యలను పరిష్కరించుకొనజూచిరి. ఈయుద్యమము జయించి, తనధర్మమును నెరవేర్చి ప్రజల నభివృద్ధి, స్వేచ్ఛా మార్గముల నింకను ముందుకు గొంపోగల మరియొక యుద్యమమునకు సావకాశము నీయవచ్చును. లేక నిది కొంతకాలము బలవంతముగ నణచివేయబడవచ్చును. ఆ పోరాటము హిందూదేశములో తరువాత వెంటనే రావలసియుండును. అని కొద్దికాలము బలహీనతను తెచ్చిపెట్టవచ్చును. రెండవ రౌండుటేబిలుకాన్ఫరెన్సు యీ పోరాటము నంతగా బాధించలేదు. కాని యది దానికి కొంతయనర్థదాయకమగు వాతావరణమును సృష్టించెను.

# 39

## సంయుక్త రాష్ట్రములలో వ్యావసాయిక కష్టములు

వర్కింగుకమిటీ సభ్యుడను, కాంగ్రెసు కార్యదర్శులలో నొక్కడను నగుటచే నఖిలభారతరాజకీయములతో నాకుసంబంధముండెను. నేను సాధ్యమైనంతవరకు తప్పించుకొనుచుండినను అప్పుడప్పుడు కొంచెము తీసుకొనుచుండవలసి వచ్చెడిది. మా భారములు, బాధ్యతలు హెచ్చినకొలది వర్కింగుకమిటీ మీటింగులు దీర్ఘములగుచు చివరకవి రెండువారములవరకు వరుసగ సాగుచుండెను. కేవల విమర్శపూర్వక తీర్మానములనుచేయు రోజులు గతించెను. విస్తృతమై, యనేకసమస్యలతోగూడిన సంస్థయొక్క యనేక వివిధ నిర్మాణ కార్యములను పాలించవలెను. దినదినము కష్టమైన సమస్యలను యోచించవలసి వచ్చెడిది.

అయినను యు. పి. నా ప్రధాన కార్యరంగము. అచ్చటి వ్యావసాయిక పరిస్థితులు కాంగ్రెసుదృష్టి నాకర్షించెను. యు. పి. రాష్ట్రకాంగ్రెసుకమిటీసభ్యులు నూటయేబదిమంది. వారు ప్రతి రెండుమూడు మాసములకు కలుసుకొనెడివారు. దాని కార్యనిర్వాహకవర్గము తఱచుకలుసుకొని వ్యావసాయికశాఖను చూచెడివారు.

1931 సంవత్సర రెండవభాగములో కార్యనిర్వాహకవర్గము ప్రత్యేక వ్యావసాయికకమిటీ నేర్పరచిరి. అనేకమంది జమీందారులు కార్యనిర్వాహకవర్గముతోను, యీకమిటీతోను మొదటినుండి చివరవరకు సంబంధము కలిగియుండిరి. వారియామోదముతోనే అన్నిచర్యలు జరుపబడెను. మా రాష్ట్రకమిటీయధ్యక్షుడు ఆసంవత్సరము సయ్యద్ అహమ్మదుఖాన్ షెర్వానీ. అతడొక సుప్రసిద్ధజమీందారీ కుటుంబమునకు చెందినవాడు. సాధారణ కార్యదర్శి శ్రీ ప్రకాష్ గారును కార్యనిర్వాహకవర్గములోని ముఖ్యసభ్యులుకూడ జమీందారులు, లేక జమీందారీ కుటుంబములోనివారు. తక్కిన సభ్యులు వృత్తులతోనున్న మధ్యతరగతివారు. మా రాష్ట్ర కార్యనిర్వాహక

వర్గములో సేద్యగానియొక్క, బీద రయితుయొక్క, ప్రతినిధి యొక్కడు లేడు. జిల్లాకమిటీలలో రయితులు గలరు. కాని రాష్ట్రీ కార్యనిర్వాహకవర్గములోనికి వచ్చుటకుపూర్వము జరుగవలసిన యెన్నికల నన్నిటిని వారు దాటి పైకి రాజాలకపోవుచుండిరి. కనుక నా వర్గమును మధ్యతరగతులలో చదువుకొన్నవారు బలమైన జమీందారులు పూర్తిగ నాక్రమించిరి. కనుక దానిని యతివాద సంఘమని యే యర్థములోను చెప్పుటకు వీలులేదు. నిశ్చయముగా వ్యావసాయిక సమస్యలో నసలే చెప్పుటకు వీలులేదు.

మా రాష్ట్రములో నేను కార్యనిర్వాహకవర్గములోను వ్యావసాయిక కమిటీలోను సభ్యుడను. నాకంతకంటె నెక్కువస్థానములేదు. మా సలహా సంప్రదింపులలోను యితరపనులలోను నే నెక్కువశ్రద్ధ తీసికొనెడివాడను. కాని నే నేవిధమునగను నాయకత్వము వహింపలేదు. మా రాష్ట్రములో నెవరును నాయకపాత్రను వహించెనని చెప్పుటకు వీలులేదు. మేము చాలకాలమునుండి సమిష్టిగ, సంఘపరముగ పనిచేయుట కలవడితిమి. ఎప్పుడు సంఘమునకే ప్రాధాన్యత యివ్వబడెను. కాని వ్యక్తికీయబడలేదు. ఆ సంవత్సరాధ్యక్షుడే మాకు తాత్కాలిక ప్రధాని యగుచుండెను. అతడు మా ప్రతినిధి. కాని యతనికికూడ ప్రత్యేకాధికార మేమియులేదు.

నేను స్థానికముగ అలహాబాదు జిల్లాకాంగ్రెసు సభ్యునిగకూడ పనిచేసితిని. ఈ కమిటీ దీని యధ్యక్షుడయిన పురుషోత్తమదాసు టాండనుయొక్క నాయకత్వముక్రింద వ్యావసాయికస్థితి నభివృద్ధి పరచుటలో ముఖ్యపాత్రతీసికొనెను. 1930లో రాష్ట్రములోపన్నుల నిరాకరణోద్యమమును ప్రారంభించుటలో నిది నాయకత్వము వహించెను. వ్యవసాయ ధరలు పడిపోవుటవలన అలహాబాదుజిల్లా కెక్కువ దెబ్బతగిలెను. అయోధ్యలోని తాలూకుదారీజిల్లాలు మరింత యధ్వాన్నముగ నుండెను. కాని యలహాబాదు జిల్లాలో మంచి యేర్పాటులు యెక్కువ రాజకీయచైతన్యమునుండెను. అలహాబాదు పట్టణము రాజకీయ కృషికంతకు కేంద్రమగుటయు, చాలమంది

ప్రభావ సేవకులు చుట్టుప్రక్క గ్రామములకు తరచు వెళ్ళుచుండుటయు దీనికి కారణములు.

1931 మార్చిలో ఢిల్లీసంధి జరిగిన వెంటనే మేము ప్రచారకులను, నోటీసులను గ్రామసీమలకుపంపి, శాసనోల్లంఘనము, ఈ యుద్యమము ఆగిపోయెనని రయితులకు తెలియజేసితిమి. పన్ను చెల్లించుటకు రాజకీయముగ నాటంకములేదని చెప్పి చెల్లింపవలసినదనియే మేము వారికి సలహానిచ్చితిమి. కాని ధరలమితముగా పడిపోవుటచే వారికి హెచ్చురెమిషనుల నీయవలెనని మా యభిప్రాయమనియు, వాటికొరకు కలిసి పనిచేయవచ్చుననియు మేము సూచించితిమి. మామూలు రోజులలోకూడ పన్ను తరచు దుర్భరముగ నుండెను. ధరలుపడిపోవుటచే పూర్తి పన్ను లేకతత్తుల్యమైనదానిని చెల్లించుట యసాధ్యముగనుండెను. మేము రయితుప్రతినిధులతో సభలనుజరిపి సాధారణముగ నూటికేబదివంతులను, కొన్ని సందర్భములలో నంతకంటె నెక్కువగ రెమిషనులుండవలెనను తాత్కాలికసూచన చేసితిమి.

వ్యవసాయిక సమస్యను సాధారణ శాసనోల్లంఘనముతో పూర్తిగ వేరుచేయుటకు మేముప్రయత్నించితిమి. 1931 లో మేము దానిని రాజకీయములనుండి వేరుచేసి, ఆర్థికదృష్టితోనే యోచింపగోరితిమి. కాని యీరెంటికి నెక్కువ సన్నిహిత సంబంధముండుటచే నిది చాల కష్టముగనుండెను. గతములో నీ రెండును యెక్కువగ కలిసిపోయెను. మాకు కాంగ్రెసు సంస్థరీత్యా, స్పష్టముగ రాజకీయ వాసనకూడకలదు. తాత్కాలికముగ నేమొకవిధమగు రయితుసంఘముగ పనిచేయ యత్నించితిమి. కాని మేము మా రాజకీయస్వభావమును వీడలేము. వీడజాలకుంటిమి. మేముచేసిన ప్రతిదానిని ప్రభుత్వము రాజకీయముగనే చూచెను. భవిష్యత్ శాసనోల్లంఘన ఛాయలుకూడ మా ముందరనుండెను. ఇది నిజరూపమును దాల్చినచో రాజకీయమును, ఆర్థికములు చేయిచేయికలిపి నడుచుననుట కెట్టిసందేహము లేదు.

ఈ యన్ని మాటంకములను లక్ష్యము చేయక ఢిల్లీసంధియొక్క విలగాయతు వ్యావసాయికసమస్యను రాజకీయపోరాటముతో వేరు చేయుటకే నేము మొదటినుండియు యత్నించితిమి. ఢిల్లీసంధి దీనిని సమాప్తముచేయకపోవుటయే దీనికి నిజమైనకారణము. నే మీవిషయమును ప్రభుత్వమునకు, ప్రజలకుకూడ స్పష్టముగ విశదము చేయగోరితిమి. ఢిల్లీసంభాషణాలు జరుగుచుండగా గాంధీజీ తాను రౌండుటేబులుకాన్ఫరెన్సుకు వెళ్ళకపోయినను కాన్ఫరెన్సు జరుగుకాలములో శాసనోల్లంఘనము తిరిగిప్రారంభింపనని యిర్విన్ ప్రభువుకు వాగ్దానమునిచ్చెనని నేను విశ్వసించెదను. అతడు కాన్ఫరెన్సు కన్ని యవకాశములను యివ్వవలెననియు, తత్ఫలితముల కొరకు వేచి యుండవలెననియు కాంగ్రెసుకు సలహాచెప్పెను. అప్పుడుకూడ గాంధీజీ యీ వాగ్దానము, స్థానికముగ మాపైవోప్పింపబడగల, ఆర్థికపోరాటమునకు వర్తింపదని స్పష్టముగచెప్పెను. యు. పి. వ్యావసాయికసమస్య యప్పుడు మా యందరికిని కాన్పించుచునే యుండెను. యదార్థమునకు భారతదేశములోనున్న రయితులందరకు నిట్టికష్టమే కలిగెను. సిమ్లా సంభాషణాలలో గాంధీజీ ఈ వాంశమును పునశ్చరణ చేసెను.

యూరపునకు పయనమై వెళ్ళుదినముననే రౌండుటేబులు కాన్ఫరెన్సుకు, రాజకీయసమస్యలకు సంబంధములేకుండ నార్థిక పోరాటములో ప్రజలయొక్క, ముఖ్యముగా రయితాంగముయొక్క, హక్కులను కాపాడవలసిన యగత్యము కాంగ్రెసుకు కలుగవచ్చునని యతడు స్పష్టపరచెను. అట్టిపోరాటములో దిగవలెనను కోరిక యతనికిలేదు. అతడు దానిని తప్పించుటకే యభిలషించెను. కాని యది తప్పనిసరియైనపుడు దానిని పూనకతప్పదు. మేము ప్రజలను విడిచిపెట్టజాలకుంటిమి. సామాన్య శాసనోల్లంఘనమునకును, రాజకీయ శాసనోల్లంఘనమునకు ననువర్తించు ఢిల్లీసంధి దీనిని నిషేధింపజాలదని యతడు స్పష్టపరచెను.

యు. పి. రాష్ట్ర కాంగ్రెసుకమిటీవారు, దాని నాయకులు పన్నులనిరాకరణమును తిరిగి ప్రారంభించి ఢిల్లీసంధిని భంగపరచిరను నపవాదము పదేపదే వేయబడుచుండుటచే నేనీ విషయము నుదహరింపవలసివచ్చెను. ఈ యపవాదమును తెచ్చినవారు వారికిసుకరముగ నుండుటవలన దీనికి సమాధానము చెప్పగలవారందరు జయిలులో నున్నపుడును, వార్తాపత్రికలును, ముద్రణాలయములును తీవ్రమగు నిర్బంధములకు పాల్పడినపుడు దీనిని తెచ్చిరి. 1931 లో యు. పి. కమిటీవారు పన్నులనిరాకరణోద్యమము నెప్పుడు సాగింపలేదు. శాసనోల్లంఘనముతో సంబంధములేకుండ నార్థికప్రయోజనములకొరకట్టి దానిని సాగించిన నది ఢిల్లీసంధినిభంగపరచుట కానేరదు. గుణమును బట్టి యది యుక్తమా అయుక్తమా యనునది వేరొకవిషయము. ఆర్థికకారణములకు ఫ్యాక్టరీకూలీలు సమ్మెకట్టుట కెంతహక్కుకలదో రైతులకు నంత హక్కుకలదు.

క్రమముగ నధ్వాన్నమగుస్థితిని వ్యావసాయికధరలమాంద్యం మరింత యధోగతికి తీసికొనిపోయెను. చాలవత్సరములనుండి వ్యావసాయికధరలు పెరుగుచుండెను. ప్రపంచపణ్యారంగముతో సంబంధముగల భారతదేశ వ్యవసాయ మీలబ్ధిని పొందెను. ప్రపంచమంతట పరిశ్రమాభివృద్ధికి, వ్యవసాయాభివృద్ధికి నత్యమితతారతమ్యముండుటచే నిది ప్రతిచోట వ్యావసాయికధరలను పెంచెను. భారతదేశములో నీధరలు పెరుగుటతోడనే ప్రభుత్వమువారి రివిన్యూ, జమీందారులకీయవలసిన పన్నులుకూడ పెరిగెను. కనుక నిజముగా వ్యవసాయముచేయు రయితు దీనివలన నెట్టిలబ్ధి పొందలేదు. మొత్తముమీద రయితులు క్షీణించిరి. యు. పి. లో రివిన్యూకంటె జమీందారు కీయవలసినపన్ను వడిగా హెచ్చిపోయెను. ఈ శతాబ్దములో మొదటి ముప్పదిసంవత్సరములలోను మొదటిదానికంటె రెండవది యైదురెట్లు యెక్కువయ్యెను. ఈ విధముగ ప్రభుత్వాదాయము చాలినంత హెచ్చుగ పెరిగియుండ, భూఖామందు రాబడి మరింత హెచ్చెను. రయితుమాత్ర మెప్పటివలె నాకలిబాధతో

మాడుచుండెను. ధరలుపడిపోయినచోట స్థానికముగ ప్రకృతిసంబంధ మైన దుఃఖములు–అనావృష్టి, వరదలు, మిడతలు వడగండ్లు మొదలగునవి–తటస్థించినచోట రివిన్యూ, జమీందారీ పన్నులు రెండు యథాప్రకారముగానే యుండెడివి. కొద్ది రిమిషనులు ఆ ఋతువునకు మాత్రమే జంకుచు జంకుచు యివ్వబడుచుండెడివి. అతి మంచిరోజుల లోనే పన్నులభారము చాల యధికముగ నుండెను. ఇతర సమయములలో వడ్డీవ్యాపారస్తునివద్దకు వెళ్ళకుండ పన్ను చెల్లించుట దుర్భరమయ్యెను. వ్యవసాయదారు ఋణము హెచ్చిపోయెను.

వ్యావసాయిక తరగతులన్నియు – భూఖామందులు, స్వంత పొలము వ్యవసాయముచేసికొనువారు, కవులుదార్లు–వడ్డీవ్యాపారస్తునికి బానిసలైరి. ఆమిషములైరి. ప్రాచీనగ్రామ ఆర్థికములలో వడ్డీవ్యాపారస్తు డిట్టిపరిస్థితులలో తన విధాయికధర్మమును నెరవేర్చెడివాడు. తన ధర్మమును కేవలము స్వప్రయోజనముకొరకే కొల్లగొనెను. ఇతడు భూమిని, భూమికిసంబంధించినవారిని నులిమివేయుచుండ వారించున దేదియు లేదు. న్యాయచట్ట మతనికిసహాయము చేసెను. అతడు తాను వ్రాయించుకొనిన పత్రముప్రకార మక్షరాల జరుగవలెనని పట్టుబట్టెను. అట్లే రొక్కించి పుస్తెపూసలను వడికి వేసెను. క్రమముగ చిన్న చిన్న భూఖామందులనుండియు, స్వంత వ్యవసాయదారులనుండియు భూమి తరలిపోయెను. వడ్డీవ్యాపారస్తుడు పెద్దప్రొప్రయిటరు, పెద్దజమీందారు, భూమిగల పెద్దమనిషిగ పెరిగి పోయెను. సేద్యముచేసికొనిన స్వంతవ్యవసాయదారు బనియాజమీందారు లేక సాహుకారులకు బానిసయయ్యెను. కవులుదారుస్థితి యింతకంటె నధ్వాన్నము. అతడుకూడ సాహుకారుబానిస లేక భూమి నుండి తరిమివేయబడుటచే పెరుగు భూమిలేని దరిద్ర ప్రజాసైన్యములో చేరిపోయెను. ఈవిధముగ భూఖామందయిన వడ్డీవ్యాపారస్తునికి భూమితో కవులుదారుతో నెట్టి సన్నిహిత సంపర్కము లేకుండెను. అతడు సాధారణముగ పట్టణవాసి. అతడు తనవడ్డీవ్యాపారము నచ్చటనుండి సాగించుచు, పన్నువసూలుచేయుటకు గ్రామముల

లోనికి తరచు రోజంటులను సంపును. పెద్ద దయాదాక్షిణ్యములు లేకుండ నిర్దాక్షిణ్యముగ యంత్రికములవలె పనిచేయును.

భూమిపన్నుపద్ధతియొక్క యస్థిరత్వమును, అయోగ్యతను చాటుట కంతకంత కభివృద్ధిచెందుచున్న వ్యవసాయ ఋణమే చాలును. ప్రజలలో నత్యధికసంఖ్యాకులకు భౌతికముగగాని, యైశ్వర్యరీత్యాగాని వెనుక నాధారమేమియు లేదు. వా రాకలిగుంటతోనే యుండెడివారు. దుఃఖప్రదములగు ననాఘాతముల సంభవములకు వారు నిలువజాలకుండిరి. ఏజాడ్యమైనను లక్షలకొలది జనులను తుడిచివేయుచుండెను. ప్రభుత్వముచే నియమింపబడిన రాష్ట్రీ బ్యాంకింగ్ యంక్వైరీ కమిటీవారు 1929-1930లో హిందూదేశములోని (బర్మాతో సహా) వ్యావసాయిక ఋణము 860 కోట్ల రూపాయలని యంచనా వేసిరి. ఈ ఋణములో జమీందారుల యొక్కయు, స్వంతవ్యవసాయము చేసుకొనువారి యొక్కయు, కవులుదారుల యొక్కయు ఋణములు కలవు. కాని ప్రధానముగా నిది నిజముగా వ్యవసాయము చేసికొనువారి ఋణము. ప్రభుత్వమువారి కరెన్సీపద్ధతి పూర్తిగ ఋణదాతల తరగతులకే సహాయపడెను. ఇది ఋణభారమును మరింత హెచ్చించెను. భారతీయులందరు తీవ్రముగ ప్రతిఘటించుచున్నను రూపాయికి 16 పెన్నీలనుగాక, 18 పెన్నీలను స్థిరపరచుటచే వ్యావసాయికఋణము నూటికి 12 1/2 వంతున అనగా 107 కోట్లు హెచ్చెను. యుద్ధమయిన తరువాత పెరిగిన ధరలు క్రమముగ, తగ్గనారంభించి వ్యవసాయపరిస్థితులు అధ్వాన్నమయ్యెను. గోరుచుట్టుమీద రోకటిపోటువలె 1939 లో యార్థిక దురవస్థ సంప్రాప్తమయ్యెను.

యు. పి. లో 1931 లో ధరవరలనుబట్టి పన్నులుండవలెనని మేము వాదించితిమి. అనగా 1931 లోని ధరలవంటి ధరలేయున్న వెనుకటిరోజులలో పన్నులెట్లుండెనో యిప్పుడు నట్లేయుండవలెనని మేమంటిమి. ముప్పదిసంవత్సరములక్రిందట 1901 లో సరిగా ధరలిట్లేయుండెను. ఇదియొక సిసలైన పరీక్షకాదు. కవులుదారులలో— కవులుదారుక్రింద కవులుదారు, సేద్యహక్కుగలవాడు, సేద్యహక్కు-

లేనివారు—మొదలగువారుండుటచే వీనినాచరణలో పెట్టుట సుసాధ్య
కాదు. అందరికంటె క్రిందనున్న కవులుదారే యెక్కువబాధలననుభ
వించువారు. ఇకనొక పరీక్షమాత్రమే కలదు. నిస్సందేహము
నిదియే యుత్తమ పరీక్ష. కవులుదారుకు పంటపండించుటకగు ఖర్చు
లను, జీవించుటకు తగినకూలిని తీసివేసినమీదటనే యతనికుండు శక్తిని
బట్టియే పన్ను వేయవలయును. కానియీతుదిపరీక్ష ప్రకారము జీవిం
చుటకెంత తక్కువ ఖర్చులను లెక్కవేసినను, హిందూదేశములో
సేద్యముచేయబడు భూపరిమితులలో అధికసంఖ్య పూర్తిగ నిరర్థ
కములు. 1931 లో యు. పి. లో మేము చూపిన యుదాహరణము
లనుబట్టి చాలమంది యాస్తిని అమ్ముకొనకుండగను, యెక్కువ
వడ్డీకప్పు తేకుండ పన్ను చెల్లింపజాలరు.

మా యు. పి. కాంగ్రెసు కమిటీ సేద్యపుహక్కుగల కవులు
దారులకు నూటికయేబదివంతునను, అంతకంటె హీనస్థితిలోనున్న వానికి
మరింత హెచ్చురిమిషను యివ్వవలెనని మొట్టమొదట నొకసూచన
చేసెను. 1931 మే నెలలో గాంధీజీ యు. పి. గవర్నరైన సర్.
మాల్కంహైలీ కలిసినపుడు వారియిరువురకు భేదాభిప్రాయము కలుగు
టచే వారికి సమాధానము కుదరలేదు. తరువాత వెంటనే గాంధీజీ
యు. పి. జమీందారులకు, కవులుదారులకు సందేశములను బంపెను.
చివర సందేశములో నతడు కవులుదారులను వారు చెల్లింపగలిగినంత
చెల్లింపవలెనని ప్రోత్సహించుచు తానొకయంకె సూచించెను. ఇది
మేమదివరకు సూచించినదానికంటె కొంచెము హెచ్చు. మా
రాష్ట్రకమిటీ గాంధీజీసూచన కంగీకరించిరి. కాని ప్రభుత్వము దాని
కంగీకరింపకపోవుటచే విషయములు చక్కబడలేదు.

రాష్ట్రప్రభుత్వస్థితి కష్టముగనుండెను. భూమిపన్ను వారిరాబ
డిలో ప్రధానమైనది. ఇది లేకపోయినచో లేక బాగుగ తగ్గింపబడి
నచో వారుదివాలాతీయవలయును. కాని వ్యావసాయిక తిరుగు
బాటు కలుగునేమో యనుభీతి హెచ్చుగనుండుటచే సాధ్యమైనంత
వరకు తగినరిమిషనులనిచ్చి వ్యవసాయదారుల నోదార్చవలెనని వారి

యుండెను. రెండును జరుగుట సులభమైన పనికాదు. ప్రభుత్వమునకు వ్యవసాయదారులకు మధ్య జమీందారులుకలరు. ఆర్థికదృష్టితో చూచిన యెడల నీజాతి నిరర్థకము, అనవసరము, అనాగరికము. ఈ జాతికి స్వస్తిచెప్పిన లాభములు దానితో ప్రభుత్వము వ్యవసాయదారులకూడ రక్షించుకొనుటకును, సాయముచేసికొనుటకును వీలుగా నుండెడిది. కాని బ్రిటిషు ప్రభుత్వమువారు, తమస్థితినిబట్టి తమన్నంటిపెట్టుకొని యున్న యీ చిన్న సంఘమును, రాజకీయకారణములచే, విడువజాల కుండిరి.

చిట్టచివరకు రాష్ట్రప్రభుత్వము జమీందారులకు వ్యవసాయదారులకుకూడ రెమిషనులనిచ్చిరి. ఈ రెమిషనులపద్ధతి సులభగ్రాహ్యముగ లేక చిక్కులతో కూడియుండెను. మొట్టమొదట దాని నర్థము చేసికొనుటే కష్టమయ్యెను. మొత్తముమీద నవి యెంతమాత్రము చాలకుండెను. పైగా అవి వర్తమానఫసలీకి సంబంధించియుండెను. వ్యవసాయదారుల బకాయిలనుగురించి ఋణములనుగురించి యది యేమియు నుదహరించలేదు. వ్యవసాయదారు జరుగుచున్న యర్థ సంవత్సరమునకే పన్ను చెల్లించుకొనలేనపుడు వెనుకటిసంవత్సరముల బకాయిలను ఋణములను చెల్లించుకొనజాలడనిస్పష్టముగ నర్థమగుచునేయుండెను. జమీందారు సాధారణముగ తన కిచ్చిన జమల నన్నింటిని పాతబకాయిలక్రింద కట్టుచుండుట యాచారము. వ్యవసాయదారుదృష్టిలో నిది చాల యుపద్రవకరమైనపద్ధతి. ఏలనన అత డీయవలసిన దే కొంతభాగమునకో యతనిమీద నెప్పుడును చర్యతీసికొని యతనిని భూమినుండి వెడలగొట్టవచ్చును.

రాష్ట్రకాంగ్రెసు కార్యనిర్వాహకవర్గముకు సాధారణకష్టపరిస్థితి యేర్పడెను. వ్యవసాయదారులకు చాల అక్రమము జరుగుచున్నదని మేము దృఢముగ విశ్వసించితిమి. కాని మేమీ విషయములలో నసహాయులమైతిమి. వ్యవసాయదారులను పన్ను చెల్లింపవలదని బాధ్యత మాపై బెట్టుకొనుటకు మేమిష్టపడలేము. వారెంత చెల్లింపగలరో యంతయు చెల్లించితీరవలయునని మేము నిరంతరము చాటు

చుంటిమి. వారి కష్టముల యెడల, దౌర్భాగ్యముపట్ల మేము సానుభూతి
చూపుచు వారికి ధైర్యము చెప్పుటకు యత్నించుచుంటిమి. రివిజనులు
తీసి వేసినను చెల్లింపవలసిన పన్ను హెచ్చుగనే యుండెను.

నిర్బంధయంత్రము కదలనారంభించెను. వేలకొలది వ్యవసాయ
దారులను భూమినుండి వెడలగొట్టు దావాలు తీసికొనిరాబడెను.
వాటితో ఆవులను, ఎద్దులను, స్వంతఆస్తిని యథేచ్ఛగ జప్తులుచేయ
నారంభించిరి. జమీందారు నోటీసుల్లు వ్యవసాయదారులను కొట్టు
చుండిరి. అధికసంఖ్యాకులైన వ్యవసాయదారులు పన్ను మొత్త
ములో కొంతభాగము చెల్లించిరి. వారంతవరకే చెల్లింపగలిగిరి.
బహుశః కొంతమంది మరికొంత చెల్లింపగలిగి యుండవచ్చును. కాని
తక్కిన యధికసంఖ్యాకుల కంతకే చాలభారముగనుండెను. కొంత
భాగము చెల్లించు యీ పద్ధతివలన వారి కెట్టి రక్షణ కలుగలేదు.
న్యాయశాస్త్రమనునొక పెద్దఆవిరిబండవలె దాక్షిణ్యములు లేకుండ
దానిక్రింద పడినవారినందరిని మార్గముచేసికొనుచు పోవుచుండెను.
కొంతభాగము చెల్లింపబడినను భూమినుండి లేవగొట్టు దావాలు
డిక్రీచేయబడెను. జప్తులు, పశువులు, స్వంతఆస్తిని అమ్మివేయుట,
నిరంతరాయముగ సాగింపబడుచుండెను. వ్యవసాయదారు లసలు
చెల్లింపకపోయినను యింతకంటె నధోగతిలోనుండెడివారు కారు.
నిశ్చయముగ వారింతకంటె కొంత బాగుగనేయుండెడివారు. ఏలనన
వారికి కాసొమ్మయినను మిగిలెడిది.

వారు తండోపతండములుగ మావద్దకువచ్చుచు "మీ
సలహాల ననుసరించి మేమివ్వగలిగినదంతయు నిచ్చితిమి. ఇదియే
దానిఫలితము" అని మమ్ము తీవ్రముగ నిందించుచుండిరి. ఒక్క
అలహాబాదు జిల్లాలోనే అనేక వేల రైతులను భూములనుండి తరిమి
వేసిరి. అనేక వేలమందిపయి నేదో యొక చర్య తీసికొనబడెను. జిల్లా
కాంగ్రెసుకమిటీఆఫీసు పగలంతయు దుఃఖాక్రాంతసమూహములచే
ముట్టడి వేయబడుచుండెను. దానితోపాటు నాయింటినికూడ ముట్టడి
వేసెడివారు; ఈ దుస్థితినుండి తప్పించుకొనుటయే తరచు నే నచ్చటి

కైన పోవలెనని యేమూలనైనదాగొనవలెననియనుకొనెడివాడను. మా దగ్గరకువచ్చిన వ్యవసాయదారుల యొంటినిండ గాయములు కాన్పించెడివి. జమీందారుల యేజంటులు వారిని కొట్టిరి. మేము ఆస్పత్రిలో వారికి చికిత్స చేయించెడివారము. వారేమిచేయగలరు? మే మేమిచేయగలిగితిమి? మేము యు.పి. ప్రభుత్వమునకు పెద్దపెద్ద యుత్తరములను వ్రాసితిమి. మా కమిటీ గోవిందవల్లభ పంతును నైనిటాలు లేక లక్నోలోని యు. పి. ప్రభుత్వముతో నుత్తర ప్రత్యుత్తరములను జరుపు కాంగ్రెసు ఆఫీసరుగ నియమించెను. అతడెప్పుడు ప్రభుత్వమునకు వ్రాయుచు నేయుండెను. మా రాష్ట్రాధ్యక్షుడు షెర్వానీకూడ అప్పుడప్పుడు వ్రాయుచుండెను. అట్లే నేనును వ్రాసితిని.

జూను, జులై నెలలలో వర్షాకాలము ప్రారంభమగుటతోడనే మరియొక కష్టము దాపురించెను. అది దున్నుట, విత్తుట మొదలగు పనులు చేసికొనవలసిన ఋతువు. భూములనుండి వెడలగొట్టబడిన వారు సోమరులుగనుండి వారికండ్లయెదుట వారిపొలములు బీడులయి పడియుండ చూచుచు నూరకుండవలసినదేనా? వ్యవసాయదారు డీనిని చూడలేడు. అది యతని స్వభావమునకు విరుద్ధము. భూములను లాగుకొనుట న్యాయసాంప్రదాయ తంతులతో జరిగెను కోర్టు డిక్రీలములు జరిగెను. తరువాత నేమియు జరుగలేదు. వారిప్పుడా భూములనుదున్ని అక్రమప్రవేశ నేరమును చేయవలసినదేనా? తాను దున్నిన పొలము నితరులు దున్నుచుండ రైతు చూచుచు సహింపజాలడు. వారు సలహాకు మా దగ్గరకు వచ్చిరి. మేమేమి సలహా యివ్వగలము?

వేసవిలో నే నాసంవత్సరము గాంధీజీతో సిమ్లా వెళ్ళినపుడు భారతప్రభుత్వ ఉన్నతోద్యోగికీకష్టము తెలిపి యతడే మా స్థితిలో నున్నచో తా నేమిసలహానిచ్చెడివాడో చెప్పుమంటిని. అతని ప్రత్యుత్తర మాశ్చర్యజనకమగు సత్యమును తెలుపునట్లుండెను. భూమినుండి తరిమి వేయబడిన వ్యవసాయదారు వచ్చి తన నిట్లడిగిన చో ప్రత్యుత్తరమునీయ నిరాకరింతునని యతడు సెలవిచ్చెను. న్యాయ

విధానము ప్రకారము భూమినుండి వెడలగొట్టబడినవాని వెతలైనను భూమిని మన్నకాడదని యొక్కమాటలో చెప్పజాలకుండెను. నిర్జీవమగు సంకెలతో చెరలాటమాడు కాగితములమీద నాజ్ఞలను చేయుట సిమ్లాపర్వతశిఖరములపై నుండు నాయకులకు సులభమైన విషయమే యగును. అతనికి, నైనిటాలులోనున్న రాష్ట్రనివాసులకు మానవ సంపర్కమేమియు లేదు. అనుభవింపబడుచున్న మానవదుఃఖము వారు చూచి యెరుగరు.

వ్యవసాయదారులకు మే మొక్కటే సలహా చెప్పవలెనని సిమ్లాలో హితబోధచేయబడెను. వారు పన్ను పూర్తిగా చెల్లింపవలెను. లేదా చెల్లింపగలిగినంత చెల్లింపవలెను. అనగా మేము జమీందారుయేజంటులవలె పనిచేయవలెను. వారు చెల్లింపగలిగినంత చెల్లింపవలసినదని చెప్పినపుడు మే మట్లే చేసితిమి. వారు పశువుల నమ్మివేయరాదనియు క్రొత్తగా ఋణము చేయరాదనియు కూడా మేము చెప్పినమాట సత్యము. దాని ఫలితము మేము చూచితిమి.

ఆ వేసవి మాకంతకును చాల భయంకరముగ నుండెను. అది మాకెక్కువ యలసట కలిగించెను. భారతరైతుకు దుఃఖముల ననుభవించుట కద్భుతశక్తి కలదు. అతని కెప్పుడు కఱవులు, వరదలు, వ్యాధులు చూర్ణముచేయు నిరంతర దారిద్ర్యము, సంభవించుచునే యుండెను. అతడు వీటిని భరించలేనపుడు నోరెత్తి చెప్పుకొనకుండ వేలు లక్షలు చనిపోవుచుందురు. అదియే తప్పించుకొనుట కతనికి గల మార్గము. అప్పు డప్పు డతనిని వేధించుచుండు గొప్ప దుఃఖములవంటి వేవియు నతనికి 1931 లో సంభవించలేదు. కాని 1931 లో సంభవించిన దుర్దశ లతనికి ప్రకృతిసిద్ధములుగా కాన్పించలేదు. కనుక వాటి నత డోర్పుతో సహింపలేకపోయెను. అవి మానవకృతములని యతడు భావించి వానిని ప్రతిఘటించెను. అతనికి గలిగిన నూతన రాజకీయ విద్య ఫలించెను. 1931 లోని యీ క్రొత్తసంఘటనలు మాకు

కూడ ప్రత్యేకముగ బాధకరముగనుండెను. ఏలనన మేము వీటికి కొంతబాధ్యులమైతిమి. వ్యవసాయదారులీ విషయములో చాలవరకు మా సలహాల ననుసరించలేదా? మా నిరంతర సహాయము లేనిచో వ్యవసాయదారులస్థితి మరింతయధ్వాన్నమయ్యెడిదని నా దృఢవిశ్వాసము. మేము వారిలో నైకమత్యము కలిగించుటచే వారికి శక్తి చేకూరెను. దీనిచేతనే వారికి యెక్కువ రిమిషనులువచ్చెను. వారి యెడల చూపబడిన నిర్బంధములు, యమానుషచర్యలుకూడ చెడ్డవే యైనను యీ దురదృష్టవంతుల కసాధారణములుకావు. సాధారణ ముగ గ్రామములో జమీందారుయేజంటు వ్యవసాదారు నవ మానపరచుట, బాధించుట సామాన్యము. అందరకు తెలిసినవిష యము. ఇట్లు బాధింపబడువ్యక్తి చనిపోయినప్పుడుగాని పైవారి కిదేమియు తెలియదు. మేము చేసిన కట్టుబాటులవలనను, వ్యవసాయ దారులలో కలిగిన నూతన జ్ఞానోదయమువలనను యీ పరిస్థితులు మారెను. వ్యవసాయదారులందరు నిపుడు కట్టకట్టుకొని యురికంబ ముల నాలింగనమొనర్తురు; తమ దుఃఖముల నన్నింటిని కాంగ్రెసు ఆఫీసుకు తెలియపరచెదరు.

వేసవి ముదిరినకొలదిదౌర్జన్యముగ పన్నులను వసూలుచేయు యత్నములు సన్నగిలెను. నిర్బంధవిధానము తగ్గెను. భూమినుండి వెడలగొట్టబడిన యనేకమంది వ్యవసాయదారుల సమస్యయే మమ్మి ప్పుడు బాధింపదొడగెను. వారికేమి సదుపాయముచేయవలెను? వారి పొలములను వారికిచ్చివేయవలసినదని మేముప్రభుత్వముపైయొత్తిడి కలిగించుచుంటిమి. ఇవి చాలవరకు కాళీగనే యుంచును. భవిష్య త్సమస్యయే మరింత ముఖ్యమయ్యెను. ఇంతవరకివ్వబడినరిమిషనులు గత ఋతువుకు మాత్రమే చెందును. భవిష్యత్తు నిశ్చయింపబడలేదు. అక్టోబరు లగాయతు ముందు వసూళ్లుప్రారంభమగును. అప్పుడేమి జరుగును? తిరిగి యీ భయంకర చక్రమే మనకు ప్రాప్తమగునా? రాష్ట్రప్రభుత్వము తమ యధికారులతోను, స్థానిక శాసనసభలోని కొందరు జమీందారుసభ్యులతోనుకూడిన యొక కమిటీనినియమించి

యీ విషయము నాలోచింపమనిరి. వ్యవసాయదారు ప్రతినిధి యొక్కడు నందులో లేడు. చివరనిమిషములో, కమిటీవారు పనిని ప్రారంభించిన తరువాత, మా తరఫున కమిటీలో జేరవలసినదని ప్రభుత్వముగోవిందవల్లభపంతు నాహ్వానముచేసెను. ముఖ్యతీర్మానములన్నియు నదివరకే చేయబడినతరువాత నా తుదిగంటలో కమిటీలో చేరుటవలన ప్రయోజనమేమియులేదని యతడు తలచెను.

యు. పి. రాష్ట్రీకాంగ్రెసు కమిటీకూడ నొక చిన్న కమిటీ నేర్పాటుచేసి వారిని భూత, వర్తమాన వ్యావసాయిక లెక్కలను తయారుచేసి ప్రస్తుతస్థితినిగురించి యొక నివేదిక తయారుచేయుమని నియమించెను. ఈ కమిటీ యు. పి. లోని వ్యావసాయిక పరిస్థితులను గురించి సర్వమగు పరిశోధనతోకూడిన యొక దీర్ఘనివేదిక తయారుచేసెను. వ్యావసాయిక ధరలు పడిపోవుటవలన కలిగిన నష్టము బాపతువారిగా విడదీసి చూపబడెను. వారి సిఫార్సులు చాల విరివిగ నుండెను. పుస్తకరూపములో ప్రకటింపబడిన యీ నివేదికమీద గోవిందవల్లభ పంతు, రఫీ అహమ్మదు కిద్వాయి, వెంకటేశ నారాయణతివారీగార్ల సంతకములు కలవు.

ఈ నివేదికకు పూర్వమే గాంధీజీ రౌండుటేబిలుకాన్ఫరెన్సుకు వెళ్ళెను. అతడు చాలసందేహముతో వెళ్ళెను. యు. పి. వ్యావసాయిక స్థితి యీ సందేహమునకొక కారణము. అతడు రౌండుటేబిలుకాన్ఫరెన్సుకు పోకపోయినచో యు. పి. లోనే యుండి యీ క్లిష్టసమస్యకొఱకు తన కాలము వినియోగింపనిశ్చయించెను. తుది సిమ్లాసంభాషణ లితరవిషయములతోపాటు యు. పి. ని గురించి జరిగెను. అతడు లండను వెళ్ళినతరువాత జరిగిన పరిస్థితులెప్పటికప్పు డతనికి పూర్తిగ తెలుపబడుచుండెను. మొదటి యొకటి రెండుమాసములు నేనతనికి వారమువారము మామూలు టపాలోను,విమానటపాలోను వ్రాయుచుండెడివాడను. తరువాతరోజులలో నత డెప్పటికప్పుడే వచ్చునను యుద్దేశముతో నే నంతగా వ్రాయలేదు. అతడు మూడుమాసముల కంటె నెక్కువకాలమచ్చట నుండడని మాతో చెప్పెను. ఈలోపల

భారతదేశములో నట్టివిషమస్థితియు నేర్పడదని నే మాశించితిమి. అతడు లేనికాలములో ప్రభుత్వముతో నెట్టిపోరాటమునైనను తప్పించుకొనవలెననియే మేము వాంఛించితిమి. కాని యతనిరాక చాల యాలస్యమయ్యెను. ఇచ్చట వ్యావసాయిక పరిస్థితులు ముంచుకొనివచ్చెను. ఇచ్చట విషమస్థితిని గురించి మేమతని కొక పెద్దతంతి పంపి మాచేతులు బంధింపబడుచున్నవని సూచించితిమి. ఈ విషయములలో తానాసమయమున నేమిచేయుటకు నసహాయుడననియు మా బుద్ధి కుచితమని తోచినవిధమున ముందుకు పోవలసినదనియు మాకు తిరిగి తంతి యిచ్చెను.

రాష్ట్రీ కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు వర్కింగు కమిటీకి గూడ పరిస్థితుల నెప్పటికప్పుడు పూర్తిగ తెలుపుచుండిరి. నే నెప్పుడు నచ్చటినుండి వారికీయదార్థవిషయముల నెప్పటికప్పుడు తెలుపుచుంటిని. పరిస్థితులు ముదురుచుండుటచే కమిటీవారు రాష్ట్రాధ్యక్షుడైన షెర్వానీతోను, అలహాబాదుజిల్లా యధ్యక్షుడైన పురుషోత్తమదాసు టాండనుతోను ఆలోచనలను సలిపిరి.

ప్రభుత్వ వ్యావసాయిక కమిటీవా రొకనివేదికను తయారు చేసి దానిలో కొన్ని శిఫారసులను చేసిరి. అవి యస్పష్టముగ నసంబద్ధముగనుండి చాలవరకు స్థానికాధికారుల యిష్టమునకు విడిచివేయబడెను. మొత్తముమీద గతఋతువులో నిచ్చినవాని కంటె నెక్కువ రిమిషనుల్ యివ్వబడెను. కాని యవి మాకు చాల నట్లు కాన్పించెను. ఆ శిఫార్సుల వెనుకనున్న సిద్ధాంతములకు, వాటినివర్తింపచేయువిధములకు నే మభ్యంతరపెట్టితిమి. ఇంతేగాక నా నివేదిక భవిష్యత్తునుగురించి మాత్రమే తెలిపి గతబకాయిలను, ఋణములను, భూములనుండి వెడలగొట్టబడిన యసంఖ్యాకములగు వ్యవసాయదారులను నిర్లక్ష్యముచేసెను. నే నేమి చేయవలెను? గత వసంత, గ్రీష్మఋతువులలో మేము చెప్పినట్లే వ్యవసాయదారులను చెల్లింపగలిగినంత చెల్లించి వెనుకటి బాధలనే యనుభవింపమని సలహా చెప్పవలెనా? ఆ సలహా యతి మూర్ఖమైనదని మేము

కండ్లార తెలిసికొనుటచే జరిగి దానినే యీయజాలము. వ్యవసాయ దారులు శతవిధముల తంటాలుపడి యీ క్రొత్తడిమాండు నంతను, వారేవిధముగనైన చెల్లింపకలిగిరా? పూర్తిగ చెల్లించవలెను. లేదా వారు ప్రస్తుతమేమియు చెల్లింపక పరిస్థితులనవలోకించుచుండ వలెను డిమాండులోని కొంతభాగము చెల్లించుట రెంటికి చెడిన రేవడిచంద మగును. వ్యవసాయదారులకున్న కొద్దిపాటి మూలధనము వ్యయమగును. దానితో వారు భూములుకూడ పోవును.

మా రాష్ట్రకాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారీస్థితిని గురించి దీర్ఘకాల మతిశ్రద్ధగ యోచించిరి. ఈ రిమిషను వేసవిలో నిచ్చినవాటికంటె నెక్కువగానున్నను నంగీకరించుటకు యోగ్యముగ లేదని వారు నిశ్చయించిరి. వ్యవసాయదారునకు లాభకరముగ నుండునట్లు వానిని మార్చుట కింకను నవకాశముండెను. మేము ప్రభుత్వము నట్లు చేయవలసినదని పట్టుబట్టితిమి. కాని మా కాశ లేనట్లు కాన్పించెను. మేము తప్పించుకొన యత్నించిన పోరాటము మాపయి బడుచుండెను. కాంగ్రెసుపట్ల రాష్ట్రప్రభుత్వ భారత ప్రభుత్వముల వైఖరి క్రమముగ మారిపోవుచు నంతకంతకు కఠినమగుచుండెను. మా పెద్ద పెద్ద యుత్తరములకు "స్థానికాధికారులను చూడుడు" అను ముఖావమగు ప్రత్యుత్తరము వచ్చెడిది మా కెట్టి ప్రోత్సాహము నీయకపోవుటయే ప్రభుత్వ నీతి యని విశదమయ్యెను. వ్యవసాయదారులకు రిమిషను యివ్వబడినయెడల కాంగ్రెసు ప్రతిష్ట హెచ్చవచ్చునని ప్రభుత్వమునకు బాధగనుండెను. చిరకాలాభ్యాసమువల్ల ప్రభుత్వమునకు ప్రతిష్ట దృష్టితప్ప వేరొకటిలేదు. ప్రజ లీ రిమిషనులకు కాంగ్రెసు కీర్తింప వచ్చునను భావము ప్రభుత్వమునకు కన్నెఱ్ఱగా నుండెను. కనుక ప్రభుత్వము సాధ్యమైనంతవరకు దీనిని లేకుండ చేయగోరిరి. ప్రభుత్వము కాంగ్రెసు యుద్యమముపై తీవ్రముగ విజృంభింప నున్నారనువార్తలు లోపుగ ఢిల్లీ మొదలైన ప్రదేశములనుండి మాకు వినవచ్చెను. ఆ 'చిన్నవ్రేలి' పును మరింత జోరుగ తన

ధర్మమును నెరవేర్చుచుండెను. తేల్చుమమ్ము శిక్షింపవచ్చుచున్నవి. జరుగబోవుపనిని గురించిన యనేకవివరములుగూడ మాకు తెలుపబడెను. నే మదివరకులో వినిన వదంతులన్నియు యదార్థములే యను సందేశము నొకదానిని నవంబరునెలలో నాకు డాక్టరు అన్సారీ పంపెను. అందులో సరిహద్దురాష్ట్రములలోను, యు. పి. లోను అమలుజరుపనున్న ఆర్డినెన్సులనుగురించినవివరములుగూడ నుండెను. ఒక క్రొత్తఆర్డినెన్సు వంగదేశమున కప్పుడే ప్రసాదింపబడెను. చాల వారములైనతరువాత క్రొత్తపరిస్థితుల నెదుర్కొనుటకో యనునట్లు ప్రారంభింపబడిన క్రొత్తఆర్డినెన్సులు డాక్టరు అన్సారీగారి పూర్వ సందేశమును వివరములతోసహా ఛాయముచేసెను. రౌండుటేబిలు కాన్ఫరెన్సు యొక్కవకాలము పొడిగింపబడుటచే ప్రభుత్వమువారు తాము తీసుకొనదలచిన చర్యలను కొంతకాల మాపివేసిరని. రౌండుటేబిలు కాన్ఫరెన్సు సభ్యులు తీపిమాటల నొకరి చెవులలో నొకరూదుకొను కాలమున ప్రభుత్వము హిందూదేశములో పెద్ద నిర్బంధములను ప్రవేశపెట్టుట నాపియుంచిరి.

కనుక తీవ్రత హెచ్చనారంభించెను. మా ప్రమేయము లేకుండ పరిస్థితులు పరుగెత్తుచున్నవనియు, ముందుగనే నిర్ణయింపబడినవాటి గతి నెవరు నాపజాలరనియు నేము భావించతిమి. వాటినెదుర్కొనుటకు తగిన సంసిద్ధత జూపుటయే మావిధి. ఈ జీవిత నాటకములో, బహుశః విషాదాంత నాటకము నేము వ్యక్తిగతముగ, సమిష్టిగ మామా పాత్రలను ధరింపవలెను. ఈ రెండుసైన్యములు తలపడుటకు పూర్వము గాంధీజీ వచ్చుననియు, యుద్ధమునకు. శాంతికి బాధ్యత నతడే వహించుననియు నేమింకను తలంచుచుంటిమి. అతడు లేనపుడు నేమెవరము నా బాధ్యతవహించుటకుసంసిద్ధులముగ లేము.

యు. పి లో ప్రభుత్వము మరియొక యడుగుముందుకు వేసెను. ఇది గ్రామసీమలలో నలజడి కలిగించెను. వ్యవసాయదారులకు రిమిషను చీటీలను పంచిపెట్టి వారి కెంత రిమిషను ఇవ్వబడెనో తెలుపుచు, నొక మాసమురోజులలో నప్పటికున్న బకాయిలను చెల్లింప

నివో నిచ్చిన కిమిషనులు రద్దుచేయబడుననియు పూర్తిమొత్త మంతయు చట్టముద్వారా, అనగా భూమినుండి వెడలగొట్టబడుట ఆస్తిని జప్తుచేయుట మొదలగువానిద్వారా రాబట్టుకొనబడుననియు భయపెట్టిరి. మామూలు వత్సరములలో వ్యవసాయదారులు తమ పన్నులను దఫదఫాలుగ రెండు మూడు మాసములలో చెల్లించు చుండిరి. ఇప్పుడీ మామూలుగ నిచ్చు కాలపరిమితిగూడ నాస్తి యయ్యెను. గ్రామప్రాంతములన్నియు హఠాత్తుగ నీ విషమస్థితి నెదుర్కొనవలసివచ్చెను. చేతులలో చీటీలను పుచ్చుకొని నిరసించుచు, ఫిర్యాదుచేయుచు, సలహా యడుగుచు వ్యవసాయదారు లిటునటు పరుగిడ నారంభించిరి. స్థానికాధికారులు, ప్రభుత్వమువారు కలుగజేసిన యీ భయము సకార్యమైనదని చెప్పకతప్పదు. అట్లు చేయుతలంపులేదని మాకు తరువాత తెలిసెను. కాని యది శాంతియుత సమాధానావకాశాలను తగ్గించి క్రమముగ పోరాటమునకు దారిచూపెను. వ్యవసాయదారులు, కాంగ్రెసు, యిపుడు వెంటనే యొక నిశ్చయమునకు రావలెను. గాంధీజీ తిరిగివచ్చువరకు మేము మానిశ్చయమును నిలిపియుంచుటకువీలులేదు. మేమేమిచేయవలెను? ఏమిసలహాచెప్పవలెను? చాలమంది తమకీయబడిన కొద్ది గడువులో దానిని చెల్లింపలేరని మే మెరిగియున్నను చెల్లించవలసినదని సహేతుకముగ మేమెట్లు చెప్పగలము? వారీయవలసిన బకాయిల సంగతి యేమిచేయవలెను? డిమాండులోని చాలభాగము నిచ్చివేసినను లేక పూర్తిగ నిచ్చివేసినను దానిని పాతబాకీక్రింద జమకట్టినచో భూమినుండి వెడలగొట్టబడు దుర్గతి వారికి తప్పునా?

ఎక్కువమంది వ్యవసాయదారులు గల అలహాబాదు జిల్లా కాంగ్రెసుకమిటి పోరాటము తప్పదనెను. వ్యవసాయదారులనుపన్ను చెల్లింపవలసినదనివారుసలహాచెప్పజాలరైరి. అయిననురాష్ట్రకార్య నిర్వాహకవర్గ, అ.భా. వర్కింగుకమిటీలయంగీకారములేనిదే యది యెట్టి తీవ్రకార్యముచేయుటకు వీలులేదని తెలుపబడెను. కనుక నీ విషయము వర్కింగుకమిటీకివిడిచిపెట్టబడెను. షెర్వానీ,టాండనుగా

క్రిసువుకు రాష్ట్రముతరపునను జిల్లా తరఫునను యీ హంశము నచ్చట ప్రవేశపెట్టిరి. మాముందరనున్న సమస్య అలహాబాదుజిల్లాకు సంబంధించెను. అది కేవల మార్థికసమస్య. కాని యప్పుడున్న రాజకీయ బింకమునుబట్టి దీనికి విపరీతఫలితములు కలుగగలవని మేము గుర్తించితిమి. జరుగనున్న రాయబారములు ముగియువరకు, మంచి షరతులు చేకూరువరకు వ్యవసాయదారులు పన్ను చెల్లించుట నాపివేయవలసినదని సలహాయిచ్చుటకు అలహాబాదుజిల్లాకమిటీ కనుజ్ఞ నీయవలెనా? ఉన్నసంకుచితసమస్య యదియే! మేము దానికే కట్టుబడదలంచితిమి. కాని మే మట్లుచేయగలిగితిమా? గాంధీజీ రాక పూర్వము ప్రభుత్వముతో నెట్టి విరోధము పెట్టుకొనకుండుటకు వర్కింగుకమిటీవారు శతవిధముల యత్నింపగోరిరి. ముఖ్యముగా వారు వర్గపోరాటముగ పరిణమించగల ఆర్థికసమస్యమీద నిది కలుగకుండ చేయగోరిరి. ఈ కమిటీ రాజకీయముగ చాల యభివృద్ధి చెందినను సాంఘికముగ నట్టియభివృద్ధిని పొందలేదు. అది జమీందారులకు వ్యతిరేకముగ వ్యవసాయదారుల సమస్యను లేవదీయుట కిష్టపడలేదు.

నేను సామ్యవాది నగుటచే నార్థిక, సాంఘిక విషయములలో సలహాయిచ్చుటకు తగుసామ్యుత లేనివాడనని భావింపబడెను. తమ కెంతయిష్టము లేకపోయినను మనలోనున్న యెక్కువ మితవాద తత్త్వము కల సభ్యులు, కుడిపక్షసభ్యులుకూడ యు. పి. పరిస్థితులవలన కార్యరంగములోని కీడ్వబడుచుండిరి. మా రాష్ట్రమునుండి షెర్వానీ మొదలగువారు వర్కింగుకమిటీ మీటింగుకు హాజరుకావలెననియే నేనుకోరితిని. ఏలనన షెర్వానీ (మా రాష్ట్రాధ్యక్షుడు) యెంత మాత్రము ఉద్రేకికాడు. స్వభావముచే నతడు కాంగ్రెసులో రాజకీయముగను, సాంఘికముగనుకూడ కుడిపక్షమువాడు. ఆతడు వత్సరారంభములో యు. పి. కాంగ్రెసుకమిటీయొక్క వ్యావసాయిక నీతి యెడల విముఖుడుగనే యుండెను. కాని యతడే ఆ కమిటీఅధ్యక్షుడై యా భారమును వహింపవలసివచ్చినపు డంతకంటె గత్యంతరము

లేదని గుర్తించెను. తరువాత రాష్ట్రకమిటీ తీసికొనిన ప్రతిచర్యయు అతని సన్నిహిత సహకారముతోడను. అతని యధ్యక్షతక్రిందను తీసికొనబడెను.

కనుక వర్కింగుకమిటీలో నేను వాదించుటవలన కలుగుదాని కంటె షెర్వానీ వాదించుటవలనే ఎక్కువ ఫలితము కలిగెను. కమిటీ వారు జంకుచు, కాని దానిని తిరస్కరించ వీలులేదని భావించుచు, యే ప్రాంతముకైనను రివిన్యూశిస్తులను చెల్లింపకుండుట కనుజ్ఞనీయ వచ్చునని యు. పి. కమిటీకధికారమిచ్చిరి. కాని వారు యు. పి. ప్రజలను శక్యమగునంతవరకీ చర్యకు దిగకుండుటమాని రాష్ట్ర ప్రభుత్వముతో రాయబారములను జరుపవలెనని బలవంతపెట్టిరి.

ఈ రాయబారములు కొద్దికాలము జరిగెను. కాని ఫలితము శూన్యము. అలహాబాదుజిల్లాలోని రిమిషను అంకెలలో కొంత మార్పుజరిగెనని నేను భావించెదను. మామూలు పరిస్థితులలోనైనచో సమాధానము కుదిరియుండెడిది. అధమము బహిరంగపోరాటమైన తప్పియుండెడిది. భేదములు తగ్గిపోవుచుండెను. కాని పరిస్థితులు చాలయసామాన్యములయ్యెను. ప్రభుత్వ కాంగ్రెసు పక్షములు సమీపములోనే పోరాటము తప్పదనుకొనుచుండిరి. ఇరుపక్షములవారు తీసికొను ప్రతిచర్యయు సమయముకొరకు వేయుచున్న యెత్తును సూచించుకొరకవలె కాన్పించెను. ఇందుకు ప్రభుత్వసన్నాహమంతయు రహస్యముగ జరుగగలదు. నిజమునకది యట్లేజరిగి పూర్ణత నొందెను. మనబలము కేవలము ప్రజలనీతిమీదనే యాధారపడెను. ఇది రహస్యకార్యములచే సిద్ధముచేయబడునది కాదు. రహస్య కార్యములచే నుత్థితమగునదికాదు. మాలోకొంతమంది అట్టిపాపము చేసినవారిలో నేనొకడను. మా బహిరంగోపన్యాసములలో మన స్వాతంత్ర్యపోరాట మింకను ముగియలేదనియు, నతి త్వరలోనే మన మనేకపరీక్షలను, కష్టములను నెదుర్కొనవలసియుండుననియు ననేక సార్లు వక్కాణించితిమి. వాటికొఱకు సంసిద్ధులుగ నుండవలసినదని మేము మా ప్రజలను హెచ్చరించితిమి. ఈ కారణముచేత యుద్ధ

మునకు కాలుదువ్వుచున్నామని మమ్ము విమర్శించిరి. యథార్థము నకు మా మధ్యతరగతి కాంగ్రెసువర్కరులకు నిజస్థితి నెదుర్కొనుట కెంతమాత్రము నిష్టములేకుండెను. ఏదో యొక విధముగ పోరాటము తప్పిపోవునని వారాశించుచుండిరి. వార్తాపత్రికలు చదువు తరగతి వారిదృష్టి లండనులోనున్న గాంధీజీపయినుండెను. విద్యాధికు లీవిధ ముగ స్థబ్దులుగనున్నను ముఖ్యముగ వంగదేశములోను, సరిహద్దు రాష్ట్రములోను, యు. పి. లోను పరిస్థితులు ముదురుచుండెను. విషమావస్థ సమీపించుచున్నదను వివేకోదయము నవంబరు మాస ములో చాలమందికి కలిగెను.

యు. పి. రాష్ట్ర కాంగ్రెసుకమిటీ పరిస్థితు లెటులుండి యెటు వచ్చునోయని పోరాటమువచ్చుచో జరుగవలసిన కొన్ని స్థానిక యేర్పా టులను చేసిరి. అలహాబాదుజిల్లాకాంగ్రెసుకమిటీరయితుకాన్ఫరెన్సు జరిపెను. మంచిషరతులు ప్రాప్తించనియెడల రయితులను పన్నులు శిస్తులు చెల్లింపవలదని సలహా యివ్వవలసియుండునను సక్రమమైన తీర్మానమందులో గావింపబడెను. ఈతీర్మానము రాష్ట్రప్రభుత్వకోప ముకు గురియయ్యెను. దీనినొక సాకుగాదీసికొని వారు మాతో నిక నెట్టిసంబంధము పెట్టుకొనజాలమనిరి. వారి వైఖరిచూచి రాష్ట్ర కాంగ్రెసు దానినొక సంగ్రామచిహ్నముగా నర్థముచేసికొని తాము కూడ తగిన సన్నాహములను చేసికొనిరి. అలహాబాదులో మరియొక రయితు కాన్ఫరెన్సు జరిగెను. రాయబారములు, షరతులు కుదురు వరకు పన్నులనీయరాదను స్పష్టమగుతీర్మాన మందులో గావింప బడెను. అప్పుడయినను మేము 'సరసమగుపన్ను' లుండవలెనను దృష్టిలో నుంటిమిగాని 'పన్నుల నీయరాదు' అను యుద్యమము నెప్పుడు తలపెట్టలేదు. రెండవపక్షము మాతో ముడుచుకొనునట్లు కాన్పించుచున్నను మేము సమాధానముకొరకు యత్నించుచునే యుంటిమి. అలహాబాదుతీర్మానము జమీందారులకు, వ్యవసాయ దారులకుకూడ సమముగనే వర్తించును. కాని యది ఫలితములో

రయితులకు కొద్దిమంది చిన్నజమీందారులకుమాత్రమే వర్తించునని మే మెరుగుదుము.

1931 సంవత్సరముచివర డిశంబరు ప్రారంభమున యు. పి. లో పరిస్థితులిట్లుండెను. ఆలోపున వంగదేశములోను సరిహద్దురాష్ట్రము లోను న్యాయశాసనములు సృష్టించెను. వంగదేశములో సర్వమును క్రమంగా సైనిక ఆర్డినెన్సు ప్రకటింపబడెను. ఇవన్నియు సంగ్రామ చిహ్నములుగాని శాంతిమార్గములుగావు. గాంధీజీయెప్పుడువచ్చును? ప్రభుత్వము చాలకాలమునుండి సన్నాహముచేయుచున్న తీవ్రచర్య ప్రారంభమగులోపల గాంధీజీ హిందూదేశముచేరునా ? లేక నతని సహాకారులు చాలమంది జయిళ్ళకు పంపబడి పోరాటము ప్రారంభింపబడినతరువాత నతడువచ్చునా? అతడు పయనమయ్యెనని, డిశెంబరు చివరివారములో బొంబాయి చేరనున్నాడని మేము వింటిమి. మేమందరము నతడువచ్చువరకు నాపోరాటము రాకుండనుండవలె ననియే కోరితిమి. పోరాటముకొరకైనను మేమతనిని కలుసుకొని యతని సలహా, యాజ్ఞలను తీసికొనుటవసరము. ఈ పందెములో నే మసహాయులమైతిమి. బ్రిటిషు ప్రభుత్వమే నూతనాధ్యాయముకు గడంగెను.

# 40

## శాంతియ స్తమించెను

యు. పి. లో నాకున్న పనియంతులుండ చాలకాలమునుండి నేను రాజకీయకేంద్రములయిన తదితర రెండు రాష్ట్రములను (వంగ, సరిహద్దు రాష్ట్రములు) చూడవలెనని యాదుర్దాపడుచు నచ్చటి పరిస్థితులను కండ్లార చూడగోరితిని. నేను రెండుసంవత్సరములనుండి చూడని యనేకపాతసహచరులనుకూడ చూడగోరితిని. ముఖ్యముగ నా రాష్ట్రములలోని ప్రజలయుత్సాహమునకు, ధైర్యసాహసములకు, జాతీయపోరాటములో వారియఖండత్యాగములకు నేను నా కృతజ్ఞతాభివందనముల నర్పింపగోరితిని. సరిహద్దురాష్ట్రమునకు పోవుటకు వీలులేకుండెను. భారతప్రభుత్వము ప్రధానకాంగ్రెసువారెవరు నచ్చటకు పోరాదని నిషేధించుటచే నేమచ్చటకువెళ్ళి తద్వారా యెట్టిప్రతిష్టంభన కలుగజేయదలంచలేదు.

వంగదేశములో స్థితిగతులు పాడగుచుండెను. అచ్చటకు వెళ్ళవలెనని నేనెంత యావేశపడుచున్నను వెళ్ళుటకుముందే సందేహించితిని. నేనచ్చట నేమియుచేయజాలననియు నసహాయుడనగుదుననియు గుర్తించితిని. చిరకాలమునుండి రెండు కాంగ్రెసువర్గముల మధ్య నచ్చట జరుగుచున్న శోచనీయమగు వివాదముచే పయి రాష్ట్రములోనున్న కాంగ్రెసువారెవరు నచ్చటకు వెళ్ళుటకు భయపడుచుండిరి. అచ్చటకు వెళ్ళినచో నే పక్షములోనైనను చిక్కుకొనిపోవచ్చునని వారు భయపడుచుండిరి. ఇది చాలదుర్బలమైన యుద్ధప్రతిపక్షనీతివలెనున్నది. ఇది వంగదేశమును శాంతిపరచుటకు, దాని సమస్యలను తీర్చుటకు తోడ్పడకుండెను. గాంధీజీ లండను వెళ్ళిన కొంతకాలమునకు రెండువిషయములు భారతదృష్టిని వంగదేశపరిస్థితులపై కేంద్రీకరింపజేసెను. ఈ రెండు హిజిలీ, చిటగాంగులలో జరిగెను.

హిజిలీ డిటెన్యూలకు ప్రత్యేక జయిలు, ఈ జయిలులో దొమ్మి జరిగెనని, డిటెన్యూ లుద్యోగస్థులపై బడిరని వారు విధిలేక తుపాకు లను పేల్చవలసివచ్చెనని యొక అధికారప్రకటన గావింపబడెను. ఈ కాల్పులవలన నొక డిటెన్యూ మరణించెను. చాలమందికి గాయ ములు తగిలెను. వెంటనే యొక స్థానికయధికారవిచారణ జరుప బడెను. ఈ కాల్పులకు, తత్ఫలితములకు నధికారులెంతమాత్రము దోషులుకారని యది సమర్థించెను. కాని యనేకచిత్రలక్షణములందు చూపట్టెను. అధికారుల వ్రాతలతో సరిపడని యనేకయదార్థములు బయల్పడెను. సమగ్రవిచారణ జరుపబడవలెనని యాందోళన బయలు దేరెను. హిందూదేశసమాచారములకు భిన్నముగా వంగప్రభుత్వము గొప్పగొప్ప న్యాయమూర్తులుగల యొక విచారణకమిటీ నియమిం చిరి. అది కేవలమధికారులకమిటీ, కాని యది సాక్ష్యములనుతీసికొని విషయమునంతిను పూర్తిగ విమర్శించెను. దానితీర్పు జయిలు అధి కారులకు వ్యతిరేకముగ నుండెను. తప్పు చాలవరకు జయిలు అధి కారులదే యని యది సమర్థించెను. కాల్పు లన్యాయమని స్పష్టపర చెను. ప్రభుత్వమువారిచే నదివరకు ప్రకటింపబడిన యధికారపత్ర ములు కేవల మసత్యములని ఋజువుచేయబడెను.

హిజలీసంభవములలో నసామాన్యమైన దేదియులేదు. భారత భూమిలో నిట్టిసంభవములకు లేక ప్రమాదములకు కొదువలేదు. "జయిలుదొమ్మిలాటలు" జయిలులో నసహాయులై నిరాయుధులై యున్న ఖయిదీలనుసాయుధులగు వార్డరులు మొదలగువా రతిధైర్య సాహసములతో నణచివేయుట మొదలగువార్తలను మనము తఱచు విందుము. హిజిలీ యొకవిధముగ నసామాన్యమయ్యెను. ప్రభుత్వ పక్షపాతబుద్ధిని, అట్టిసంఘటనలమీద వారు ప్రకటించు ప్రకటనల లోని బూటకమును అధికారులచేతనే బయటపెట్టించెను. ఇదివరలో నిట్టి ప్రకటనల నెవడును విశ్వసించెడువాడుకాడు. కాని యిప్పుడు వాటిపస కనుగొనబడెను. హిజలీవ్యవహారమైనతరువాత నొక్కొ క్కప్పుడు కాల్పులును, ఒక్కొక్కప్పు డితర దౌర్జన్యపద్ధతులు నవ

లంబింపబడిన జయిలు "సంభవములు" భారతదేశమంతట ననేక చోట్ల జరిగెను. ఈ జయిలుదొమ్మీలలో ఖయిదీలొక్కరే గాయపడుచుండుట యొకవింత. ప్రతిసారితప్పకుండ వివిధ దుష్కార్యములను చేసిరని ఖయిదీలను నిందించుచు నుద్యోగస్థులు నిర్దోషులని ప్రకటించుచు నొక యధికారపత్రము వెలువడు చుండును. అతియనుదుగ జయిలు ఉద్యోగస్థులకు డిపార్టుమెంటుద్వారా కొద్దిశిక్షలు ప్రసాదింపబడును. పూర్తియైన విచారణ సలుపవలెనను కోరికలన్నియు నిరాకరింపబడెను. డిపార్టుమెంటు చేయు విచారణయే చాలునని తలంపబడెను. హిజిలీ ప్రభుత్వముకొక గుణపాఠమునేర్పెను. ఉచితమగు నిష్పక్షపాతవిచారణలలో తమకు భద్రతలేదని వారు కనుగొనిరి. ముద్దాయియే యుత్తమమగు న్యాయమూర్తి. ప్రభుత్వపత్రములు యదార్థముగజరుగు సంగతులుగాక ప్రభుత్వము ప్రజలనేమి విశ్వసింపవలెనని కోరునో దానినే తెలుపును హిజిలీపాఠమును ప్రజలుకూడ నేర్చుకొనవలెననుటలో నాశ్చర్యమేమున్నది?

చిటగాంగు వ్యవహారము మరింత యుపద్రవమైనది. ఒక టెర్రరిష్టు ఒక ముస్లిము పోలీసుయినస్పెక్టరును కాల్చిచంపివేసెను. దీని వెంటనే హిందూ-ముస్లిముకలహముజరిగెను. కానియదియంతకంటె నెక్కువయైన దేదియోయని పయికి కాన్పించుచునేయుండెను. అది మామూలు కులకలహముకంటె భిన్నమైనది. టెర్రరిష్టుచర్యకు కులకక్షతో సంబంధములేదు. హిందువు, ముస్లిము అను ప్రశ్నలేకుండ నదియొక పోలీసుయుద్యోగిపై తీసుకొనబడినచర్య. కాని తరువాత కొంత హిందూ ముస్లిము కలహములు జరిగినసంగతి నిజము. మంచి బాధ్యతగల ప్రజాహితైషులే యెంత తీవ్రనేరారోపణలను చేసినను యిది యెట్లు ప్రారంభింపబడెనో దీనికి కారణమేమి కలదో స్పష్టపరుపలేదు. ఈ కలహములోని మరియొక లక్షణ మేమనిన ఆంగ్లో యిండియనులు, ముఖ్యముగా రైల్వేనౌకర్లు యితర ప్రభుత్వనౌకర్లు యిందులో కలుగజేసుకొనిరి. వీరుయధేచ్ఛగజనబాహుళ్యముమీద పగపుచ్చుకొనిరి. చిటగాంగు సంభవములనుగురించి సేనుగుప్త మొద

లగు విఖ్యాత వంగదేశ నాయకు లిదమిద్ధమను నేరములను మోపి, విచారణ చేయవలసినదని లేదా పనుపష్టపుదానా చేయవలసినదని సవాలుచేసిరి. కాని ప్రభుత్వ మదేదియు చేయక యూరకుండెను.

కొంత యసాధారణములగు యీ చిటగాంగుసంభవములు రెండు యుపద్రవములవైపు దృష్టినాకర్షించెను. అనేక కారణముల చేత శిరగ్రిజము ఖండింపబడెను. ఆధునికవిప్లవ శాస్త్రముకూడ దానిని ఖండించెను. దానివలన కలుగుఫలితములలో నొకటి ముఖ్యముగా నా కెప్పుడు భయము కలిగించుచుండెను. దానివలనహిందూ దేశములో నచ్చటచ్చట మతకలహములు వ్యాపించు నుపద్రవము కలదు. నేను దౌర్జన్యమునకు వెఱచునంతటి 'పిరికి హిందువు'ను కాను. కాని హిందూదేశములో విఘాతములను కల్పించుశక్తులింకను బలవత్తరముగ నున్నవని నేను భావించెదను. అచ్చటచ్చట బయలు దేరుదౌర్జన్యములు నిశ్చయముగ వాటికి మరింతబలము చేకూర్చును. సుశిక్షణ, జాతీయైక్యత నిర్మించువిధానము నది మరింత కష్టతరము చేయును. మతము పేరిట లేక స్వర్గముకొరకు ప్రజలు హత్యలొనరించుచో నట్టివారిని టెర్రరిష్టు దౌర్జన్యముల కలహాలుచేయుట చాల యుపద్రవకర విషయము. రాజకీయహత్యయేమో చెడ్డది. అయినను రాజకీయ టెర్రరిష్టును త్రిప్పవచ్చును, ఏలనన అతడు ప్రపంచ ప్రయోజనముకొరకు యత్నించుచున్నాడు. స్వార్థముకొరకుగాక జాతికొరకు పాటుపడుచున్నాడు. మతహత్య యనర్థమైనది. ఏలనన అది యితరప్రపంచమునకు సంబంధించినది. అట్టివిషయములను గురించి సహేతుకచర్చ కెవడును యత్నమునైనను చేయజాలడు. ఒకొక్కప్పుడీ రెంటిని విడదీయు రేఖ యనుమానాస్పదమై కొంచెమించుమించు మాయమగును.

చిటగాంగుహత్య, తత్ఫలితములు టెర్రరిస్టు చర్యలవలన కలుగు నుపద్రవములను కండ్లకుకట్టినట్లు స్పష్టపరచెను. అది భారత స్వాతంత్ర్యమునకు, ఐక్యతకు విపరీతనష్టము కలిగింపగలదని విదిత మయ్యెను. దానివెంటనే తీసికొనబడిన ప్రతీకారచర్యలు భారతదేశ

ములో ఫాసిస్టుపద్ధతులు ప్రారంభమైనట్లు తెలుపుచుండెను. అప్పటి నుంచి యిట్టి ప్రతీకారములు, ముఖ్యముగ వంగదేశములో, ననేకములు కలిగెను. యూరపియనులలోను, ఆంగ్లోఇండియనులలోను నిస్సందేహముగ ఫాసిస్టుసిద్ధాంతము వ్యాప్తిచెందెను. బ్రిటిషు సామ్రాజ్యతత్త్వము నాశ్రయించుకొని జీవించు కొందరు భారతీయులకుగూడ నిదియబ్బెను. టెర్రరిస్టులకుగూడ యీఫాసిస్టుదృష్టికలదు. కాని దానిదృష్టి వేరు. వారి జాతీయఫాసిజము యూరపియనుల యొక్కయు ఆంగ్లోయిండియనులయొక్కయు, కొంతమంది పైతరగతులలోని భారతీయులయొక్కయు సామ్రాజ్యపరమగు ఫాసిజము నెదుర్కొనును.

1931 నవంబరులో కొద్దిరోజులు నేను కలకత్తాలోనుంటిని. నా కూపిరి తిరుగని ప్రోగ్రాముండెను. వ్యక్తులను, సంఘములను యిష్టాగోష్ఠిగకలుసుకొనుచు నేననేకబహిరంగసభలలోనుపన్యసించితిని. ఈ యన్నిసభలలోను నేను టెర్రరిజమునుగురించి చర్చించి యదితప్పని వ్యర్థమని భారతస్వాతంత్ర్యమునకు హానికరమనిచూపయత్నించితిని. నేను టెర్రరిస్టులను తిట్టలేదు. తమ జీవితములో నెన్నడు ధైర్యసాహసకార్యములనుచేసిన పాపమునకుపోని మన 'యోధుల'వలెనేను వారిని 'పిరికివారని, పందలని' నామకరణము చేయలేదు. తనజీవితమును నిరంతరము నొడ్డుచున్న పురుషుని స్త్రీని పిరికివారని పిలుచుట నా కెప్పుడు హాస్యముగ కాన్పించును.

నేను కలకత్తాలో స్టేషనుకు పయనమగుచుండ నిద్దరు యువకులు నన్ను చూడవచ్చిరి. వారిరువదియేండ్ల తరుణవయస్కులు. ముఖములు పాలిపోయి యావేశపడుచున్నట్లుండెను. కండ్లు ప్రకాశమానముగ నుండెను. వారెవరో నే నెరుగను. కాని వారు వచ్చినపని నాకు వెంటనే తెలిసిపోయెను. టెర్రరిస్టుల దౌర్జన్యమునకు వ్యతిరేకముగ నేను చేసిన ప్రచారమునకు వారికి నాపై కోపముగలిగెను. అది యువకులపై చెడుఫలితములను కలుగచేయుచున్నదని, నే

విల్లభ్యాంతరములను కలిగించుట సహింపజాలమని వారనిరి. మేము కొద్దివాదనకు దిగితిమి. నేను వెళ్ళవలసిన సమయము సమాసన్నమగుటచే అది తొందరగ ముగింపబడెను. మా కంఠములు, మా ఆవేశములు హెచ్చుచుండెను. నేను భయపడితిని. నేను వారికి కొన్ని కఠిన మాటలను చెప్పితిని. వారిని విడిచి వెళ్ళిపోవుపుడు టికెటును తిన్నగా నడుచుకొనకపోయినచో నితరులకు చూపబడిన మర్యాదయే వారికును చూపబడునని నాకు నన్ను కడసారి యదలించిరి.

నేను కలకత్తా విడిచితిని; రైలులో రాత్రి పడుకొనియుండగా నా యువదళబాలుర యుద్రేకపూరిత ముఖములు చాలసేపు నన్ను వెంటాడించెను. చైతన్యము, శక్తి, మూర్తీభవించినట్లుండెను. యుక్తమార్గములో పనిచేసినచో నా కెంతటి యమూల్యరత్నములు! వారి నంత తొందరగ మోటుగ పంపివేసితినే! నేను వారితో దీర్ఘ సంభాషణ జరుపకపోతిని. భారతదేశమును, దాని స్వేచ్ఛను సేవించు విధము తమ కీర్తివంతములగు యౌవనజీవితముల నర్పించునట్లు బహుశః నేను వారి నొప్పించగలిగి యుండెడివాడను.

అది డిసెంబరు మాసము. రెండవ రైతుసభ అలహాబాదులో జరిగెను. తరువాత హిందూస్థాన సేవాదళాధిపతియైన డాక్టరు యన్. యస్. హార్డికరుకు నేను చేసిన చిరవాగ్దానమును నెరవేర్చుటకు కర్నాటకమునకు పయనించితిని. జాతీయోద్యమ యైచ్ఛికభటశాఖయైన సేవాదళము, ఆ సంస్థ ప్రత్యేకము వేరుగ నున్నను, మొదటి నుండియు కాంగ్రెసు సహాయసంస్థగనే యుండెను. అయినను 1931 వేసవిలో వర్కింగుకమిటీ దానిని పూర్తిగ కాంగ్రెసుసంస్థలో కలుపుకొనుటకు నిశ్చయించెను. దానిని కాంగ్రెసు వాలంటీరు శాఖగ చేయకోరిరి. వారట్లుచేసి హార్డికరును నన్ను దాని యధికారులను చేసిరి. ఈ దళముయొక్క ప్రధానస్థానము హుబ్లీలో యుంచబడెను. హార్డికరు నన్నాప్రదేశమును సందర్శింప ప్రోత్సహించెను. కర్నాటకములో కొద్దిరోజులు యాత్రచేసితిని. ప్రతిచోట ప్రజల యద్భుతో

త్సాహమునకు నే నాశ్చర్య చకితుడనైతిని. నేను తిరిగివచ్చునపుడు త్రోవలో సైనికశాసనకీర్తి నార్జించిన షోలాపురమును దర్శించితిని.

కర్నాటకయాత్ర నాకు వీడ్కోలు యాత్ర యయ్యెను. నా యుపన్యాసములు కటువుగ గానరసములేకయున్నను మృత్యుగానము వలె నుండెను. యు.పి.నుండి నిశ్చయవార్తలేతెంచెను. ప్రభుత్వము జేగంట మ్రోగించిరి. అలహాబాదునుండి కర్నాటకము పోవునపుడు నేను కమలనుతీసికొనిబొంబాయి వెళ్ళితిని. ఆమెకుతిరిగిజబ్బుచేసెను. బొంబాయిలో నేనామె చికిత్స కేర్పాట్లు చేసితిని. మేముఅలహాబాదు వీడివచ్చిన వెంట నేభారతప్రభుత్వమువారు యు.పి.కిప్రత్యేకఆర్డినెన్సు ప్రసాదించిరని బొంబాయిలో వింటిమి. గాంధీజీ యిదివరకే సముద్ర ప్రయాణముచేయుచు త్వరలో బొంబాయి రానున్నను నా రతని రాకకొఱకు వేచియుండదలచుకొనలేదు. ఆయార్డినెన్సువ్యవసాయి కాందోళన నణచుటకేయుద్దేశింపబడినట్లు చెప్పబడెను. కాని యది దిగంతవిశ్రాంతమై యున్నంటిని యావరించి యెట్టిరాజకీయ, లేక ప్రజాకార్యములనుకూడ సాధ్యము కాకుండచేసెను. అనిబిడ్డలు, పెద్దల యొద్దిలోనుండు పిల్లలుచేయు పాపములకు తల్లిదండ్రులను, సంరక్షకులనుకూడ శిక్షించుటకేర్పాట్లుచేసెను.ఇది పురాతన బైబిలు లోని యాచారమునకు తల్లక్రిందులు.

నేను కర్నాటక యాత్రను కట్టిపెట్టి అలహాబాదు తిరిగివెళ్లుట కాతురపడుచుంటిని. యు. పి. లో నా సహచరులతో నుండుటయే నాధర్మమని నేనుభావించితిని. నారాష్ట్రములో కొంపలు కూలిపోవుచుండ నెచ్చటనో దూరములోనుండుట యగ్నిపరీక్షవలె నుండెను. అయినను నేనుకర్నాటకప్రోగ్రాముకు బద్ధుడనగుటకేనిశ్చయించితిని. నేను బొంబాయితిరిగివచ్చుసరికి కొందరుస్నేహితులు గాంధీజీవచ్చు వరకు నన్నచ్చటనే యుండమనిరి. అతడుసరిగా నొక్కవారములో రానైయుండెను, కాని యిది యసంభవమయ్యెను. పురుషోత్తమదాసు టాండను మొదలగువారు నిర్బంధింపబడిన వార్తలు అలహాబాదు నుండి వచ్చెను. పయిగా మా రాష్ట్రకాన్ఫరెన్సు యిటావాలో నా

కాని నేను అలహాబాదు చేరకమునుపే మా యధ్యక్షుడైన షెర్వానీకి యు. పి. ప్రభుత్వమునుండి ఖండితమైన సందేశ మొకటి వచ్చెను. అది మా కాన్ఫరెన్సు వ్యావసాయిక సమస్యను చర్చించునాయని ప్రశ్నించెను. అది యట్లుచేయుచో ప్రభుత్వము వారా కాన్ఫరెన్సనే నిషేధించెదరు. రాష్ట్రమునంతను ఆందోళనపరచుచున్న వ్యావసాయిక సమస్యను చర్చించుటయే కాన్ఫరెన్సు యొక్క ప్రధానప్రయోజనమని విదితమగుచున్నది. సభ జరిపి దానిని గురించి చర్చింపకుండుటకంటె హాస్యము వేరులేదు. అది మనకు మనమే మూఢులమని చెప్పుకొనుటయగును. ఏది యెట్లున్నను, మన యధ్యక్షునకు లేక మరెవరికి కాన్ఫరెన్సును బంధించుట కెట్టి యధికారములేదు. ప్రభుత్వమువారి జడిపింపులతో సంబంధము లేకుండగనే కాన్ఫరెన్సు మరియొక తేదీకి మార్చవలెనని మాలో కొందర ముద్దేశించుచుంటిమి. కాని యీజడిపింపు కొంతయలజడికి కారణమయ్యెను. ఇట్టివిషయములలో [మాలోచాలమంది పెంకితల కాయలను గలవారు] ప్రభుత్వముచే శాసింపబడుట యనుభావము వెగటుగనుండెను. చాలకాలము చర్చించినతరువాత మేము మా యభిమానమును దిగమ్రింగుటకు నిశ్చయించుకొని కాన్ఫరెన్సును మరియొక తేదీకి మార్చితిమి. ఏమి జరిగినను జరుగుగాక! గాంధీజీ వచ్చువరకు పోరాటము లేకుండ [అదియిదివరకే ప్రారంభింపబడెను] చేయుటకే మేమట్లు చేసితిమి. రాయబారము జరుపుట కశక్యమగు పరిస్థితులలో నతనిని పెట్టుటకు మాకిష్టములేకుండెను. మేము రాష్ట్ర కాన్ఫరెన్సునాపివేసినను యిటవాలో పోలీసు, మిలటరీ బ్రహ్మాండమగు ప్రదర్శనమునుజరిపెను. కొంతమంది తెలియకవచ్చిన ప్రతినిధులు అరెస్టుచేయబడిరి. అచ్చటనున్న స్వదేశీ ప్రదర్శనశాలను మిలటరీవారు జయప్రదముగ పట్టుకొనిరి.

షెర్వానీ నేను డిసెంబరు 26 వ తేదీ యుదయము అలహాబాదు వీడి బొంబాయివెళ్ళుటకు నిశ్చయించితిమి. యు. పి. పరిస్థితులను గురించి చర్చించుటకు షెర్వానీ, వర్కింగుకమిటీ మీటింగుకు

ప్రత్యేకముగ నాహ్వానింపబడెను. అలహాబాదు పట్టణము విడకూడ
దని మాయిరువురకైనను ఆర్డినెన్సు క్రింద ఆర్డర్లు అమలుజరుప
బడెను. అలహాబాదుజిల్లాగుండా గ్రామప్రాంతములలోను, మరి
కొన్ని యు.పి. జిల్లాలలోను పన్నులను చెల్లింపకుండు చర్యల నెదు
ర్కొనుటకే ఆర్డినెన్సు యుద్దేశింపబడినదని చెప్పబడెను. ఈ గ్రామ
ప్రాంతములకు పోకుండ ప్రభుత్వమువారు నన్నడ్డుపెట్టుట యత్నము
చేసికొనుట సులభము. కాని యీ వ్యవహారముకాందోళనమును
మేము బొంబాయి మహాపట్టణములో చర్చింపజాలమనుట సువిది
తము. ఆర్డినెన్సు నిజముగా నొక్క వ్యవసాయిక పరిస్థితులకొరకే
యుద్దేశింపబడినదో, రాష్ట్రమునుండి వెళ్ళిపోవుచున్నందులకు మమ్మభి
నందింపవలసియుండెను. ఆర్డినెన్సు ప్రకటింపబడినది లగాయతు
స్వరక్షణమే మా సాధారణనీతిగ నుండెను. అప్పటప్పటవ్యక్తులు
ఆర్డరులను ధిక్కరించినను మేము దానితో తలపడుట కిచ్చగింపలేదు.

యు.పి. కాంగ్రెసువారుకూడ ప్రభుత్వముతో పోరాటము
లేకుండనుండవలెనని లేక ప్రస్తుతమునకు నాపివేయవలెనని కోరు
చుండిరి. గాంధీజీ వర్కింగుకమిటీ యీ విషయములను గురించి
చర్చింపనున్న బొంబాయిపట్టణమునకు షెర్వానీ, నేను వెళ్ళు
చుంటిమి. వారి యంత్య నిర్ణయము లెట్లుండునో - నిశ్చయముగా నా
కేమియుగూడ తెలియదు.

ఈ యన్ని కారణములచే మేము బొంబాయి వెళ్ళుట కభ్యం
తరముండదని నేను భావించితిని. ప్రవాసమును విధించిన ఆర్డరును
సాంకేతికముగ నుల్లంఘించినందులకు ప్రభుత్వమువారు తాత్కాలిక
ముగ నైనను సహించెదరనుకొంటిని అయినను నాయంతరాత్మ మరి
యొకవిధముగ చెప్పుచుండెను.

మేము రైలెక్కుటతోడనే ప్రాతఃకాలపత్రికలలో సరిహద్దు
రాష్ట్రక్రొత్తఆర్డినెన్సునుగురించియు, అబ్దుల్ గఫర్ఖాను, డాక్టరుఖాను
సాహెబు మొదలగువారియరెస్టులనుగురించియు చదివితిమి. ఇంతలోనే
మాబండి బొంబాయి మైలు, ఇరదత్ గంజియను నొకమారు

మూల స్టేషనులో నకస్మాత్తుగా నిలిచిపోయెను. ఇదిసాధారణముగ మెయిలు ఆగు ప్రదేశముకాదు. ఇంతలో పోలీసు అధికారులు మమ్మరెస్టుచేయుటకు వచ్చిరి. రైల్వేలైనుప్రక్కనొక బ్లేక్ మేరియా మా కొరకు వేచియుండెను. షెర్వానియు, నేనును కట్టుదిట్టముగ మూసివేయబడిన యీ ఖయిదీలబండిలో నెక్కగానే యదిమమ్ము నైనీలో దింపివేసెను. కిష్టమసు బహుమానములనిచ్చు యీ రోజు ప్రాంతఃకాలమున నమ్మరెస్టుచేసిన పోలీసుసూపరింటెండెంటు, ఒక ఆంగ్లేయుడు, గుజ్జగను విచారముగను కాన్పించెను. పాపము మే మతని క్రిష్టమసు పండుగను పాడుచేసితిమను కొనెను!

తిరిగి ఖయిదుకు సిద్ధము!

# 41

## అరెస్టులు, ఆర్డినెన్సులు, నిషేధములు

మా అరెస్టులు జరిగిన రెండురోజులకు గాంధీజీ బొంబాయి చేరెను. చిట్టచివరజరిగిన విపరీతములన్నియు నతని కప్పుడే తెలిసెను. అతడు వంగదేశపు ఆర్డినెన్సునుగురించి లండనులోనే విని తెల్లబోయెను. ఇప్పుడతనికి యు.పి., సరిహద్దురాష్ట్రముల ఆర్డినెన్సులు నూతనక్రిస్మసుప్రసాదము. ఈ రెండురాష్ట్రములలో నతనియత్యంత సన్నిహిత సహోద్యోగులు కొందరు నిర్బంధింపబడిరి. కథ ప్రారంభమయ్యెను. శాంతికుదురునను యాశలన్నియు నడుగంటెను. అయినను దుస్థితినుండిబయటపడుమార్గముకొఱ కతడొకయత్నముచేసెను. వైస్రాయి విల్లింగ్డను ప్రభువును చూడకోరెను. యతనికి కొన్ని షరతులు తెలియజేయబడెను. వంగ, యు.పి., సరిహద్దు రాష్ట్రములలో జరిగిన సంగతులుగురించి క్రొత్త ఆర్డినెన్సులు వాటిక్రింద జరిగిన అరెస్టులనుగురించి యతడు చర్చింపకూడదట. భారతప్రభుత్వము కాంగ్రెసును పూర్తిగా చూర్ణముచేయ నిశ్చయించిన ట్లిప్పు డద్దము కట్టినట్లుకాన్పించుచుండెను. కాంగ్రెసుతో వా రెట్టిసంబంధము పెట్టుకొనదలంచలేదు. వర్కింగుకమిటీకి శాసనోల్లంఘనముతప్ప మరే మార్గము కాన్పించలేదు. వా రేనిమిషమందైన నరెస్టు కావచ్చునని భావించి బలవంతముగా నీడ్చుకొనిపోబడుటకు పూర్వము, దేశమున కొక త్రోవచూపగోరి శాసనోల్లంఘనతీర్మానము నామోదించిరి. వైస్రాయినిచూచుటకు గాంధీజీ మరియొక యత్నముచేసెను. ఎట్టి షరతులులేకుండ దర్శన మిప్పించవలసినదని యతడు వైస్రాయికి రెండవ టెలిగ్రాము పంపెను. దీనికి గాంధీజీ కాంగ్రెసు అధ్యక్షుల అరెస్టే ప్రభుత్వజవాబు. దేశమునంతను ముంచివేయు భయంకర నిర్బంధకీలకమును నొక్కుటయే దీనికీయబడిన ప్రత్యుత్తరము, ఇతరులెవరు పోరాటము కోరినను కోరకపోయినను ప్రభుత్వముదానికాతురపడుచు సర్వసిద్ధముగ నున్నట్లు విదితమగుచున్నది.

మేము జయిలులోనుంటిమి. ఈ వార్తలు మా కస్పష్టముగ నసంబద్ధముగ వచ్చుచుండెడివి. మా విచారణ నూతన వత్సరమునకు వాయిదా వేయబడెను. విచారణలోనున్న ఖయిదీలము కనుక శిక్షింపబడిన వారికంటె మా కెక్కువ బంధుదర్శన భాగ్యము లభించుచుండెను. వైస్రాయి దర్శనమీయ నంగీకరింపవలెనా కూడదా యను జరుగు రాద్ధాంతసిద్ధాంతములను మేము వినుచుంటిమి. ఈ దర్శనసమస్యయే తదితర విషయముల నన్నింటిని కప్పివేయుచుండెను. ఇర్విన్‌ప్రభువు దీనికంగీకరించెడివాడనియు నతడు గాంధీజీని కలుసుకొనినచో సంతోషము చక్కబడియుండెడిదనియు చెప్పబడుచుండెడిది. భారతపత్రికలు యదార్థములను నిర్లక్ష్యముచేసి, పరిస్థితుల నతిస్థూలదృష్టితో చూచుచుండుట నా కాశ్చర్యము కలిగించెను. భారతజాతీయతకు బ్రిటిషుసామ్రాజ్యతత్త్వమునకుగల విధాయిక సంగ్రామము-బాగుగతర్కించి చూచినచో రెండు పరస్పర విరుద్ధతత్త్వములు-వ్యక్తులు యిష్టాయిష్టములకు జోహారు చేయునా? రెండు చారిత్రికశక్తుల పోరాటము మందహాసములచేతను, పరస్పర మర్యాదలచేతను తీరిపోగలదా? గాంధీజీ బలవంతముగా నొకమార్గము త్రొక్కవలసివచ్చెను. భారతజాతీయత ఆత్మహత్యచేసికొనజాలదు. లేక ప్రధానవిషయములలో నది బుద్ధిపూర్వకముగ విదేశీయులచే శాసింపబడ నిచ్చగింపదు. ఈ జాతీయసవాలు నెదుర్కొని, బ్రిటిషు ప్రయోజనములను కాపాడ యత్నించుటకు హిందూదేశ వైస్రాయి మరియొకవిధముగ సంచరింపవలెను. ఆ సమయమున వైస్రాయి యెవరైననేమి! ఇర్విన్‌ప్రభువు సరిగా తూచా తప్పకుండ విల్లింగ్డను ప్రభువుచేసినట్లే చేసియుండెడివాడు. వారిరువురు సామ్రాజ్య నీతి కుపకరణములే. ఇర్విను ప్రభువు తరువాత బ్రిటిషుప్రభుత్వములో నొకసభ్యుడయ్యెను. అతడు భారతదేశములో ప్రభుత్వముతీసికొనిన చర్యలతో సంపూర్ణముగ నేకమయ్యెను. భారతదేశ బ్రిటిషునీతికి వ్యక్తులైన వైస్రాయిలను నిందించుట లేక భూషించుట చాల యప్రయోజకమైనపని, యదార్థసమస్యలు మనకు తెలియకపోవుటచేతను

లేక బుద్ధిపూర్వకముగ మనము వాటిని తప్పించుకొనుట చేతను మనమిట్టి వినోదమును కలవరిచితిమి.

1932 జనవరి నాల్గవ తేదీ స్మరణీయమైన దినము. అది చర్చలను వాదమును కట్టిపెట్టించెను. ఆరోజు ప్రాతఃకాలమున గాంధీజీ, కాంగ్రెసు అధ్యక్షులైన వల్లభాయిపటేలు అరెస్టుచేయబడి డిటెన్యూలుగ నుంచబడిరి. మేజిస్ట్రేటులకు పోలీసుయుద్యోగులకు చాల యధికారములనిచ్చు నాలుగు క్రొత్త ఆర్డినెన్సులు సృష్టింపబడెను. పౌరసత్వములు నశించెను. అధికారులు మనిషిని ఆస్తిని పట్టుకొనవచ్చును. అది భారతదేశమంతయు ముట్టడింపబడిన ప్రకటనవలె నుండెను. దాసత్రవ్రత, వ్యాప్తి స్థానికాధికారుల వివేకమునకు విడిచి వేయబడెను.

జనవరి నాల్గవ తేదీనే యు. పి. ఎమర్జెన్సీపవర్సు ఆర్డినెన్సు క్రింద మా విచారణ నైనీజయిలులోనే జరిగెను. షెర్వానీ కారు మాసములు కఠినశిక్ష, 150 రూపాయలు జుల్మానా. నాకు రెండేండ్ల కఠినశిక్ష 500 రూపాయలు జుల్మానా. మే మొకేనేరము చేసితిమి. అలహాబాదు పట్టణములో నుండవలెనను నొకే ప్రవాస ఆజ్ఞ మా పయి నమలుజరిపిరి.

మే మిరువురము నాటి నొకేమాదిరిగ నుల్లంఘించితిమి. మమ్ము నొకేసెక్షనుక్రింద అరెస్టు, విచారణచేసిరి. అయినను మా శిక్షలుమాత్రము వివిధములుగనుండెను. ఒక భేదముమాత్ర ముండెను. ఆజ్ఞనుల్లంఘించి బొంబాయి వెళ్ళుయుద్దేశ్యముతోనున్నానని నేను జిల్లా మేజిస్ట్రేటుకు వ్రాసితిని. షెర్వానీ అట్టిలాంఛనము దేనిని జరుపలేదు. కాని యతనిప్రయాణముకూడ నందరికి తెలిసిన విషయమే. అది పేపరులలోకూడ తెలుపబడెను. శిక్షవిధించుట తోడనే షెర్వానీ, విచారణచేసిన మేజిస్ట్రేటును తన కట్టి తక్కువ శిక్ష విధించుట కులగౌరవముచేతనా యని ప్రశ్నింప మేజిస్ట్రేటు కంగారుపడెను. అచ్చటనున్న తదితరుల కది వినోదముగ నుండెను.

పరిపక్వమైన మా జననీ నాల్గునకేడను భారతదేశ మంతట ననేక ఘోరములు జరిగెను. మా కఠినవిరామపములలోనున్న అలహాబాదు పట్టణములోనే ప్రజాసమూహములకు పోలీసులతోను, మిలిటరీతోను సంఘర్షణ యేర్పడెను. కాల్పులతోను, యితర శరీర వైకల్యములతోను కూడిన మారణకాండలు లాఠీచార్జీలు జరిగెను. జయిళ్ళు శాసనోల్లంఘన ఖయిదీలతో నిండనారంభించెను. ప్రారంభములో నీ ఖయిదీలు జిల్లా జయిళ్ళకు వెళ్ళిరి. అవి పూర్తిగానిండిపోయిన తరువాత నైనీ మొదలగు పెద్ద సెంట్రలుజయిళ్ళు నింపబడుచుండెను. తరువాత యీ జయిళ్ళు నిండిపోవుటచే తాత్కాలిక క్యాంపుజయిళ్ళు స్థాపింపబడెను.

నైనీలోనున్న మా చిన్న యావరణలోనికి చాల తక్కువ మంది వచ్చెడివారు. నా పాతస్నేహితుడు, నర్మదాప్రసాద్, మమ్ము కలుసుకొనెను. రంజితపండితుడు మా పెత్తండ్రి కుమారుడు మోహనలాలు నెహ్రూ మాతోనుండిరి. ఆరవనెంబరు కోఠిలోనున్న మా చిన్నసోదరమండలిలోనికి మరియొక క్రొత్తసభ్యుడువచ్చి మా కాశ్చర్యము కలిగించెను. సయ్యదు ఆల్ విహార్ సింహళమునుంచి వచ్చిన తరుణవయస్కుడు. అతడు బారిష్టరుపరీక్ష పూర్తిచేసి యింగ్లండునుండి యప్పుడే వచ్చెను. మా యుత్సవములలో చేరవలదని నా సోదరి యతనితో చెప్పెను. కాని యుత్సాహము పట్టజాలక నత డొక కాంగ్రెసు యుత్సవములో పాల్గొనెను. వెంటనే యతడు మావద్దకు తీసుకొనిరాబడెను.

కాంగ్రెసు అక్రమసంఘమని ప్రకటింపబడెను. పయినున్న వర్కింగుకమిటీ, రాష్ట్రికమిటీలు, అసంఖ్యాకములగుస్థానికకమిటీలు— అన్నియు నక్రమసంఘములయ్యెను. కాంగ్రెసుతోపాటు — కిసాను సభలు, రయితు యూనియనులు, యువజనసంఘములు, విద్యార్థుల సంఘములు, అభివృద్ధిలోనున్న రాజకీయ సంస్థలు, జాతీయ విశ్వ విద్యాలయములు, పాఠశాలలు, ఆస్పత్రులు, స్వదేశీవ్యాపారములు, లైబ్రరీలు— మొదలగు కాంగ్రెసు అభిమానముకలిగినట్టి, లేకముందంజ

చేయుచున్నట్టి యనేకసంస్థలు అక్రమసంఘము లయ్యెను. నిశ్చయముగ నీ లిస్టులు చాల హెచ్చుగనుండి ప్రతి పెద్దరాష్ట్రములోను వందలకొలది పేర్లు కలిగియుండెను. భారతదేశ మొత్తపుసంఖ్య కొన్ని వేలమీద నుండవలెను. అక్రమములుగ ప్రకటింపబడిన యీ సంస్థలసంఖ్యయే కాంగ్రెసుయొక్కయు, జాతీయోద్యమము యొక్కయు శక్తిని చాటుచున్నది.

నా భార్య వ్యాధిగ్రస్తురాలై మంచముపట్టి శాసనోల్లంఘనోద్యమములో నురకజాలనందులకు ఖేదపడుచు బొంబాయిలో పడియుండెను. నా తల్లియు, నిరువురు చెల్లెండ్రును యావచ్ఛక్తితో నుద్యమములో నురికిరి. తోడనే నా చెల్లెండ్రిరువురు నొక్కొక్క వత్సర శిక్షతో జయిలులో ప్రవేశించిరి. జయిలుకు క్రొత్తగావచ్చిన వారివలన మాకు చిన్న చిన్న వార్తలు తెలియుచుండెను. మా కొసంగబడిన స్థానికవారపత్రికవలనకూడ కొన్ని వార్తలు తెలియుచుండెను. వార్తలు కఠినముగ నరికట్టబడుచుండుటచే నేము జరిగినవాటినిగురించి యెక్కువగ నూహింపవలసి యుండెను. వార్తాపత్రికలు, ఏజన్సీలు పెద్ద పెద్ద జుల్మానాల కెప్పుడు భయపడుచుండవలెను. భయపడుచుండెను. కొన్ని రాష్ట్రములలో నిర్బంధింపబడినవాని పేరు లేక శిక్షింపబడినవాని పేరు నుదహరించుట కూడ నేరమయ్యెను.

కనుక మేము బాహ్యపోరాటమునకు దూరులమై నైనీ జయిలులో కూర్చుంటిమి; అయినను శతవిధముల వానినిగురించి తలపోయుచుంటిమి. నూలువడుకుట, పుస్తకములను చదువుకొనుట, యితరపనులు చేయుచుండుట;ఒకొక్కప్పుడితరవిషయములనుగురించి మాట్లాడుకొనుట, కాని యెల్లప్పుడును జయిలుగోడ వెలుపల జరుగుచుండుదానిని గురించి యోచించుట-యిట్లు కాలమును పుచ్చుచుంటిమి. మేము యుద్యమము వెలువలనున్నను అందులోనే యుంటిమి. ఒకొక్కప్పుడు ఫలానిది జరుగునని యనుకొనుటవలన నెక్కువయలసటకలిగెడిది; లేక యేదో తప్పు జరుపబడెనని కోపము

కలిగెడిది; దుర్బలత్వముపట్ల లేక నైచ్యముపట్ల విసుగుజనించెడిది. ఒక్కొక్కప్పుడు మేమతియుదాసీనులమైయుండి రంగమును ప్రశాంతముగ నుద్రేకరహితముగ చూడగలిగెడివారము. బ్రహ్మాండమైన శక్తులుపనిచేయుచున్నపుడు, దైవయంత్రములు మనుష్యులను పిండిచేయుచున్నపుడు చిన్న చిన్న వ్యక్తిగతప్రమాదములను, దుర్బలత్వమును మన మంతగా లెక్కచేయరాదని మేము భావించెడివారము. పోరాటమునుగురించి, ధైర్యోపేతమగు యుత్సాహమును గురించి, క్రూరమగు నిర్బంధములనుగురించి, విషాదకరమగు పిరికితనమును గురించి, రేపేమి వినవచ్చునోయని మేమాశ్చర్యపడెడివారము. ఇదియంతయు నెచ్చటకు గొంపోనున్నది? మన మెచ్చటకు పోవనున్నారము? భవిష్యత్తు తెరమరుగున నున్నది. అది యట్లుండుట మంచిది. మాకు సంబంధించినంతవరకు వర్తమానముకూడ కొంతవరకు తెరమఱుగుననే యుండెను. కాని పోరాటము, బాధ, త్యాగము తప్పవను సంగతి మాత్రము మాకు తెలియును.

# 42

## అధికారుల హుంకారములు

1942 తొలిమాసములు బ్రిటిషుఅధికారుల హుంకారప్రదర్శనములకు ప్రఖ్యాతివహించెను. పెద్దయధికారులు, చిన్నయధికారులు కూడ తాము నిర్దోషులుగ శాంతులుగ నుండిరనియు కాంగ్రెసుపోరాటమునకు దిగెననియు, పాపముచేసెననియు చాటనారంభించిరి. వారు ప్రజాస్వామికమును సమర్థించుచుండె కాంగ్రెసు డిక్టేటరుల నభిమానించుచుండెను. దానియధ్యక్షుడు డిక్టేటరని పిలువబడుట లేదా? తమ పవిత్ర కార్యోత్సాహములో ఆర్డినెన్సులు, అన్నివిధములగు స్వేచ్ఛలను అరికట్టుట, వార్తాపత్రికల ముద్రణాలయముల మూతలనుకట్టివేయుట, విచారణలేకుండగనే ప్రజలను ఖయిదుచేయుట, ఆస్తులను ధనమును లాగుకొనుట – ప్రతిదినము జరుగునట్టి యనేక 'స్వల్పహింసము' లను వారు మరచిపోయిరి. వారు భారతదేశములోని బ్రిటిషుప్రభుత్వ ప్రధానలక్షణముకూడ మరచిపోయిరి. ప్రభుత్వమంత్రులు (మనదేశీయులే) నెల కేకొద్దివేల రూపాయల స్వల్పజీతములతోనో ప్రజాహితముకొఱకు పడజాలనిపాట్లు పడుచుండ కాంగ్రెసువారు 'కత్తులను నూరుచున్నారు'–జయిళ్ళలో–అని చాటుచుండిరి. క్రిందికోర్టు మేజిస్ట్రేటులు మాకు పెద్దపెద్ద శిక్షలను విధించుటకాక తా మట్లు చేయుసందర్భంలో మా కుపన్యాసముల నిచ్చెడివారు. ఒకొక్కప్పుడు కాంగ్రెసును, దానికి సంబంధించిన వ్యక్తులను దూషించెడివారు. సర్. సామ్యూల్ హోరు కూడ, తన యత్యున్నత భారతదేశకార్యదర్శిపదవియొక్క చలింపని యౌన్నత్యమునుండి 'కుక్కలు మొఱుగుచున్నను మా రథము సాగుచునే యున్నది' యని ప్రకటించెను. అతడా నిమిషమున కుక్కలు జయిలులోనున్నవనియు, నవి యచ్చట సులభముగా మొఱుగజాలవనియు, బయటనున్నవాని మూతులు గట్టిగా బిగింపబడెననియు మరచిపోయెను.

అన్నిటికంటె చిత్రమేమన కాన్పూరులో జరిగిన కులకలహములు కాంగ్రెసువలననే జరిగినవనిరి. భయంకరమైన యీ కలహములలోని భయోత్పాతమంతయు వెల్లడిచేయబడి కాంగ్రెసు దీని

కంతకు బాధ్యురాలని పదేపదే చెప్పబడెను. యదార్థమునకు కాంగ్రె సాక్షే ఈసందర్భములో యోగ్యముగా ప్రవర్తించెను. తన యుత్తమోత్తమపుత్రులలో నొకని నామె ఇందులో బలియొసగ్గెను. కాన్పూరులోని ప్రతిసంఘమును, కులమును నతనినొకను పరితపించెను. ఈ కలహమునుగురించి వినుటతోడనే కరాచీకాంగ్రెసు సభ యొక విచారణ కమిటీని నియమించెను. ఈ కమిటీ సమగ్రవిచారణ సలిపెను. అనేక నెలలు కష్టించి పనిచేసినతరువాత నదియొక పెద్దని వేదికను ప్రకటించెను. ప్రభుత్వము దీనిని తోడనే నిషేధించెను. అచ్చుప్రతులుపట్టుకొనబడి తగులపెట్టబడెను. ఒక పరిశోధనయొక్క ఫలితముల నణచివేయుటకు చేయబడిన యీ ప్రయత్నము అధికారవిమర్శకులును, బ్రిటిషు యాజమాన్యముక్రిందనున్న పత్రికలును కాంగ్రెసువలననే యీ కలహములు కలిగెనని మాటిమాటికి చేయు నిందలను నాపింపనయ్యెను. నిశ్చయముగ నీ విషయములోను, యితరవిషయములలోనుసైదకు నిజమేజయింపగలదు. కానియొక్కొక్కప్పుడసత్యము చిరకాలము జీవించును. 'అసత్యముచేయవలసిన పనిసంతయు చేసినతరువాత నశించును. సత్యము అమోఘమైనది. గొప్పది. అది జయించును. దాని జయాపజయములకొరకెవడును చూడనినాడది జయించును.'

హిందూదేశములో బ్రిటిషుయాజమాన్యమున నున్న ఆంగ్లోయిండియను వార్తాపత్రికలుకూడ నీహులంకారపువేటలో నత్యుత్సాహముతోచేరియవిచాలకాలమునుండిదోహదముచేసుకొనుచు, రహస్యముగ నణచియుంచుకొనిన, యనేకభావములను వెల్లడించెను. మామూలుగ నవి యేదేని చెప్పునపుడు కొంచెము జాగ్రత్తగ చెప్పవలెను. వీలనన వాటిపాఠకులలో చాలమంది భారతీయులు కలరు. కాని హిందూదేశములోని విషమస్థితి యీ నిగ్రహములన్నింటిని తుడిచిపెట్టి యందరిహృదయములను బహిర్గత మొనరించెను. భారతదేశములో ఆంగ్లోయిండియను పత్రికలు చాల తక్కువ; ఒకటి తరువాతనొకటిగ నవి పడిపోయెను. మిగిలినవాటిలో చాలపత్రికలు, అవి యిచ్చువార్తలలోనేమి, సాధారణ రూపలావణ్యములలోనేమి

యుత్తమజాతికి చెందిన పత్రికలు, ప్రపంచవ్యవహారములను గూర్చిన
వాటిప్రధానవ్యాసము లెప్పుడును కన్సర్వేటివ్ దృష్టిలోనేయున్నను,
సమర్థములై, జ్ఞానమును గ్రహించుశక్తిని వెల్లడిచేయును. నిస్సందేహ
ముగ వార్తాపత్రికల దృష్టిలో నవి భారతదేశములో నత్యుత్తమ
మైనవి. కాని భారతదేశ రాజకీయ సమస్యలలో నవి యేకపక్షముగ
పడిపోవును. వాటి నవి మాన్యప్రకారము పక్షపాతబుద్ధితో
మానవుల పరస్పరసమయములలో నిష్పక్షపాతబుద్ధి తఱచు చిన్నా
భిన్నమై, విచ్ఛిన్నమై మారిపోవును. అవి భారతప్రభుత్వమునకు కడి
విశ్వాసముగ ప్రాతినిధ్యము వహించెను. ప్రభుత్వముతో జతకలిసియు
నిరంతరప్రచారము పిలువని పేరంటమువలె నుండును.

ఈ కొద్ది ఆంగ్లోయిండియను వార్తాపత్రికలతో పోల్చిచూచి
నచో భారతవార్తాపత్రికలు సాధారణముగ పేలవములు. వాటికి తగి
నంత ద్రవ్యముండదు. వాటియజమానులకు వానినభివృద్ధి చేయవల
యనెడిబుద్ధి. యత్నము నుండదు. వాటినిత్యజీవితమే కష్టతరము. దుర
దృష్టవంతులగు సంపాదకీయశాఖకు శాంతియుండదు. వాటియంద
చందములుగూడ దరిద్రముగనే యుండును. తఱచు వాటిలో చేయబడు
యడ్వరుటైజుమెంటులు చాలనిషిద్ధముగనుండును. జీవితములపట్ల రాజ
కీయములపట్ల వాటిసాధారణదృష్టి భావోద్రేకముగ, వెర్రిగనుండును.
మనము భావోద్రేకముగల జాతియగుటయే దీనికి కొంత కారణమని
నేననుకొనెదను. మనము వ్రాయుభాష (ఇంగ్లీషు వార్తాపత్రికల
సంగతి) విదేశభాషయగుటచే సరళముగ శక్తివంతముగా వ్రాయుట
సులభముకాదు. కాని యదార్థకారణమేమనగ చిరదాస్యముచేతను,
నిర్బంధములచేతను మన మనేక నిమ్నోన్నతభావములచే బాధ
పడుచున్నారము. కనుక నేమాత్రము సావకాశము చిక్కినను భావో
ద్రేకము పొర్లుచుండును.

భారతీయుల యాజమాన్యములోనున్న యింగ్లీషు వార్తాపత్రి
కలలో హిందూపత్రిక బహుశః నన్నింటికంటె నుత్తమమైనది. అది
నాకెప్పుడును మర్యాదకు నౌచిత్యములకు మూర్తియగు వృద్ధకన్యకను
జ్ఞప్తికి తెచ్చును. ఆమె యెదుట నెవరేని యొక్క కఠినపదము నుప

యోగించుచో నది మామెకు వజ్రపాతమువలె నుండును. అది ముఖ్యముగా బూర్జువాజాతికి చెందిన పత్రిక. దానిజీవితము సుస్థిర మయ్యెను. జీవితములోని దుఃఖమయమనుభవము, జీవితపోరాటము కష్టపరంపరలు దానికేమియు లేవు. మితవాదదృష్టికల యనేక యితర పత్రికలకును 'యీవృద్ధకన్యా' ప్రమాణముకలదు. అవి హిందూ పత్రికకున్న యాధిక్యతలేకుండ దానిని సాధించును. తత్ఫలితముగ నవి యన్నివిధముల చాల చప్పగనుండును.

ప్రభుత్వమువారు చాలకాలముక్రిందనే తమపిడికిలిని సిద్ధము చేసికొనియుంచిరి. వారుగుక్క త్రిప్పుకొనుటకు వీలులేనట్లు వారిముష్టి నుపయోగింపగోరిరి. 1930 లో నది యెల్లప్పుడు క్రొత్తఆర్డినెన్సుల ద్వారా యంతకంత కధ్వాన్నమగుచుండినస్థితినరికట్టుటకుయత్నించు చుండెను. అప్పుడు కాంగ్రెసే ముందుకురుకుచుండెను. 1932 పద్ధతు లన్నియు వేరు. ప్రభుత్వమే కార్యరంగమునకు దిగెను. అఖిలభారత దేశమునకు, రాష్ట్రములకు చెందిన ఆర్డినెన్సుల గుదిక్రిందయూహింప దగిన ప్రతిఅధికారము ప్రసాదింపబడెను; తీసుకొనబడెను. సంస్థలు అక్రమసంస్థలుగ ప్రకటింపబడెను. భవనములు, ఆస్తులు, మోటారులు బ్యాంకిఅకౌంటులుపట్టుకొనబడెను. బహిరంగసభలు, ఉత్సవములు నిషేధింపబడెను. వార్తాపత్రికలు, ముద్రణాలయములు పూర్తిగా అదుపులో నుంచబడెను. 1930 లో వలెగాక గాంధీజీ యిప్పుడుశాస నోల్లంఘనమును తప్పించవలెననియే నిశ్చయముగ వాంఛించు చుండెను. వర్కింగుకమిటీ సభ్యులు చాలమంది యట్లే భావించు చుండిరి. వారిలో కొందరు, నాతోసహా, మాకెంత యిష్టము లేక పోయినను; పోరాటము తప్పదనియు, కనుకదానికి సిద్ధపడవలెననియు భావించితిమి. యు. పి. లోను సరిహద్దురాష్ట్రములోను యుద్రేకము హెచ్చుచుండుటచే ప్రజాహృదయము రానున్న పోరాటముపైకి మరలెను. కాని మొత్తముమీద మధ్యతరగతులవారు, విద్యార్థులు పోరాటమునుగురించి యోచించుటలేదు. గాంధీజీ వచ్చుటతోడనే యేదోవిధముగ నీ పోరాటము తప్పింపబడునని వారాశించిరి. వారి కోరికయే వారి కాభావములను కలిగించెను.

ఫలితముగ 1932 లో ప్రభుత్వమే పోరాటము ప్రారంభము చేసెను. కాంగ్రెసు సవాలును నాత్మరక్షణగా చేసికొనవలసియుండెను. చాలచోట్ల స్థానిక కాంగ్రెసునాయకులు ఆర్డినెన్సులను, శాసనోల్లంఘనము తెచ్చిపెట్టిన శీఘ్రపరిశాసనములచే ముట్టడింపబడినట్లయిరి. అయినప్పటికి కాంగ్రెసుపిలుపున కద్భుతమగు సమాధానము వచ్చెను. శాసనోల్లంఘనము చేయువారికి కొఱతయే లేకుండెను. నిశ్చయముగ 1932 లో బ్రిటిషు ప్రభుత్వముతో చేసిన శాసనోల్లంఘనము 1930 లో చేసిన దానికంటె గొప్పది యనుట కెట్టిసందేహము లేదని నేను భావించెదను. 1932 లో, ప్రజలెక్కువ సహనము జూపినను, వారత్యంత శాంతముగనున్నను ప్రారంభములో కలిగిన ప్రబోధ వేగము 1930 కంటె చాలతక్కువగ నుండెను. నే నయిష్టముగ యుద్ధములోనికి దిగినట్లుండెను. 1930 లో నొకవిధమగు కీర్తియుండెను. రెండేండ్లయిన తరువాత నది కొంచెము సన్నగిలెను. ప్రభుత్వము తనకున్న సర్వశక్తులతో కాంగ్రెసుపై బడెను. భారతదేశము కొంచెమించుమించు సైనిక శాసనముక్రింద జీవించెను. కాంగ్రెసుకు నిజముగా నేకార్యముచేయుటకు స్వేచ్ఛ, పట్టుదొరకనేలేదు. మొట్టమొదటిదెబ్బలే దానిని దానికిప్రధానపోషకులుగనున్న బూర్జువాజాతీయభిమానులను నిశ్చేష్టులను చేసెను. వారి బొక్కసములకు దెబ్బతగిలెను. శాసనోల్లంఘనములో జేరినవారు దాని కెట్టిసహాయము చేసిన వారు, స్వేచ్ఛను వారియావదాస్తిని పోగొట్టుకొనుట తథ్యమయ్యెను. యు. పి. లో నిది మాకంత బాధకరముగ కాన్పించలేదు. అచ్చట కాంగ్రెసు పేదవారి కాంగ్రెసు. కాని బొంబాయి మొదలగు మహాపట్టణములో నిది చాలవ్యత్యాసమును కలిగించెను. వర్తకజాతి కిది పూర్తియైన వినాశము. వృత్తులలోనున్నవారికి గొప్పదెబ్బ. కేవల మీ భయమే పట్టణములలో నున్న యాధునికతరగతులవారిని స్తంభింపజేయుచుండెను. రాజకీయ సంబంధము లేని యొక ధనవంతుడైన పిరికివర్తకుని సంగతి తరువాత వింటిని. దీర్ఘకాలశిక్ష, ఐదులక్షలరూపాయిల జుల్మానా విధించెదమని పోలీసువారతనిని భయపెట్టిరి. అట్టి జడిపింపులు చాలసామాన్య

మయ్యెను. అవి కేవలము శుష్కవాక్యములుగావు. ఏలనన పోలీసు లప్పుడు సర్వాధికారులు. జడిపింపులు కార్యరూపమునుదాల్చు సాదృశ్యములు, నిత్యము సంభవించుచునేయుండును.

ప్రభుత్వపద్ధతి కభ్యంతరము చెప్పుటకు ప్రతికాంగ్రెసువానికి హక్కుగలదని నేను భావించను. కాని యత్యంత దౌర్జన్యరహిత మైన యుద్యమముపై ప్రభుత్వము ప్రయోగించిన దౌర్జన్యము, జబరదస్తీ క్రియలు నేటి నాగరికప్రమాణమునుబట్టి చూచినను నిశ్చయముగ దూష్యములేయగును. మనము విప్లవచర్యకు గడంగి నపు డది యెంత దౌర్జన్యరహితమైనను ప్రతీకారముండి తీరును. మనము పడకటింట్లలో కూర్చొని విప్లవము కలుగచేయజాలము. కాని చాలమంది యుభయలాభములను కావలెనందురు. విప్లవపద్ధతు లలో దిగదలచుకొనువారు తమసమస్తము పోగొట్టుకొనుటకు సిద్ధపడ వలెను. కనుక ధనవంతులు, ఐశ్వర్యవంతులు చాల యరుదుగ విప్లవకారులగుదురు.

మోటారులు, బ్యాంకింగు అకౌంటులు. పట్టుకొనుటకు తగినయితరఆస్తులు వేసి ప్రజలసందర్భములో నితరపద్ధతుల నవలం బించవలసియుండెను. పోరాటముయొక్క నిజభారమంతయు వీరి మీదనే కలదు. ప్రభుత్వమువారు అన్నివిధములగు క్రూరపద్ధతుల నవలంబిలచుటవలన కలిగిన ప్రయోజనకరమైన యొకఫలితమేమనిన 'గవర్నమెంటురియనులు' అని పిలువబడు జాతివారు వీటివలన కార్యమునకు పురికొల్పబడిరి. వారిలో కొంతమంది నూతనముగ కాంగ్రెసుతో స్నేహముచేసికొన నారంభించిరి. పాపము భవిష్య త్తును వారు గుర్తింపజాలకపోయిరి. కాని ప్రభుత్వము దీనిని సహింపజాలకపోయెను. వారికి తాటస్థ్య రాజభక్తి చాలకుండెను. 1857 నాటి మ్యూటినీని గురించివ్రాసిన ఫ్రెడరిక్ కూపరు చెప్పినట్లు ప్రభుత్వమువారు "పరిపూర్ణ కార్యరూపమును దాల్చిన, చురుకైన రాజభక్తికి పీసమంత తక్కువకూడ సహింపజాలరు. ప్రభుత్వము తన ప్రజల నైతికబలముమీద జీవించునట్టి యమర్యాదకార్యము కొడి గట్టజాలదు." ఒక వత్సరముక్రితము లాయడ్ జార్జి జాతీయప్రభుత్వ

వారొకయింట సమావేశమగుచుండ నిర్బంధింపబడి యొక్కొక్కరు రెండేసివత్సరములు కఠినకారాగారశిక్షలబడసిరి. ఇది యొక చిన్న విషయము. ఇట్టివి భారతదేశమంతట ప్రతిదినము జరుగుచునేయుండెను. శిక్షింపబడిన బాలికలు, స్త్రీలు చాలమంది జయిళ్ళలో ననేకబాధలనుభవించిరి. వారు పురుషులకంటె నెక్కువ బాధలనే యనుభవించిరి. నేను బాధకరములగు ననేక విషయములను గురించి వింటిని. కాని బొంబాయి జయిలులో నితర శాసనోల్లంఘన ఖయిదీలతోపాటు తా ననుభవించిన యనుభవములనుగురించి మీరాబాయి తెలిపిన కథన మతిదారుణముగ నుండెను.

యు. పి లో మా పోరాటము గ్రామములలో కేంద్రీకరింపబడెను. కాంగ్రెసువలన కలిగిన నిరంతర యొత్తిడివలన యెక్కువ రిమిషనులను, అవి చాలవని మేము భావించినను, వాగ్దానముచేసిరి. మా నిర్బంధములు జరుగుటతోడనే యధిక రిమిషనులను ప్రకటించిరి. ఈ ప్రకటన ముందుగా చేయబడకపోవుటొక వింత. దానివలన పరిస్థితులలో చాల వ్యత్యాసముకలిగెడిది. అనాలోచితముగ మేము వాటినితిరస్కరించుటచాలకష్టమయ్యెడివి. కాని యీ రిమిషనులకీర్తి కాంగ్రెసుకు దక్కకూడదని ప్రభుత్వమువారు తాతురపడుచుండిరి. కనుక వారొకవంక కాంగ్రెసును హోమముచేసి వ్యవసాయదారులను శాంతపరచుటకు సాధ్యమైనంత యెక్కువ రిమిషను యివ్వగోరిరి. కాంగ్రెసు వత్తిడి యెచ్చట హెచ్చుగనుండెనో యచ్చట నెక్కువ రిమిషనులు ముట్టినను విషయము గమనింపదగియున్నది.

ఈ రిమిషనులు వ్యావసాయికసమస్యలను పరిష్కరించలేదు. కానియవి పరిస్థితులనెక్కువసులభముచేసెను. అవి వ్యవసాయదారుల ప్రతిఘటనలోనున్న తీవ్రతను తగ్గించెను. మా పెద్ద పోరాటముకు సంబంధించినంతవరకవియుద్యమమును దుర్బలపరచెను. ఆపోరాటము యు. పి. లో వేలకొలది వ్యవసాయదారుల కనేకబాధలను కలిగించెను. చాలమంది దానివలన పూర్తిగధ్వంసమైపోయిరి. కాని యీ పోరాటముయొక్క యొత్తిడివలననే లక్షలకొలది రైతులకు వర్తమానపద్ధతిలో రాబట్టుటకు వీలైనంత హెచ్చురిమిషను సంపా

కనుక ఆర్డినెన్సులకుగల యదార్థకారణములు వైస్రాయి హృదయకుహరములోనో లేక వారి మంత్రివర్గ సామ్రాజ్యపరమగు హృదయసీమలోనో తాళము వేయబడియుండెను. కాని యవి స్పష్టములే. అధికార కారణములు బ్రిటిషుప్రభుత్వము హిందూదేశములో పూర్ణముచేయు ప్రచారముయొక్క నూతన సాంప్రదాయము నర్థముచేసికొనుటకు తోడ్పడుచున్నవి. అనేకయసత్యములతో నిండిన యర్థప్రభుత్వ కరపత్రములు గ్రామములలో, విరివిగా పంచిపెట్టబడి నట్లు మేము వింటిమి. వాటిలో కాంగ్రెసు వ్యవసాయవస్తువుల ధరలను పడగొట్టెననియు కనుక వ్యవసాయదారుల కన్నికష్టములను తెచ్చిపెట్టెననియు నొక సూచనచేయబడెను. ప్రపంచఆర్థికమాంద్యమును తేగలిగిన కాంగ్రెసుయొక్క శక్తికింతకంటె వేరుపొగడ్త యేమియు నవసరములేదా? కాని యీ యసత్యముదీనివలనకాంగ్రెసు గౌరవము నశించునను నాశతో విఘ్నవిరామములేకుండ వ్యాప్తిచేయ బడుచుండెను.

దీనినంతను లక్ష్యముచేయక యు.పి. లో కొన్నిప్రధానజిల్లాల లోని వ్యవసాయదారులు శాసనోల్లంఘన శంఖారావమును వినుట తోడనేదానిననుగమించిరి. అది1930యుద్యమమునుమించి యెక్కువ శిక్షణగలది. ప్రథమములో నిందు మంచిహాస్యరసముకూడ నుండెను. నే నొక వింతకథవింటిని. రైబెరిల్లీ జిల్లాలో బలియా యనుగ్రామ మును పోలీసుపార్టీ యొకటిసందర్శించెను. పన్ను చెల్లింపనందులకువారు సామానులను జప్తుచేయుటకు వెళ్ళిరి. ఆగ్రామము కొంతయైశ్వర్య వంతమయినది. ఆగ్రామవాసులు కొంతయుత్సాహముకలవారు. వారు పోలీసుయుద్యోగులను, రివిన్యూయుద్యోగులను మర్యాదతో సత్క రించి యిండ్లతలుపులను తెరచి యుంచి యుద్యోగులను వారియిష్టము వచ్చిన చోటుకు వెళ్ళవలసినదని యాహ్వానించిరి. పశువులు మొద లగునవి కొన్ని జప్తుచేయబడెను. తరువాత గ్రామస్తులు రివిన్యూ యుద్యోగులకు, పోలీసుయుద్యోగులకుతమలపాకులు, వక్కలుయిచ్చి తాంబూల చర్వణము చేయుమనిరి. వారుసిగ్గుపడి చిన్నబుచ్చుకొని

వెడలిపోయిరి. కాని యిది యొక యసాధారణచర్య. త్వరలోనే శౌర్యము, ధైర్యము, సహనదాక్షిణ్యములు నశించెను. పాప మా బసులిమా గ్రామవాసుల శౌర్యము వారియుత్సాహమునకు కీడు ననుభవింపకుండ చేయజాలవయ్యెను!

ఈ జిల్లాలలో చాల నెలలవరకు వ్యవసాయదారులు పన్నులు చెల్లింపలేదు. బహుశః కోరని ప్రారంభమునుంచిమాత్రమే వసూళ్లు క్వచితుగా వచ్చుచుండెను. అనేకమంది యరెస్టుకావింపబడిరి. కాని యిది ప్రభుత్వనిరోధక భిన్నముగ జరిగెను. సాధారణముగ నరెస్టులు గ్రామనాయకులకు ప్రత్యేకపద్ధతులను భద్రపరచి తక్కినవారిని చావగొట్టిరి. ఖయిదుకంటె, కాల్చుటకంటె తన్నుటయే ఘనమైన దని గ్రహించి యవసరమైనప్పుడెల్ల దానిని ప్రయోగించిరి. మారు మూలలలోనున్న గ్రామములలో జనులచేత పని పయిమావుల కంటబడెను. అవి యంతగా ప్రాంతీయ లేకుండ పెరిగిపోవు ఖయిదీల సంఖ్య తగ్గించును. జప్తులు, ఆస్తినమ్ముట, పశువుల నమ్ముట, భూమినుండి వెడలగొట్టుట మొదలగునవి జరిగెను. తమకున్న కొద్దియాస్తిలాగు కొని స్వల్పధరల కమ్మివేయుచుండ వ్యవసాయదారులు దారుణమగు బాధతో చూచుచు నూరకుండెడివారు.

దేశమంతట పట్టుకొనబడిన యసంఖ్యాకములగు భవనముల వలెనే స్వరాజ్యభవనముకూడ తీసికొనబడి యందలి కాంగ్రెసుఆస్ప త్రికిచెందు విలువైనవస్తువులు, పరికరములుకూడ పట్టుకొనబడెను. కొద్దిరోజులవరకు ఆస్పత్రి పూర్తిగ పనిచేయుటయే మానివేసెను. కాని తరువాత దగ్గరనున్న యొక పార్కులో నారుబయట నొక డిస్పెన్సరీ పెట్టబడెను. తరువాత నీ ఆస్పత్రి లేక డిస్పెన్సరీ స్వరాజ్య భవనమునకు చేరియున్న యొక చిన్నయింటిలోనికి మార్చబడి యచ్చట సుమారు రెండున్నరసంవత్సరములు పనిచేసెను.

నేను చాలహెచ్చుగనున్న రాబడిపన్ను చెల్లింప నిరాక రించుటచే మా నివాసమగు ఆనందభవనమును ప్రభుత్వమువారు తీసికొనెదరను వదంతులు బయలుదేరెను. ఈ పన్ను తండ్రిగారి యాదాయమునిూద 1930లో విధింపబడెను. శాసనోల్లంఘనముందు

టచే నతఁడా వత్సర మీపన్ను చెల్లింపలేదు. 1931 లో ఢిల్లీసంధి యైన తరువాత దానిగురించి రాబడిపన్ను విధించు అధికారులతో నేను కొంత వాదముచేసితిని. కాని చివరకు నేను చెల్లించుట కంగీకరించి యొక వాయిదా చెల్లించితిని. అప్పుడే ఆర్డినెన్సులు వచ్చుటచే నే నిక చెల్లింపరాదని నిశ్చయించుకొంటిని. పన్నులు, శిస్తు యీయవలదని వ్యవసాయదారులకు బోధించుచు నేనే రాబడిపన్ను చెల్లించుట నేరములను తప్పఁజేసినట్లగును. కనుక ప్రభుత్వమువారు మా యింటిని జప్తుచేయుదురనియే నే ననుకొంటిని. కాని దీనివలన మా తల్లియింటినుండి వెడలఁగొట్టబడును. కనుక నాకీతలంపు చాల వెగటుగ నుండెను. వ్యక్తిగతముగ మే మెంతయో ప్రేమించుచు మూల్యములగు పుస్తకములు, పత్రములు వస్తువులు, పశువులు, ఇంక ననేకవస్తువులు యితరుల చేతులలోపడి నష్టమైపోవును. మన జాతీయజెండా లాగివేయబడి దానిచోట యూనియన్‌జాక్ యెత్తబడును. కాని మాసొంతయిల్లు పోవుట యను భావముకూడ నన్నాకర్షించెను. ఆస్తులన్నియు లాగివేయబడుచున్న వ్యవసాయదారుల కిది నన్ను చేరికచేసి, వారి కుత్సాహము కలిగించును. మా యుద్యమదృష్టిలో చూచినచో నిది నిశ్చయముగ జరుగవలసిన విషయమే. కాని ప్రభుత్వమువా రన్యథాతలంచి మాయింటినిముట్టుకొనలేదు. బహుశః మా తల్లి యెడల దయచేతను, శాసనోల్లంఘనోద్యమమున కది మరింత ప్రోత్సాహమునిచ్చు ననుయోచనచేతను వారట్లు చేసియుండవచ్చును. చాల నెలలయినతర్వాత నా రైల్వేవాటాలు కొన్ని రాబడిపన్ను చెల్లింపనందులకు జప్తుచేయబడెను. మోటారులు జప్తుచేయబడి యమ్మివేయబడెను.

ఈ ప్రారంభమాసములలోని యొకలక్షణము నన్నెక్కువగ బాధించెను. అనేక మునిసిపాలిటీలు, పబ్లికుసంస్థలు ముఖ్యముగా కాంగ్రెసు మెజారిటీకలదని చెప్పబడినకలకత్తాకార్పొరేషనే జాతీయ జెండాలను లాగివేసెను. జెండాలను లాగివేయనిచో తీవ్రచర్య తీసికొనెదమని పోలీసువారు, ప్రభుత్వమువారు భయపెట్టుటచే నవి తీసివేయబడెను. ఈ చర్య మునిసిపాలిటీని రద్దుచేయుట లేక దాని సభ్యు

లను రక్షించుటకైయుండెనేది స్వప్రయోజనములతో గూడుకొనిన సంస్థను సహజముగ పరికిరి. ఒకసారిక విధలేక నా నట్లు చేసిరి. అయినను అది యన్ని గ్రహించెను. జెండా నంత మెచ్చుకగా ప్రేమించుదాని కొరక చిహ్నము. దానికింద నిలిచి దానిగౌరవమును రక్షించెదమని మన మనేకప్రమాణములను చేసితిమి. దానిని మన చేతులతోనే లాగివేయుట లేదా మారాజ్ఞల ప్రకారము లాగివేయించుట ప్రతిజ్ఞాభంగమే. వాతకమును లెక్కించక కాన్పించెను. అది మన యాత్మనుచంపుకొనుట, సత్యమును నాశన మొనర్చుటయగును. బలీయమైన పశుశక్తిముందర యసత్యమును ధృవపరచుట. ఈ విధముగ లొంగిపోయినవారు జాతీయనీతిని భంగపరచిరి, దాని యాత్మగౌరవమునకు హానికలిగించిరి.

వారు వీరులవలె ప్రవర్తించి యగ్నిహోత్రములోని కుఱుకవలెననితాము. ముందుకుకుముకలేదని భయపడుటలేదని యితరనష్టములను బాధలను పొందలేదని దూషించుట తప్పు, మూర్ఖము. ప్రతివాడు ననేకధర్మములను బాధ్యతలను నిర్వహింపవలసి యున్నాడు. అతనిమీద న్యాయవిమర్శచేయుట కితరుని కెవనికి హక్కులేదు. వెనుక కూర్చొనుట లేక వెనుకనుండిపనిచేయుట వేరు. సత్యమును లేక తాను సత్యమనుకొనుదానిని నిరసించుట గర్హ్యమైన విషయము. జాతీయ ప్రయోజనములకు వ్యతిరేకముగ దేనినైన చేయవలసివచ్చినచో మునిసిపల్ సభ్యులు తమస్థానములకు రాజీనామా యివ్వవచ్చును. కాని సాధారణముగ వారాస్థానములవిడుటకిష్టపడరు. “తేనెటీగలు పుష్పములపై వ్రాలుటతోడనే ఝుంకారములను కట్టిపెట్టును. పదవుల నాక్రమించుటతోడనే విగ్గులు మూకీభావము వహింతురు.

అసహాయుడై విషమపరిస్థితులలోనున్నవాని ప్రవర్తనను విమర్శించుటన్యాయముకాదు. ప్రపంచయుద్ధ మనేకసార్లు విశదముచేసినట్లొక్కొక్కపుడత్యంతధైర్యశాలిధైర్యముకూడ చెదరిపోవును. అంతకు పూర్వము 1912లో టిటానికు నోడ మునిగిపోయిన సందర్భములో నతిప్రతిభావంతులైనవారు, పిరికివారనదగనివారు, నావికులకు లంచమిచ్చి యాత్మరక్షణము చేసికొనిరి. ఈమధ్య మారోకొటలతగులపడి

నప్పుడు సిగ్గుకరమగు విషయములు బయల్పడెను. హేతువును, నిగ్రహశక్తిని నాశముచేయు జంతుస్వభావములందు సంకటావస్థలో నెట్లు ప్రవర్తింతుమో యెవరును చెప్పజాలరు. కనుక మనము దూషింపరాదు. అనగా ఋజుప్రవర్తనమునుండి జారిపోవుటను గుర్తింపరాదని యర్థముకాదు. అత్యవసరసమయములలో వణకు సంధ్యాజీవులపై జాతీయ నౌకానిర్వాహణ నిర్ణయమునందు పెట్టరాని యర్థముకాదు. ఇట్టి ధర్మవ్యతిక్రమ నిరోధించు యత్నమునందు కర్తవ్యనిర్వహణ మఱచుట మరింత యక్రమము. నిశ్చయముగా నిది మహాధర్మవ్యతిక్రమమేగాక గొప్పనేరము.

విప్లవకారుల మధ్యజరుగు పోరాటము నీతిమీద ధైర్యస్థైర్యముల మీద నాధారపడియుండును. అత్యంత రక్తసిక్తమగు యుద్ధముకూడ వీనిమీదనే యాధారపడును. “యుద్ధరంగములో యుద్ధములు ధైర్యస్థైర్యములచేతనే గెలుపొందుచుండును.” అని మార్షల్ ఫోక్ చెప్పెను. శస్త్రరహితపోరాటములో నీతి, ధైర్యస్థైర్యములు మరింతయవసరము. ఎవరు తన ప్రవర్తనచే సత్యనీతిని భంగపరచి, జాతిస్థైర్యమును కూలద్రోయునో వాడు యుద్యమమునకు మహాపరాధము చేసినవాడగును.

శుభాశుభవార్తలతో మాసములు గడిచిపోవుచుండెను. మేము మా మా జయిళ్ళలో పేలవములగు నిత్యకర్మల కలవడిపోతిమి. జాతీయవారము ఏప్రిల్ 6 లగాయితు 13 వరకు వచ్చెను. ఇది యనేక యసాధారణ యుదంతములను తెచ్చెనని మే మెరుగుదుము. కాని యొక యుదంతముందర నాకు తక్కినవన్నియు పేలవముగనుండెను. అలహాబాదులో నాతల్లి యొక యుత్సవములో నుండెను. పోలీసు లాయుత్సవమునాపి లాఠీచార్జి చేసిరి. ఉత్సవమాపివేయబడిన తరువాత నెవరో యామెకొక కుర్చీ తెచ్చివేసిరి. ఆమె యుత్సవముముందర రోడ్డుమీద కుర్చీలో కూర్చొనెను. ఆమె కొరకు ప్రత్యేకముగ చూచుచున్న కొంతమంది, నాకార్యదర్శితో సహా, అరెస్టుచేయబడి తీసికొనిపోబడిరి. తరువాత పోలీసు లాఠీచార్జి ప్రారంభమయ్యెను. నాతల్లి కుర్చీలోనుండిపడగొట్టబడెను. తరువాత

విడువకుండ నామె తలమీద బెత్తములతో మోదిరి. తలమీద తగిలిన గాయమునుండి రక్తము స్రవించెను. ఆమె స్మృతితప్పి రోడ్డు ప్రక్కన పడియుండెను. అప్పటికి రోడ్డుమీదనున్న ప్రజలు, యుత్సవములో పాల్గొనినవారు తరిమి వేయబడి రోడ్డు విజనముగ నుండెను. కొంతకాలమయిన పిదప నామెను లేవనెత్తి యొకపోలీసు ఆఫీసరు తన మోటారులో ఆనందభవనమునకు చేర్చెను. నాతల్లి చనిపోయెనని యారాత్రి యలహాబాద్‌లో నొక యసత్యవదంతి వ్యాపించెను. క్రోధపూరితులగు ప్రజలు సమూహములుగ జేరిరి. నాకు శాంతిని, దౌర్జన్యరాహిత్యమును మరచిపోయి పోలీసులను ముట్టడించిరి. పోలీసులు తుపాకులను కాల్చిరి. కొంతమంది హతులయిరి.

ఈ యుదంతము జరిగిన కొన్ని రోజులయినతరువాత నాకీ వార్త తెలిసెను. దుర్బల శరీర, వృద్ధురాలును నైన నాతల్లి ధూళి ధూసరిత మార్గములో రక్తస్రావముతో పడియుండెనను భావము హృదయవిదారకముగ నుండెను. అచ్చటనేయున్న యెడల నేనెట్లు ప్రవర్తించెడివాడనో యని నేనాశ్చర్యపడితిని. నా దౌర్జన్యరాహిత్య మెంతవరకు నిలిచియుండెడిదో! అది కొంతవరకే నన్ను తీసికొని పోయెడిదని నేననుకొందును. ఏలనన యాదృశ్యము పన్నెండు వత్సరములనుండియు నేర్చుకొనుటకు యత్నించిన పాఠమును మరచిపోవునట్లు చేసియుండెడిది. దానివలన నాకు నాజాతికి కలుగుఫలితములకు నే నంత లెక్కపెట్టి యుండెడివాడనుకాను.

ఆమె నెమ్మదిగా కోల్కొనెను. ఆమె మరుసటినెల బరెల్లీ జయిలుకు నన్ను చూచుటకువచ్చినపుడింకను తలకు కట్లు కట్టుకొనుచుండెను. కాని మా వాలంటీరు బాలురతోను, బాలికలతోను బెత్తపుదెబ్బలను, లాఠీదెబ్బలను పంచుకొనగల భాగ్యము కలిగినందుల కామె యుత్సాహ గర్వములతో నుండెను. అయినను, ఆమె స్వస్థత బాహ్యమయినదికాని యదార్థముకాదు. ఆ వయసులో నామెయనుభవించిన యా యా వేదన యామెశరీరావస్థను పూర్తిగా తారుమారుచేసి శాశ్వతకష్టములను తెచ్చిపెట్టెను. ఇవి యొక వత్సరమైన తరువాత నుపద్రవకరముగ పరిణమించెను.

# 43

## బెరిల్లీ, ఢేరాడూను జయిళ్ళలో

నైనీజయిలులో ఆరువారములున్న తరువాత నన్ను బెరిల్లీ జిల్లా జయిలుకు మార్చిరి. తిరిగి నా యారోగ్యము కొంతచెడెను. ప్రతి రోజు నాకు జ్వరము తగులుచుండెను. బెరిల్లీలో నాలుగుమాసములు గడిపిన తరువాత, వేసవికాలపు వేడి ప్రచండతరమయినపుడు, హిమాలయపాదముదగ్గరనున్న ఢేరాడూనుజైలుకు నన్ను మార్చిరి. అచ్చట నేనుపదునాల్గుమాసముల పదిహేనురోజులు, రమారమినా రెండు సంవత్సరముల శిక్షపూర్తియగువరకు నుంటిని. ఉత్తరములు, బంధు మిత్రదర్శనములు, వడపోయబడిన వార్తాపత్రికలమూలమున నాకు వార్తలు వచ్చుచుండెను. కాని బయటజరుగు దానిలో చాల వరకు నాకెంతమాత్రము తెలియకుండెను. ప్రధానయుదంతములను గురించి నా కస్పష్టభావములు మాత్రమే కలవు.

నన్ను విడిచిపెట్టినపుడు నేను స్వంత వ్యాపారములతోను, అప్పటి రాజకీయపరిస్థితులతోను తీరికలేకయుండెడివాడను, అయిదు మాసములకు కొంచెముపయిగా స్వేచ్ఛననుభవించిన తరువాత నన్ను తిరిగి జయిలుకు తీసికొనివచ్చిరి. నేనింకను యిచ్చటనే యున్నాను. ఈవిధముగ గతమూడుసంవత్సరములలో నేను చాల భాగము జయిలులోనేయుండి బయటజరిగిన విషయములతో సంబంధములేకయుంటిని. ఈ కాలములో జరిగినపరిస్థితులను వివరముగ తెలిసికొనుటకు నాకు సావకాశము లేకపోయెను. గాంధీజీహాజరయిన రెండవరౌండుటేబిలు సభ తెరచాటున నేమిజరిగెనో నా కింకను సరిగా తెలియదు. ఈ విషయమునుగురించి నే నతనితో మాట్లాడుటకు నా కింతవరకు సమయము దొరకలేదు.

1932, 1933 వత్సరముల జాతీయపోరాట పరిణామమును చిత్రించుటకు నా కంతగా నేమియు తెలియదు. కాని నేనారంగమును దాని వెనుకనున్న చరిత్రను, నటకులనుకూడ బాగుగ నెరుగుదును

అప్పుడు జరిగిన యనేక చిన్నవిషయములను సహజముగ నర్థముచేసి
కొని పోరాటముయొక్క సాధారణగతినిగురించి తగిన భావముకలిగి
యుంటిని. మొదటి నాలుగుమాసములు శాసనోల్లంఘనముతీవ్రముగ
శక్తివంతముగ పనిచేసెను. తరువాత నది క్రమముగా, మధ్యమధ్య
పొంగుచు, క్షీణించెను. ప్రత్యక్షచర్యతో గూడిన పోరాట మెప్పుడు
విప్లవస్థాయిలో కొద్దికాలము నిలువగలదు. అది స్థాయిగనుండజాలదు.
అది విజృంభించనైన విజృంభింపవలెను. లేదా పడిపోవలెను. మొదటి
విజృంభణమైనతరువాత శాసనోల్లంఘనము నెమ్మదిగ దిగజారెను.
కాని తక్కువస్థాయిలో నది ఎక్కువకాలము నిర్వహింపబడగలదు.
అఖిలభారత కాంగ్రెసుసంస్థ అక్రమసంస్థగా ప్రకటింపబడినను జయ
ప్రదముగ పనిసాగించుచునేయుండెను. అది తన రాష్ట్రీయవర్కరులతో
సంపర్కముకలిగియుండి, యాజ్ఞలనుపంపుచు నివేదికలనందుకొనుచు,
మధ్యమధ్య ధనసహాయము చేయుచుండెను.

రాష్ట్రీయసంస్థలుకూడ నించుమించుజయప్రదముగా నేపనిచేసెను.
నేను జయిలులోనున్న వత్సరములలో నాకితరరాష్ట్రీయములసంగతి తెలి
యదు. కాని నేను విడుదలయైన తరువాత యు. పి. రాష్ట్రీయములో
జరిగిన చర్యలను గురించి కొంత సమాచారము పోగుచేసితిని.
యు. పి. కాంగ్రెసు ఆఫీసు 1932 సంవత్సరమంతయు క్రమముగ
పనిచేసెను. అది గాంధీజీ సలహామీద నప్పటి కాంగ్రెసు ప్రెసి
డెంటుచే శాసనోల్లంఘన మాపివేయబడువరకు అనగా 1933 మధ్య
వరకు పనిచేసెను. ఈకాలములో జిల్లాలకు తరచు సందేశములుపంప
బడుచుండెను. అచ్చుకరపత్రములు, సైక్లోస్టైలు కరపత్రములు
సక్రమముగ ప్రకటింపబడుచుండెను. అప్పుడప్పుడు జిల్లాలో జరుగు
చుండినపని తనిఖీచేయబడుచుండెను. మన జాతీయసేవకు సంబంధిం
చిన వర్కరులకు బత్తెములీయబడుచుండెను. ఈ పని చాలవరకు,
అవసరమునుబట్టి, రహస్యముగనే జరిగెను. కాని రాష్ట్రీకమిటీ
కార్యదర్శి ఆఫీసుపనులను చూచుకొనుచు తనధర్మమును బహిరంగ

ముగనే నెజవేస్తుచుండెను. అతడు నిర్బంధింపబడినపుడు మరియొక డా స్థానము నాక్రమించెడివాడు.

1930, 1932 సంవత్సరముల యనుభవము భారతదేశమంతట రహస్యవార్తావిధానము నేర్పరచుట సులభమేయనుసంగతి విశదము చేసెను. ఎక్కువ యత్నమక్కరలేకుండ, కొన్ని యవాంతరములు సంభవించినను, మంచిఫలితమేకలిగెను. కాని శాసనోల్లంఘన తత్వముతో రహస్యవిధానముకు సరిపడదని మేము భావించితిమి. ప్రజా ప్రబోధము దానివలన మందగించెను. పెద్దబహిరంగమైన ప్రజోద్యమములో నొక చిన్న భాగముగ నది యుపయోగకరముగనుండెను. కాని యొక్కయుపద్రవమెప్పుడుకలదు. నిష్ఫలములగుకొన్ని రహస్య క్రియలే యుద్యమస్థానము నాక్రమింపవచ్చును. 1933 జూలైలో గాంధీజీ రహస్య మెంతమాత్రము పనికిరాదని నిరసించెను.

యు. పి. తో సంబంధములేకుండ గుజరాతు, కర్నాటకములలో కొంతకాలము వ్యవసాయపన్నుల నిరాకరణోద్యమములుజయప్రదముగ సాగింపబడెను. రెండురాష్ట్రములలోను వ్యవసాయప్రొప్రయిటరులు ప్రభుత్వముకు పన్ను జెల్లింపనిరాకరించిరి. దీనివలన వారు చాలకష్టముల ననుభవించిరి. ఈ బాధితులకు సహాయముచేయుటకు, భూమినుండి వెడలగొట్టబడుటవలన; ఆస్తులనులాగుకొనుటవలనకలిగిన దుఃఖములనుపశమింపజేయుటకుకాంగ్రెసుకొన్నిప్రయత్నములుచేసెను. యు. పి. లో రాష్ట్రకాంగ్రెసునాయకుఆస్తులనుపోగొట్టుకొనినరైతాంగముకు కీవిధముగ తోడ్పడుట కెట్టి యత్నమునుచేయలేదు. ఇచ్చట సమస్య (కౌలుదార్లు వ్యవసాయ ప్రొప్రయిటర్లకంటె నత్యధికముగ నున్నారు) యతిపెద్దసమస్య. భూవైశాల్యమూ చాలహెచ్చు! రాష్ట్రనిధి చాలస్వల్పము. ఈ యుద్యమమువలన బాధపడిన వేనవేలకు సహాయముచేయుట మాకసాధ్యమైనపని. వారిని, యెప్పుడును ఆకలిబాధచే మాడుచున్న యసంఖ్యాకులయిన తదితరులను, వేరుచేయుట కూడ మాకసాధ్యముగ నేయుండెను. కొద్దిమందికేసహాయముచేయుట క్రోధద్వేషములను పుట్టించును. కనుక మేము ధనసహాయము చేయ

కాలమును నిశ్చయించి, మొట్టమొదటనే ఈ విషయమును బహిరంగ పరచితిమి. వ్యవసాయదారులు మా స్థితిని చక్కగా గ్రహింపగలిగిరి. సణగకుండ ఫిర్యాదుచేయకుండ వారెంతసహింపగలిగిరో యాశ్చర్య కరముగ నుండెను. మేము చేయగలిగినచోట కొంతమంది వ్యక్తులకు ముఖ్యముగా జయిలుకు వెళ్ళినవారి భార్యాబిడ్డలకు; సహాయము చేయుటకు యత్నించితిమి. ఈ దురదృష్ట దేశదౌర్భాగ్యమెట్టిదో! నెలకొక్క రూపాయికూడ దేవతా ప్రసాదముగ భావింపబడును.

ఈ కాలములో మొదటినుండియు యు. పి. రాష్ట్రకమిటీవారు (ఈసంఘము నిషేధింపబడెను.) తమ జీతగాండ్రకు స్వల్పజీతములనిచ్చుచునేయుండిరి. వారు జయిళ్ళకు వెళ్ళినపుడు వారి కుటుంబములను పోషించిరి. వారిబడ్జెటులో నిది పెద్దమొత్తము. తరువాత కరపత్రములను, నోటీసులను, బులెటినులను అచ్చువేయించుఖర్చులువచ్చెను. ఇవి కూడ చాల సొమ్ముగనే యుండెను. ప్రయాణఖర్చులు మరియొక ప్రధానవిషయము. తక్కువభాగ్యవంతమైన జిల్లాలకు కొన్ని గ్రాంటుల నీయవలసియుండెను. అతిశక్తివంతమై యేర్పాటుకొనియున్న ప్రభుత్వముతో తీవ్రప్రజాసంగ్రామము జరిగిన యీ కాలములో పైఖర్చులు తదితరఖర్చులు యెన్నియో చేయబడినను యు.పి. రాష్ట్రకమిటీవారు 1932 జనవరి లగాయతు 1933 ఆగష్టువరకు యిరువది మాసములలో మొత్తము 63000 రూపాయలు అనగా నెలకు 3140 రూపాయలు ఖర్చుపెట్టిరి. (ఈ మొత్తములో అలహాబాదు, ఆగ్రా, కాన్పూరు, లక్నోలవంటి యెక్కువధన, బలములుకలిగిన జిల్లాకమిటీల ప్రత్యేక ఖర్చులు లేవు.) 1932, 1933 పోరాటములో యు. పి. రాష్ట్రమన్నిటికంటె ముందంజవేసెను. పొందిన ఫలితములనుబట్టి చూడ నది చాల తక్కువఖర్చు చేసెననియే నేననుకొనెదను. శాసనోల్లంఘనము నణచుటకు రాష్ట్రప్రభుత్వము చేసినప్రత్యేక ఖర్చులను ఈ యల్పసంఖ్యతో పోల్చి చూచుట చాలప్రయోజనకరము. తక్కిన పెద్దరాష్ట్రములు కొన్ని ఇంతకంటె నెక్కువఖర్చు చేసెనని నేనూహించెదను. కాని బీహారు, కాంగ్రెసు దృష్టిలో, దాని సరి

హద్దురాష్ట్రమయిన యు. పి. కంటె చాల బీదది. అయినను పోరాటములో నది యద్భుతముగ పనిచేసెను.

క్రమముగ శాసనోల్లంఘనోద్యమము క్షీణించెను. కాని యది జలగసాగినట్లు సాగుచు నేయుండెను. అంతకంత కది బాహుళ్యము మీద జరుగుట తగ్గిపోయెను. ప్రభుత్వమువారి తీవ్రనిర్బంధ విధానమట్లుండ 1932 సెప్టెంబరులో గాంధీజీ హరిజన సమస్యమీద మొదట యుపవాసముచేసినపుడు దానికి మొట్టమొదట గట్టిదెబ్బ తగిలెను. ఆ యుపవాసము ప్రజాప్రబోధము కలిగించెను. కాని యది దానిని మరియొకవైపు మరలించెను. 1933 మే మాసములో శాసనోల్లంఘన మాపివేయుటచే చివరకది యాచరణలో చంపివేయబడెను. తరువాత నది యాచరణలోగాక సిద్ధాంతములోనుండెను. అది యట్లాపుచేయబడకపోయినను క్రమముగ నశించియుండెడిది. నిర్బంధములలోని కాఠిన్యతచేతను, దౌర్జన్యముచేతను భారతదేశము సొమ్మసిలిపోయెను. జాతియొక్క ధైర్యస్థైర్యములు తాత్కాలికముగ డస్సిపోయెను. అవి తిరిగి ప్రతిష్ఠింపబడలేదు. శాసనోల్లంఘనమును వ్యక్తిగతముగ సాగింపగలవారింకను అనేకమంది కలరు. కాని వారు కొంత కృత్రిమవాతావరణములో పనిచేసిరి.

ఒక మహోద్యమ మీ విధముగ నెమ్మదిగనశించినదనువార్త మాకు సంతోషకరముగ లేదు. అయినను గొప్పవిజయముకలుగునని మాలో నెవరు భావించియుండలేదు. ప్రజలలో నణచివేయబడజాలని ప్రబోధముకలిగినచో నద్భుతమయిన దేదిమో సంభవించుటకొక వెర్రియవకాశ మెప్పుడును ఉండెను. కాని దానిమీద నాధారపడుటకు వీలులేదు. కనుక మేము నిమ్నోన్నతములతోను, మధ్యమధ్య ననేక 'ఆటకట్టులతోను గూడిన దీర్ఘపోరాటముకొరకే యెదురుచూచితిమి. ప్రజలకుశిక్షణలోను, సమిష్టికార్యాచరణలోను లక్ష్యశుద్ధిలోను అత్యధిక బలము చేకూరునని యూహించితిమి. ఒక్కొక్కప్పుడు 1932 మొదటిదినములలో శీఘ్రముగ నేదేనియొక బాహ్యవిజయము కలుగునేమోయని భయపడెడివాడను; ఏలనన నిది విధా

ప్రభుత్వనిర్బంధములకు మోకరింప నిరాకరించి శిక్షలనుస్వీకరించిరి. తక్కినవారు పూర్తిగ నణచివేయబడి నోరెత్తి విమర్శయైనను చేయ జాలకుండిరి. ఎప్పుడైనను నిర్వీర్యమైన విమర్శజరిగినయెడల నదిహీన స్వరముతో, క్షమార్పణధోరణిలో నుండెడిది. దానిని వెంటనే కాంగ్రెసుపోరాటమునుజరుపుచున్నవారు తీవ్రముగఖండించెడివారు.

పాశ్చాత్యదేశములలో పౌరహక్కులను సమర్థించు బలీయమైన ప్రజాభిప్రాయము నిర్మింపబడెను. వాటి కేమాత్రము భంగము కలిగినను ప్రతిఘటన, ఆందోళన బయలుదేరెను. అచ్చట వాక్కు, వ్రాత, సభలు, సంస్థలు, ముద్రణాలయములు, వ్యక్తులు,—ఈ యన్నింటి స్వాతంత్ర్యముల యెడలతగినంతశ్రద్ధతీసుకొనువార నేకులుకలరు. వారు నిరంతరము వాటికొఱ కాందోళనచేయుచు వాటి నాక్రమింపజూచు ప్రభుత్వ స్వభావము నరికట్టుటకు తోడ్పడుచుందురు. భారతలిబరలు పక్షమువారు బ్రిటిషు లిబరలుపక్ష సాంప్రదాయములను (పేరుతప్ప వారితో వీరికెట్టి సామ్యము లేకపోయినను, కొంతవరకు నిర్వహింతుమని చెప్పెదరు. ఈనాగరికసత్వముల నణచివేయునపుడు వీరు తమ బుద్ధ్యా కొంతవ్యతిరేకముచూపెదరని యనుకొందుము. ఏలనన దీని వలన తాముకూడ బాధపడిరి. కాని వా రట్టిపాపము చేయలేదు! వోల్టేయరు మహాశయునివలె "మీరు చెప్పుదానితో నే నెంత మాత్రము నంగీకరింపజాలను. కాని నా కంఠములో ప్రాణమున్నంత వరకట్లుచెప్పు మీ హక్కును నేను కాపాడెదను" అని వీరనజాలరు.

దీనికి వీరినిదూషించుట యుక్తముకాదు. ఏలనన వీ రెన్నడు ప్రజాస్వామికమును, స్వేచ్ఛను, కాపాడుటకు నిలిచినవారుకారు. మాన్చెస్టరుగార్డియన్పత్రికా కరస్పాండెంటు చెప్పినట్లు "నిర్బంధము శాస్త్రయుక్తముగప్రయోగింపబడుచున్నది" అనువిషయమునకువారు సంతృప్తులగుచుండుటప్పుడప్పుడువిదితమగుచుండెను. ఈమధ్యబ్రిటిష్ జాతీయప్రభుత్వము రాజద్రోహబిల్లు నొకదానిని చేయుటకు ప్రయత్నించిరి. దానిమీద బ్రహ్మాండమైన విమర్శ ముఖ్యముగా లిబరలు పక్షమునుండి లేబరుపక్షమునుండి బయలుదేరెను. ఆబిల్లువాక్స్వాతం

త్ర్యము నరికట్టునని, సెన్సారంటులనిచ్చుటకు మేజిస్ట్రేటుల కధి
కారమునిచ్చునవియనువిమర్శింపబడెను. ఈవిమర్శనువినినప్పుడెల్లనాకు
దానియందభిమానము కలిగెడిది. అప్పుడే నాకు భారతచిత్రముకూడ
కాన్పించెడిది. ఇప్పటి చట్టములు బ్రిటిషురాజద్రోహ బిల్లుకంటె
నూరురెట్లఘోరముగానున్నవి. ఇంగ్లండులో నటువంటివైనవియున్నచో
లేని బ్రిటిషువారు హిందూదేశములో [illegible] నోరెత్తుటను
కూడ నెట్లు నిగ్రహించగలరో నాకాశ్చర్యము. తమ భౌతిక ప్రయో
జనముల కవసరమైనట్లు తమ నైతికప్రమాణములను మార్చుకొనగల
బ్రిటిషుప్రజల యద్భుతశక్తి నాకెప్పుడు నాశ్చర్యమును, మెప్పును
కలిగించెడిది. వారిసామ్రాజ్యమెత్తులకు ద్రోహమునిచ్చు ప్రతిదాని
యందు వారికి సుగుణము కాన్పించును. స్వేచ్ఛను, ప్రజాస్వామిక
మును ముట్టడించుచున్నారను విశ్వాసముతో, ఆధ్యాత్మికాగ్రహ
ముతో వారు హిట్లరు, ముస్సోలినీలను ఖండింతురు. అట్టివిశ్వాసము
తోనే హిందూదేశములో [illegible]లును, స్వాతంత్ర్యము నాడ
బెడుటయు నవసరమని వారు భావింతురు. తమ ప్రయోజనపరిహిత
మైన యదార్థప్రవర్తనము పైని యనైతికతను కప్పియున్నదని
చూపుటకు వారి దృష్టాంతము నైతిక కారణములను తెలిపెదరు.

హిందూదేశము పంతను దవానల మావరించియుండ
పురుషు లగ్నిపరీక్షకు గురియగుచుండ వేలకొలది మైళ్ళదూరములో
లండనులో హిందూదేశమునకు చట్టములను తయారుచేయుటకు
కొందఱు 'దేవతలు' సమకూడిరి. 1932 లో మూడవ రౌండుటేబిలు
సభ, కమిటీసభలు జరిగెను. అసెంబ్లీలోని చాలమంది సభ్యులు యీ
కమిటీసభలలో సభ్యత్వముకొఱకు గేలమువేసుకొని కూర్చొనిరి.
వారీ విధముగ ప్రజాధర్మనిర్వహణమును, వ్యక్తిగతానందమును
మిళితముచేయజూచిరి. ప్రజలఖర్చుమీద నొకతండా బయలుదేరి
వెళ్ళెను. తరువాత 1933లో భారతఅస్సెసరులతోగూడినజాయింటు
కమిటీవచ్చెను. సాకులకు యుదారప్రభుత్వము యుచితటిక్కెట్లు
నిచ్చిరి. హిందూమాతను సేవించుట కతిశ్రద్ధాళువులై ప్రజలఖర్చుల

మీద తిరిగి చాలమంది సముద్రములను దాటిరి. కొంతమంది యెక్కువదారిఖర్చులు రావలెననికూడ బేరములాడిరట!

హిందూదేశ ప్రజోద్యమములకు భయపడి స్వప్రయోజన ప్రతినిధులు బ్రిటిషుసామ్రాజ్యాధిపత్యముక్రింద లండనులో సమావేశమగుటలో నాశ్చర్యములేదు. దేశమాత జీవించుటయా నశించుటయా యను సంకుల సంగ్రామములోనుండ నే భారతీయులైన నిట్లు ప్రవర్తించుట మా జాతీయతను పొడిచినట్లయ్యెను. ఒక దృష్టిలో మాలో చాలమంది కది మంచిదిగనే కాన్పించెను. అది భారతదేశములోనున్న యభివృద్ధికోరువర్గమువారిని యభివృద్ధినిరికట్టువారిని శాశ్వతముగ వేరుపరచెనని యనుకొంటిమి. ఈ వడపోత ప్రజలకు రాజకీయ ప్రబోధము కలిగించుట కెంతయో సహాయపడును. ఒక్క స్వాతంత్ర్యము మూలముననే మనము సాంఘికసమస్యల నెదుర్కొన గలమనియు ప్రజల భారములను తగ్గింపగలమనియు నిది మరింత స్పష్టము చేయగలదు.

కాని వీరు భారతప్రజలకు తమ నిత్యజీవితములలోనేగాక నైతికముగ, మానసికముగ నెంతదూరమయిరో కనుగొనుటయాశ్చర్యకరము. వీరికి వారితో నెట్టి సంబంధములు లేవు. త్యాగములకు, బాధలకు ప్రోత్సహించువారి యాంతరంగిక ప్రబోధమా వీ రర్థము చేసుకొనలేదు! పేరెన్నికగనిన యీ రాజకీయ దురంధరులకు సత్యమంతయు నొక్కచోట మూర్తీభవించి యుండును. బ్రిటిషు సామ్రాజ్యశక్తి నెవరును జయప్రదముగ నెదుర్కొనజాలరు. కనుక దానిని విష్టమైనను, అయిష్టమైనను అంగీకరింపక తప్పదు. ఇదియే వారి వేదాంతము. సత్యముల భారతసమస్యను పరిష్కరించుట జీవచట్టనిర్మాణము ప్రజలమూమోదము లేనిదే యసంభవ మనుసంగతి వారికి తట్టినట్లు కాన్పించదు. స్పెండరుగారు 'మనకాలపు క్లుప్త చరిత్ర' అను పుస్తకములో చట్టసంబంధమైన విషమస్థితి నంత మొందించుటకు 1910లో జరిగిన ఐరిషుజాయింటు కాన్ఫరెన్సుయొక్క విఫలతనుగురించి యుదహరించెను. విషమసమయమధ్యమున చట్టమును

నిర్మించుటకు యత్నించు రాజకీయనాయకశిఖామణులు తగులబడు చున్న కొంపను భీమాచేయించుటకు యత్నించు మూఢులవంటివారని యుతడనెను. 1932, 1933 లలో భారతదేశములో బయలుదేరిన శాసనములు 1919 లో పంజాబులో జేసిన దానికంటె చాలగొప్పవి; జ్వాలలారి [illegible] సైనిక ప్రభుత్వతంత్రము రూపమున పట్లాంటి కఠినత్వముగా దీర్ఘకాల మున్నెయుండదను.

భారతస్థానములలో [illegible] సుస్థిరముగ పెరిగెను. ఈ సంప్రదాయము పురాతనమైనది. బ్రిటిషువారి కి దేశమును ప్రధానముగ పోలీసురాజ్యముగనే పాలించుచుండిరి. నాగరిక పరిపాలకునియొక్క అధికారప్రాతిపదికదృష్టికాక సైనికదృష్టియే. శత్రుసైన్యము, జయింపబడిన శత్రుభూమిని ఆక్రమించుకొనునట్టి వాసన యెప్పుడునుకలదు. ప్రస్తుత ప్రభుత్వవిధానమును సవాలుచేయుటచే నిమానసికస్థితి వర్ధిల్లెను. వంగదేశములోను, తదితరచోట్లను అప్పు డప్పుడుజరుగు టెర్రరిస్టుచర్యలీయధికార దౌర్జన్యమునకు దోహదము నిచ్చెను. అవి యధికారచర్యలలో కొంత న్యాయము కలదను కొనుటకు కారణమయ్యెను. వివిధఆర్డినెన్సులు, ప్రభుత్వానితి కార్య నిర్వాహకవర్గమునాటికి, పోలీసులకు విస్తృతమైన యధికారము నిచ్చుటచేత భారతదేశము పోలీసురాజ్యమయ్యెను. దీనిని మంద లించు వారెవరునులేరు.

హెచ్చుతగ్గుస్థాయిలలో భారతదేశములోని రాష్ట్రము లన్నియు నీ భయంకర నిర్బంధాగ్ని ననుభవించెను. కాని సరిహద్దు, వంగదేశము లెక్కువగా బాధపడెను. సరిహద్దురాష్ట్రమెప్పుడుప్రధాన ముగా సైనికప్రాంతముగనేయుండి యర్ధసైనిక రెగ్యులేషనులక్రింద పాలింపబడుచుండెను. దాని స్థితి రాజకీయముగముఖ్యమైనది. 'యెఱ్ఱ చొక్కాల' యుద్యమము ప్రభుత్వమువారిని పూర్తిగ తాపమూను చేసెను. రాష్ట్రమును 'శాంతపరచుటకు' 'తిరుగబడినగ్రామముల' నణచుటకు సైనికదళములు విరివిగనుపయోగింపబడెను. హిందూదేశ మంతట గ్రామములమధ్య అప్పుడప్పుడు (వంగదేశములో) పట్టు

ణములమీఁద సాముదాయక జుల్మానాలు సామాన్యమయ్యెను. తఱచుశిక్షార్థముపోలీసులనుపెట్టుచుండెడివారు. పెద్దపెద్దయధికారము లీయబడి, పయిపుందలింపులు లేనపుడు పోలీసులు మితిమీరివర్తిం చుట విధాయకము. లా ఆర్డరుల పేరిటనే యవి భంగపఱుపబడిన చక్కని యుదాహరణము లెన్నియో కలవు.

వంగదేశములో కొన్నిభాగము లసామాన్యదృశ్యముప్రద ర్శించెను. ప్రభుత్వమువారు ప్రజలను శత్రువులవలెజూచిరి. పన్నెండు సంవత్సరములు లగాయితు యిరువదియైదేండ్లవరకుగల బాల, బాలిక లందఱు తమ చెహరాలను తెలుపుకార్డులనుంచుకొనవలెను. ఒక చోటునుండి బయటకుపోకూడదు. బయటనుండి యొకచోటుకు రాకూడదు. దుస్తులను ధరించుటలో నియమముల నేర్పరచిరి. పాఠశాలలకు నియమముల నేర్పరచిరి. లేదా మూసివేసిరి. సైకిళ్ళు పనికిరావనిరి. పోలీసువారికి రాకపోకలను తెలుపవలెననిరి. రాత్రి చట్టము, సాయంకాలచట్టము సైన్యములను నడపుట, ప్యూనిటివ్ పోలీసులు జుల్మానాలు యింక ననేకనియమములు స్థాపింపబడెను. పెద్దపెద్ద ప్రాంతములు నిరంతర ముట్టడిలోనున్నట్లు కాన్పించెను. ఇవి యవసరములా? ఇవి యవసరము కానియెడల పెద్దపెద్దప్రాంత ములలోనున్న ప్రజలందఱిని బాధపెట్టి యవమానపరచి, గొప్ప నష్టములను కలిగించినందుల కా ప్రభుత్వము విపరీతనేరము చేసి నట్లు భావింపబడవలెను. అవి యవసరమే యైనచో నిశ్చయముగ భారతదేశ బ్రిటిషుపరిపాలనమీఁద నదియే తుదితీర్పుగాగలదు.

దౌర్జన్యము జయిళ్ళలోకూడ ప్రజలను వెంటనంటెను. ఖయిదీలను తరగతులుగ విభజించు టొక బూటకము. అది తరచు పైతరగతులలో నుంచబడినవారికి కంటకముగ నుండెడిది. చాలకొద్ది మంది యీ పై తరగతులలో నుండెడివారు. అభిమానధనులైన స్త్రీ పురుషులు నిరంతర కంటకపరిస్థితులకు లొంగవలసియుండెను. మామూలు ఖయిదీలస్థితికంటె రాజకీయఖైదీలస్థితిని యధమాధమ మొనరించుటకు ప్రభుత్వముబుద్ధిపూర్వకముగతలపెట్టినట్లుకాన్పింప

చేను. జయిళ్ళ యిన్స్పెక్టరు జనరలుగారొకరు శాసనోల్లంఘన ఖయిదీలను "క్రూరముగా చూడవలెను." అనునొక రహస్యసర్క్యులరు అన్నిజయిళ్ళకు పంపించెను. కొరడాదెబ్బలు జయిలుశిక్షలలో తరచుగా జరుగుచుండె[illegible]. 1933 ఏప్రిల్ 27 వ తేదీని భారతదేశ సహాయకార్యదర్శి కామన్సుసభలో మాట్లాడుచు "1932 లో శాసనోల్లంఘన నేరములకు భారతదేశములో 500 మందికిపయిగా కొరడా దెబ్బలు విధింపబడెననుసంగతి సర్. సామ్యూయల్ హోరుగారెరుగుదురు." అని చెప్పెను. జయిలునియమములనుల్లంఘించినకారణమున జయిలులో విధింపబడినయనేకకొరడాశిక్షలీసంఖ్యలో జేర్చబడినవో లేదో స్పష్టపరుపబడలేదు. 1932 లో జయిలులోనున్నపుడు కొరడా దెబ్బలశిక్షలు తరచు విధింపబడుచుండగా 1930 డిశెంబరులో జరిగిన యొకటిరెండు కొరడాశిక్షలను మేము నిరసించుట మూడుదినములుపవసించుట నాకు జ్ఞప్తికివచ్చెను. నేనప్పుడు దానిపరుషత్వమునకు నిర్విణ్ణుడనై లోపల నొకవిధమగు బాధననుభవించితిని. కాని దానిని నిరసింపవలెనని నేను తిరిగి యుపవసింపవలెనని నాకు తట్టలేదు. ఈ విషయములో నేను మరింత యసహాయుడ ననుకొంటిని. కాలము గడచుటతోడనే మనస్సు మొద్దుబారి పరుషత్వమును సహించును. చెడ్డవస్తువు ప్రపంచములో కొంతకాలమునిలిచిన చాలును. ప్రపంచము దాని కలవడిపోవును. జైళ్ళలో పురుషుల కతికఠినమైన పని-యంత్రములు, నూనెగానుగలు మొదలగునవి యివ్వబడెను. ప్రభుత్వమునకు క్షమార్పణ చెప్పుకొని, విడుదలయగునట్లు వారిస్థితి యతిదుర్భరముగ చేయబడెను. జయిలుఅధికారులకది యొక గొప్పవిజయము.

ఈ జయిలుశిక్షలు చాలవరకవమానములను నిర్బంధములను సహింప తిరస్కరించినబాలురమీద, యువకులమీద పడెను. వారందరు నత్యుత్సాహవంతులైన బాలురు. ఆత్మగౌరవము, సాహసము పటుత్వముగలవారు. ఇట్టివారింగ్లండులో బహిరంగపాఠశాలలలోను విశ్వవిద్యాలయములలోను అత్యంత ప్రోత్సాహము, మెప్పు పొంది యుండెడివారు. ఇచ్చట హిందూదేశములో వారి యౌవనాదర్శ

ములు, అభిమానధనము వారికి సంకెలలను, ఏకాంతవాసములను, కొరడా దెబ్బలను తెచ్చిపెట్టును.

జయిళ్ళలోని మన స్త్రీలస్థితి యతికఠినము. చింతించినకొలది బాధకరము. వారు చాలవరకు మధ్యతరగతివారు. ఇంటిపట్టుననుండుట కలవడినవారు. స్వలాభముకొరకు పురుషునిచేపరిపాలింపబడుసంఘము చేత సృష్టింపబడిన యనేక నిర్బంధములనుండి యాచారములనుండి వారు బాధపడుచుండిరి. స్వాతంత్ర్య మహోద్యమములు వారిప్పుడు రెండువిధముల వర్ధముచేసికొనుచున్నారు. సంగ్రామములో వారుచూపిన యుత్సాహము, శక్తి యపారము. వీటివెనుక నస్పష్టముగ నిద్రాణముగనున్నను, గృహదాస్యమునుండి విముక్తులుకావలెనను తీవ్రమైన కోరికగలదు. కొద్దిమంది తప్ప వీరందరు మామూలు ఖయిదీల తరగతిలో నీతిబాహ్యులైన ఖయిదీలమధ్య భయంకర పరిస్థితులలో నుంచబడిరి. ఒకసారి నేను స్త్రీల యావరణ ప్రక్కనున్న యొక కొట్టాములోనుంటిని. ఒకగోడ మాత్రమడ్డము. ఆయావరణములో నితర ఖయిదీలమధ్య కొందరు స్త్రీరాజకీయఖయిదీలు కలరు. వారిలో నా కొకసారి యాతిథ్యము నిచ్చిన స్త్రీ యుండెను. ఒకపెద్దగోడ మాత్రమడ్డముగానున్నను స్త్రీ ఖయిదీ వార్డరులు మన స్నేహితురాండ్రపయి నుపయోగించుచున్న భాష, తిట్టులు నాకు కర్ణకఠోరముగ వినిపించుచుండెను.

1932–1933 లలో రాజకీయ ఖయిదీల యావరణ రెండువత్సరముల క్రిందట 1930 లో చూపబడిన దానికంటె నధమముగా నుండెను. ఇది కేవలమధికారుల వ్యక్తిగత యిష్టాయిష్టములచేత సంభవించినదికాదు. ఇది ప్రభుత్వము బుద్ధిపూర్వకముగ నవలంబించిన నీతి. రాజకీయఖయిదీలవిషయమట్లుండ ఆ రోజులలో యు. పి. రాష్ట్రజయిలుశాఖ దయారసవాసనైనను భరింపజాలదనుకొనెనుగదా. ఈ సందర్భములో ననిర్వాచ్యమైన తావునుండి మనకొక చక్కని యుదాహరణమూ కలదు. జయిళ్ళను సందర్శించు గొప్ప హోదాగల ప్రేక్షకుడొకడు 'వీర' బిరుదాంకితుడు ప్రభుత్వముచే

సత్ప్రవర్తితో గౌరవింపబడిన వారు జయిలులో నొక్కసారి చూడ వచ్చెను. కొన్ని నెలలు క్రిందట నతడు మరియొక జయిలును చూచి తనవివేదికలో దాని జయిలరు "దయగలిగిన క్రమపాలనా దక్షుడు" అని వ్రాసెను' ఆ జయిలరు తన పరిపాలనమును గూర్చి ఏమియు నుదహరించవలదనియనెనని ఖైదీలు కొందరనుట. అధికారులదృష్టిలో దయకు స్థానములేదని యతడు చెప్పెనట. వర్తనవలన నతని కెట్టియుప కారము కలుగజాలదని భావించుటచేత నాతడట్లు 'అనియుండవలెనని పట్టుపట్టెను. ఫలితము వెంటనే యా జయిలరెప్పటనో మారుమూల నున్నయొక జయిలునకు విసరివేయబడెను. అది యతనిదయ కొకశిక్ష.

భయంకరమే పనిచేయుటకు నిరాకరించువారిని కొందఱు జయిలధికారులకు బెందములు, ప్రమాదములు, అక్రమముగా నతనిలపొత్తు కొట్టివేయుట జయిలులలో సర్వసాధారణము. వీనిని చేయనివారతి స్వల్పము. కాని నా స్వంతయనుభవము, నా స్నేహితుల యనుభవము కూడ నియమములను కఠినముగ పాలించునట్లు నటించువారే యీ విషయములలో నధమాధములగు దోషులని చూపుచున్నవి.

లోపలబయటగూడ నే నదృష్టవంతుడను. నాతో సంపర్కము కలిగిన ప్రతివాడు నన్ను గౌరవమర్యాదలతో చూచెను. జయిలులో నొక్క విషయముమాత్రము నాకు, మా బంధుజనులకు చాలకష్టము కలిగించెను. మా తల్లియు, కమలయు, నుమా రై ఇందిరయు నలహా బాదుజయిలులో మా బావమరది రంజిత పండితుని చూడవెళ్ళిరి. నా రెట్టితప్పుచేయకపోయినను జయిలరు వారి నగౌరవపరచి పైకి గెంటివేసెను. నే నీ విషయమును వినినపుడు చాల విచారించితిని. ఈ సందర్భములో రాష్ట్రప్రభుత్వమువారి చర్య నా కాశ్చర్యము కలిగించెను. జయిలు ఆఫీసరులు మా తల్లి నవమానపరపకుండ నేను బంధు దర్శనములను మానివేయ నిశ్చయించితిని. డేరాడూను జయిలులో నేడుమాసములవరకు నేను నా బంధువుల నెవరిని చూడలేదు.

—:o:—

# 44

## జయిలులోని వివిధభావములు

గోవిందవల్లభపంతును, నన్ను బెరెల్లీ జిల్లాజయిలునుండి డేరాడూను మార్చి బెరెల్లీలో రైలెక్కించుట మానివేసి యేబది మైళ్ళదూరములోనున్న మారుమూలస్టేషనుకు రాత్రి రహస్యముగా నొక మోటారులో తీసికొనివెళ్ళిరి. నెలలకొలది యేకాంతవాసములోనున్న మా కా రాత్రిపయనము హాయిగొల్పెను.

నేను బెరెల్లీజయిలువీడుటకు పూర్వ మొకవిశేషము జరిగెను. అది నా కింకను జ్ఞప్తికివచ్చుచుండును. బెరెల్లీలో పోలీసుసూపరింటెండెంటు ఒక ఆంగ్లేయుడు. అతడు నేను మోటారులో నెక్కుచుండ కొంచెముసిగ్గుతో బొమ్మలుగల పాతజర్మనుమేగజైనులకట్ట నొక దానిని నాకిచ్చెను. నే నతని నంతకుమును పెన్నడుకలుసుకొనలేదు. దాని తరువాత తిరిగి యతనిని చూడలేదు. నేను జర్మనుభాష నేర్చుకొనుచున్నానని విని యతడు నాకొరకు వీటిని పట్టుకొనివచ్చితినని చెప్పెను. ఐచ్ఛికముగ నతడు చూపినమర్యాదయు దానిని ప్రోత్సహించిన దయార్ద్రభావమునకు నే నతనియెడల కృతజ్ఞుడనైతిని.

ఆ నిశీథ దీర్ఘప్రయాణములో నే నాంగ్లేయులకు భారతీయులకు, పాలకులకు, పాలితులకు, నధికారులకు, ననధికారులకు, నాజ్ఞలను శిరసావహింపవలసినవారికి గల సంబంధమునుగురించి యోచింప నారంభించితిని. ఈ రెండుజాతులమధ్య నెంతయంతరువుగలదు! ఉభయులమధ్య నెంత యవిశ్వాసము, అప్రేమ కలవు! అవిశ్వాస అప్రేమలకంటె నొండొరులను గురించిన యజ్ఞాన మెక్కుడుగ నుండెను. ఈ కారణముచే వారొకరిని చూచి యొకరుభయపడుచు నొకరిసమక్షమున నొకరు జాగరూకులుగ మెలగుచుందురు. ఒకరి కొకరు కంటకులుగ ప్రేమరహితులుగ కాన్పించుచుందురు. ఈ తెర మఱుగున నౌచిత్యము దయ యున్నసంగతి యిరువురుగుర్తింపరైరి. తగినంత మేతవేయగల పాలకుడగుటచే నాంగ్లేయు లుద్యోగముల

గొఱ కతినీచముగ వేటాడువారెని, సమయానుకూల స్వాపాపములను చాలమంది నాకర్షించిరి.

ఈ యసహ్యాకర సాదృశ్యములనుబట్టి వారు హిందూదేశ మిట్టిదేయని నిర్ణయింతురు. భారతీయు డింగ్లీషువారెని యుద్యోగిగ మాత్రమే చూచును. నిజభావప్రేరితుడై వ్యక్తిగతముగ పనిచేయు నపుడుండు ప్రవర్తనకు నొకయధికారిగనో లేక సైన్యములో నొక యంగముగనో పనిచేయునపుడుండుప్రవర్తనకు నెంత భేదముకలదు !

'తయార్' అను కేక వినవచ్చుటతోడనే బిర్రబిగిసి సైనికుడు తనయాదరమును జారవిడచి యంత్రమువలె పనిచేయుచు నిరప రాధులు నిరుపద్రవకరులునైన ప్రజలను కాల్చిచంపివేయును. అట్లే యే వ్యక్తికి నపకారముచేయ సందేహించు పోలీసు యుద్యోగి, మరు నాడు,నిరపరాధులగు ప్రజలపై లాఠీచార్జిచేయ నాజ్ఞాపించును.అప్పు డతడు తన నొకవ్యక్తిగ తలంపడు. తాను లాఠీచార్జిచేయు లేక కాల్చు ప్రజ వ్యక్తులని తలంపడు.

మనము రెండవపక్షము నొకమూకక్రింద గుంపుక్రింద భావింప మొదలిడుటతోడనే మానవసంబంధము తెగిపోవును. గుంపుకూడ ప్రేమ, ద్వేష, బాధలనుభవించు స్త్రీలు, పురుషులు, బిడ్డలు అను సంగతి మనము మఱచిపోదుము. నిష్కపటియగు సామాన్యాంగ్లే యుడు చక్కనిభారతీయుల నెరుగుదునని యొప్పుకొనును. కాని వారు తప్పబుట్టినవారు. మొత్తముమీద భారతీయులందఱు గర్హింపదగిన మూక. సామాన్యభారతీయుడు ఆంగ్లేయులు కొందరు యోగ్యులని యొప్పుకొనును.కాని యీ కొద్దిమందిని మినహాయించినచో తక్కిన యాంగ్లేయులందరు నధికార ధూర్వహులు, క్రూరులు, చాలచెడ్డ వారు. ప్రతివాడు నితరజాతిని తా నెరిగిన వ్యక్తులనుబట్టిగాక తా నెంతమాత్రము నెరుగనివారినబట్టి విమర్శించుట చాల చోద్యము.

నా కనేక సౌకర్యములున్నను జయిలు జయిలుగ నేయుండెను. ఒకొక్కప్పుడు భారభూయిష్ఠమగు నా వాతావరణము దుర్భరముగ నుండెడిది. అచ్చటి వాయువే దౌర్జన్య, నైచ్య, అసత్య, అక్రమ

సంపాదనతో నిండియుండును. తిట్లకు కొఱతయుండదు. ఏమాత్రమభి మానమున్నవాడైనను నిరంతరోద్రేకస్థితితో నుండకతప్పదు. స్వల్ప సంభవములు మనుష్యులను తారుమారుచేయుచుండును. ఒకయుత్త రములోని చెడువార్త వార్తాపత్రికలోని యొక విషయము కొంత కాలము క్రోధమునకు లేక విచారమునకు కారణమగును. బాహ్య ప్రపంచమున కార్యనిమగ్నతలో నెప్పుడు సుఖముకలదు? అనేక విధములగు కార్యములు ప్రయోజనములు శారీరక మానసిక స్వాస్థ్యము, శాంతిచేకూర్చును, జయిలులో బయటకుపోవుమార్గము లేవియు నుండకపోవుటచే సీసాలోబిగింపబడినట్లు నిర్బంధింపబడినట్లు భావింపబడును. ఇట్టిస్థితిలో విధాయకముగ పాఠకబుద్ధి, విషయము లను వికటముగ నర్థముచేసికొనుట సంభవించును. జయిలులో వ్యాధిగ్రస్తుడగుటకంటె కంటకము వేరొండు యుండబోదు.

అయినను జయిలులోని నిత్యకర్మలకు నేను చక్కగ నలవడి తిని. నేను శరీర వ్యాయామ మానసికపరిశ్రమలచే స్వస్థచిత్తుడ నైతిని. వ్యాయామమునకు పనిపాటలకు బయట నెట్టివిలువయున్నను జయిలులో నవి చాల యవసరము. అవి లేనిచో కొంచెమించుమించు మతిపోవును. నేనొక కఠినమగు కాలపట్టిక ననుసరించెడివాడను. దానిని తప్పకుండుటకు నేను నా మామూలు యాచారములను. నిత్య క్షురకర్మవంటివాటిని, చాలవరకు జరుపుకొనెడివాడను. నేనీ స్వల్పవిషయము నుదహరింపవలసివచ్చెను. ఏలనన మనవారు దీనిని మానివేసి దీనితో నితరవిషయముల యెడలగూడ మాంద్యులగు చుండిరి. పగలంతయు పాటుపడిపనిచేయుటచే రాత్రి నాకు హాయిగ నిద్రపట్టెడిది.

ఇట్లు రోజులు, వారములు, నెలలు గడచిపోవుచుండెను. కాని యొకొక్కప్పు డొకమాసము పెనుభూతమువలెనుండి చప్పున గడవదు. ఒకొక్కప్పుడు నాకు విసుగు, వేసరిపాటు కలుగును. నా కందరియెడల నన్నింటియెడల, జయిలులోనున్న నా యెడల, సహచరులయెడల, జయిలు అధికారులయెడల, బయటనున్న ప్రజ

లోక పనిని చేయలేదనియో, చేసిరనియో వారియెడల, బ్రిటిషు సామ్రాజ్యముయెడల, సందర్భకంబును నాయెడల కోపముకలుగు చుండెడిది. నేను జయిలు జీవితముచే కలుగు వివిధభావోద్రేకములకు తావిచ్చు యుద్రేకముల ప్రోవునగుదును. అదృష్టవశమున నే నీయుద్రేకములనుండి త్వరితముగ స్వస్థతనొందెడివాడను.

జయిలులో బంధుమిత్రదర్శన దినములు సుఖావహములైనవి. దినములను లెక్కించుకొనుచు వాటికొరకు మే మెట్లు వేచియుండెడి వారము! ఆ బంధుదర్శనోద్రేకము చల్లారుటతోడనే తిరిగి యంతయు చప్పబడెడిది. మామూలుబంటరితనము, శూన్యత తప్పెడివికావు. ఒకొక్కప్పుడు తటస్థించున ట్లది జయప్రదముగ నుండనిచో తరు వాత నేను దుఃఖపడెడివాడను. ఈ సమయములో జయిలు అధికారు లుండెడివారు. కాని బెరెల్లీలో రెండుమూడుసారులు వీరికితోడు రహస్యశాఖకు చెందినవాడొకడు కాగితము పెన్సిలుపుచ్చుకొని మేము మాట్లాడు ప్రతియక్షరము వ్రాసికొనుచుండును. ఇది నాకు చాల కోపము కలిగించుటచే నివి పూర్తిగ చెడిపోయెను.

అలహాబాదుజయిలులో నన్ను చూడవచ్చినపుడు, తరువాత ప్రభుత్వము నాతల్లి యెడలను భార్యయెడలను చూపిన యమర్యాద ప్రవర్తనచే నేను వీటిని మానివేసితిని. సుమారేడు నెలలవరకు నేనెవ రిని దర్శించలేదు. ఆ కాలము నాకుశంతో మరహితముగ కాన్పించెను.

నేను తిరిగి బంధుదర్శనము చేయుటకు నిశ్చయించినతరువాత మా బంధువులు నన్ను చూడవచ్చినపుడు నా కమితానందము కలి గెను. నా చెల్లెలి చిన్నబిడ్డలుకూడ నన్ను చూడవచ్చిరి. వారిలో కడ గొట్టుబిడ్డ నాభుజములమీద కెక్కగోరినపుడు నేనుద్రేకమును పట్ట జాలకపోతిని. మానవస్పర్శానందము నభిలషించుచుండిన నా కా గృహజీవిత స్పర్శ సుఖదుఃఖములను కలిగించెను.

బంధుదర్శనములను మానివేసినపుడు యింటివద్దనుండియు నితర జయిలునుండియు వచ్చు పాక్షికలేఖలతిప్రియములగుచుండెను. మేము వాటికొరకాతురతతో నెదురుచూచుచుండెడివారము. అనుకొనిన

రోజున యుత్తరమురానిచో నేను చాల బాధపడెడివాడను. అయినను అది వచ్చినయెడల దానిని విప్పుటకు సందేహించెడివాడను. ధృవముగు నానందముతో చెలగాటమాడునట్లు నేను దానితో నాడెడివాడను. ఆ యుత్తరములో నాకు విచారముకలిగించువార్త, విషయములుండు నేమో యను భయముకూడ నుండెడిది. ఉత్తరములను వ్రాయుట యుత్తరములను తీసికొనుట జయిలులోని ప్రశాంతజీవితముపు నిశ్చల స్థితికి భంగకరము. అవి స్వాస్థ్యమును చెదరగొట్టు భావోద్రేకము కలిగించెడివి. తరువాత నొకటిరెండు రోజులవరకు మనస్సు చెదరి పోవుచు నిత్యకృత్యములమీద ధ్యాసముంచుట కష్టమయ్యెడిది.

నైనీ, బెరిల్లీలలో నాకు చాలమంది సహచరులుండెడివారు. డేరాడూనులో మొట్టమొదట గోవిందవల్లభపంతు, కున్వరఆనంద సింగు, నేను యుండెడివారము. కాని రెండునెలలయిన తరువాత పంతుజీ యతనిశిక్షాకాలము పూర్తియగుటతోడనే విడిచిపెట్టబడెను. తరువాత మమ్ము మరిద్దరు కలుసుకొనిరి.

1933 జనవరిప్రారంభములో నా స్నేహితులందరు వెడలిపోవు టచే నేనొక్కడినే మిగిలితిని. సుమారెనిమిదినెలలవరకు, ఆగష్టు మాసాంతమున నేను విడుదలయగువరకు డేరాడూనుజయిలులో నే నొక్కడనే యుంటిని. జయిలుఅధికారులు రోజు కేకొలదినిమిష ములో మాట్లాడుటతప్ప యిక నాతో మాటలాడువారెవరు నుండెడి వారుకారు. ఇది పేరు కేకాంతవాసము కాదు. కాని దానికి చాల చేరికయైనది. ఇది నాకు దుఃఖమయమగుకాలము. అదృష్టవశాత్తు నేను నాబంధుదర్శనములనుతిరిగిప్రారంభించుటచే నాకుకొంతయుపశాంతి కలుగుచుండెను. నేనుబయటనుండి పువ్వులను, కొద్దిపటములను తెప్పించు కొనవచ్చుననిరి. అవి నాకెంతయో యానందము చేకూర్చెడివి. మామూలుగ పటములను, పువ్వులను లోపలకు రానీయరు. అనేక సారులు నాకొఱకు పంపబడిన పువ్వులను నాకిచ్చుటకు నిరాకరించిరి. మాగదులనలంకరించుకొనుటకుచేయుప్రయత్నముల నెంతమాత్రము ప్రోత్సహించెడివారుకారు. నా ప్రక్కగదిలోనున్న నా సహచరు

డొకడు తనయలంకార సామగ్రి నొక క్రమములో నుంచుకొనగా జయిలు సూపరింటెండెంటు దాని కర్థ్యాంతరము చెప్పెను. తనగది నాకర్షవంతముగ, "భోగయోగ్యము"గ చేయరాదని యతడు వాదింపబడెను. ఆ విలాసవస్తువు లేవియనిన పండ్లుతోముకొను బ్రష్, పండ్లపొడి, షాంపెన్ కలము, దానికి కావలసిన సిరా, తలనూనె సీసా, దువ్వెన, తలను సింగారించుకొను బ్రష్, మరియొకటి రెండు చిన్నవస్తువులు.

జీవితములోని చిన్నవస్తువులవిలువ జయిలులో బాగుగ గుర్తింపబడును. అచ్చట మనకుండువస్తువు లతిస్వల్పము. వాటికిమరి కొన్నిటిని జేర్చుకొనుట, బదిలీగా తెచ్చుకొనుట సులభవిషయము గాదు. బయటప్రపంచములో మనము పారవేయుచుండు చిన్నవస్తువులనచ్చట ప్రాణప్రదముగ చూచుకొనెదము. విలువవస్తువుల నుంచుకొనుటకు వీలులేనిచోటగూడ ఆస్తియుండవలెనను భావము మనలను విడకుండును.

ఒకొొక్కప్పుడు శరీరసుఖము, హాయిగొల్పు పరిసరములు, మిత్రబృందము, ప్రయోజనకరసంభాషణ, పిల్లలతో నాడుకొనుట... వీటికొరకు శరీర మూ వేదనపడును. ఒకపటము లేక వార్తాపత్రికలోని యొక పేరా సూచన పర్వదినములను కండ్లకుకట్టినట్లు జ్ఞప్తికి తెచ్చును. తోడనే యింటిమీద దృష్టిపాఱును. ఆ దినమంతయు చిరాకుగనుండి గడుపుట గగనమగును.

నేను ప్రతిదినము కొద్దిగ వడికెడివాడను. దీనివలన నాకు ముఖ్యమగు శరీరకష్టముకొంత ప్రాప్తించెడిది; మానసిక పరిశ్రమకు కొంత విరామముగనుండెడిది. కాని వ్రాసికొనుట, చదువుకొనుట నాప్రధాన వృత్తి. నిర్బంధములు, తణిఖీ చేయుటయుండుటచే నాకుకావలసిన పుస్తకములు లభించెడివికావు. తణిఖీ చేయుటకెల్లప్పుడు సమర్థులుండెడివారు కారు. శీర్షిక ఉపద్రవకరముగ రాజద్రోహాకరముగనున్నదని స్పెంగ్లరు యొక్క "పాశ్చాత్త్యుల పతనము" అను పుస్తకము నాపివేసిరి. మొత్తముమీద నాకనేకరకముల పుస్తకములీయబడుటచే నేనెట్టి ఫిర్యాదుచేయరాదు. నాయెడల ప్రత్యేకాభిమానము చూపబడినట్లు

కాన్పించును. నా సహచరులు చాలమందికి ("ఎ"తరగతిఖయిదీలు) వర్తమాన పరిస్థితులనుగురించిన పుస్తకములు దొరకుట దుర్ఘటమయ్యెడిది. బ్రిటిషుప్రభుత్వమువారి చట్టసంబంధమైన మార్పులను సూచించు అధికార శ్వేతపత్రములుగూడ కాశీజయిలులో నిరాకరింపబడెనని చెప్పిరి. మత పుస్తకములను లేక నవలలను మాత్రమే ప్రభుత్వ అధికారులు హృదయపూర్వకముగ శిఫారసుచేసెడివారు. మతము బ్రిటిషుప్రభుత్వహృదయమున కెంతప్రియమైనది! అది యెంత నిష్పాక్షికముగ మతముద్రగలసమస్తమును ప్రోత్సహించును!

భారతదేశములోసామాన్యపౌరస్వత్వములే త్రుంచివేయబడు చుండ ఖయిదీలహక్కులనుగురించి మాట్లాడుట యసమంజసమగును. అయినను యీవిషయము యోచింపదగినది. కోర్టువారిచే శిక్షింపబడి నంతమాత్రముచే నొకనిశరీరమేగాక మనస్సుకూడ నిర్బంధింపబడ వలెనను న్యాయ మెచ్చటకలదు? ఖయిదీలశరీరములు నిర్బంధింపబడి నను వారిమనస్సులు స్వేచ్ఛగనుండగూడదా?భారత జయిలుపరిపాల నాధికారు లట్టిప్రశ్నను వినినపుడు నిర్ఘాంతపోయెదరు. ఏలనన నూతనభావములను యోగ్యమగు యోచనలను చేయుటకు వారిశక్తి యత్యల్పము. పుస్తకములను తణిఖీచేయుపద్ధతి యేకాలమందు మంచిదికాదు. అది పక్షపాతముగను బుద్ధిహీనముగను నుండును. భారతదేశములో నది మన కాధునికసాహిత్యమును, పురోభివృద్ధిలో నున్న పత్రికలను, జర్నలులను లేకుండచేయును. నిషేధింపబడిన పుస్తకములసంఖ్య విస్తారముగ నుండుటయేగాక నది నిత్యాభివృద్ధి యగుచుండును. వీటికి తోడు ఖయిదీకి రెండవతణిఖీ (ప్రత్యేకతణిఖీ) యుండుటచే నతడు బయట న్యాయముగ కొని చదువుకొనుట కవకాశముగల యనేక పుస్తకములను వార్తాపత్రికలను చదువుకొనుటకు వీలుండదు.

న్యూయార్కులోని సింగుసింగు జయిలులో కొంతకాలము క్రిందట కొన్ని కమ్యూనిష్టు పత్రికలను నిషేధించుటచే నీసమస్య చర్చకు వచ్చెను. అమెరికాలోని పాలకజాతులలో కమ్యూనిష్టులపై

వ్యతిరేకభావ మతితీవ్రముగ నుండెను. అయినప్పటికి జయిలులో నున్నవారు తమకు కావలసిన యే పుస్తకమునైనను కమ్యూనిస్టు వార్తాపత్రికలు మేగజినులుసహా తెప్పించుకొనుటకు జయిలు అధికారు లొప్పుకొనిరి. జయిలు వార్డెనుద్రేకములను కలిగించునని తలంచి కార్టూనులు మాత్రమే పనికిరావనెను.

అధికసంఖ్యాకులగు ఖయిదీల కెట్టివార్తాపత్రికలు వ్రాతసౌకర్యములు కలుగనీయని భారతదేశములో ఖయిదీలకు మానసిక స్వాతంత్ర్యముండవలెనను సమస్య చర్చించుట కొంచెము పరిహాసాస్పదముగనుండును. ఇది సంపూర్ణ నిరాకరణముగాని తనిఖీకాదు. ఒక్క 'ఎ' క్లాసుఖయిదీ (వంగదేశములో 1వడివిజను)కి వ్రాత సౌకర్యములను కలిగింతురు. వీరందరికైనను దినపత్రికల నీయరు. ఇవ్వబడు పత్రిక ప్రభుత్వము కిష్టమైన దినపత్రిక. 'బి' 'సి' తరగతుల ఖయిదీలకు, రాజకీయఖయిదీలకైనను, తదితరులకైనను, వ్రాత సౌకర్యములుండవు. ఒకొక్కప్పుడు వీరిలో మొదటివారి కివి ప్రత్యేకసౌకర్యములుగ ప్రసాదింపబడి తరుచు లాగివేయబడుచుండును. వేయింటికొక్క 'ఎ' తరగతి ఖయిదీ. భారతదేశఖయిదీల దుస్థితినిగురించి యోచించునపుడు వీరిని మినహాయింపవచ్చును. కాని యట్లభిమానింపబడు 'ఎ' తరగతి ఖయిదీకి పుస్తకములు వార్తాపత్రిక సౌకర్యములు నాగరికదేశములో సామాన్యఖయిదీల కీయబడు వాటికంటె చాలతక్కువ.

వేయింట తక్కిన 999 మంది తడవకు రెండుమూడు పుస్తకముల నుంచుకొనవచ్చును. కాని వారీ సౌకర్యము నెల్లప్పుడు పొందజాలని షరతులుండును. వ్రాసికొనుట చదివిన పుస్తకముల నుండి నోట్సు తీసికొనుట యుపద్రవకర వినోదములు. వారట్టి భోగములలో మునుగరాదు, మానసికాభివృద్ధి నీవిధముగ బుద్ధిపూర్వకముగ నిరుత్సాహపరచుట చోద్యము. ఇది యదార్థమును విదితముచేయుచునేయున్నది. ఖయిదీని సంస్కరించుటకు, నతనిని యోగ్యమగు నాగరికుని చేయుటకు, నతని మనస్సును

గ్రహించవలెను. దానిని సరియగు మార్గముకు త్రిప్పవలెను. అతనికి చదువుచెప్పి యేదో యొకవృత్తి నేర్పవలెను. కాని భారతదేశములో జయిలుఅధికారుల కీవిషయము, యీ దృష్టి బహుశః గోచరించదు. యు.పి. రాష్ట్రములో నిశ్చయముగ నిట్టిదేదియుకానరాదు. జయిలులోనున్న పిల్లలకు యువకులకు చదువును వ్రాయను నేర్పుటకు నవీనముగ కొన్ని యత్నములు చేయబడెను.కాని యివిపూర్తిగ నిరర్థకములు.ఆపనికి నియోగించబడినవా రసమర్థులు. ఖయిదీలకు చదువుకొనుట యనిన గిట్టదట. కాని నాయనుభవము దీనికి కేవలము వ్యతిరేకము.దీనికొఱకుచాలమంది నాదగ్గఱకువచ్చుచుండిరి. చదువుకొనుటకు,వ్రాసికొనుటకు వారిలో సంపూర్ణయుత్సాహముకాన్పించెడిది. మాదగ్గరకువచ్చిన ఖయిదీలకు మేము చదువుచెప్పెడివారము.వారు కష్టపడి పనిచేసెడివారు. ఒక్కొక్కప్పుడు నేను నిశీథమందు మేల్కాంచినపుడు వారిలోనొకరిద్దరు తమ కొటారులో నొక గుడ్డిలాంతరుదగ్గర కూర్చుని చదువుకొనుట చూచి యాశ్చర్యపడెడివాడను. వారు మరునాటి పాఠముకు తయారగుచుండెడివారు.

నేను నాపుస్తకములలో మునిగియుండి రకరకములపుస్తకముల చదువుచుండెడివాడను. కాని మామూలుగ 'కఠిన' పుస్తకములనే చదువుచుండెడివాడను. నవలలుమానసికమాంద్యముకలుగచేయును. నేను వాటి నెక్కువ చదువలేదు.ఒక్కొక్కప్పుడెక్కువగచదువుటచే నేనువిసుగుచెంది వ్రాయుట ప్రారంభించెడివాడను.నాకుమాత్రెకు నేను వ్రాసిన చారిత్రకలేఖలు నా రెండుసంవత్సరముల శీతాకాలమునకు నాకు సరిపడిన పనికలిగించి, నామానసికస్వాస్థ్యముకెంతయోతోడ్పడెను. నేను వ్రాయుచుండినభూతకాలచరిత్రలో కొంతవరకు జీవించు నేను నా జయిలుపరిసరములను కొంచెమించుమించు మరచిపోతిని.

పురాణయాత్రికుల గ్రంథములు–హూనిట్సాంగున్ను, మార్కోపోలో, ఇబన్‌బటూట మొదలగువారి గ్రంథములను, ఆధునికులగు స్వెన్‌హెడెన్, రోరిక మొదలగువారి గ్రంథములు సత్కరింపబడుచుండెను. చిత్రములుగల పుస్తకములుకూడ, ముఖ్యముగ పర్వత

ములు, మంచుదిబ్బలు, యెడారులుగలవి, యూహాహ్వానింపబడుచుండెను. ఏలనన జయిలులో విశాలసీమలకొఱకు, సముద్రములకొఱకు, పర్వతములకొఱకై పరితపించుచుంటిమి. నావద్ద ఆల్ప్సు, గ్లాంకు, హిమాలయపర్వతముల సుందరచిత్రములుగల పుస్తకములు కొన్ని యుండెడివి. నాగదియొక్క యుష్ణత 115 ఫారెన్‌హీట్ యున్నప్పుడు నేను తెఱచు యీ పటములనుతీసి మంచుదిబ్బలను తదేకదృష్టితో చూచుచుండెడివాడను. అట్లాసు (దేశములనుచూపు చిత్రములుగల పుస్తకము) మంచి హుషారు పుట్టించెడిది. అది ఎన్నివిధముల భూతకాలచరిత్ర జ్ఞప్తికి తెచ్చుచుండెడిది. మేముచూచిన దేశములను గురించిన కలలు, చూడదలచుకొనిన ప్రాంతముల కలలు వచ్చుచుండెడివి. వెనుక తిరిగిన ప్రదేశములను చూడవలెనను కోరిక – గొప్పగొప్ప పట్టణములను సూచించు నితరమార్కులను, చుక్కలను, పర్వతములను సూచించు రంగులుగల ప్రాంతములను, సముద్రములను సూచించు పచ్చనిసీమలను, ప్రపంచములోని శృంగార విశేషములను, నిరంతరము మారు మానవలోక పోరాటములను, సంఘర్షణలను పరీక్షింపవలెననుకోరిక ఉద్భవించి మమ్మావహించెడివి. ఇంతలో మేము తొందరగ, విచారముతో అట్లాసు ముడిచివేసి, మమ్మావరించియుండిన మా మామూలుగోడలకు దైనందిన రసహీన నిత్యకర్మలకు బూనుకొనెడివారము.

# 45

## జయిలు జంతువులు

నేను ఢేరాడూనుజయిలులో నాగదిలో పదునాలుగున్నర మాసములు నివసించుటచే కొంచెమించుమించు దానిలో నొకభాగమయినట్లు భావింపనారంభించితిని. అందులోనున్న ప్రతిభాగముతో నాకు పరిచయముకలిగెను. వెల్ల వేయబడిన యాగోడలమీద, నునుపు లేని నేలమీదగల ప్రతిచిహ్నము, మిట్టపల్లములు, చెద తిని వేసిన దూలములతోనున్న పయికప్పుభాగము నాకు బాగుగా తెలియును. బయటనున్న చిన్నదొడ్డిలోగల చిన్నచిన్నపచ్చికసీమలను, అందముకొఱకమర్చబడిన రాతిముక్కలను నేను ప్రాతస్నేహితులవలెచూచుకొనుచుండెడివాడను. నాగదిలో నేనొక్కడినేగాక నాతో కందిరీగలు, తుమ్మెదగుంపులనేకములుండెను. దూలములవెనుక ననేకబల్లులు నివసించుచు సాయంత్రమాహారముకొఱకు బయటకు వచ్చుచుండెడివి. ఆలోచనలు, భావములు భౌతిక పరిసరములమీద తమచిహ్నములను విడిచిపెట్టునెడల నాగదిలోని వాయువుకూడ వాటిచే పూరింపబడి యుండును. అవి యాప్రదేశములోనున్న ప్రతివస్తువుకుకూడ పట్టుకొని యుండును.

ఇతరజయిళ్ళలో నాకు మంచిగదులే యుండెడివి. కాని ఢేరాడూనులో నాకొక యమూల్య సౌకర్యముండెడిది. ప్రధానజయిలుభాగము చాలచిన్నది. జయిలు వెలుపలనున్న యొక పాతకొట్టులో (జయిలు ఆవరణలోనే) మమ్ము పెట్టిరి. మే మందులో తిరుగుటకెంత మాత్రము చోటులేకపోవుటచే నుదయ సాయంత్రములయందు గుమ్మముముందరనొకవందగజములదూరముమమ్ము నడువనిచ్చెదరు. మేము జయిలుకాంపౌండులో నేయున్నను గోడలనుదాటి బయటకు వచ్చుటచేకొంతదూరములోనున్నపర్వతములను, పొలములను, బహిరంగరోడ్డు చూడగలిగెడివారము. ఇది నాకొసంగబడిన ప్రత్యేకసౌకర్యముకాదు. ఢేరాడూనుజయిలులోనుంచబడు 'ఎ' 'బి' తరగతి ఖయిదీలందఱకు నిది సమముగనుండెను. కాంపౌండులోనే జయిలుగోడల

బయుట యూరపియనులనుంచు నట్టిదొక చిన్నభవనముకలదు. దీని
చుట్టు ప్రత్యేకగోడలేదు, కనుక గదిలోనున్న మనిషి సుందర పర్వత
దృశ్యములను, బాహ్యజీవితములను అనుభవింపవచ్చును. ఇచ్చటనుంచ
బడు యూరపియనుఖయిదీలు తరచు తక్కువకాల జయిలుగుమ్మముముం
దర ప్రతి యుదయసాయంత్రము లచట నడువవచ్చును.

చిరకాల మెత్తైనగోడల వెనుక బంధింపబడినఖయిదీయే యీ
విహారములయొక్కయు నీలాకాశదృశ్యములయొక్కయు నసామాన్య
యాధ్యాత్మికవిలువ గ్రహింపగలడు. ఈ పర్వతములను నేనెంతయో
ప్రేమించుటచే వర్షకాలములోకూడ. ఎడతెగని వానపాతమున్నను,
చీలమడమలోతునీళ్ళలో నేనునడచిపోవుచుండెడివాడను. ఇట్టివిహార
ములను నేనెచ్చటనైనను యనుభవించెడివాడను. కాని ప్రక్కనున్న
మహత్తరమగు హిమాలయపర్వతదృశ్యము నాసంతోషమును ద్విగు
ణముచేసి జయిలుఖేదము నపనయింపుటకు చాలవరకుతోడ్పడెను.
ఎట్టి బంధుదర్శనము లేక నొంటరిగనున్న యాదీర్ఘకాలములో
నే నెక్కువగా ప్రేమించిన ఆపర్వతములను వీక్షించుచుండగలుగుట
నాభాగ్యము. నాగదిలోనుండి నేను వాటినిచూడజాలను. కాని నా
హృదయము వాటిచేనిండియుండెను. అవి సమీపముననున్నసంగతి
నాకెప్పుడు జ్ఞప్తియందుండి మామధ్య నొకరహస్యపరిచయ మభి
వృద్ధి యగుచున్నట్లుండెను.

"దూరమున గగనమార్గమున ఖేచరపంక్తులెగిరిపోవుచుండెను.
ఒక యేకైకనీలనీరదశ్రేణికూడ యాత్రచేయుచు చటచటజరిగిపోయెను.
వెనుకనున్న మహోన్నతచింగుటింగుశిఖరముతో నేనొంటరిగకూర్చొ
నెదను. మేమెన్నడును (ఆ పర్వతము, నేను) పరస్పరము విసుగుచెంది
యెరుగము" అని లీపైపో యనునొకకవి వ్రాసెను. అతనివలె పర్వత
ముతో నెప్పుడు విసుగుచెందలేదని నేనుచెప్పజాలను. కాని యీయను
భవ మసామాన్యమైనది. దానిసాన్నిధ్యము నా కానందము కలుగ
చేసెను. దానినిశ్చలత, దానిస్థైర్యము లక్షలకొలదివత్సరముల యను

భవజ్ఞానముతో నన్నుతిలకించుచు నా చంచలభావముల నెగతాళి చేయుచు నాక్లేశపూరితమనస్సు నుపశమింప జేయుచుండెను.

ఢేరాడూనులో వసంతకాల మతిముదావహముగ నుండును. క్రిందమైదానములలో నుండుదానికంటె నది యిచ్చట హెచ్చుకాల ముండును. శీతకాలము చెట్లయాకులన్నింటిని రాల్చివేసి మోడులను చేసెను. జయిలుద్వారముసుందరనున్న నాలుగుమహోన్నతయశ్వత్థ వృక్షములుకూడ కొంచెమించుమించు యాకుల నన్నింటిని రాల్చి వేయుట నాకెంతయో యాశ్చర్యము కలిగించెను. అవి బక్కచిక్కి, సంతోషముదక్కి వసంతకాల ప్రాణవాయువులు తిరిగి వాటికుత్సాహముగొల్పి, వాటియంతర్నాడులకు జీవితసందేశమును పంపువరకు నట్లేనిలిచియుండెను. అకస్మాత్తుగా నారావులలోను, తదితర చెట్లలోను చైతన్యముద్భవిల్లెను. తెరమఱుగున జరుగు రహస్యక్రియావిశేషములవలె వానినొకరహస్యావాతావరణమావరించెను. వాని యన్ని భాగములనుండియు పచ్చదనము తొంగిచూచుచుండుటను చూచి నేనాశ్చర్యచకితుడనైతిని. ఆదృశ్యము సంతోషోత్సాహ జనకముగ నుండెను. ఇంతలోనతి వేగముగ లక్షలుపదిలక్షలుకొలదిగ లేతయాకులు సూర్యరశ్మిలో తళతళ ప్రకాశించుపిల్లవాయువులతో కేళి సల్పుచుండును. చిగురు, వర్ణములోపల కలుగు నకస్మాత్ పరిణామ మెంత యద్భుతమైనది !

లేమావిచిగురు కాశ్మీరుపర్వతములమీద శరత్కాలవర్ణముల వలె చెంగావి వర్ణము కలిగియుండునని నేనంతకుముసుపెన్నడు గ్రహించియుండలేదు. కాని వెంటనే రంగుమారి యది పచ్చబడును.

వేసవికాల తాపమును చల్లార్చునుగనుక ప్రావృట్కాల వర్షము నెప్పుడును హాయిగొల్పును. కాని యవి యెందును పనికిరావు. ఢేరాడూను వరుణదేవునకు ప్రియమైన ప్రదేశము. వర్షఋతువు ప్రారంభమైన మొదటి యైదారువారములలో నేటది లేక నరువది యంగుళముల వర్షముకురియును. కిటికీలనుండియు, పైకప్పులనుండియు, పడు వర్షధారలను తప్పించుకొనుటకు కాళ్ళుముడిచికొని యేమూలనో

కూడ స్నేహియుండుట సంతోషప్రదమైన విషయము కానేరదు.

శరత్కాలముకూడ సుఖముగనుండును. శీతాకాలముకూడ, వర్షము లేనిచో బాగుండును. ఉరుములు, వర్షము, గడగడలాడించు చలిగాలులు వెలుపలనున్నప్పుడు చక్కనిభవనము, సుఖము, తగిన యుష్ణత యుండవలెనను కోరికపుట్టును. అప్పుడప్పుడు గోళీలకంటె పెద్దవియగు వడగండ్లు రేకుకప్పులమీద దబదబ పడుచు ఫిరంగి ప్రోతవలె నట్టహాసముచేయును.

ముఖ్యముగా నాకొక్కదినము జ్ఞప్తియందున్నది; అది 1932 డిసెంబరు యిరువదినాలుగవ తేదీ. ఆ దినమంతయు వడగండ్లవర్షము. వర్షముకురియుచు చలి మిక్కుటముగ నుండెను. నేను జయిలులో గడపిన దినములలో నది దుర్దినమని చెప్పవలెను. సాయంకాలమొక స్మాత్తుగ తెరిపియిచ్చెను. దగ్గరనున్న పర్వతములు, గుట్టలు దట్టమగు మంచుతో కప్పబడిన దృశ్యమును చూచినపుడు నా విచారమంతయు పలాయనమయ్యెను. మరునాడు క్రిస్మసు పండుగ. నిర్మలముగ నానందదాయకముగను నుండెను.

మా మామూలువిధులను నెరవేర్చుకొనుట కాటంకము కలుగుటచే మేము ప్రకృతిరహస్యముల నెక్కువగ పరీక్షించుచుంటిమి. మేము మాకు కాన్పించువివిధజంతువులను పురుగులనుకూడ పరిశీలించుచుండెడివారము. నేను పరీక్షించుచుండిన కొలది నాగదిలోను, బయటనున్న చిన్నదొడ్డిలోను అనేకరకములగు కటకములను చూచుచుండెడివాడను. ఒంటరితనమును గురించి నేను ఫిర్యాదుచేయుచుండినను శూన్యముగను యెడారివలెను కాన్పించిన యీదొడ్డి జీవరాసులతో నిండియున్నట్లు నేను కనుగొంటిని. ప్రాకునట్టి లేక యెగురునట్టి యీ కీటకములన్నియు నన్నెంతమాత్రము బాధింపక తమ జీవితమును గడుపుకొనుచుండ నేనుకూడ వాటిజోలికిపోవుటయుక్తముకాదనుకొంటిని. కాని నల్లులకు, దోమలకు, కొంతవరకు ఈగలకు నాకు మధ్య నిరంతరపోరాటము జరుగుచుండెడిది. నాగదిలో పందలకొలదిగనున్న కందిరీగలను తుమ్మెదలను నేను సహించితిని.

ఒక కందిరీగ నన్ను పట్టినప్పుడు మా కొక చిన్నసంగ్రామము జరిగెను, ఆకోపములో నే నాజాతినంతను నాశనముచేయ యత్నించితిని. కాని యవి తమ తాత్కాలికాశ్రయమును కాపాడుకొనుటకు చెలరేగి ఘోరసంగ్రామము సలిపెను. నేను తగ్గిపోయి యవి యిక నా జోలికి రాకపోయినచో వానిని సుఖముగ జీవింపనీయవచ్చునని నిశ్చయించుకొంటిని. తరువాత నేనచ్చట సుమా రొక వత్సరము కందిరీగలతోను, తుమ్మెదలతోను నివసించితిని. అవి నా జోలి కెన్నడురాలేదు. మేము పరస్పరము గౌరవించుకొనెడివారము.

గబ్బిలములనిన నా కసహ్యము. అయినను నేను వానినిసహింప వలసివచ్చెను. సంజచీకటిలో నవి నిశ్శబ్దముగ నెగురుచు వినీలాకాశము లోనికి పోవుట చూచెడివాడను. అవి భూమితో సంబంధములేని జంతువులు. అవియనిన నాకసహ్యము. అవి సరిగా ముఖమునకొక యంగుళముదూరమునుండి రయ్యిమని యెగిరిపోవుచుండును. అవి నా ముఖమును గీరునేమోయని నేనెప్పుడును భయపడెడివాడను. పెద్ద గబ్బిలములు చాల యెత్తైన వాయువులలో పోవుచుండెడివి.

నేను చీమలను చెదలను యితరకీటకములను గంటలకొలది పరీక్షించుచుండెడివాడను. సాయంకాలము బల్లులు మెల్లగా ప్రాకివచ్చి యాహారముకొఱకు కీటకములను వేటాడుచు తోకల నొక వింతవిధముగ నాడించుచు నొండొరులను తరుముకొనుచుండెను. సామాన్యముగ నవి కందిరీగలజోలికిపోకుండెను. కాని యవి వాటి నతిజాగ్రతతో వేటాడి ముందునుంచి పట్టుకొనుట నేను రెండుసార్లు చూచితిని. పట్టుబడకుండుట కవి యట్లు బుద్ధిపూర్వకముగ చేయునో లేక నవి యాగంతుక సంభవములో నేను చెప్పజాలను.

ఉడుతలు చెట్లుదగ్గరున్నచో గుంపులుగుంపులుగ నుండెడివి. అవి చాలసాహసమునుచూపుచు మాసమీపమునకువచ్చుచుండెడివి. లక్నోజయిలులో నేను కదలకుండకూర్చొని చాలసేపు చదువుకొనుచుండ నొకయుడుత చటచట నా కాలుమీదకెక్కి నామోకాలు మీద కూర్చుని సింహావలోకము చేయును. తరువాత నది నా కండ్ల

కేసిచూచి నేను చెట్టును కాదని గ్రహించెడిది. అప్పుడు భయమావహించుటచే నది పారిపోవును. ఒక్కొక్కప్పుడు యువతపిల్లలు చెట్లమీదనుండి క్రిందపడిపోవుచుండును. వెంటనే తల్లి పరుగెత్తుకొనివచ్చి వాటినియుండక్రిందచుట్టి తీసికొనిపోవును. అప్పుడప్పుడు పిల్లలు తప్పిపోవుచుండును. నా స్నేహితుడొకడు తప్పిపోయిన పిల్లలను మూటిని పట్టుకొని పోషించెను. అవి చాల చిన్నవి. వాటిని పోషించుట మాకొక సమస్య యయ్యెను. చివర కొక చక్కని మార్గము దొరకెను. ఊటకలములో సిరాపోసికొను గాజుగొట్టముతో వాటి కాహారము నిచ్చుట కేర్పాటుచేయబడెను.

నేను వెళ్ళిన యన్నిజయిళ్ళలోను, ఒక్క ఆల్మోరాలోతప్ప, పిచ్చుక లసంఖ్యాకములుగ నుండెడివి. అవి వేలకొలదియుండి సాయంకాలమగునరికి యాకసమును కప్పివేయుచుండెను. ఒకొక్కప్పుడు జయిలు అధికారులు వాటిని తుపాకులతో కాల్చి చంపి యాహారముగ చేసికొనెడివారు. గోరువంకలు ప్రతిచోటనుండెడివి. డేరాడూనులో నాగదిగుమ్మముపై నొకదంపతి గూడుకట్టుకొని నివసించుచుండెను. నేను వాటికాహారము పెట్టెడివాడను. అవిచాలమచ్చికపడెను. ఉదయ సాయంకాలములయందు వాటియాహారమున కేమాత్రము ప్రొద్దుపోయినను యవి నాదగ్గరకూర్చుని బిగ్గరగా కేకలువేయును. అవి చేయు సంజ్ఞలను పరీక్షించుచుండుటయు తాల్మిలేని వానియరపులను వినుటయు వినోదకరముగ నుండును

నైనీలో వేలకొలది రామచిలుకలుండెను. నాకొటారుయొక్క గోడలలోని కన్నములలో నవి తెగలక్రింద నివసించుచుండెను. వాని యుపసర్పణ విధానము, ప్రణయచేష్టలు సదా మనోజ్ఞముగనుండును. ఒక్కొక్కప్పు డొక యాడుచిలుకకొఱకు రెండు మగచిలుకలు ఘోర సంగ్రామము గావించుచుండ నాయాడుచిలుక ప్రక్క నతిశాంతముగ కూర్చుని యుద్ధములో జయించినదానిపై తన ప్రేమరసమును చిమ్ముటకు సన్నాహపడుచుండును.

డేరాడూను జయిలులో వివిధరకముల పక్షులు గలవు. వాటి కలకలములు, కిలకిలలు, కూజితములు, కేకలు, కోయిలలగానములు_ వినసొంపగుచుండును. వర్షకాలములో తీతువపిట్ట (బుద్ధిజాడ్యముగల పక్షి) వచ్చుచుండెడిది. దానికట్టి పేరెందుకు కలిగెనో నేను వెంటనే గ్రహించితిని. అది రాత్రింబవళ్ళు వర్షించుచున్నను,తీవ్రముగా నెండ కాయుచున్నను, విరామములేకుండా నొక్కపాటనే పాడుచుండును. సాధారణముగ నేమీపక్షులను చూడజాలకుంటిమి. వాటిధ్వనులను మాత్రమే నేము వినగలిగెడివారము. కాని గ్రద్దలు, గరుడపక్షులు గగనమార్గమున నతిరమణీయముగ నెగిరిపోవుచుండ నేను వీక్షించు చుండెడివాడను. అవి యొకొక్కప్పుడు తటాలన క్రిందకువ్రాలుచు తిరిగి పైకెగిరిపోవుచుండును. తఱచు యడవిపక్షుల గుంపు మా తల మీదనుండి యెగిరిపోవుచుండును.

బెరిల్లీ జయిలులో నొక పెద్ద కోతులదండు కలదు. ఇక నవి చేయు చేష్టలకు హద్దులేదు. ఒక కథ నామనస్సుకు బాగుగ పట్టెను. ఒక చిన్నకోతిపిల్ల నా కొట్టుగల యావరణలోని కెట్లోవచ్చి తిరిగి యాగోడ నెక్కి పోజాలకుండెను. జయిలువార్డరు,కొంతమందిఖయిదీ ఓవరుసీర్లు దానిని పట్టుకొని మెడకొక త్రాడుగట్టిరి. దాని తలి దండ్రులు యెత్తైన యా ప్రాకారముపయినుండి యీ కధనంతను చూచుచుండెను. వాటికి హద్దులేని కోపము కలిగెను. అకస్మాత్తుగా వానిలో నొక పెద్దకోతి క్రిందకురికి యా పిల్ల చుట్టూమూగిన మూక నెదుర్కొని యసామాన్యమైన ధైర్యమునుచూపెను. ఏలనన వార్డరు, ఖయిదీ ఓవరుసీర్లు కర్రలను_లాఠీలనుపుచ్చుకొనిగిరగిర త్రిప్పుచుండిరి. చివరకు దాని ధైర్యసాహసములే దిగ్విజయమునొందెను. భయ భ్రాంతులై కర్రలను వెనుక పారవేసి యా మానవమూక పిక్క బలము చూపెను. కోతిపిల్ల స్వజనమును చేరుకొనెను.

మే మెంతమాత్రము నాహ్వానింపజాలని జంతుప్రేక్షకగణము మమ్ము తఱచు చూడవచ్చుచుండెను. మాగదులలో వృశ్చికములకు కొదువలేదు. ముఖ్యముగ వర్షముపడినతరువాత నవి చెలరేగుచుండె

డివి. కాని నన్నెప్పుడు నవి కుట్టకుండు టాశ్చర్యము. వానికి వీలు లేని
చోట్ల నేను తారసించుట సంభవించెడివి. నా పరుపుమీదనో లేక
పుస్తకముమీదనో యవి జేరుచుండును. నే నొకసారి యొక పల్లటి
విషపుతేలును కొంతకాల మొక సీసాలోనుంచి చిన్న చిన్న యీగల
నాహారముగ నిడెడివాడను. తరువాత దాని కొక త్రాడుకట్టి యొక
గోడకు వ్రేలాడగట్టగా నది యెటో పారిపోయెను. అది తిరిగి విచ్చల
విడిగా తిరుగునేమో యను భయముచే నేను నా గదినంతను శుభ్ర
ముగా తుడిచి దానికొఱ కెంత వేటాడినను నా కది దొరక లేదు.

నా గదులలోను సమీపమునను నాకు రెండు మూడు పాములు
కూడ కాన్పించెను. ఒక పామునుగుఱించిన వార్త పయికి పొక్కెను.
తోడనే యది పత్రికాశీర్షికలలో గాన్పించెను. ఈ వినోదమును నే
నానందించితిని. జయిలుజీవితము నిస్సారముగనుండును గనుక దీనిని
ఛేదించున దేదియైనను సంతోషదాయకముగ నుండెడిది. పాములను
నేను మెచ్చుకొనెదనని వానిని నే నాహ్వానము చేసెదనని దీని
యర్థముకాదు నేను వాటిని చూచి భయపడను. వాటికొఱకు నేను
భయపడి పామును చూచినచో నన్ను రక్షించుకొనజూచుట నిజము.
కాని పామనిన యేహ్యత, విపరీతభీతి నాకు లేవు. పురికొసపురుగనిన
నాకింతకంటె నెక్కువ భయము. అదియనిన భయముకంటె సహజ
మగు యేవగింపు యెక్కువ. కలకత్తాలోని ఆలిపూరుజయిలులో నర్ధ
రాత్రివేళ లేచి నా కాలుమీద నేదియో ప్రాకుచున్నట్లు తెలిసి
కొంటిని. నాదగ్గరనున్న టార్చిలైటును నొక్కిచూడగా నా పరుపు
మీద నొకపురికొస కాన్పించెను. అప్రయత్నముగ నే నద్భుతరయ
మున యాపరుపుమీదనుండి గదిగోడకుతగులునట్లు రివ్వున వ్రాలితిని.

ఢేరాడూనులో నేనొక క్రొత్తజంతువును చూచితిని, లేక
నామట్టుకది క్రొత్త. నేను జయిలుద్వారమువద్ద నిలచి జయిలరుతో
మాట్లాడుచుండ బయట నొకమనిషి యొక క్రొత్తజంతువునుతీసికొని
వెళ్ళుచుండెను. జయిలరు వానిని పిలిపించెను. అప్పుడు నేనతనిచేతిలో
బల్లికి మొసలికి మధ్యరకములోనున్న రెండడుగుల జంతువునుచూచి
తిని. దాని యొడలునిండ పొలుసులు, కాళ్ళకుపంజాలు గలవు. బ్రతికి

యున్న యీ వికారపుజంతువు గుండ్రముగ నొకవింతచుట్టవలె చుట్ట బడెను. దానియజమాని దానిచుట్టగుండ నొక కఱ్ఱనుపోనిచ్చి దాని నతిహుషారుగ మోసుకొనిపోవుచుండెను. అతడు దానిని "జో" యని పిలచెను. జయిలరు 'దానిని నీవేమిచేతువ'ని ప్రశ్నించ నప్ప డతడు పకపక నవ్వుచు 'బజ్జ' చేసికొనెదనని బదులుచెప్పెను. అత డొక మాటవినుడు. తరువాత నేనది యుడుమని తెలిసికొంటిని.

ఖయిదీలు, ముఖ్యముగా దీర్ఘకాలశిక్ష ననుభవించు వారేవినోదములులేక బాధపడుచుందురు. తఱచు వారేదే పెంపుడుజంతువునో చేరదీసి దానితో చెలగాటమాడుచు కొంతయుపశాంతి పొందుచుందురు. మామూలు ఖయిదీల కెట్టి సావకాశము లేదుకాని, ఖయిదీఓవరుసీర్లకు కొంతస్వేచ్ఛగలదు. సామాన్యముగ జయిలు అధికారులు వారికభ్యంతరము చెప్పరు. ఉడుతల నతిసామాన్యముగ పెంచుచుందురు. ముంగిస మరియొక పెంపుడుజంతువు. జయిలులో కుక్కలను రానీయరు కాని పిల్లులను ప్రోత్సహింతురు? ఒకసారి యొక పిల్లిపిల్ల నాతో చెలిమిచేసికొనెను. అది యొక జయిలుఅధికారిదగుటచే నతడు బదిలీయగుటతోడనే యదికూడ లేకపోయెను. అదిలేకపోవుట నాకు కొరతగనుండెను. కుక్కలకు తావులేకపోయినను డేరాడూను జయిలులో నాకు కొన్నికుక్కలతో తలవనితలంపుగ సంబంధముకలిగెను. ఒక జయిలుఅధికారి యొక ఆడకుక్కను తెచ్చెను. అతడు బదిలీయైనపుడు దానిని విడిచి వెడలిపోయెను. పాపము దానికొక నివాసము, యిల్లువాకిలి లేక తూములక్రింద నివసించుచు వార్డరులు పారవేయు రొట్టెముక్కలను తినుచు తిరుగుచుండెను; అది సామాన్యముగ తిండిలేక మాడుచుండెను. నన్ను ప్రధానజయిలుబయట నున్న కొట్టులో నుంచుటచే నది తిండికొరకు నాదగ్గరకు వచ్చెడిది. నేను దానికి విడువకుండ తిండిపెట్టెడివాడను. అదియొక తూముక్రింద కొన్ని కూనలనుపెట్టెను. వీనిలోకొన్నిటి నెవరో తీసికొనిపోయిరి. మూడుమాత్రము మిగిలెను; నేను వాటికి తిండి పెట్టెడివాడను. అందులోనొకదానికి చాలజబ్బుచేసి వైరికోప

ముతో కొట్టుకొనుచుండెను. నేను దానితో చాల బాధపడితిని. నేను దాని కతి జాగ్రతతో సేవచేయుచు నొక్కొక్కప్పుడు రాత్రి పదిపన్నెండుసార్లు లేసి దానిని చూచుచుండెడివాడను. చివర కది బ్రతుకుటచే నా చికిత్సవలన నదితేరుకొనెనని నేను సంతోషించితిని.

బయట నున్నప్పటికంటె జయిలులోనుండగనే నాకు జంతువులతో నెక్కువసంబంధము. కుక్కలనిన నాకెప్పుడును ప్రీతి. నేను కొన్నిటిని పెంచెడివాడను. కాని నాకితరపనులుండుటచే వానినితగు శ్రద్ధతో చూచుటకు వీలులేకపోయెడిది. జయిలులో వాటిసావాసమున నేనెంతయు కృతజ్ఞుడనైతిని. సాధారణముగ హిందువులు తమ యిండ్లలో జంతువులను పెంచుటకొప్పుకొనరు. భూతదయ కలిగియుండవలెనని వారి వేదాంత మెంత బోధించుచుండినను తఱచు వారతి నిర్లక్ష్యముగను, జంతువులయెడల క్రూరముగను నుందురు. చాలమంది హిందువులచే నతిఘనముగ చూడబడుచు పూజింపబడు గోవుకూడ (కొట్లాటలకు తరచు యిదియే కారణమగుచున్నది) దయతో చూడబడుటలేదు. దయయు పూజచేయుటయు నెల్లప్పుడు కలిసియుండనేరవు.

తమతృష్ణను, లేక ప్రవర్తనను తెలుపుచిహ్నములుగవివిధదేశములు వివిధజంతుచిహ్నముల నామోదించును. అమెరికాసంయుక్తరాష్ట్రములకు,జర్మనీకిగరుత్మంతుడు; ఇంగ్లండుకుసింహము, వేటకుక్క; ఫ్రాన్సుకుకోడిపుంజు, పాతరష్యాదేశమునకు యెలుగుగొడ్డు. ఈ యభిమాన మృగములు జాతీయశీలము నెంతవరకు పోతపోయును? ఇవి చాలవరకు ఘోరస్వభావముకలవి. జగడమునకు కాలు దువ్వునవి. మృగములను వేటాడి తినునట్టి ఘాతములు. ఈ సాదృశ్యములను ఆదర్శముగనుంచుకొని పెరుగుమనుష్యులను బుద్ధిపూర్వకముగ నా రీతుల నవలంబించి, ఘోరస్వభావమును చూపుటలోను, సింహగర్జనలను చేయుటలోను, యితరులను భక్షించుటలోను ఆశ్చర్యమేమున్నది? హిందూదేశస్థుడు శాంతముగ దౌర్జన్యరహితముగనుండుటలో నాశ్చర్యములేదు; ఏలనన గోవు అతని యభిమాన మృగము.

# 46

## పోరాటము

బయట పోరాటము సాగుచునేయుండెను. సమీపములో జయము కాన్పించకపోయినను ధైర్యసాహసములుగల స్త్రీ పురుషులనేకమంది వేళ్ళుపాతుకొని,యతిశక్తివంతముగనున్న ప్రభుత్వమును శాంతముగ ధిక్కరించుచునే యుండిరి. విరామములేకుండ దినాదినాభివృద్ధియగుచున్న నిర్బంధపరంపరలు భారతదేశములో బ్రిటిషుప్రభుత్వ పునాదులు దేనిమీద నిర్మింపబడెనో విదితముచేయుచుండెను. ఇప్పుడీవిషయములో నెట్టివంచనయును లేకపోవుటచేనిదిమాకుకొంతతృప్తి నిచ్చెను. తుపాకులు, సన్నీలు విజయవంతములయ్యెను. కాని యొక గొప్పయోధుడొకసారి "నీవు తుపాకులతో,సన్నీలతో నేమిచేసినను చేయవచ్చును కాని, వానిమీదమాత్రము కూర్చొనరాదు" అని చెప్పెను. మా యాత్మల నమ్ముకొని యాధ్యాత్మిక వ్యభిచారమున కొడబడుటకంటె నేమీవిధముగ పాలింపబడుటయే మంచిదనుకొంటిమి. జయిళ్ళలో నేము భౌతికముగ నసహాయులము. కాని నేమచ్చటకూడ మాయుద్యమమునే సేవించినట్లు భావించితిమి. బయటనున్న చాలమందికంటె బాగుగ దానిని సేవించితిమి. మాదుర్బలత్వముచే మమ్ము రక్షించుకొను నుద్దేశ్యముతో భారతదేశ భవిష్యత్తును నాశము చేయవలసినదేనా? మానవశక్తిసంపదలు, మానవబలము పరిమితిగలవి యను సంగతి నిజమే! చాలమంది వికలాంగులైరి.చాలమంది చనిపోయిరి. చాలమంది వెనుకకు తగ్గిరి. అనేకమంది యుద్యమమునకు ద్రోహముకూడ చేసిరి. కాని యెన్ని యవాంతరములు కలిగినను యుద్యమము సాగుచునేయుండెను. ఆదర్శములు మలినము కాక స్పష్టముగనుండి, యుత్సాహము మొక్కవోకున్నచో నపజయము కలుగజాలదు. మన సూత్రమును సిద్ధాంతమును విడిచిపెట్టుటయు, మన హక్కులను జారవిడుచుటయు, నవమానమునకు మర్యాదహీనముగ లొంగిపోవుటయు నిజమైన యపజయము.శత్రువు కలుగచేయుగాయములకంటె స్వయంకృతములగు గాయములు కుదురుట కెక్కువకాలము పట్టును.

తలచిన మా దుర్బలత్వముపట్ల, తప్పుమార్గమున పోవుచున్న ప్రపంచముపట్ల కొంతవిసుగుదల కలిగెడిది. అయినను మేముసాధింపగలిగినదానికి కొంతగర్వముకూడ నుండెడిది. ఏలనన మాప్రజలు వీరులవలె ప్రవర్తించిరి; వీరగణములో మనముకూడ సభ్యులమని భావించుకొనుట యుత్తమలక్షణము.

ఆ శాసనోల్లంఘన దినములలో బహిరంగ కాంగ్రెసుసభలను జరుపుటకొకసారి ఢిల్లీలోను, మరియొకసారి కలకత్తాలోను రెండుయత్నములుజరిగెను. ఒకయక్రమసంస్థ, నిరాటంకముగ, ప్రశాంతముగ కలుసుకొనజాలదని విదితమగుచునే యున్నది. అట్టి ప్రయత్నము విధాయకముగ పోలీసులతో జగడము తెచ్చిపెట్టెను. పోలీసు లాసభలను లాఠీల సహాయముతో బలవంతముగ చెదరగొట్టి, యనేకమంది ప్రజలనునిర్బంధించిరి. ఈయక్రమసభలకు భారతదేశమంతటనుండియు వేలకొలది జనులు ప్రతినిధులుగవచ్చుట యొక యసాధారణవిషయము. ఈ రెండు సభలలోను యు.పి. రాష్ట్రములోనిప్రజలు ప్రధానభాగమువహించిరని విని నేను సంతసించితిని. 1933 మార్చి మాసాంతమున మాతల్లికూడ కలకత్తాసభలకు వెళ్ళెదనని పట్టుపట్టెను. ఆమె కలకత్తాకుపోవుచుండ మార్గమధ్యమున మాలవ్యాజీతోను తదితరులతోను నిర్బంధింపబడి అసన్‌సోలుజయిలులో కొద్దిరోజులుంచబడెను. దుర్బలముగనుండి బాధపడుచున్నను యామెచూపినయుత్సాహశక్తులకు నేనెంతయు నాశ్చర్యపడితిని. జయిలనిన యామె కొక లెక్కగాదు. ఆమె యంతకంటె నెక్కువ యగ్నిపరీక్షనిచ్చెను. ఆమె యేకైకపుత్రుడు, కుమార్తెలిద్దరు ఆమె ప్రేమించిన యితరులు జయిళ్ళలో దీర్ఘకాలశిక్షలననుభవించుచుండ నామెనివసించు యానందభవన మామెకు గుండెదిగులు కలిగించుచుండెను.

మాయుద్యమముతగ్గి తక్కువస్థాయిలో నెమ్మదిగా సాగుచు (మధ్యమధ్య నెప్పుడో తప్ప) నెట్టియుద్రేకము లేకయుండెను. నా భావములు యెక్కువగ నితర దేశములమీదకు పోవుచుండెను. జయిలులో నాకవకాశమున్నంతవరకు నార్థికమాంద్యగ్రస్తమైన ప్రపంచపుస్థితిని

నేనుపేక్షించుచు నవగాహనము చేసికొనుచుంటిని. ఆ విషయమును గురించి నాకు దొరికిన పుస్తకములన్నింటిని చదివితిని. చదివినకొలది నాకు దానియందు కుతూహలము హెచ్చుగుచుండెను. తనసమస్యలు తనపోరాటములుగల హిందూదేశము జాతీయముగ నంతర్జాతీయముగ రాజకీయముగనార్థికముగసర్వత్రజరుగుతున్న పోరాటములలో, నద్భుతజగన్నాటకములో, నొకచిన్న భాగమయ్యెను. ఆపోరాటములో నాయభిమానమంతకంత కెక్కువగ కమ్యూనిష్టులవైపు మ్రొగ్గుచుండెను.

చిరకాలము క్రిందట నేసామ్యవాదకమ్యూనిజములునన్నాకర్షించెను. రష్యాయెడల నాకభిమానము. సోవియటురష్యాలోననేకవిషయములు—వ్యతిరేకాభిప్రాయమును నిర్దాక్షిణ్యముగ నులిమివేయుట, దేశమునంతను సైన్యమయముచేయుట, వివిధపోలసీలను నిర్వహించుటకు చేయబడిన యనవసర దౌర్జన్యము—ఈయన్నింటిని నేనంగీకరింపజాలను. కాని పెట్టుబడిదారులప్రపంచములో దౌర్జన్యమునకునిర్బంధములకు కొరతలేదు. దౌర్జన్యనే ధనార్జనచేయు సంఘముయొక్కయు ఆస్తియొక్కయు మూలము, పునాదియని నేనంతకంతకు గ్రహించితిని. దౌర్జన్యము లేనిదే యది యనేకరోజులు నిలువజాలదు. ఆకలిచిచ్చు ప్రతిచోట ప్రజాబాహుళ్యమును సదా కొద్దిమంది (వారిలాభముల కొరకును, వైభవాదుల కొరకును) యిచ్చకు లొంగదీయుచున్నపుడు రాజకీయస్వాతంత్ర్యమువలన ప్రయోజనమేమియు నుండదు.

రెండుచోట్ల దౌర్జన్యము సమముగనే యుండెను. కాని పెట్టుబడిదారుల దౌర్జన్యవిధానమునకు స్వతస్సిద్ధమైనట్లు కాన్పించును. రష్యా దౌర్జన్యము చెడ్డదేయైనను, పరస్పర సహకారము మీదను శాంతిమీదను ఆధారపడు నొకచక్కనిక్రమమును, ప్రజాసామాన్యమునకు నిజమైన స్వేచ్ఛ నిచ్చుటయు దానిలక్ష్యము. సోవియటురష్యా యెన్నితప్పులుచేసినను, యసంఖ్యాకములగు కష్టములను తరించి యీ క్రొత్తక్రమమువైపు చాలయడుగులను వేసెను. తక్కినప్రపంచమంతయు నార్థికమాంద్యముచే నలిగిపోవుచు ననేకవిధముల వెనుకకు పోవుచుండ, సోవియటుదేశములో మన కండ్ల

యొనటనే యొక మహోద్వృత నవీనప్రపంచమునిర్మింపబడుచుండెను. లెనినుమహాశయుని యనుసరించుచు రష్యా భావికాలమునకొఱకు చూచుచు నిక ముందుండవలసిన క్రమమునుగురించిమాత్రమే యోచించుచుండెను. ఇతర దేశములు నిర్వీర్యమైన భూతకాల క్రమముక్రింద చేష్టలుదక్కియుండ, గతకాలమునాటి నిరర్థక నిష్ప్రయోజక శిథిలసంస్థలను రక్షించుటకు తమ శక్తులన్నింటిని వ్యయము చేయుచుండెను. ప్రధానముగ, మధ్యఆసియాలో చాల వెనుకబడి యున్న ప్రాంతముల సోవియటు ప్రభుత్వముక్రింద పొందిన గొప్ప యభివృద్ధినిగురించిన నివేదికలు నన్నెంతయో మెప్పించెను. కనుక నీ తూకములో నేను పూర్తిగ రష్యాదేశము నభిమానించితిని. అంధకారబంధురము, విషాదపూరితమునగు ప్రపంచములో సోవియటుల యునికియు, సాదృశ్యమును సంతోషకాంతులను ప్రసరింపజేయు చుండెను.

సోవియటురష్యా విజయముగాంచినను, విఫలమయినను కమ్యూనిస్టుసిద్ధాంత మాహాత్మ్యమున కది కళంకము కాజాలదు. జాతీయ కారణములచేత, యంతర్జాతీయ కారణములచేత బోల్షివిక్కులు తప్పిదములను చేయవచ్చును; లేక విఫలతనొందినను పొందవచ్చును. అయినను కమ్యూనిస్టుసిద్ధాంతము సరియైనదే కావచ్చును. ఆ సిద్ధాంతమును బట్టియే రష్యాలో జరిగినదానిని గ్రుడ్డిగానను కరించుట మూర్ఖత్వమగును. ఏలనన దానిని వర్తింపజేయు విధము ఆయా దేశములలోని ప్రత్యేక పరిస్థితులమీద, వాని చారిత్రకాభివృద్ధిమీద నాధారపడియుండును. మరియు, హిందూదేశముగాని, మరేదేశము గాని బోల్షివిక్కుల విజయములనుబట్టియు, వారు విధాయకముగ నొనర్చు తప్పులను బట్టియు గుణపాఠము నేర్చుకొనవచ్చును. చుట్టు శత్రుప్రపంచమావరించుకొని యుండుటచే బయటనుండి తమకు యొత్తిడికలుగవచ్చునను భయముచే బోల్షివిక్కులు యెక్కువవేగముగ పోవుటకు ప్రయత్నించిరి; వారు తీవ్రతను కొంతతగ్గించిన యెడల గ్రామప్రాంతములవారికి సంభవించినదుఃఖము చాలవరకు

లేకుండ పోయెడిది. కాని పరివర్తన వేగము తగ్గించినచో నిజమైన గొప్పఫలితములు చేకూరగలవా? యను ప్రశ్నయుదయించెను. మూల నిర్మాణమునే మార్పుచేయవలసిన క్లిష్టసమయ మాసన్నమయినపుడు సంస్కారపద్ధతియే ప్రధానసమస్యను పరిష్కరింపజాలదు. తరువాత యభివృద్ధి యెంతనెమ్మదిగ జరిగినను ప్రాతిపదికలోమాత్రము ప్రస్తుత క్రమమును పూర్తిగ ఛేదింపవలెను.

భారతదేశములో పరస్పరసంబంధముగల భూసమస్యను, పారిశ్రామికసమస్యను కొంచెమించుమించు తదితరప్రధాన సమస్యలను విప్లవమార్గ మొక్కటియే సాధింపగలదు. లాయడ్ జార్జి తన 'యుద్ధస్మరణములు' అనుపుస్తకములో వ్రాసినట్లు "అగాధమును రెండుదాటులలో దాటెదమనుటకంటె గొప్పతప్పిదము మరియొకటి యుండబోదు."

రష్యాసంగతి విడిచిపెట్టి మార్క్సుసిద్ధాంతము, వేదాంతము నాహృదయములోనున్న యనేకాంధకారకోణములను ప్రకాశమానమొనర్చెను. చరిత్రలోనాకొకనూతనయర్థముద్యోతకమగుచుండెను. మార్క్సు వ్యాఖ్యానము దానిపయి నొక యద్భుతకాంతి ప్రసరింపజేసెను. అది యంతయు దానివెనుక నొకప్రయోజనమును, క్రమమునుగల తెరవిడిపోయిన నాటకమయ్యెను. భూత, వర్తమానముల నాశము దుఃఖము, మనలనెంత నిర్ఘాంతపరచునదియైనను భవిష్యత్తు యాశాపూరితముగ నుండెను. మార్క్సుసిద్ధాంతములోని శాస్త్రీయ దృష్టియు, నిరంకుశాభిప్రాయములకు విశ్వాసములకు కట్టుబడవలెనని నిర్బంధ మెంతమాత్రము లేకపోవుటయు, నన్నాకర్షించెను. రష్యాలోను, తదితర చోట్లను అధికారసమ్మతమగు కమ్యూనిజములో నెంతయో యభిప్రాయ నిరంకుశత్వమున్నమాట నిజము; తఱచు దానికి వ్యతిరేకులైనవారు వేటాడబడిరి. సోవియటు దేశములోనద్భుతమగుమార్పు యతి వేగముగ జరుగుచుండ తీవ్రముగు వ్యతిరేకము దీనినంతను నాశనముచేయవచ్చునని గ్రహించుట కష్టముకాకపోయినను యది శోచనీయముగ కాన్పించెను.

ప్రపంచము నావరించిన యార్థిక మాంద్యము, విషమస్థితి మార్క్సు హేతువాదమును సమర్థించుచున్నట్లు కాన్పించెను. తక్కిన యన్ని పద్ధతులు, సిద్ధాంతములు నంధకారములోపడి కొట్టుకొనుచుండ మార్క్సు సిద్ధాంత మొక్కటే కొంచెము మించుమించు తృప్తికరముగ దీని కర్థముచెప్పి నిజమైన తరుణోపాయము ప్రసాదించెను.

ఈ నా విశ్వాస మభివృద్ధియైనకొలది నాలో నూతనభావము లుద్భవించెను. శాసనోల్లంఘనము విజయమునొందలేదను విచారము తరుగ నారంభించెను. ప్రపంచ మతిత్వరితముగ నభిలషింపబడిన గమ్యస్థానమునకు చేరుటలేదా? యుద్ధములు విపరీత నష్టములు సంభవింపవచ్చునను భయోత్పాతము కలదు. అయినను మనము ముందుకుపోవుచున్నారము. ఇచ్చట స్తబ్ధత్వములేదు. ఈ మహా ప్రస్థానములో మన జాతీయ సంగ్రామ మొక యంతరువు, ఒకమజలీ, నిర్బంధములు, బాధలు మన ప్రజలను భవిష్యత్సంగ్రామములకు తయారుచేయుచు, ప్రపంచము నుఱ్ఱూతలూగించుచున్న నూతనభావములనుగురించి యోచించునట్లు బలవంతపరచుచున్నవి. దుర్బలులు తప్పుకొనినకొలది మన మంతికంతకు బలము, శిక్ష, కష్టసహిష్ణుత గలవారమగుదుము. కాలము మనకు ప్రసన్నముగనుండెను.

కనుక నేను రష్యా, జర్మనీ, యింగ్లండు, అమెరికా, జపాను, చీనా, ఫ్రాన్సు, స్పెయిను, యిటలీ, మధ్యయూరపులలో జరుగు చరిత్రనుగురించి యతిజాగ్రతగ చదివి వర్తమానవ్యవహారములవిషయ గ్రంథుల నర్థముచేసికొన యత్నించితిని. మహాసంక్షోభము నెదుర్కొను టకు ప్రతిదేశము సల్పిన యత్నములను విడివిడిగను సమగ్రముగను నే నెక్కువ యాసక్తితో వీక్షించితిని. రాజకీయ ఆర్థిక దుస్థితులను పరి ష్కరించుటకు నాయుధములను, యుద్ధపరికరములను తగ్గించు సమస్యను చర్చించుటకు, జరుపబడిన యంతర్జాతీయసభల యనేకాపజయములు నాకు మన కులసమస్యను బలవంతముగ జ్ఞప్తికి తెచ్చెను. ప్రపంచము దీనికెంతసుముఖముగనున్నను మన మీసమస్య నింతవరకు పరిష్కరింప జాలకపోతిమి. ఈసందర్భములో నపజయము ప్రపంచవినాశమును,

తెచ్చిపెట్టునను నెంత వ్యాప్తినొందిన విశ్వాసమున్నను యూరపు అమెరికాల రాజకీయ ధురంధరులందరు సమన్వయమునకు రాజాలక పోయిరి. దీనినితీర్చవలసిన పెద్దలున్యాయమార్గమున పోవసాహసింపరు.

ప్రపంచదుఃఖములను, పోరాటములనుగురించి యోచించుటలో కొంతవరకు నేను నాస్వంతకష్టములను, జాతీయ కష్టములను మరచి పోతిని. ప్రపంచచరిత్రలోని యీ మహావిప్లవయుగములో జీవించు చుంటినని నేనొక్కొక్కప్పు డుత్సాహభరితుడ నగుచుందును. బహుశః రాబోవుగొప్పమార్పులసందర్భములో ప్రపంచములోని నా చిన్నసీమలో నేనుకూడ కొద్దిభాగము తీసికొనవలసియుండును. మరి యొకప్పుడు పోరాటము, దౌర్జన్యములతో నిండియున్న ప్రపంచవాతా వరణము నన్నుకృంగదీయును. మానవుడధఃపతితుడై బానిసయగుట కలవడుటచే బాధను, దారిద్ర్యమును, క్రూరత్వమును ధిక్కరింపజాల నంతటి మొద్దుబారిన మనస్సులుగల విద్యాధికులైన స్త్రీపురుషుల దృశ్యము మరింతశోచనీయమైనది. సత్పురుషులు హీనవంతులైయుండ నీతిబాహ్యమైన యీవాతావరణములో జోకరింపగల నీచులు నారి తేరిన మోసగాండ్రు వృద్ధిచెందిరి. హిట్లరువిజయము, దానిననుసరించిన ప్రౌను పెర్రరు వజ్రపాతమువలెనుండెను. అయినను నదితాత్కాలికమే యని నన్ను నేనోదార్చుకొంటిని. మానవప్రయత్నము, పౌరుషము, వృథయనెడుభావము కొంచెమించుమించు కలిగెడిది. యంత్రము గ్రుడ్డిగా నడిచిపోవుచుండ దానిలోనున్న యొకచిన్నభాగము, యొక సీల, యేమిచేయగలదు?

అయినప్పటికి, జీవితమునకు సంబంధించిన కమ్యూనిష్టు వేదాం తము నా కాశను, సుఖమును ప్రసాదించెను. దానిని భారతదేశమున నెట్లుప్రవర్తింప జేయవలెను ? రాజకీయస్వాతంత్ర్యసమస్యను మన మింకను సాధించుకొనలేదు. మా మనస్సులు జాతీయదృష్టితో నిండి యుండెను. ఏకకాలమందే నే మార్థికస్వాతంత్ర్యముకుకూడ దుముక వలెనా? లేక వాని నొకటి తరువాత నొకటిగ తీసికొనవలెనా? ప్రపంచ పరిస్థితులు, భారతదేశములో జరుగుచున్న విషయములు

కూడ సాంఘిక సమస్యను బలవంతముగ ముందుకు తెచ్చుచున్నవి; రాజకీయస్వాతంత్ర్యము నిక నెంతమాత్రము దానినుండి వేరుజేయుటకు వీలులేనట్లు కాన్పించెను.

భారత దేశములో బ్రిటిషుప్రభుత్వము నీతి సాంఘికాభివృద్ధిని భంగపరచు తెగలు రాజకీయస్వాతంత్ర్యము నెదుర్కొనునట్లు చేసెను. ఇది జరుగక తప్పదు. భారత దేశములో వివిధతరగతులు, వర్గములు, స్పష్టముగ నిరూపింపబడవలెనని నేను కోరుచుంటిని. కాని యితరు లీవిషయము నామోదించిరా? చాలమంది యట్లు చేయలేదు. కొన్ని పెద్దపట్టణములలో కొద్దిమందిసనాతనకమ్యూనిష్టులున్నసంగతినిజము. వారు జాతీయోద్యమమునకు వ్యతిరేకులయి దానిని తీవ్రముగ విమర్శించుచుండిరి. మంచికట్టుబాటులతో నేర్పడిన లేబరు యుద్యమములుకూడ గట్టితనములేని సామ్యవాదమునే కలిగియుండెను. కాని యవిచిన్నచిన్నముక్కలయి యార్థికమాంద్యముచే బాధపడుచుండెను. విద్యార్థులలో, మంచి వివేకముగల ప్రభుత్వాధికారులతో గూడ, కమ్యూనిజముకు, సామ్యవాదముకు సంబంధించిన యస్పష్టభావములు వ్యాప్తిచెందెను. ప్రజాస్వామికములను గురించిన బ్రైస్ గ్రంథములను, మోర్లే, కీత్, మేజిస్ గ్రంథములను చదువుచుండిన కాంగ్రెసు యువతీ, యువకులు దొరికినపుడెల్ల సామ్యవాదము, కమ్యూనిజము, రష్యాలను గురించి యిప్పుడు చదువుచుండిరి.

మీరటు కుట్రకేసు ప్రజల హృదయముల నీనూతనభావముల వైపు మరలించుటకు చాల తోడ్పడెను. ప్రపంచము నావరించినవిమర్శావస్థ దృష్టి నరికట్టుచుండెను. ప్రతిచోట నొక నూతన పరిశోధనోత్సాహముప్రబలెను. వర్తమాన సంస్థలను ప్రశ్నించుట, సవాలు చేయుట, విమర్శించుట ప్రారంభమయ్యెను. మానసిక వాయుప్రసారగతి తెల్లమగుచున్నను నది యాత్మవిశ్వాసములేని మృదువచనము. కొంతమంది ఫాసిస్టు భావములను ప్రేరేపించిరి. నిర్దుష్టమైన నిర్వచనముగల లక్ష్యము లేకుండెను. జాతీయతయే యింకను ప్రధాన భావముగనుండెను.

కొంత రాజకీయ స్వాతంత్ర్యము సాధింపబడువరకు జాతీయతయే ప్రధానశక్తిగనుండునని నాకు స్పష్టమయ్యెను. ఇందుచేతనే భారతదేశములో కాంగ్రెసు యన్నిటికంటె ముందంజవేసిన సంస్థ. ఇప్పటికి నది యట్లేయున్నది అది యతిశక్తివంతమైనసంస్థ. గాంధీజీ నాయకత్వముక్రింద గత పదమూడు వత్సరములలో నది ప్రజలలో నద్భుతప్రబోధము కలిగించెను. దానిలక్ష్య మస్పష్టమైన బూర్జువా లక్ష్యమేయైనను అది యొక విప్లవప్రయోజనము సాధించెను. దాని యుపయోగ మింకను తఱిగిపోలేదు. జాతీయదృష్టి సాంఘికదృష్టికి తావిచ్చువరకు నది యట్లే యుండును. కనుక భావియభివృద్ధి కాంగ్రెసు ద్వారముననే జరుగవలెను. కనుక నేను కాంగ్రెసును వీడుట,జాతిని నడుపు ప్రధానశక్తినుండి సంబంధము త్రెంచుకొనుట వలె కాన్పించెను. అది మనచేతిలోనున్న దివ్యాస్త్రమును వ్యర్థము చేసికొనుటయగును. అది నిష్ప్రయోజకమగు సాహసకృత్యములలో శక్తిని వమ్ముచేసికొనుట యగును. అయినను కాంగ్రెసు, దాని ప్రస్తుత నిర్మాణమునుబట్టి యదార్థప్రయోజనముగల సాంఘిక పరిష్కారము నెప్పటికైన నామోదించునా? దానిముందర నట్టి సమస్యను తెచ్చినచో నది కాంగ్రెసును రెండుమూడు చీలికలక్రింద చీల్చివేయుటగ పరిణమించును. అథవము చాలమంది దానినుండి తరిమివేయబడుదురు. సారాంశములు చక్కగ స్పష్టపరుపబడి సమ్యగ్బద్ధమైనదర్గమొకటి సార్థకమగు సాంఘికవిధానముకొఱకునిలుచునెడల పైచీలికలనుమనమభిలషింపవచ్చునుఆహ్వానముచేయవచ్చును.

కాని ప్రస్తుతము కాంగ్రెసనగా గాంధీజీ. అతడేమిచేయును? భావములలో నతడొక్కొక్కప్పుడద్భుతముగ వెనుకబడియుండును. ఆచరణలో నతడు నవీనభారతయుగములో ననన్యవిప్లవకారుడు, అసాధారణవ్యక్తి. అతనిని మామూలు ప్రమాణములచే విమర్శించుట దుస్సాధ్యము. సాధారణ తార్కికసూత్రములనుకూడ నతనియెడల వర్తింపజేయుటసంభవము. కాని యతడు హృదయాంతరాళమున విప్లవకారుడగుటచేతను, భారత రాజకీయస్వాతంత్ర్యమునకు బద్ధకంకణుడగుటచేతను, దానినిసాధించువరకు వెనుదిరుగని పాత్రమై

వహించితిమి. ఈ విధానములోనే యుత సమ్మతమగు ప్రజాశక్తుల నుద్రేకింపజేయును. అతనుకూడ క్రమక్రమముగ సాంఘికపరమావధి వైపు సాగిపోవునని నేను సగ మాశపడితిని.

భారతదేశములోను, బయటనుగల శుద్ధకమ్యూనిస్టులు చాల వత్సరములనుండి గాంధీజీని, కాంగ్రెసును తీవ్రముగ నిమర్శించుచునే యుండిరి. వారు కాంగ్రెసునాయకుల కనేక నీచోద్దేశ్యముల నాపాదించిరి. కాంగ్రెసు లక్ష్యమునుగురించిన సిద్ధాంతసంబంధ విమర్శలు చాలవరకు సమర్థములు, శక్తివంతములు, విషయబద్ధములు. తరువాత సంభవించినవిషయములు కొంతవరకు వాటిలోనున్న న్యాయమును ఋజువుచేసెను. సామాన్య భారత రాజకీయపరిస్థితులను విడివిడిగా పరీక్షించి విమర్శించినచో మొదటి కమ్యూనిస్టు విమర్శలు కొన్ని 'తు' 'చ' తప్పకుండ యథార్థములయ్యెను. కాని వారు తమ సామాన్యసూత్రములను విడిచిపెట్టి వివరములోనికి దిగుటతోడనే తప్పుమార్గమున పడిపోవుచుందురు. సంఖ్యలోను, పలుకుబడిలోను కమ్యూనిస్టులు భారతదేశములో చాల దుర్బలులగుటకు కారణమే మనిన వారు కమ్యూనిజమునుగురించి శాస్త్రీయజ్ఞానమును వెదజల్లి ప్రజాహృదయమును త్రిప్పుకొనుటకు బదులితరులను తిట్టుటయందే తమశక్తినంతను వినియోగించిరి. ఇది యెదురుతిరిగి వారికే యెక్కువ యపకారము చేసెను. వారిలో చాలమంది లేబరులో పనిచేసెడి వారు. అచ్చట నేకొద్దికేకలో పనివాండ్రను తమవైపు త్రిప్పుకొనుటకు సరిపోయెడివి. కాని విద్యార్థులకు వట్టికేకలు చాలవు. ఇప్పుడు భారతదేశములో మధ్యతరగతికి చెందిన విద్యార్థియే విప్లవకారుడనుసంగతి వారు గుర్తింపరైరి! శుద్ధకమ్యూనిస్టుల సంబంధము లేకుండగనే చాలమందివిద్యార్థులను కమ్యూనిజము ఆకర్షించెను. అయినను వారిమధ్య నెంతయో యంతరువుకలదు.

ప్రభుత్వముపయి విశేషమయొత్తిడి కలిగించి భారతపెట్టుబడిదారులకు, జమీందారులకు పారిశ్రామిక, వర్తక హక్కులను సంపాదించిపెట్టుటయే కాంగ్రెసునాయకులలక్ష్యమని కమ్యూనిస్టులయభిప్రాయము.

"కాంగ్రెసు వ్యవసాయదారుల యొక్కయు మధ్యతరగతికిచెందిన క్రిందితరహావానియొక్కయు, పారిశ్రామికపనివాండ్రయొక్కయు రాజకీయ, ఆర్థిక యసంతృప్తిని బొంబాయి, అహమ్మదాబాదు, కలకత్తాలోని యంత్ర యజమానులయొక్కయు లక్షాధికారుల యొక్కయు రధములకు కట్టివేయజూచును." భారతదేశ పెట్టుబడిదారులు తెరమఱుగున కూర్చొని ప్రజోద్యమము నారంభింపవలసినదని మొదట కాంగ్రెసు వర్కింగుకమిటీవారి నాజ్ఞాపింతురు. తరువాత నది చాల గొప్పదియై, యుపద్రవకరమైనపుడు దాని నాపివేయమనియో లేక పెడత్రోవబట్టించమనియో నాజ్ఞాపింతురు. మరియు బ్రిటిషువారు పోవలెనని కాంగ్రెసునాయకులు నిజముగాకోరరు.ఏలనన నాకలితో మాడుచున్న ప్రజలను నిరోధించుటకు,కొల్లగొనుటకు వారియవసరమెంతయోకలదు. భారతదేశ మధ్యతరగతులవారు తమంతతామీ పనిచేయుటకసమర్థులమనిభావించిబ్రిటిషువారిసహాయమ పేక్షింతురు.

సమర్థులైన కమ్యూనిస్టులే యిట్టిపిచ్చివ్రాతలను విశ్వసించుచుండుటాశ్చర్యకరము.ఇట్టివిశ్వాసములుండుటచేతనేవారుభారతదేశములో నెక్కువ యపజయమునొందిరి. భారతజాతీయోద్యమమును యూరపులోని లేబరు ప్రమాణములనుబట్టి విమర్శించుటయే వారు చేసిన ముఖ్యప్రమాదము. లేబరునాయకులు తఱచు లేబరుయుద్యమమునకు ద్రోహముచేయుండుట వీరికి చాలయనుభవము. కనుక వీరా సాదృశ్యమునే హిందూదేశమునకును వర్తింపజేతురు. భారతజాతీయోద్యమము లేబరుయుద్యమము, బీదలయుద్యమము కాదని విదితమగుచునేయున్నది. అది బూర్జువాయుద్యమమని దాని పేరే విశదము చేయుచున్నది. దానిలక్ష్యమింతవరకు రాజకీయ స్వాతంత్ర్యముగాని సాంఘిక క్రమమును మార్చుటగాదు. ఈ లక్ష్యము గొప్పదికాదని, చాలదని విమర్శింపవచ్చును. వర్తమాన యుగమునకు పనికిరాదని జాతీయతనే ఖండింపవచ్చును. కాని యుద్యమపునాదుల నంగీకరించు భూమిపద్ధతిని, పెట్టుబడిదారులపద్ధతిని కూలద్రోయుటకు యత్నింపక కాంగ్రెసునాయకులు ప్రజలను ద్రోహము

చేసిరని చెప్పుట మూర్ఖత్వము. అట్లు చేసెదమని వారెన్నడు చెప్పి
యుండలేదు. కాంగ్రెసులో కొందరు ఘాతుకపద్ధతిని పెట్టుబడి పద్ధతిని
మార్చవలెనని కోరుచున్నారు. కాని వారు కాంగ్రెసు పేరిట నట్లు
మాట్లాడజాలరు.

జాతీయోద్యమములో బ్రిటిషువస్తువులను తదితర విదేశ
వస్తువులను బహిష్కరించుటచేతను స్వదేశీని ప్రోత్సహించుటచేతను
భారతదేశ పెట్టుబడిదారులు చాల లబ్ధిపొందిరనుమాట సత్యము. ఇది
విధాయకము. ప్రతిజాతీయోద్యమము బహిష్కారమును బోధించి
స్వదేశీ పరిశ్రమలను ప్రోత్సహించును. శాసనోల్లంఘనము జరుగు
చున్నకాలములో మేము బ్రిటిషువస్తుబహిష్కారమును బోధించు
చున్నపుడుకూడ బొంబాయి మిల్లుపరిశ్రమ యజమానులందరు నొక
సంఘముగా లాంకషైరుతో నొడంబడికచేసికొన సాహసించిరి.
కాంగ్రెసుదృష్టిలో నిది జాతీయోద్యమముపట్ల పరమద్రోహము. అది
దానినట్లే ప్రకటించెను. అసెంబ్లీలోని బొంబాయిమిల్లు యజమానుల
ప్రతినిధికూడ మాలో చాలమంది జయిలులోనుండగా కాంగ్రెసును
"అతివాదులను" పదేపదే దూషించెను.

కాంగ్రెసు జాతీయదృష్టులనుండి చూచినను గతకొద్దిసంవత్సరము
లలో భారతదేశములో చాలమంది పెట్టుబడిదారులు తీసికొనినపాత్ర
నీతిబాహ్యమైనది. ఒటావావలన తాత్కాలికముగ కొన్ని చిన్నవర్గ
ములకు లాభము కలిగియుండవచ్చును. కాని యది భారతదేశపరిశ్రమ
కంతకు చెడ్డచేసెను. దానివలన నాపరిశ్రమ బ్రిటిషుపెట్టుబడికి, పరిశ్ర
మకు మరింతబానిసయయ్యెను. అది ప్రజలకుహానికరము. మాపోరాట
మింకను జరుగుచుండ వేలకొలది జయిళ్ళలో మ్రగ్గుచుండ నీరాయ
బారము జరుపబడెను. ప్రతి వలసదేశము యింగ్లండునుండి యతికఠిన
షరతులనుపిండుకొనెను. హిందూదేశమే దానికొకవరముప్రసాదింప
గలిగెను. గత కొద్దివత్సరములలో బ్రిటిషుపెట్టుబడిదారులు భారత
దేశమునకు నష్టముకలిగించు వెండిబంగారువర్తకము సాగించిరి.

పెద్దజమీందారులు తాలూకాదార్లు రౌండుటేబిలు కాన్ఫరెన్సులో కాంగ్రెసును పూర్తిగ వ్యతిరేకించిరి. శాసనోల్లంఘనకాలములో వారు ప్రభుత్వపక్షముననున్నట్లు బహిరంగ ప్రకటనచేసిరి. వారి సహాయముతోడనే ప్రభుత్వము వివిధరాష్ట్రములలో ఆర్డినెన్సు రూపములో నిర్బంధశాసనములనుచేసిరి. యు. పి. రాష్ట్రశాసన సభలో జమీందారు సభ్యులలో నధికసంఖ్యాకులు శాసనోల్లంఘన ఖయిదీల విడుదలకు వ్యతిరేకముగ వోటుచేసిరి.

1921, 1930లలో ప్రజయొత్తిడివలన గాంధీజీ తీవ్రయుద్యమములను ప్రారంభించెనను భావము శుద్ధపొరపాటు. కాని రెండుసార్లు గాంధీజీయే నడకను త్వరితముచేసెను. 1921లో కొంచెమించుమించు నతడొక్కడే కాంగ్రెసునునడిపించెను. దానిసహాయోద్యమములో వికిదించెను. 1930లో నతడేవిధముగ నడ్డుపెట్టినను యెట్టితీవ్ర ప్రత్యక్షకార్యవిధానము సాధ్యమయ్యెడిదికాదు. యదార్థవిషయజ్ఞానములేని వ్యక్తిగత బాహ్యవిమర్శలనుచేయుట దౌర్భాగ్యమైనపని. ఇట్టివి నిజసమస్యలనుండి దృష్టిని మరల్చును. గాంధీజీ సత్యసంధతను నిజాయితీని ధిక్కరించినవాడు తనకు, తన యుద్యమమునకు తీరని నష్టము కలిగించినవాడగును. భారతదేశములో కోట్లకొలది ప్రజలకతడు సత్యదేవత. అతని నేమాత్రము గ్రహించినవాడైనను న్యాయముకొరకతడెంత యాతురత చూపునో గ్రహింపగలడు.

హిందూదేశ కమ్యూనిష్టులు పెద్దపట్టణములలోని పారిశ్రామిక పనివాండ్రతో సంబంధముకలిగియుండిరి. పల్లెటిప్రాంతములతో వారికెట్టి సంపర్కములేదు. వాటినిగురించి వారికేమియు తెలియదు. వారి శ్రామిక పనివాండ్రు వ్యవసాయదారుల తరువాతనే పరిగణింపబడవలెను. ఏలనన నేడు భారతదేశములోనున్న సమస్య వ్యవసాయదారులసమస్యయే. కాంగ్రెసు సేవకులుగ్రామసీమలన్నిటిలోవ్యాపించియున్నారు. మామూలువ్యవహారములో కాంగ్రెసు గొప్ప వ్యావసాయకసంస్థ. తమ యత్యవసర మనోరథమీడేరినతోడనేవ్యవసాయదారుల క్వచితుగ విప్లవకారులగుదురు. భవిష్యత్తులో నెప్పుడో

రొకవ్యుడు పట్టణమునకు, గ్రామమునకు పారిశ్రామిక పనివానికి, వ్యవసాయదారునకు గల మామూలు సమస్య భారతదేశములోకూడ తలయెత్తగలదు.

అనేకమంది కాంగ్రెసునాయకులతోను వర్కింగ్ తోనునాకతి సన్నిహిత పరిచయముగలదు. వారికంటె యోగ్యులైన స్త్రీ పురుషులను నేను వాంఛింపజాలను. అయినను ప్రధానసారాంశములనుగురించి నాకు వారికి భేదాభిప్రాయములు కలుగుచుండెను. నాకతి స్పష్టముగ కాన్పించు విషయము వారి కర్థముకాకపోవుట లేక వారు గుర్తింపకపోవుట తరచు నాకు వినుకుదలగనుండెడిది. బుద్ధివిశేషము కొరవడుట దానికి కారణముకాదు. ఎందుచేతనో మేము వివిధ లక్ష్యములమధ్య తిరుగుచుంటిమి. ఈ హద్దుల నకస్మాత్తుగ తిరించుట చాల కష్టమని నేను గుర్తించితిని. అవి జీవితమునకు సంబంధించిన వివిధ వేదాంతములు. మనము క్రమముగ నప్రయత్నముగ నా పరిణామమును పొందుదుము, ఇతరపక్షమును నిందించుట నిరర్థకము. సామ్యవాదమనగా జీవితమును దాని సమస్యలను నొక విధమగు మానసికదృష్టితో చూచుటయనియర్థము. అది వట్టి తర్కముకాదు. దానికంటె నెక్కువది. సాంప్రదాయములమీదను శిక్షణ పోషణలమీదను, భూతవర్తమాన పరిసరముల యదృశ్యప్రభావములమీదను నాధారపడు యితర దృక్పథములుకూడ నట్టివే. కఠినపాఠమును బోధించు జీవిత మొక్కటియే మనలను నూతనమార్గములగుండ నడిపించును. చివర కది మనలను మరొక విధముగ యోచించునట్లు (ఇది చాల కష్టమైనపని) చేయును. బహుశః మన మీ విధానములో కొద్దిగ సహాయభూతులము కావచ్చును.

# మతమననేమి ?

1932 సెప్టెంబరు రెండవవారములో ప్రశాంతము విసుగు పుట్టించునదియగు మా జయిలు జీవిత మకస్మాత్తుగ నొకబాంబు ప్రేలుట వలన దద్దరిల్లెను. నిమ్నజాతులకు రామ్సేమాక్డొనాల్డు ప్రసాదించిన 'కమ్యూనల్ అవార్డు' ఫలితమైన ప్రత్యేక నియోజకవర్గపద్ధతిని నిరసించుటకు గాంధీజీ "చనిపోవునరకు నుపవసించ" నిశ్చయించెనను వార్త తెలెంచెను. ఆహా! ప్రజలను హడలగొట్టుటక తని కెట్టిశక్తికలదు! అకస్మాత్తుగా నా తలలోని కనేకవిధభావములు చొరుచుకొనివచ్చెను. అనేకవిధ సంభవములు, ఘటనలు జరుగవచ్చునను తలంపు నన్నావేశించి నాశాంతిని భంగముచేసెను. రెండురోజులవరకు నాకెట్టి దోవ తెన్ను కానరాక నే నంధకారములోనుంటిని. గాంధీజీచర్యవలన జరుగు కొన్ని ఫలితములను తలచుకొనినపుడు నాహృదయముకృంగిపోయెడిది. వ్యక్తిగతమగు భావము భరింపనశక్యముగనుండెను. నేనతని నిక నీ లోకములో తిరిగి చూడజాలకపోవచ్చునని దిగులుపడితిని. వత్సరక్రిత మింగ్లండు వెళ్ళుచుండగ నే నతనిని కడసారి చూచితిని. అదియే నా కతని తుది సందర్శనము కాబోవుచున్నదా !

తరువాత తన తుదియాత్మార్పణ కెట్టి చిన్న సమస్యను—నియోజకవర్గముకు సంబంధించిన చిన్నసమస్య – నతడు తీసికొనినందులకు నేను బాధపడితిని. ఇది మన స్వాతంత్ర్యోద్యమమున కెట్టి ఫలితము నిచ్చును? దీనివలన తాత్కాలికముగనైన ప్రధానసమస్యలు మరుగు పడిపోవా? అతడు తన యత్యావసర లక్ష్యమును సాధింపగలిగినచో దానివలన నొక ప్రతిక్రియ పుట్టదా? ఒకటి సాధించితిమి. కొంత కాలమువరకు మన మిప్పు డేమియు చేయనక్కరలేదను భావము జనింపదా?

అతనిచర్య కమ్యూనల్ అవార్డును, ప్రభుత్వముచే తయారు చేయబడిన సామాన్యరాజకీయస్కీమును గుర్తించికొంతవర కామోదించినట్లగుటలేదా? ఇది యసహాయోద్యమముతో శాసనోల్లంఘ

నముతో సమన్వయమగునా ? బ్రహ్మాండమగు త్యాగము ధైర్యసా హసోపేతములగు యత్నములు చేసినతరువాత మనయుద్యమ మిట్టి నామరూపములులేని విషయముతో శోకమునుపవలసినదేనా ? ఒక రాజకీయ సమస్య నతడు మతవిషయికముగ హేతువిరుద్ధముగ చూచు టయు నీ సందర్భములో నతడు తరచు భగవంతుని యుదహరించు చుండుటయు నా కతనియెడల కోపముకలిగించెను. ఉపవసింపవలసిన దినమును భగవంతుడే నిర్దేశించునని యతడు సూచించెను. ఇదియెంత భయంకర యుదాహరణము.

బాపూజీ చనిపోయినచో భారతదేశ మప్పుడెట్లుండును ? దాని రాజకీయము లెట్లు ప్రవహించును ? భవిష్యత్తు దుఃఖమయముగ శూన్యముగ కాన్పించెను. దానిని తలచినపుడు నిరాశ నాహృదయము నావరించెడిది. నేనిట్లు యోచింపగా యోచింపగా నా బుద్ధి వికల మగుచుండెడిది. కోపము, నిరాశ యీ ప్రబోధమునకంతకు జనకు డైనవానియెడల ప్రేమ మువ్విరిగొని యుండెడివి. ఏమిచేయుటకు నాకు తోచకుండెను. కనుక నేను ప్రతివానియెడల (ముఖ్యముగా నా యెడలనే) చిరుబురుగ ముక్కోపిగ నుండెడివాడను.

తరువాత నొకచిత్రము జరిగెను. నే నుద్రేకముల రాశినైతిని. అట్లు కొంతసేపుంటిని. ఆ స్థితి గతించినతరువాత నా మనస్సు శాంతించెను. భవిష్యత్తు అంత యంధకారముగ కాన్పించలేదు. బాపూజీ పరిపక్వసమయము కనిపెట్టి యుక్తకార్యముచేయు చిత్ర యుక్తిగల వ్యక్తి. అతనిచర్య గొప్పఫలితముల నీయవచ్చును. బాపూజీ చనిపోయినను మన స్వాతంత్ర్యపోరాటము సాగుచునే యుండును. కనుక నేమిజరిగినను మనము దానికి సిద్ధముగ తయారుగ నుండవలెను. గాంధీజీమరణమునుగూడ నిర్విచారముగ నెదుర్కొను టకు నిశ్చయించుకొని నేను శాంతినొంది, యుద్రేకము నణచుకొని ప్రపంచమును, అది ప్రసాదించు సమస్తమును నెదుర్కొనుటకు సిద్ధ ముగనున్నట్లు భావించితిని.

తరువాత దేశమంతట నద్భుతమగు ప్రబోధము కలిగినట్లు హిందూసంఘములో నొక వింతయుత్సాహతరంగ ముప్పతిల్లినట్లు వార్తలేతెంచెను. అస్పృశ్యత కంత్యకాలమువచ్చినట్లు కాన్పించెను. ఎరవాడజయిలులో కూర్చొనిన యీ బక్కమనిషి, యీ చిన్నవ్యక్తి యెంతటి గారడీడు! ప్రజాహృదయములను కదల్చు తంత్రుల నెట్లు మీటవలెనో బాగుగ గ్రహించిన యెంతటి చతురుడు! అతనివద్ద నుండి నాకొక తంతివచ్చెను. నేను శిక్షింపబడినతరువాత నతనివద్ద నుండి నాకువచ్చిన మొదటిసందేశమిదియే. అంత దీర్ఘకాలమయిన తరువాత నే నతనిని గురించి వినుట నా కాహ్లాదకరముగనుండెను. ఈ తంతిలో నత డిట్లు వ్రాసెను.

"ఈ యన్నిమహాసంక్షోభదినములలోను నీవు నా మనోనేత్రమున నుంటివి. నీ యభిప్రాయము తెలిసికొనుటకు నే నత్యాతురపడుచుంటిని. నీ యభిప్రాయము నాకెంత యమూల్యమో నీకే తెలియును. ఇందు కుమారుని, సరూపబిడ్డలను చూచితిని. ఇందుకులాసాగానున్నది ఆమె రొయిడలు పెంచుచున్నది. నేను చాలయారోగ్యముగనున్నాను. తంతిద్వారా ప్రత్యుత్తరము నిమ్ము. ప్రేమ"

ఉపవాసశ్రమ ననుభవించుచున్నను, అనేక కార్యములలో నిమగ్నుడయినను నా కుమార్తెయు, నా చెల్లెలు బిడ్డలు నతనినిదర్శింప వచ్చిన సంగతి, యిందిర రొయిడలుచేయుచున్నదను సంగతికూడ నుదహరించుట యసాధారణ విషయము. అయిన నది యతనికెన్న స్వభావము. అతడు జీవితములో నతిస్వల్పముగ కాన్పించు విషయములనుగూడ (నిజముగవాటికి చాలవిలువగలదు) నెప్పుడును మరచి పోజాలడు. నియోజకవర్గము విషయమైన యొకయొడింబడిక జరిగెనని కూడా నాకప్పుడే వార్త వచ్చెను. గాంధిజీకి ప్రత్యుత్తరమిచ్చుటకు నా జయిలు అధికారి యంగీకరించుటచే నతనికి క్రింది తంతిపంపితిని.

"మీతంతియు, నొక యొడంబడిక కుదిరెనను క్లుప్తవార్తయు నా కానంద, శాంతులను చేకూర్చెను. మీరుపవసించుటకు నిశ్చయించిరను మొదటివార్త మానసికసంక్షోభమును, చిత్తవైకల్యమును

కలిగించెను. కాని తుద కుత్సాహము ప్రజ్వరిల్లెను. నేను చిత్తశాంతి పొందితిని. అణగద్రొక్కబడి. పీడింపబడువారికొరకు చేయు త్యాగమెంతైనను చాలదు. అత్యధమస్థితిలోనున్న వారి స్వాతంత్ర్యమును బట్టియే దేశస్వాతంత్ర్యము పరీక్షింపబడవలెను. కాని మన యైక్యలక్ష్యము నితరసమస్యలు మరగుపరచునని భయపడుచున్నాను. మతదృష్టినుండి విమర్శించుట కశక్తుడను. ఇతరులు మీ పద్ధతులను కొల్లగొట్టవచ్చునను భయము కలదు. కాని నేనొక హైందవజాలికునకు సలహా చెప్పుట కెట్లుసాహసింపగలను? ప్రేమ."

పూనాలో సమావేశమైనవారందరు నొక 'యొడంబడిక' మీద సంతకముచేసిరి. బ్రిటిషుప్రధానమంత్రి యెన్నడు నెరుగని వేగముతో నాయొడంబడిక నంగీకరించి తన వెనుకటి 'అవార్డును' దాని ప్రకారము మార్చివేసెను. ఉపవాసము సమాప్తమయ్యెను. అట్టి యొడంబడికలు, అగ్రిమెంటులు నాకు గిట్టవు. కాని పూనాయొడంబడికను, నే నామోదించితిని.

ఉద్రేకము చల్లబడెను. మేము మాజయిలు కృత్యములకుమరలితిమి. హరిజనోద్యమమును గురించి, జయిలునుంచి గాంధీజీ జరుపు చర్యలనుగురించి మాకు వార్తలువచ్చుచుండెను. అవి నాకంత సుఖకరముగలేవు. అస్పృశ్యత నంత మొందించి మరదృష్టవంతులైనవిన్న జాతుల నుద్ధరించు యుద్యమమున కద్భుత వ్యాప్తికలిగెను. ఇది యొడంబడిక వలనగాక దేశములో చెలరేగిన చెడుగునుతొలగింపవలె ననెడి సంగ్రామోత్సాహమువలననే జరిగెను. ఇదియంతయునవసరమే. కాని శాసనోల్లంఘనమునకు నష్టము కలిగెను. దేశదృష్టి యితరవిషయములమీదకు మరలెను. చాలమంది కాంగ్రెసు వర్కరులు హరిజనోద్యమమునకు బూనుకొనిరి. బహుశః వీరిలో చాలమంది చల్లనిపనులలో నిమగ్నుకొనుట కవకాశములను చూచుకొనుచుండిరి. అది సహజము. లక్షలకొలది వర్కరు లెల్లప్పుడు తీవ్రబాధలకు, గృహవిచ్ఛేదములకు సిద్ధముగనుండవలెనని కోరుట న్యాయముకాదు. కాని మన మహోద్యమము నెమ్మదిగ నశించుటను వీక్షించుట బాధకరముగ

నుండెను. అయినను శాసనోల్లంఘన మింకను సాగుచునేయుండెను. అప్పుడప్పుడు 1933 మార్చి ఏప్రియల్ లోని కలకత్తా కాంగ్రెసువంటి జనసముద్రముతో గూడిన యుత్సవములు జరుగుచుండెను. గాంధీజీ యరవాడజయిలులో నుండెను. కాని వ్యక్తులను కలుసుకొనుటకు హరిజనోద్యమ సందేశములకు నతనికి కొన్ని సౌకర్యములు కలిగింపబడెను, ఇందువలన నతడు జయిలులో నుండెనను వ్యథ లేకుండెను. ఇదియంతయు నన్ను నిరుత్సాహపరచెను.

చాలనెలలయినతరువాత, 1933 మే మొదటివారములో గాంధీజి యేకవింశదినోపవాసము ప్రారంభించెను. దీని ప్రథమవార్త తిరిగి నాకొక గుండుదెబ్బవలె తగిలెను, కాని యిదియొక విధిధర్మమని నేను దీనిని స్వీకరించి యీ పాఠమున కలవడిపోతిని. అతడునిశ్చయించుకొని ప్రకటనచేసినతరువాత దానిని మానవలసినదని కొందరు ప్రోత్సహించుట నాకు కోపముకలిగించెడిది. నామట్టు కుపవాస మగ్రాహ్యమైనది, నిశ్చయముచేసికొనుటకు పూర్వము నన్నడిగియుండినచో తప్పకుండ నేను దానికి గట్టి వ్యతిరేకము చెప్పియుండెడివాడను. కాని నేను గాంధీజీమాటల కెక్కువ విలువనిచ్చితిని. దానిని భంగముచేయ యత్నించువారుతప్పుచేయుచున్నట్లు నాకుకాన్పించెను అది యతనికి సంబంధించిన వ్యక్తిగత విషయము. కనుక, నా కెంత యసుఖముగనున్నను నేను దానిని సహించితిని.

ఉపవాసము ప్రారంభించుటకు కొద్దిరోజులుపూర్వ మతడునా కొక యుత్తరము వ్రాసెను. అది నన్నెంతయో కదల్చివేసెను. అతడు జవాబు కోరుటచే నేనీ క్రింది తంతి పంపితిని. "మీ యుత్తరము చేరినది. నా కర్థముకాని విషయములనుగురించి నేనేమి చెప్పగలను? మీరొక్కరే తరచు మార్గముచూపు దిక్కుగనున్న యొక వింత దేశమున నుంటిని. అంధకారములోనే నేను నా మార్గమును తడుము కొనుటకు యత్నించుచున్నాను. కాని నేను జారుచున్నాను. ఏమి సంభవించినను నా యోచనలు, ప్రేమ మీ మీదనే యుండును."

అతని చర్యయెడల నా కసమ్మతి; అతనికి కష్టము కలిగింపరాదనుకోరిక ఈ రెంటిమధ్య నేను నలిగితిని. నేనతనికుత్సాహకరమైన వార్త పంపలేదని భావించితిని. ఇప్పు డతడు భయంకరాగ్ని పరీక్షకు నిలువనెంచెను. కనుక నేను నాశక్తికొలది యతనికుత్సాహముకలిగింపవలెను. చిన్నవిషయములే మానసికముగ పెద్దవియగును. అతడీపరీక్ష దాటి జీవించుటకు శక్తినంతనువినియోగించవలెను. ఏమిసంభవించినా నతనికి మృత్యువే వచ్చినను, మనము దానిని ధైర్యముగ స్వీకరింపవలెనని నేను భావించితిని. కనుక నేనతనికి మరియొక తంతి నిచ్చితిని.

"మీ రిప్పుడు మీ యున్నత సాహసమును ప్రారంభించిరి. కనుక నేను నా ప్రేమను అభినందనములను మీకు తిరిగి పంపుకొనుచున్నాను. ఏమి సంభవించినను మంచిదే! ఏమిసంభవించినను జయము మీదే! యని నేనిప్పు డెక్కువ స్పష్టముగ భావించుచున్నానని నమ్మగోరుచున్నాను." అతడుపవాసమునుండి బయటపడెను. దానిని ప్రారంభించిన మొదటిదినముననే యతనిని విడిచివేసిరి. అతని సలహాపై శాసనోల్లంఘన మారువారములు విరమింపబడెను.

ఉపవాసకాలమున దేశములో బయలుదేరిన యుద్రేక పూరిత ప్రబోధమును నేను తిరిగి పరీక్షించితిని. ఇది రాజకీయములలో సరియగు మార్గమేనా యను నాశ్చర్యము నా కంతకంతకు హెచ్చుచుండెను. కేవల మతోత్సాహము తిరిగితలయెత్తినట్లు నాకుకాన్పించెను. భారత దేశమంతయు 'మహాత్మ' వైపు పూజ్యభావముతో తేరిచూచి చూచుచు నతడద్భుతము వెంబడి యద్భుతములనుచేసి, యస్పృశ్యతను రూపుమాపి, స్వరాజ్యము మొదలగువానిని తెచ్చి పెట్టునని యనుకొనుచు తానేమియుచేయక నూరకుండెను. తమకు తామాలోచన చేసుకొనవలెనని గాంధీజీ యితరులను ప్రోత్సాహముచేయలేదు. త్యాగము, పవిత్రతయను నీరెంటినే యతడుపదేపదేవక్కాణించును. నాతనియెడల నెంత ప్రేమానుబంధమున్నను మానసికముగ నేనంతకంతకతనికి దూరమగుచున్నట్లు భావించితిని. అనేకసారు లతడు తన రాజకీయ క్రియాకలాపములో ప్రమాదరహితమగునాత్మప్రబోధముచే

నడుపబడుచుండెను. కార్యాచరణయం దతని కమోఘశక్తి కలదు. కాని జాతికి తగిన శిక్షణనిచ్చుటకు విశ్వాసమే సరియైన మార్గమా? దానివలన కొద్దికాలము లబ్ధికలుగవచ్చును. కాని తుదకేమగును?

దౌర్జన్యముమీద, సంఘర్షణమీద నిర్మింపబడిన ప్రస్తుత సాంఘిక క్రమము నతడెట్లంగీకరింపగలడో నేనుగ్రహింపజాలకుంటిని. నాలోకూడ సంఘర్షణ రేగెను. రెండు విరుద్ధవిశ్వాసములు నన్ను చీల్చుచుండెను. బలవంతముగా నాకుసముకూడినజయిలురక్షణపోవుట తోడనే నన్ను కష్టము లెదుర్కొనునని నేనెరుగుదును. నేను ఇల్లు వాకిలి లేనివానివలె, నేకాకినైనట్లు భావించితిని. నేను ప్రేమించిన భారతము, నేను సేవించినభారతమునాకొకవింతదేశముగ, నాశ్చర్యకరమగుదేశముగ కాన్పించెను. నా దేశస్థులేమిభావించుచున్నారో, ఎట్లుభావించుచున్నారో గ్రహింపజాలకపోవుట నాదోషమా? నాకతి సన్నిహితులైనవారికి నాకు మధ్యనొక కనపడనిగోడ యున్నట్లు నేను భావించితిని. దీనిని తరించుటకశక్తుడనగుటకు విచారపడుచు నాలోనికి నేనణగిపోవుచుండెడివాడను. ప్రాచీనప్రపంచము వారి నావరించినట్లు నాకు కాన్పించును. నూతనప్రపంచమింకను చాలదూరముననుండెను.

“రెండు ప్రపంచముల మధ్య (ఒకటినశించినదియు, రెండవది జన్మించుట కశక్తమైయున్నదియు) అది భ్రమించుచు తన తల దాచుకొనుట కింకను చోటులేక యుండెను.”

హిందూదేశ మన్నివిషయములకంటె నెక్కువగ మతప్రసక్తి కలదేశమనిభావింపబడుచున్నది. హిందువులు, సిక్కులు,ముస్లిములు, తదితరులు తమతమ విశ్వాసములకు గర్వపడుచుతలలనుపగలగొట్టుట వలన తమవిశ్వాసములలోనిసత్యములను రుజువుచేయుచున్నారు. హిందూదేశములోను తదితరచోట్లనుకూడ మతమని పిలువబడు దాని ప్రదర్శనము నన్ను భయముతో ముంచివేసెను. తరచు నేను దానిని ఖండించితిని. నేను దానిని పూర్తిగ తుడిచిపెట్టగోరితిని. అదికొంచె మించుమించు యెప్వుడును గ్రుడ్డివిశ్వాసము, వెనుకముఖము, పిడివాదము, మొండిపట్టు, పిచ్చినమ్మకము, యితరులను పీడించుట, స్వార్థ

ప్రయోజనములను కాపాడుట ఈయన్నింటిని సమర్థించును. అయినను అందులో నింతకంటె భిన్నమైనది, మానవుల యాంతరంగికాక్రోశమును తీర్చునది, మరియొకటేదియో కలదని నేనెరుగుదును. లేనియెడల నది యట్టియద్భుతశక్తి యెట్లుకాగలిగెను? అసంఖ్యాకములగు దుఃఖితాత్మల కది శాంతిని, సుఖమును యెట్లుచేకూర్చగలిగెను? ఆ శాంతి గ్రుడ్డివిశ్వాసమునకు ప్రశ్నింపజాలని చేతకానితనమునకు కేవలమొక యాశ్రయమా? ఆ శాంతి సముద్రతరంగ సంఘాతములనుండి రక్షించు సముద్రాశయమున దాగొనుటచే కలిగిన శాంతియా? లేక నది యింతకంటె నధికమైనదా? కొందరి సందర్భములలో నిశ్చయముగ నది యింతకంటె నధికమైనదే!

కాని విరోధములతోగూడిన మతము (గతకాలములో నదియెట్లుండినను) నేడు చాలవరకు జీవముపోయిన మృతకళేబరము వంటిది. జి. కె. ఛెస్టర్టన్ దానిని (తనకు చెందిన ప్రత్యేకమతముద్రను కాదు. ఇతరములను!) భూగర్భ జంతువుల బాహ్య రూపములతో పోల్చెను. దీనిలోనుండు నాత్మపదార్థము సంపూర్ణముగ మాయమయ్యెను. కాని దానికి కేవల భిన్నమగు నితరపదార్థముతో నది నింపబడుటచే దానియాకారము మిగిలెను. ఒకవేళ: విలువగల దేదియైన కొంతమిగిలినచో నది యితర యుపద్రవకర వస్తువులచే నావరింపబడెను.

మన ప్రాచ్యమతములకు పాశ్చాత్యమతములకు గూడ నిట్టిస్థితియే సంభవించినట్లు కాన్పించును. నిజమైన యర్థములో నేకొలమందు మతముకాని ఇంగ్లీషుచర్చి మతమే యిందుకు ప్రబలనిదర్శనము. కొంతవరకు నది నిబంధన రూపములోనున్న ప్రొటెస్టెంటు మతముకంతకు వర్తించును. కాని ఇంగ్లండు చర్చి చాలకాలమునుండి ప్రభుత్వవ్యవసాయశాఖయగుటచేబహుశః మరికొంతముందుకువెళ్లెను.

దాని భక్తులు చాలమంది నిస్సందేహముగ నుత్తమోత్తమశీలము కలవారు. కానియీచర్చి బ్రిటిషు సామ్రాజ్య ప్రయోజనముల నద్భుతముగ సేవించెను. అది సామ్రాజ్య తత్వమునకు, పెట్టుబడిదారులతత్వమునకు నైతికము, క్రైస్తవమత సంబంధమునగు రక్షణ

నిచ్చెను. అది ఆసియా, ఆఫ్రికాలలోని బ్రిటిషు దోపిడీనీతి నత్యో త్తమ నైతిక ప్రమాణములద్వారా సమర్థింప యత్నించెను. ఎప్పుడును న్యాయముగనే యుండిరను నసాధారణమును, నసూయపడదగినదియు నగుభావమును నది వారికి కలిగించెను. సుఖదాయకమగు నీ పవిత్రభావమును కలుగచేయుటకు చర్చిసహాయపడెనో లేక నదియే దానిని పుట్టించెనో నేను చెప్పజాలను. యూరపు అమెరికా ఖండములలోని యింతకంటె తక్కువ యదృష్టవంతమైన దేశములు తఱచు ఇంగ్లీషువారిని మోసగాండ్రని నిందింతురు. "ఇంగ్లీషువారి నమ్మిక స్వామిద్రోహము" అనునది యొక చెప్పిపోలుమాట. కాని యీ నింద బహుశః ఇంగ్లీషువారిజయమున కసూయచే కలిగినది. నిశ్చయముగ, నే యితర సామ్రాజ్యప్రభుత్వము ఇంగ్లండుపై రాళ్ళు విసరజాలదు. ఏలనన దాని చరితకూడ తత్తుల్యమైనదే. బుద్ధి పూర్వకముగ మోసముచేయు నే జాతికి బ్రిటిషువారు నిరంతరము ప్రదర్శించుచుండిన శక్తిసంపత్తులు లేవు. వారవలంబించిన 'మతముద్ర' వారి స్వప్రయోజనములను సంబంధించినచోట వారినైతికజ్ఞానమును మొద్దుపరచి వారికిందులో సహాయముచేసెను. ఇతర ప్రజలు, జాతులు బ్రిటిషువారికంటె నతి యధమముగ ప్రవర్తించిరి. కాని తమకు లాభించినదాని నొక పుణ్యకార్యముగచేయుటలో వారెవరికిని యింతటిజయము చేకూరలేదు. మన కందరకు నెదుటవాని దోషములు నలుసులైనను కాన్పించును. మనదోషములు గుమ్మడికాయలంతయైనను కానరావు. కాని బ్రిటిషువారీ విద్యలో నందరిని చిత్తుచేసెదరు.

ప్రొటెస్టెంటు మతము నూతనపరిస్థితులకు సరిపడియుండుటకు యత్నించెను. అది రెండులోకముల యుత్తమభోగములను అనుభవింప గోరెను. ఈ ప్రపంచముకు సంబంధించినంతవరకు విజయము నొందెను. కాని మతదృష్టిలో (నిబంధనలతో గూడిన మతము) నది రెంటికి చెడ్డ రేవడివలె చెడిపోయెను. మతము క్రమముగ హేతుశూన్యమగు నుద్రేకమునకు పెద్దవర్తకమునకు దావిచ్చెను. పాతమార్గమునే యంటిపెట్టుకొని యుండుటచే రోమనుకాథలిక్ మతము

కేస్థితిలప్పెను. ఆ మార్గము సరిగా నున్నంతవర కది వృద్ధిచెందును. పాశ్చాత్యదేశములలో నే డది యొక్కటే సచేతనమైనమతముగ (దానిసంకుచితార్థములో) కాన్పించును. ఒకరోమనుక్యాథలిక్ స్నేహితుడు నాకు జైలులోనికి కెథాలిసిజమునుగురించిన యనేకపుస్తకములను పోపుగారి యుత్తరములను పంపించెను. నేను వానిని శ్రద్ధతో చదివితిని. వానిని చదివిన తరువాత నామతమున కనేకమంది ప్రజలపైగల పలుకుబడిని నేను గ్రహింపగలిగితిని. ఇస్లాముమతము జనసామాన్యమునకు చెందు హిందూమతమువలెనే (యదిసందేహాస్పదము) మానసిక సంఘర్షణములేనట్టి యొక భద్రమగు నాశ్రయమును ప్రసాదించెను. ఈ జీవితములోని దోషములను కూడగట్టగల భవిష్యజ్జీవితము నది భీమాచేసిపెట్టును!

ఈ విధముగ తలదాచుకొనజూచుటనాకసంభవముగనుండెను. తుపానులతోను అలలతోను నిండియుండు సముద్రమునే నేను వాంఛింతును. చనిపోయిన తరువాత జరుగు విషయములందును, పరమునందు నా కంతయభిరుచి లేదు. ఈ జీవితసమస్యలే నామనస్సును నింపునంతటి యాకర్షవంతముగ కాన్పించును. ప్రధానముగ నైతికమయినదేయైనను (మతవిశుద్ధము లేక మతమును సందేహించునట్టిదియైనను?చీనాదేశస్థుల సాంప్రదాయకకృషి దానిని జీవితమునకు వర్తింపచేయుటలో నేనంగీకరింపకపోవచ్చును. నన్నాకర్షించును. మన మనుసరింపవలసిన మార్గము మనము జీవింపవలసిన విధము నాకు ప్రధానములు. జీవితమును తిరస్కరించుట దానినర్థముచేసికొనుట కాజాలదు, దానినిస్వీకరింపవలెను. దానికితగిన సన్నాహముచేసికొని దానినిచక్కపరచవలెను, కానిమామూలు మతదృష్టికి ప్రపంచముతో సంబంధము లేదు. అదినిర్దుష్టభావములకు కుశలత్వపువలెకాన్పించును. ఏలనన నది స్థిరములు మార్పుకూడని సిద్ధాంతములు ధర్మవన్నములను నిరాటంకముగ నంగీకరించుపునాదులమీద నిర్మింపబడుటయేగాక స్వదేశము, ద్వేషము, రాగము అను పునాదులనుగూడ నంగీకరించెను. ఆత్మకుసంబంధించినయాధ్యాత్మికములను నా భావన కదియనేకమైళ్ళదూరము, అంతకుపూర్వము భావింపబడిన భావములకు సత్యము సరి

పడకపోవచ్చుననుభయముచే నది బుద్ధిపూర్వకముగ లేదా యబుద్ధి పూర్వకముగ సత్యముపట్ల కండ్లుమూసికొనును. అది సంకుచితమయి నది. ఇతరభావములను యితర యభిప్రాయములను అది యెంత మాత్రము సహింపనేరదు. అది తనకేంద్రమునుదాటక అహంకార పూరితమయియుండును, స్వార్థపరులచేతను సమయానుకూల స్వాపరులచేతను అది తఱచు కొల్లగొట్టబడును.

మతతత్వరులతో తరచు నుత్తమోత్తమ నైతిక, యాధ్యాత్మిక వ్యక్తులుండలేదని, యిప్పుడులేరని దీనియర్థముకాదు. నీతిని, యాధ్యాత్మికములను పరముకుచెందు ప్రమాణమునుబట్టిగాక నిహప్రమాణమునుబట్టి విమర్శింపవలసినచో మతదృష్టి యొక జాతియొక్కయు ప్రజయొక్కయు నైతిక, యాధ్యాత్మికాభివృద్ధికిసహాయపడక పోవుటయేగాక దాని కభ్యంతరముగగూడ నుండునని దీనిభావము. సాధారణముగ మతము సంఘమున కతీతమైనభగవంతుని లేక పరబ్రహ్మమునుచూచు యత్నమగుచున్నది. మతాభిలాషికి సాంఘిక శ్రేయస్సుగాక తన ముక్తియే కావలెను. యోగి స్వార్థనాశముచేయ యత్నించుచు నా విధానములో సాధారణముగ తానును చిక్కుకొనును. నైతిక ప్రమాణములకు సాంఘికావసరములతో సంబంధములేదు. కాని యవి పాపమను నత్యంత మానసిక సిద్ధాంతముపై నిర్మింపబడెను. నిరోధములతో నున్నమతము విధాయకముగ స్వప్రయోజనపరత్వమగును. కనుక నది తప్పనిసరిగ మారుప్పను. అభివృద్ధిని యెదుర్కొను శక్తియే యగును.

మొదటిదినములలో క్రైస్తవచర్చి, తమ సాంఘికశక్తిని చక్కబరచుకొను బానిసలకు సహాయపడలేదనుసంగతి సువిదితము. ఆర్థిక పరిస్థితులవలన బానిసలు యూరపుయొక్క మధ్యయుగములో సామంతుల కమ్ముడుపోయిన నౌకరులైరి. రెండువందలేండ్ల క్రితము చర్చి కెట్టి దృష్టియుండెనో లండన్‌బిషప్ అమెరికా దక్షిణకాలనీలోని బానిసల యజమానులకు (1727లో) వ్రాసిన యొక యుత్తరము వలన తెలియుచున్నది.

“క్రైస్తవమతము జీససుబోధలను స్వీకరించుట– ఇది నాగరిక సంబంధమైన యేధర్మములో గాని, ఆస్థిలోగాని యెట్టి కనీసపు మార్పును చేయదు. కాని యీ యన్ని విషయములలో నవియేస్థితిలో నున్న మనిషినాస్థితిలోనే యుంచును. క్రైస్తవ మతము పాపబంధము నుండియు, సైతానునుండియు మానవుల లోభ, మోహ, మాత్సర్యములనుండియు మోక్షము నిచ్చును. కాని వారిబాహ్యపరిస్థితివిషయమై–యది యంతకుమును పెట్టిదియైనను–బానిసత్వమైనను, స్వాతంత్ర్యమైనను, వారు క్రైస్తవులగుటవల్లను, ‘మంత్రోదకము’ తీసికొనుటవల్లను వారిలో నెట్టిమార్పును కలుగజాలదు” అని యీ బిషప్ వ్రాసెను.

నేడు నిబంధనలతోనున్న యేమతమును దాపరికము లేకుండ నిట్లు వ్యక్తపరచదు. కాని ప్రస్తుత సాంఘిక క్రమమును గురించియు, ఆ స్థితిని గురించియు దాని దృష్టి ముఖ్యముగ నిట్లేయుండును.

శబ్దము, భావమును తెలుపు యసంపూర్తి సాధనమని మన మెఱుగుదుము. తరచు అవి యనేక విధముల నర్థము చేసికొనబడుచున్నవి. ‘రెలిజియన్’ అను పదమువలె (లేక నీ యర్థమిచ్చు యితర భాషలలోని పదములవలె) బహుశః యే భాషలలోని యే శబ్దమును కూడ ననేక ప్రజలచేత ననేకవిధముల నర్థముచేసికొనబడును. ఈ శబ్దమును వినుటవలనగాని, చదువుటవలనగాని బహుశః యే యిద్దరు మనుష్యులకు నొకేభావములు, రూపములు యుత్పన్నముకాజాలవు. ఆ భావములలోను, రూపములలోను, పూజలు పునస్కారములు, కర్మకాండ, వేదములు, పవిత్రగ్రంథములు, నీతులు, సిద్ధాంతములు, భక్తి, ప్రేమ, భయము, ద్వేషము, దయ, త్యాగము, సన్యాసము, ఉపవాసము, విందులు, ప్రార్థన, ప్రాచీనచరిత్ర, వివాహము, మృత్యువు, పరము, కొట్లాటలు, బుర్రలు పగులగొట్టుట యిత్యాదులెన్నియో యుండవచ్చును. ఇన్ని విధములైన రూపములు, అర్థములు నుండుటచే కలుగు గందరగోళముసంగతి యటుండ, యుద్రేకరహితభావము నసంభవము చేయునట్టి బలమైన యుద్రేక మెప్పుడును యుండితీరును. ‘మతము’ అనుపదము సరియైన యర్థమును కోల్పోయి.

కేవల గందరగోళము మాత్రమే చేయుచున్నది. తఱచు దాని కనేక విరుద్ధార్థము లుండుటచే నది యంతుపొంతులేని వాదనకు, చర్చకు నావకాశ మిచ్చుచున్నది. మనము దాని నుపయోగించుట పూర్తిగ మానివేసి యంతకంటె స్వల్పమైన యర్థములుగల వేదాంతము ఆధ్యాత్మికములు, నీతులు, మనఃశాస్త్రము ధర్మము పూజాపుర స్కారములు, ద్రవ్యశాస్త్రము మొదలగునట్టివాని నుపయోగించిన చాలబాగుండును. ఈ పదములుకూడ నస్పష్టమైనవేకాని 'మతము' కంటె వీనికున్న వ్యాప్తి చాల తక్కువ. ఒక గొప్పలాభమేమనిన 'మతము' అను పదము నావరించు భావములు, ఉద్రేకములు యీ పదముల కంతగా కల్పింపబడలేదు.

కనుక మతమన నేమి? బహుశః అది వ్యక్తియొక్క యాంత రంగికాభివృద్ధి శ్రేయస్కరమని తలంపబడిన మార్గమున నతనిబుద్ధి వికశించుటయు కావచ్చును. ఆ మార్గమునుగురించి మరల తర్కము బయలుదేరును. కాని మతమునుగురించి నాకు తెలిసినంతవరకది యీ యాంతరంగిక మార్పు కావలెననియే చెప్పును. బాహ్యపరివర్తన మీ యాంతరంగికాభివృద్ధి బాహ్యపరిసరముల నత్యంత శక్తితో చక్కబరచుననుటలో నెట్టి సందేహము లేదు. కాని బాహ్యపరిసర మాంతరంగికాభివృద్ధికి మిక్కిలి తోడ్పడును. అవి యొకటి కొకటి తోడ్పడును. ఆధునిక పారిశ్రామిక పాశ్చాత్యఖండములలో బాహ్యాభి వృద్ధి యాంతరంగికాభివృద్ధి నెక్కువగ దిగద్రొక్కి వేసెననుట సామాన్యమాట యయ్యెను. కాని మనము పారిశ్రామికముగ వెనుక బడియున్నాము. మన బాహ్యాభివృద్ధి మందముగనున్నది. కనుక మన యాంతరంగిక పరిణామము గొప్పదియను యర్థము కానేరదు. ఇట్టిపిచ్చిభ్రమలతో మనల నోదార్చుకొన యత్నించుచు మనము తక్కువవారమను భావమును పోగొట్టుకొన యత్నించుచున్నాము. వ్యక్తులు కొందఱు పరిస్థితులను, పరిసరములను తరించిగొప్ప యాంత రంగికోన్నతిని పొందవచ్చును. కాని సంఘములకు జాతులకు నాంత రంగికపరిణామము కలుగుటకు పూర్వము కొంత బాహ్యాభివృద్ధి

యవసరము. ఆర్థికపరిస్థితులకు దాసుడై జీవితసంబంధముచే నలిగిపోవు వా డెట్టి యుత్తమ యాంతరంగికజ్ఞానమును సాధింపజాలడు. అట్టివా రతి క్వచితు. రాజకీయముగ, నార్థికముగ, నితరజాతికి బానిసలై నిర్బంధింపబడి, కొల్లగొట్టబడి, నలిగిపోవుజాతి యాంతరంగికాభివృద్ధి నెన్నటికి సాధింపజాలదు. అంతరంగికాభివృద్ధికి బాహ్యస్వేచ్ఛ, తగిన పరిసరములు నవసరమైయున్నవి. బాహ్యస్వేచ్ఛను సంపాదించుటకు నాంతరంగికాభివృద్ధి నాటంకపరచు పరిసరములను మార్చుటకు నవలంభింపబడు విధానము మన నిజలక్ష్యమునకే హానిచేయరాదు. మన లక్ష్యముకంటె మన మవలంబించు సాధనమే యెక్కువ ముఖ్యమైనదని గాంధీజీ చెప్పినప్పు డతనిదృష్టిలో నిట్టిభావమే యుండెనని నే ననుకొనెదను. కాని యా సాధన మన లక్ష్యమునకు తీసుకొనిపోవునదిగ నుండవలెను. లేనిచో నదియంతయు వ్యర్థప్రయత్నమగును. అది మరింత బాహ్యాభ్యంతర యధఃపతనమునకు గారణముకావచ్చును

“మతము లేకుండ నెవడు జీవింపజాలడు” అని గాంధీజీ యొకచోట వ్రాసెను. “హేతువాదాహంభావముచేత మతముతో తమకెట్టి సంబంధములేదని ప్రకటించువారు కొందఱుకలరు. కానియది “నేను గాలిని పీల్చుచున్నాను కాని నాకు ముక్కులేదు,” అనునట్లుండును. మరియొకచోట నతడిట్లనెను. “సత్యమువట్ల నాకుగల భక్తియే నన్ను రాజకీయరంగములోనికి దింపెను. మతమునకు రాజకీయములతో నెట్టి సంబంధములేదని చెప్పువారికి మతమున కర్థము తెలియదని నే నెట్టి సందేహములేకుండ చెప్పగలను.” మతమును రాజకీయములనుండియు, జీవితమునుండియు బహిష్కరింపగోరువారిలో చాలమంది ‘మతము’ అను పదమున కతడు చెప్పు యర్థముగాక వేరొక విపరీతార్థమునిచ్చుచున్నారని యతడు చెప్పిన యెడల బహుశః మరింత యొప్పుగనుండెడిది. అతడుదానిని మతమును విమర్శించువారి యర్థమునకు భిన్నమైన–బహుశః అన్ని భావములకంటె నెక్కువగ నైతికభావములో—యర్థములో నుపయోగించుచున్నాడని స్పష్టమగుచునేయున్నది. ఒకే పదమును వివిధార్థములలో నుపయోగించుటచే పరస్పరసమన్వయము మరింత కష్టమగుచున్నది.

మతమునకు జాన్‌డ్యూయీ పండితు డాధునిక నిర్వచనము చేసెను. అతని ప్రకారము "వివిధములు, మారునవియగు జీవిత విషయములలో, యదార్థ మానసికదృష్టిని ప్రవేశపెట్టు నదేదియైనను మతమనబడును. లేక "ఒక యాదర్శపూర్వక లక్ష్యముకొఱ కెన్ని యాటంకములనైనను యెంతటి వ్యక్తిగత నష్టమునైనను భరించుచు చేయబడు నే కార్యమైనను వస్తుతః మతమే" ఇది మతమైనచో నిశ్చయముగ దీనిపట్ల నెవనికి నెట్టి యభ్యంతరము నుండజాలదు.

రోమారోలాకూడ నిబంధనలతో గూడిన సనాతన మతస్థులకు భయముగొల్పునట్లు మతమునకు విశేషార్థము చెప్పెను. అతడు తాను రచించిన 'రామకృష్ణుని జీవితము'లో నిట్లు చెప్పెను.

"ఏట్టిమత విశ్వాసమునకు కట్టుబడని చాలమంది లేక కట్టుబడుటలేదని విశ్వసించువారు దానిని సామ్యవాదము, కమ్యూనిజము, భూతదయాళుత్వము, జాతీయత, చివరకు హేతువాదము, అని యందురు. ఒక భావముయొక్క మూలమును నిశ్చయించునది దాని గుణము కాని లక్ష్యముకాదు. ఆ భావము మతమునుండి బయలు దేరుచున్నదా లేదా యనునది దాని గుణమునుబట్టి నిర్ణయింపబడ వలెనేగాని దాని లక్ష్యమునుబట్టి నిర్ణయింపబడరాదు. అది నిర్భయముగ సత్యాన్వేషణమున కెట్టి కష్టములనైన నెదుర్కొని, యే కైక దీక్షతో నెట్టి త్యాగమునకైనను సంసిద్ధతను చూపినచో నేనుదానిని మతసంబంధమైన దనియెనెదను. ఏలనన నది ప్రస్తుతసాంఘికజీవితము కంటె, సమగ్ర మానవ లోకమంతటికంటె నుత్తమమైనదే. పురుషార్థ లక్ష్యమును విశ్వాసమును తెలుపుచున్నది నిరీశ్వరవాదము కూడ, తత్వాన్వేషణాతత్పరతగల తీవ్రప్రకృతులనుండి బయలు దేరునపుడు మత సంబంధమైన 'ఆత్మ' యొక్క మహా సైన్య ప్రస్థానము లోనే జేరుచున్నది.

రోమారోలా షరతులను నిర్వహింపగలనని నేను చెప్పజాలను కాని ఈ షరతులమీద నా మహాసైన్యము యొక్క విధేయత గల సైనికునివలెనుండుటకు నేను సంసిద్ధుడనైయుంటిని.

# బ్రిటిషు ప్రభుత్వ "ద్వంద్వనీతి"

ఎరవాడ జయిలునుండియు, [illegible] బయటనుండియు గాంధీజీ యాదేశానుసారము హరిజనోద్యమము నడిపింపబడుచుండెను. దేవాలయప్రవేశమునకు గల యాటంకములను తొలగింపవలెనను గొప్ప యాందోళన బయలుదేరెను. అసెంబ్లీ సభలో నట్టి బిల్లు ప్రవేశపెట్టబడెను. అప్పుడొక విఖ్యాత కాంగ్రెసునాయకుడు ఢిల్లీలో నిల్లిల్లు తిరుగుచు, అసెంబ్లీసభ్యులనందరిని దర్శించుచు, నీదేవాలయ ప్రవేశబిల్లుకొరకు వోటులను భిక్షించునద్భుత ప్రదర్శనము జరిగెను. గాంధీజీ స్వయముగ వతనిద్వారా అసెంబ్లీసభ్యులకొక వార్త పంపెను. అప్పటికింకను శాసనోల్లంఘనము జరుగుచునే యున్నది. ప్రజలు జయిళ్ళకు పోవుచునే యున్నారు. కాంగ్రెసు అసెంబ్లీని బహిష్కరించెను! మన అసెంబ్లీ సభ్యులందరు దానిని విడిచివచ్చిరి. మిగిలిన మొండిముక్కలును, తాబేలను భక్తిచేసినవారు కలిసి యావిషమ సమయములో కాంగ్రెసు నెదిరించుచు, ప్రభుత్వమును బలపరచుచు తమ ఘనతను చాటుకొనిరి. వారిలో సభా సంఖ్యాకులు ఆర్డినెన్సుల యనాధారణాధికారములకు శాశ్వతత్వము ప్రసాదించు నిర్బంధ చట్టములను చేయుటలో ప్రభుత్వమునకు తోడ్పడిరి. వారు ఒటావా సంధిని దిగమ్రింగిరి. వారు ఢిల్లీ సిమ్లా, లండనులోనున్న ఘనులతో భోజనభాజనములను చేసిరి. విందులను గుడిచిరి. భారతదేశములోని బ్రిటిషు ప్రభుత్వముకు జేజేలుకొట్టుటలో జేరిరి. భారతదేశములోని "ద్వంద్వనీతి" యని పిలువబడు దాని విజయముకొరకు ప్రార్థించిరి.

అప్పుడున్న పరిస్థితులలో గాంధీజీ చూపిన ప్రాధేయతకు నే నాశ్చర్యపడితిని. కొద్దివారములక్రితమె తాత్కాలికాధ్యక్షుడుగ పని చేసిన రాజగోపాలాచారిగారి భగీరథ యత్నములకంటెకంటె నెక్కువగ నాశ్చర్యపడితిని. ఈ చర్యవలన శాసనోల్లంఘనము నష్టపడెను.

కాని దీనిలోనున్న నైతికపతనమే నాకెక్కువ బాధ కలిగించెను. గాంధీజీగాని, మరేకాంగ్రెసునాయకుడుగాని యిట్టిచర్యలను ప్రోత్స హించుట యపేక్షింగను, జయిళ్ళలోనున్న యసంఖ్యాకులయెడలను, పోరాటమును సాగించుచున్న వారియెడలను కొంచెమించుమించు నమ్మికస్వామిద్రోహముగను నాకు కాన్పించెను. కాని యతడు దానిని మరియొక విధముగ చూచుసని నేనెరుగుదును.

ఈ దేవాలయ ప్రవేశబిల్లు సందర్భములో ప్రభుత్వవైఖరి [యిప్పుడును, తరువాతను] సత్యమును వెల్లడించెను. దానిని ప్రోత్స హించినవారి మార్గమున కది కల్పింపగలిగినన్ని కష్టములను గల్పించెను. వాయిదా వెంబడి వాయిదాలను వేసెను. దానికి వ్యతిరేకమును ప్రోత్సహించెను. తరువాత తుదకు తానే వ్యతిరేకముగ నున్నట్లు ప్రకటించి దానిని చంపివేసెను. భారతదేశములోని యన్ని సంఘసంస్కారోద్యమములపట్లను (హెచ్చుతగ్గుస్థాయిలో) దానివైఖరి యట్టిదియుండెను మతములో జోక్యము కలిగించుకొనము అనుమిష మీంద నది సాంఘికాభివృద్ధి నాటంకపరచెను. కాని మన సాంఘిక దోషములను విమర్శించుటకు యితరుల నట్లుచేయ ప్రోత్సహించుటకు నిది వారికెట్టి యాటంకము కలిగింపదని వేరుగ చెప్పనక్కర లేదు. అదృష్టవశాత్తు శారదా శిశువివాహ నిర్బంధ బిల్లు చట్టమయ్యెను. కాని ప్రభుత్వమిట్టి చట్టముల నమలుపరచుట కెంత యయిష్టముగనుండెనో యీ దురదృష్ట చట్టముయొక్క తరువాత చరిత్ర [మరేదియు చూపజాలనట్లు] విశదముచేయుచున్నది. వింత నేరములను సృష్టించుచు, నొకరికొకరు మరియొకనిని శిక్షించుటకు తగిన బందోబస్తులను చేసికొనుచు,విశేధమందుఆర్డినెన్సులనుసృష్టింప గల ప్రభుత్వము; వాని నుల్లంఘించినందులకు లక్షలకొలదిజనమును జయిళ్ళకుపంపగలిగిన ప్రభుత్వము శారదాచట్టమువంటి క్రమచట్టము నమలుపరచుటకు జంకెను కాబోలు! ఈ ఆక్టుయొక్క మొదటిఫలిత మేమనిన నిది యేదోషమును డీకొనుట కుద్దేశింపబడెనో యది యద్భుతముగ పెరిగిపోయెను. ఈ ఆక్టు అతితెలివి తక్కువగా నిచ్చిన

యీ యుపమానముల సావకాశమును తీసుకొనుటకు ప్రజలు త్వరపడిరి, తరువాత నీ అట్టి కొంచెమించుమించుగ నొకపరిహాసముగాని కనుగొనబడెను. ప్రభుత్వమెట్టిచర్య తీసుకొనకుండ దీనినిచులకనగనిర్లక్ష్యము చేయవచ్చునని ప్రజలు గ్రహించిరి అధికారరీత్యా ప్రచారము చేయుటకు ప్రయత్నలేశమైనను గావింపబడలేదు. గ్రామములలో చాలమందికి అట్టిసంగతియే తెలియదు వారు హిందూ, ముస్లిం గ్రామ పురోహితులవలన దీని యవకతవక కథను వినిరి. యదార్థ విషయము లా పురోహితులకే తెలియవు.

హిందూదేశములో బ్రిటిషుప్రభుత్వముసాంఘికదోషములపట్ల చూపు అసాధారణసహనము వానియెడలగల పక్షపాతబుద్ధిచే కలిగినదికాదు వానిని రూపుమాపుటకు వారంతగా లెక్కచేయకనుట సత్యము. ఏలనన యీ దోషములు వారు హిందూదేశమును పరిపాలించుటకుగాని, దాని నిధులను కొల్లగొనుటకుగాని యడ్డముకావు సాంఘిక సంస్కరణమువలన ప్రజలకు కోపముకలిగించు యుపద్రవ మెప్పుడును కలదు. రాజకీయరంగములో కావలసినంతకోపము నెదుర్కొనవలసియుండుటచే బ్రిటిషుప్రభుత్వము లేని కష్టములకు క్రొత్త వానిని చేర్చుకొనన నిచ్ఛగింపకుండెను. కాని సంఘసంస్కారము చేయగోరువాని దృష్టిలో యిప్పటిస్థితిగతు లధ్వాన్నముగనుండెను. బ్రిటిషువారంతకంతకే సాంఘికదోషములకు పైకికాన్పించని రక్షణ నిచ్చుచున్నారు. భారతదేశాభివృద్ధి కత్యంత భంగకారకులైనవారి సన్నిహితసంపర్కముచేతనే వారిట్లు తయారైరి. వారి పరిపాలనకు వ్యతిరేకము హెచ్చినకొలదివారు క్రొత్తస్నేహితులను చూచుకొనుచుండవలెను. నేడు భారతదేశములో కులతత్వవాదులలో పతి వాదులు, జ్ఞానము, సంస్కారము వలదనువారు బ్రిటిషుప్రభుత్వము కచంచల మూలస్తంభములు. ముస్లింకులసంస్థలు ప్రతివిషయము లోను—రాజకీయ, ఆర్థిక, సాంఘికము లన్నింటిలోను యభివృద్ధిభంగ కరములని ప్రసిద్ధిచెందెను. వానికి హిందూమహాసభ పోటీ. కాని ఈ వెనుకకు నడుగెత్తు పందెములో వారితాతలు మరి మొనకరున్నారు.

వారు సనాతనులు. వారు మత సంబంధముగ నెట్టి యభివృద్ధియు
కూడదనుటలో నతివాదులేగాక బ్రిటిషుపరిపాలనయెడల గొప్పరాజ
భక్తి [అర్థమనగా వారట్లు బిగ్గరగా చెప్పకొందురు]. కలవారు.

శారదాచట్టమును ప్రజలకు తెలుపుటకు నమలుపరచుటకు
బ్రిటిషుప్రభుత్వము మిన్నకయుండి యెట్టి చర్యయు తీసుకొనకపోయి
నను కాంగ్రెసు, తదితర యనధికారసంస్థలు దాని తరుపున యేల
ప్రచారముచేయలేదు? బ్రిటిషువిమర్శకులు, నితర విదేశవిమర్శకులు
తఱచు యీ ప్రశ్న వేయుచుండిరి. కాంగ్రెసు గత పదిహేను
సంవత్సరములనుండి [ముఖ్యముగ 1930 లగాయతు) జాతీయ
స్వాతంత్ర్యముకొరకు బ్రిటిషు ప్రభుత్వముతో పోరాటములోమునిగి
యుండెను, యితర సంస్థలకు నిజమైనబలముగాని ప్రజలతో నెట్టి
సంబంధముగాని లేదు, ఆదర్శములును నైతికబలమును, ప్రజా
సామాన్యములో పలుకుబడియు గల, స్త్రీపురుషులు కాంగ్రెసులోని
కీడ్చబడి తమ జీవితములో చాలభాగము బ్రిటిషుజయిళ్ళలో గడుపు
చుండిరి.

తక్కిన సంస్థలు ప్రజాసంపర్కమునకు భయపడు కొద్దిమంది
చేయు తీర్మానములను దాటి పయికిపోజాలకుండెను. అవి "పెద్దమనిషి
తరహాగా పనిచేసెను. అఖిలభారత స్త్రీసమాజమువలె పనిచేసెను.
వారికి తీవ్రమైన ప్రచారముచేయు సత్తువలేదు. అదిగాక ఆర్డినెన్సులు
వానివెనుకవచ్చిన చట్టములును అన్ని ప్రజాహితకార్యములను
భయంకరముగ నణచివేయుచుండుటచే వారుగూడా నిర్విణ్ణులైరి,
సైనిక శాసనము విప్లవచర్యల నణచివేయవచ్చును. కాని యవి
దానితోపాటు నాగరికతను పౌరక కార్యములనుగూడ నిర్వీర్య
మొనర్చును.

కాంగ్రెసు, తదితరయధికారేతర సంస్థలు సంఘసంస్కారము
కెక్కువగ పనిచేయజాలకపోవుటకు గల కారణమింతకంటె గంభీర
మైనది. జాతీయతయనువ్యాధి మనలను బాధించుచున్నది. అది మన
దృష్టినంతను మ్రింగివేయుచున్నది. మనకు రాజకీయస్వాతంత్ర్యము

వచ్చువరకు నది యుక్తే చేయును. బెర్నార్డుషా చెప్పినట్లు 'జయింపబడిన జాతి రాచపుండుగల మనిషివంటిది. వాడు మరిదేనిని గురించియు యోచింపజాలడు. జాతికి జాతీయోద్యమముకంటె గొప్ప శత్రువు వేరొకటిలేదు. అది యణచివేయబడిన యొక సహజధర్మము యొక్క బాధను తెలుపు చిహ్నముమాత్రమే యగుచున్నది. జయింపబడిన దేశములు ప్రపంచస్థానములో తమస్థానమునుకోల్పోవుచున్నవి. ఎందుచేతనన అవి జాతీయస్వాతంత్ర్యమును సంపాదించి తద్వారా జాతీయోద్యమములను వదిలించుకొను యత్నముకంటె వేరేమియు చేయజాలవు"

మంత్రులకు కొన్ని శాఖలు బదిలీచేయబడినను ప్రస్తుత పరిస్థితులలో మన నెట్టి సాంఘికాభివృద్ధిని చేయజాలమని గత యనుభవము తెలుపుచున్నది. ప్రభుత్వ స్వభావము కన్సర్వేటివుల కెప్పుడు సహాయకారిగనుండెను. అనేకతరములనుండి బ్రిటిషు ప్రభుత్వము వారు స్వతంత్రశక్తిని చంపివేసి నిరంకుశముగ లేక వారే చెప్పినట్లు మన సంరక్షకులుగ పాలించిరి. అధికారేతరులుచేయు నెట్టి గొప్ప యత్నమునైన నది యామోదింపజాలదు. అది దానికి కూటాస్త్రములను కల్పించును. హరిజనోద్యమమునకు (దాని స్థాపకులన్నివిధములైన జాగ్రతలను తీసికొనినను) అప్పుడప్పుడు ప్రభుత్వాధికారులతో సంఘర్షణవచ్చుచుండెను. కాంగ్రెసు సబ్బువాడవలెనని ప్రచారము దేశమున ప్రారంభము చేసినచో ననేకవిధముల ప్రభుత్వముతో సంఘర్షణ సంభవించునని నేను రూఢిగ చెప్పగలను.

ప్రభుత్వము తలచుకొనినచో ప్రజలను సంఘసంస్కారసుముఖులనుచేయుట కష్టమైనపనికాదు, కాని విదేశ పరిపాలకు లెప్పుడు సందేహించుచు మార్పుచేయు విధానములో దూరముపోజాలరు. విజాతీయ సంపర్కము తీసివేసి యార్థికపరివర్తనలకు ప్రాముఖ్యత నిచ్చినచో సమర్థతగల పరిపాలన గొప్ప సాంఘిక సంస్కారములను చులకనగా ప్రవేశపెట్టవచ్చును.

కాని జయిలులో మా మనస్సులు సంఘసంస్కారము, శారదా చట్టము, హరిజనోద్యమములతో (శాసనోల్లంఘనమున కడ్డమువచ్చె

వని హరిజనోద్యమమువల్ల నాకు కొంచెము కోపముకలుగుటతప్ప నిండియుండలేదు, 1933 మే మొదటివారములో శాసనోల్లంఘన మూరువారము లాపివేయబడెను. తరువాత నేమియగునో యని మే మాతురతతో చూచుచుంటిమి అవిరామమనే యుద్యమమునకు తుది సంఘాతమయ్యెను. జాతీయపోరాటమును మనము మన యిష్టము వచ్చినప్పుడు బిగించుచు విడిచిపెట్టుచు చెరలాట మాడజాలము. దానిని విరమించుటకు పూర్వమే యుద్యమమును నడిపించిన నాయకత్వము దుర్బలముగ నిర్వీర్యముగ నుండెను. చిన్నచిన్న కాన్ఫరెన్సులు ననేక వదంతులు చెలరేగుచు చురుకైనపని మొండివడుచుండెను. కొంతమంది తాత్కాలికాధ్యక్షులు చాల గౌరవనీయులు. కాని తీవ్రమైన యుద్యమమున కట్టివారిని సేనాధిపతులుగ నియమించుట వారియెడల క్రూరత్వమే యగును, వారలసిపోయిరి. క్లిష్ట స్థితినుండి తప్పుకొనవలెనని వారికి కోరిక యున్నట్లనేక సూచనలు కాన్పించుచుండెను. పెద్దవారి యూగిసలాటయు, అనిశ్చయము నసంతృప్తిని కలిగించెను. కాని కాంగ్రెసు సంఘములన్నియు నక్రమ సంఘములగుటచే దీనిని సక్రమముగ వ్యక్తముచేయుట యసంభవమయ్యెను

అప్పుడు గాంధీజీ యేకవింశతి దినోపవాసము, జయిలునుండి విడుదలబడుట, ఆరువారములు శాసనోల్లంఘనమును విరమించుట సంభవించెను. ఉపవాసము పూర్తియైనతరువాత నతడు నెమ్మదిగ కోలుకొనెను. జూన్ నెలమధ్య శాసనోల్లంఘన విరామము మరి యారువారములు హెచ్చింపబడెను. ఈ లోపున ప్రభుత్వతీవ్రవిధాన మెంతమాత్రము సడలలేదు. అండమాను ద్వీపములలో రాజకీయ ఖయిదీలను (వంగదేశములో విప్లవదౌర్జన్యచర్యలకు శిక్షింపబడిన వారచ్చటకు బంపబడిరి.) తిన్నగ చూడకపోవుటచే నిరశనవ్రతము ప్రారంభమయ్యెను. అందులో నొకరిద్దరు (చనిపోవువరకు నుపవసించి) చనిపోయిరి. ఇతరులు చనిపోవనుండిరి. అండమానులలో జరుగుచున్న దానిని నిరసించుటకు భారతదేశములో జరుపబడు సభ

లలో నుపన్యసించువారు నిర్బంధింపబడి శిక్షింపబడిరి. బాధపడ వలసియుండుటయే గాక, ఖయిదీలు నిరసనదీక్ష యను భయంకరాగ్ని పరీక్ష కాహుతియగుచుండ (నిరసనచూపుటకు మరియొక మార్గము లేక) నోరెత్తి చెప్పుకొనుటకుగూడ నేము నోచుకొనలేము. కొన్ని నెలలైనతరువాత 1933 సెప్టెంబరులో (నేను జయిలు వెలుపల నున్నప్పుడు) రవీంద్రనాథటాగూరు, సి. యఫ్. ఆండ్రూసు మొదలగు వనేకమంది విఖ్యాతపురుషుల సంతకములతో నొక అప్పీలు చేయబడెను. వీరికి కాంగ్రెసుతో నెట్టి సంబంధములేదు. అండమాను దీవులలోనున్న ఖయిదీలనెక్కువభూతదయతో చూడవలసినదనియు, వారిని భారతజయిళ్ళకు మార్చవలసినదనియు వారు కోరిరి. భారత ప్రభుత్వ హోమ్మెంబరు యీ స్టేటుమెంటుపట్ల తన తీవ్రమసమ్మతిని వెలిబుచ్చుచు ఖయిదీలయెడల సానుభూతి చూపుచు సంతకములను చేసినవారిని కఠినముగ విమర్శించెను. తరువాత (నాకు జ్ఞాపకమున్నంతవరకు) నట్టి సానుభూతి వెలిబుచ్చుట వంగదేశములో నొక శిక్షార్హమైన నేరమయ్యెను.

శాసనోల్లంఘన విరామముయొక్క రెండవవాయిదా పరిమితి ముగియులోపల గాంధిజీ పూనాలో నొక యిష్టాగోష్ఠి సభ జరుపనుండెనను వార్తడేరాడూను జయిలుకు వచ్చెను. అచ్చట రెండు మూడువందలమంది చేరిరి. గాంధీజీసలహామీద సమష్టి శాసనోల్లంఘన మాపివేయబడెను. కాని వ్యక్తిగత శాసనోల్లంఘనము చేయవచ్చుననిరి. రహస్యపద్ధతులన్నియు బహిష్కరింపబడెను. ఈ తీర్మానము లెక్కువ ప్రబోధజనకముగలేవు. కాని వారికిసంబంధించినంతవరకు నే నెట్టి ప్రత్యేకాభ్యంతరము చెప్పలేను. సమష్టి శాసనోల్లంఘనము నాపుటయనగా దానిని మానుటయే! నిజమునకప్పుడు సమష్టియుద్యమము లేదు. రహస్యకృత్యములు పనిచేయుచున్నామని చెప్పుకొనుట కొక సాకుగమాత్రమే యుండెను. మా యుద్యమగౌరవమునుబట్టి చూచినచో నది తరచు యవినీతి తెచ్చిపెట్టును. ఆదేశములను పంపుటకు పరస్పర సంబంధము కలిగి

యుండుటకు కొంతవరకిది యవసరము. కాని శాసనోల్లంఘనము రహస్యముగ నుండరాదు.

వర్తమానస్థితిని గురించి, మా లక్ష్యములనుగురించి పూనాలో నెట్టి, నిజమైనచర్చయు జరుగకపోవుట నా కాశ్చర్యవిషాదములను కలిగించెను. రెండుసంవత్సరముల భయంకరపోరాటము, నిర్బంధములు జరిగినతరువాత కాంగ్రెసుసేవకు లొకచోట కలుసుకొనిరి. ఈలోపల హిందూదేశమున, బయట ప్రపంచమున చాలసంగతులు జరిగెను. బ్రిటిషుప్రభుత్వమువారి చట్టసంస్కార సూచనలుగల శ్వేతపత్రము ప్రకటింపబడెను. ఈ కాలములో మేము బలవంతముగ మౌనము వహింపవలసియుండెను. రెండవపక్షమున విషయములను మరుగుపుచ్చు నిరంతర యసత్యప్రచారము జరుగుచుండెను. ప్రభుత్వమును బలపరుచువారేగాక లిబరలుపక్షమువారు, తదితరులుగూడ కాంగ్రెసు తన స్వాతంత్ర్యలక్ష్యమును విరమించుకొనెనని తరచు చెప్పుచుండిరి. కనీసము మా రాజకీయలక్ష్యమును పునశ్చరణచేసి, తిరిగి స్పష్టపరచి వీలైనచో దానికి సాంఘిక, ఆర్థిక లక్ష్యములను జేర్చియుండవలసినదని నేననుకొంటిని. దీనికిబదులు చర్చయంతయు సమిష్టి శాసనోల్లంఘనమునకు, వ్యక్తిశాసనోల్లంఘనమునకు సంబంధించిన మంచి చెడుగులకు, రహస్య మవసరమా కాదా యనుదానికిబంధింపబడినట్లుస్పష్టముగ కాన్పించును. ప్రభుత్వముతో 'సంధి' యను కొంత వింత సంభాషణకూడ జరిగెను. గాంధీజీ (నాకు జ్ఞాపకమున్నంతవరకు) సందర్శన మీయవలసినదని వైస్రాయికి తంతియిచ్చెను. వైస్రాయి దానికి 'నాస్తి' యను ప్రత్యుత్తరమిచ్చెను. గాంధీజీ 'గౌరవమైన సంధి'ని గురించి కొంత యుదహరించుచు రెండవతంతి యిచ్చెను. ప్రభుత్వము విజయోత్సాహముతో జాతి నన్నివిధముల నలిపివేయుటకు యత్నించుచుండ, అండమానులలో ప్రజ లుపవాసములుచేసి చచ్చిపోవుచుండ, వేటాడబడుచున్న మృగతృష్ణవంటి యీ శాంతి ఎక్కడిది? కాని, ఏమి జరిగినను, యెల్లప్పుడు సంధికోరుటయే గాంధీజీస్వభావమని నే నెరుగుదును.

నిర్బంధములు జోరుగా సాగుచుండెను. బహిరంగ చర్యల నణచివేయు ప్రత్యేక శాసనములన్నియు నాచరణలోనుండెను. 1938 ఫిబ్రవరిలో మాతండ్రి మరణించిననాటి సాంవత్సరిక దినమున జరుగు స్మారకసభకూడ పోలీసు లాపివేసిరి. అది కాంగ్రెసుకు సంబంధించని సభ. సర్ తేజబహాదరు సప్రూవంటి స్వచ్ఛమైన మితవాది దీని కధ్యక్షతవహింపవలసియుండినను దీనికీగతి పట్టెను. ఇకముందు రానున్న ప్రమాదములకు నమూనాగా మనకు శ్వేతపత్రము ప్రసాదింపబడెను.

ఇదియొక చిత్రమైన పత్రము. దీనినొకసారి చదివినవానికి విభ్రాంతి పుట్టును. భారతదేశ మొక దేదీప్యమానమగు భారతప్రభుత్వముగ మార్పుచెందవలసి యుండెను. ఈ ఫెడరేషనులో వివిధ సంస్థానముల ఫ్యూడల్ ప్రతినిధులకు విశేషాధికారముండును. కాని యీ సంస్థానములలో పయివారెవరకు జోక్యము కల్పించుకొనరాదు. అట్టిది సహింపబడదు. అచ్చట కలితీలేని శుద్ధ నిరంకుశత్వమే రాజ్యముచేయును యదార్థమైన సామ్రాజ్యపాశములు, ఋణశృంఖలములు, మనలను శాశ్వతముగ లండను మహానగరమునకు కట్టివేయును. రిజర్వుబ్యాంకుద్వారా యింగ్లండుబ్యాంకు కరెన్సీ నీతిని, ద్రవ్యనీతిని వశమునందుంచుకొనును. ఇదివరకెవరి కేహక్కులుగలవో యవన్నియు నభేద్యముగ కాపాడబడును. అదనముగనూతనహక్కులు కూడ నిర్మింపబడనున్నవి. ఈ స్థాపింపబడిన హక్కుల క్షేమస్థైర్యములకొరకు మన యాదాయములన్నియు చాలవరకు హామీగా యివ్వబడెను. మేమతిగాఢముగా ప్రేమించు సామ్రాజ్యపదవులు ముట్టబడకుండ, శాసింపబడకుండ సాగుచుండును. అవి మనలను మరికొన్ని స్వపరిపాలనా మోతాదులకు తయారుచేయును. మాకు రాష్ట్ర స్వపరిపాలన ప్రసాదింపబడనున్నది. కాని గవర్నరుమాత్రము సర్వాధికారములను చలాయించు నుద్దాగ నిరంకుశుడయి మనలను క్రమము తప్పకుండనుంచును. వైస్రాయి, నిరంకుశ శిరోమణి, సర్వాధికారి. యందరిపైనను కూర్చొనును. తన యిష్టమువచ్చినట్లు చేయుటకు, తాను కోరినపుడు శాసించుటకే వానికి సర్వాధికారములు నుండును.

నిశ్చయముగ కలోనియల్ ప్రభుత్వ నిర్మాణమందు బ్రిటిషుపాలిక జాతుల బుద్ధికుశలత మున్నెన్నడు నింతస్పష్టముకాలేదు. హిట్లరులు ముస్సోలినీలు వారి నెక్కువగ మెచ్చుకొనెదరుగాక! వారు భారత వైస్రాయిని చూచి యసూయపడెదరుగాక!

భారతదేశముయొక్క కాళ్ళను చేతులను బంధించిన యొక చట్టమును తయారుచేయుటయేగాక 'ప్రత్యేక బాధ్యతలు' రక్షణలు అను మరికొన్ని సంకెలలుగూడ వానికి జేర్చబడెను. వీనితో నీ దుర దృష్ట దేశము కదలమెదలజాలని ఖయిదీగ చేయబడెను నెవిల్లి చాంబర్లేను చెప్పినట్లు "చేయబడిన సూచనలన్నింటిని మానవబుద్ధి సృజింప గల లక్షణ లన్నింటితోను కాపాడుటకు వారు చేయగలిగినదంతయు చేసిరి."

మరియు నీ వరములను ప్రసాదించినందులకు మనమెక్కువ సుంకమును చెల్లించుకొనవలెననిరి. ప్రప్రథమములో కొద్ది కోట్లు మొత్తముగను తరువాత వార్షికముగను చెల్లింపవలెను. చాలినంత సొమ్ము చెల్లింపనిదే, 'రక్షణ' లేనిదే మనముస్వరాజ్యమును పొంద జాలము. భారతదేశము దారిద్ర్యముచే పీడింపబడుచున్నదను భ్రమలో మేముంటిమి. అది యదివరకే యెక్కువ ఋణభారములో క్రుంగియుండుటచే మేము దానిని తేలికచేయుటకొరకుస్వాతంత్ర్యము నాశించితిమి. స్వాతంత్ర్యమును వాంఛించుటకు ప్రజలను ప్రోత్స హించిన దీ శక్తియే కాని యిప్పు డీ భారము మరింత యధికముగు నట్లు కావింపించెను.

భారత సమస్యయొక్క యీ యకటావికటపు పరిష్కారము బ్రిటిషు దయారసముచే ప్రసాదింపబడెను. మన పాలకులు చాల యుదారులని మనకు చెప్పబడుచుండును ఇదివరకెన్నడు నే సామ్రాజ్యప్రభుత్వము తనంత తానైచ్ఛికముగ నిట్టి యధికార మును, అవకాశములును తన పాలనలోనున్న ప్రజల కిచ్చియుండ లేదు. ఈ వరములకు ప్రసాదించిన దాతలకు నిట్టియుదారతకాశ్చర్య పడి వీని కభ్యంతర పెట్టినవారికి నింగ్లండులో గొప్ప చర్య బయలు

జేరెను. ఇంగ్లండు హిందూదేశముల మధ్య మూడు వత్సరముల దీర్ఘకాలములో ననేకమంది రాకపోకలయొక్కయు, మూడురౌండు టేబిలు కాన్ఫరెన్సుల యొక్కయు, ననంఖ్యాకములగు కమిటీల యొక్కయు, సలహాలయొక్కయు ఫలితమిదియే.

కాని యింగ్లండును సందర్శించుట ఇంకను పూర్తికాలేదు. శ్వేతపత్రమును విమర్శించుటకు బ్రిటిషు పార్లమెంటుయొక్క జాయింటు సెలెక్టుకమిటీ యొకటియుండెను భారతీయులు దీనియందు సాక్ష్యమిచ్చుటకు అస్సెసర్లుగ వెళ్ళిరి. లండనులో ననేక యితర కమిటీలుకూడ సమావేశమగుచుండెను. యేదో యొక కమిటీలో సభ్యత్వము సంపాదించుటకు తెరచాటున గౌరవహీనమగు పోరాటములు జరిగెను ఈ సభ్యత్వమువలన సామ్రాజ్యరాజధానికి యుచిత ప్రయాణము, నచ్చటనుండుట ప్రాప్తించును. శ్వేతపత్రములోని వక్ళరాళ్ళవంటి చట్టములకు జంకని ధైర్యశాలురు సముద్రయాన యుపద్రవములను, వాయుయాన కష్టములను, అంతకంటె నెక్కువగ లండనునగర నివాసకష్టములను నెదుర్కొని తమ వ్యక్తిత్వధాటి చేతను, యెదుటవాని నొప్పింపగల శక్తిచేతను శ్వేతపత్రములోని చట్టములను మార్పుచేయ యత్నించుటకు బూనుకొనిరి. తాము బూనినకార్యము సక్యముకానిదని వారికి తెలియును. వారట్లే చెప్పిరి. కాని వారు విడిచిపెట్టువారు కారు. వారు చెప్పునది వినువారు లేకపోయినను చెప్పవలసినది చెప్పుచుయేయుందురు. వారిలో నొకడు రెస్పాన్సివిస్టు నాయకుడు, తక్కినవారందరు విడిచివెళ్ళిపోయినను బహుశః లండలోనున్న యధికారులను దర్శించుచు విందులు గుడుచుచు తానెట్టి రాజకీయమార్పులను గోరుచున్నాడో వారిహృదయములకు గట్టిగా పట్టించుటకు చివరవరకు,మఠము వేసికొని కూర్చొని యుండెను. చిట్టచివరకు తన జన్మభూమికి వచ్చినపుడతడు తనకృషిని విరమింపక తాను చెప్పవలసినదని చెప్పువరకు లండనులో నాగిపోయినట్లు గంపెడాశతోనున్న ప్రజలకు చెప్పెను.

నా తండ్రి రెస్పాన్సివిష్టు మిత్రులలో హాస్యరసము లేదని తరచు ఫిర్యాదుచేయుచుండుట నాకుజ్ఞాపకము అతడు పరిహాసముగా

చేయు రిమార్కులవలన (వారు వానినెంతమాత్రమును గుర్తింప
లేకుండిరి) వారితో చిక్కులు తటస్థించుచుండెడివి. తరువాత నతడు
వారికి నచ్చచెప్పి శాంతింపచేయుచుండెడివాడు. మహారాష్ట్రుల
యద్భుత సంగ్రామోత్సాహము మొక్కవోని ధైర్యముగల తిలక
మహాశయుని నే నపుడు తలంచితిని.

లిబరలుపక్షమువారు స్వేతపత్రము నెంతమాత్రము నామో
దింపలేదు. భారతదేశములో దినదినము జరుగుచున్న నిర్బంధములను
గూడ వా రిష్టపడలేదు. అప్పుడప్పు డతి యరుదుగ వారు వానిని
విరసించుచుండిరి. కాని వారు కాంగ్రెసును, అది చేయు నన్ని
పనులను ఖండించుచుండిరి. వా రప్పుడప్పుడు కొంతమంది ప్రధాన
కాంగ్రెసువాదులను జయిలునుండి విడిచిపెట్టవలసినదని ప్రభుత్వమును
సూచించుచుందురు. వారు తా మెరిగిన కొంతమంది వ్యక్తుల
పరముగ మాత్రమే యోచింపగలరు, లిబరలుపక్షమువారును,
రెస్పాన్సివిస్టులునుగూడ నిక ప్రజాశాంతి కెట్టి యుపద్రవము కలు
గదు గనుక ఫలానవానిని విడిచిపెట్టవలెనని చెప్పుచుందురు. తరువాత
నతడు యుక్తముగ ప్రవర్తింపనిచో ప్రభుత్వమువా రతని నెప్పుడు
పట్టుకొనినను పట్టుకొనవచ్చును. ఈ సారి ప్రభుత్వమువా రెక్కువ
న్యాయముగగూడ నట్లుచేయవచ్చును ఇంగ్లండులోగూడ కొంత
మంది వ్యక్తులు కొంతమంది వర్కింగుకమిటీసభ్యులను, లేక ప్రత్యేక
వ్యక్తులను పై వాదముల ననుసరించియే విడిచిపెట్టవచ్చునని దయతో
వాదించెడివారు. మేము జయిలులోనుండగా మమ్ముగురించి శ్రద్ధతీసి
కొనినవారియెడల మేము కృతజ్ఞులముగ నుండకతప్పదు. కాని మే
మొక్కొక్కప్పుడు మా శ్రేయస్సు నుద్దేశించిన యీ స్నేహితుల
నుండి రక్షింపబడిన బాగుండెడిదని భావించెడివారము. వారిసదుద్దేశ్య
ములపట్ల మా కెట్టిసందేహములేదు. కాని వారు సంపూర్ణముగ
బ్రిటిషుప్రభుత్వ లక్ష్యమునే కలిగియున్నట్లు స్పష్టమగుచున్నది. మా
యుభయులమధ్య గొప్ప యగాధముగలదు.

లిబరలు పక్షమువారు భారతదేశములో సంభవించువానిని
చాలవరకామోదింపలేదు. దానికి వారెంతయు వగచుచుండిరి, అయి

వను వా రేమిచేయవలెను? ప్రభుత్వముపై వా రెట్టి పటుత్వముగల వారైనను తీసికొనుట మహాహాస్యము వారు కేవలము తమయొక్క ప్రత్యేకసంఘముగ రక్షించుకొనుటకు ప్రజా సామాన్యమునుండియు, ప్రజలలో చైతన్యముగల వ్యక్తులనుండియు నంతకంతకు దూరముగ పోవుచు దక్షిణాముఖము పట్టి ప్రభుత్వలక్ష్యమునుండి వేరుచేయుటకు వీలులేని లక్ష్యము నవలంబించిరి. వారికి సంఖ్యాబలమా లేదు! ప్రజలలో పలుకుబడియా శూన్యము! కనుక వారివలన ప్రజాసంగ్రామమున కెట్టి యుపద్రవములేదు. కాని వారిలో నాధిక్యత సంపాదించినవారు, పేరు పొందినవారు, వ్యక్తిగతముగ గౌరవింపబడువారు కొందరుగలరు. ఈ నాయకులు లిబరలు రెస్పాన్సివిస్టు బృందములు మొత్తము మీదను బ్రిటిషుప్రభుత్వ సంకష్టకాలములోనున్న సమయములో ప్రభుత్వనీతికి తమ నైతికబలము నిచ్చి వారి కమూల్య సేవచేసిరి. పటుత్వమైన విమర్శలేకపోవుటచేతను, లిబరలు పక్షమువారి యిప్పు డప్పుడు సమ్మతిని, ఆమోదమును చూపుటచేతను, ప్రభుత్వనిర్బంధ ములకు, న్యాయసౌన్యతకుగూడ లాభముకలిగెను. ఈ విధముగ లిబరలుపక్షమువారు, రెస్పాన్సివిస్టులు దేశములో జరుగుచున్న భయంకరమైన, మున్నెన్నడును కని విని యెరుగని నిర్బంధమునకు నైతికాధికారము నిచ్చిరి.

శ్వేతపత్రము చెడ్డది, చాలా చెడ్డది అని లిబరలునాయకులు చెప్పిరి. దానినిగురించి యేమిచేయవలెను? 1933 ఏప్రియల్ మాసములో కలకత్తాలో జరుపబడిన లిబరలు ఫెడరేషను సభలో శ్రీనివాసశాస్త్రిగారు, లిబరలు నాయకశిఖామణి, చట్టసంబంధమైన మార్పులెంత యసంతృప్తికరములైనను, వానినాచరణలో పెట్టవలెనని వాదించిరి. "మిన్నక విమర్శలను జారవిడుచుట కిది సమయముకాదు" అని యతడు చెప్పెను. ఇచ్చినదానిని తీసుకొని దానినాచరణలో పెట్టుటకు ప్రయత్నించుట యొక్కటే యతడూహింపగలిగిన కార్యము. ఇదికానినాడు మరియొకపని యేమియు చేయక నూరకుండుటయే! మరియు "మనకు జ్ఞానము అనుభవము, వివేకము,

ఒప్పించగలశక్తి,నిర్మలమగుపలుకుబడి, యదార్థమైన సామర్థ్యములు. మనకీ సుగుణములేయున్నచో వానిని పరిపూర్ణమైనబలముతో ప్రకటించుట కిదియే సమయము" అని యతడు చెప్పెను. ఈపదగుంభనతోనిండినపిలుపునుగురించి కలకత్తాలోని స్టేట్సుమన్ పత్రిక ప్రకాశమానమగు శబ్దజాలము" అని వ్యాఖ్యానము చేసెను.

శాస్త్రిగారెప్పుడు శబ్దజాలమును జోడుగ నుపయోగించుచుందురు లలితపదములయెడలను, వానిమధుర ప్రయోగమునందును వక్తకుండునట్టిప్రేమ యాయనకు గలదు. కాని యాయన తన యుత్సాహములో కొట్టుకొనిపోవును. అతడు స్పష్టించు శబ్దయింద్రజాల మతని భావము నితరులకు మరుగుపరచును. బహుశః యతనికి యట్లేయగును. అతడు 1933 ఏప్రియల్ లో శాసనోల్లంఘనమింకను జరుగుచుండగా కలకత్తాలోచేసిన యాపిలుపును పరీక్షించుట ప్రయోజనకరముగ నుండును, మూలసూత్రములను, లక్ష్యములను వటులుంచినచో మనము రెండు విషయములను గమనింపవలసియుండును. మొదటిది యేమిజరిగినను, బ్రిటిషుప్రభుత్వముచే మనమెంతగా నగౌరవింపబడినను, పలిపివేయబడినను' అవమానింపబడినను, కొల్లగొట్టబడినను మనము దానికి దాసులముకావలెను మనమీహద్దు దాటిపోగూడదను పంక్తి యెన్నటికిని వ్రాయబడజాలదు. ఒకక్రిమి మారవచ్చును. కాని శాస్త్రిగారి సలహావినినచో భారతప్రజలు మారజాలరు. అతనిప్రకారము వేరొక మార్గములేదు. అనగా బ్రిటిషు ప్రభుత్వ నిశ్చయములకు తలయొగ్గుటయు, వానినంగీకరించుటయు నొక మతముతో సమానము, మనకిష్టమున్నను లేకపోయినను మన మందరము, నీకర్మకు [కిస్మతు] దాసులము కావలెను.

అతడొక వినిశ్చయమైన, యిదమిద్ధమనుస్థితిని గురించిసలహా యిచ్చుటలేదని గమనింపవలసి యున్నది "చట్టసంబంధమైన మార్పులు" (అవి చాల చెడ్డవిగనుండునను స్పష్టమైన భావముమవ సిన్నను) యింకను తయారగుచున్నవి. శ్వేతపత్రములోని మార్పులు చెడ్డవిగనున్నను పరిస్థితులనన్నింటిని గమనించి, యవి శాసనములు

గావింపబడిన-చో, వాని నాచరించుటకు నేను సుముఖుడనని యతడు
చెప్పియుండినచో నతనిసలహా మంచిదైనను చెడ్డదైనను యదార్థము
లకు సంబంధించి యుండెడిది. శాస్త్రిగారింకను చాలదూరము వెళ్ళి
చట్టసంబంధమైన మార్పు లెంత యసంతృప్తిగనుండినను తనసలహా
చెల్లవలెననెను. జాతీయదృష్టిలో నతిముఖ్యమైనవిషయమున నతడు
బ్రిటిషు ప్రభుత్వమునకు సంపూర్ణాధికార మిచ్చుటకు సిద్ధముగ
నుండెను. ఏవ్యక్తిగాని, వర్గముగాని, పార్టీగాని యగోచరమగు భావి
వ్యాప్తిసందర్భములలో నెట్టియంగీకారము నెటియగలరో నా కర్థము
గాకున్నది. దానికేసిద్ధాంతములుగాని, యెట్టి నైతిక రాజకీయప్రమా
ణములుగాని లేక పాలకులయాజ్ఞలకు విధాయకముగ తలయొగ్గుటే
దానిసిద్ధాంతము, నీతియైనచో నిట్టి యంగీకారము నీయవచ్చును.

నాకుతట్టు రెండవవిషయము కేవలము రాజకీయయెత్తుకు
యుక్తికి సంబంధించినది క్రొత్తసంస్కరణలను చట్టముగాచేయుదీర్ఘ
ప్రస్థానములో శ్వేతపత్ర మొకమజిలీ. ప్రభుత్వదృష్టిలో నదియొక
ప్రధానమైన మజిలీ కాని యింకను చాల మజిలీలను చేయవలసి
యున్నది. ఈ తరువాత ప్రయాణములో దీనిని మంచికో చెడ్డకో
మార్చినను మార్చుటకవకాశముగలదు. ఈ మార్పులన్నియు వివిధ
ప్రయోజనములుగలవారు బ్రిటిషుప్రభుత్వమీదను, పార్లమెంటు
మీదను కలిగించు యొత్తిడిపయి నాధారపడియుండును. ఈ గుంజు
లాటలో భారతదేశ లిబరలుపక్షమువారిని తమవైపు త్రిప్పుకొనవలె
ననుకోరిక ప్రభుత్వమునకు పనిచేసి, చట్టములనుసడలించుటకు ప్రోత్స
హింపవచ్చును. లేక నధమము ఆక్రమణలనైనను ఆపివేసెడిది.
కాని క్రొత్తసంస్కరణల నంగీకరించుటయా, త్రోసివేయుటయా,
యాచరింపకుంటయా యనుసమస్య బయలుదేరుటకు చాలముందు
గనే శాస్త్రిగారుచేసిన గంభీరప్రకటన భారతలిబరలు పక్షమువారిని
సంపూర్ణముగ నిర్లక్ష్యము చేయవచ్చునని ప్రభుత్వమునకు విశదము
చేసెను, వారిని త్రిప్పుకొనవలెనను సమస్యయే లేదు. గెంటివేయ
బడినను వారు ప్రభుత్వమును వీడువారుకారు. ఈ లిబరలుపక్షము

వారి దృష్టినుండి నేను [చూడగలిగినంతవరకు] యీ విషయము చూచినను కలకత్తాలోని శాస్త్రిగారి యుపన్యాస మసాధారణము చెడ్డయెత్తుగను, లిబరలుపక్షయుద్యమము కపటకారిగను కాన్పించెను.

శాస్త్రిగారి పాతయుపన్యాసములనుగురించి నేను చాలవరకు వ్రాయ సాహసించుటకు కారణమందులోనున్న సహజ ప్రాముఖ్యత గాని లిబరలు ఫెడరేషనుకున్న ప్రాముఖ్యతగాని కాదు. లిబరలు నాయకుల మానసిక ప్రవృత్తిని, చిత్తవృత్తిని గ్రహింపవలెనను కోరికయే నన్నింతమాటలకు ప్రోత్సహించెను. వారు సమర్థులు, గౌరవనీయులు అయినను యెంత సహృదయముతో చూచినను వారెట్లు ప్రవర్తించిరో నేనెంతమాత్రము గుర్తింపలేకపోతిని. 1934 జూన్‌లో శాస్త్రిగారిచ్చిన మరియొక యుపన్యాసము నన్ను బాధించెను. తాను 1927 వరకు అధ్యక్షుడుగానుండిన భారతసేవక సంఘములో నాలుపన్యసించుచుండెను. బ్రిటిషుపరిపాలన హఠాత్తుగా పోయినచో భారతదేశమునకు కలుగు యుపద్రవముల నతడు పేర్కొనెనట. రాజకీయోద్యమములలో తీవ్రమైన ద్వేషముతో నిండి యొకపార్టీ మరియొకపార్టీని హింసించును, అణచివేయును. మొట్టమొదటినుండియు సహనమే బ్రిటిషు రాజకీయ జీవితలక్షణము, కనుక భారతభవిష్యత్తు బ్రిటనుయొక్క సహకారముతో నెంత యెక్కువగా జరుపబడిన భారతదేశములో నంత యెక్కువ సహనముండుట కవకాశమున్నది. కలకత్తా స్టేట్సుమను పత్రిక యిచ్చిన శాస్త్రిగారి యుపన్యాస సంగ్రహముమీదనే నాధారపడవలసియుండెను. "అది సంతోషకరమైన సిద్ధాంతము. డాక్టరుమంజీకూడా నీభావముతో నే మాట్లాడుచున్నట్లు మేము గమనించుచున్నాము" అనికూడ స్టేట్సుమన్ వ్రాసెను. శాస్త్రిగారు రష్యా' ఇటలీ, జర్మనీలలో స్వేచ్ఛయణచి వేయబడుచున్నదనియు, నచ్చట పశుత్వము, యమానుషములు జరుపబడుచున్నవనియు నుదహరించెనట!

నేను దీనిని చదివినపుడు బ్రిటను భారతదేశములకు సంబంధించిన శాస్త్రిగారి దృష్టి "డైహార్డు" బ్రిటిషుకన్న శ్వేటివు దృష్టినెంత

యసాధారణముగ పోలియున్నదో నాకు తెలియును. వివరములలో భేద
ములున్నమాట సత్యము. కాని ప్రధానముగ నొక్కటే లక్ష్యము
విన్స్టను చర్చిల్ తన విశ్వాసముల కెట్టి యపకృతియు చేయనక్కర
లేకుండ నిదే ధోరణిలో, నిదే భాషలో తన భావములు వెల్లడించి
యుండెడివాడు అయినను శాస్త్రిగారు లిబరలుపార్టీలో నాయకపద
మును చెందును. అతడు దాని నాయకులలో నత్యంత సమర్థుడు.

శాస్త్రిగారి చారిత్రకాభిప్రాయములను, ప్రపంచవ్యవహారము
లనుగురించిన భావములను నేనెంతమాత్రము నంగీకరింపజాలను.
అహంకారి ఆంగ్లేయేతరవిదేశీయుడు పీడింపబడు నీచాలభావములు
గల చాలమంది యింగ్లీషువారే యతనితో నేకీభవింపకపోవచ్చును.
ప్రపంచమును, నిజదేశమును బ్రిటిషుపాలకజాతి రంగులకంటిజోడుతో
చూడగలవరప్రసాద మతనికి గలదు. అయినప్పటికి భారతదేశములో
గత పదునెనిమిది మాసములనుండియు ప్రతిదినము జరుగుచుండినట్టియు,నత
డుపన్యసించుకాలమున జరుగుచున్నట్టియు నసాధారణ చర్యల నతడు
నిర్లక్ష్యముచేయుట గమనింపదగినవిషయము. అతడు రష్యా,యిటలీ,
జర్మనీల నుదహరించెనేగాని తన దేశములో నన్ని స్వాతంత్ర్యములు
శూన్యమగుట, అణచివేయబడుట నుదహరింపడు. వార్తలరికట్ట
బడుచుండుటచే సరిహద్దురాష్ట్రములోను వంగదేశములోను(రాజేంద్ర
బాబు తన కాంగ్రెసు అధ్యక్షోపన్యాసములో దానిని 'వంగదేశ
మానభంగము' అని పిలిచెను) భయంకరసంభవముల నన్నింటిని
యతడెరుగకపోవచ్చును; కాని యతడు భారతదేశము పడుచున్న
యపరిమితబాధలను, తన ప్రజలు స్వేచ్ఛకొరకు, జీవితముకొరకు
శక్తివంతమగు ప్రభుత్వముతో జేయుచున్న పోరాటమును యెరుగడా?
ప్రాంతప్రాంతమున నమలుజరుపబడిన పోలీసు రాజ్యమును, సైనిక
శాసనమును పోలిన పరిస్థితుల నతడెరుగడా? ఆర్డినెన్సుల నతడెరుగడా?
జయిళ్ళలోని నిరశనవ్రతములు మొదలగు నితరబాధల నతడెరుగడా?
బ్రిటిష్ దేశము నతడే సమానముకొరకు నే స్వాతంత్ర్యముకొరకు
పోరాడెనో యవి భారతదేశములో బ్రిటనువలననే నిలిపివేయబడెనను
సంగతి నతడు గుర్తింపలేడా?

అతడు కాంగ్రెసుతో సంగీకరింపవచ్చు, అంగీకరింపక పోవచ్చును. కాంగ్రెసునీతిని విమర్శించుటకు, ఖండించుటకు నతనికి స్వేచ్ఛకలదు. కాని తనదేశ స్త్రీపురుషులు చూపిన యద్భుత ధైర్యసాహసముల యెడల, నాత్మార్పణ యెడల భారతీయుడు, స్వేచ్ఛాదేవి నారాధించువాడు, గ్రహణశక్తికలవాడు నగు తానెట్లు ప్రవర్తించెను? మన పాలకులు భారతహృదయముపై గొడ్డలితో చెరలాటమాడినపు డతడట్టి బాధనువ్యధనుపొందలేదా? లక్షలకొలది జనులొక మహాసామ్రాజ్య పశుశక్తికి మోకరింపనిరాకరించుట, ఆత్మదాస్యముకంటె శరీరమారణము ప్రాణసమములగు గృహములు విచ్ఛిన్నమగుట, ప్రేమాస్పదులందరు వెతలనొందుట శ్రేయస్కరమని ప్రకటించిన ఈ యాత్మవికసనమునంతను నతడు శూన్యమనియే తలచెనా? జయిలులో బయట మేమెప్పుడు ధైర్యమునే ప్రకటించిమందహాసములతో నవ్వుముఖములతో నుంటిమి. కాని తఱచు మా మందహాస మానందబాష్పములుగ నుండెడిది. మా నవ్వు లొక్కొక్కప్పుడేడ్పులను సమీపించెడివి.

ధైర్యవంతుడు, నుదారుడగు వెర్రియర్ 'యెల్విన్ అను నొక యాంగ్లేయుడు 1930 ని గురించి యిటు చెప్పెను. "ఒక జాతియంతయు తన మానసిక దాస్యసంకెలలను త్రోసిపుచ్చి తన నిజగౌరవప్రస్థానమును సాగించుటొక యద్భుతము. సత్యాగ్రహపోరాటములో చాలమంది కాంగ్రెసు వాలంటీర్లు ప్రదర్శించిన యద్భుతశిక్షణము రాష్ట్రగవర్నరులలో నొక డుదార ధృవపత్రము నిచ్చిన శిక్షణము..."

శ్రీనివాసశాస్త్రిగారు సమర్థుడు, గ్రహణశక్తికలవాడు. తన దేశీయులచే నెక్కువగ గౌరవింపబడువాడు. అతడు కూడపైయనుభవమునే కలిగియుండవలెను. అట్టిపోరాటములో తన దేశీయులకొరకు బాధపడియుండవలెను. ప్రభుత్వము పౌరసత్వములను, ప్రజాహితకార్యములను, అణచివేయుచుండుట నతడు ఖండించుననుకొందును. అతడు, నతనిసహోద్యోగులు దుర్భర బాధలనొందుచున్న రెండు రాష్ట్రములనువంగ దేశము, సరిహద్దు రాష్ట్రము-స్వయముగ సందర్శించియుండవలెనని కాంగ్రెసుకును, శాసనోల్లంఘనమునకునుసహాయముచేయుటకు

గాక నధికారులయొక్కయు, పోలీసులయొక్కయు నత్యాచారములను బయటపెట్టి ఈరీతిగ నాలించుటకు) మనుకొనుచు పౌరసత్వములను స్వేచ్ఛను ప్రేమించువారితర దేశములలో నిట్లు సామాన్యముగ చేయుచుందురు. కాని యతడట్లు ప్రవర్తించుటకు బదులు ధృవపత్రము నిచ్చెను. అతడు వారికి తననైతికసహాయమునిచ్చి తద్వారానిర్బంధ విధానమున కుత్సాహ ప్రోత్సాహములను కలిగించెను.

అతడిట్లు భావించియుండడని, తన చర్యయొక్క ఫలితములను గుర్తించలేదని నేను దృఢముగ చెప్పగలను. కాని యతని యువ వ్యాసమున కిట్టిఫలితము గలదనుట నిస్సందేహము అయినచో అతడీవిధముగ నేల యోచింపవలెను? ఏల యాచరించవలెను?

లిబరలు నాయకులు స్వదేశీయులకు నాధునిక భావములకు దూరస్థులైరనుటకంటె నా కీప్రశ్నకు వేరొక సమాధానము దొరకలేదు. వారు చదివెడు బూజుపట్టిన పుస్తకములు వారి దృష్టినుండి భారతదేశప్రజలను తెరిమివేసెను. నానావిధముగ తమ్ముతామే ప్రేమించుకొను విద్య నభివృద్ధిచేసికొనిరి. మేము జయిళ్ళకుపోయితిమి. మా శరీరములు గదులలో బంధింపబడెను. కాని మా మనస్సులు స్వేచ్ఛగ ప్రపంచ విహారము చేయుచుండెను. మా యుత్సాహ మినుమడించెను. కాని లిబరలుసోదరులు స్వయంకృత మానసిక కారాగారములను నిర్మించుకొని వానిచుట్టు గిరగిర తిరుగుదురు. వారికి బయటకుపో మార్గము దొరకదయ్యెను! వారు నేత్ర గోచరమగు ‘వస్తుదైవతమును’ పూజించిరి. వస్తువులు మారినపుడు (ఈనశ్వరప్రపంచంలో నవి యెప్పుడును మారుచుండును) వారు చుక్కాని, దిగ్దర్శిని యంత్రము లేనివారై శారీరక మానసికవికాసము లేక, యాదర్శములు, నైతికప్రమాణములు లేనివారై యుందురు. మనమందరము ముందుకు పోవలెను. లేదా ముందుకు త్రోయబడుదుము. నిత్యపరివర్తనచెందు ప్రపంచములో మనము స్థావరముగ నిలిచిపోజాలము. కదలుటకు, మార్పుచెందుటకు, భయపడి లిబరలు పక్షమువారు తమ్మావరించిన ఝంఝామారుతములకు భయభ్రాంతు

లైరి. దుర్బలగాత్రులగుటచే తడబడుకాళ్ళతో వారు ముందుకు పోజాలక తమకుదొరికిన ప్రతితృణమును బట్టుకొనుచు నిటునటుకొట్టు కొనుచు "దీర్ఘాలోచనచే పాలిపోయి వ్యాధినొందిన" యెప్పుడు సందేహించుచు, జంకుచు, నిశ్చయహీనులగుచు వారు భారతరాజకీయములలో షేక్స్పియరు మహాకవి నాటకములో హామ్లెటులయిరి.

లిబరలు వారపత్రికయైన 'సర్వెంటు ఆఫ్ ఇండియా' జయిలుకు వెళ్ళునరకు చిందులు త్రొక్కెదరనియు వెళ్ళినతరువాత బయటకు రావలెనని తహతహలాడెదరనియు శాసనోల్లంఘన చివరిరోజులలో కాంగ్రెసును నిందించెను. కాంగ్రెసుయొక్క సమగ్ర నీతి యదియేయని యది కొంతయుద్రేకముతో వ్రాసెను. దానికి లిబరలు పక్షమువారి ప్రత్యామ్నాయనీతి, బ్రిటిషుమంత్రులతో రాయబారము, ఇంగ్లీషుప్రభుత్వములో మార్పుకలుగవలెనని ప్రార్థించుట.

ఆర్డినెన్సుచట్టములను, తక్కిన నిర్బంధచట్టములను ధిక్కరించుటయే కాంగ్రెసునీతియనుట, కొంతవరకు నిజము. దీనివలన జయిలు ప్రాప్తించును. దీర్ఘపోరాటానంతరము కాంగ్రెసుజాతి యలసిపోయి ప్రభుత్వముపై తగిన యొత్తిడి కలిగింపలేకపోవుటగూడ నిజము కాని యొక వాస్తవిక నైతిక ఫలితముకలదు.

భారతదేశ మనుభవించుచుండినట్టి నిర్బంధము, పాలకుల కతి వ్యయకరమైనది, వారికిగూడ నది బాధకరమై నరములబిగిని సడలింప చేయు నొక కఠినపరీక్ష. తుదకది తమ పునాదులను దుర్బలపరచునని వారికి బాగుగ తెలియును. అది వారి పరిపాలనానిజస్వభావమునుపీడింప బడు ప్రజలకు విశాలప్రపంచమునకు నిరంతరము బహిరంగపరచును. వారు తమ యినుపముష్టి దాచుటకు ముఖమల్ తొడుగు ధరించుట కెంతయో యుత్సహించెదరు. ఎట్టి ఫలితములు సంభవించినను తమ యిచ్ఛకు లొంగని ప్రజలతో వ్యవహరించుటకంటె నేప్రభుత్వముకు నెక్కువకోపము కలిగించునది (చిట్టచివరకు) యుపద్రవకరమైనది వేరొకటి యుండ నేరదు. కనుక నచ్చటచ్చట జరుగు నిర్బంధవిధాన ధిక్కారమునకుగూడ విలువయున్నది. అది ప్రజలకు శక్తినిచ్చును. ప్రభుత్వ నీతిని నాశనము చేయును.

నైతికఫలితము మరింత ప్రధానమైనది. థోరో కవి యిట్లు చెప్పెను. “స్త్రీ పురుషు లక్రమముగ నిర్బంధింపబడు కాలమున జయిలే యోగ్యమైన స్త్రీ పురుషుల కుత్తమస్థానము”. ఈ సలహా లిబరలు సోదరులకు తదితరులకు కటువుగ నుండవచ్చును. కాని శాసనోల్లంఘనముతో సంబంధము లేకపోయినను, మన సహచరులు చాలమంది యెప్పుడును జయిలులో నుండుచున్నప్పుడు, ప్రభుత్వముయొక్క నిర్బంధ సాధనసామాగ్రి మనలను నిరంతరము నణచివేయుచు, నగౌరవపరచుచు, మన ప్రజలను కొల్లగొనుటకు సహాయపడుచుండ - నిట్టి పరిస్థితులలో నైతికజీవిత మసంభవమని మాలో చాలామంది తలచు భావించెడివారము. మన దేశములోనే మన మనుమానింపబడువారివలె సంచరించెదము. పోలీసులు వెంటనంటి పరీక్షించుచుందురు. మా మాటలు, సర్వాంతర్యామియైన రాజద్రోహ చట్టమును భంగము చేయునేమోయని వ్రాసికొనబడును. మా యుత్తర ప్రత్యుత్తరములను విప్పి చూచెదరు. ఏదోయొక బహిష్కారము లేక అరెస్టు మాకొరకెప్పుడు నెదురుచూచుచుండును. మా కొక్కటే గతి. ప్రభుత్వాధికారము కతినీచముగ తలయొగ్గవలెను. ఆధ్యాత్మికాధఃపతనమునొందవలెను మాలోనున్న సత్యమునునిరాకరింపవలెను. మేము నీచమనితలంచు కార్యములకు నైతికవ్యభిచారమునకు నొడబడవలెను. లేదా ప్రతిఘటించి తత్ఫలితము ననుభవింపవలెను. జయిలుకు వెళ్ళవలెనని కష్టముల నాహ్వానింపవలెనని కోరు వెర్రులెవరు నుండరు. కాని రెండవ దౌర్భాగ్యస్థితికంటె జయిలే వాంఛనీయము. బెర్నార్డుషా చెప్పినట్లు “నీచప్రయోజనములకు స్వార్థపరులచేతిలో కీలుబొమ్మయగు టొక్కటియే జీవితవిషాదము.”

# 49

## దీర్ఘశిక్ష యంతరించెను

నా విడుదలకాలము సమీపించుచుండెను. 'సత్ప్రవర్తనకు' మామూలు రిమిషనుఇవ్వబడెను. దీనివలననా రెండేడ్లశిక్షలో మూడు న్నరమాసములు తగ్గిపోయెను. విడుదబడుదునను భావముచే జనించు యుద్రేకమువలన నామనశ్శాంతిలేక, జయిలు కలుగజేయు సాధారణ మానసికమాంద్యమంతరించెను. బయట నేనేమిచేయవలెను? ఇదియొక కష్టమైనప్రశ్న. దీనికి సమాధానమిచ్చుటకు కలుగు సందేహము విడు దలవలనగల యానందమును క్రమింగివేయుచుండెను. కాని యాభావం కూడ తాత్కాలికము. చిరకాలమణచి వేయబడిన నాయుత్సాహశక్తి యుబుకుచుండుటచే నేను బయటకుపోవలెనని యాతురతపడుచుంటిని.

1933 జూలై మాసాంతమున నొక విషాదవార్త వచ్చెను. సేనుగుప్త హఠాత్తుగ చనిపోయెను. మేము కాంగ్రెసువర్కింగు కమి టీలో చాలవత్సరములుసన్నిహితసహోద్యోగులమేగాక నాబాల్యంపు కేంబ్రిడ్జి దినములనాటినుండి మాకు సంబంధముండెను. మేము మొట్ట మొదట కేంబ్రిడ్జిలో కలుసుకొంటిమి. నేనప్పుడు నూతనముగ ప్రవే శించితిని. అతడప్పుడే పట్టభద్రుడయ్యెను.

సేనుగుప్త డిటెన్షనులో చనిపోయెను. 1932 ప్రారంభములో నతడు యూరపునుండి వచ్చుటతోడనే ప్రభుత్వఖయిదీగ నరెస్టుచేయ బడెను. అప్పటినుండియు నతడు ఖయిదీ లేక డిటెన్యూ. అతని యారో గ్యము ధ్వంసమయ్యెను. ప్రభుత్వ మతనికి వివిధసౌకర్యములను కలి గించిరి. కాని ప్రయోజనములేకపోయెను కలకత్తాలో నతని యంత్య క్రియలనాడు ప్రజలు బ్రహ్మాండమగు నుత్సవము జరిపి యతనిని గౌరవించిరి. చిరబంధనముచే నవయుచున్న వంగాత్మ కొద్దికాల మయినను ప్రస్ఫుటించినట్లు కాన్పించెను.

ఇట్లు సేనుగుప్త నిర్గమించెను. వత్సరములతరబడి ప్రవాసము, జయిలులో నుండుటచే నారోగ్యముచెడిన సుభాసుబోసు చికిత్సకై

యూరపు వెళ్లుటకు ప్రభుత్వముచే చిట్టచివర కనుమతింపబడెను. మా భీష్ముడు విఠల్ భాయిపటేలుకూడ, రోగగ్రస్తుడయి యూరపులోనే యుండెను. జయిలుజీవితముయొక్క శరీరకష్టముకు, బయటనున్న నిరంతరకృషివలన కలుగు శ్రమకు తాళలేక నింకనెంతమంది యారోగ్యములు ధ్వంసమయ్యెనో! ఎంతమంది చనిపోయిరి! తమ యసాధారణ జీవితములచే నెంతమంది మానసిక భ్రష్టత్వము, విపరీత భావములను పొందిరి!

దేశమంతట జరుగు భయంకర, నిగూఢ బాధ సేయు ప్రభుత్వమువలన నా కండ్లకుకట్టినట్లు ద్యోతకమయ్యెను. నాకు కొంత నిరాశ, విసుగు జనించెను. ఇదియంతయు నే పరమావధికొరకు? దేనికొరకు? నా యారోగ్యవిషయమున నే నదృష్టవంతుడను. నా కాంగ్రెసుకృషివలన నెంతయొత్తిడి, క్రమరహిత జీవితము నే ననుభవింపవలసివచ్చినను మొత్తముమీద, నే నారోగ్యముగ నుంటిని. బహుశః కొంతవరకు నా తలిదండ్రులనుండి సంక్రమించిన పటుత్వగాత్రము, కొంతవరకు శరీరవిషయమై నేను తీసికొనిన శ్రద్ధ దీనికి కారణములు కావచ్చును. వ్యాధి, దుర్బలత, స్థౌల్యము నా కేవగింపుగనుండును. వ్యాయామము, కావలసినంత చక్కనిగాలి, సంశాహారముల తోడ్పాటుతో నే నవిలేకుండ చేసికొంటిని. భారతదేశములో మధ్యతరగతులవారికి కలుగు వ్యాధులు చాలవరకు తిండి దోషమువలన కలుగుచున్నవని నా స్వంతయనుభవము చెప్పుచున్నది. అవివేకురాలగు తల్లి బిడ్డలకు మిఠాయిలు, యితర చిరుతిండ్లు మిక్కుటముగ పెట్టి యావజ్జీవాజీర్ణ రోగమునకు స్థిరపునాదులను వేయును. బిడ్డ నెక్కువ గుడ్డలతో కప్పివేయుచుండును భారతదేశములో నింగ్లీషువారుకూడ మిక్కుటముగ మెక్కునట్లు కాన్పింతురు. బహుశః వారు వెనుకటి తరమువారికంటె కొంతనయము. వెనుకటి వారు బలమైన తిండి వేడివేడి 'పెద్దపెద్ద పట్టు' పట్టెడివారు.

నా కాహారముపట్ల నెట్టి వెర్రులులేవు. మితముమీరి తినక పోవుట, జీర్ణముకాని యాహారములను మానివేయుట; ఈ రెండు నా

నియమములు కొంచెమించుమించు కాశ్మీర బ్రాహ్మణులందరివలెనే మేము మాంసాహారులము. బాల్యమునుండి నేను మాంసాహారిని. కాని నాకు దానియందంత యెక్కువ యభిరుచిలేదు. 1920 లో సహాయనిరాకరణము వచ్చుటతోడనే నేనుమాంసాహారమును మాని వేసి శాకాహారినైతిని. నే నారుసంవత్సరముల తరువాత యూరపు వెళ్ళువరకు శాకాహారిగనేయుండి యచ్చట తిరిగి మాంసాహారినై హిందూదేశము తిరిగివచ్చుటతోడనే తిరిగి శాకాహారినైతిని. నాడు లగాయితు నేను శాకాహారిగనే యుంటిని. మాంసాహారము నాకు చక్కగ సరిపడునట్లుతోచును. కాని నాకు దానియెడల నొకవిధమగు విముఖత్వముకలిగెను. నా[illegible]కొంత మోటుతనముకాన్పించెను.

చాలనెలలవరకునాకు ప్రతిదినము జ్వరముతగులుచుండినపుడు (చాలయారోగ్యవంతుడనను గర్వమునకవి యపకృతినొనరించుటచే) విసుగుదల కోపము కలిగెడివి. నే నిదివరలో నెప్పుడును చూచెడి యుత్సాహము, శక్తి, చైతన్యత కాన్పించకపోవుటకిదియే ప్రథమము. వినాశ, క్షైణ్య, వికారరూప మొకటినాయెదుట కాన్పించి భయసూచక మయ్యెను. నేను మృత్యువుకు భయపడితినని యనుకొనను కాని శారీరక మానసిక కార్యము వేరొకవిషయము.

ఎట్లయిననేమి నాభయము లుత్ప్రేక్షలని రుజువయ్యెను. నేను నా వ్యాధిని వదలించుకొని, నాశరీరమును వశములోనికి తెచ్చుకొన గలిగితిని, శీతకాలములో చాలకాలము సూర్యాతప స్నానములు చేయుటచే నాకు స్వాస్థ్యము చేకూరెను. నాతోడివారు జయిళ్ళలో కోటులతోను, శాలువలతోను గజగజ వణకుచుండ నేను వస్త్రములు లేకుండ సూర్యరశ్మితో శరీరమును హాయిగకాచుకొనుచు కూర్చొ నెడివాడను. ఇది శీతకాలములో నొక్కయుత్తర హిందూదేశము లోనే సాధ్యమగును. తక్కినచోట్ల సాధా ముగ సూర్యుడతితీవ్ర ముగ నుండును.

నా వ్యాయామములలో నొకటినాకుప్రత్యేకముగ నానందము చేకూర్చెడిది. అది శీర్షాసనము. అరచేతులను నేలమీాదనుంచి,

వ్రేళ్ళను వ్రేళ్ళతో చక్కగబంధించి తలవెనుకభాగమును, మోచేతులను నేలమీద నానుకొని శరీరమును క్రమముగ తలక్రిందుగ నిలువబెట్టవలెను. శరీరరీత్యా యీ యాసనము చాల మంచిదని నాయభిప్రాయము. దానివలన కలిగిన మానసిక ఫలితమువలన నాకు దానియందు మరింత యెక్కువయభిమానము కలిగెను. హాస్యముగ నుండు యీ తలక్రిందులుస్థితి నాలోనున్న హాస్యగుణము పెంచి జీవిత చాపల్యములయెడల మరికొంత సహనమును కలిగించెను.

నా సాధారణ యారోగ్యస్థితి, సుఖముగ నుంటినను శరీరజ్ఞానము జయిలులో తప్పనిసరియగు నిరుత్సాహ సమయములను తరిమివేయుటకు నాకెంతయో సహాయపడెను. జయిలులోను, బయట మారుచుండు పరిస్థితులకు తగియుండుటకు గూడ నాకవి సహాయపడెను. నన్నొక సమయమున పడద్రోయునట్లు కాన్పించిన కష్టములు నాకనేకములు కలిగెను. కాని నాకే యాశ్చర్యమగునట్లు వానినుండి నే ననుకొనిన కాలముకంటె త్వరితముగ కోలుకొనుచుంటిని. నేను ప్రధానముగ మితముగలవాడను. యుచితజ్ఞుడను. నే నెప్పుడు తలనొప్పి యెట్టిదో యెరుగకపోవుటయే దీనికొక రుజువు అని నేననుకొనెదను నే నెప్పుడు నిద్రలేకపోవుటచే బాధపడి యెరుగను. నాగరికతయొక్క యీ సామాన్యవ్యాధులనుండియు, చదువులోను వ్రాతలోను నాకండ్లను (ఒకొక్కప్పుడు జయిలులో గుడ్డివెలుతురులోను) విపరీతముగ నుపయోగించినను, కంటిజబ్బునుండి నేను తప్పించుకొంటిని. ఒక ప్రత్యేక కంటివైద్యుడు నా మంచి కంటిదృష్టిని గత వత్సరము చూచి యాశ్చర్యపడెను ఎనిమిదేండ్ల క్రితమతడు నే నొకటి రెండు వత్సరములలో కండ్లజోడు నుపయోగింపవలసియుండునని జోస్యము చెప్పెను. అతడు చాల పొరబడెను. అదిలేకుండ నేనింకను జయప్రదముగనే గడుపుచున్నాను. ఈవిషయములు నేను మితముగలవాడను, యుచితజ్ఞుడను, అను నాపేరును స్థాపింపగలిగినను బొట్టివువ్వు, మార్పులేని నిర్మితమును, యుచితజ్ఞత పాటించువాడనని నాకు భయము.

జయిలునుండివిడుదలయగుటకు నేనెదురుచూచుచుండ బయట క్రొత్తరకపు వ్యక్తిశాసనోల్లంఘనము ప్రారంభమగుచుండెను. గాంధీజీ మార్గదర్శకుడగుటకు నిశ్చయించి ప్రభుత్వమువారికి పూర్తియగు నోటీసు యిచ్చి గుజరాతు వ్యవసాయదారులకు శాసనోల్లంఘనము బోధించుటకు ఆగస్టు మొదటితేదీని బయలుదేరెను అతనిని వెంటనే ఆరెస్టుచేసి, యొకసంవత్సరము శిక్ష విధించి యరవాడ జయిలులో నతని మామూలు గదికి తిరిగి పంపించిరి. అతడు తిరిగి వెళ్ళినందులకు నేను సంతోషించితిని. కాని వెంటనే యొక క్రొత్తచిక్కు తటస్థించెను. అతడు జయిలునుండి హరిజన ప్రచారము చేసికొనుటకు వెనుక తనకున్న యవకాశములే యిప్పుడుండవలెననెను. ప్రభుత్వమువారట్లుచేయ తిరస్కరించిరి. ఈ సమస్యపై గాంధీజీ యుపవసించెనని మేమకస్మాత్తుగ వింటిమి. అట్టి యుపద్రవకరమైన చర్య తీసికొనుటకు మా కది చాల స్వల్పవిషయముగ కాన్పించెను. అతడు ప్రభుత్వముతో సల్పిన వాదము పూర్తిగ యుక్తమైనదేయైనను అతని నిశ్చయమును నే నర్థముచేసికొనుట బొత్తిగ దుస్సాధ్యమయ్యెను. మే మేమియు చేయజాలక తెల్లబోయి చూచుచుంటిమి.

ఉపవాసమువారమురోజులుజరిగినతరువాత నతనిస్థితి వేగముగ పాడగుచుండెను. అతని నొక ఆస్పత్రికి మార్చిరి. అయినను అతడింకను ఖయిదీయే యగుటచే ప్రభుత్వమువా రతనికి హరిజనసమస్యకు సౌకర్యముల నీయలేదు. జీవింపవలెనను యిచ్ఛ యిప్పుడు లేకపోవుటచే నతడు కృంగిపోవుచుండెను. మృత్యువాసన్నమగునట్లు కాన్పించెను. అతడు సెలవుతీసికొనెను. తనవద్దనున్న కొద్ది స్వంత సామగ్రిని పంచిపెట్టెను. కొన్నిటిని ఆస్పత్రినర్సుల కిచ్చివేసెను. కాని ప్రభుత్వమువారి కతడు తమ చేతులలో చనిపోవుట కిష్టములేక నకస్మాత్తుగా నా సాయంకాలమే విడిచివేసిరి. అతనిని రక్షించుట కదియే సరియైనసమయము. ఒక్కరోజు గతించెనా బహుశః యతడు దక్కెడివాడు కాడు. బహుశః యతనిని రక్షించినకీర్తి చాల

వరకు సి. యఫ్. ఆండ్రూసుకు చెందును. గాంధీజీ వలదనినను అతడు హిందూదేశములో రివ్యూన వ్రాసెను.

ఈ లోపల నన్ను ఆగష్టు 23 వ తేదీన డేరాడూను జయిలు నుండి మార్చిరి. పదునెనిమిదిమాసము లితర జయిళ్ళలో గడిపిన తరువాత నైనీజయిలుకు నేను తిరిగివచ్చితిని నా తల్లికి జబ్బుచేసి నట్లు, ఆస్పత్రికి తీసికొనిపోబడినట్లు వార్తవచ్చెను. మా తల్లి స్థితి చాల యుపద్రవకరముగ నున్నదని భావింపబడుటచే 1933 ఆగష్టు 30 వ తేదీ నేను విడువబడితిని. మామూలుగ సెప్టెంబరు 12 వ తేదీని నా శిక్ష పూర్తియగుటతోడనే నేను విడువబడెడివాడను కనుక రాష్ట్రప్రభుత్వము నాకు పదిహేనురోజులెక్కువ రిమిషను యిచ్చెను.

—)o(—

# 50

## గాంధీజీని దర్శించుట

నేను విడుదలయగుట తోడనే మంచమువట్టిన మా తల్లివద్దకు లక్నో వెళ్ళి కొన్నిదినము లచ్చటనేయుంటిని. చాలకాలము జయిలులో గడిపినతరువాత బయటకు వచ్చుటచే నేను సంగములేని వాని వలె, పరిస్థితులతో స్పర్శలేనివానివలె నుంటిని. నేను జయిలులో నెట్టి మార్పులేక యుండగా ప్రపంచము త్వరితముగ కదలుచు మార్పు చెందుచు పోవుచున్న ట్లాశ్చర్యముతో గుర్తించితిని. బిడ్డలు, బాలురు, బాలికలు పెద్దవాండ్రగుచుండుట; పెండ్లిండ్లు, పుట్టుకలు, చావులు, ప్రేమ, ద్వేషము, కృషి, క్రీడ, విషాదము, వినోదము, జీవితములో నూతన ప్రయోజనములు, సంభాషణకు నూతన విషయములు, నేను చూచినదానిలోను, వినుదానిలోను సదా ఏదో యొక వింతవిషయము ఉండెడిది, నన్ను వెనుకకు దిగ్రదొక్కి జీవితము పరుగిడినట్లు కాన్పించెను. అది నాకు తృప్తికరముగ లేదు. నేను వెంటనే నా పరిసరములకు సరిపెట్టుకొని యుండెడివాడను. కాని నాకట్టి కోరిక కలుగలేదు స్వల్పకాలము జయిలు వెలుపల విహారము చేయుటకు వచ్చినట్లు, కొద్దికాలములోనే తిరిగి వెళ్ళిపోవలసియుండు నట్లు నేను గుర్తించితిని. కనుక కొలదికాలములోనే వీడనున్న పరిస్థితులకు సరిపెట్టుకొని యుండవలెనని నేనేల బాధపడవలెను?

రాజకీయముగ హిందూదేశము శాంతముగ నుండెను. ప్రభుత్వము వారు బహిరంగచర్యల నణచివేసిరి, వశపరచుకొనిరి. అప్పుడప్పు డరెస్టులు జరుగుచుండెను. కాని యప్పటి భారత మౌనమున కెంతయో యర్థముగలదు. అది భయంకరనిర్బంధము చాలకాల మనుభవించిన తరువాత నలసటచేకలుగు చెడునూచనగల మౌనము! అది చాల గంభీరమైన మౌనము ! కాని నిర్బంధములనే యెరుగు ప్రభుత్వముల కది గోచరముకాదు. భారతప్రభుత్వ మాదర్శపూర్వకమైన పోలీసు ప్రభుత్వము. పోలీసు చిత్తవృత్తి ప్రభుత్వశాఖలన్నిం

టిని మట్టబెట్టెను. తిరుగుబాటు బాహ్యముగ నణచివేయబడెను. దేశమునంతను వేగులవాండ్రయొక్కయు, గూఢచారులయొక్కయు మహాసైన్యము కప్పివేసెను. ప్రజలలో నైతికదుర్బలత్వము, సర్వత్ర వ్యాపించిన భయము కలిగెను. ఎట్టి రాజకీయకృషియైనను, ముఖ్యముగ గ్రామప్రాంతములలో వెంటనే యణచివేయబడెను. వివిధ రాష్ట్రప్రభుత్వములవారు కాంగ్రెసువారిని మునిసిపాలిటీలనుండి స్థానిక సంస్థలనుండి తరిమివేయ ప్రయత్నించుచుండిరి. ప్రభుత్వ దృష్టిలో శాసనోల్లంఘనములో జయిలుకు వెళ్ళిన ప్రతివాడు మునిసిపాలు పాఠశాలలలో బోధించుటకు, మునిసిపాలిటీలో నెట్టిసేవ చేయుటకు పనికిరాడు. మునిసిపాలిటీలు మొదలగువానిమీద నెక్కువ వత్తిడి కలిగింపబడెను. దోషులైన కాంగ్రెసువారిని యుద్యోగములనుండి తొలగింపనియెడల ప్రభుత్వగ్రాంటులీయబడవని భయపెట్టిరి. ఇట్టి నిర్బంధ యుదాహరణములలో కలకత్తా కార్పొరేషను విశేషము పేరుపడెను. చివరకు రాజకీయ నేరములకు శిక్షింపబడినవారికి కార్పొరేషనులో నుద్యోగములనీయరాదని వంగప్రభుత్వమొక చట్టముచేసిరని నేనువిశ్వసించెదను

నాజీల యత్యాచార చరిత్రలు బ్రిటిషు ప్రభుత్వాధికారుల వయినను వారి పత్రికలవారికైనను నొక చిత్రఫలితమును కలిగించెను. తాము హిందూదేశములో జరిగినవన్నియు యుక్తమేయని యవి వారికి మద్దతునిచ్చెను. నాజీలే మనతో వ్యవహరింపవలసివచ్చిన యెడల నెంత యధ్వాన్నముగ నుండెడిదో! యని మాకు బోధింపబడుచుండెడిది! నాజీలు నూతన ప్రమాణములను నూతన చరిత్రను స్థాపించిరి. నిశ్చయముగ వారితో పోటీచేయుట సులభవిషయము కాదు. బహుశః మా స్థితి యధమముగనే యుండియుండెడిది, గత మయిదు సంవత్సరములలోను హిందూదేశమంతట వివిధప్రాంతములలో జరిగిన సంభవములను గురించిన వాంశములన్నియు నాయొద్ద లేకపోవుటచే నేను తీర్పుచెప్పుట కష్టమైన విషయము. హిందూదేశములోనున్న బ్రిటిషుప్రభుత్వము "నీయెడమచేయి చేయు దానము

నీకుడిచేతికి తెలియకుండునుగాత" అను గుప్తదానమును విశ్వసిం
చును. కనుకనది నిప్పటిపాతమైన పరిశోధనను జరుపవలెననెడి ప్రతి
సూచనను నిరాకరించెను. సామాన్యయాంగ్లేయుడు పశుత్వమును
ద్వేషించునను సంగతి నిజమేయని నేను భావించెదను. నాజీలవలె
యింగ్లీషువారు బహిరంగముగ "బ్రూటాలిటేటు"(లేక నీయుద్ధమువచ్చు
యింగ్లీషుపదము) పశుకృత్యములో బహిరంగముగ నోలలాడుటయు
నాపదము నతిప్రీతితో నుచ్చరించుటయు చేయగలరని నేనూహింప
జాలను. ఒకవేళ వారాకృత్యము నాచరించినను దానికి కొంచెము
సిగ్గుపడుదురు. మనము జర్మనులమైనను, యింగ్లీషువారమైనను,
భారతీయులమైనను మననాగరిక ప్రవర్తనకవచము చాల పలుచనగ
నుండును. రాగద్వేషములు ప్రకోపించినపుడది తొలగిపోయి
యసహ్యమయిన దానిని బహిర్గత మొనరించును. ప్రపంచయుద్ధము
మానవలోకమును భయంకర పశుప్రాయ మొనరించెను. దీని ఫలిత
మును మనము సంధియైన తరువాతగూడ జర్మనీ కాహారపదార్థము
లను పోకుండ నలువైపులను ముట్టడించిన భయంకర రూపమున
చూచియేయుంటిమి–దీనికొక యింగ్లీషు గ్రంథకర్త "ఏ జాతియు
నెన్నడు గావింపని యత్యంత బుద్ధిహీనమైన, పశుప్రాయమైనభయం
కరమైన క్రౌర్యము" అని వర్ణించెను. 1857, 1858 సంవత్సరము
లను భారతదేశము మరచిపోలేదు. మనప్రయోజనములకే ధాక
తగిలినపుడు, "యెసరు" వచ్చునప్పుడు మనముమనశుభలక్షణములను
సంఘనీతిని మరచిపోదుము; అసత్యము "ప్రచారము" అగును, పశు
త్వము శాస్త్రీయమైన నిర్బంధము "న్యాయ, క్రమముల" నుద్ధరిం
చుట యగును.

అది వ్యక్తులయొక్క లేక ప్రత్యేక ప్రజలయొక్క దోషము
కాజాలదు. ప్రతివాడు నట్టిపరిస్థితులలో నట్లేప్రవర్తించును. హిందూ
దేశములోను, విదేశపాలనలోనున్న ప్రతిదేశములోను, పాలకుల
మీద వంతర్హితముగ నొకసవాలు యెప్పుడు నుండును. అదినానాటికి
మరింత స్పష్టము, భయోత్పాతజనకము నగును. ఈసవాలు పాలక

వర్గముయొక్క సైనిక సుగుణములను, అవగుణములను సదా యభివృద్ధిచేయును. మానవాలు శక్తివంతము, వీర్యవంతము నైనదగుటచే గత కొలది వత్సరములలో భారతదేశమున మేము వీరా సైనిక గుణములను, అవగుణములను విశేషముగ చూచితిమి. కానిభారతదేశములో కొంతవరకు మే మెప్పుడు సైనిక హృదయమును సహింపవలసియుండెను. ఇది సామ్రాజ్య ఫలితములలోనొకటి. ఇది దీనితో సంబంధమున్న రెండుపక్షములవారినికూడ భ్రష్టులను చేయును. భారతీయుల భ్రష్టత్వము తగినంత స్పష్టముగనే యున్నది. కాని రెండవవారి భ్రష్టత్వమింతకంటె నెక్కువ సూక్ష్మమైనది. కాని ఇది విషమ సమయములలో బహిర్గతమగుచుండును. తరువాత మూడవ పక్షమొకటియుండెను. పాపము దీని కీ రెండురకముల భ్రష్టత్వములను పంచుకొను దౌర్భాగ్యము పట్టెను

ఉన్నతోద్యోగుల యుపన్యాసములను, అసెంబ్లీలోను, కౌన్సిళ్ళలోను వారి సమాధానములను, ప్రభుత్వ వాఙ్మూలములను చదువుటకు జయిళ్ళలో నాకు తగినంత సావకాశముండెను. గత మూడువత్సరములలో వానిలో కొంత మార్పువలిగినట్లు నే నను కొంటిని. ఈమార్పు యంతకంతకు స్పష్టముగ విశదమగుచుండెను. వారియుపన్యాసము లధికార పురస్కారముగ, భయజనకముగనుండెను. అవి గొప్ప సైనికాధికారి తన సైనికులను సంబోధించు భాషలో నుండెను. వంగదేశములోని మిడ్నపూరు డివిజను కమిషనరు 1933వ నవంబరు లేక డిసెంబరులో నిచ్చిన యుపన్యాసము దీనికొక చక్కని యుదాహరణము. పరాజితులు దుఃఖభాగులని యతని సూత్రము. అధికారేతర యూరపియనులు (ముఖ్యముగ వంగదేశములో) వాక్క్రియలలో శుద్ధ ఫాసిస్టు స్వభావమును చూపిరి.

సింధులో శిక్షింపబడిన కొంతమంది నేరస్థులమధ్య బహిరంగముగ నురితీయుట, పశుత్వమును తెలుపు మరియొక యుదాహరణము. సింధులో నేరములు హెచ్చిపోవుచున్నవి కనుక నచ్చటి యధికారులీ నేరస్థులను బహిరంగముగ నురిదీయ నిశ్చయించిరి. ఇది యితరుల

కొక సందడింపు. ఈ ఘోరమైన దృశ్యమును జూచుటకు ప్రజల
కనేక సౌకర్యములు గావింపబడెను. అనేక వేలనుండి హాజరయిరని
కూడ చెప్పబడెను.

కనుక నేను జయిలునుండి విడుదలయగుటతోడనే భారతదేశ
రాజకీయ, ఆర్థిక పరిస్థితులను పరీక్షించితిని. అవి చాల నిరుత్సాహ
కరముగనుండెను. నా సహచరులు చాలమంది జయిళ్ళలోనుండిరి.
క్రొత్త అరెస్టులు జరుగుచునేయుండెను. ఆర్డినెన్సులన్నియు నమలు
లోనే యుండెను తణిఖీపద్ధతి ముద్రణాయంత్రముల మూతులను బిగిం
చెను; మా యుత్తరప్రత్యుత్తరములను తారుమారు చేసెను. తన
యుత్తరముల నర్థము లేకుండ తణిఖీ చేయుటచే నా మిత్రుడు, రఫీ
అహమ్మదు కిద్వాయికి చాల కోపముకలిగెను. ఉత్తరములు లాపివేయ
బడుచు చాల యాలస్యముగ వచ్చుచుండెడివి, కొన్ని పోవుచుండెడివి.
దీనిచే నతని వ్యాపారములు భగ్నమగుచుండెను. తన యుద్యోగమును
మరికొంత జాగ్రతగ నిర్వహింపవలసినదని యతడు తణిఖీదారునకు
వ్రాయగోరెను. కాని యతడెవరికి వ్రాయవలెను? ఈ తణిఖీదారు
బహిరంగయుద్యోగి కాడు. అతడు రహస్యముగ పనిచేయుచుండునొక
సి.ఐ.డి యుద్యోగి. ఇతని కృషియు నునికియు బహిరంగముగ గుర్తింప
బడవు. రఫీఅహమ్మదు దీనినిగురించి తణిఖీచేయు అధికారి కొక యుత్త
రము వ్రాసి పయి కవరుమీద తనచిరునామానే వ్రాసియీకష్టమును
పరిష్కారముచేసెను. సరిగా యీ యుత్తరము వెళ్ళవలసినచోటుకు
వెళ్ళెను. తరువాత నతని యుత్తర ప్రత్యుత్తర వ్యవహారము కొంత
చక్కబడెను.

నాకు తిరిగిజయిలుకు వెళ్ళవలెననుకోరిక లేకుండెను. నేనుదానిని
పూర్తిగ చవిచూచితిని. కాని నేను నా రాజకీయ కృషినంతను
మానుకొన నిశ్చయించినగాని వర్తమానపరిస్థితులలో దీనిని తప్పించు
కొను టెట్లో నాకు తెలియలేదు. నాకట్టి యుద్దేశ్యము లేదు. ప్రభుత్వ
ముతో సంఘర్షణ తప్పదని భావించుచుంటిని. ఒకపనిని చేయవలె
ననియో లేక చేయరాదనియో యే నిమిషమందయిన పైగా నొక

ఫర్మానా జారీచేయబడవచ్చును. 'నీవిల్లునకువవలెను' అనుబలవంత మునకు నా స్వభావ మశేషము తిరుగబడును. భారతప్రజల నణచి వేయుటకు లొంగదీయుటకు నొకప్రయత్నము జరుపబడుచుండెను. విశాలరంగములో పనిచేయుటకు నేనసహాయుడను. నే నేమియు చేయజాలకుంటిని. కాని యుద్ధమును స్వాయముగ నాపుట్టుకు నేను తిరస్కరింపగలను.

నేను తిరిగి జయిలుకు వెళ్ళుటకుపూర్వము కొన్ని పనులను నిర్వహించుకొనవలసియుండెను. ముందు నేను మాతల్లి వ్యాధివిష యమై చూచుకొనవలసియుండెను. ఆమె చాల నెమ్మదిగ స్వస్థత చెందుచు నొక సంవత్సరముపరకు మంచముమీదనే యుండెను. తన తుది యువవాసమునుండి కోలుకొనుచున్న గాంధీజీని చూచుటకు నే నాతురపడుచుంటిని. రెండుపత్సరములు పయిగ నే నతనిని కలుసుకొన లేదు. నేను రాష్ట్రీయ చకులనుగూడ చూడగలిగినంతవరకుచూచి భారత దేశ ప్రస్తుత రాజకీయపరిస్థితులనేగాక ప్రపంచ పరిస్థితులను, నా మనస్సులోనున్న భావములను వారితో చర్చింపగోరితిని. ఈ ప్రపంచము త్వరలోనే యొక రాజకీయ ఆర్థికయుత్పాతము ననుభ వింపనున్నదని నే నప్పుడు భావించితిని. మా జాతీయప్రోగ్రాము ను తయారుచేయుటలో మేము దీనిని గుర్తింపవలసియుండెను. నాగృహ పరిస్థితులనుగూడ నేను చూచుకొనవలసి యుండెను. నేను వానినింత వరకు నిర్లక్ష్యముచేసితిని. మా తండ్రి చనిపోయినప్పటినుండియు నే నతని కాగితములను, దస్తావేజులను పరిశీలించియుండలేదు. మేము మా ఖర్చులను చాలవరకు తగ్గించితిము. అవి యింకను భరింపజాలనంతగ నుండెను మే మా భవనములో నున్నంతకాలము వానిని తగ్గించుట దుస్సాధ్యము శక్తిలేక మేము మోటారుకారు పెట్టుకొనలేదు. అంతేగాక ప్రభుత్వము దానిని నే ఋణమొంను' జపుచేయవచ్చును. ఆర్థికచిక్కులలోపడి మేము బాధపడుచుండ ద్రవ్యసహాయముచేయ వలసినదని వచ్చు యుత్తరముల కట్టలనుచూచి నేను వినోదపడెడి వాడను. (తనిఖీయుద్యోగి యీ గుట్టను నిరర్థ్యంతరముగ పంపెడి

వాడు) నేను చాల ధనవంతుడనని సాధారణముగ నొక దురభి ప్రాయము కలదు.

నేను విడుదలగుటతోడనే నా కడసారి చెల్లెలు కృష్ణకుమారికి వివాహముచేయవలసియుండెను. నేను తిరిగి వారిని బలవంతముగ విడవలసియుండకులోపలనే యీ వివాహము జరుపవలెనను నాతురతతో నుంటిని. కృష్ణకూడ నొక వత్సరము శిక్ష ననుభవించి కొద్ది మాసములక్రితమే జయిలునుండి బయటకు వచ్చెను.

నాతల్లి యారోగ్యము చూచుకొని గాంధీజీనిదర్శించుటకు నేను పూనా వెళ్ళితిని అతనిదర్శన భాగ్యము తిరిగినాకు లభించినందులకు నేను సంతోషించితిని అతడుకొంచెమునీరసముగనున్ననుత్సాహితముగకోల్లా సచుండెను మేము దీర్ఘసంభాషణలను జరిపితిమి జీవితమునుగురించి రాజకీయములనుగురించి, ఆర్థికములనుగురించి మాదృష్టులలో చాల వ్యత్యాసముండెను. నాదృష్టి నవగతముచేసుకొని దానిని సమీపించుట కతడు చల్పిన మనఃపూర్వక ప్రయత్నములకు నే నతని కెంతయు కృతజ్ఞుడను. మా యుత్తరప్రత్యుత్తరములు నా హృదయమునునింపిన విశాల సారాంశములలోని కొన్నింటిని కలిగియుండెను. వానికిసంబంధించినభాష కొంత యదృష్టముగనున్నను సాధారణ తాత్పర్యము సుస్పష్టము సుస్థాపిత ప్రయోజనముల నూడబెరుకవలెనని యతనుచేసిన ప్రకటన నాకు సంతసముకలిగించెను. అతనిప్రవర్తనవిధానములుకొన్ని (నాదృష్టిలో) మృదుత్వముతోను, మర్యాదతోను గూడిన బలవంతవిధానము కంతదూరముకాకపోవుటచే నాకంత భేదము కాన్పించలేదు. అదృష్టసిద్ధాంతములను విచారణచేయుట కతడిష్టపడడని భావించినను సత్యమనుతర్కము, ప్రధాన సాంఘిక పరివర్తనములు అవసరములను స్థితి కతనిని క్రమక్రమముగ గొంపోవునని నేను భావించితిని అతడొక యద్భుతవ్యక్తి—వెర్రియను ఎల్విను చెప్పినట్లతను మధ్యయుగపు క్యాథలిక్కుఋషి—అయినను భారతకృషీవల హృదయము నాకళింపుచేసుకొనిన కార్యదక్షతగల నాయకుడు. విషమపరిస్థితు లెదుర్కొనినపుడతడేమిచేయునో, యెట్లువిరు

గునో చెప్పజాలము. కాని యతడెట్లుతిరిగిన నావైపే బలమగును. మన యాలోచనలప్రకార మతడు తప్పుమార్గమునేబట్టినను అది యెప్పుడును సరళమార్గమే యగును. అతనితో పనిచేయుట శుభప్రదము: కాని యవసరమైనచో వేరుమార్గము త్రొక్కవలసియుండును.

ప్రస్తుత మీ సమస్యకు తావులేదని నేను భావించితిని. మేము మా జాతీయ సమరరంగమధ్యముననుంటిమి. శాసనోల్లంఘనమింకను కాంగ్రెసు కార్యక్రమముగనుండెను. మేము యథాప్రకారము మా కార్యము నిర్వహించుచు ప్రజలలో సామ్యవా[illegible]లను వ్యాప్తి చేయప్రయత్నింపవలెను. ఇట్లుచేసి మేము ప[illegible]సతిని ప్రకటింపవలసిన మరియొక తరుణమాసన్నమయినపుడు తగిన యభివృద్ధికి సిద్ధముగనుందుము. ఈ లోపల కాంగ్రెసు అక్రమసంస్థగ నుండెను. ప్రభుత్వమువారు దానిని నలిపివేయుటకు ప్రయత్నించుచుండిరి. మేమా దాడి నెదుర్కొనవలసియుండెను.

గాంధీజీ ప్రధానసమస్య వ్యక్తిగతముగ నుండెను. అతనిమట్టుకతడేమిచేయవలెననునది చిక్కుసమస్య. అతడు తిరిగి జయిలుకు వెళ్లినచో హరిజనోద్యమ సౌకర్యముల ప్రశ్న తిరిగి యుదయించును. బహుశః ప్రభుత్వమువారు లొంగకపోవచ్చును; అతడు తిరిగియుపవసించును. ఈ చర్వితచర్వణము జరగవలసినదేనా? అతడిట్టిమార్గాల మూషికనీతి కొప్పుకొనక తాను తిరిగి ఈసౌకర్యములకొరకుపవసింపవలసివచ్చినచో తాను విడుదలయైనను ఉపవాసము విరమింపబడదని చెప్పెను. అనగా చనిపోవువరకు నుపవసించును.

అత డింక చేయగల రెండవపని యేమన తన సంవత్సర శిక్షాకాలములో జయిలుకుపోక దానిని హరిజనోద్యమమునకు వినియోగింపవలెను. అయినను అతడు కాంగ్రెసు వర్కరులను కలుసుకొని యవసరమైనపుడు వారికి సలహా యిచ్చుచుండును.

అతడు మూడవమార్గమును సూచించెను. కొంతకాలమతడు కాంగ్రెసునుండి పూర్తిగవిరమించి దానిని "యువకుల" హస్తగతము చేసెతునవెను.

మొదటి పద్ధతివలన నతఃమపవసించి చనిపోవుటతప్పదు. కనుక నేమెవరము దానిని సిఫార్సుచేయలేదు. కాంగ్రెసు అక్రమసంఘముగ నున్నపుడు మూఁడవపద్ధతి నవలంబించు టెంత మాత్రము వాంఛ నీయముకాదు. ఇది శాసనోల్లంఘనమును, అన్నివిధ ప్రత్యక్షకార్యము లను వెంటనే విరమించి తిరిగిన్యాయవిధానములకు, చట్టబద్ధచర్యలకు దిగుటగ పరిణమించును. లేదా యిప్పుడు గాంధీజీచేత కూడ బహి ష్కరింపబడి, వేరుచేయబడి ప్రభుత్వముచే మరింతనలిపి వేయబడు కాంగ్రెసుగ పరిణమించును. యింతేగాక నొకచోట కలుసుకొనుటకు నొకనీతిని చర్చించుకొనుటకు వీలులేని యక్రమసంస్థ నేవ్యక్తియు వారును చేబట్టుటకవకాశము లేదు. కనుక నతఃమసూచించిన వానిలో రెండవపద్ధతికి నేమంగీకరించితిమి. మాలో చాలమంది కది ఇష్టము లేదు, చావగా మిగిలిన శాసనోల్లంఘన కార్యక్రమమున కిది యొక్క పెద్ద గొడ్డలి దెబ్బయని నేమెరుఁగుదుము. న్యాయముగనే సమరరంగము నుండి విరమించిన యెడల ననేకమంది యుత్సాహవంతులగు కాంగ్రెసు వర్కరు లీ యగ్నిలోనికి దుముకజాలరు. కాని యీ చిక్కులోనుండి బయటపడుటకు మరియొక తెన్ను కానరాదయ్యెను. కనుక గాంధీజీ పయివిధముగనే ప్రకటించెను.

గాంధీజీ నేను శాసనోల్లంఘనమును విరమింపరాదనియు, దానిని సన్నసన్నగానైనను నడుపవలెననియు నొప్పుకొంటిమి. ఇక నేను ప్రజాదృష్టిని సామ్యవాద సిద్ధాంతములమీఁదకు, ప్రపంచ పరిస్థి తులమీఁదకు త్రిప్పఁగోరితిని.

నే నింటికి తిరిగివచ్చినపుడు బొంబాయిలో కొద్దిదినము లుంటిని. నే నచ్చట యుదయశంకరుని నృత్యకళను గ్రోలితిని. ఇది నాకు తలవని తలంపుగ చేకూరుటచే నేను దీని నాస్వాయముగ నను భవించితిని. నాటకములు, గానము, సినీమాలు, టాకీలు, రేడియో, దూరశ్రవణము యిత్యాదులు చాల వత్సరములనుండి నాకననుభూత ములు. ఏలనన నాకు స్వేచ్ఛయబ్బిన మధ్యకాలములలో గూడ నే నితరపనులలో నెక్కువగ మునిగియుండెడివాడను. నేనింతవర

కొక్కసారియే టాకీకి పోగలిగితిని. సినిమా ప్రపంచములో ప్రసిద్ధి చెందినవారి నామములు నాకు నామమాత్రముగనుండెను. ముఖ్యముగా నాకు నాటకములతో సంబంధము లేకుండెను. విదేశములలో రచింపబడు నూతన నాటకములను నేనసూయతో చదువుచుండెడివాడను. ఉత్తరహిందూదేశములో మంచి నాటకములను చూచుట కవకాశములు లేకుండెను. మాసమీపములో నట్టివేవియు లేకుండెను.

వంగ, మహారాష్ట్ర, గుజరాతీ నాటకములలో గొప్పయభివృద్ధికలిగెనని నేను విశ్వసించెదను. హిందూస్థానీ నాటకరంగ మట్లుగాక మిక్కిలి సంస్కార శూన్యముగ, కళావిహీనముగ నున్నది; భారతదేశములోని ఫిల్ములు చాలవరకు (టాకీలును మాట్లాడని ఫిల్ములను కూడ) కళోపాసనచేయు దోషమున కొడిగట్టువని నేను వింటిని. అవి సాధారణముగ ప్రాచీన భారతదేశ చరిత్రనుండియో, పురాణగాథలనుండియో తీసికొనబడు విషయమునకు చెందిన సంగీత మిశ్రిత కథలు, పుక్కిటిపురాణములు.

అవి నగరవాసులవాంఛను సప్లయిచేయునని నేననుకొనెదను. సంస్కార రహితములు, బాధకరములు నగు యీ ప్రదర్శన కళకును యింకను నిలిచియున్న వీధినాటకములు, బొబ్బిలికథలు, నృత్యము మొదలగు కళకును గల వ్యత్యాస మెంతయో గలదు. వంగదేశము, గుజరాతు, దక్షిణహిందూదేశములోని గ్రామప్రజలు ప్రధానముగ నెంతకళాభిజ్ఞులో మన మొక్కొక్కప్పు డత్యాశ్చర్యముతో కనుగొన గలము. మధ్యతరగతులవారట్లుగాక తమ మూలములను పోగొట్టుకొనినట్లు కాన్పింతురు. వారుపాసించునట్టి కళాసాంప్రదాయమేదియు లేదు. వారు జర్మని, ఆస్ట్రియాలలో గుట్టలుగ తయారుచేయబడు అందవికారమగు చౌకరకప్రింటులతో మురియుచు నొక్కొక్కపుడు రవివర్మ చిత్రములనుగూడ గుర్తించుచుందురు. హార్మోనియము వారి యభిమానజంత్రము (స్వరాజ్య ప్రభుత్వ మీవికారయంత్రమును తీవ్ర ప్రతిబంధక చట్టములచే నిషేధించుననుగంపెడాశతో నేను జీవించుచున్నాను.) కాని లక్నోలోనుఇతరచోట్లనుగల పెద్దతాలూకుదార్ల

భవనములలో నతి ప్రమాదకరమగు నసంగతకళయు, కళాసిద్ధాంత ముల నన్నిటిని భంగపరచుటయు గాననగును. ఖర్చు పెట్టుటకు వారికి కుప్పతిప్పలుగ ద్రవ్యముకలదు. ఘనతకు ప్రకటించుకొనవలెనను నిచ్ఛగలదు! కనుక వా రక్లేల చేయరాదు! వారిని దర్శింపబోవు ప్రజలు వారి యీ యపసిద్ధిని కండ్లారజూచు విచారకలుషిత ద్రష్ట లగుదురు.

సుప్రసిద్ధ టాగూరువంశ మొక కళాప్రబోధమును నవీనముగ కలిగించెను. భారతదేశమంతట దానిప్రతిభ యప్పుడే ప్రసరించెను. కాని, దేశములోని ప్రజ లడుగడుగునకు నిర్బంధింపబడుచు, వారింప బడుచు, నణచివేయబడుచు భయభ్రాంతమగు వాతావరణంలో జీవించుచుండ నే కళగాని విరివిగా నెట్లభివృద్ధి చెందగలదు ?

బొంబాయిలో నేననేకమందిస్నేహితులను,సహచరులనుకలుసు కొంటిని. వారిలో కొందఱు కొద్దికాలము క్రిందటనే జయిలునుండి బయటపడిరి. అచ్చట సామ్యవాదము బలముగనుండెను కాంగ్రెసు లోని పయితరగతులలో నవీనముగ సంభవించిన మార్పువల్ల తిర స్కారము హెచ్చుగనుండెను. తన యాధ్యాత్మికదృష్టిని రాజకీయ ములకు వర్తింప జేసినందులకు గాంధీజీ తీవ్రముగ విమర్శింపబడెను. ఆ విమర్శలో చాలవరకు నే నేకీభవించితిని. కాని, పరిస్థితులనుబట్టి మనకు వేరుగత్యంతరము లేదనియు, నుద్యమమును సాగింపక తప్ప దనియు నేను స్పష్టముగగ్రహించితిని. శాసనోల్లంఘనమునువిరమించు యత్నమేదియు మనకు శాంతిని ప్రసాదింపజాలదు. ఏలనన ప్రభుత్వ నిర్బంధవిధానముసాగింపబడుచునేయుండును మనకృషివిధాయకముగ జయిలుకే మార్గమగును. మన జాతీయోద్యమము ప్రభుత్వముచే నణచివేయబడవలెను. లేదా ప్రభుత్వముపై తన యిచ్ఛను చలా యించవలెను. దీనికి మరియొక మార్గము లేదు. అనగా జాతీయోద్యమ మెప్పుడు ప్రభుత్వముచే నక్రమసంఘముగ ప్రకటింపబడుస్థితికి వచ్చెను శాసనోల్లంఘనము విరమింపబడినను యీ యుద్యమము వెనుకకు మరలజాలదు. శాసనోల్లంఘనమును సాగించుటవలన నాచ

రణలో నెక్కువభేదములేదు. కాని యానైతిక తిరస్కారమునకొక ప్రయోజనముకలదు. పోరాటమును కట్టిపెట్టినపు డవినీతి ప్రబలును. అప్పుడు నూతనభావములను వ్యాపింపజూచుటకంటె సమరకాలము లోనే వాటిని వ్యాపింపజేయుట సుకరము. పోరాటమును విరమించి నచో మనము చేయగలిగిన దొక్కటియే కలదు, మనము బ్రిటిషు ప్రభుత్వముతో రాజీపడి శాసనసభలలోని చట్టబద్ధ కార్యకలాపము నకు దిగవలెను

అది యొక కఠినమైనస్థితి! దీనికంగీకరించు టంత సులభవిషయ ముకాదు. నేను నాసహచరుల మానసిక సంఘర్షణలను గుర్తించితిని. ఏలనన నేనే యట్టివాని నొకప్పు డెదుర్కొనవలసి యుండెను. కాని సామ్యవాదసిద్ధాంతమును కార్యశూన్యతకొక యాశ్రయముగ చేయ గోరినవారిని కొందరిని కనుగొంటిని. తమంతతాము రవంత కార్యము నైనను చేయరానివారు సంగ్రామోత్సుకులుగనున్నప్పుడు కార్యభారము నంతను వహించిన యితరులను నభివృద్ధిభంజకులని విమర్శించుట కొంచెము క్రోధోద్దీపితముగ నుండకమానదు. ఈ వడకగది సామ్య వాదులు గాంధీజీ నతికఠినముగ వచ్చి రియాక్షనరీయని నిందించిరి. వారు తర్కమునకెంతమాత్రము కొరతపడని వాదనలను కుప్పించిరి. కాని ఈ 'రియాక్షనరీ' భారతదేశము నెరిగినవాడు. గ్రహించినవాడు. అతడే కృషీవల భారతదేశము విప్లవకారుడనబడువా డెవడు కదల్చన ట్లతడు భారతదేశమును కదల్చివేసెనను విషయ మాచంద్రార్కము నిలిచిపోగలదు. అతని నవీనహరిజనోద్యమముకూడ సనాతనహిందూ మతమును నెమ్మదిగ త్రవ్వి దానిని పునాదులవరకు కదల్చివేసెను. సనాతనబృందమంతయు నొక్కపెట్టున నతనిపై యెదురుతిరిగిరి. అతడు వారినెంత యుదారముగ, మర్యాదగ, సన్మానించినను వారతనిని ప్రబలశత్రువుగ పరిగణించిరి. చిత్రముగ నతడు ప్రబలశక్తులనువిడిచి పెట్టుచుండును, ప్రయోగించుచుండును. అవి నీటిమీద యలలవలె విస్తరించుచు కోట్లకొలది ప్రజలను చేరుచుండును, వారినినిమిషములో మార్చివేయుచుండును. 'రియాక్షనరీ' యగుగాక విప్లవకారుడగుగాక!

అతడు భారతముఖమునంతను మార్చివేసెను. దాసానుదాసులై యుండి నీతిపరులై పడియున్న ప్రజల కతడు యభిమానధనమును, శీలసంపత్తును ప్రసాదించెను. ప్రజలలో నొకశక్తిని, ప్రబోధమును నిర్మించెను. భారతసమస్యను ప్రపంచసమస్యగ చేసెను. దౌర్జన్యరహితసహాయ నిరాకరణము లేక నాత్మికనిరోధము భారతదేశమునకు, ప్రపంచమునకు నతడు ప్రసాదించిన మహత్తరవరము. అది భారతదేశపరిస్థితుల కతివిచిత్రముగ నరిపడెననుటకు సందేహ మెంతమాత్రము లేదు.

సవిమర్శయుక్తము మనసమస్యలనుగురించిసాధ్యమైనంతబహిరంగచర్చ కవకాశమీయవలెను. గాంధీజీయొక్క యనన్యస్థానమీ చర్చకు కొంతయాటంకము కలిగించుట దురదృష్టము. అతనిపై నాధారపడుట, నిశ్చయము నతని కేవిడిచివేయుట పరిపాటియయ్యెను. ఇది చాల పొరపాటు, లక్ష్యములను, పద్ధతులను హేతుబద్ధముగ నంగీకరింపవలెను. దానిపై నాధారపడు సహకార, శిక్షణలచేతనే జాతి యభివృద్ధిచెందగలదు. ఎంతగొప్పవాడైనను విమర్శ కతీతుడుగనుండరాదు. కాని విమర్శ కేవలము కార్యకారి కానిచో దానిలో నేదో యొక దోషముండును. సామ్యవాదు లిట్టివానికి పాల్పడిన ప్రజలచే గ్రహింపబడుటతప్పదు. ప్రజలు కార్యములనుబట్టియే విమర్శించుచుందురు. "భవిష్యత్తునకుచెందు సుకుమారకార్యములనుగురించి కలలను గనుచు నేటికఠిన కార్యములను త్రోసిపుచ్చువాడు వంచకుడగును" అని లెనినుమహాశయుడు వచించెను. అనగా నది వాస్తవిక జీవితాభివృద్ధిపయి నాధారపడుటను తిరస్కరించుటయగును. కలల పేరిట అభివృద్ధిమార్గమును పోనాడుటయగును.

భారతదేశ సామ్యవాదులు, కమ్యూనిష్టులు చాలవరకు పారిశ్రామిక బీదజనులకు సంబంధించిన సాహిత్యముమీదనే పెరిగిరి. బొంబాయి, కలకత్తా మొదలగు కొన్ని ప్రత్యేకప్రాంతములలోనే చాలమంది ఫ్యాక్టరీ కూలివాండ్రు, పనివాండ్రుకలరు. తక్కినభారతదేశమంతయు వ్యావసాయిక దేశము కనుక పారిశ్రామిక పనివాండ్ర రీత్యా భారతసమస్యను యథోచితముగ పరిష్కరించుటకు వీలులేదు.

జాతీయత, గ్రామఆర్థికము లిచ్చటప్రధానములు, ప్రాశ్చాత్యసామ్య
వాదమునకు వీనితో నెట్టిసంపర్కము లేదు యుద్ధమునకు పూర్వము
రష్యాదేశ పరిస్థితులు హిందూదేశమును పోలియేయుండెను. కాని
యచ్చటసాధారణములు, నసామాన్యములు నగు సంభవములు తట
స్థించెను. అట్టివే యెచ్చటనైననుజరుగుననియనుకొనుట మూర్ఖత్వము.
ప్రస్తుతపరిస్థితులనుగ్రహించుటకు, నన్వయించుకొనుటకు కమ్యూనిస్టు
వేదాంతము సహాయపడునని నా విశ్వాసము. మరియు నది భవిష్య
దభివృద్ధిమార్గము సూచించును కాని యథార్థములను, పరిస్థితులను
యుక్తముగ గుర్తింపకుండ గ్రుడ్డిగ నీ వేదాంతమును వర్తింప జేయుట
దీనియెడల నపచారము, దౌర్జన్యము చేయుటయే యగును.

ఎట్లైనను జీవితమంత సులభమైన విషయముకాదు. జీవితములో
నున్నపోరాటములు, పరస్పరసంఘర్షణలు ఒక్కొక్కప్పుడుకొంతనిరా
శను కలిగించును భేదాభిప్రాయములుండుటలో నాశ్చర్యమేమియు
లేదు. సమస్యలవల్ల సమానాన్వయమును పొందిన సహచరులు వివిధ
వారాంశములను కలిగియుండుటలోగూడ నాశ్చర్యమేమియు లేదు.
కాని తన నిజమర్బలత్వము నుదాత్తపదజాలములోను, ఉదాత్త
సిద్ధాంతములలోను కప్పిపుచ్చజూచు వ్యక్తిపట్టుబడకమానదు ప్రభు
త్వమునకు వ్రాతమూలముల నిచ్చియు, హామీల నిచ్చియు జయిలు
నుండి దప్పించుకొన ప్రయత్నించు వ్యక్తి, లేక సందేహాస్పదమగు
నితర ప్రవర్తనగల వ్యక్తి, యితరులను విమర్శించుటకు సాహసించి
నచో తానుబూనిన యుద్యమమునకే ఘాతచేసినవాడగును.

బొంబాయి పట్టణరాజమగుటచే నన్నిరకముల మనుష్యుల
కాకరము. అయినను ఒక విఖ్యాతనగరవాసి తన రాజకీయ 'ఆర్థిక'
సాంఘిక మతవిషయకదృష్టిలో చిత్రమగు, ననన్యసాధ్యమగు, 'నుదా
రత'ను ప్రదర్శించెను. కూలీల నాయకుడయి యతను సామ్యవాది
యయ్యెను. రాజకీయములలో సాధారణముగ నతడు ప్రజాప్రభుత్వ
వాదియని పిలుచుకొనెడివాడు. అతడు 'హిందూసభ' యొక్క గారాబు
పట్టి. ప్రాచీనమత, సాంఘికాచారములను కాపాడుటకు, వాటితో

జోక్యము కలిగించుకొనకుండ శాసనసభలను వారించుటకు నతడు వాగ్దానముచేసెను. ఎన్నికసమయములో నతడు సనాతనపక్షయభ్యర్థి, ఇట్టి వినోదకరమగు చౌచౌ జీవితముతో తృప్తిపొందక నతడు వ్యర్థముగపోవు తనశక్తిని కాంగ్రెసును విమర్శించుటయందు, గాంధీజీని 'రియాక్షనరీ' యని నిందించుటయందు సద్వినియోగము చేసెను. మరికొందరితో కలసి యతడు కాంగ్రెసుకు ప్రజాస్వామికపక్ష మను దానిని లేవదీసెను. దీనికి వస్తుతః ప్రజాస్వామికముతో నెట్టి సంబంధములేదు. దీనికి కాంగ్రెసుతోగల సంబంధము ఆ మహాసభపై దాడి వెడలుట యొక్కటియే! క్రొత్తసీములను జయింపవలెనని గాలము వేసి పరిశోధించుచు లేబరుప్రతినిధిగ నతడు జీనీవా లేబరుకాన్ఫరెన్సుకు తయారయ్యెను. ఇంగ్లీషువారిమాదిరి 'జాతీయ' ప్రభుత్వ ప్రధానమంత్రిత్వమున కతడర్హతనుసృష్టించుకొనుచుండెనని మనము యోచించుకొనవచ్చును.

కొద్దిమందికి మాత్రమే యిట్టి చౌచౌ దృష్టియు, చేష్టలు లభింపగలవు. అయినను కాంగ్రెసును విమర్శించువారిలో వివిధ రంగములను చూచినవారు చాలమందికలరు. అన్ని వాయిద్యములను వాయించినవారును కలరు. వీరిలో కొద్దిమంది సామ్యవాదులని తమ్మును, పిలుచుకొనిరి. వీరు సామ్యవాదమునకు చెడ్డపేరు తెచ్చిరి.

# 51

## లిబరలు దృష్టి

గాంధీజీని చూచుటకు పూనా వెళ్ళినపు డొకనాటిసాయంకాలము నే నతనితో కలసి 'భారతసేవకసంఘ' భవనమును చూచుటకు వెళ్ళితిని. ఆ సంఘసభ్యు లతనిని సుమా రొక గంటసేపు రాచకీయ ప్రశ్నలడిగిరి. అతడు వానికి సమాధానములను చెప్పెను. ఆ సంఘాధ్యక్షుడైన శ్రీనివాసశాస్త్రిగా రచ్చటలేరు. తక్కిన సభ్యులందరిలో నతిసమర్థుడైన పండిత హృదయనాథకుంజ్రూగారుకూడ నచ్చటలేరు. కాని కొందరు సీనియరుసభ్యులుండిరి. ఆ సమయమున నచ్చటనున్న మేము కొందర మా ప్రశ్నల నాశ్చర్యముతో వినుచుంటిమి వారతిస్వల్పసంభవములనుగురించి పృచ్ఛించిరి. అవిచాలవరకు గాంధీజీ వైస్రాయిని దర్శనమీయవలెనని కోరుట, వైస్రాయి దానిని తిరస్కరించుట మొదలగువానితో గూడియుండెను. పలువిధ సమస్యాభరితమయిన ప్రపంచములో వారు భావింపగలిగిన ముఖ్యవిషయ మిదియేనా? స్వాతంత్ర్యముకొరకు తమమాతృభూమి ఘోరసంగ్రామము సలుపుచున్నపుడు, వందలకొలది సంస్థలక్రమసంఘములుగ ప్రకటింపబడినపు డడుగవలసిన ప్రశ్నలివియేనా? వ్యావసాయక దుస్థితి, విపరీత నిరుద్యోగమును దాపరింపజేసి పారిశ్రామిక మాంద్యము, వంగ, సరిహద్దు రాష్ట్రములలోను, తదితర ప్రాంతములలోను జరుపబడినఘోర కృత్యములు, ఉపన్యాసములు, వ్రాతలు, సభలు, భావములు మొదలగువాని స్వాతంత్ర్యములనణచివేయుట, అనేక జాతీయ, అంతర్జాతీయ సమస్యలు—ఇన్నియుండగా నెట్టిప్రశ్నలు దొరకెను !

బహిఃప్రపంచముతో నెట్టిసంపర్కములేని యొక మఠములో నడుగుపెట్టినట్లు నాకుతోచెను. అయినను మనమిత్రులుహుషారయిన రాచకీయ దురంధరులు, సమర్థులు, త్యాగము, చిరప్రజాసేవక చరిత్ర కలవారు. మరికొద్దిమందితో కలసి వారు లిబరలుపక్ష మేరుదండివలె నుండిరి. ఈపక్షములోని తక్కుంగలవా రూరుపేరులేని నిరర్థకమూక,

రాచకీయకృషితో సంబంధమున్నట్లుప్పండప్పడు తృప్తిపడగోరువారు, వీరులోకొందరు ప్రభుత్వాధికారులనుండి వేరుజేయుటకువీలులేనివారు,

ఒకదేశము వేయుప్రశ్నలే యాదేశ రాజకీయాభివృద్ధికి ప్రమాణములు సరియైన ప్రశ్న వేసికొనకపోవుటయే దేశవిఫలతకు కారణమగుచుండును మన కాలమును, శక్తిని, బుద్ధులను శాసనసభాస్థానములను కులమువారీగా పంపకము చేయుటయందు వ్యర్థముచేయుటయు లేక కమ్యూనల్ అవార్డు సమస్యమీద పక్షములనుసృష్టించి, దానిని గురించి వ్యర్థవాగ్వివాదాలతో ప్రొద్దుపుచ్చుటయు, మన రాజకీయ దుస్థితికి ప్రమాణములు. అదేవిధమున భారతసేవక సంఘమువారి మందిరమున నాడు వేయబడిన ప్రశ్నలా సంఘముయొక్క, లిబరలు పక్షముయొక్క వింతమానసికస్థితిని ప్రతిబింబించుచుండెను. వారికి రాజకీయ లేక ఆర్థిక సిద్ధాంతములున్నట్లు కాన్పించదు. విశాల దృష్టియులేదు. వారి రాజకీయములన్న అధికారులేమిచేతురు? లేక నేమిచేయకుందురు? అను పడకగది లేక కాఫీహోటలు రాజకీయములుగ కాన్పించెను.

'లిబరలుపక్షము' అనునామకరణము మోసమునకాస్పదము కావచ్చును. ఇతరచోట్ల నాపదమొక యార్థికనీతిని–స్వేచ్ఛావాణిజ్యము మొదలగుదానిని–వ్యక్తిస్వాతంత్ర్యము, పౌరసత్వహక్కులుఅనునొక లక్ష్యమును నిరూపించును. ఆంగ్లదేశపు లిబరలు సాంప్రదాయమార్థిక పునాదులపై నిర్మింపబడెను. వర్తకములో స్వాతంత్ర్యముండవలెనను నభిలాష, రాజుయొక్క గుత్తపద్ధతినుండి, నిరంకుశ సుంకముల విధానమునుండి స్వేచ్ఛబడయవలెననుకోరిక రాజకీయ స్వాతంత్ర్యేచ్ఛకు మార్గముచూపెను. భారతదేశ లిబరలుపక్షము వారి కట్టి పునాదియేదియులేదు స్వేచ్ఛావర్తకములో వారికి నమ్మిక లేదు. వారందరు రక్షణకావలెననియే కోరెదరు. పౌరసత్వములకు వారెక్కువ ప్రాముఖ్యత నీయరని యీమధ్యజరిగిన సంభవముల వలన విదితమగుచున్నది. నిరంకుశ ప్రభుత్వములు, అర్థఫ్యూడల్ ప్రభుత్వములు, ప్రజాస్వామిక ప్రాతిపదికలు, వ్యక్తి స్వాతంత్రము

కూడ లేనట్టియు నగు భారతసంస్థానములతో వారికెక్కువసంపర్క, సహాయములు కలవు. యూరోపియను లిబరలులకు వీరికినీవిషయములో పోలికయే లేదు. నిశ్చయముగ భారతదేశ లిబరలు లెంతమాత్రము లిబరలులు (అనగా ఉదారులు) కారు వారెవరో సరిగా చెప్పగలుగుట కష్టసాధ్యము. వారికి కదముద్దమును స్థిరభావనిర్మాణ మేదియు లేదు. వారల్పసంఖ్యాకులైయును నొకరితో నొకరికి సరిపడదు. ఒక్క 'న' కారములోనే (అనగా వ్యతిరేకించుటలోనే) వారు దిట్టలు. వారికి సర్వత్ర ప్రమాదమే కాన్పించును. కనుక దానినుండి తప్పించుకొన యత్నింతురు. ఆట్లుచేయుటలో సత్యము ద్యోతకమగునని వారాశింతురు. నిశ్చయముగ వారి సత్యమెప్పుడు రెండు చివరల మధ్య నుండును. అతి యనుకొనునట్టి ప్రతిదానిని విమర్శించుటచే వారు మితము, పవిత్రత, మంచితనము గలవారమనెడి భావమునకుభవింతురు. బాధకరము, కష్టతరమునగు విచారసాగరమునుండి నిర్మాణ భావములనుండి తప్పించుకొనుటకు వారికీ పద్ధతి తోడ్పడును. పెట్టుబడిదారుల విధానము యూరపులో పూర్తిగ జయింపలేదనియు, నది చిక్కులపాలయ్యెననియు వారిలో కొందర స్పష్టముగ భావింతురు. ఇక సామ్యవాదము స్వార్థప్రయోజనములపై దాడివెడలును గనుక చెడ్డది. బహుశః భవిష్యత్తులో నేదో యొక యద్భుత పరిష్కారము, యొక మధ్యేమార్గగ్రహము కనుగొనబడును. ఈ లోపల స్వార్థప్రయోజనములు రక్షింపబడవలెను. భూమి గుండ్రముగనున్నదా లేక బల్లపరపుగనున్నదా యనువాదమొకటి బయలుదేరినచో వారీ యతివాదభావములను ఖండించి యది చతురముగనో లేక కోడిగ్రుడ్డువలెనో యుండవచ్చునని తాత్కాలికముగ సూచించెదరు.

అప్రధానములను, అల్పవిషయములను గురించి వారతి యుద్రేకపడెదరు. అహాహాలును చప్పట్లును అత్యద్భుతముగ చెలరేగును. వారు బుద్ధిపూర్వకముగను, భావముచేతనుగూడ ప్రధాన సమస్యలను చేబట్ట నొల్లరు. ఏలనన నట్టి సమస్యలకు మూలచికిత్సలు భావ,

క్రియలలో ధైర్యసాహసములునుండవలెను. కనుక లిబరలుల జయాపజయము లర్థరహితములు. వారికే సిద్ధాంతముతోను సంబంధము లేదు. ఆపార్టీయొక్క ప్రధానలక్షణము, ప్రత్యేకచిహ్నము, (అట్లు భావింపతగినయెడల) ప్రతిదానియందు, మంచికాని చెడుకాని, మితము, మితి, అదియొక జీవితపంథ. బహుశః పాతపేరైన మిత వాదపదమే వీరికెక్కువ దగియుండెడిది.

కాని మితి, యెంతమంచిదైనను గొప్పగుణము. ప్రకాశించు గుణముకానేరదు. అది మాంద్యమునుకలిగించును కనుక భారతలిబరలులు దురదృష్టవశమున "మందగొడిసైన్యము"అయిరి. వారిచూపులు మందముగను, విరసముగను, వ్రాతలు, సంభాషణలు నిర్వీర్యముగను రసవిహీనముగను నుండును దీనికి మినహాయింపులు లేకపోలేదు. సర్ తేజబహదరు సప్రూ వీరిలో నతివిఖ్యాతపురుషుడు. అతడు నిశ్చయముగ మాంద్యుడుకాడు. అతనిలో సరసముకు కొదువలేదు, అతడు తనమీద ప్రయోగింపబడిన వేళాకోళమునైనను సంతోషముతో స్వీకరింపగలడు. కాని మొత్తముమీద లిబరలువర్గ మస్ఖలితబూర్జువా ప్రాతినిధ్యము వహించును. లిబరలుపక్షమువారి ప్రధాన వార్తాపత్రికయైన "లీడరు"పత్రిక గతవత్సరము తన తత్త్వమును తెలుపు ప్రధాన వ్యాసమును వ్రాసెను. గొప్పవారు, అసామాన్యపురుషులు ప్రపంచమున కెవ్వరు ముప్పు తెచ్చిపెట్టరనియు, కనుకనది సామాన్యవ్యక్తికి నిత్యప్రత్యక్షమగు వ్యక్తికి, యెక్కువ ప్రాధాన్యత నిచ్చునవియు వచించెను. అది చక్కని సూచనను నిర్మొగమాటముగచేసి తన జెండాను సాధారణస్థితికి కట్టివేసెను.

మితవ్యాపారము, చలనములేకుండుట, సాహసములు, హఠాత్ప్రవర్తనములు లేకుండవలెననుకోరిక మొదలైనవి వృద్ధాప్య లక్షణములు. అవి యువకులకు తగినవికావు. కాని మనదేశ మతి ప్రాచీనమైనది. ఒక్కొక్కప్పుడామెబిడ్డలు శ్రమతోను, విసుగుదలతోను జనించునట్లు కాన్పింతురు. కాంతితఱగు వృద్ధలక్షణములు వారియందు కాన్పించును. కాని యిప్పుడీ ప్రాచీన దేశముకూడ విప్లవ

శక్తులతో రేకెత్తుచున్నది మితవాదదృష్టి తెల్లబోవుచున్నది. పాత ప్రపంచము నశించుచున్నది. లిబరలుల తియ్యని హేతువాద సంభాషణవలన లాభమేమియు లేదు. ఇంతకంటె వారే తుపానుతోనో, వరదతోనో, భూకంపముతోనో వాదించుకొనిన బాగుండెడిది. వారి ప్రాతియూహాలు నిష్ఫలములగుచున్నవి. నూతనభావములను, కార్యములను, అలవరచుకొనుటకు వారు సాహసింపరు యూరపియను సాంప్రదాయమునుగురించి మాట్లాడుచు డాక్టరు యే. యస్. వైటుహెడ్ గారిట్లు చెప్పిరి. ప్రతి పురుషాంతరము తన తండ్రులనాటికాల పరిస్థితులలోనే సంపూర్ణముగ జీవించుచవని, తన బిడ్డల జీవితముల నట్టి శక్తితోనే పాతపోయుట కా పరిస్థితులనే రవాణా చేయవలెనను పిచ్చి యూహతో నీ సాంప్రదాయమంతయు నల్లుకొనబడియున్నది. మన మనస్తత్వభావముతోనున్న మానవచరిత్రయొక్క మొదటియుగములో జీవించుచున్నాము.” డాక్టరు వైటుహెడ్డు తన విమర్శలో మితవాదము నవలంబించి ప్రమాదమునకు లోనయ్యెను. వలనన ఆయూహ యెప్పుడు నిజము కానేరదు. యూరపియను సాంప్రదాయమే చలనహీనమైనయెడల మనసాంప్రదాయమునుగురించి వేరుగ చెప్పవలెనా? కాని విప్లవసమయ మాసన్నమయినపుడు చారిత్రక నడక యీ సాంప్రదాయములను లెక్కచేయదు. మనమునసహాయులవలె నిరీక్షించి చూచుచు మన ప్రయత్నములు భగ్నమగుట కితరులనునిందింతుము. గిరాల్డుహెర్డుగారు సూచించినట్లు “మన ప్రయత్నములు భగ్నమగుటకు మన భావములలోనున్న లోపములేవియో కారణములుగాక నితరులెవరో బుద్ధిపూర్వకముగ వానిని భగ్నపరచిరని విశ్వసించు భావ మతి ప్రమాదకరమైన భ్రాంతి.

మనమందర మిట్టి భయంకర భ్రాంతిచే బాధపడుదుము. గాంధీజీ దానినుండిముక్తినొందలేదని నేనొక్కొక్కప్పుడు భావించుచుందును. కాని మన మధమాను పనినైననుచేసి జీవితములో సంపర్కము నుంచుకొన యత్నింతుము. ప్రయత్నించుచు నొక్కొక్కప్పుడు పడుచు నీ భ్రాంతియొక్క శక్తిని నిర్వీర్యమొనర్చుచు నెమ్మ

దిగ ముందుకుపోదురు. కాని లిబరలులు విశేష బాధపడుదురు తప్పు చేయుదురేమోయను భయముచే వారు పనినేచేయరు. పడిపోవుదు రేమోయను భయముచే వారు నడువనే నడువరు. ప్రజాసామాన్యముతో వారెట్టి యుక్తసంపర్కము కలిగించుకొనక తమ మానసిక కుహరములలో జపించుకొనుచు స్వీయగౌరవదీవిద్యతో కూర్చొనెదరు. శ్రీనివాసశాస్త్రిగారు పదునెనిమిదిమాసములక్రిందట తనతోడి లిబరలులను "ఊరక చూచుచు విషయములను జారవిడువరాదని" మందలించెను. ఆ మందలింపులో నతడు గుర్తించిన దానికంటె నెక్కువ సత్యమున్నది. ఎల్లప్పుడు ప్రభుత్వమేచేయుచుండునాయని యోచించుచుండుటచే నతడు వివిధప్రభుత్వ కమిటీలు పొదుగు చట్టబద్ధమైన మార్పులను గురించి యుదహరించుచుండెను. కాని లిబరలుల దురదృష్టమేమనిన తమ ప్రజలే ముందుకు నడచిపోవుచుండ వారూరక నిలచి విషయములను జారవిడచిరి. వారు తమప్రజలనే చూచి భయపడిరి. పాలకులతో పొత్తుచెడగొట్టుకొనుటకంటె వారీ ప్రజలతో సంబంధము విడగొట్టుకొనుటయే యోగ్యమనుకొనిరి. తమ నిజభూమిలోనే వారు విదేశస్థులయిరనుటలో నాశ్చర్యమేమికలదు? మిన్నకుండువారినిప్పుడి జీవితము పరుగెత్తుననుటలో నాశ్చర్యమేమున్నది? తమదేశస్థులు ప్రాణములకొరకు స్వాతంత్ర్యముకొరకు ఘోరసంగ్రామములను జరిపినపుడు లిబరలుధీరులు శత్రువులనరికట్టు గోడకేవైపున నిలచిరో వేరుగ నడుగనక్కరలేదు. వారుగోడకవతలవైపున నిలచి మాకు గంచి సలహానిచ్చిరి. వారనేక ధర్మవన్నములను వల్లించిరి. రౌండుటేబిలు కాన్ఫరెన్సులలోను, కమిటీలలోను వారు బ్రిటిషు ప్రభుత్వముకుచేసిన సహాకారము ప్రభుత్వముకు గొప్పనైతికబలము. వారు దానిని నిరాకరించినచో పరిస్థితులలో నెంతయో బేధముండెడిది. ఈ కాన్ఫరెన్సులలో నొకదానికి బ్రిటిషు లేబరుపార్టీకూడ హాజరుకాకుండుట గమనించవలసిన విషయము. మన లిబరలు లట్టిపాపము చేయలేదు. అట్లుపోవలదని కొంతమంది బ్రిటిషువారు ప్రార్థించినను వారు వెళ్ళుట మానలేదు.

మనమందరము వివిధ ప్రయోజనములకొరకు హెచ్చుతగ్గు స్థాయిలలో మితవాదులమో లేక అతివాదులమో యగుదుము. మనము దేనికొరకై తగినంత శ్రద్ధతీసికొందుమో దానినిగురించి గట్టిగ భావింతుము. దానినిగురించి యతివాదులమగుదుము. లేనియెడల మన ముదారమగు సహనమును, వేదాంతపరమగు మితిని చూపవచ్చును. దేశములో స్వప్రయోజనములు తుడిచివేయబడవలెనని సూచింపబడినప్పుడతి సాత్త్వికమితవాదికూడ నెక్కువగ నుద్రేకించుట, అతివాదియగుట నేనెరుగుదును. మన లిబరలుమిత్రులు కొంతవరకు ధనికులను కలవారికి ప్రతినిధులు. వారు స్వరాజ్యమువచ్చువరకు వేచియుండగలరు. దానినిగురించి వారంతగా నుద్రేకపడ నవసరములేదు కాని గొప్ప సాంఘిక మార్పుకేసూచనయైన చేయబడినచో వారలిక్కపడుదురు. అప్పుడు వారి మితవాదము పలాయనమగును. అత్యాని హేతువచనములు సెలవుతీసికొనును. వారి మితవాదమంతయు బ్రిటిషు ప్రభుత్వపట్టుననే కాననగును. తాము తగినంత గౌరవప్రదముగ, రాజబుద్ధితోను నుండునెడల తమమాటలు మన్నింపబడునని వారాశింతురు. బ్రిటిషువారి యుద్దేశ్యములను న్యాయవిధాయకముగనొప్పుకొనదీరవలెను. బ్లూపుస్తకములు (ఇంగ్లీషుపార్లమెంటుకు సంబంధించినవి) వారికి వేదగ్రంథములు. ఎర్స్కిన్‌మేగారి పార్లమెంటరీ యాచారమను గ్రంథము, అట్టి పుస్తకములు వారి కుపాస్యములు. ఒక క్రొత్త ప్రభుత్వనివేదిక యుద్రేకమునకు, గాలిమేడలకు, కారణమగును. ఇంగ్లండునుంచి తిరిగివచ్చు లిబరలు నాయకులు వైటుహాలులో నివసించు గొప్పవారికృత్యములను గురించి యద్భుత స్టేటుమెంటులను చేయుచుందురు. వలనన లిబరలులకు, రెస్పాన్సివిస్టులకు నట్టి యితరవర్గములవారికి వైటుహాలు యింద్రభవనము. పూర్వకాలములో పుణ్యాత్ములగు అమెరికనులు చనిపోవునప్పుడు ప్యారిసు వెళ్లుచుండెడివారట! పుణ్యాత్ములగు లిబరలులయాత్మ లొకప్పుడు వైటుహాలు ఆవరణలో తిరుగుచుండవచ్చును.

నేను లిబరలునుగురించి వ్రాసితిని. కాని, యిది కాంగ్రెసులోనున్న చాలమందికిగూడ వర్తించును. మితవాదములో లిబరలులను జయించిన రెస్పాన్సివిస్టుల కిది మరెంత యెక్కువ వర్తించును. సామాన్య లిబరలుకు, సామాన్యకాంగ్రెసువారికి నెక్కువ వ్యత్యాసము కలదు. అయినను వారిని భేదించు రేఖ స్పష్టముగ, కచ్చితముగ లేదు. అభివృద్ధిచెందిన లిబరలులకు మితవాదియైన కాంగ్రెసువానికి భేదమంతగా లేదు. కాని, గాంధీజీధర్మమాయని ప్రతికాంగ్రెసువానికి దేశముతో, ప్రజలతో కొంతసంబంధము కలిగెను. అతడు క్రియచేసి చూపించెను. కనుకనే యతడు సమగ్రమై, దోషభూయిష్ఠమైయుండు తత్వమువలన సంభవించు కొన్ని ఫలితములను తప్పించుకొనగలిగెను. లిబరలులట్లుకాక పాతవారితోను క్రొత్తవారితోనుకూడ సంబంధములకోల్పోయిరి. ఆ వర్గము క్షీణించిపోవు తెగయొక్క ప్రతినిధి.

మనలో చాలమంది శాందసభావమును పోగొట్టుకొంటిమి. కాని నూతన యాత్మదృష్టి నార్జింపలేదు "సముద్రమునుండి మైనాకుడు పుట్టెను." ఇక్ష్వాకుడెవడో దేవదుందుభిని మ్రోగించెను." అనునవి మనకు తృప్తినీయవు. "ఇసుక రేణువులో ప్రపంచమును చూచుట; అడవిపువ్వులో స్వర్గమును చూచుట; అనంతమును కరతలామలకము చేసికొనుట; గంటలో ననంతకాలము నిముడ్చుకొనుట; ఇట్టియదృష్టవంతులు మనలో ముందుకు కానరారు.

"దేశభక్తి కాంగ్రెసువారిముల్లెకాదు" అని యాగ్రహముతో నుడువబడుచుండును. ఈవాక్యమే పదేపదే పాటక్రింద పాడుచుండుట విచారకరము. ఏ కాంగ్రెసువాది యిట్టిదురహంకారము బూనియుండడని నేను తలంచెదను అది కాంగ్రెసువారి గుత్తయని నిశ్చయముగ నేను తలంపను. కోరినవారికి దానిని బహుమతిచేయుటకు నేనెంతయో సంతసించెదను. అది మోసగాండ్రకు జీవితముకొరకు పోంచియుండు వారలకు నాశ్రయమగును. అందరి యభిరుచులకు నన్ని ప్రయోజనములకు, నన్నితరగతులకు సరిపడునట్లు దానిలో ననేకరకములున్నవి. నేడు జూడాను (గురుద్రోహి) జీవించియున్నయెడల నిస్సందేహముగ

దీనిపేర పని చేసెడివాడు. ఈ రోజులలో దేశభక్తి చాలదు. మనకంత కంటె నుత్తమమైనది, విశాలమైనది, యుదారమైనది కావలెను

కేవల మితవాదము చాలదు. నియమము మంచిది. అది మన విజ్ఞాన ప్రమాణము కాని యానియమము వెనుక దానినిపట్టియుంచు మన దేదో యొకటియుండవలెను. పంచభూతములను వశపరచుకొనుట: ఇంద్రధ్వజము నారోహించుట, దవానలమును తరలుకొనివచ్చు జల ప్రవాహమును తన ప్రయోజనముకొరకు లొంగతీసుకొనుట_ఇవివిధి నిర్మితములైన మానవహక్కులు. కాని తనను దహించు రాగద్వేషము లను నియమించుట, పట్టియుంచుట యన్నిటికంటె కష్టసాధ్యమైనపని. అతడు వానిని వశపరచుకొననంతవరకు తన మానవసంపదను పూర్తిగ ననుభవింపజాలడు. కాని మనము కదలనికాళ్ళను, స్తంభించి పోయిన చేతులను విరోధింపవలెనా?

లిబరలుమిత్రులు సర్వోత్కృష్టమగు నసిధారావ్రతమును తా మనుసరింతుమనియు, కాంగ్రెసుయొక్కయు, ప్రభుత్వము యొక్కయు నతివాదములమధ్య తాము మెళుకువగ సంచరింతుమ నియు చెప్పుదురు. వారితరులదోషములను నిరూపించు స్వయంనిర్మిత న్యాయాధికారులు ఆదోషములనుండి తాము విముక్తులైనట్లు వారే యభినందించుకొనెదరు వారు తూకము చూచుటకు యత్నింతురు. న్యాయవిగ్రహమువలె వారు కండ్లను మూసికొనెదరు. లేక నేత్ర పట్టము కట్టుకొనెదరు. "పండితోత్తములారా!......గుడ్డినేతలారా నలుసులను ఏరేరెదరు. గుమ్మడికాయలను గుభాలున దిగమ్రింగె దరు!"

# 52

## డొమినియను ప్రభుత్వము - స్వాతంత్ర్యము

గత పదిహేడువత్సరముల కాంగ్రెసునీతినినిర్ణయించినవారిలో చాలమంది మధ్యతరగతులవారు. లిబరలు కాంగ్రెసువాది యొకతరగతినుండియే వచ్చి, యొక వాతావరణములోనే వృద్ధిచెందిరి. వారి సాంఘికజీవితము, సంబంధములు, స్నేహములు ఒకమాదిరిగనే యుండెను, మొట్టమొదట వారియుభయులకు గల రెండురకముల బూర్జువాతత్త్వములలో భేదమంతగా లేదు: స్వభావమానసిక భేదములు వారిని వేరుచేయనారంభించెను. వారు వేరువేరు దిశలకు చూడనారంభించిరి. ఒకరు ప్రభుత్వమువైపు, ధనికులవైపు, మధ్యతరగతులలో పైతరహాకు చెందినవారివైపుచూడ నారంభించిరి. రెండవవారు మధ్యతరగతిలోని క్రిందితరహావారివైపు చూచిరి, వారితత్త్వమింకను నొకటిగనే యుండెను. లక్ష్యములు మారలేదు. కాని రెండవవర్గము వారి వెనుక నౌకరులనుండి తక్కువవృత్తులనుండి నిరుద్యోగులైన విద్యార్థులనుండి వచ్చినవారి సంఖ్యాబలముయొక్క యుత్సాహముండెను. వారి స్వరము మారెను ఇప్పుడందులో పూజ్యభావము, వినయవిధేయతలు లేవు. కాని తీవ్రత, చురుకుపాలు హెచ్చెను. కార్యశూరత్వము చూపుటకు తగినంతబలము లేకపోవుటచే ఘాటైన భావద్వారా కొంత యుపశాంతి కలుగుచుండెడిది. ఈనూతన సంచలనమును చూచి భయపడి మితవాదప్రభృతులు జారిపోయి, యేకాంతమున సురక్షితముగ నుండగోరిరి. అయినను కాంగ్రెసులో చిన్న బూర్జువాలసంఖ్య యత్యధికముగనున్నను, మధ్యతరగతిలోని పైతరహావారికే గట్టిప్రాతినిధ్యముండెను. జాతీయపోరాటములోజయము చేకూరవలెనను కోరికచేతనేగాక నాపోరాటములోనొకయాంతరంగిక తృప్తినిగోరి వారందులో కురికిరి. తద్వారావారు తాముకోల్పోయిన మానధనమును, ఆత్మగౌరవమును తిరిగి సంపాదించుకొనగోరిరి: శిథిలమైన తమ యాన్యత్యమును నిలువుకొనగోరిరి. అది మామూలు.

జాతీయావేశము. ఇది యందరకు సామాన్యమైనను యిప్పటనే మితవాదికి నతివాదికిగల స్వభావజన్య భేదములు పొడసూపెను. క్రమముగ మధ్యతరగతిలోని క్రిందితరహావారు కాంగ్రెసు నాశ్రయించిరి. తరువాత కృషీవలులు పలుకుబడిని సంపాదించిరి

కాంగ్రెసు అంతకంతకు గ్రామప్రజల ప్రతినిధియైనకొలది లిబరలులకు దానికి మధ్యయంతరు వధికమయ్యెను. కాంగ్రెసు దృక్పథమును గ్రహించుట లేక గుర్తించుట లిబరలుల కసాధ్యమయ్యెను. పైతరగతి చిన్న యూరుటింటిని, మట్టిగుడిసెను అర్థముచేసికొనుట తేలికకాదు అయినను, యీభేదములున్నను, ఈ రెండు తత్వములు జాతీయములు, బూర్జువాతత్వములు. ఈ రెండూ తరహాలకు చెందినవి కాని జాతికి చెందినదికాదు. లిబరలువర్గములో నతికులాసాగానుండగలవారు చాలమంది కాంగ్రెసులో చివరవరకు నుండిరి.

చాలకాలము వరకు బ్రిటిషువారు హిందూదేశమును తమ గ్రామమందిరమువలె చూచిరి. వారాభవనములోని సుందర భాగముల నాక్రమించుకొనిన యజమానులు, పెద్దలు. భారతీయులు నౌకరుల హాలులోను, ఆహారపదార్థశాలలోను వంటశాలలోను కుములుచుందురు. సరియైనప్రతిగ్రామభవనములోను ఆ క్రిందిప్రపంచములో బట్లరు యిల్లుచక్కబెట్టునది, వంటలవాడు, డలాయతు, దాసీది, భృత్యుడు యిత్యాది న్యూనవర్గముండును. వారిలో వరుసగ కఠినమగు న్యూనాధిక్యతలుండును. కాని యీ భవనములోని పై ప్రపంచము వారికి, క్రిందిప్రపంచమువారికి సాంఘికముగ రాజకీయముగ నభేద్యమగుగోడ యుండును. బ్రిటిషుప్రభుత్వ మీ యేర్పాటులను మనపై చొప్పించుటలో నాశ్చర్యమేమియు లేదు. కాని మనము లేక మనలో చాలమంది మనజీవితములు, విధి యీ విధముగ నేర్పాటింపబడుట సహజమని, విధాయకమని యంగీకరించుటయే యాశ్చర్యకర విషయము మనము నమ్రమైన గ్రామ మందిర నౌకరుబుద్ధి నలవర్చుకొంటిమి. ఒకప్పుడు మన కఖండమర్యాద చూపబడును. మనకు ప్రేక్షకాగారములో నొక చిప్పెడు తేయాకు ప్రసాదింపబడును.

గౌరవముగ చూడబడుట, వ్యక్తిగతముగ పై ప్రపంచములో పెద్ద పేరొందుట మన మహత్తరకోరిక, సైనిక విజయముకంటె రాజకీయ విజయముకంటె హిందూదేశములో బ్రిటిషు ప్రభుత్వమువారి యీ మానసికవిజయము చాల గొప్పది భావిస బానిసవలెనే యోచింప ప్రారంభించెను.

కాలముమారెను. ఇప్పుడింగ్లండులోను హిందూదేశములోను గ్రామమందిర నాగరికతమాదిరి బుద్ధిపూర్వకముగ నొప్పుకొనబడుట లేదు. కాని మనలో నింకను నౌకరులహాలుల నంటిపెట్టుకొనియుండ వలెనను కోరికగలవారు, నౌకరీదుస్తులు. డలాయతు బిళ్ళలు చూచి మురియువారు, గర్వించువారు కలరు. లిబరలులవంటి యితరులా గ్రామమందిరమును మొత్తముగ నంగీకరింతురు. దాని పవిత్రతను, ఆ నిర్మాణమునంతను మెచ్చుకొనుచు యజమానుల స్థానములో క్రమక్రమముగ తాము ప్రవేశింపజూతురు, దీనిని వారు భారత పరముచేయుట యని పిలుతురు. పరిపాలకుల వర్గమును మార్చుటయే వారి సమస్య హెచ్చుగ వెళ్ళినచో నూతన పాలక వర్గమును వాంఛింతురు, వారెన్నడు నూతన ప్రభుత్వ విధానమును గురించి యోచింపరు. వారికి స్వరాజ్యమనగా సమస్తముయథాప్రకారముగనే సాగుట. కొంచెము వన్నె నల్లబడినచాలును, వారు లేక వారివంటి వారు ప్రధానపాత్ర వహించునట్టియు, నున్నత యాంగ్లాధికారుల స్థానముల నాక్రమించునట్టియు భవిష్యత్తునే చూడగలరు. అదేమాదిరి యుద్యోగము, ప్రభుత్వశాఖలు, శాసన సభలు, వర్తకము, పరిశ్రమలు—తమ పదవులలోనుండు ఐ. సి. యస్, లు; అప్పుడప్పుడు తళుకు బెళుకు దుస్తులతో కాన్పించుచు, తమ ప్రజల నొప్పించుటకు సమస్తాభరణములతో మెరయుచు సౌధసీమలలోనుండు రాజకుమారులు. తమరైతులను బాధించు ప్రత్యేకాధికారములను కోరు భూఖామందులు. ధనసంచులను చేతబుచ్చుకొని జమీందారులను, రైతులనుగూడ బాధించు వడ్డీవ్యాపారస్తుడు; ఫీజుగుంజుకొను లాయరు; స్వర్గములోనుండు భగవంతుడు.

వారిదృష్టి (ప్రధానముగ) ఉన్నతస్థితిని సంరక్షించుటమీదనే యాధారపడియున్నది. వారుకోరు మార్పులన్నియు వ్యక్తిగతములైనవని చెప్పవచ్చును. ఈమార్పులను వారు బ్రిటిషువారి ప్రసాదము వలన నెమ్మదినెమ్మదిగ ముక్కచుక్క చొప్పున సాధింపచూతురు. వారి రాజకీయములయొక్కయు, నార్థికములయొక్కయు పునాది యావత్తు బ్రిటిషుసామ్రాజ్యస్థిరత్వముమీద సాగుదలమీద నిలిచియున్నది. ఈ సామ్రాజ్య మచంచలమని భావించి వారు దానికి సరిపెట్టుకొనెదరు. వారు దాని రాజకీయ, ఆర్థికతత్వమునే గాక దాని నైతిక ప్రమాణములకూడ నంగీకరింతురు. అవియన్నియు బ్రిటిషు అధికారమును భద్రముగ సాగించుటకే నిర్మింపబడెను.

కాంగ్రెసుదృష్టి యింతకంటె భిన్నమైనది. అది కేవలము మరియొక పరిపాలకులనుగాక నొకనూతనప్రభుత్వమునుసృష్టింపజూచుచున్నది. ఈనూతన ప్రభుత్వరూప మెట్లుండునో, సామాన్యకాంగ్రెసు వారికే యెక్కువస్పష్టముకాకపోవచ్చును. దానినిగురించేయభిప్రాయములు భేదింపవచ్చును. కాని వర్తమానపరిస్థితులు, పద్ధతులు నిక నెంతమాత్రము సాగకూడదు, సాగరాదు అనునది కాంగ్రెసులో సామాన్యవిషయము ప్రధానమార్పు లత్యవసరము. డొమినియను ప్రభుత్వమునకు స్వాతంత్ర్యమునకు భేద మిచ్చటనేకలదు. మొదటిది మనలను బ్రిటిషు ఆర్థిక పద్ధతి కనేక ప్రత్యక్షా ప్రత్యక్ష పాశములచే బంధించు వెనుకటి నిర్మాణమునే సూచించును. రెండవది మనపరిస్థితులకు సరిపడు నూతన నిర్మాణమును నిర్మించుకొనుటకు మనకు స్వేచ్ఛనిచ్చును.

అనగా యింగ్లండుపట్ల యింగ్లీషుప్రజలపట్ల తిరుగులేని, రాజీలేని శత్రుత్వమని యర్థముకాదు. ఏమిసంభవించినను వారితో త్రెంచుకొనవలెనను కోరికయుకాదు. ఇంత 'గ్రంథము' జరిగిన మీదట భారతదేశమునకు యింగ్లండునకు మధ్య ద్వేషభావము లుండుట సహజము. "అధికారమత్తత నున్నితమగు తాళముచెవిని చెడగొట్టి గొడ్డలి నుపయోగించును" అని టాగూరు వచించెను. మన

హృదయములను తెఱచు తాళముచెవి చాలకాలము క్రిందటనే నాశనముచేయబడెను. గొడ్డలి మనపై తనివితీర యుపయోగింపబడినను మనము బ్రిటిషువారియెడల పక్షపాతము వహించునట్లు చేయజాలకపోయెను మనము భారతదేశముయొక్కయు, మానవలోకముయొక్కయు విశాలధర్మమును సేవించితిమని యనుకొనుటచే మన తాత్కాలికాహంకారముచే మత్తులముకాము. ఒకవేళ మనమట్లు జారినను పదిహేనుసంవత్సరములనుండి గాంధీజీప్రసాదించిన కఠినశిక్ష మనల నట్లు చేయనీయదు. నేను బ్రిటిషుజయిలులో కూర్చుని దీనిని వ్రాయుచున్నాను. అనేక నెలలనుండి నామనస్సు విచారగ్రస్తమైయుండెను. జయిలులో నేను మునుపెన్నడు బాధపడనట్లే యేకాంతవాసములో నెక్కువబాధపడితిని. అనేక సంభవములచే నా మనస్సు క్రోధ, రోషపూరిత మయ్యెను. అయినను నే నిచ్చట కూర్చొని నాహృదయమును, మనస్సును గంభీరముగ పరీక్షించి చూచుకొనునపుడు నాకు ఇంగ్లండు యెడల నింగ్లీషువారియెడల నెట్టి కోపము కానరాదు నేను బ్రిటిషు సామ్రాజ్యతత్త్వమును ప్రేమింపను. దానిని భారతదేశముపై రుద్దుటకొప్పుకొనను. క్యాపిటలిష్టుపద్ధతి నాకంగీకారముకాదు. బ్రిటిషు పాలకతరగతులవారు భారతదేశమును కొల్లగొట్టువిధమును నేనెంతమాత్రము ప్రేమింపను: దానిని నేను నిరసింతును. కాని దీనికి యింగ్లండు. యింగ్లీషు ప్రజలందరు బాధ్యులని నేను భావింపను ఒకవేళ నేనట్లు భావించినను అందులో నంతవ్యత్యాసమేమియు నుండదు. ఏలనన ఒక దేశపుప్రజల నందరను గర్హించుట లేక వారిపట్ల కోపము వహించుట మూర్ఖత్వమగును. మనవలెనే వారును పరిస్థితులకు దాసులయిరి.

వ్యక్తిగతముగ నామానసికపరిణతికి నేను యింగ్లండుకెంతయో ఋణపడియుండుటచే దానికెన్నడు కేవలవ్యతిరేకముగ భావింపజాలను. నే నేదిచేసినను యింగ్లండులో పాఠశాలలలోను, కళాశాలలోను అలవరచుకొనిన మానసికభావములను, యితరదేశములను, జీవితమును విమర్శించు ప్రమాణములను, పద్ధతులను వీడజాలను.

రాజకీయరంగము మినహా నాయభిమానమంతయు యింగ్లండుమీద యింగ్లీషుప్రజలమీద నుండును. నేను హిందూదేశములోని బ్రిటిషు పరిపాలనకు రాజీనొల్లని శత్రువునైనచో దానికి నేను కారకుడనుకాను.

ఆ పరిపాలనకు, నధికారమునకు మే మధ్యంతర పెట్టెదము. దానితో బుద్ధిపూర్వకముగ రాజీపడము. ఇంగ్లీషువారితోను తదితర దేశములతోను మనకత్యంతసన్నిహితసంపర్కములుండుగాక! భారత దేశంలో మాకకలంక వాయుప్రవారము అకలంకములు, ప్రాణప్రదములునగు భావములు, సౌభాగ్యప్రదమగు సహకారము కావలెను. మేము యుగములకో చాల బూజుపట్టినవారమైతిమి. కాని యింగ్లీషువారు వ్యాఘ్రాకారములో వచ్చునెడల మా స్నేహభావము, సహకారము నాశింపరాదు. సామ్రాజ్యతత్త్వమును వ్యాఘ్రమునకు భయంకరతమ వ్యతిరేకముతప్పదు. నేడు మాదేశ మా భయానకజంతువు నెదుర్కొనవలసియున్నది ఆటవిక, క్రూర వ్యాఘ్రమును మచ్చిక చేయుట సాధ్యముకావచ్చును. దాని సహజక్రౌర్యమును మంత్రించి వేయవచ్చును. కాని, క్యాపిటలిజము, సామ్రాజ్యతత్త్వముకలసి యొక దురదృష్టదేశముపై కుదుకునపుడు వానిని మచ్చికచేయు టసాధ్యము

తాను తన దేశమును రాజీపడరని చెప్పుట మూర్ఖత్వము. ఏలనన జైతె మెప్పుడు రాజీపరచులకు మనలను బలవంతపరచుచున్నది. దానిని మరియొక దేశమునకు లేక ప్రజలకు వర్తింపచేయుటలో సత్యముకలదు. అప్పుడు దానిని సాధించుటకు మానవశక్తిచాలదు. భారతస్వేచ్ఛ, బ్రిటిషు సామ్రాజ్యతత్త్వము పరస్పర విరుద్ధములు సైనిక శాసనము, ప్రపంచములోనున్న తీపిమాత్రలు వాని పరస్పర వైరుధ్యమును పోగొట్టజాలవు. దరిచేర్పజాలవు. భారతదేశమునుండి బ్రిటిషు సామ్రాజ్యతత్త్వమునకు స్వస్తి చెప్పబడినప్పుడే యథార్థ హిందూ బ్రిటిషు సహకారమునకు తగిన పరిస్థితు లేర్పడును.

ఆధునిక ప్రపంచములో స్వాతంత్ర్యము సంకుచిత సిద్ధాంతమని మనకు నీతులు గఱపబడుచుండును. ప్రపంచ మంతకంతకు నన్యోన్యాశ్రయమగుచున్నది. కనుక స్వాతంత్ర్యము కోరుటలో మనము

గడియారమును వెనుకకు త్రిప్పుటకు యత్నించుచున్నాము! బ్రిటను లోనున్న లిబరలులు, శాంతిని గోరువారు, సామ్యవాదులనబడు వారు ఈవాదమునేచేయుచు సంకుచిత జాతీయతకు మనలను మందలింతురు. పరిపూర్ణ జాతీయ జీవితమునకు మార్గము "బ్రిటిషు కామన్వెల్తు" ద్వారా కలదని మనకు సూచింతురు. ఇంగ్లండులోనన్ని మార్గములు లిబరలిజము, సోషలిజము, ఫాసిజము మొదలైనవి— సామ్రాజ్యమును సంరక్షించుటకే త్రోవచూపుట విచిత్రము. తాను గొల్లగొనిన ధనమును కాపాడుకొనుటకొరకు జయించినజాతి "శాంతి" "శాంతి" యను వాక్యము నుచ్చరించును. పరిపాలకజాతి తనస్థితిని సంరక్షించు కొనుటకు "జాతీయత" కంటె నుత్తమమైనదిగా సింగారించుకొను చుండును. ఈవిధముగనే గాంధీయెదుట మాక్డొనాల్డు అంతర్జాతీయ వాదిగ కబుర్లు చెప్పెను" అని ట్రాట్‌స్కీ వచించెను.

రాజకీయ స్వాతంత్ర్యము వచ్చినతరువాత భారత మెట్లుండునో యేమిచేయునో నేను చెప్పజాలను. కాని జాతీయ స్వాతంత్ర్యము కోరు భారతీయు లతివిశాలమైన అంతర్జాతీయతను కూడ కోరుదురని చెప్పగలను. సామ్యవాదికి జాతీయత వర్తములేదు. కాని కాంగ్రెసు ప్రథమశ్రేణిలోనున్న యనేకమంది సామ్యవాదులుకానివా రారి తేరిన అంతర్జాతీయవాదులు. ప్రపంచముతో సంబంధములేని స్వాతంత్ర్యమును మేము కోరుటలేదు. ఇతరదేశములతోబాటు యదార్థమైన యంతర్జాతీయ క్రమముకొరకు మా స్వాతంత్ర్యములో నొక భాగము నిచ్చివేయుటకు మేముసంపూర్ణముగనంగీకరించుచున్నాము, ఏ సామ్రాజ్యపద్ధతియైనను, దాని కెట్టి ఘనమైన నామకరణ మిడినను, అట్టి ఆక్రమముసకు శత్రువుగాక తప్పదు. అట్టి పద్ధతిచే ప్రపంచ సహకారము లేక ప్రపంచశాంతి చేకూరజాలదు

వివిధ సామ్రాజ్యపద్ధతు లెట్లు నిరంకుశత్వమువలనను, ఆర్థిక సామ్రాజ్య పద్ధతివలనను తమకు తాము వేరగుచున్నవో ప్రపంచ సంభవములు తెలుపుచునేయున్నవి. అంతర్జాతీయాభివృద్ధికి బదులు దాని తల్లక్రిందులు మతమునే మనము చూచుచున్నాము. దీనికారణ

ములను తెలిసికొనుట ఘనకార్యము కాదు. అవి ప్రస్తుత ఆర్థికక్రమ దుర్బలత్వమును సూచించును. దీనిఫలిత మేమనిన విరంకుశ ప్రాంతము లలో తక్కిన ప్రపంచమునుండి దానిని వేరుచేయుచున్నది. భారత దేశములో నది, ఒటావా మొదలగు తీర్మానములద్వారా, మనకితర దేశములతోగల సంబంధ బాంధవ్యముల నధికముగ తగ్గించెను. మనము మునుపటికంటె నెక్కువగ బ్రిటిషువర్తకములపై నాధారపడు టాపిసలమైతిమి. అనేకవిధముల యీ నీతివలన కలిగిన నష్టము నటుంచినను దీని యపకారములు సువిదితములు. ఈ విధముగ డొమిని యను ప్రభుత్వము విశాల అంతర్జాతీయ సంబంధములకు బదులు ఒంటెత్తుతనమునకే మార్గముగునట్లు కాన్పించును.

అయినను భారత లిబరలు మిత్రులు ప్రపంచమును, మరింత ప్రత్యేకముగ తమ దేశమును తను బ్రిటిషు కండ్లజోళ్ళద్వారా చూచుబుద్ధి సంపాదించిరి. కాంగ్రెసు యేమి చెప్పుచున్నదో, యెందుల కిట్లు చెప్పుచున్నదో గ్రహింపయత్నింపకుండకనే వారు స్వాతంత్ర్యము డొమినియను ప్రభుత్వముకంటె సంకుచితము, తక్కువ యౌన్నత్యకరమను పురాతన బ్రిటిషువాదమునే చిలకపలుకులవలె నప్పగింతురు. అంతర్జాతీయతయనగా వారికి తెలుపోలు. ఎలనన వారికితర దేశముల విషయమై బొత్తిగా తెలియదు భావలు రాకపోవుట దీనికి కొంతకారణమైనను వారు వానిని నిర్లక్ష్యము చేయుటతో తృప్తిపొందెదరు హిందూదేశములో వారెట్టి ప్రత్యేకచర్యను, యెట్టి తీవ్ర రాజకీయములను అంగీకరింపరు. కాని వారి నాయకులలో కొందర కట్టిపద్ధతు లితర దేశములలో నవలంబింపబడుట కెట్టియభ్యంతరము కానరాదు. వారు వానిని దూరమునుండి గుర్తింపగలరు, మెచ్చుకొనగలరు. పాశ్చాత్యదేశ యాధునిక డిక్టేటరులు కొందరు వారిచే మానసికముగ నారాధింపబడుదురు.

పేరులు సాధారణముగ పెడమార్గమును త్రొక్కింపవచ్చును కాని మనము నూతన ప్రభుత్వమును వాంఛించుచున్నామా? లేక నూతనపాలకవర్గము మాత్రమే కోరుచున్నామా? అనునదే హిందూ

దేశ యదార్థసమస్య. లిబరలుల సమాధానము స్పష్టమే! వారికి రెండ వది తప్ప మరేమియు నవసరములేదు. అది కూడ క్రమక్రమముగ సాధింపదగిన దూర లక్ష్యము. 'డొమినియను ప్రభుత్వము' అను పద ములు పదేపదే వాడబడును. కాని తాత్కాలికమైన వాటి నిజవిష యము "కేంద్రములో బాధ్యత" అను నైంద్రజాలిక పదములచే వ్యక్తీకరింపబడుచున్నది. అధికారము, స్వాతంత్ర్యము, స్వేచ్ఛ, మోక్షము అను కడుపునిండుమాటలను వారు నోటినిండ నుచ్చరింప జాలరు. అవి యుపద్రవముగ ధ్వనించురు. ప్రజాసమూహము నకు చప్పగనున్నను లాయరుభాష, దృష్టి వారికి నచ్చును. విశ్వా సముకొఱకు, స్వాతంత్ర్యముకొఱకు నుపద్రవముల నెదుర్కొని ప్రాణ ములనొడ్డిన వ్యక్తులు, వర్గములు అసంఖ్యాకములుగలవు. "కేంద్రము లోని బాధ్యత" కొరకు మరియొక లీగలు పదముకు యెవడైనను బుద్ధిపూర్వకముగ నొకపూట తిండి మానుకొనుట లేక సుఖముగ నిద్రింపకుండుట సంశయాస్పదమైన విషయము.

కనుక నిదియే వారిలక్ష్యము. దీనిని వారు ప్రత్యక్ష కార్య క్రమము వలనగాక శ్రీనివాసశాస్త్రిగారు సెలవిచ్చినట్లు "పరిజ్ఞా నము, అనుభవము, మితము, ఒప్పింపగలనేర్పు, ప్రశాంతమగు పలుకు బడి, యదార్థ సమర్థత"—ఇన్నింటిని ప్రదర్శించి సాధింపగోరుదురు. పభుత్వ మధికారమును మన కొప్పజెప్పినట్లు సత్ప్రవర్తన చేతను సుకర్మచేతను మనము వారిని బుజ్జగింపవలెను. అనగా మన దుడుకు తనమువలన కలిగిన కోపముచేత లేక మనశక్తిసామర్థ్యములను శంకించుటచేత లేక నీ రెండుకారణములచేత ప్రభుత్వమువారు మనల నిపుడు తిరస్కరించుచున్నారు. ఇది ప్రస్తుతస్థితియొక్కయు ఇంపీరియ లిజముయొక్కయు చిత్రమయిన విమర్శ. సోపానక్రమముగ పాలక జాతుల సహకారముతో నధికారమును సంపాదింపవలెనను భావ మును గురించి ప్రొఫెసరు "టానీ" యను ఇంగ్లీషురచయిత యొక యథ్యాయమును వ్రాసెను. అతడు బ్రిటిషులేబరుపార్టీనిగురించి యుదహరించెను. కాని అతని మాటలు హిందూదేశమునకు మరింత

యెక్కువగ వర్తించును. ఏలనన ఇంగ్లండులో నధమము ప్రజా స్వామిక సంస్థలైనను కలవు. అచ్చట సిద్ధాంతములో అధికసంఖ్యా కుల యిచ్ఛ మన్నింపబడగలదు. ప్రొఫెసరు టానీ యిట్లు వ్రాసెను:

"ఉల్లిపాయలను పొరపొరగా తినవచ్చును. కాని జీవించి యున్న పెద్దపులిని క్రమశః చర్మము నొలుచుట సులభము కాదు. జంతువులను చంపుట దానివృత్తి అది మొదట చర్మము నొలుచునా......"

"హక్కులుగల తరగతులలో నవివేకులున్న దేశమేదైన యున్నచో నది ఇంగ్లీషుదేశముకాదని నిశ్చయముగ చెప్పవచ్చును. ఒక ఆస్తియొక్క క్రియదనావేజులుగల బుద్ధిమంతుడైన లాయరు నా యాస్తినుండి తరిమివేయుటకు జోకరించు ఏంతవ్యర్థమో లేబరుపార్టీ యొక్క హక్కులను కోరుటలో యుక్తి, సరసత, వారిని మోసము చేయగలవని భావించుటయు నంతవ్యర్థము. సరసవర్తనులు, మేధా వులు శక్తివంతులు, ఆత్మవిశ్వాసముకలవారు, దేనికిని వెరువనివారు ధనిక ప్రభుత్వములో నుందురు. వారు తమ రొట్టెకేవైపున నేయి వ్రాయబడినదియు బాగుగ నెరుగుదురు ఆ నేయి తమకుగక్కుండునట్లు వారు చూచుకొనెదరు...వారి యునికికి గట్టిభయము కలిగిన యెడల వారివశములోనున్న ఆర్థిక, రాజకీయ పాచికలన్నింటిని-ప్రభువులసభ, చక్రవర్తి ముద్రణాలయము, సైన్యములో నసంతృప్తి, ద్రవ్యకాట కము, అంతర్జాతీయ కష్టములు (1931లో పౌండు సమస్యమీద వార్తాపత్రికల దాడుల విశదముచేసినట్లు) ఎమిగ్రేయను వానివలె - స్వంతజేబులను రక్షించుకొనుటకు స్వదేశమునకే హానిజేయు యుక్తి కూడ వారుపయోగింతురు.

బ్రిటిషు లేబరుపార్టీ మంచిశక్తిగలసంస్థ. చందాలను చెల్లించు లక్షలకొలది సభ్యులుగల ట్రేడుయూనియనులు, మంచియభివృద్ధిలో నున్న పరపతిసంఘసంస్థలు, వృత్తులలోనున్న తరగతులలోని సభ్యులు, అభిమానులు దానికి గొప్పయండలు వయసువచ్చినవారికి వోటుహక్కుగల ప్రజాస్వామిక పార్లమెంటరీసంస్థలు పౌరసత్వము

లకు సంబంధించిన చిరచరిత్ర బ్రిటనులో కలవు. ఇన్ని సావకాశము లున్నను మందహాసముచేతను బోధనలచేతను లేబరుపార్టీవారు యదార్థాధికారమును సంపాదింపజాలరు అని టానీ చెప్పుచున్నాడు. లేబరుపార్టీవారికి కామన్సుసభలో మెజారిటీయున్నను అది యెట్టి గొప్పమార్పులను చేయజాలదు. రాజకీయ, సాంఘిక, ఆర్థిక, ద్రవ్య సంబంధ, సైనికకోటలెన్నియో తమ వశమువందున్న హక్కులుగల తరగతుల వ్యతిరేకముయుండర నది నిర్వీర్యమగును. హిందూదేశ పరిస్థితులు కేవలము భిన్నములని వేఱుగ చెప్పనక్కరలేదు. ఇచ్చట ప్రజాస్వామిక సంస్థలు సాంప్రదాయములు లేవు. వానికి బదులు మనకు సుస్థాపితమైన ఆర్డినెన్సుల యాచారము, డిక్టేటరు ప్రభుత్వము వ్యక్తి, వాక్కు, సభ, వార్త, ముద్రణాదుల స్వాతంత్ర్యము నణచి వేయుటయిత్యాదులుకలవు. లిబరలుల వెనుకగూడ నెట్టి బలియు మైన కట్టడములేదు. వారు తమ మందహాసములమీాదనే యాధార పడవలెను.

లిబరలులు 'అశాస్త్రీయము' లేక 'న్యాయవిరుద్ధము' నగు నే చర్యకైనను శుద్ధవ్యతిరేకులు. ప్రజాస్వామిక చట్టములుగల దేశము లలో 'చట్టసంబంధమైన' యను పదమునకు విశాలమైన యర్థము కలదు. అది న్యాయములను నియమించును. స్వేచ్ఛలను రక్షించును. అది కార్యనిర్వాహకుల నదుపులోనుంచును అది రాజకీయ, ఆర్థిక నిర్మాణములో మార్పులను చేయుటకు ప్రజాస్వామిక పద్ధతులను కల్పించును. కాని హిందూదేశములో నట్టి చట్టమేదియు లేదు. ఆ పదమున కట్టియర్థములేదు. దాని నిచ్చట నుపయోగించుట హిందూ దేశములో స్థానములేని యొక భావమును ప్రవేశపెట్టుటయగును. 'శాస్త్రీయమైన' యను పద మిచ్చట కార్యనిర్వాహకుల నిరంకుశ చర్యలను ననుసరించుటకే వినియోగింపబడునని చెప్పుట వింతగ నుండును. లేక అది 'లీగల్' అను నర్థములో నుపయోగింపబడును. 'లీగల్' లేక 'ఇల్లీగల్' అను పదములనే మనము వాడుటయుక్తము.

ఒక నూతనలక్ష్మిణెన్సు లేక నూతన "లా" నూతన నేరములను సృష్టించును. ఒక బహిరంగసభకుపోవుట నేరము కావచ్చును. అట్లే సైకిలుమీఁదపోవుట, ఒకరకపుదుస్తులను ధరించుట, సాయంకాలమునకు సరికింటనుండకపోవుట, ప్రతిదినము పోలీసునకు తననుగురించినివేదించు కొనకపోవుట ఇవన్నియు మఱియనేక చర్యలు-నేఁడు హిందూదేశములో నేభాగముననో యొకచోట నేరములగుచున్నవి. ఒక చర్య దేశములో నొకభాగములో నేరముకావచ్చును. మరియొక భాగములో నేరము కాకపోవచ్చును. బాధ్యతలేని ప్రభుత్వము క్షణములో నిట్టి న్యాయములను సృష్టింపగలుగునపుడు 'లీగల్' అనుపదమునకు కార్య నిర్వాహకుల యిచ్ఛయని యర్థము దానికి వేఱుయర్థముండజాలదు. సాధారణముగ ఆ యిచ్ఛకు తలయొగ్గబడుచున్నది. ఏలయనఁ నవిధేయత వలన కలుగుఫలితములు సుఖదాయకములుకావు. కాని దానినెల్లప్పుడు శిరసావహింతుమని చెప్పుట బాధ్యతలేని ప్రభుత్వమునకు, లేక నిరంకుశత్వమునకు తుచ్ఛమైన దాస్యమగును. అది యాత్మను చంపుకొనుట. తన కార్యములపట్ల నిక నెన్నటికి స్వేచ్ఛను సంపాదింపజాలకపోవుట యగును.

తమవశములోనున్న చట్టమును యంత్రములద్వారా మామూలు పద్ధతిలో గొప్పఆర్థిక మార్పులు సాధ్యమగునా? యను వాద మిప్పుడు ప్రతి ప్రజాస్వామిక ప్రభుత్వములో జరుగుచున్నది. ఇది యసాధ్యమని చాలమంది తమయభిప్రాయములను వెల్లడించి యేదోయొక యసామాన్య విప్లవపద్ధతి యవలంబింపబడవలెననిరి. భారతదేశములో మన కీవాదములోనున్న విషయము ప్రధానముకాదు. ఏలనన మనకు కావలసిన మార్పులను తెలిసికొనుటకు మన కెట్టి చట్టసంబంధమైన సాధనములు లేవు. శ్వేతపత్రము యట్టిదే. మఱియొకటి శాసనమైనచో ననేకవిధములగు చట్టసంబంధమైన యభివృద్ధి పూర్తిగానిలిచిపోవును. విప్లవము లేక న్యాయవిరుద్ధకార్యములతప్ప దీనికి వేరుమార్గము లేదు. కనుక మన మేమి చేయవలెను? మార్పుసంగతి యెంతమాత్రము తలపెట్టక మనవిధికి నమస్కరింపవలెనా?

నేడు భారతదేశస్థితి మరింత యసాధారణముగ నున్నది. కార్య నిర్వాహకు లన్ని బహిరంగకృషులను ఆపగలరు. నియమింపగలరు. ఆపుచున్నారు. నియమించుచున్నారు. తమయభిప్రాయములో తమ కుప్రద్రవకరమైన ప్రతిచర్యను వారు నిషేధింతురు. ఈవిధముగ నువ యోగకరమైన ప్రజాహితకృషియంతయు (గతమూడువత్సరములలో వలె) నాపివేయబడగలదు. దీనికి లొంగుటయనగా ప్రజాహితకార్యములన్నింటిని మానుకొనుటయని యర్థము. ఇది యసాధ్యమైనస్థితి. ఎల్లప్పుడు "చట్టము" ప్రకారము నడచెదనని యెవరును చెప్పజాలరు. ప్రజాస్వామిక ప్రభుత్వములోకూడ తద్వ్యతిరేకముగ నుండవలెనని యంతరాత్మచే నిర్బంధింపబడు సమయముగలుగవచ్చును. నిరంకుశముగ లేక యథేచ్ఛగ పరిపాలింపబడు దేశములో నట్టియవకాశములతితరచుగకలుగుట తప్పదు. నిశ్చయముగ నట్టిదేశములో 'న్యాయముకు' నైతిక బలమేమియు నుండజాలదు.

"ప్రత్యక్షకార్యము నిరంకుశత్వమునకు సంబంధించినది కాని, ప్రజాస్వామికమునకు సంబంధించినదికాదు. ప్రజాస్వామికమునకు విజయము చేకూర్చనుత్సహించువారు ప్రత్యక్షకార్యమును వీడవలెను" అని లిబరలులు చెప్పుదురు. ఇది భ్రమజనితము. ఈరచనసందిగ్ధరచన. ఒకొక్కప్పుడు ప్రత్యక్షకార్యము – కూలీలసమ్మె – న్యాయబద్ధము కూడ కావచ్చును. కాని, బహుశః రాజకీయకార్యమని వారి భావము కాబోలును! నేడు జర్మనీలో హిట్లరుహయాముక్రింద నెట్టి విధమగుచర్య సాధ్యమగును? తుచ్ఛమైన విధేయత లేక న్యాయ విరుద్ధమైన విప్లవచర్య అచ్చట ప్రజాస్వామ్యమును సేవించుటెట్లు?

భారతలిబరలులు, తఱచు ప్రజాస్వామికమును స్మరించుచుందురు. కాని, వారిలో చాలమందికి దానిదరికి జేరవలెనను కోరిక లేదు లిబరలు నాయకులలోనతిముఖ్యులలో నొకడైన సర్ పి. యస్. శివస్వామిఅయ్యరు 1934 మే నెలలో నిట్లుచెప్పెను "కాన్‌స్టిట్యూయంటు అసెంబ్లీసమావేశము జరుగవలెనని వాదించుటలో కాంగ్రెసు ప్రజాసమూహ పరిజ్ఞానముమీద నెక్కువ విశ్వాసముంచుచున్నది

వివిధకాంగ్రెసుసభలలో పాత్రవహించిన వారి శక్తిసామర్థ్యములపట్ల నిజాయితీపట్ల న్యాయమును చూపలేదు. కాన్‌స్టిట్యూయంటు అసెంబ్లీ యంతకంటె నెక్కువచేయునని నే ననుకొనను కనుక సర్ శివస్వామిగారి ప్రజాస్వామికభావము 'ప్రజాసమూహముకు దూరవిషయము. అది బ్రిటిషుప్రభుత్వముచే పేర్కొనబడిన 'నిజాయితీ' సమర్థతగల వ్యక్తులగుంపు కెక్కువ సరిపడును. మరియు నతడు శ్వేతపత్రము నాశీర్వదించెను. దానితో "పూర్తిగ తృప్తిపడకపోయినను దేశము దానిని సంపూర్ణముగ తిరస్కరించుట తెలివితక్కువ యని యతడు భావించెను. బ్రిటిషుప్రభుత్వముకు సర్ పి యస్ శివస్వామిఅయ్యరుకు మధ్య సంపూర్ణసహకార మేల యుండకూడదో కారణము కానరాకున్నది.

కాంగ్రెసు శాసనోల్లంఘనమును విరమించెను. లిబరలులు సహజముగ దీని నామోదింతురు. ఈ "వివేకహీనము, దుర్బుద్ధిప్రేరితమగుయుద్యమముకు" దూరముగనుండగల తమ బుద్ధివిశేషమునకు వా రానందించుకొనుట యాశ్చర్యముకాదు. మే మట్లు "చెప్పియుండలేదా" అని వారడిగిరి. అది చిత్రమైనవాదము. మనము తీవ్రపోరాటము సల్పినపుడు పడగొట్టబడితిమి. కనుక పోరాడుటే చెడ్డయట. ప్రాకుట సర్వోత్తమము. భద్రతమమైనది. ఆ సాష్టాంగస్థితినుండి పడగొట్టబడుట, పడుట యసంభవము.

## బ్రిటిషు పరిపాలనా చరిత్ర

భారతదేశములో బ్రిటిషుపరిపాలకుల చరిత్రయెట్టిది? భారతీయుడుగాని, ఆంగ్లేయుడుగాని దీనిగురించి నిష్పక్షపాత దృష్టికలిగియుండుట సాధ్యమని నే ననుకొనను. ఇది సాధ్యమేయైనను ఆధ్యాత్మికాది భావికాంశములను తూచుట కొలుచుట మరింత కష్టసాధ్యమైనది బ్రిటిషుపరిపాలన "భారతదేశము శతాబ్దములుగా నెరుగనిదానిని, ఆ ఖండములో నే భాగమందు తన యధికారమును ప్రశ్నింపని యొక ప్రభుత్వము ప్రసాదించెను" అని మనకు చెప్పుదురు. • అది "చట్ట" సంబంధమైన పరిపాలనను స్థాపించెను. యుక్తము, సమర్థమునగు ప్రభుత్వమును ప్రసాదించెను. అది భారతదేశమునకు పాశ్చాత్య పార్లమెంటరీ ప్రభుత్వమును, వ్యక్తిస్వేచ్ఛను తెచ్చిపెట్టెను. "బ్రిటిషు ఇండియాను యేకైక ప్రభుత్వముగమార్చివేయుటచే నది భారతీయులలో రాజకీయ యైక్యత యనుభావమును కలుగజేసి" యీ విధముగ జాతీయతయొక్క ప్రథమావస్థను దోహదము చేసెను ఇది బ్రిటిషువారి వాదము. "చట్ట" పరిపాలన, వ్యక్తిస్వేచ్ఛ అనునవి చాల ఎత్సరములనుండి కానరాకున్నను యిందులో చాల సత్యము కలదు.

ఈ కాలమునుగురించిన భారతీయులపరిశోధన అనేకయితరాంశములకు ప్రాధాన్యత నిచ్చుచు విదేశప్రభుత్వముకలుగజేసిన భౌతికయాధ్యాత్మి కాపకారంములను సూచించును. ఉభయుల దృష్టులలోను భేదమెంతయోకలదు. బ్రిటిషువారిచే పొగడబడునది యొక్కొక్కపుడు భారతీయులచే గర్హింపబడును. డాక్టరు ఆనందకుమారస్వామి వ్రాయునట్లు "భారతప్రజలపై గావింపబడిన మహాపచార

---

• ఈ యుదాహరణవాక్యములు భారతచట్టముల పంస్కరణములకు(1934) సంబంధించిన జాయింటు పార్లమెంటరీ కమిటీ రిపోర్టులోనివి.

ములో బ్రిటిషువ్యక్తి తప్పుచేసిన యెడల నది వానిదికాని యావద్ధతిది కాదు. కాని, భారతదేశములోని యాంగ్లపరిపాలననుగురించిన విమర్శకగ్రంథములు, అంశములు విప్లవప్రయోజనము కలిగించి, మన జాతీయతకు రాజకీయఆర్థికపునాదులను ప్రసాదించెను. దాదాభాయి నౌరోజీయొక్క 'దారిద్ర్యము, భారతదేశములో బ్రిటిష్‌వ్యతిరేకపరిపాలన', రమేశచంద్రదత్తు, విలియండిగ్బీ తదితరులు-వ్రాసిన పుస్తకములు-మనజాతీయభావాభివృద్ధిలో గొప్పపరివర్తనము కలిగించెను. ప్రాచీనభారతచరిత్రయొక్క మరికొన్ని పరిశోధనలు ప్రాచీనకాలము నాటి జ్ఞానవిజ్ఞాన యుగములను బహిర్గతమొనరించెను వీనిని మనము విశేషాదరముతో చదివితిమి. హిందూదేశబ్రిటిషుచరిత్ర వారి హిస్టరీపుస్తకములలో వ్రాసినదానికంటె భిన్నమైనదను విషయము గూడ మనము కనుగొంటిమి.

బ్రిటిషువారుచెప్పు చారిత్రక, ఆర్థిక పరిపాలక కథలకు మన సహాలు హెచ్చుచుండెను. అయినను మనమింకను వారి యావరణలోనే పనిసాగించుచుంటిమి. శతాబ్దాంతమగుసరికి భారతజాతీయత యీ స్థితిలో నుండెను.

పందొమ్మిదవ శతాబ్ది భారతవిద్యాధికులు బ్రిటిషు తత్త్వమునకు విధేయులగుటలో నాశ్చర్యములేదు ఇరువదియవ శతాబ్దములో జరిగిన కల్లోలానంతరముకూడ కొంతమంది యీ భ్రమచే బాధపడుచుండుట యాశ్చర్యము. పందొమ్మిదవ శతాబ్దములో బ్రిటిషుపాలకజాతు లైశ్వర్య, విజయాధికారములతో నెగడిప్రపంచనిరంకుశులైరి. ఈచిరచరిత్ర, శిక్ష, నిరంకుశత్వములోని కొన్ని గుణావగుణములను వారికిప్రసాదించెను. గత నూటడెబ్బదియైదుసంవత్సరములలోనున్నత స్థితికి రాగలుగుటకు తగిన సాధనములను, శిక్షణను మనకు సంపూర్ణముగ ప్రసాదించితిమని వారు సంతోషించుకొనవచ్చును. వారు-అనేక దేశములు, జాతులు తలంచినట్లు భగవంతుని పెద్దకొడుకులమని తమసామ్రాజ్యము భూతలస్వర్గమని భావించనారంభించిరి. వారి ప్రత్యేకస్థితి గుర్తింపబడి, వారి యాధిక్యత శంకింపబడకుండిన యెడల,

వారి శిహకారము జరుగనంతవరకు, వారుదారులు, నష్టములు. కాని వారి నెదిరించుటయున వారిదృష్టిలో దివ్యక్రమము నెదిరించుటయే! కనుక నది మహాపాపము: దానిని పాతిపెట్టవలెను.

తదితర ప్రపంచమునుగురించికూడ బ్రిటిషువారి సామాన్య దృష్టి యిదియేయైనపుడు హిందూదేశములో నిది మరింత ప్రస్ఫుటించెను. బ్రిటిష్‌వారు హిందూదేశ సమస్యను వీక్షించు దృష్టిలో మోహా మేదియో కలదు. సదా ధర్మపథముననే యుందుమను చల్లని యాభయము. మహాభారమును న్యాయముగ వహించితిమనుమాటలు తమజాతి ధర్మమునందు తమ సామ్రాజముద్రయందు విశ్వాసము. తమ విశ్వాసపునాదులను సవాలుచేసిన యవిశ్వాసకులయెడల, పాపుల యెడల ద్వేష, క్రోధముగల దృష్టిలో మత స్వభావమేదియో యుండెను. పాపులను రక్షించిన వెనుకటి "ఇంక్విజిటరు"ల వలె మనకోరిక లేకుండగనె వారు మనలను రక్షింప బూనుకొనిరి. ఈ పాపరక్షణ పుణ్యావర్తకములో వారయాచిత లాభములను పొందిరి. దేశమును సామ్రాజ్యప్రణాళికకు సరిపడునట్లు నడుపుట బ్రిటిషు ముద్రప్రకారము కొంతమంది పురుషులను తయారుచేయుట భారతాభివృద్ధియని పిలువబడెను. మనము బ్రిటిషు లక్ష్యములను, భావములను యెంతయెక్కువగ నంగీకరించిన నంతయెక్కువగ "స్వయప్రభుత్వము"నకు తగియుందుము స్వేచ్ఛను బ్రిటిషువారికోరికల ప్రకారమే యుపయోగించెదమని ప్రదర్శించి యట్లు భీమాయిచ్చిన వెంటనే స్వేచ్ఛ మనదియగును: మనకీయబడును.

భారతదేశ బ్రిటిషు పరిపాలన చరిత్రనుగురించి భారతీయులకు నాంగ్లేయులకు భేదాభిప్రాయములుండును. అది బహుశః సహజము. కాని యున్నతి ప్రభుత్వాధికారులు: భారత దేశం సెక్రటరీలుసహా, విపరీతచిత్రములను చిత్రించి యదార్థములమీద నాధారపడిన స్టేటుమెంటులను చేయుచుండుట చోద్యము. కొంతమంది నిపుణులు, యితరులుతప్ప యింగ్లీషుప్రజలు భారతదేశము నావంతయు నెరుగకపోవుట యసాధారణవిషయము. సామాన్యవిషయములే వారికి మర

గైనయెడల భారతాత్మ వారికెంతదూరములో నుండునో వేరుగ చెప్పవలెనా? వా రామె శరీరమును తమ యధీనములో నుంచుకొనిరి. కాని యది బలాత్కారకర్మ. వా రామెను తెలిసికొనలేరు. తెలిసికొనుటకు ప్రయత్నించలేదు. వా రెన్నడు నామె కండ్లకేసి చూడలేదు. ఏలనన వారికండ్లు విముఖముగనుండెను. అవమానము చేత, సిగ్గుచేత నామెకండ్లు అవనతములయ్యెను. శతాబ్దముల సంపర్కానంతరము వారు పరస్పర ద్వేషపూరిత దృక్కులతో నొకరినొకరు చూచుకొనెదరు.

భారతదేశము గర్భదారిద్ర్యముచేత నవమానముచేత కుంగుచున్నను ఆమెలో నొకవింతయగు భారత, యుత్కృష్టకళలు ప్రాచీన సాంప్రదాయములు, ప్రస్తుత దుఃఖములు నామె కొంతభారముగ నున్నను, కనురెప్ప లలరుటచే నెంత మూతలుపడుచున్నను ఆమెలో "క్రొత్తభావములచేతను, వింతకళలచేతను, మనోజ్ఞ రాగములచేతను అంతరంగమునుండి శరీరోపరిభాగమునకు ప్రస్ఫుటించు శోభకలను." భిన్నాభిన్నమైన యామె శరీరబాహ్యాంతరములలో నుపమింపను నొక మాతాత్మాభిమానము చూడగలము. ఆమె యనేక యుగ ప్రస్థానములగావించి, పరిజ్ఞానమును సంపాదించెను. విదేశస్థులతో వర్తకము చేసి వారిని తన విశాలకుటుంబములో కలుపుకొనెను. మహాదైశ్వర్యము, దౌర్భాగ్యము ననుభవించెను అవమానములను, భయంకర దుఃఖములను భరించెను అనేక వింతదృశ్యములను చవిచూచెను. కాని ఈ మహాప్రస్థానమంతట తన యనాది విజ్ఞానము నాశ్లేషించి యుండెను. దానినుండి శక్తిని, వీర్యమును లాగుకొని దాని నితరదేశములకు యథేచ్ఛగ పంచిపెట్టెను. తూగుటుయ్యాలవలె నామె నిమ్నోన్నతములలో నూగెను. తపవిశేష భావనాశక్తి సాహసములచే స్వర్గమునుచేరి, దాని రహస్యములను బయటపెట్ట సాహసించెను; నరకకూపముయొక్క యసహ్యానుభవములనుకూడ నామె యనుభవించెను. దుఃఖప్రదములగు పిచ్చి నమ్మకములు, కృంగదీయు దురాచారములుపెరిగి యామెను కూల్చద్రోసినను ధార్మికత భాస్కరోదయ

మగునాడు మహా మేధావులగు తన ముద్దుబిడ్డ లుపనిషత్తులతో ప్రసా దించిన ప్రబోధము నామె యెన్నడు పూర్తిగ విస్మరించియుండలేదు. ఎన్నడును విశ్రాంతినెరుగక సెల్లప్పుడు యత్నించుచు, పరిశోధించు చుండు నిశితములగు వారి మనస్సులు శుష్కశిద్ధాంతముల వెనుక శరణుపొందలేదు. జీవరహితములగురూపములను, కర్మకాండాదులను నిత్యానుష్టానము చేయుటయందు వారు తృప్తులు కాలేదు వారు వర్తమాన దుఃఖములనుండివ్యక్తిగత శాంతి కోరలేదు. రాబోవు స్వర్గములో స్థానమును కోరలేదు. వారుతేజస్సును, జ్ఞానమునుకోరిరి "అసత్తునుండి నన్ను సత్తునకు గొంపొమ్ము; అంధకారమునుండి వెలుతురునకు గొంపొమ్ము; మృత్యువునుండి నన్ను యమరత్వమునకు గొంపొమ్ము" + నేడుకూడ లక్షలకొలది ప్రజలచే నిత్యము జపింప బడు "గాయత్రి మంత్రములో "జ్ఞానము" "వెలుతురు" ఆహ్వానింప బడుచున్నవి.

రాజకీయముగ తఱచు విచ్ఛిన్నమగుచున్నను భారతాత్మ ఎల్లపుడు నొక సామాన్య పైతృకధనమును సంరక్షించుచుండెను. ఆమెయొక్క భిన్నత్వములో నద్భుతమగుయేకత్వముండెడిది ప్రాచీన దేశములన్నిటిలోవలెనే యిచ్చటను మంచిచెడ్డలు రెండును కలవు. కాని మంచి కప్పివేయబడుటచే దాని కొఱకు వెతకవలసియుండెను. చెడ్డవాసనకు దాపరికములేదు నిర్దయాత్ముడగు భారత చండభాస్క రుడు దానిని బహిర్గత మొనర్చుచుండెను.

హిందూదేశమునకు యిటలీకి కొంత పోలికగలదు. రెండును చిర విజ్ఞాన సాంప్రదాయముగల ప్రాచీనదేశములు. హిందూదేశ ముతో పోల్చినపుడు ఇటలీ నవీనమైనది హిందూదేశము దానికంటె నతి విశాలమైనది రాజకీయముగ రెండును ముక్కలక్రిందచీల్చబడెను. అయినను హిందూదేశములోవలెనే ఇటాలియా యను భావమెన్నడు నశించిపోలేదు. ఆ భిన్నత్వములో నేకత్వము ప్రధానముగ నుండెడిది. ఇటలీలోని యేకత్వము చాలవరకు రోమునగరమునకుసంబంధించినది.

+ బృహదారణ్యకోపనిషత్తు 1, 3, 27.

ఆ మహాపట్టణము దేశమునంతను పాలించెను. అది ఏకత్వమునకు మూలము, చిహ్నమునైయుండెను కాశీ హిందూదేశమునకే గాక ప్రాచ్య ఆసియాకుకూడ ప్రాచ్య అమరనగరమని పిలువబడినది. హిందూదేశములో నట్టి యేకైక కేంద్ర మేదియును లేదు. రాజ సామ్రాజ్యములో గాని భాతికాధికార స్థాపనలో గాని యెన్నడు ఐక్యము కలిగించుకొనలేదు. భారత విజ్ఞానము భారతదేశమంతట విరివిగ వెదజల్లబడుటచే దేశములో నేభాగమునుఅవిజ్ఞాన కేంద్రమని చెప్పుటకు వీలులేదు. కన్యాకుమారి మొదలు హిమాలయములలోని అమర్ నాథ్ బదరీనాథ్‌లవరకు, ద్వారకావతి మొదలు జగన్నాధము వరకు నాకేభావములు ప్రవహించెను. ఒకచోట భావసంఘర్షణ కలిగినచో దానిధ్వని దేశములోనున్న మూలమూలకు చేరెడిది.

ఇటలీ పశ్చిమయూరపు ఖండమునకు మత విజ్ఞానములను ప్రసాదించినట్లే భారతదేశము ప్రాచ్యఆసియాకు ప్రసాదించెను. రాజకీయముగ ఇటలీ సాగలబడి యున్నప్పుడుకూడ నామె జీవితము యూరపునాళములగుండ ప్రవహించుచుండెను.

మెటర్నిక్ అనునతడు ఇటలీని "భూగోళములో నొక ప్రత్యేక భాగము" అని వచించెను. మెటర్నికులు కాబోవువారు చాలమంది యీపదమును భారతదేశమునకు గూడ నుపయోగించిరి. చిత్రముగ భూగోళస్థితినిబట్టికూడ రెండు ఖండములలోను వాటిస్థితిలో పోలిక కలదు. ఇంగ్లండును ఆస్ట్రియాతో పోల్చుట గమనింపదగిన విషయము. ఏలనన నిరువదియవశతాబ్దములోనున్న యింగ్లండు పందొమ్మిదవ శతాబ్దమునాటి ఆస్ట్రియాతో పోల్చబడెను. ఆస్ట్రియా యప్పుడింకను గర్వము పొగరుబోతుతనము గొప్పతనములతో విరవీగుచుండెను; కాని దానికి శక్తినప్రసాదించిన వేళ్ళు నశించుచుచుండెను. వినాశము ఆ మహావృక్షమును దొలుచుచుండెను.

తన దేశమును మానవరూపములో వర్ణించు స్వభావము నాత్మకొనజాలకుండుట చిత్రము బాల్యసంబంధములు, ఆచారబలము చాలగట్టివి. భారతదేశము "భారతమాత" అందమైనస్త్రీ; అతివృద్ధ

కాలైనను, ఆకారములో నెప్పుడు యౌవనవంతురాలు, విచారభరితనేత్ర. అసహాయురాలు. విద్దేశస్తులచేత, పరాయివారిచేత క్రూరముగ చూడబడుచు తనను రక్షింపరమ్మని తల్లి బిడ్డల నాక్రోశించుచున్నది. ఇట్టి చిత్రములక్షలకొలది జనులయుద్రేకములను రగుల్కొలిపి వారిని కార్యోత్సాహులను, త్యాగులనుచేయును. అయినను భారతదేశము ప్రధానముగ బక్కపేగులు, బీదరయితు, బిక్కమొగములు, కూలిజనము, చూచుటకందచందములు లేనివారు. ఏలనన దారిద్ర్యములో నందములేదు. మనము కలలనుగను యందమైన స్త్రీ, కట్టగుడ్డలేక తిన తిండిలేక నడుములు వంగిపోయి పొలములలోను, ఫ్యాక్టరీలలోను పని చేయువారి ప్రతినిధియేనా ? లేక యుగముల నుండి ప్రజలను నలపి, వారిని కొల్లగొని వారిపై క్రూరమగు నాచారములను రుద్ది వారిలోచాలమంది నస్పృశ్యులను చేసిన స్వల్పవర్గము వారి ప్రతినిధియా? మనము మన యూహలచే సృష్టింపబడిన వానితో సత్యమును కప్పివేయయత్నించి దానినుండియూహాప్రపంచమునకు పారిపోవ జూతుము.

వివిధతరగతులు, పరస్పర పోరాటములు నున్నను భారతదేశములో వీరి నందరిని నైక్యముచేసిన సామాన్యబంధ మొకటి యుండెను. దానిజిగి, పట్టుదల, దేనికైనను నిలువగలశక్తి యాశ్చర్యము ఈశక్తికి కారణమేమి? ఇది కేవలము జడత్వ సాంప్రదాయముల యుదాసీనతవలన కలుగు శక్తిసామర్థ్యమా ? ఇదియొక క్రియారూపముగల, రక్షణశక్తిగల సూత్రము. ఇది బలీయమైన బాహ్యశక్తులను జయప్రదముగ నెదిర్చెను. దాని నెదిర్కొన బయలుదేరిన దేశములోని శక్తులను తనలో నిముడ్చుకొనెను. ఎంతశక్తికలదియైనను యిది రాజకీయ స్వాతంత్రమును కాపాడజాలకపోయెను. రాజకీయ మైక్యతను సాధింప యత్నింపజాలకపోయెను. ఈ రెండును కష్టింపదగినంత యోగ్యములుగావని తలంపబడెను; వీని ప్రాముఖ్యత యత్యావివేకముగ నిర్లక్ష్యముచేయబడెను. దీనికే మనము బాధపడితిమి. చరిత్రయందంతట ప్రాచీనభారతలక్ష్యము రాజకీయ, సైనిక

విజయమును కీర్తింపలేదు; అది ద్రవ్యమును, ధనార్జన వృత్తులలోని వారిని నీచముగ చూచెను. ఐశ్వర్యము గౌరవము దాంపత్యము వహింపలేదు! సంఘమునకు ద్రవ్యరూపములో సేవచేసినవారికి గౌరవము కలదనిరి.

ప్రాచీన విజ్ఞాన మనేక భయంకర ఝంఝామారుతములను, తుపానులను దాటగలిగెను. కాని యది దాని బాహ్యరూపమును సంరక్షించుకొనినను దాని నిజసారము కోల్పోయెను. నేడది మరి యొక సర్వశక్తివంతమైన నూతనశత్రువును పాశ్చాత్య 'బలిమా' విజ్ఞానమును మహానముగను, నిస్పృహతోను పోరుచున్నది. అదియా నూతనదాడికిలోంగిపోవును ఏలనన పాశ్చాత్యవిజ్ఞానమును శాస్త్రి మును తెచ్చును. శాస్త్రివన్నాతమమైన లక్షల కాహారమునిచ్చును కాని పశ్చిమదేశములు యీ గొంతుకను పిసుకువిజ్ఞానములోనున్న దోషముల కొక చింతామణిని గూడ—సామ్యవాదసూత్రములు, పర పతి సూత్రములు అందరిశ్రేయస్సుకొరకు సంఘసేవచేయుట—ప్రసా దించును ఇది ప్రాచీన బ్రాహ్మణసేవాలక్ష్యమున కంతదూరము కాదు. కాని యిది అన్నితరగతులను. వర్గములను బ్రాహ్మణులను జేసి తరగతులలోని భేదములను రద్దుచేయును. భారతదేశము తన నూతన దుస్తులను ధరించినపు డీ మాదిరిలో తయారుచేయించుకొన వలసియుండును. ఇది ప్రస్తుతపరిస్థితులకు నామె ప్రాచీన భావమునకు సరిపోవును. ఈమె స్వీకరించు భావము లా దేశగంధమును కలిగి యుండవలెను

# భారతము - ప్రాచీనము, నవీనము

భారతజాతీయత పరప్రభుత్వమునొల్లకపోవుట సహజము. విధాయకము. అయినను పందొమ్మిదవ శతాబ్దాంతమువరకు మన విద్యాధికులలో నధిక సంఖ్యాకులు బ్రిటిషుసామ్రాజ్యలక్ష్యమును బుద్ధిపూర్వకముగ లేక నబుద్ధిపూర్వకముగ నంగీకరించుట చోద్యము. దీనిమీద వారు తమస్వంతవాదనలను నిర్మించుకొని దానిబాహ్య చిహ్నములను మాత్రమే విమర్శింపసాహసించెడివారు. పాఠశాలలలోను, కళాశాలలలోను బోధింపబడెడిచరిత్ర, అర్థికశాస్త్రము, తదితరవిషయములు_అన్నియు పూర్తిగ బ్రిటిషుసామ్రాజ్యదృష్టితోనే వ్రాయబడెను. అవి మనయనేకభూత, వర్తమానదోషములను బ్రిటిషు వారిసుగుణములను, ఉత్కృష్టతను చాటుచుండెను. కొంతవరకు మన మీయవకతవక కథనమును స్వీకరించితిమి. మనము సహజముగ దానిని తిరస్కరించినపుడుగూడ మనపై దానికెక్కువ పలుకుబడి యుండెడిది మొట్టమొదట మనము దానినుండి మానసికముగ తప్పించుకొనలేకపోతిమి. ఏలనన మనకితరవిషయములు, వాదనలు తెలియవు కనుక మనము మతసంబంధమైన జాతీయతయందు శరణు జొచ్చితిమి. అధమము మనవేదాంతములలో మనమే యితరప్రజలకు తీసిపోవువారము కామను భావమునందు శరణుజొచ్చితిమి. పాశ్చాత్యుల బాహ్యాడంబరములు, తళుకుబెళుకులు మనకులేకపోయినను అంతకంటె నమూల్యము, యోగ్యము నగు నాంతరంగిక తత్వమును కలిగియున్నారమని మనదౌర్భాగ్యమందు, అధఃపతనమందు ఓదార్పు పొందెడివారము.

మన భూతవర్తమాన పరిస్థితులనుగురించి బ్రిటిషువారుచేసిన స్టేటుమెంటులను క్రమముగ సందేహింపనారంభించితిమి. కాని మన మింకను బ్రిటిషుతత్త్వమను పంజరమునుండియే భావించుచు పనిచేసితిమి చెడ్డయంతయు 'బ్రిటిషేతరము' అనెడివారము. హిందూదేశ

నుల కాశీర్వచనములవంటి బాహ్యాకారములుండుట భారతదేశ బ్రిటిషువరిపాలనయొక్క ప్రధానలక్షణము ”

యథార్థమునకు భారతదేశములో గత నూటయేబది వత్సరములనుండి జరుగుచుండినమార్పులు ప్రాచ్యపాశ్చాత్యములలో సమానముగ జరిగిన ప్రపంచమార్పులు. పశ్చిమ యూరపులోను, ప్రపంచమంతట నభివృద్ధియైన 'ఇండస్ట్రియలిజము' యంత్రాభివృద్ధి దానితో జాతీయతను, శక్తిగల కేంద్రప్రభుత్వపద్ధతిని సర్వత్ర తెచ్చి పెట్టెను. బ్రిటిషువారు భారత కవాటమును పశ్చిమాభిముఖముగ తెరచి యూరొపు పాశ్చాత్య యంత్రములను, శాస్త్రమును ప్రసాదించినందుల కభివందనీయులు. కాని వారట్లుచేసి దేశపారిశ్రామిక పురోభివృద్ధిని నులిమివేసిరి. భారతదేశ మిదివరకే పశ్చిమాసియా విజ్ఞానమైన యిస్లాముయొక్కయు, ప్రాచ్యమునకంతకు వ్యాపించిన ప్రాచ్యవిజ్ఞానముయొక్కయు సంగమస్థానమయ్యెను. ఇప్పుడింకను పశ్చిమమునుండి మరింత శక్తివంతమైన మూడవ వచ్చెను. భారత దేశము వివిధ ప్రాచీన నవీనభావముల సమరరంగము, కేంద్రస్థానము, ఈ మూడవశక్తిజయించి భారతదేశ ప్రాచీనసమస్యలను పరిష్కరించి యుండెడిదనుటను సందేహములేదు. కాని దీనిని తెచ్చుటకు తమంత తామే సహాయపడిన బ్రిటిషువారు దీనిపురోభివృద్ధినరికట్టయత్నించిరి వారు మనపారిశ్రామికాభివృద్ధి నరికట్టి తద్వారా రాజకీయాభివృద్ధి నాలస్యముచేసిరి. దేశములోవారు ఫ్యూడల్ ప్రభుత్వములను, ఇతర శిథిలసంస్థలను కాపాడిరి మార్పుచెందుచు, కొంతవర కభి వృద్ధిచెందుచున్న చట్టములను, ఆచారములను వారువచ్చినప్పుడున్న స్థితిలో గడ్డకట్టుకొనిపోవునట్లుకూడ చేసి యీ సంకెలనుండి తప్పించుకొనుట కష్టసాధ్యముచేసిరి. భారతదేశ బూర్జువాలు వారి యాశీర్వాదముచేత, సహాయముచేత పెరిగినవారు కారు. రైల్వేలను యితర పారిశ్రామికోత్పత్తులను ప్రవేశపెట్టినతరువాత పరివర్తనచక్రమును వారాపజాలకపోయిరి. వారు దాని నడ్డగించి, దానిగతిని మాంద్యపరచగలిగిరి. దీనిని వారు స్పష్టముగ తమ లాభముకొరకే చేసిరి.

"ఈగట్టిపునాదిమీద మహోత్కృష్ట భారతప్రభుత్వసౌధము నిలిచియున్నది. ఈస్టుయిండియాకంపెనీయధీనములో నున్న రాష్ట్రము లన్నింటిని చక్రవర్తి యధీనములోనికి తీసుకొనిన తరువాత, 1858 లగాయతు, భారతదేశముపొందిన యైశ్వర్య, విద్యాభివృద్ధులు మున్నెన్నడు తన చరిత్రలో నేయుగములోను కనివినియెరిగిన వాని కంటె గొప్పవియని నిస్సందేహముగ చాటవచ్చును."* ఈ స్టేటు మెంటులో పైకికాన్పించునంతట యదార్థములేదు. బ్రిటిషుప్రభుత్వము వచ్చుటతోడనే విద్య యదార్థముగ తగ్గిపోయెనని తరచు చెప్పబడుచుండెను. కాని యీ స్టేటుమెంటు సంపూర్ణముగ యథార్థమైయైనను యిది యాధునిక పారిశ్రామికయుగమును పాతయుగములతో పోల్చినట్లగును. ప్రపంచములో ప్రతిదేశములోను గతశతాబ్దమున, శాస్త్రము, యంత్రాభివృద్ధి, యైశ్వర్య విద్యాభివృద్ధులు అద్భుతముగనుండెను. ఇట్లే దేశమును గురించియైన నిట్టి యభివృద్ధి "మున్నెన్నడు తన చరిత్రలో నేయుగములోను కని విని యెరిగిన దానికంటె గొప్పదియని నిస్సందేహముగ చాటవచ్చును.'

బహుశః ఆదేశచరిత్ర హిందూదేశ చరిత్రయంతటి పురాతనమైనది కాకపోవచ్చును. ఇట్టి సాంకేతికాభివృద్ధి యీ పారిశ్రామిక యుగములో మన కేవిధముగ నైనను, బ్రిటిషు ప్రభుత్వము లేకపోయినను అబ్బియుండెడిదనిసూచించు టతిశయోక్తికాదు. నిశ్చయముగ మనము మనస్థితి ననేక యితరదేశములతో పోల్చిచూచినచో మనకింతకంటె నెక్కువయభివృద్ధియే చేకూరియుండెడిదని యూహించుట దోషము కానేరదు. బ్రిటిషువారే యీయభివృద్ధిని నులిమివేయుటచే మనము పోరవలసివచ్చెను. రైల్వేలు. టెలిగ్రాఫులు, టెలిఫోనులు, వైర్లెసు యిత్యాదులు బ్రిటిషుప్రభుత్వముయొక్క మంచితనమునకు, యుదారతకు పరీక్షలు కాజాలవు. అవి యవసరములు, ఆహ్వానింపదగినవి. వానిని మొట్టమొదట మనకు తీసుకొనివచ్చిన యేజెంటులు బ్రిటిషు వారు కనుక మనము వారికి కృతజ్ఞులము. కాని యీ పారిశ్రామిక

* జాయింటు పార్లమెంటు కమిటీ రిపోర్టు (1934)

నాందీ ప్రవేశముకూడ ముఖ్యముగ బ్రిటిషుప్రభుత్వమును బలపరచుటకే జరిగెను పైవి జాతియొక్క రక్తనాళములు. వానిగుండ జాతీయరక్తము ప్రవహించి, దానివర్తకము నభివృద్ధిపరచి, యుత్పత్తులను తీసికొనిపోవుచు, దానిలక్షలకొలది ప్రజల కైశ్వర్యమును, నూతనోత్తేజమును ప్రసాదింపవలసియుండెను చివరకట్టి ఫలితము చేకూరుననుట సత్యము. కాని యవి మరియొక ప్రయోజనము కొరకు — బ్రిటిషువస్తు పుణ్యస్థలముల కొరకు, సామ్రాజ్యాధికారమును బలపరచుకొనుటకు నుద్దేశింపబడి యందుకే పనిచేసెను. పరిశ్రమమయము చేయుటకు, నవీన ప్రయాణసౌకర్యములకు నేనెంతయో సుముఖుడను, కాని నేను భారతమైదానములగుండపోయినపుడొక్కొక్కప్పుడును, రైల్వే—ప్రాణమునిచ్చునది—హిందూదేశమును బంధించి, ఖయిదుచేయు యినుపబంధనముగ నాకు తోచుచుండెను.

ప్రభుత్వము పోలీసుపని చేయవలెనను భావమే బ్రిటిషువారికుండెను. ప్రభుత్వమును రక్షించుటయే పాలకులపని. తక్కినదానినితరులు చేసుకొనవలెను. వారి 'పబ్లికు ఫైనాన్సు' సైనికవ్యయము, పోలీసు, సివిలుపరిపాలన, ఋణములమీదవడ్డీ — మీవిషయములకే సంబంధించును పౌరుల యార్థికావసరములు బ్రిటిషు ప్రయోజనములకు బలిచేయబడెను. ప్రజలయొక్క విజ్ఞానాదియవసరములు పూర్తిగ నిర్లక్ష్యముచేయబడెను. పబ్లికు ఫైనాన్సు, యితరదేశములలో నందరకు నుచితవిద్య, ప్రజల 'యారోగ్యాభివృద్ధి, బీదలయొక్కయు, దుర్బల మనస్కులయొక్కయు జాగ్రత, వ్యాధి, వృద్ధాప్యము, నిరుద్యోగము మొదలగువానినుండి పనిచేయువారలను రక్షించు భీమా—యన్నింటిని ప్రసాదించెను. ఇవి యిచ్చట ప్రభుత్వబుద్ధికి కేవల మగ్రాహ్యములు. ఇది ధనవ్యయమగు యీకార్యములలో జోక్యము కల్పించుకొనజాలకపోయెను. ఏలనన దానిపన్నుల పద్ధతిలో నభివృద్ధి లేదు. అది పెద్దరాబడులమీదకంటె తక్కువ రాబడులమీద నెక్కువ మొత్తములను వసూలుచేయును. దానిసంరక్షణ ఖర్చులు,

పరిపాలనఖర్చులు విపరీతముగనుండి యాదాయమును చాలవరకు మ్రింగివేసెను.

తమ రాజకీయ ఆర్థికాధికారమును బలపరచు ప్రతిదానినీమీద కేంద్రీకరించుటే బ్రిటిషుపరిపాలన ప్రధానలక్షణము. తక్కినదంతయు నసంగతము. వారు శక్తివంతమగు కేంద్రప్రభుత్వమును, సమర్థతగల పోలీసుదళమును సృష్టించినందులకు తమ విజయమునకు తామే మెచ్చుకొనవలెను. కాని భారతప్రజలు దానికి తమ్ము తా మభినందించుకొనజాలరు. ఐక్యము శుభ్రమైనదే. కాని దాస్యములోని యైక్యము గర్వింపదగినదికాదు. ఒక నిరంకుశ ప్రభుత్వముయొక్క బలమే ప్రజల కెక్కువభారము కావచ్చును. అనేక విధముల నుపయోగకారియగు పోలీసుదళము తాను రక్షించుట కుద్దేశింపబడిన ప్రజలకు వ్యతిరేకముగ నుపయోగింపబడవచ్చును. అది యట్లే చేయబడెను. ఆధునిక నాగరికతను ప్రాచీనగ్రీసుదేశపు నాగరికతతో పోల్చుచు బెర్ట్రండు రస్సెలు "మనదానితో పోల్చిన గ్రీసుదేశపు నాగరికతలోగల యాధిక్యత యేదియన పోలీసుల యసమర్థత. ఇది చాలమంది సత్పురుషులు తప్పించుకొనుట కవకాశమిచ్చెను." అని వ్రాసెను

భారతదేశములో బ్రిటిషువారి యాధిక్యత మనకు శాంతి నిచ్చెను. మొగలుసామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత సంభవించిన కష్టములు, దురదృష్టములు గతించినవెనుక భారతదేశము శాంతిని గోరుచుండెను శాంతి యెట్టి యభివృద్ధికైనను నవసరము, యమూల్యము, అది సంభవించినపుడు దాని నాహ్వానము చేతుము. కాని శాంతినికూడ మనము భరింపరాని వెలకు కొనగలము. మనము శ్మశానశాంతిని పొందవచ్చును. పంజరము లేక ఖయిదు యిచ్చు సంపూర్ణభద్రత ననుభవింపవచ్చును. లేక శాంతి తమ బాగు కొరకు మర్థులైనవారి వైరినిస్పృహ గావచ్చును. విదేశవిజేతలచే బలత్కారముగ నొసంగబడు శాంతి కందులోనుండవలసిన సుఖవిశ్రాంతులను కలుగజేయు సుగుణములుండవు. యుద్ధము భయంకరమైనది. మాన

తగినది. కాని; యది కొన్ని సుగుణములను ప్రోత్సహించును. అవి మనస్తత్వవేదియగు విలియం జేమ్సు ప్రకారము, విశ్వాసము, పట్టుదల, కలయిక, శౌర్యము, తెలివి, విద్య, క్రొత్తవస్తువులను కనిపెట్టు బుద్ధి, పొదుపు, శరీరబలము, చురుకుదనము ఈ కారణములచే జేమ్సు యుద్ధమువలన కలుగు బీభత్సమువినా జాతికి గుణములు ప్రసాదింపగల నైతికసామ్యమునకొరకు యత్నించెను. అసహాయోద్యమమును గురించియు, శాసనోల్లంఘనమునుగురించియు నతడు వినియుండినచో బహుశః యతని యభీష్టసిద్ధి నెరవేరెడిది.

చరిత్రలో 'అయితే' 'ఏమిజరిగెడిదో' యనుచర్చ వ్యర్థ ప్రసంగము. శాస్త్ర, పారిశ్రామిక; పశ్చిమప్రపంచసంబంధము భారతదేశమునకు కళ్యాణకరమనియే నేను భావించెదను. శాస్త్రము పాశ్చాత్యులు మనకిచ్చిన గొప్పవరము. భారతదేశమునకిది కొఱతయయ్యెను. ఇది లేనిచో నది నశింపక తప్పదు. మన సంబంధముల పద్ధతి దురదృష్టమైనది. అయినను, బహుశః యీ సంఘాత పరంపరలు మాత్రమే మనలను కుంభకర్ణనిద్రనుండి మేల్కొల్పగలిగెను. ఈదృష్టితో చూచిన ప్రొటెస్టెంటులు, 'యెవరికివారే' యనువారు, ఆంగ్లోసాగ్జనులువగు ఇంగ్లీషువారు దీనికర్హులు. ఇతర పాశ్చాత్యులందరికంటె వీరికి మనకు నెక్కువ భేదములు కలవు. కనుక మన కెక్కువ గొప్పదెబ్బలను వడ్డించగలరు.

వారు మనకు రాజకీయయైక్యతనిచ్చిరి. అదియవసరమె కాని, మనకీయైక్యత యున్నను లేకపోయినను భారతజాతీయత యభివృద్ధి చెంది దానిని కోరియుండెడిది. నేడు అరబ్బులోక మనేక ప్రత్యేక ప్రభుత్వముల క్రింద స్వతంత్రములు, రక్షింపబడునవి, మాండేటరీలు మొదలగునవిగ చీల్చబడినది. కాని యరబ్బైక్యము కావలెనని యవన్నియు కోరుచున్నవి. పాశ్చాత్య సామ్రాజ్యాధికారము లడ్డము రానియెడల అరబ్బుజాతీయత యీ యైక్యతను చాలవరకు సాధించి యుండెడిదనుట కెట్టిసందేహము లేదు. కాని హిందూదేశములోవలెనే భేదభావములను ప్రోత్సహించి మైనారిటీసమస్యలను సృష్టించుట యీ

యధికారములవనియై యున్నది. ఈ సమస్యలు జాతీయ ప్రేరణను దుర్బలపరచి కొంతవరకు దానిశక్తిని ప్రతిఘటించును. సామ్రాజ్యాధికారము నిలిచియుండుటకు, నిష్పక్షపాత మధ్యస్థునివలె నటించుటకు నిది యొకసాకు.

భారతరాజకీయ మైక్యత సామ్రాజ్యాభివృద్ధిలో కొసరు భాగము. తరువాత వత్సరములలో భేదములను, కులసమస్యలను బుద్ధిపూర్వకముగ హెచ్చరించుట మనము కండ్లార చూచియుంటిమి. అవి మన భవిష్యదభివృద్ధికి ప్రబల శత్రువులు.

బ్రిటిషువారిచ్చటకువచ్చి చిరకాలమైనది! వారధికారమునకు వచ్చినతరువాత నూటడెబ్బది సంవత్సరములు గతించెను. నిరంకుశ ప్రభుత్వములన్నింటికి వలెనే వారికి సర్వస్వేచ్ఛయుండెను వారి కోరికల ననుసరించి భారతదేశమును తయారుచేయుట కసమానమైన యవకాశము చిక్కెను ఈ సంవత్సరములలో ప్రపంచమంతయు, ఇంగ్లండు, అమెరికా, యూరపు, జపాను-గుర్తించుటకు వీలులేనట్లు మారిపోయెను. 18వ శతాబ్దములో అట్లాంటికు నంటిపెట్టుకొని యుండిన నామరూపములులేని అమెరికను కాలనీలు నేడు ప్రపంచములో సమానవైభవము, నత్యంతశక్తి, శాస్త్రములో విశేషాభివృద్ధిగల జాతియయ్యెను. జపాను త్రుటికాలములో నద్భుతమగు మార్పులను పొందెను. నిన్నమొన్నటివరకు నిర్జీవమైన జారుప్రభుత్వహస్తముచే నభివృద్ధియంతయు నణచివేయబడి, నులిమివేయబడిన విశాలమగు యు. యస్. యస్. ఆర్. రాష్ట్రములు నేడు నూతన జీవితములో నుద్దీపితమగుచు మనకండ్లయెదుట నొక నూతన ప్రపంచమును నిర్మించెను, భారతదేశములో గూడ గొప్ప మార్పులు కలిగెను. అది 18వ శతాబ్దముకంటె నిపుడు చాల భిన్నముగ నున్నది. రైల్వేలు, నీటిపారుదల పనులు, ఫ్యాక్టరీలు, పాఠశాలలు, కళాశాలలు, పెద్దపెద్ద ప్రభుత్వ భవనములు యిత్యాదులు వచ్చెను.

అయినను, యన్నిమార్పులు కలిగినప్పటికి నేడు భారతదేశ మెట్లున్నది? వేలకొలది మైళ్ళ దూరముననున్న విదేశీయులచే పాలింప

జడుచు, దాని దివ్యశక్తియంతయు పంజరబద్ధమై, స్వేచ్ఛగ నూపిరి పీల్చుకొనుటకైనను సాహసింపలేక పడియున్న బానిసదేశము. ఆమె ప్రజ లెవరితో పోల్చుటకు వీలులేని గర్భదరిద్రులు. అచిరజీవులు. అనివార్యములను జాడ్యముల నెదుర్కొన నసమర్థులు. అజ్ఞానము ప్రబలము. విశాల ప్రాంతములలో నెట్టి పారిశుధ్యము, వైద్య సహాయము కానరావు. మధ్యతరగతులలోను, ప్రజాసామాన్యము లోను నిరుద్యోగము విపరీతప్రమాణములోనున్నది. స్వేచ్ఛ, ప్రజా స్వామికము, సామ్యవాదము, కమ్యూనిజములు అనుభవశూన్యులగు లక్ష్యవాదుల యొక్కయు, సిద్ధాంతుల యొక్కయు, లేక దొంగల యొక్కయు వెర్రికేకలని చెప్పబడుచుండును. ప్రజలందరు మొత్తము మీద సుఖపడుటయే నిజపరీక్ష. నిశ్చయముగ నిది ప్రధానమైన పరీక్ష. ఈ పరీక్షనుబట్టియే నేడు హిందూదేశము భయంకర దరిద్ర ప్రదర్శనము చేయుచున్నది. ఇతరదేశములలో నిరుద్యోగ సమస్యలను, దుఃఖనివారణకు సంబంధించిన గొప్ప స్కీములను గురించి వింటుము. లక్షలకొలది నిరుద్యోగులైనవారి యొక్కయు, విశాల వ్యాప్తిచెంది, శాశ్వతమైపోయినట్టియు మన దుఃఖముసంగతి ఏమి కావలెను? ఇతరచోట్ల జరుగుచున్న ఇండ్ల స్కీములనుగురించికూడ మనము చదువుచుందుము. మట్టిగుడిసెలలో నివసించు లేక నే యిండ్లులేక నల్లాడు మన లక్షలకొలది ప్రజల గృహము లెచ్చట నున్నవి? మేమున్న చోటనేయుండి లేక తాబేలునడక నతికష్టము మీద నడచుచుండ, నితరదేశములలో విద్య, పారిశుధ్యము, వైద్య సహాయము, విజ్ఞానసౌకర్యములు, ఉత్పత్తి దినదినాభివృద్ధియగు చుండుటనుచూచి యసూయపడకూడదా? పన్నెండు సంవత్సరముల స్వల్పకాల ప్రయత్నముచే రష్యాదేశము తన విశాల రాష్ట్రములలో నజ్ఞానమును రమారమి నశింపుచేసి, ప్రజాజీవితముతో సంబంధము గల యొక చక్కని యాధునిక విద్యావిధానమును వృద్ధిచేసెను. వెనుకబడియున్న టర్కీకూడ ముస్తఫా కెమాల్ పాషా నాయకత్వము క్రింద విద్యావిశేషాభివృద్ధిని గాంచెను. ఫాసిస్టు యిటలీ తన యుద్ధ కారమును ప్రారంభించుటతోడనే, విద్యావిహీనతపై దాడిసడలెను.

విద్యాసంస్కృతుడైన జెంకైలు “యజ్ఞానమును ముందరనుండి యెదు
ర్కొనవలెను. మన రాజకీయశరీరమును తినివేయుచున్న యీ రాచ
పుండు నెఱ్ఱని యినుపకడ్డీతో కాల్చివేయవలెను” అని యాజ్ఞా
పించెను. ఇవి ప్రేక్షకాగారమునకు తగని పరుషవాక్యములు. కాని
యివి యీ భావమువెనుకనున్న విశ్వాసమును, శక్తిని విశదముచేయును.
మనమిచ్చట నెక్కువ పెద్దమనిషితరహా చూపుచు విశేషలలితపద
జాలము నుపయోగింతుము. మన మతిజాగ్రత్తగ సంచరించుచు మన
శక్తులను కమిషనులలోను, కమిటీలలోను వ్యయపరచెదము.

భారతీయులు మాటల ప్రోగులనియు, కార్యశూన్యులనియు
నొక యపవాదముకలదు. ఇది యుక్తమైన నేరము. కాని కమిటీలకు
కమిషనులకు బ్రిటిషువారికిగల యనంతశక్తికి మన మాశ్చర్యము
వెలిబుచ్చగూడదా? ప్రతికమిషను చాలకాలము కష్టించిన తరువాత
నొక ప్రతిభావంతమగు నివేదికను “ఒక గొప్ప ప్రభుత్వపత్రమును”
తయారుచేయును. ఇది సక్రమముగ స్తుతింపబడి భద్రముగ నే గూటి
లోనో దాచబడును. కనుక మనము ముందుకుపోవుచున్నట్లుఅభివృద్ధి
చెందుచున్నట్లు భావింతుము. అయినను మనమున్న చోటనే యున్నా
రము. 'గొప్పతనము' తృప్తినొందుచున్నది. ఉన్న ప్రయోజనములు
చలనములేకుండ నిలిచిపోవుచున్నవి. మనము చాలవేగముగ పోవుదు
మను భయముతో వారణములు, బ్రేకులు, రక్షణలు మొదలగు
వానిని గురించి చర్చింతుము.

“మొగలు పరిపాలననాటి సామ్రాజ్యవైభవమే ప్రజలదారి
ద్ర్యమునకు ప్రమాణము” అని 1934 జాయింటు పార్లమెంటరీ కమిటీ
చెప్పుచున్నది. అది యుక్తమైన విమర్శ, పరీక్ష. కాని యీ ప్రమా
ణమునే మనము నేడును వర్తింపచేయగూడదా? వైస్రాయిగారివైభవ
ప్రదర్శనములతోగూడిన నేటి నూతన ఢిల్లీసంగతి యేమిటి? ఆశ్చర్యకర
మగు గర్భదారిద్ర్యమొకప్రక్క వేధించుచుండ నీ యాడంబరమా!
ఈ వ్యత్యాసము బాధకరముగ నుండును. హృదయముగల వ్యక్తులు
దీని నెట్లు సహింపగలరో యోచించుట దురూహ్యము. పైకి

కాన్పించు సామ్రాజ్య వైభవముల వెనుకనున్న భారతదేశము దరిద్ర భూయిష్ఠము దుఃఖపూరితము. ఇదియంతయు వర్తకులవని. మెరుగు పూతలు. వీరివెనుక నాధునికపరిస్థితులచే నంతకంతకు కృంగిపోవు చున్న చిన్న బూర్జువాలు కలరు. ఇంకను వెనుక వచ్చిదరిద్రముతో దుఃఖమయజీవితములనుగడుపు పనివాండ్రుకలరు. తరువాత "అనంత యంధకారముకొరకుపుట్టిన" బీదవ్యవసాయదారు కలడు.

"శతాబ్దములభారముచే కృంగి యతడు తన త్రోల్పికపై నాధారపడి భూమివైపు తేరిబారిచూచును అతనిముఖమున యుగములనాటి శూన్యత కాన్పించును; వీపుపై ప్రపంచభారము గోచరమగును.

"......ఈ భయంకరాకారముగుండ బాధపడిన యుగములు వీక్షించును. వంగిన యీ నడుము కాలవిషాదచరిత్రను తెలుపును. దోచుకొనబడిన, ద్రోహముచేయబడిన, యీడ్చిలాగుకొనబడిన మానవలోక మీ భయంకరరూపముద్వారా ప్రపంచమును సృష్టించిన శక్తులను తన నిరసనను వెలిబుచ్చును. ఈ నిరసనమే జ్యోతిషముకూడ నగును."

భారతదేశములోనున్న దోషములన్నింటిని బ్రిటిషువారిపయి రుద్దుట మూర్ఖత్వము ఆ బాధ్యతను మనము వహింపవలెను. మనము దానినుండి తప్పించుకొనుటకు వీలులేదు. మననిజదుర్బలత్వముచే సంభవించిన ఫలితముల కితరులను నిందించుట యుక్తముకాదు. అధికారధూర్వహ ప్రభుత్వపద్ధతి, ముఖ్యముగ విదేశప్రభుత్వము, విధేయతను దోహదముచేయు చిత్తవృత్తినే ప్రోత్సహింపవలెను. ప్రబలమానసిక దృష్టిని, యాచరణను తగ్గించుటకు యత్నము చేయవలెను. అదియువకులలోనున్న శుభావహాలక్షణములన్నింటిని—యుత్సాహము, ధైర్యసాహసములు క్రియాశక్తి 'వీర్యము'—నలిపివేయవలెను. నైచ్యము, బల్లివలె నంటిపెట్టుకొని యుండుట, యజమానుల నాశ్రయించుట, సంతోషపెట్టుట మొదలగుభావములనే ప్రోత్సహింపవలెను. అట్టిపద్ధతి నిజమైన సేవచేయవలెననెడి చిత్తవృత్తిని, ప్రజాసేవయెడల భక్తిని పురిగొల్పజాలదు. అది ప్రజాసేవయందెంతమాత్రముత్సాహములేక

నేదోవిధముగ పొట్టపోసికొను నాశయముగలవారినే తీసికొనును. భారతదేశములో బ్రిటిషువా రెట్టితరగతిమనుష్యులను చేరదీసెదరో మనము చూచుచునే యున్నాము. వారిలో కొందరు బుద్ధిబలము కలిగి మంచిపనిచేయగల సమర్థులు కలరు. వారి కితరత్ర నెట్టియవకాశము లేక పోవుటచే ప్రభుత్వసేవకో లేక అర్ధప్రభుత్వసేవకో యొడంబడుదురు. క్రమముగ వారి చురుకుపాలు తగ్గి వారి మనస్సులు సారములేని నిత్య కర్మబద్ధమై యీ పెద్దయంత్రములో భాగములుగ నిమిడిపోయెదరు వారు నిరంకుశత్వమునకు కావలసిన గుణములను "గుమాస్తాపదవికి తగినజ్ఞానమును ఆఫీసు నడపగల రాచకీయకళను" వృద్ధిచేయుదురు క్వాచిత్కుగ ప్రజ సేవయందు మానసిక భక్తి యుండవచ్చును. ప్రజ్వలించునట్టి యుత్సాహముండదు. ఉండజాలదు. విదేశప్రభుత్వముక్రింద నిది సాధ్యముకాదు.

పేరుమినహా. చిన్నయధికారులలో చాలమంది యెన్నదగినవారుకారు. వారు తమ పైయధికారుల నాశ్రయించుట. క్రిందవారిని బాధించుట మాత్రమే యెరుగుదురు. ఈ దోషము వారిదికాదు. అది యీపద్ధతివలన కలుగు శిక్షలోనున్నది. మనదేశములో తఱచు కాన్పించుయీయాశ్రయింపుజీవితములోను, బంధువులకుద్యోగములనిచ్చు పక్షపాత యాచారములోను నాశ్చర్యమేమియున్నది? సేవజేయుటకు వారికెట్టియాదర్శములులేవు నిరుద్యోగ పిశాచము, తత్ఫలితమగు నాకలిబాధ వారిని పీకుచుండును. కనుకయుద్యోగముల కంటిపెట్టుకొని యుండుటయు. వారిబంధువులకు స్నేహితులకు పదవులనిప్పించుటయు వారిప్రధాన తాపత్రయము. గూఢచారి వేసడములు వెంటాడు ప్రజలలో మనోజ్ఞములగుసుగుణములనువృద్ధిచేయుటసులభమైన పనికాదు.

ఈ మధ్య జరిగిన మార్పులవలన ప్రజాసేవయందభిరతి, హృదయముకలవాడు ప్రభుత్వసేవలో జేరుట మరింత కఠినమయ్యెను. ప్రభుత్వము కట్టివా రవసరములేదు. ఆర్థికముగ తప్పనిసరియైనగాని వారు ప్రభుత్వసంపర్కము నంగీకరింపరు.

కాని సామ్రాజ్యభారమును నల్లవారుకాక తెల్లవారు భరించుచున్నట్లు ప్రపంచమంతయు నెరుగును. సామ్రాజ్య సాంప్రదాయ

మును నిర్వహించుటకు మనకు వివిధ సామ్రాజ్య శాఖలుగలవు. వాటి ప్రత్యేకహక్కులను, కాపాడుటకనేక సంరక్షణలు కలవు. ఈ శాఖల ప్రయోజనములతోను, అభివృద్ధితోను, భారతకళ్యాణము ముడిపెట్ట బడును. ఐ. సి. యస్. యొక్క ప్రత్యేక హక్కు, పెద్దపదవి తీసివేయ బడినచో స్వతంత్రత, యథేచ్ఛ ప్రబలునని చెప్పుదురు. ఐ. యం. యస్. కొరకు ప్రత్యేకింపబడిన పదవులను తగ్గించినచో "భారతదేశ యారోగ్యమునకు భంగముగలుగును." సైన్యములోని బ్రిటిషు యుద్యోగులను ముట్టినచో మనల నానావిధములకు భయంకర ఉపద్రవములు ముట్టడించును!

ఇందులో కొంత సత్యమున్నది. పై పెద్దయధికారులు హఠా త్తుగా వెళ్ళిపోయి తమ శాఖలను క్రిందివారికి విడిచివేసిన యెడల సమర్థత తగ్గిపోవును. కాని యీ పద్ధతియే దీనికి కారణము క్రింది యధికారు లెంతమాత్రము శ్రేష్ఠులు కాక బాధ్యత వహించుటకు వారి కెట్టియవకాశములు నీయబడలేదు. భారతదేశములో గొప్ప బుద్ధిబలసంపన్నులు కావలసినంతమంది యున్నారని నేను విశ్వసించె దను. తగుదీక్ష తీసికొనినచో స్వరతికాలములోనే యువయోగిం తురు, తయారగుదురు కాని దానికి ప్రభుత్వ, సాంఘిక పరివర్తనము కలుగవలెను. అనగా నొక నూతన ప్రభుత్వ మేర్పడవలెను

ప్రస్తుతము చట్టములలో నెట్టిమార్పులువచ్చినను మనలను రక్షించి, మనకు నీడనిచ్చు పెద్దయుద్యోగములనెడి 'యుక్కు చట్టము' మామూలుగనే సాగుచుండునట! పవిత్రప్రభుత్వ రహస్య సంరక్షక మఠాధిపతులకు ఏరా గర్భగుడిని కాపాడుచు నీచుల నా పవిత్ర యావరణములోనికి రాకుండ వారించెదరు మనకీయబడిన హక్కుల కష్టాలనుని మనము ఋజువుచేసినచో క్రమముగా నా రొక్కొక్క తెరతీసివేయుచు చివర కెప్పుడో భవిష్యద్యుగములో నాశ్చర్యచకిత ములు, భక్తిపురస్సరములు నగు మన నయనముల కా యత్యంత పవిత్రపదార్థము బహిర్గతమగునట!

ఈ సామ్రాజ్యశాఖలన్నింటిలోను ఐ. సి. యస్. కు అగ్ర స్థాన మీయబడెను. ప్రభుత్వము భారతదేశములో నడుచుటకుగల

కీర్త్యపకీర్తులు వీరికే ముట్టవలెను. ఈ శాఖయొక్క గుణగణములను గురించి మనకనేకసార్లు చెప్పబడెను. సామ్రాజ్యస్వామ్యములో దాని యుత్కృష్టత యొక్క సామెతయయ్యెను. భారతదేశములో దానికున్న యప్రతిహతాధికారపదవి యది ప్రసాదించు నిరంకుశాధికారము, దీనినిగురించి చేయుబడు విశేష పొగడ్తలు నెట్టి వ్యక్తి, వర్గముల మానసిక స్వాస్థ్యమునకును శ్రేయస్కరములు కాజాలవు ఈ శాఖ యెడల నాకెంతయభిమానమున్నను యిది వ్యక్తిగతముగ, మొత్తము మీద నాత్మస్తుతి యను వ్యాధికి లొంగిపోయెనని చెప్పక తప్పదు. ఐ.సి.యస్. వారి సుగుణములను మరచిపోనీయరు. కాని యాశాఖను గురించి శుష్కోపన్యాసములు గావింపబడెను యింకను కావింపబడు చున్నవి కనుక నీ జోరును తగ్గించునట్లు చేయుట యవసరమని నే నొక్కొక్కప్పుడు భావించుచుందును. వెబ్లెను అను అమెరికా దేశపు యార్థిక శాస్త్రవేత్త హక్కులుగల తరగతులను "ఉంపుడుతరగతులు" అని పిలిచెను. ఐ సి యస్ ను, యితర సామ్రాజ్య శాఖలను "ఉంపుడుశాఖలు" అని పిలుచుటలోగూడ నంత సత్యముగలదని నేను భావించెదను. అవి చాల వ్యయకర విభవములు, భోగములు.

మేజరు డి గ్రహాంపోలు భారతదేశ వ్యవహారములలో నెక్కువ శ్రద్ధతీసుకొనుచుండెడివాడు. అతడు కొంతకాలముక్రిందట మోడరన్ రివ్యూ పత్రిక కిట్లు వ్రాసెను. "ఐ సి యస్. శాఖ చాల సమర్థమైనది, పటుత్వమైనది అను నంశము నెవరును కాదనుట కెన్నడు యత్నించి యుండలేదు" ఇట్టి స్టేటుమెంటులే యింగ్లండులో తఱచు చేయబడుచు విశ్వసింపబడుచుండుటచే దీనిని పరిశీలించుట ప్రయోజనకరము. ఇట్టి స్టేటుమెంటులను చేయుట భద్రముకాదు ఈ విషయము నిరాకరింపబడలేదని మేజరు గ్రహాంపోలు భావించుట చాల పొరపాటు. చాలకాలముక్రిందటనే గోఖలేగారుకూడ ఐ.సి.యస్. ను గురించి చాల కఠినవిమయములను చెప్పెను. సామాన్య భారతీయుడు-కాంగ్రెసువాది యైనను కాకపోయినను- మేజరు గ్రహాంపోలుతో డీకొనగలడు డీకొనును. అయినను నా సభ్యులు కొంతవరకు యుక్తముగనే మునిడి వివిధయవస్థలను గురించి యోచించుకొను

చుండవచ్చును. శక్తిసమర్థతలు దేనికొరకు ? బ్రిటిషు సామ్రాజ్యమును హిందూదేశములో బలపఱచుటకు, దేశమును కొల్లగొట్టి దానికి సహాయముచేయుటకు నైనయెడల నిశ్చయముగ ఐ. సి. యస్. బాగుగనే పనిచేసెను. కాని భారతప్రజలు సౌభాగ్యమే నిజమైన పరీక్షయైనయెడల వారు పూర్తిగ విఫలులైరి. ఏ ప్రజలనుండి హెచ్చుజీతములు వచ్చుచున్నవో యట్టిప్రజలకు విద్యా రాబడిచేతను, జీవిత ప్రమాణముచేతను గల దూరమును చూచినచో నీ విఫలత మరింత స్పష్టము కాగలదు

ఈ శాఖ మొత్తముమీద నొకవిధమగు ప్రమాణమును నిలిపెననుట పూర్తిగ యథార్థము. అప్పుడప్పుడది యసాధారణ ప్రజ్ఞగల వారినిచ్చుచుండెను. ఇట్టి యే శాఖనుండియైనను నింతకంటె నెక్కువ యాశింపరాదు బ్రిటిషు పబ్లికు స్కూలుయొక్క తత్త్వము నిది ప్రధానముగ యలవఱచుకొనెను. ఇది యొక మంచి ప్రమాణమును నిలిపినను యీమాదిరిని దాటివెళ్ళుట కంగీకరింపదు. ప్రత్యేకవ్యక్తుల ప్రత్యేకశక్తిసామర్థ్యములు దైనికనిర్జీవతంతులో నాశనమగుచుండెను; పెద్దమనిషితరహా శ్రద్ధకలవారు, సేవను గ్రహించినవారు చాలమంది కలరు. కాని యీ సేవ సామ్రాజ్యసేవ. భారతదేశము దానితరువాత విధిలేక వచ్చును వారికీయబడిన శిక్షనుబట్టి వారుండు పరిస్థితులను బట్టి వారట్లే ప్రవర్తింపగలరు. వారు స్వల్పసంఖ్యాకులు, విజాతీయులు. తఱచు మిత్రులుకాని ప్రజలమధ్య నుండుదురు కనుక నేకీభావముకలిగి యొక విధమగు ప్రమాణమును నిలిపిరి. తమ జాతియొక్కయు, పదవియొక్కయు గౌరవమును నిలుపుకొనుట కిది యవసరము, వారికి నిరంకుశాధికారములు కలవు. కనుక విమర్శను నిరాకరించి దానిని మహాపాపముగ భావించి, యంతకంతకు సహనమును కోల్పోయి, బెత్తమును ఝుళిపించు బడిపంతుళ్ళయి, బాధ్యతలేని పరిపాలకులకుండుదోషముకలవడిపోయిరి. పరివర్తనముచెందు ప్రపంచములో వారాత్మతృప్తిగల సంకుచితములై యభివృద్ధిచెందుచున్న వాతావరణమున కెంతమాత్రము తగనివారైరి. తమకంటె సమర్థులు నవసరములను గుర్తించి నడవగలవారు భారత సమస్యలను

చేబట్టినపుడు వీరు కోపించిరి. వారిని నిందించి, యణచివేసి, వారి కనేక యడ్డంకులను కల్పించిరి. యుద్ధానంతర పరివర్తనముల పూర్వ పరిస్థితులను తెచ్చిపెట్టినప్పుడు వారు వాటితో తూగలేక కర్తవ్య విమూఢులైరి. అల్పావధిగలది, అతిని:కృష్టమైనది యగు వారివిద్య నూతన పరిస్థితులకు, నవసరములకు తగినట్లు వారిని తయారుచేయ లేదు. చిరకాల బాధ్యతవలన వారు చెడిపోయిరి మొత్తముమీద వారికి సంపూర్ణాధికారము కలదు. "అధికార మవినీతిని కలిగించును" అని ఆక్టన్‌ప్రభువు చెప్పెను. "సంపూర్ణాధికారము మరింత యవినీతిని కలిగించును."

వృద్ధియగుచున్న తీవ్ర జాతీయోద్యమము నెదుర్కొనుటకు వారు దౌర్జన్యము నవలంభించిరి. సామ్రాజ్యములు దానిమీదనే నిలుచుచున్నవి. ప్రతిపక్షము నెదుర్కొనుటకు వారి కింకొకమార్గము చూపబడలేదు. అనవరత, అత్యధిక దౌర్జన్యము నుపయోగించుటే పరిస్థితులను వారిచేతిలోనుండి జారిపోవునట్లు విశదము చేసెను. మామూలు పరిస్థితులలో వారి కుండునట్లు కాన్పించిన నిగ్రహము, ఆత్మసంయమము వారిపుడు కోల్పోయిరి. వారినాడులు సడలి పోయెను; వారి బహిరంగ ఉపన్యాసములలో గూడ హిస్టీరియా చిహ్నము కాన్పించెడిది గత కాలమునాటి ప్రశాంత విశ్వాసము గతించెను. సందిగ్ధసమయము నిర్దాక్షిణ్యముగ మనల నందరను బహిర్గతమొనర్చి మన యత్యంతాంతరంగిక దుర్బలత్వమును ప్రదర్శించును. శాసనోల్లంఘన మట్టి సమయము; అట్టి పరీక్ష. చాల కొద్ది మంది (యిరుపక్షములోను – కాంగ్రెసు, ప్రభుత్వము) మాత్రమే యీ పరీక్షకు పూర్తిగ నిలువగలిగిరి. యదార్థ ప్రతిభావిశేషములు కలవారు కొద్దిమందియే యుందురని సందిగ్ధసమయములో కనుగొన బడునని లాయిడ్‌జార్జి చెప్పుచున్నాడు తక్కినవారు సందిగ్ధసమయములలో లెక్కకు రారు. ప్రశాంత సమయములో గుట్టలవలె కాన్పించు యిసుకతిన్నెలు, గొప్ప వరద వచ్చినపుడు మునిగిపోయి నీటిపయినుండు యున్నత శిఖరములు మాత్రమే కాన్పించును,

ఐ. సి. యస్. వారు విద్యచేతను భావములచేతను దేశములో సంభవించినదానికి తయారుగనుండలేరు వారికీయబడిన యుకలు శిక్ష సాహిత్యవిద్య. అదివారికొకవిధమగు విజ్ఞానమును, శోధనయిచ్చును. అది విక్టోరియారాణి కాలమునకు తగినపాతప్రపంచ సాంప్రదాయము అది యాధునికపరిస్థితుల కెంతమాత్రము పనికిరాదు. వారు సంకుచితమైనను తమ స్వంతప్రపంచములో—ఆంగ్లోయిండియను—యిదిహిందూదేశముకాదు, యింగ్లండుకాదు—జీవింతురు. సమకాలిక సంఘములో పనిచేయు శక్తులను వారు గుర్తింపజాలరు. భారత ప్రజల ధర్మకర్తలు సంరక్షకులు అను వినోదకరమగు నధికారము చలాయించుచున్నను వారు వారినిగురించి యేమియు నెరుగరు. కాలుమున్న నూతన బూర్జువాల వంతకంటె యెరుగరు. వారు తమచుట్టు ఉద్యోగములకొరకు నిచ్చకములకొరకు మూగువారినిబట్టి భారతీయులను విమర్శింతురు; తక్కినవారి నాందోళనకారులని ద్రోహులని త్రోసివేతురు. యుద్ధానంతరము ప్రపంచమంతటను జరిగిన పరివర్తనములనుగురించి ముఖ్యముగ నార్థికప్రపంచమునుగురించి వారి జ్ఞాన మతిస్వల్పము. వారు తాముపోవు రథచక్రమార్గములో నిరుకుకొనిపోయి మార్పుచెందు పరిస్థితులకు తగినట్లు లేవజాలకున్నారు. తాము ప్రాతినిధ్యము వహించు పీఠ మాధునిక పరిస్థితులకు తగియుండలేదని వారంతకంతకు టి. యస్. యిలియటు 'శూన్యమానవులు' అను పుస్తకములో వర్ణించిన మాదిరిని జేరుచున్నారని గుర్తింపరైరి.

అయినను బ్రిటిషు సామ్రాజ్యము సాగునంతకాల మీపీఠము సాగుచునేయుండును. ఇది యింకను శక్తివంతముగనున్నది. సమర్థులు ప్రతిభకలవారు నగు నాయకులను కలిగియున్నది. భారతదేశములో బ్రిటిషు ప్రభుత్వము గుల్లబారిపోయిన దంతమువలెనుండి బాధ హెచ్చుగ నున్నను సులభముగ పీకుటకు వీలులేనట్లున్నది. దానిని పీకివేయువరకు లేక దానంతటది పడిపోవువరకు నాబాధ తగ్గకమరింత యధ్వాన్నము కావచ్చును.

ఐ. సి. యస్. వారిలో యింగ్లీషువారు, భారతీయులు చాల మంది యుత్తములు కలరు. కాని ప్రస్తుత పద్ధతి నడచునంత కాలము వారి యోగ్యత భారత ప్రజల కుపయోగింపని విషయములకే వినియోగింపబడును. ఈ శాఖలోని కొందఱు భారతసభ్యులీ పబ్లిక్ స్కూలు తత్వముతో తన్మయత్వమొంది రాజభక్తిలో నసమానులగుదురు తన గొప్పను పొగడుకొను యొక యుత్సాహవంతుడగు భారత ఐ. సి. యస్. సభ్యుని నేనొకసారి కలుసుకొంటిని. అతడు తన శాఖ సుగుణములను వర్ణించి వర్ణించి బ్రిటిషు సామ్రాజ్యమును సమర్థించుచు అది రోమను సామ్రాజ్యముకంటె, చెంఘిజుఖాను, తైమూరుల సామ్రాజ్యములకంటె శ్రేష్ఠమైనది కాదా ? యను ప్రత్యుత్తర మక్కరలేని వాదముతో ముగించెను.

తమ ధర్మముల నతి సమర్థతతో నిర్వహించుచున్నారని, కనుక తమ హక్కులను నొక్కి వక్కాణించుట యోగ్యమేయని ఐ. సి. యస్. శాఖవారి తలంపు. హిందూదేశ బీదతనమునకు సాంఘికాచారములు, బనియాలు, వడ్డీవ్యాపారస్థులు, అన్నిటికంటె నసంఖ్యాకులగు ప్రజలు కారకులు. అందరికంటె గొప్ప బనియాయగు బ్రిటిషు ప్రభుత్వముసంగతి చల్లగ జారవిడువబడును. వారీ ప్రజలనుగురించి యేమిచేయగోరుదురో నే నెరుగను. ఏలనన కఱవులు, జాడ్యములు, సాధారణముగ నెక్కువ మరణములు మొదలగునవి విశేషసహాయము చేసిననుగూడ జనాభా విస్తరించుచున్నది. జనన నిరోధము సూచింపబడెను దీనిని సమర్థించువారలలో నేనొకడను. కాని యీ పద్ధతుల నుపయోగించుటకే ప్రజల జీవిత ప్రమాణము చాల హెచ్చుగ నుండవలెను. కొంత సామాన్యవిద్య యుండవలెను. దేశమంతట నసంఖ్యాకులగు వైద్యులుండవలెను, ప్రస్తుతపరిస్థితులలో జనన నిరోధపద్ధతులు ప్రజల కెంతమాత్రము నందుబాటులో లేవు. మధ్యతరగతులవారికి లాభము పొందవచ్చును. వారట్లు చేయుచున్నారని నేను విశ్వసించెదను.

జనాభా విస్తారముగ పెరిగిపోవుచున్నదను వాదమును మరి కొంచెము తర్కించవలసియున్నది. నేడు ప్రపంచమంతటగల సమస్య యాహారము, తదితర ముఖ్యపదార్థములు లేకపోవుట కాదు. తిను వారు లేరు. అనగా ఆహారము మొదలగువానిని కొనగలశక్తి యున్నా తుకులకు లేదు. ప్రత్యేకముగ హిందూదేశమునుగురించి యోచించినను అన్నలోపము లేదు. ప్రజాభివృద్ధియైనను, యాహార సరఫరాకూడ పెరిగెను. జనాభా పెరిగికొలది యది యంతకంటె నెక్కువగ పెంచ గలదు. భారతదేశములో జనమమితముగ పెరిగిపోవుచున్నారని పెద్దగోల చేయబడును. చాల పాశ్చాత్యదేశములతో పోల్చిచూచిన యెడల నిది చాల తక్కువ. భవిష్యత్తులో నెక్కువ భేదముండునను సంగతి యదార్థము. జనాభివృద్ధి నరికట్టుటకు లేక నాపివేయుటకు కూడ పాశ్చాత్యదేశములలో వివిధశక్తులు పనిచేయుచున్నవి హిందూదేశములోకూడ దానిని తగ్గించు శక్తులు వృద్ధియగు సూచనలు గలవు.

హిందూదేశము స్వాతంత్ర్యము సంపాదించినతోడనే. తన నూతన జీవితమును తన యిష్టప్రకారము నిర్మించుకొనగల శక్తి కలుగుటతోడనే, యది విధాయకముగ తన పుత్ర పుత్రికారత్నముల నీ పనికి వినియోగించును. శ్రేష్ఠమానవసృష్టి యెల్లప్పుడు స్వల్పముగనే యుండును. బ్రిటిషు ప్రభుత్వముక్రింద హిందూదేశములో నది మరింత స్వల్పము మన పబ్లిక్ కార్యములకు చెందిన యనేక శాఖలకు మనకు చాలమంది విదేశ నిపుణుల సహాయ మవసరము. ప్రత్యేక సాంకేతిక శాస్త్రీయజ్ఞాన మవసరమైన శాఖల కత్యవసరము. ఐ. సి. యస్.లోను యితర సామ్రాజ్యశాఖలలోను పనిచేసినవారిలో చాలమంది యీ నూతన క్రమమున కవసరము; వా రాహూయము చేయబడుదురు. కాని ఐ. సి. యస్. తత్త్వము మన పాలకవర్గములోను, మన పబ్లిక్ శాఖలలోను జీర్ణించియుండునంతకాలము భారతదేశములోనే నూతనక్రమము నిర్మింపబడజాలదని నేను దృఢముగ చెప్పగలను. అధికార ధూర్వహతత్త్వము సామ్రాజ్యతత్త్వమునకు

తోడునీడ; స్వాతంత్ర్యముండుచోట నది యుండజాలదు. అది స్వాతంత్ర్యమునైనను నలిపివేయును. లేదా యదియే తుడిచివేయబడును అది ఫాసిస్టుప్రభుత్వమునకే సరిపడగలదు. కనుక మనము నూతనక్రమముక్రింద పని ప్రారంభించుటకుపూర్వము ఐ.సి.యస్. వంటి శాఖలు (ప్రస్తుతమున్న రూపములో) పూర్తిగ మాయమగుట యత్యావసరమని నాకు తోచును. ఈశాఖలకు చెందిన వ్యక్తులు వారికిష్టముండి. వారు సమర్థులైనయెడల, నూతన షరతుల కొప్పుకొను పద్ధతిమీద యాహ్వానింపబడుదురు. నేడు వారికీయబడు విపరీత జీతములు, అలవెన్సులు యివ్వబడునని కలలోనైన తలంపరాదు. తాము సేవించు ధర్మమువట్ల పరిపూర్ణవిశ్వాసము దానిని సాధింపవలెననెడి పూనికగలిగి, గొప్పజీతములయందలి మోహముచేతగాక దానిలోనున్న యానందముకొరకు, దాని ప్రఖ్యాతికొరకు శ్రద్ధ సమర్థతగలిగి పనిచేయు సేవకులే నూతనభారతమును సేవింపనర్హులు. ద్రవ్యాపేక్ష చాల తక్కువకు దిగవలెను. విదేశస్థుల యవసరము యోచింపబడును కాని సాంకేతికజ్ఞానములేని సివిలువాలకు లందరికంటె తక్కువ వాంఛనీయులు. భారతదేశములో నట్టివారికి కొరతలేదు.

భారత లిబరలులు నట్టి యితరవర్గములు భారతపరిపాలనను గురించి బ్రిటిషుతత్త్వము నామోదించినసంగతి నే నిదివరలో చెప్పియుంటిని. ఈ సర్వీసులసందర్భములో నిది ముఖ్యముగ కాన్పించును. కేవలము వారు వీనిని 'భారతీయులపరము' చేయవలయుననియే గోల చేసెదరు. ఈ శాఖలు, ప్రభుత్వనిర్మాణ మూలప్రకృతి, తత్త్వము పూర్తిగా మార్పుచెందవలెనని కోరరు. చాల ప్రధానమగు నీవిషయములో నెంతమాత్రము సడలుటకు వీలులేదు. బ్రిటిషు సైన్యములు, శాఖలు తగినంతమాత్రముచే భారతస్వాతంత్ర్యము చేకూరనేరదు. వాని వెనుకనున్న యధికారతత్త్వము పోవలెను. వారి జీతములు, హక్కులు చాల తగ్గిపోవలెను. చట్టనిర్మాణము జరుగు యీ దినములలో రక్షణలనుగురించి పెద్దకబుర్లు వినబడుచున్నవి. ఈ రక్షణలు భారత ప్రయోజనములకొరకే యైనయెడల ఐ. సి. యస్., యితర

శాఖలు అంతరింపవలెనని శాసింపబడవలెను. నూతనచట్టములో వీని కెట్టి సంబంధము నుండరాదు.

రక్షణశాఖలనబడునవి మరింత క్లిష్టములు, రహస్యములు నైన విషయములు. వానిని గురించి మనము విమర్శింపరాదు! నోరెత్తి మాట్లాడరాదు! ఏలనన నట్టియున్నతవిషయములను గురించి మన కేమి తెలియును? సణుగుటలు, గొణుగుటలు కట్టిపెట్టి చాల హెచ్చు మొత్తములను చెల్లించుటొక్కటే మనము చేయవలసినపని! 1934 సెప్టెంబరులో భారత చీఫ్ కమాండర్ సర్. ఫిలిప్ ఛెట్వోడ్డు సిమ్లాలో స్టేటుకౌన్సిలులో మాట్లాడుచు తమపని తాము చూచుకొనవలసినదనియు, నతని పనిలో జోక్యము కల్పించుకొనరాదనియు ఘాటైన మిలిటరీ భాషలో భారత రాజకీయవేత్తలను మందలించెను. ఒక ప్రొపోజిషనుకు సవరణ నుపపాదించిన వాని నుదహరించుచు నతడిట్లు చెప్పెను. "శక్తితో సామ్రాజ్యమును సంపాదించి తదారభ్య దానిని శక్తితోనే నిలుపుకొని యుద్ధములలో మునిగి తేలుచు, యుద్ధప్రావీణ్యతను సంపాదించిన బ్రిటిషుజాతియొక్క సాంగ్రామిక పరిజ్ఞానము పడకకుర్చీ విమర్శకుల మాటలచే తరిమివేయబడునని యతడు, యతని స్నేహితులు భావింతురా?" అతడింకను వినసొంపైన యనేక విమర్శలు చేసెను. అతడు తన యుపన్యాసమునంతను వ్రాసుకొనివచ్చిన వ్రాతప్రతినుండియే చదివెను.

సైనిక విషయములను గురించి తెలియని సామాన్యమానవుడు చీఫ్ కమాండరుతో వాదించు టసంగతము అయినను పడకకుర్చీ విమర్శకుడుకూడ కొన్ని యభిప్రాయములను వెలిబుచ్చవచ్చును. సామ్రాజ్యమును శక్తితో పరిపాలించువారి ప్రయోజనములు, తమ శిరములపై తళతళ మెరయు నీ యాయుధ మెప్పుడు వ్రేలాడుచుండు ప్రజల ప్రయోజనములు భేదింపవచ్చును. భారతసైన్యము భారత ప్రయోజనములను, సామ్రాజ్య ప్రయోజనములను సేవింపవచ్చును. ఈ రెంటికి భేదముండవచ్చును. లేదా సంఘర్షణమే యుండవచ్చును. తమపనిలో జోక్యము కలిగించుకొనరాదను గొప్పసేనాధిపతుల కోరి

కలు యుక్తములో, కావో ప్రపంచ యుద్ధానుభవములనుబట్టి రాజకీయవేత్త, పడకకుర్చీవిమర్శకుడు యోచింపవచ్చును. వారి కప్పుడు చాలవరకు స్వేచ్ఛయేయుండును అన్నిచరిత్రలనుబట్టి చూచిన యెడల ప్రతిసైన్యములోను —బ్రిటిషు, ఫ్రెంచి, జర్మన్, ఆస్ట్రియన్ ఇటాలియన్, రషియన్వారు ప్రతివిషయములోను విపరీత గందరగోళము చేసిరి. విఖ్యాతిగాంచిన బ్రిటిషుసైనిక చరిత్రకారుడు, తంత్రవేత్తయగు కెప్టెన్ లిడెలుహార్టు యుద్ధముజరుగుచున్న యొక స్థితిలో బ్రిటిషు సోల్జరులు శత్రువుతో పోరుచుండ బ్రిటిషు సేనాధిపతులు తమలో తామె పోరాచుండిరని తన 'ప్రపంచయుద్ధచరిత్ర' యను పుస్తకములో వ్రాసెను. జాతీయోపద్రవము వారిభావములలోగాని, ప్రయత్నములలోగాని యైక్యమును కలిగింపలేదు; మరియు నతడు 'యుద్ధము' విగ్రహములలోనున్న మన విశ్వాసమును నాశనము చేసెను; గొప్పవారు సామాన్యమానవులకంటె భిన్నపదార్థముతో చేయబడిరను మన వీరారాధన ముక్కలుచేసెను. నాయకుల యవసరమెంకను కలదు; బహుశః యెక్కువగకలదు. కానివారుసామాన్య మానవజాతివారేయని మన కిప్పుడు కలిగిన ప్రబోధము వారినుండి విపరీతమైనదాని నాశింపరాదనియు, లేక వారిని విపరీతముగ నమ్మరాదనియు మనలను గుర్తింపజేయుచున్నది" అని వ్రాసెను.

రాజకీయధురంధరుడగు డి లాయడ్ జార్జి 'యుద్ధస్మరణములు' అను తన పుస్తకములో ప్రపంచయుద్ధములోని సేనాధిపతుల యొక్కయు, సేనానులయొక్కయు తప్పులను, దోషములను గురించి భయంకర చిత్రములను చిత్రించెను. ఈ దోషములు లక్షలకొలది జనుల ప్రాణములను తీసివేసెను. ఇంగ్లండు, ఆమె మిత్రులు యుద్ధములో జయించిరి. కాని యది "రక్తముతో నుక్కిరి బిక్కిరియైన విజయము" ఉన్నతోద్యోగులు మనుష్యులను, అవకాశములను నిర్లక్ష్యముగ, తెలివితక్కువగ చేబట్టి ఇంగ్లండును కొంచెమించుమించు మృత్యుసదనమునకు గొంపోయిరి. ఆమెయు, నామెమిత్రులు వారి శత్రువుల ప్రమాదమువలననే రక్షింపబడిరి. ఇంగ్లండుయొక్క

గొప్ప యుద్ధమంత్రి ఈవిధముగ వ్రాయుచు కెల్లికో ప్రభువు తల
లోనికి భావముల నెక్కించుటకు శస్త్రచికిత్స చేయవలసివచ్చెనని
వివరించెను. శక్తినుద్బోధించునట్టి నిశ్చలముఖలక్షణములను కలిగి
యుండుటయే ఫ్రెంచి సేనాధిపతియైన జోఫ్రె యొక్క ముఖ్యగుణ
మని యతడు భావించునట్లు కాన్పించును, "కష్టములోనున్న ప్రజలు
సహజముగ దానికొరకే చూచెదరు. గడ్డము వివేకస్థానమను దురభి
ప్రాయము వారికుండును."

కాని లాయిడ్‌జార్జి కమాండర్‌ఇన్ ఛీఫ్, ఫీల్డుమార్షల్ హేగ్
మీదనే ప్రధానదోషము నారోపించెను. హేగ్ అసాధారణాహంకా
రముగలిగి రాజకీయవేత్తలు యితరులు చెప్పినదానిని వినకపోవుట
యేగాక ముఖ్యవిషయములను బ్రిటిషు మంత్రివర్గమువారికి కూడ
తెలియపర్చక ఫ్రాన్సులోనున్న బ్రిటిషుసైన్యమును మహోపద్రవము
లోనికి దింపెను. అపజయ మతని నెదుర్కొనినను అతడు పశ్చెండెలీ
కేంబ్రైయను భయంకరమైన రొంపిస్థలములో ననేకమాసములవరకు
తన తెలివితక్కువ పోరాటమును సాగించెను. అచ్చట ఆఫీసరు
లొక్కరే 17,000 మంది చనిపోయిరి నాలుగులక్షలమంది ధైర్య
వంతులైన బ్రిటిషు సోల్జరులు 'చావుసంఖ్యకు వచ్చిరి. చనిపోయిన
తరువాత 'నా యజ్ఞాతసోల్జరు' గౌరవింపబడుట మంచిదని, అతని
జీవిత మతిచౌకగా నుండెను. జీవించియుండగా నతని లెక్క యేమియు
లేకపోయెను.

ఇతరులవలె రాజకీయవేత్తలును తఱచు ప్రమాదములకు
లోనగుచుందురు. కాని ప్రజాస్వామిక రాజకీయవేత్తలు ప్రజలను,
విషయములను గురించి, బాధ్యతతో మెలగవలెను. సాధారణముగ
వారు తమతప్పును గుర్తించి సవరించుకొన ప్రయత్నింతురు. అధికార
రాజ్యముచేయుచు విమర్శకు స్థానములేనిచోట సైనికుడు నేమివిధ
మగు వాతావరణములో తయారగును అతడితరులసలహా పాటింపడు.
అతడు తప్పుచేసినప్పుడు పూర్తిగ చేయుచు తప్పు దిద్దుకొనమనినను
దిద్దుకొనడు.

సైన్యములో 'భారతీయులను ప్రవేశపెట్టు' విధానము జరుగుచున్నదనియు, మరి ముప్పదిసంవత్సరములలో నొక భారతసేనాధిపతి కూడ భారతరంగములో కాన్పించవచ్చుననియు చెప్పబడుచున్నది. నూరు సంవత్సరములకు యెక్కువ కాలము మించకుండ భారతీయుల పరము చేయుపద్ధతి చాలవర కభివృద్ధి కావచ్చును. మంచితరుణములో యింగ్లండు ఒకటిరెండు సంవత్సరములలోనే లక్షలకొలదిగ మహా సైన్యము నెట్లు నిర్మింపగలిగెనో యాశ్చర్యముగ నుండును. మనకు సలహా చెప్పు సలహాదారులే దానినన్న యెడల నది యెక్కువ జాగ్రతగను, భద్రముగను నడిచియుండెడిది. కట్టుదిట్టమైన శిక్షణ గల యీ సైన్యము తయారగుటకు చాల పూర్వమే నిశ్చయముగ యుద్ధము ముగిసియుండెడిది. రష్యన్ సోవియటు సైన్యములుకూడ రమారమి శూన్యమునుండియే ప్రారంభమై యనేకమంది శత్రువుల నెదుర్కొని విజయముగాంచుటగూడ మనము చూచుచున్నారము. నేడు ప్రపంచములో నవి యత్యంతసమర్థమైన సైన్యములలో నొకటిగనున్నవి యుద్ధములో మునిగితేలుచు 'యుద్ధ ప్రావీణ్యతను' సంపాదించిన సేనాధిపతులెవరు వారికి సలహాయిచ్చినట్లు తోచదు.

డేరాడూనులో నుద్యోగస్థులబిడ్డల నాఫీసరులుగ తయారు చేయుటకొరకై సైనికశిబిరము కలదు. వారు కవాతుచేయుటలో నతిచురుకుగనుందురట! వారు నిస్సందేహముగ గొప్ప ఆఫీసరులు కావచ్చును. సాంకేతిక శిక్షణ లేనిదే యిట్టి శిక్షణవలన ప్రయోజనమేమి యని నే నొక్కొక్కప్పు డాశ్చర్యపడుచుందును. పూర్వకాలపు గోమనుపటాలమువలన నేడెంత ప్రయోజనముండునో కాల్బలము, గుర్రపుదళమువలనను నంతియే ప్రయోజనముండును. వాయుయుద్ధము, వాయుబాంబులు, టాంకులు శక్తివంతమైన మరఫిరంగులు గల యీ రోజులలో బాణము, విల్లుకంటె తుపాకి కొంచెము శ్రేష్ఠమైనది; వారిశిక్షకులు, సలహాదారులు ఈ సంగతి గుర్తింపకపోలేదు.

భారతదేశములో బ్రిటిషు పరిపాలనా చరిత్ర యెట్టిది ? దాని దోషములు మన తప్పులఫలితములే యైనప్పుడు ఫిర్యాదు చేయుటకు మన మెవరము? పరివర్తనమను ప్రవాహములో సంసర్గమునువీడి ముసుగుగుంటలలో ప్రవేశించి మనలో మనము తృప్తి చెందుచు, నుష్ట్రపక్షివలె బయటజరుగుచున్న దానిని నిర్లక్ష్యముచేయుచో మన నాశనమునమే తెచ్చుపెట్టుకొనెదము. ప్రపంచములో బయలుదేరిన యొక్క నూతన భారతరంగ శిఖరముమీద బ్రిటిషువారు మన దేశము వచ్చి శక్తివంతమైన చారిత్రకశక్తులకు ప్రాతినిధ్యము వహించిరి. మనము మనల నెగురగొట్టుచు నిలువనీటు పడవేయు గాలి వానను గురించి ఫిర్యాదుచేతుమా? లేక మనలను గజగజ వణికించు చలిగాలిని గురించి చేతుమా? గతమును గత కలహములను చాలించి మనము భవిష్యత్తు నెదుర్కొనవలెను. శాస్త్రముచు వీర్యవంతమయిన తత్వం తతిని మనకు ప్రసాదించిన బ్రిటిషువారికి మనము కృతజ్ఞులము. అయినను బ్రిటిషు ప్రభుత్వమువారు భారతదేశములో చీలిక, మత పిచ్చి, అభివృద్ధిభంగము, కులకక్షలు, మోసము మొదలగు స్వభావములను ప్రోత్సహించుటకు చేసిన యత్నములను మరచిపోవుట లేక ప్రశాంతచిత్తముతో వీక్షించుట కష్టసాధ్యము బహుశః యదిమూడ మన కవసరమైన యొకపరీక్ష, యొకసవాలు. నవ్యభారత ముత్పన్నమగు లోపల దుర్బలత్వమును, నపవిత్రతను, అవినీతిని పోద్రోలి యగ్నితప్తముచేయువలెను.

# 55

## సివిల్ వివాహము - లిపి సమస్య

1933 సెప్టెంబరులో నొకవారము పూనా బొంబాయిలలో గడపిన తరువాత నేను లక్నో తిరిగివచ్చితిని. నా తల్లి యచ్చట నింకను ఆస్పత్రిలోనేయుండి చాల నెమ్మదిగ కోలుకొనుచుండెను. కమలకూడ లక్నోలోనుండి యామె కుపచారముచేయుచుండెను వారము వారము నా చెల్లెండ్రు అలహాబాదునుండి వచ్చుచుండిరి. నే నచ్చట రెండుమూడు వారములుంటిని. అలహాబాదులోకంటె నా కిచ్చటనే యెక్కువ తీరిక దొరికెను. నిత్యము ఆస్పత్రికిరెండుసారులు పోవుచుండుటయే నా ప్రధానకార్యము. తీరికగలగంటలలో నేను పత్రికలకు కొన్ని వ్యాసములు వ్రాసెడివాడను ఇవి దేశమంతట ప్రచురింపబడుచుండెను. "భారతమా ! యెచ్చటకు ?" అను నొక వ్యాసపరంపర ప్రజాదృష్టినాకర్షించెను. ఈ వ్యాసములు టెహారను కాబూలులలో పరిషియనుభాషలోనికి తర్జుమాచేయబడెనని నేను తెలుసుకొంటిని నవీనాభివృద్ధితోను. ఆధునిక పాశ్చాత్యభావము తోను సంపర్కముగలవారికీ వ్యాసములలో గ్రొత్తదనము, స్వకపోల కల్పితము లేవియునుండవు. కాని, హిందూదేశములో మన ప్రజలు గృహచ్ఛిద్రములలో మునిగియుండుటచే నితరచోట్ల జరుగు విషయ ములనవలోకించుట కంతె వీలులేకుండెను. నా వ్యాసముపట్ల చూప బడిన యాదరణయు, ననేక యితర సూచనలను ప్రజలు విశాల భావముల నభివృద్ధిచేయుచున్నారని విశదము చేసెను.

ఆస్పత్రిలోనుండుట మా తల్లి కతి విసుగుగ నుండుటచే మే మామె నలహాబాదు తీసికొనిపోవనిశ్చయించితిమి. నా సోదరి కృష్ణ కుమారి యొక్క వివాహముకూడ దీనికొక కారణము. హఠాత్తుగ నన్ను తిరిగి జయిలుకు తీసికొనిపోవులోపల నీ వివాహము జరిపించు టకు మేము వేగిరపడుచుంటిమి. శాసనోల్లంఘన మింకను కాంగ్రెసు కార్యక్రమములో నుండ కాంగ్రెసు సంస్థయు, ననేక యితర సంస్థలు

సత్రీసంఘములుగా నున్నను నన్ను బయట నెంతకాలముండనిచ్చెదరో నాకు తెలియకుండెను.

మేము అక్టోబరు మూడవవారములో వివాహము జరుపనెంచితిమి. దానినొక నాటకప్రాయముగ జరుపదలంచితిమి. యథార్థమునకు మాకు మరియొక మార్గములేక పోయినను, నేను దీనికి సంతసించితిని. ఈ వివాహము రెండువర్గముల మధ్య [బ్రాహ్మణ, బ్రాహ్మణేతరుల మధ్య] జరుగనుండెను. ప్రస్తుత బ్రిటిషుయిండియాను చట్టము ప్రకారము ఏ మతము నిట్టి వివాహమున కంగీకరింపదు. అదృష్టవశమున కాలికముగ నామోదింపబడిన యొక సివిల్ వివాహచట్టము మాకు సహాయ్యమయ్యెను. ఇట్టివి రెండు చట్టములుండెను. నా చెల్లెలి వివాహము జరిగిన రెండవ చట్టము క్రింద హిందువులు, తత్సన్నిహిత బౌద్ధ, జైన, సిక్కు మతస్థులు స్వతంత్రించి వివాహము చేసికొనవచ్చును. పుట్టుకచేత లేక మారుటచేత నభూపకు లీమతములలో నొకదానికి చెందకపోయినచో నీ రెండవ చట్టము వారికి వర్తింపదు. వారికి మొదటి చట్టము వర్తించును. దీని ప్రకారము వారు ముఖ్యములును ప్రధానమతములను నిరసింపవలెను. లేదా వారు వాటికి చెందనట్లొక వాఙ్మూలమునైన నివ్వవలెను. కేవల మనవసరమగు యీ నిరసన యొక పెద్దయుల్లరి. ఎట్టి మతేచ్ఛ లేనివారైనను చాలమంది యీ వాఙ్మూలమున కంగీకరింపనిచో యీ చట్టమువలన లబ్ధిపొందజాలరు. వివిధ మతములకు చెందు శిష్టాచార సంపన్నులంతర్వివాహములకు సౌకర్యమిచ్చు మార్పులను తిరస్కరింతురు. ఫలితమేమన ప్రజలిట్టి నిరసన వాఙ్మూలమునిచ్చునట్లు బలాత్కరింపబడుదురు. లేదా చట్టముక్రిందకువచ్చుటకు నామకః మార్చుచుందురు. వ్యక్తిగతముగ నే నంతర్వివాహములను ప్రోత్సహింపగోరెదను. మనము ప్రోత్సహించినను మానినను, అట్లుచేసికొనుట కంగీకరించు సామాన్య సివిల్ వివాహచట్ట మొకటి యత్యావశ్యకము. మతమును మార్చుకొనుట లేక నిరసించుట యవసరము లేకుండగనే యది యన్ని మతస్థులవారు వివాహముచేసికొనుట కనుమతింపవలెను.

నా చెల్లెలు వివాహమునుగురించి మే మెట్టి యట్టహాసము చేయలేదు. అది చాల నిరాడంబరముగ జరిగెను. సాధారణముగ భారత వివాహములలో జరుపబడు నట్టహాసము నాకు గిట్టదు. నా తల్లి వ్యాధిగ్రస్తురాలై యుండుటచే, నంతకంటె నెక్కువగ శాసనోల్లంఘన మింకను జరుగుచు మన సహచరులు చాలమంది జయిళ్ళలోనుండుటచేత నెట్టి యాడంబరమునకు తావు లేకుండెను. కొద్ది మంది బంధువులు స్థానిక స్నేహితులు నాహ్వానింపబడిరి ఇది నా తండ్రిగారి పాతస్నేహితులకు చాలమందికి కష్టము కలిగించెను. నేను వారిని బుద్ధిపూర్వకముగ నిర్లక్ష్యముచేసితినని యనుకొనిరి.

వివాహాహ్వానపత్రిక ల్యాటిను లిపిలో హిందూస్థానీ భాష వ్రాయబడెను ఇదియొక నూతనవిషయము. ఇట్టి యాహ్వానము లెప్పుడు నాగరిలిపిలోగాని పర్షియను లిపిలోగానియుండును. హిందూస్తానీభాషను ల్యాటిను లిపిలో వ్రాయుట సైనిక మిషనరీ సంఘములలో తప్ప మరెవరికీ తెలియదు. ప్రజలు దీని నెట్లు భావింతురో నేను చూడగోరితిని. ఇది యంత బాగుగ నాదరింపబడలేదు. ఇవి తక్కువ మందికే పంపబడెను. విరివిగ పంపియుండినచో మరింత యెక్కువ యనాదరణ పుట్టెడిది. గాంధీజీ నేను చేసినదాని కంగీకరింపలేదు.

నేను ల్యాటినుభాషను వరించుటచే దాని నుపయోగింపలేను టర్కీలోను, మధ్య ఆసియాలోను దానికి గలిగిన విజయము నన్ను మెప్పించెను. దానినభిమానించుటకుబలవత్తర కారణములే యుండెను. అయినను నేను విశ్వసింపలేదు. విశ్వసించినను ప్రస్తుత పరిస్థితులలో భారతదేశమున నది యుపయోగింపబడుటకు రవంత యాస్కారమును లేదని నే నెఱుగుదును దాని కన్నిప్రక్కలనుండియు, జాతీయవాదులు_మతము, హిందువులు, ముస్లిములు, నవీనులు, ప్రాచీనులు తీవ్రమైన వ్యతిరేకులు ఈ వ్యతిరేకము కేవల ముద్దేశముమీద నాధారపడదని నేను భావించెదను. గొప్పసంస్కారము. చరిత్ర గల యేభాషయైనను తనలిపిని మార్చుకొనుట సామాన్యవిషయము కాదు. ఏలనన లిపి సాహిత్యములో నొకయత్యంతసన్నిహితభాగము.

లిపిని మార్చినచో భిన్నశబ్దచిత్రములు, భిన్నధ్వనులు, భిన్నభావములు నుత్పన్నమగును. శ్రోత్రసాహిత్యమునకు, పాతసాహిత్యమునకు మధ్య దాటశక్యముకాని గోడయొకటి నిర్మింపబడును; రెండవది నశించి కొంచెమించుమించు విదేశభాషయగును. సంరక్షించుకొనుటకుదగిన సాహిత్యములేనిచోట నిట్టిసాహసము చేయవలెను. భారతదేశములో నే నిట్టిమార్పు భావింపజాలను. ఏలనన మనసాహిత్యము సారవంతమైనది. యమూల్యమైనది. అది మన చరిత్రతోను, భావములతోను బద్ధమైయున్నది. అది మన ప్రజల జీవితములతో సన్నిహిత సంబంధము కలిగియున్నది అట్టి మార్పును బలవంతముగ చేయుట క్రౌర్యము, హత్యయగును ఇది మన ప్రజాసామాన్య విద్యాభివృద్ధి నరికట్టును.

కాని యీ సమస్య భారతదేశములో నేడు తర్కింపవలసినది కూడకాదు సంస్కృతభాషనుండి పుట్టిన-హిందీ, బెంగాలీ, మరాటీ, గుజరాతీల కొక సామాన్యలిపి సృష్టించుటచే మనమిపుడు చేయవలసినది లిపిసంస్కారమని నాకు తోచుచున్నది. ఉన్నస్థితిలో వాటిలిపులొకేమూలమునుండి బయలుదేరి యెక్కువ భేదములులేక యుండుటచే నొక సామాన్యలిపిని కనుగొనుట కష్టముకాదు. దీనివలన నీ నాలుగు నేకగర్భజనితభాషలు మరింత సామీప్యము పొందగలవు.

ఇంగ్లీషుప్రభుత్వము భారతదేశములో వందలకొలది భాషలు గలవను నొక కథ ప్రపంచమునకు సతతము చాటుచుండెను. రుజువుకు జనాభాలెక్కలు కలవు. వీటి నొకతరగతికి చేర్చి 'వర్నాక్యులర్లు' అనగా బానిసల భాషలు అనిపిలుతురు. (ల్యాటినులో 'వర్నా' అనగా యింటపుట్టిన బానిసయని అర్థము) మనవారు చాలమంది, యీ యర్థము నెరుగక దీనిని స్వీకరించిరి. ఇంగ్లీషువారు భారతదేశములో నొకజీవితకాలము గడుపుచు భాషను బాగుగ నేర్చుకొనుట కెంతమాత్రము కష్టపడకపోవుట యాశ్చర్యము. వారియొద్ద నుండు 'ఖాన్‌సామా' (వంటలవాండ్రు, సేవకులు) సహాయముతో వారొకవిధమగు నసాధారణ పిచ్చిభాషను, పచ్చిపులుసు హిందుస్థానీ తయారుచేసి యదియే నిజమైన వస్తువని యూహింతురు భారత జీవి

తమును గురించిన విషయములను తమ క్రిందివారినుండి, యిచ్చకములాడువారినుండి గ్రహించునట్లే వారు హిందూస్థానీని గురించిన భావములను తమయింటి నౌకరులనుండి తీసికొనెదరు. నౌకరులు తమ 'సాహిబ్ లోగ్' (యజమానులు)కు మరేమియు నర్థముకాదను భయముచే పచ్చిపులుసు హిందూస్థానీలోనే మాట్లాడవలెనను నియమము పెట్టుకొనెదరు హిందూస్థానీభాషకు నితర భారత భాషలకు నుత్తమ సాహిత్యమున్న సంగతి వారి కెంతమాత్రము తెలియనట్లు కాన్పించును

భారతదేశములో రెండు మూడువందల భాషలున్నట్లు జనాభా లెక్కలు చెప్పునట్లే జర్మనీలో యేబది లేక అరువది భాషలున్నట్లు చెప్పుచున్నవి జర్మనీలోని చిలికలకు. వ్యత్యాసములకు నివి కారణములని యెవడును చెప్పినట్లు నాకు జ్ఞాపకము లేదు. యదార్థముకు జనాభా లెక్క అన్నివిధములగు చిన్న చిన్న భాషలను (ఒక్కొక్కప్పుడే కొద్దివేలమందియో మాట్లాడు భాషకూడ ఉదాహరించును తరుచు భాషాభేదములు కూడ శాస్త్రపరిశోధన కొరకు) వేరు వేరు భాషలక్రింద జేర్పబడును. వైశాల్యమునుబట్టి చూచినచో భారతదేశములో నతితక్కువ భాషలున్నట్లు నాకు కాన్పించును. యూరపులోని సమానవైశాల్యముగల ప్రాంతములతో పోల్చినచో భాషసందర్భములో నిచ్చట నెక్కువ సన్నిహిత బాంధవ్యమున్నది. కాని చదువు బొత్తిగా లేకపోవుటచే సామాన్య ప్రమాణములు లేక భాషాభేదము లేర్పడెను. భారతదేశములో నున్న ప్రధాన భాషలు హిందూస్థానీ, (హిందీ, ఉరుదు రెండు రకములును) బెంగాలీ, గుజరాతీ, మరాటీ, తమిళము, తెలుగు, మళయాళము, కన్నడము, వీనికి అస్సాముభాష ఉరియా, సింధి, పుస్తు, పంజాబీలను కలిపినచో (కొద్దిమంది యాటవికులు, కొండజాతులుతప్ప) దేశమంతయుపూర్తి యగును, వీనిలో నుత్తర, మధ్య, పశ్చిమ భారతములో వ్యాపించుయుండో ఆర్యనుభాషల కెక్కువ సంబంధము కలదు. దక్షిణముననున్న ద్రావిడభాషలు, భిన్నములైనను, సంస్కృతభాషాప్రభావమునకు లొంగి సంస్కృతపదములతో నిండియున్నవి.



పైనుదహరింపబడిన యెనిమిది ప్రధానభాషలకు యమూల్య ప్రాచీనసాహిత్యములు కలవు. వానిలో ప్రతిభాషయు నేడు పెద్ద ప్రాంతములలో మాట్లాడబడును. ఆ ప్రాంతములు స్పష్టముగ, నిస్సందేహముగ వేరుచేయబడియే యున్నవి. ఈ భాషలనుమాట్లాడువారిసంఖ్యలనుబట్టి చూచినచో నివి ప్రపంచములోనున్న పెద్దభాషలలో చేరును. అయిదుకోట్లమంది బెంగాలీభాష మాట్లాడుదురు. హిందూస్థానీ భారతదేశములో పదునాల్గుకోట్లమంది మాట్లాడుదురని నేనూహించెదను. అది భారతదేశమంతట చాలమందిచే కొంతవరకర్థము చేసుకొనబడుచున్నది. అట్టిభాషకు విశేషావకాశములు కలవు. అది బలీయమైన సంస్కృతభాషాపునాదిపైనిర్మింపబడి పర్షియనుతో సన్నిహిత సంబంధము కలిగియున్నది. ఈ విధముగ నది రెండు సారవంతములైన నిధులనుండి శక్తిని గ్రహింపగలదు. నిశ్చయముగ నీమధ్య సంవత్సరములలో నది యింగ్లీషు భాషనుండికూడ బలము సంపాదించెను. దక్షిణముననున్న ద్రావిడదేశ మొక్కచోటనే హిందూస్థాని రమారమి విదేశభాషవలెనుండును. కాని, యచ్చటిప్రజలు దానిని, నేర్చుకొనుటకు విశేషప్రయత్నములను చేయుచున్నారు. రెండు సంవత్సరముల క్రిందట (1932 లో) దక్షిణమున హిందీ ప్రచారము చేయుచున్న యొక యైచ్ఛిక ప్రయివేటుసంఘముయొక్క లెక్కలను నేను చూచితిని. గతపదునాల్గువత్సరములలోను దాని ప్రయత్నమువలన నొక్క మద్రాసురాష్ట్రములోనే 550,000 మంది హిందీ చదివినట్లు చెప్పబడెను ప్రభుత్వముచే నేవిధమునను బలపరుపబడని యైచ్ఛికయుద్యమమున కిది సామాన్య విషయము కాదు. హిందీ చదువుకొనినవారిలో చాలమంది తమంత తామే యీ యుద్యమ ప్రచారకు లగుచున్నారు.

హిందుస్థానీ భారతదేశములో సామాన్యభాష కాగలదనుటకు నా కెట్టి సందేహము లేదు. మామూలు పనులకు నేడదియట్లె యున్నది. లిపి నాగరలిపి యుండవలెనా పర్షియనులిపి యుండవలెనా యను మూర్ఖవాదములవలన దాని యభివృద్ధియరికట్టబడెను. ఎక్కువ సంస్కృత పదముల నుపయోగింపవలెనని యొకరు, పర్షియను పద

పైనుదహరింపబడిన యెనిమిది ప్రధానభాషలకు యమూల్య ప్రాచీనసాహిత్యములు కలవు. వానిలో ప్రతిభాషయు నేడుపలు ప్రాంతములలో మాట్లాడబడును. ఆ ప్రాంతములు స్పష్టముగ, నిస్సందేహముగ వేరుచేయబడియే యున్నవి. ఈ భాషలను మాట్లాడువారిసంఖ్యలనుబట్టి చూచినచో నివి ప్రపంచములోనున్న పెద్దభాషలలో చేరును. అయిదుకోట్లమంది బెంగాలీభాష మాట్లాడుదురు. హిందూస్థానీ భారతదేశములో పదునాల్గుకోట్లమంది మాట్లాడుదురని నే నూహించెదను. అది భారతదేశమంతట చాలమందిచే కొంతవర కర్థము చేసుకొనబడుచున్నది. అట్టిభాషకు విశేషావకాశములు కలవు. అది బలీయమైన సంస్కృతభాషాపునాదిపై నిర్మింపబడి పర్షియనుతో సన్నిహిత సంబంధము కలిగియున్నది. ఈ విధముగ నది రెండు సారవంతములైన నిధులనుండి శక్తిని గ్రహింపగలదు. నిశ్చయముగ నీమధ్య సంవత్సరములలో నది యింగ్లీషుభాషనుండికూడ బలము సంపాదించెను. దక్షిణముననున్న ద్రావిడదేశ మొక్కచోటనే హిందూస్థానీ రమారమి విదేశభాషవలెనుండును. కాని, యచ్చటిప్రజలు దానిని, నేర్చుకొనుటకు విశేషప్రయత్నములను చేయుచున్నారు. రెండు సంవత్సరముల క్రిందట (1932 లో) దక్షిణమున హిందీ ప్రచారము చేయుచున్న యొక స్వైచ్ఛిక ప్రయివేటుసంఘముయొక్క లెక్కలను నేను చూచితిని. గతపదునాల్గువత్సరములలోను దాని ప్రయత్నములవలన నొక్క మద్రాసురాష్ట్రములోనే 550,000 మంది హిందీ చదివినట్లు చెప్పబడెను. ప్రభుత్వముచే నేవిధముగను బలపరుపబడని స్వైచ్ఛికయుద్యమమున కిది సామాన్య విషయముకాదు. హిందీ చదువుకొనినవారిలో చాలమంది తమంత తామే యీ యుద్యమ ప్రచారకు లగుచున్నారు.

హిందుస్థానీ భారతదేశములో సామాన్యభాష కాగలదనుటకు నా కెట్టి సందేహము లేదు. మామూలు పనులకు నే డదియట్లె యున్నది. లిపి నాగరలిపి యుండవలెనా పర్షియనులిపి యుండవలెనా యను మూర్ఖవాదములవలన దాని యభివృద్ధియరికట్టబడెను. ఎక్కువ సంస్కృత పదముల నుపయోగింపవలెనని యొకకక్ష, పర్షియను పద

ముల నుపయోగింపవలెనని యొకకట్టు దానిని దిగలాగెను. రెండు లిపులనుకూడ నధికారరీత్యా యంగీకరించుట తప్ప దానికి వేరొక మార్గములేదు. ప్రజలు వారి యిష్టమువచ్చిన లిపి నుపయోగింపవలెను. కాని రెండు కొనలకు తీసికొనిపోవు స్వభావములను నిరుత్సాహపరచి సామాన్యోపయోగములో నున్న వాడుకభాషమీద నాధారపడు మధ్యరకపు సాహిత్యభాష నభివృద్ధిచేయుటకు ప్రయత్నము జరుగవలెను. జనసామాన్యములో విద్య యభివృద్ధియైన కొలది యిది విధాయకముగ జరుగగలదు. ప్రస్తుతము సాహిత్యాభిరుచికి, శైలికి మధ్యవర్తులనుకొనబడు చిన్నమధ్యతరగతి వర్గములవా రతిసంకుచిత మనస్కులు, ఛాందసులు. తమ ప్రజలతోను, ప్రపంచ సాహిత్యముతోను సంపర్కములేక, చైతన్యమనునదియే లేని ప్రాచీన రూపములకు వా రంటిపెట్టుకొనియుందురు.

హిందూస్థానీ భాషాభివృద్ధియు, వ్యాప్తి భారతదేశములోని యితర గొప్ప భాషలైన—బెంగాలీ, గుజరాతి, మరాటీ, ఉరియా, దక్షిణదేశ ద్రావిడభాషల యథోచితోపయోగముతోను, సంపదభివృద్ధులతోను తలపడరాదు, తలపడవు. వీనిలో కొన్ని హిందూస్థానీకంటె నిదివరకే యెక్కువ మెలకువను, బుద్ధిపాటవమును కలిగియున్నవి. ఆ యా ప్రాంతములలో విద్య గరపుటకు, నితర వ్యవహారములకు నవియే యధికారసమ్మతములైన భాషలు వానిద్వారా ప్రజాసామాన్యములో విద్య, విజ్ఞానము ఎక్కువ త్వరితముగ వ్యాప్తినొందగలవు.

ఇంగ్లీషు భారతదేశములో సామాన్యభాష కాగలదని కొందరు భావింతురు. ఏ కొద్దిమంది పై తరగతుల విద్యాధికుల విషయములోనో తప్ప నా కిది పిచ్చియూహవలె కాన్పించును ప్రజాసామాన్యముయొక్క విద్యా విజ్ఞాన సమస్యకు దీనికి సంబంధమేమియు లేదు. ఇంగ్లీషు అంతకంత కెక్కువగా సాంకేతిక, శాస్త్రి వ్యవహార విషయములలో నుత్తర ప్రత్యుత్తరములను జరుపుకొను భాషగ నుండవచ్చును. మనలో చాలమంది విదేశ భాషలను (ప్రపంచభావములను, చర్యలను తెలిసికొనుచుండుటకు) తెలిసికొను

టత్యావసరము. మన విశ్వవిద్యాలయములు యింగ్లీషుతోపాటు, ఫ్రెంచి, జర్మన్, రష్యన్, స్పానిషు, ఇటాలియను భాషలనుకూడ ప్రోత్సహింప కోరెదను. ఇంగ్లీషును నిర్లక్ష్యము చేయవలెనని దీని యర్థముకాదు. ప్రపంచమును గురించి సమదృష్టి కలిగియుంచ వలెనని మన మొక్క యింగ్లీషు సులోచనములనే ధరింపరాదు. ఒక్క భాషము, ఒక్క లక్ష్యమువిూదనే కేంద్రీకరించుటచేత మన మిదివర కేమానసికముగ కావలసినంత యంగవైకల్యము పొందితిమి. మన జాతీయవాదులలో నతిపిచ్చియెత్తినవారుకూడ భారతదేశము నకు సంబంధించిన బ్రిటిషుదృష్టినే తామెంత నిర్బంధింపబడిరో గుర్తింపజాలకున్నారు.

ఇతర విదేశభాషలను మనమెంత ప్రోత్సహించినను, ఇంగ్లీషు భాషయే మనలను బయటి ప్రపంచముతో కలుపు ప్రధానసంధాన కరణిగ నుండకతప్పదు. అది తప్పనిసరి. గతకొన్ని పురుషాంతరముల నుండి మన మాంగ్లము నభ్యసించుటకు యత్నించుచుంటిమి. ఈ యత్నములో మనము కొంత మంచి విజయమును గాంచితిమి. ఈచిర శిక్షవలన కలిగిన లబ్ధిపొందక మన మిపుడు దీనినంతను తుడిచి వేయుట మూర్ఖత్వమగును నేడు యింగ్లీషుకూడ చాల విశాల వ్యాప్తిని పొందిన ప్రపంచభాష యనుటకు సందేహము లేదు. అది యితరభాషలను వేగముగ దిగద్రొక్కుచున్నది. 'అమెరికను' భాష దాని స్థానము నాక్రమించిన తప్ప యదియే యంతర్జాతీయ వ్యవ హారములకు, రేడియోద్వారా వార్తాప్రసారములకు తగు భాష కాగల సూచనలు కలవు. కనుక మనమాంగ్ల భాషాజ్ఞానమును సాగింపు చునే యుండవలెను. దానిని సాధ్యమైనంతవరకు నేర్చుకొనుటయే యుక్తము; కాని యిపుడు మనలో కొంతమంది చేయుచున్నట్లు యీ భాషలోనున్న యందచందములను గ్రహించుట కెక్కువ శక్తిని, కాలమును వినియోగించుట ప్రయోజనహీనమని నా యభిప్రాయము. వ్యక్తు లట్లు చేయవచ్చును. కాని యనేక సంఖ్యాకులకు దానిని లక్ష్య

ముగానుంచుట వారిపై ననవసర భారమును వేయుట యగును; వారి యితర యభివృద్ధి కది యాటంకమగును.

ఈమధ్య 'సామాన్య ఆంగ్లము' న న్నెక్కువగ నాకర్షించెను. ఇంగ్లీషును యింత యత్యధికముగ సరళముచేయుట గొప్ప పురోభివృద్ధిసూచకము 'ప్రమాణ ఇంగ్లీషు' భాషకంటె మనము సామాన్య భాషను విరివిగ నేర్పించుట యుక్తము. మొదటిదానిని పండితులకు, ప్రత్యేక విద్యార్థులకు విడిచివేయవచ్చును,

హిందూస్తానీ యింగ్లీషునుండియు నితర విదేశభాషలనుండియు ననేక పదములను తీసికొని తనలో లీనముచేసికొనుటను నేను వ్యక్తిగతముగ ప్రోత్సహింపగోరెదను. మనకు నవీనపదములు లేవు. కనుక నిది యవసరము. సంస్కృతమునుండియు, అరబ్బీనుండియు నూతనముగ కష్టమైన పదజాలమును సృష్టించుటకంటె బాగుగ తెలిసిన పదములను వాడుటయే శ్రేష్ఠము. విదేశపదముల నుపయోగించిన భాష మైలపడిపోవుననీ కొందరందురు. ఇది చాల పొరపాటు. మన భాషను సాగునట్లుచేసి, ఇతరభాషలలోని పదములను, భావములను తనలో నిముడ్చుకొను శక్తిగలిగి పెరుగునట్లు చేసినప్పుడే భాష వృద్ధిపొందును

నా చెల్లెలు వివాహమగుటతోడనే నా సహచరుడు, పాత స్నేహితుడు, సంవత్సరమువయిగా వ్యాధిగ్రస్తుడునై యున్న శివ ప్రసాదగుప్తను చూచుటకు నేను కాశీ వెళ్ళితిని. లక్నోజయిలులో నుండగా నతనికి హఠాత్తుగ పక్షవాతము వచ్చెను. అప్పటినుండి యతడు నెమ్మదిగ కోలుకొనుచుండెను నేను కాశీలోనుండగ నొక చిన్న హిందీసాహిత్యసంఘము నాకు స్వాగతపత్రము నిచ్చెను. దాని సభ్యులతో నేను చక్కని యిష్టాగోష్ఠి సలిపితిని. నా కతిస్వల్పముగా తెలియు విషయములనుగురించి పండితులముందర మాట్లాడుటకు సందేహించుచుంటినని నేను చెప్పితిని. అయినను నేను కొన్ని సూచనలు చేసితిని. సమాసములతోను, అలంకారములతోను, కృత్రిమ సంస్కృతపదములతోను, ప్రాచీనరూపములతోను వ్రాయ

బడు హిందీని నేను విమర్శించితిని. కొద్దిమంది సభ్యులకే యుద్దేశింప బడు యీరాజభాషను విడిచిపెట్టవలెననిసూచించితిని. హిందీరచయి తలు బుద్ధిపూర్వకముగ ప్రజలకొరకు, ప్రజల కర్థమగు భాషలోనే వ్రాయవలెనని చెప్పితిని. ప్రజాసంబంధమువలన భాషకు నూతన వికాసము, సరళత చేకూరును. హిందీగ్రంథక ర్తలు పాశ్చాత్యభావ ములపట్ల, సాహిత్యముపట్ల నెక్కువ శ్రద్ధవహించినచో దానివలన నెక్కువలబ్ధి పొందగలరని నేను సూచించితిని. యూరపియనుభాషల యుత్తమకావ్యములనుండియు. నాధునిక భావములనుగురించి వ్రాయు పుస్తకములనుండియు, తర్జుమాలనుచేయుట చాల యవసరము. ఆధునిక బెంగాలీ, గుజరాతీ, మరాటీలు, యీ సందర్భములలో నాధునిక హిందీకంటె నెక్కువ నభివృద్ధిలో నున్నవనికూడ నేను చెప్పితిని. నిశ్చయముగ హిందీకంటె బెంగాలీలో నీమధ్య నెక్కువ కల్పనాశక్తి ప్రదర్శింపబడెను ఈ విషయములనుగురించి మిత్ర సంభాషణలను జరిపినతరువాత నేను వచ్చివేసితిని. నా విమర్శలు పత్రికలకు పంపబడునని నేను భావింపలేదు. అచ్చటనున్నవారెవరో హిందీపత్రికల కొరకు రిపోర్టు పంపిరి.

అప్పుడు హిందీపత్రికలు నన్నుగురించి గగ్గోలుపెట్టి నేను హిందీని విమర్శించుచు నది బెంగాలీ, గుజరాతీ, మరాటిలకుతీసిపో వు చున్నదని చెప్పసాహసించితి నని యల్లరిచేసెను నేనేమియు తెలి యనివాడ ననియు; నన్నుఅణచివేయుటకు మందలించుటకు ననేక పరుష పదము లుపయోగింపబడెను. ఆ చర్చను గమనించుటకు నాకు తీరిక లేకపోయెను అది నేను తిరిగి జయిలుకు పోవువరకు సాగుచునే యుండెనట!

ఈ విషయము నాకు కనువిప్పయ్యెను. అది హిందీపండితుల యొక్కయు,పత్రికారచయితలయొక్కయు నసాధారణ సహనహీన్య తను,తమ బాగుకోరినవారిచే చేయబడిన యొకచిన్న నిష్కపటవిమర్శను భరించుటపట్ల వారి నిరాకరణమును తెలుపుచుండెను. తెక్కువవార మహించుకొనుటయా? యను భావము పనిచేసెను. ఆత్మవిమర్శయను

నది యెంతమాత్రము లేదు. విమర్శక ప్రమాణములు హీనముగ నుండెను గ్రంథకర్తయు విమర్శకుడు పోరుపెట్టుకొని వ్యక్తిగత యుద్దేశ్యములు గలవని యొకరినొకరు నిందించుకొనుట యసామాన్య విషయముగాదు. వారి దృష్టియంతయు సంకుచితము. బూర్జువావాసన కలది. ప్రాంతీయాభిమానము. గ్రంథకర్తలు, పత్రికారచయితలు విస్తారమైన ప్రజాసామాన్యమును, వారిప్రయోజనములను నిర్లక్ష్యము చేసి యొకరికొరకొక రొకచిన్న కూటముకొరకు వ్రాసికొనుచుండు నట్లు కన్పించును. అతివిశాలము, నాకర్షణీయమునగు రంగస్థల ముండగ నిట్లుచేయుట విచారము, దురదృష్టము, శక్తినిపాడుచేయుట.

హిందీసాహిత్య భూతచరిత్ర గొప్పది; కాని యదియెల్లకాలము దానిమీదనే జీవింపజాలదు. దానికి గొప్ప భావికలదనియు, నీదేశ ములో హిందీపత్రిక లద్భుతశక్తివంతములగుననియు నే నెరుగుదును. కాని, ఈరెండును సంకుచితయాచారములను త్రోసివేసి ధైర్యముగ ప్రజల నుద్దేశించి వ్రాయువరకు నెక్కువ యభివృద్ధి నొందజాలవు.

## కులతత్త్వము - తిరోగమనము

విఠల్భాయి పటేలు యూరపులో మరణించెనని నా చెల్లెలి వివాహములో వింటిమి. అతడు చాలకాలమునుండి బాధపడుచు ననారోగ్యకారణముచేతనే భారతదేశ జయిలునుండి విడుదలబడెను. అతని మరణము మాకు పిడుగుపడినట్లుండెను. సంగ్రామమధ్యమున మా నాయకశ్రేష్ఠు లొక్కొకరితరువాత నొకరు మమ్ము విడుచుండిరను భావ మసాధారణ మనఃఖేదమును కలిగించుచుండెను. విఠల్భాయి యనేక మొప్పులను బడసెను. అతని అసెంబ్లీయధ్యక్షత, పార్లమెంటరీశక్తి ప్రఖ్యాతిబడసెను. ఇది పూర్తిగా సత్యము. కాని దీనిని పదేపదే పునశ్చరణచేయుట నాకు కోపము కలిగించెడిది. హిందూదేశములో మంచి పార్లమెంటేరియనులను లేక సభానాయకస్థానము నలంకరింప గలవారికి నెప్పుడైనను కొఱతయున్నదా? మన న్యాయవాదకీట మనల నాపనికే యర్హులచేసెను. విఠల్భాయి యంతకంటె చాల గొప్పవాడు. అతడు భారతస్వాతంత్ర్యముకొఱకు పోరిన యప్రతిహత వీరశిఖామణి.

నవంబరులోనే నేను కాశీ వెళ్ళినపుడు హిందూవిశ్వవిద్యాలయ విద్యార్థుల కుపన్యసింపగోరిరి. నేను దీనికంగీకరించి వైసుఛాన్సెలరు మదనమోహనమాలవ్యాగారి యధ్యక్షతక్రింద నొక పెద్దసభలో నుపన్యసించితిని. నా యుపన్యాసములో నేను కులతత్వమునుగురించి యెక్కువగ చెప్పవలసివచ్చెను. నేను దానిని తీవ్రభాషలో— ముఖ్యముగ హిందూమహాసభాచర్యలను గర్హించితిని. నేనుముందుగ భావించుకొని యీ పని చేయలేదు కాని కులతత్త్వవాదుల పురోభివృద్ధి నరికట్టు ప్రయత్నముపయి నాకు చాలకాలమునుండి యపరిమిత కోప ముండెను. నే నా విషయము నందుకొనునరికి కోపము కొంత పైకుబికెను. హిందూకులతత్త్వవాదుల తిరోభావముగురించి నేను బుద్ధిపూర్వకముగనే నొక్కి చెప్పితిని. ఏలనన హిందూమహాసభవ

చాలకాల మొక స్తంభముగానుండిన మాలవ్యాజీ యధ్యక్షతవహిం చిన సభలో హిందూమహాసభను విమర్శించు టంత సభ్యమైనపని కాదని, నాకాసమయమున తోచలేదు. ఇటీవల నతనికి దానితో నంత సంబంధములేకపోవుటచే నాకది తోచలేదు. మహాసభయొక్క నూతన నాయకు లతనిని రమారమి గెంటివేసినట్లు కాన్పించెను. అతడు నాయకులలో నొకడుగా నున్నంతకాలము హిందూమహాసభ రాజ కీయముగ తిరోగమనము నహింపలేదు. అయినను నతని యాహ్వా నముమీాద వెళ్ళి యతనిని పరిహాసస్థితిలోనుంచు విమర్శనలుచేయుట తగదని నేను తరువాత గ్రహించితిని. నేను దీనికి చాల చింతించితిని.

నేను మరియొక ప్రమాదమునకుకూడ విచారించితిని. అజమీా రులో నొక హిందూయువజనసంఘముచే నూతనముగ నామోదింప బడిన తీర్మానప్రసకలు మాకు టపాద్వారా పంపబడెను. ఈ తీర్మా నము చాల యభ్యంతరమైనది. నేను దీనిని నా కాశీ యుపన్యాస ములో నుదహరించితిని. నిజమున కిట్టి తీర్మానమేదియు నెట్టిసంఘము చేతను గావింపబడలేదు. నే మొక మోసములో పడిపోతిమి.

నా కాశీయుపన్యాసము గగ్గోలుపుట్టించెను. అట్టికేకలకు నే నలవడినను హిందూమహాసభనాయకుల దాడిలోనున్న తీవ్రతకు నే నెంతయో యాశ్చర్యపడితిని ఈదాడులు చాలవరకు వ్యక్తిగతముగ నుండి సారాంశమునకు కావలసినవిషయమునుముట్టకుండెను. వారు వెళ్ళ వలసినంతవరకు వెళ్ళిరి చివరకు నా కవకాశము చిక్కెను. నేను నెలలకొలది (జయిలులోనున్నప్పుడుకూడ) వారికి సమాధానమిచ్చుట కాతురపడుచుంటిని. కాని దానినెట్లు చేపట్టవలెనో తెలియకుండెను. అదియంతయు నొక కందిరీగల గూడు. నేను కందిరీగల కలవడిన వాడనైయైనను బూతుల క్రింద పరిణమించిన చర్చలోనికి దిగుట ముదావహము కాదు. కాని, యది నాకు తప్పనిసరియయ్యెను. నేను హిందూ, ముస్లిము కులతత్త్వములనుగురించి నాకు సహేతుకముగ కన్పించిన యొక వ్యాసమును వ్రాసితిని. ఈ రెండును నమ్మతగిన కులతత్త్వములు కావని, వానివెనుక దాగియున్న సాంఘిక, రాజ కీయ తిరోభావములనియు నేను రుజువుచేసితిని. కులనాయకుల యుప

వ్యాసములయొక్కయు, నా ఉపన్యాసములయొక్కయు వార్తాపత్రికలనుండి
తీసినముక్కలు నాయొద్దనుండెను. నాయొద్ద కావలసినంత విషయ
ముండుటచే దానినంతను నొక వార్తాపత్రిక వ్యాసములో నిముడ్చుట
చాల దుర్ఘటముగ నుండెను.

ఈ నా వ్యాసము భారతపత్రిక లన్నింటిలోను ప్రకటింప
బడెను దానిలో నే నుద్యమములను గురించియు నెంతయో వ్రాసినను
వారు మిన్నకుండుట వింతగ నుండెను నన్ను తీవ్రముగ విమర్శించిన
హిందూమహాసభానాయకు లసలే నోరెత్తలేదు. ముస్లిములలోని ప్ర
సర్ మహమ్మదు ఇక్బాలుగారు రెండవ రౌండు టేబిలు కాన్ఫరెన్సును
సంబంధించిన కొన్ని యంశములను సవరించుటకు ప్రయత్నించెను.
అయినను నా వాదమునుగురించి యతడేమియు మాట్లాడలేదు.
నే నతనికిచ్చిన సమాధానములో రాజకీయ,కుల సమస్యలను రెంటిని
కూడ కాన్స్టిట్యుయెంటు అసెంబ్లీ నిర్ధారణ చేయవలెనని సూచించి
తిని. తరువాత కులతత్వమునుగురించి నేను మరి యొకటి, రెండు
వ్యాసములను వ్రాసితిని. ఈ వ్యాసము లాదరింపబడుటయేగాక
యోచనచేయువారిపయి మంచి ఫలితము కలుగజేసినందులకు నే
నపరిమితోత్సాహము పొందితిని కులతత్వము వెనుకనున్న రాగ
ద్వేషములను మంత్రించివేయగలనని నే నూహింపలేదు. కులనాయ
కులు భారతదేశములోను, యింగ్లండులోనుగల యత్యంత తిరోగమన
వాదులకు జ్యేష్ఠభ్రాతలని చూపుటయే నాయుద్దేశ్యము. నిజము
నకు వారు రాజకీయాభివృద్ధికి సాంఘికాభివృద్ధికి శత్రువులు. వారి
కోరికలకు ప్రజలతో నెట్టి సంబంధము లేదు. పైనున్న చిన్న బృంద
ములవారికి కొంత యభివృద్ధి కలుగజేయుటకే యవి యుద్దేశింప
బడెను. 'హిందూ ముస్లిము యైక్యము' అని తరుచు వేయబడు కేక
(నిస్సందేహముగ నుపయోగకరమే యైనను) యైకమత్యరాహిత్య
కారణములను తెలిసికొనినగాని నిష్ఫలమని నాకు కాన్పించెను.
అయినను యీ గారడీమంత్రమును తరచు జపించినచో నైక
మత్యము చివరకూడివచ్చునని కొందరు భావించుచున్నట్లు కాన్పించును.

1857 విప్లవము లగాయతు కులసమస్యపట్ల బ్రిటిషునీతి యెట్లుండెను? ఈచరిత్ర వినదగినది. హిందువులు, ముస్లిములు ఏకమై పనిచేయుట కభ్యంతరములను కల్పించి యొకరిపయి నొకరినాడించుట వారి నీతియైయుండెను. 1857 తరువాత ప్రభుత్వము హిందువులకంటె మహమ్మదీయులనే కన్నెఱ్ఱగచూచెను. ముస్లిములెక్కువకాలముద్వ్రే మనని, భారతదేశములో మొన్నటివరకు పరిపాలకులమను స్మృతి వారి కుండునని, వా రుపద్రవకరులని ప్రభుత్వము భావించెను. ముస్లిములు నూతనవిద్యకు దూరులై ప్రభుత్వముక్రింద కొద్దియుద్యోగములను మాత్రమే కలిగియుండిరి. ఇదియంతయు సందేహమునకు కారణ మయ్యెను. హిందువులు ఇంగ్లీషుభాష నతిసుకరముగ నవలంబించి గుమాస్తాపదవులను గుత్తగొనిరి. వారు చాలసాధువులుగకాన్పించిరి.

అప్పుడు నూతనజాతీయత—పైనుండి ఇంగ్లీషుచదువుకొనిన పై తరగతివిద్యార్థులనుండి యభివృద్ధిమయ్యెను. ఇది సహజముగ హిందువులలోనేయుండెను. ముస్లిములు విద్యలో వెనుకబడియుండిరి. ఈ జాతీయత యతిసాధుభాషలో, హీనస్వరముతో మాట్లాడెను. అయినను బ్రిటిషుప్రభుత్వమునకిది రుచించలేదు. కనుక వారు ముస్లిములను ప్రోత్సహించుచు వారిని జాతీయవేదికనుండి వేరుచేయగోరిరి. ఇంగ్లీషువిద్య లేకపోవుటొక్కటే ముస్లిముల కాటంకముగనుండెను. కాని యిది క్రమముగ తొలగిపోకతప్పదు. దూరదృష్టితో బ్రిటిషువారు భవిష్యత్తుకు పునాదులను వేసుకొనిరి. ఈ కృషిలో వారికిగొప్ప వ్యక్తియగు సర్ సయ్యద్ అహ్మదుఖాను సాయపడెను.

సర్ సయ్యదు తనజాతి దుస్థితికి (ముఖ్యముగ విద్యలో)విచారపడెను. బ్రిటిషుప్రభుత్వ దృష్టిలో తనజాతిపట్ల నాదరాభిమానములు లేవని ఖేదపడెను. తన సమకాలికులు చాలమందివలెనే యతడు బ్రిటిషువారి నెక్కువగ మెచ్చుకొనెడివాడు. అతని యూరపు సందర్శన మతనిపైగొప్పఫలితమును కలుగచేసెను. 19వ శతాబ్దమధ్యమున నున్న యూరపు, లేక పశ్చిమయూరపు తన విజ్ఞానశిఖరము నధిరోహించి, ప్రపంచమునకప్రతిహతరాణియై, తన యాధిక్యతకు

కారణములగు గుణసంపత్తుతో మెరయుచుండెను. పై తరగతుల యాస్తులతిభద్రముగనుండి గొప్పమార్పులు కలుగునను భీతిలేక దిన దినాభివృద్ధిచెందుచుండెను. అవి స్వేచ్ఛ యభివృద్ధియగుచున్న దినములు. జగత్కల్యాణము జరుగునను నమ్మకముగలదినములు. అచ్చటకు వెళ్ళిన భారతీయు లీ గంభీరదృశ్యముచే నాకర్షింపబడుటలో నాశ్చర్యమేమియులేదు. మొట్టమొదట హిందువులెక్కువమంది వెళ్ళిరి. వారు యూరపును, యింగ్లండును మెచ్చుకొనుచు తిరిగి వచ్చిరి. క్రమముగ వారాకాంతికి, భ్రాంతికి నలవడుటచే మొదటి యాశ్చర్యము తొలగిపోయెను. కాని సర్ సయ్యదుగారి విషయములో మొదటి యాశ్చర్యము,. మోహము చాల ప్రస్ఫుటముగ నుండెను. 1869 లో యింగ్లండును దర్శించి యతడు తన యభిప్రాయముల నింటికి వ్రాసెను. ఒకయుత్తరములో నతడిట్లు వ్రాసెను. భారతదేశములోనున్న యింగ్లీషువారు ఆ దేశప్రజలను పశువుల వలెను, హేయముగను, అమర్యాదగను చూతురను నేరమునుండి వారిని నేను విడుజాలకపోయినను వారు మనల నర్థముచేసికొన జాలకపోవుటచేతనే యట్లు చేయుచున్నారని భావించెదను. మనలను గురించిన తమ యభిప్రాయములలో వారంతదోషులు కారనికూడ నే నొప్పుకొనకతప్పదు. ఇంగ్లీషువారిని పొగడకుండగనే భారతదేశములోనున్న ప్రజలు, యెక్కువవారును, తక్కువవారును, పెద్దవర్తకులును, చిన్నదుకాణదారులును, విద్యాధికులును, విద్యలేనివారును యింగ్లీషువారితో పోల్చి చూచినచో విద్యలోను, నడకలోను నిజాయితీలోను, సమర్థుడగు, స్ఫురద్రూపియైనవానిముందర నందవికారమగు జంతువెట్లుండునో యట్లుండెదరు. హిందూదేశములోనున్న మనలను నిర్వీర్యమైన పశువులని విశ్వసించుట కాంగ్లేయులకు కారణముగలదు... నేను చూచినది, నిత్యమును చూచుచుండునది భారతీయుని యూహ కెంతమాత్రము నందని విషయములు...ఆధ్యాత్మికముగ, లౌకికముగ మానవున కుండవలసిన సద్విషయములన్నియు భగవంతునిచే యూరపునకు, ముఖ్యముగ యింగ్లండునకు ప్రసాదింపబడెను.

బ్రిటిషు వారిని,యూరపును ఇంతకంటె నెక్కువగ నెవడుపొగ డగలడు? సర్ సయ్యదు కత్యద్భుతమైన యభిప్రాయముకలిగినట్లువిశద మగుచున్నది. బహుశఃయతడు తన నిజప్రజనునిద్రనుండి మేల్కొల్పు టకు ముందంజవేయునట్లుప్రోత్సహించుటకు ఘాటైనభాష నుపయో గించి, వ్యత్యాసములనుత్ప్రేక్షించెను.పాశ్చాత్యవిద్యనభ్యసించుటయే యీ ముందంజ యని యతడు విశ్వసించెను. ఆ విద్యలేనిదే యతని సంఘ మంతకంతకు వెనుకకు పోవును, నిర్వీర్యమగును. ఇంగ్లీషువిద్య యనగా ప్రభుత్వోద్యోగములు, భద్రత, పలుకుబడి గౌరవము కనుక నీ విద్యపట్ల నతడు తన శక్తినంతను వినియోగించి తన ప్రజలను తన వలెనే యోచించునట్లు చేయ ప్రయత్నించెను. అతడు వారి బుద్ధి యితర విషయములమీదకు బోకుండచూడగోరెను. ముస్లిముల స్తబ్ధ త్వమును, సందేహములను ఛేదించుట కష్టసాధ్యము. హిందూబూర్జు వాలచేత ప్రతిపాదింపబడు నూతన జాతీయారంభము వారి బుద్ధిని చెడగొట్టుదానివలె నతనికి గాన్పించెను. కనుక నతడు దాని నెది ర్చెను. పాశ్చాత్యవిద్యలో నర్ధశతాబ్దముముందంజ వేసినహిందువులు ప్రభుత్వమును విమర్శించు వినోదములో క్రీడింపవచ్చును. తనవిద్యా విషయిక ప్రయత్నములలో నతడా ప్రభుత్వసహాయమును పూర్తిగ నపేక్షించెను. కనుక ననాలోచితకార్యములచే నతడు దీనినిపోగొట్టు కొన నిష్టపడక జాతీయకాంగ్రెసుపట్ల విముఖుడయ్యెను. బ్రిటిషు ప్రభుత్వమిట్టి దృక్పథమునుప్రోత్సహించుట కువ్విళ్ళూరు చుండెను.

ముస్లిములకొరకు పాశ్చాత్యవిద్యమీద కేంద్రీకరింపవలెననెడి సర్ సయ్యదు నిశ్చయము యుక్తమైనదే. అది లేకుండ వారు యీ క్రొత్తరకపు జాతీయ నిర్మాణములో నుచితపాత్ర వహింపజాలరు. వారు తమకంటె నెక్కువ విద్య, యార్థికపరిస్థితులు గలిగిన హిందు వుల వెనుక నుండవలసిన గతి పట్టియుండెడిది. చరిత్రచేతను లక్ష్యము చేతను ముస్లిము లపుడు బూర్జువా జాతీయోద్యమమునకు సిద్ధముగ లేరు. వారిలో హిందువులలోవలె బూర్జువాలు లేరు, కనుక సర్ సయ్యదు కృషి పైకి చాల మితవాదపరముగనే కాన్పించి నను నిజమైన విప్లవదశలోనుండెను. ముస్లిము లింకనుప్రజాస్వామిక

వ్యతిరేకమైనఫ్యూడల్ లత్యములోనే మునిగియుండిరి. కాని హిందువులలోని మధ్యతరగతివారు యూరపియను లిబరలుల స్థాయిలో నాలోచింప నారంభించిరి. ఉభయులు పూర్తిగ మితవాదులు. బ్రిటిషు ప్రభుత్వముపై నాధారపడినవారు. సర్ సయ్యదుగారి మితవాదము, కొద్దిమంది ధనవంతులగు మూస్లిము భూఖామందుల మితవాదము. హిందూమితవాదము వృత్తిలోను, పత్రికములోను అతి జాగ్రతగ సంచరించుచు పరిశ్రమలకు, పెట్టుబడికి మార్గము వెదుకుచుండువాని మితవాదము. ఈ హిందూ రాజకీయవేత్త లింగ్లీషు లిబరలిజముయొక్క ప్రకాశమానమగు కాంతులైన గ్లాండ్‌స్టన్, బ్రైటు యిత్యాదులవైపు చూచుచుండుదురు. ముస్లిము లట్లు చేసిరని నేననుకొనను బహుశః వారుటోరీలను, యింగ్లండులోని భూములున్న తరగతులను మెచ్చుకొనిరి. ఆర్మీనియాలో జరిగిన హత్యలను, టర్కీని గాడ్‌స్టన్ పదేపదే గర్హించుటచే వారికి బూచివలె నుండెను. డిస్రాలీటర్కీయెడల నెక్కువస్నేహముగ నున్నట్లుకాన్పించెను; కనుక వారతనియెడల కొంచెము పక్షపాతము వహించిరి.

సర్ సయ్యదు యుపన్యాసములు కొన్ని నేడు వింతగనుండును. 1887 డిశంబరులో లక్నోలో నతడిచ్చిన యుపన్యాసములో నాసమయములోనే జరుగుచున్న జాతీయకాంగ్రెసుయొక్క యతి మితవాద కోరికలను విమర్శించి గర్హించెను. సర్ సయ్యద్ "ప్రభుత్వము వారాఫ్ఘనిస్థానముతో పోరినను లేక బర్మాజయించినను వారినీతిని విమర్శించుటమనపనికాదు...చట్టములనుచేయుటకు ప్రభుత్వమొక కౌన్సిలును నిర్మించెను...ఈకౌన్సిలు కది యన్నిరాష్ట్రములనుండి ప్రజల పరిస్థితులతోను, పరిపాలనతోను గొప్పపరిచయముకలవారి నెన్నుకొనెను. మరియుసంఘములోను తమస్థానము నాక్రమించుటచే ఆ యసెంబ్లీలో స్థానమునకర్హులగువారిని కొందరి నెన్నుకొనును. సమర్థతకుబదులుసంఘస్థితినిబట్టి వారి నేల యెన్నుకొనవలెను? అని కొందరడుగవచ్చును. తక్కువజాతివాడు లేక పేరుప్రఖ్యాతులులేని వంశమువాడు బి. ఏ. లేక యం. ఏ యై కావలసిన సమర్థతకలిగియున్నచో నతడు తమపై యధికారము వహించి, తమజీవితములను, ఆస్తిని మార్చుచట్టములనుచేయు

పదవిలోనుండుటకు మన యుత్తమజాతులలో నొప్పుకొనునా? యని నేను మిమ్ముల నడుగుచున్నాను. ఎన్నటికి యొప్పుకొనరు...వైస్రాయి సద్వంశ సంజాతునితప్ప మరెవరిని తనసహోద్యోగిక్రిందజేసికొని, తన సోదరునివలెభావించి, ప్రభువులు, డ్యూకులు మొదలగువారితో మెలగవలసిన విందుల కాహ్వానింపజాలడు...ప్రభుత్వము శాసనములనుచేయుట కవలంబించిన పద్ధతులలో ప్రజాభిప్రాయములను మన్నించుటలేదని మనము చెప్పకలమా? చట్టములను చేయుటలో మనకు భాగములేదని మనము చెప్పగలమా? నిశ్చయముగ నట్లు చెప్పజాలము.”

భారతదేశములోని 'ఇస్లాముప్రజాస్వామికము' యొక్క ప్రతినిధియు నాయకుడు నీవిధముగ మాట్లాడెను. అయోధ్యతాలూకుదార్లు, ఆగ్రా, బీహారు, బెంగాలురాష్ట్రములలోని భూఖామందులు నేడు ఈ సరళిలో మాట్లాడుటకు సాహసింతురని నే ననుకొనను. అయినను సర్ సయ్యదు ఈ విషయములో ననన్యుడుకాడు. అనేక కాంగ్రెసుయుపన్యాసములుకూడ నేడింత వింతగనేకాన్పించును. కాని యప్పటి హిందూ ముస్లిము సమస్యయొక్క రాజకీయ, ఆర్థికస్థితి యిటుండెను. పైకిలేచుచున్నట్టియు, నార్థికముగ మంచి స్థితిలోనున్నట్టియు మధ్యతరగతి [హిందువులు] ఫ్యూడలు భూస్వాములతరగతిచే (ముస్లిములు) కొంతవరకు నెదుర్కొనబడి,యడ్డగింపబడెను. హిందూ భూఖామందులు తరచు తమబూర్జువాలతో సన్నిహిత సంబంధము కలిగియుండి మధ్యతరగతులవారి కోరికలపట్ల తటస్థముగను, లేక సానుభూతితోనుకూడ నుండెడివారు. బ్రిటిషువారెప్పుడు ఫ్యూడలు సంఘమును బలపర్చెడివారు. ప్రజాసామాన్యమును, మధ్యతరగతులలోని క్రిందితరహావారును [ఇరువంకలవారును] ఈ చిత్రములో బొత్తిగ కాన్పించరు.

శక్తివంతము, నధికారసమన్వితమునగు సర్‌సయ్యద్‌రూపము భారతముస్లిముల నాకర్షించెను. అలీఘరు కళాశాల యతనికోరికల యొక్క స్థూలాకారము. మార్పులువచ్చు కాలములో నొక యభివృద్ధిదాయకభావము త్వరలోనే తనపని నిర్వర్తించినదై, కాలముతీరి

యాలంకారిక నుండవచ్చును. భారత లిబరలులే దీనికి చక్కని సాక్ష్యము. వారు ప్రాచీనకాంగ్రెసుసాంప్రదాయమునకుసంతతివారనియు తరువాతవచ్చిన మనము మధ్యగావచ్చినవారమనియు తరచు ప్రస్తావకముచేయుదురు, నిశ్చయము. కాని ప్రపంచము మారుచుండుటవలన పాతకాంగ్రెసు సాంప్రదాయము గతవత్సర హిమములో మాయమగునని యదియొక జ్ఞప్తిగమిగిలెనని వారుమరచిపోయిరి. అట్లే సర్ సయ్యదు సందేశ మా కాలమునకు తగియుండెను. అవసరమయ్యెను. కాని యది యభివృద్ధిచెందుసంఘముయొక్క తుదిలక్ష్యము కాజాలదు. అత డింకొక పురుషాంతరము జీవించియున్నచో నతడే తన సందేశమునకు మరియొకరూపకల్పన చేసియుండెడివాడు. లేక నితరనాయకులతని పాతసందేశమునకు నూతన యర్థముచెప్పి దానిమారుచున్న పరిస్థితుల కన్వయింపగలిగెడువారు. కాని, సర్ సయ్యదుకు కలిగిన విజయము నతని స్మరణయెడలగల పూజ్యభావముచే పాతవిశ్వాసము వీడుట కష్టసాధ్యమయ్యెను. దురదృష్టవశమున భారతదేశములోని ముస్లిములకు నూతనమార్గము చూపించు విశేష ప్రతిభగలసమర్థులు కొఱతగనున్నారు. అలీఘరు కళాశాల చక్కనిపని చేసెను అనేకమంది సమర్థులను తయారుచేసెను; ముస్లిమువిద్యాధికుల దృష్టినంతను మార్చివేసెను. అయినను అది తన గూడుదాటి బయలుకుపోజాలకుండెను. ఫ్యూడలుతత్త్వము దానిపై రాజ్యముచేసెను. సామాన్య విద్యార్థి లక్ష్య మెప్పుడు ప్రభుత్వనౌకరిమీద నుండెను. స్వతంత్ర పరిశోధన, యాత్మ సాహసము మచ్చునకైన నతనిలో గానరావు. ఒక డిప్యూటీ కలెక్టరు పదవి వచ్చుచో నత డపరిమితానందభరితుడగును ఇస్లాము ప్రజాస్వామికములో తా నొక సభ్యుడనను కొనుటతో నతని గర్వ ముపశమించును. ఈ సౌభ్రాతృత్వమునకు దాఖలాగా టర్కీషుఫెజ్ అనబడు నొక యెఱ్ఱటోపి నతడు గోటుగ తలపయి ధరించును. దీనిని తురుష్కులే త్వరలో విడిచివేసిరి. ఈ విధముగ ప్రజాస్వామికమునకు తన శాశ్వతాధికారమును స్థిరపరచుకొనిన తరువాత భారతదేశములో రాజకీయ ప్రజాస్వామికమున్నదా లేదా యను విచారము నతడు పెట్టుకొనడు.

ఈ సంకుచితదృష్టి ప్రభుత్వ నౌకరీలకొరకు దేవురించుట అలీ ఘరు లేక నితరచోట్ల గల ముస్లిము విద్యార్థులకొక్కరికే నియమింప బడలేదు. సహజముగ నెట్టి సాహసము లేని హిందూవిద్యార్థులలో నిది తత్తుల్యముగనే ప్రదర్శింపబడుచున్నది. కాని పరిస్థితులు చాల మంది నీ బాటనుండి తరిమెను. వీరసంఖ్యాధికముగ నుండిరి. వీరందరికి చాలినన్ని నౌకరీలు లేవు, కనుక వీరు జాతీయ విప్లవోద్యమమునకు వెన్నెముకయైన విద్యాధిక కులబాహులైరి.

సర్ సయ్యదుగారి రాజకీయసందేశ సంకుచిత ఫలితమునుండి భారత ముస్లిము లింకను పూర్తిగ కోలొకొనకమును పేయిరువదియవ శతాబ్దారంభమున జరిగిన విషయములు వారికిని జాతీయోద్యమము నకును గల భేదమును పెంపుచేయుటకు బ్రిటిషుప్రభుత్వమునకు సహాయపడెను. సర్ వలెన్టిన్ షిరాల్ తన 'భారతదేశ యసం తృప్తి' యను పుస్తకములో నిట్లు వ్రాసిరి. "నేడు భారతదేశ మహ మ్మదీయు లొక్కుమ్మడిగా తమ ప్రయోజనములను, యాశయము లను బ్రిటిషు పరిపాలనాస్థాపనతోను, స్థిరత్వముతోను నైక్యముచేసి కొనినట్లు మున్నెన్నడు చేసియుండలేదని ధైర్యముగ నొక్కి వక్కా ణింపవచ్చును." రాజకీయ జోస్యములు చాల యుపద్రవకరములు. సర్ వలెన్టిన్ వ్రాసిన ఐదేండ్లలోనే ముస్లిము విద్యాధికులు తమ బంధనములను త్రెంచుకొని కాంగ్రెసుతో చేయి కలుపుటకు గట్టి ప్రయత్నము చేయుచుండిరి. పదేండ్లలో భారత ముస్లిములు కాంగ్రె సును మించినట్లు కాన్పించిరి. వారు కాంగ్రెసుకే దారి చూపు చుండిరి. కాని యీ పదేండ్లుచాలముఖ్యమైనవి మహాసంగ్రామము వచ్చి ఛిన్నభిన్నమైన ప్రపంచమును మరణకాల యాస్థిగా మన కర్పించెను

అయినను సర్ వలెన్టిన్ యట్టి పర్యవసానమునకు వచ్చు టకు బాహ్యముగ ననేక కారణములు గలవు. ఆగాఖాను ముస్లిము నాయకుడయ్యెను. వారింకను ఫ్యూడల్ సాంప్రదాయముల కంటి పెట్టుకొని యుండిరనుట కా విషయమేచాలు. ఆగాఖాను బూర్జువా నాయకుడు కాడు. అతడు చాల డబ్బుగల రాకుమారుడు; ఒక మత

శాఖకు నాయకుడు; బ్రిటిషువారిదృష్టిలో, బ్రిటిషుపాలకజాతులతో నతనికి సన్నిహిత సంబంధముండుటచే, నతడు గొప్పపురుషుడు. అతనికి విశేషవిజ్ఞానము కలదు. గొప్పయింగ్లిషుభూస్వామి జీవితము వంటి జీవితమును, వేటాడుజీవితమును, యెక్కువగ యూరపులోనే జీవించెను. ఈ విధముగ వ్యక్తిగతముగ నతనికి సంకుచిత కులవిషయములు, సంఘవిషయములు లేవు. అతడు భూస్వాములైన ముస్లిములను, వృద్ధిచెందుచున్న బూర్జువాలను బ్రిటిషు ప్రభుత్వముతో జోడించుటకే ముస్లిము నాయకత్వము వహించెను. కులసమస్య నిజముగ రెండవది; ప్రధానలక్ష్యముకొరకే దానికి ప్రాముఖ్యత యివ్వబడును. ఆగాఖాను వైస్రాయి మింటో ప్రభువుకు "బంగాళా విభజనవలన కలిగిన రాజకీయస్థితిని గురించి మహమ్మదీయుల యభిప్రాములను తెలిపెను. లేనిచో తొందరపడి హిందువుల కెక్కువ రాజకీయహక్కులివ్వబడవచ్చును. దీనివలన నధికసంఖ్యాకులైనహిందువుల ప్రభ యెక్కువగుటచే నది బ్రిటిషుపరిపాలనా స్థైర్యమునకు సర్వోవాద రాజభక్తిగల యల్పసంఖ్యాక మహమ్మదీయుల ప్రయోజనములకు నుపద్రవకరముగ నుండును" అని నచ్చచెప్పెనని షిరాల్ చెప్పుచున్నాడు.

కాని బాహ్యముగ బ్రిటిషుప్రభుత్వముతోనున్నను దీనివెనుక నితరశక్తులు పనిచేయుచు డెను నూతన ముస్లిము బూర్జువాలు తమ పరిస్థితులతో నంతకంత కసంతృప్తులగుచు జాతీయోద్యమమున కాకర్షింపబడుచుండిరి ఆగాఖానుగారే యీ విషయమును గుర్తించి బ్రిటిషువారిని తగిన భాషలో మందలించిరి. 1914 జనవరిలో ఎడింబరో రివ్యూలో వ్రాయుచు ప్రభుత్వము హిందువులను ముస్లిములను విడదీయు పద్ధతి మానుకొనవలసినదనియు, రెండు మతముల లోని మితవాదులను నొక మకాములోనికి పోగుచేసి రెండు సంఘములకు చెందిన యువక భారత తీవ్రజాతీయభావముల నెదుర్కొనవలెననియు నతడు ప్రభుత్వమునకు సలహాచెప్పెను. కనుక నతనికి ముస్లిము కుల ప్రయోజనములందుకంటె భారతదేశ రాజకీయ పరివర్తన నడ్డగించుటయందే యెక్కువ శ్రద్ధయున్నట్లు విశదమగుచున్నది.

కాని, ఆగాఖాను బ్రిటిషు ప్రభుత్వము ముస్లిము బూర్జువాలను జాతీయతనుండి మరల్పజాలకపోయిరి. ప్రపంచయుద్ధము దీనిని మరింత త్వరితపరచెను. క్రొత్తనాయకులు రంగము నాక్రమించుటతోడనే ఆగాఖానుకు స్వస్తిచెప్పబడెను. అలీఘరు కాలేజీ స్వరముకూడ మారిపోయెను. క్రొత్తనాయకులలో ఆలీసోదరు లిరువురు నతిశక్తి సామర్థ్యములు కలవారు. వారిరువురు ఆలీఘరు కళాశాలలోనివారే! డాక్టరు యం. యె. అన్సారీ, మౌలానా అబుల్ కలాం అజదు, యింకను అనేకమంది బూర్జువా నాయకులు ముస్లిము రాజకీయవ్యవహారము లలో ప్రధానపాత్రవహింప నారంభించిరి. అట్లే, కొంచెముతక్కువ మోతాదులో, యం. యె. జిన్నాయును చేసెను. గాంధీజీ యీ నాయకులలో చాలమందిని సాధారణముగ ముస్లిములను తనఅసహాయోద్యమములోనికి లాగివేసెను. 1919_23 లో వారు నాయకపాత్ర లను వహించిరి.

తరువాత తిరోగమనము వచ్చెను. హిందువులలోను ముస్లిములలోను బలవంతముగ వెనకకు నెట్టివేయబడిన కులప్రముఖులు ముందుకు వచ్చిరి. ఇది కొంచెము నెమ్మదిగ జరిగినను, విడువకుండ సాగింపబడెను. కులద్వేషము లుండుటచే హిందూ మహాసభకు మొదట కొంత ప్రాముఖ్యత కలిగెను. కాని, రాజకీయముగ నది కాంగ్రెసు నెక్కువగ మెప్పించలేకపోయెను. ముస్లిముకులసంఘములు తమప్రజలలో కొంత పలుకుబడి తిరిగిసంపాదించుకొనగలిగెను. అయి నప్పటికి ముస్లిమునాయకులలో బలమైనవర్గము మొదటినుండి చివర వరకు కాంగ్రెసుతోనే యుండిరి. బ్రిటిషుప్రభుత్వమీలోపల రాజకీయ తిరోగాములైన ముస్లిము కులనాయకులకు కావలసినంత ప్రోత్సాహమునిచ్చెను. వీరి విజయములను గమనించి హిందూ మహాసభవారు తిరోగమనములో వీరితో పోటీచేయ ప్రారంభించిరి. ఈవిధముగ ప్రభుత్వదయ సంపాదింపవచ్చునని వీరనుకొనిరి. మహాసభలో ముందంజవేయువారు తరిమివేయబడిరి. లేక వారంతట వారే విడిచి వెళ్ళిపోయిరి. అది యంతకంతకు మధ్యతరగతిలోని పైతరహా వైపు, ముఖ్యముగ ఋణదాత, బ్యాంకరులవైపు మొగ్గెను.

శాసనసభా స్థానముల పంపకముగురించి నిరంతరాయముగ చర్చించుకొనుచున్న యిరువంకల కులరాజకీయవేత్తలు ప్రభుత్వ ప్రాపకముకొరకే చూచుచుండిరి. అది యుద్యోగములకొరకు మధ్య తరగతి విద్యాధికుల గుంజులాట. ఉద్యోగములుతక్కువ;కనుక వాటి కొరకు హిందూముస్లిము కులనాయకులు పోట్లాడుకొనిరి. మొదటి వారు స్వరక్షణకొరకు రెండవవారంతకంత కెక్కువకావలెనని పోరిరి. ఈ పోరాటముల వెనుక మరియొక ప్రముఖపోరాటముండెను. అది కేవలము కులసమస్య కాదు; కాని, దానికి దోహదమునిచ్చెను. మొత్తముమీద హిందువులు పంజాబు, సింధు, బెంగాలులలో నెక్కువధనికులు, ఋణ దాతలు, పట్టణవాసులు; ముస్లిము లీ రాష్ట్రములలో నెక్కువబీదలు, ఋణగ్రస్తులు, గ్రామవాసులు, కనుక తరచు వీరిపోరాట మార్థిక మైనది కాని దాని కెవ్వడు కులస్వభావము కల్పింపబడెడిది. గ్రామ ఋణములను తగ్గించుటకు తీసికొనిరాబడినవివిధ రాష్ట్రములలోని చర్చలలో నిది యీమధ్య గతించిన మాసములలో, ముఖ్యముగ పంజాబులో, పైకి పొక్కెను. హిందూమహాసభాప్రతినిధులు మొదటి నుండియు వీని నెదుర్చు బ్యాంకరులతరగతి పక్షము వహించిరి.

హిందూమహాసభ ముస్లిముకులతత్వమును విమర్శించు తమ జాతీయతలో నెట్టి కళంకము లేదని యెల్లప్పుడు చాటుచుండును. ముస్లిముసంస్థ లసాధారణ కులతత్వప్రచోదితములని యందరకు తెలిసిన విషయము. మహాసభయొక్క కులతత్వము జాతీయత ముర ఖాలో నుండుటచే నంత సులభగ్రాహ్యము కాదు. జాతీయము, ప్రజా స్వామికమునగు పరిష్కారము పయితరగతి హిందూప్రయోజనము లకు నష్టము కలిగించినపుడు పరీక్షవచ్చును, ఈ పరీక్షలో హిందూ మహాసభ యనేకసారులోడిపోయెను. కొద్దిసంఘమువారి అర్థికప్రయో జనములకొర కధికసంఖ్యాకులు ప్రకటించిన కోరికలకు భిన్నముగ వారు సింధుదేశ విభజనమును మొదటినుండియు నెదిరించిరి.

కాని, రౌండుటేబిలు కాన్ఫరెన్సులలో హిందూముస్లిముకుల తత్వవాదులిరువురు నసాధారణప్రతీకారమును జాతీయ వైరుధ్య మును ప్రదర్శించిరి. బ్రిటిషుప్రభుత్వము నిక్కచ్చియైనకులతత్వము

గల ముస్లిములను మాత్రమే పేర్కొనెదమని పట్టుబట్టిరి. వీరు ఆగాఖాను నాయకత్వముక్రింద నత్యంతతిరోగాములు బ్రిటిషుపబ్లిక్ జీవితములో నత్యంత యుపద్రవకరులునైన వారితో నేకమయిరి. ఆగాఖాను, అతనిబృందము లాయిడ్ ప్రభువుతోను, అతని పార్టీతోను సన్నిహిత సంబంధము కలిగియుండు టాశ్చర్యము. వారు మరియొక యడుగు ముందుకువేసి, యూరపియను సంఘప్రతినిధులతోను, యితరులతోను, ఆర్. టి. సి లో సంధులను చేసికొనిరి. ఇది విచారకరవిషయము. ఏలనన యీసంఘము హిందూదేశములో భారత స్వాతంత్ర్యమునకు ప్రబల విరోధి.

హిందూమహాసభా ప్రతినిధులు దీనికి జవాబుగ స్వాతంత్ర్యమున కన్నివిధములగు నాటంకములను (ముఖ్యముగ పంజాబులో) బ్రిటిషు ప్రయోజనములకొరకు సంరక్షణలను కోరిరి. బ్రిటిషుప్రభుత్వముతో సహాకారముచేయు ప్రయత్నములతో వారు ముస్లిములను చిత్తుచేయ ప్రయత్నించి. దేనిని సాధింపకపోగా, తమ నిజవిషయమునే పాడుచేసుకొని స్వాతంత్ర్యధర్మమునకు ద్రోహమొనర్చిరి. ముస్లిము లాత్మగౌరవముతో మాట్లాడిరి. హిందూకులతత్త్వవాదులు దీనికైనను నోచుకొనలేదు.

ముఖ్యవిషయమేమనిన యిరుపక్షముల నాయకులు కొద్దిమంది పయితరగతికి ప్రాతినిధ్యమువహించి తమ స్వార్థములకొరకు ప్రజల మతద్వేషములను కొల్లగొని, లబ్ధిపొందుచున్నారు. ఉభయులునార్థిక సమస్యల విచారణనణచివేయుటకు, తప్పించుటకుసర్వప్రయత్నములు చేయుదురు. ఈ సమస్యల నణచిపెట్టరాని సమయము త్వరలోనే రానున్నది. అప్పు డిరువరియొండ్లక్రిందట ఆగాఖాను తీవ్రవాదుల నెదుర్చుట కొక సామాన్యకూటముక్రింద జేరవలెనని మితవాదుల కిచ్చిన సలహానేయుభయపక్షకులనాయకులు చాటుదురు. కొంతవరకది యిదివరకే కాన్పించుచున్నది. ఉభయపక్షములవారు బహిరంగముగ నెంతపోరాడుకొనినను అసెంబ్లీలోను యితరచోట్ల నభివృద్ధి భంజక తీర్మానములను చేయుటకు ప్రభుత్వమునకు సహాయము చేయుటలో సహాకారము చేసికొనుచున్నారు. ఈ ప్రితయము ఒటావా

తీర్మానములో మిళావుకాలేదా !

ఈలోపుగ ఆగాఖానుకు కన్సర్వేటివు పార్టీ యొక్క కుడిపక్ష ములో నతివాదులకు సన్నిహిత సంబంధము సాగుచునేయుండెను. 1934 అక్టోబరులో నతడు బ్రిటిషు నౌకాదళమువారి విందుకు గౌరవ యతిథిగ వెళ్ళెను. లాయిడ్ ప్రభువు దీని కధ్యక్షుడు. లాయిడ్ ప్రభువు బ్రిస్టల్ లో జరిగిన కన్సర్వేటివు కాన్ఫరెన్సులో బ్రిటిషు నౌకాదళ మును మరింత బలపర్చవలెనని చేసిన సూచనల నీయన మనఃపూర్వ కముగ నామోదించెను. ఈ భారతనాయక శిఖామణి సామ్రాజ్య మును, యింగ్లండును కాపాడుటయందు బాల్డ్విన్ కంటె లేక 'జాతీయ' ప్రభుత్వముకంటె నెక్కువయాతుర పడుచు బ్రిటిషు నౌకా దళ మభివృద్ధికావలెనని వారికంటె ముందంజవేసెను. అవును! ఇది యంతయు శాంతికొరకు !

మరుసటి నెలలో 1934 నవంబరులో, లండను నగరములో నొక ఫిలుము ప్రయివేటుగ చూపబడెనని రిపోర్టు చేయబడెను. "ముస్లిము ప్రపంచము బ్రిటిషు సామ్రాజ్యముతో నవిచ్ఛిన్న స్నేహము" దాని యుద్దేశ్యము ఈ సందర్భములో ఆగాఖాను లాయిడ్ ప్రభువు నతిథులుగ పిలువబడిరట. ఈ యుభయులు నవినా భావముగ నైక్యమైపోయిరి. రెండు గుండెకాయలు - తేజబహాదుర సప్రూ, యం.ఆర్. జయకర్లు మన జాతీయ రాజకీయములలోవలె- ఒకటివలె స్పందించును. భారత దేశము కత్యధిక సంతర్పణ జరుగు చున్నదని లాయిడ్ ప్రభువు అధికారములోనున్న కన్సర్వేటివు నాయకులమీదను, జాతీయ ప్రభుత్వముమీదను దయాదాక్షిణ్య రహితముగ ధ్వజమెత్తెను.

ఇటీవల కొంతమంది ముస్లిము కులనాయకులయుపన్యాసముల లోను, వాఙ్మూలములలోను చిత్రమైన మార్పుకాన్పించును. దీనికి నిజమైన ప్రాముఖ్యతలేదు. కాని చాలమంది యిట్లు భావింతురని నే ననుకొనను. అయినను యిది కులతత్త్వ చిత్తప్రవృత్తిని తెల్పును. దీనికి పెద్ద ప్రాముఖ్యత యివ్వబడెను. భారతదేశ 'ముస్లిముజాతి', 'ముస్లిము విజ్ఞానము', హిందూముస్లిము 'విజ్ఞానముల' పరస్పర

బద్ధవైరుధ్యము ప్రధానములయ్యెను. దీని విధాయక సారాంశ
మేమన యీ రెండు 'విజ్ఞానములకు' మధ్యవర్తిగనుండుటకు, వీనిని
సమదృష్టితో నడపుటకు బ్రిటిషుప్రభుత్వ మాచంద్రార్కము భారత
దేశములో నుండవలెను. కొద్దిమంది హిందూకులనాయకులు సరిగా
యిట్లే భావింతురు. ఒక్క వ్యత్యాసము మాత్రముండును. తా మధిక
సంఖ్యాకులుగ నుండుటచే తమ ముద్దరగల 'విజ్ఞానమే' చివరకు
జయించునని వా రాసింతురు.

హిందూ, ముస్లిము 'విజ్ఞానములు', 'ముస్లింజాతి'—ఈ పదము
లాకర్షవంతములగు భూతకాలచారిత్రక వీధులను, భవిష్యద్వర్త
మాన వాయు సౌధములను యెంత చిత్రముగ తెరచును ! భారత
దేశములో ముస్లిముజాతి – జాతిలోజాతి. యిది యిమిడికయైనది
కూడ కాక నస్పష్టము, నిర్ధారణచేయుటకు వీలులేనిది. రాజకీయ
ముగ నీభావమసంగతమైనది; ఆర్థికముగ నిది పిచ్చిమాట. అవిచా
ర్యము. ఇది దీనివెనుకనున్న చిత్తవృత్తిని తెలుపుటలో మనకు
తోడ్పడుచున్నది. మధ్యయుగములలో నిట్టి కలియరాని వేరు వేరు
'జాతులు' ఉండెడివి. ఆటమను సుల్తానుల ప్రథమ దినములలో
కాన్‌స్టాంటునోపిలులో నిట్టి 'జాతి' వేరుగ జీవించి కొంత స్వాతం
త్ర్యము కలిగియుండెడిది. ల్యాటిను క్రిస్టియనులు, సనాతన క్రిస్టి
యనులు, జ్యూమతస్థులు మొదలగువా రుండెడివారు. ఇది యన్య
రాష్ట్రముల నాక్రమించుకొనుట కారంభము, ఇటీవల నిది యనేక
ప్రాచ్యదేశముల కుపద్రవములుగ పరిణమించెను. కనుక "ముస్లిము
జాతి" యనగా జాతియనునదెంతమాత్రముకాదని మతసంబంధముకల
దని యర్థము. అనగా ఆధునిక యర్థములో యేజాతిని వృద్ధిచెందనీయ
రాదని యర్థము. అనగా నాధునిక నాగరికతను విడిచి మనము తిరిగి
మధ్యయుగ పద్ధతులకు పోవలెననియర్థము. నిరంకుశప్రభుత్వము లేక
విదేశప్రభుత్వము చివరపర్యవసానము. మనస్సుయొక్క యుద్రేక
స్థితితప్ప వేరేమియులేదని యదార్థములను, ముఖ్యముగ నార్థిక
యదార్థములను నెదుర్కొనునిచ్ఛలేకుండుట యని యర్థము. రాగా
దుల తర్కమును తల్లక్రిందులు జేయుమార్గముకలదు. అవి యహేతు

కముగ కాన్పించుచున్నంత మాత్రమున మనము వానిని నిర్లక్ష్యము చేయజనదు. కాని ముస్లిముజాతి యను భావ మల్పభావముల కట్టు కథమాత్రమేయగును. పత్రికలలో దాసికీయబడిన ప్రచురణయే లేని యెడల దాని నెవరును వినియే యుండకపోవుదురు. చాలమందియొక వేళ దానిని విశ్వసించినను యదార్థజ్ఞానముచే నదిపలాయనమగును.

హిందూ, ముస్లిము 'విజ్ఞానము' అను భావములుకూడనిట్టివే. 'జాతీయవిజ్ఞానములు' అనుభావములుకూడ శీఘ్రముగ నశించుచున్నవి. ప్రపంచమంతయు నొకేవిజ్ఞానకేంద్రమగుచున్నది. జాతులన్నియు చాలకాలమువరకు తమప్రత్యేక చిహ్నములను–భాష, ఆచారములు, భావించువిధములు మొదలగువానిని, ఉంచుకొనవచ్చును. కాని యంత్రయుగము, శాస్త్రము, శీఘ్రయానము. ప్రపంచ వార్తల నవిచ్ఛిన్నముగ సరఫరాచేయుట, దూరశ్రవణము, సినిమా – మొదలగు వాని నంతకంతకు చదునుచేయును. ఈ విధాయకస్వభావము నెవడు నెదిరింపజాలడు. ఆధునిక నాగరికతను ధ్వంసముచేయు ప్రపంచ యుత్పాతమొక్కటియే దీనినివారింపగలదు. సాంప్రదాయజన్యమైన హిందూముస్లిము జీవిత వేదాంతములలో నిశ్చయముగ ననేక భేదములుకలవు. కాని ఈ రెంటిని యాధునిక శాస్త్రీయ,పారిశ్రామిక జీవితదృష్టితో పోల్చిచూచినచో నీభేదములుకాన్పించవు. ఏలనన ఈ రెండవదానికిని మొదటిరెంటికిని విశేషయంతరువుకలదు. నేడు భారతదేశములోనున్నయదార్థపోరాటము,హిందూ ముస్లిమువిజ్ఞానము అది యీ రెంటికి, వీనిని జయించుచున్న యాధునికనాగరికతయొక్క శాస్త్రీయ విజ్ఞానమునకుమధ్య కలదు. 'ముస్లిమువిజ్ఞానమును' (అదియేదయైనను) రక్షించుకొనగోరువారు హిందూవిజ్ఞానముగురించి బాధపడనక్కఱలేదు. వారు పశ్చిమదిశనుండివచ్చు రాక్షసిని కాచుకొనవలెను. ఆధునికశాస్త్రీయ, పారిశ్రామిక విజ్ఞానము నెదుర్కొను ప్రయత్నములన్నియు హిందువులవికానిండు ముస్లిములవికానిండు విఫలములగునని చెప్పుటకు వ్యక్తిగతముగ నాకెట్టిసంశయములేదు. నేనీ విఫలతను నిర్విచారముగ వీక్షించుచుందును. రైల్వేలు మొదలగునవి యిచ్చుటకు వచ్చినప్పుడే యనైచ్ఛికముగను, అబుద్ధిపూర్వ

కముగను మనముకోరితిమి. అలీఘరుకళాశాలను ప్రారంభించినపుడు సర్ సయ్యదు భారతముస్లిములతరఫున కోరుకొనెను. కాని నిజముగా మనకెవరికి నీ విషయములో నెట్టి స్వేచ్ఛయులేదు మునిగిపోవువాడు గడ్డిపరకనైనను పట్టుకొని రక్షింపదలచుకొను స్వేచ్ఛయే మనకు కలదు.

కాని, యీ'ముస్లిముల విజ్ఞానము'యేది? ఇది అరబ్బులు, పరిష్యనులు, తురుష్కులు మొదలగువారుచేసినఘనకార్యములకు సంబంధించిన యొకవిధమగు కులస్మృతియా? లేక భాష, కళ, గానము, ఆచారములు మొదలగువాని స్మృతియా? వర్తమాన ముస్లిము కళ, ముస్లిము గానముల నుదహరించినవాడొక్కడు నాకు కాన్పించడు. భారతదేశములో ముస్లిముభావముల నుత్పన్నముచేసినవి అరబ్బీ, పరిష్యనుభాషలు; ముఖ్యముగ రెండవది కాని పరిష్యనుభాషయుచ్చారణలో మతవాసన యేమియులేదు. పరిష్యనుభాషయు, ననేకపరిష్యను సాంప్రదాయములు, ఆచారములు వేలకొలది సంవత్సరములక్రిందట భారతదేశమువచ్చి యుత్తర హిందూదేశమంతట తన ప్రభావమును వ్యాపింపజేసెను. పరిష్యాదేశము ప్రాచ్యులకు ఫ్రాన్సువంటిది. అదితన భాషను, విజ్ఞానమును తన యిరుగు పొరుగు వారికి పంపును. అది భారతదేశములోనున్న మనకందరికి సామాన్యమైన, యమూల్య పిత్రార్జితము

ఇస్లామికజాతులు, దేశములు సాధించినఘనకార్యాభిమానమే బలవత్తరమైన యిస్లామికానుబంధములలో నొకటిగ కాన్పించును. వివిధజాతుల యీ యుదారచరిత్రకు ముస్లిములపట్ల యసూయపడు వారుందురా? వారు దానిని జ్ఞప్తియందుంచుకొని ప్రేమించునంత కాలము వారినుండి దానినెవరును తీసికొనిపోజాలరు. యథార్థమునకే గతచరిత్ర చాలవరకు మనకందరకు సామాన్యపిత్రార్జితము. ఏలనన యూరపుయొక్క యత్యాచారముపై ఆసియాదేశస్థులమైన మనల నొక సామాన్యబంధ మైక్యముచేయుచున్నట్లు భావింతుము. స్పెయినుదేశములోనున్న అరబ్బుల పోరాటములనుగురించి, క్రైస్తవులు చేసిన మతయుద్ధములను గురించి నేనెప్పుడు చదివినను నాసాను

భూతి వారి ప్రక్కనే యుండెడిది. నేను నిష్పక్షపాతముగ నుండుటకు విజయమునకు సంబంధించియుండుటకు ప్రయత్నించితిని. నే నెంత ప్రయత్నించినను యాసియా దేశపు ప్రజల సంబంధమువచ్చినపుడు నాలోనున్న యాసియాతత్త్వము నా విమర్శను మార్పుచేసెడిది.

ఈ "ముస్లిమువిజ్ఞానము"ను తెలిసికొనుటకు నే నెంతయో ప్రయత్నించితిని. కాని నేను సఫలుడను కాలేదని యొప్పుకొనుట తప్పదు. ఉత్తరహిందూ దేశములో నత్యల్పసంఖ్యాకులగు మధ్య తరగతి ముస్లిములమీదను హిందువులమీదనుపరిమ్యానుభావకు, సాంప్రదాయములకు పలుకుబడియున్నటు నేను చూచితిని. ప్రజాసామాన్యమును చూచినచో 'ముస్లిమువిజ్ఞానము' యొక్క స్పష్టమైనచిహ్నము లేవియున పొడుగు పొట్టిగాని యొక తరహా పాయిజామాలు, మీసముల నొక ప్రత్యేకవిధమున గొరిగించుట లేక కత్తిరించుట, గడ్డమునుమాత్రము స్వేచ్ఛగ పెరుగనిచ్చుట, ప్రత్యేకరకమైన మూతిగల యొక చెంబు—ఇట్లే హిందువుల యాచారములు ఒక ధోవతి ధరించుట, పిలకజుట్టు, మరియొకవిధమగు చెంబు. నిజమున కీ భేదములు కూడ పట్టణములకు సంబంధించినవి. అవి మాయమగుచున్నవి. ముస్లిము వ్యవసాయదారును, పారిశ్రామిక వర్కరును హిందూవ్యవసాయదారునుండి, వర్కరునుండి వేరుచేయుట కష్టము. ముస్లిము విద్యార్థికు లరుదుగ గడ్డమును పెంచుదురు. అలీఘరు యింకను జాలుతోనున్న యఱ్ఱటి తురుష్కటోపీని (తుర్కీదేశము దానిని విడిచిపెట్టినను అది తురుష్కమనబడును) వరించును. ముస్లిముస్త్రీలు చీరలుకట్టుకొని మెల్ల మెల్లగా ఘోషావీడి పయికివచ్చుచున్నారు. నా రుచు లీ యాచారములలోని కొన్నింటితో నైక్యము కాజాలవు. నాకు గడ్డమును, మీసములు, పిలకలు గిట్టవు. కాని నా రుచులను నే నితరులపై బలవంతవరుప నిచ్ఛగింపను. కాని యమానుల్లా కాబూలులో గడ్డముల నమూలాంతము తీయించివేసినపుడు నేను సంతోషించితినని యొప్పుకొనక తప్పదు.

ఎల్లప్పుడు వెనుకకే తిరిగిచూచు హిందువులు, ముస్లిములు, తమ చేతులనుండి జారిపోవుచున్నవానినే పట్టుకొనుచుండువారును

శోచనీయమగు దృశ్యమును ప్రదర్శింతురు. నేను భూతకాలమును గర్హింపగోరుటలేదు, తిరస్కరింపగోరుటలేదు. మన భూతకాలములో ప్రత్యేక సౌందర్య మెంతయో కలదు. అది శాశ్వతముగ నుండునను టకు నా కెట్టి సందేహములేదు. కాని వీ రా సౌందర్యమును వరిం పరు; ఏ రతి నిష్ప్రయోజనమైనదానిని, తరుచు హానిచేయుదానిని గ్రహింతురు.

ఇటీవల సంవత్సరములో భారత ముస్లిములకు నిరంతరాయ ఘాతలు తగిలెను. వారత్యంత ప్రేమతో దోహదముచేసికొనినయనేక భావములుముక్కలైపోయెను. ఇస్లాముకు గురుపీఠమైన టర్కీ 1920 లో భారతదేశము దేనికొరకతిధైర్యముగ పోరెనో, యట్టి ఖిలాఫతుకు స్వస్తిచెప్పుటకే క్రమక్రమముగ మతమునే విడిచిపెట్టెను. టర్కీ యొక్క నూతనచట్టములో నది ముస్లిము ప్రభుత్వమని చెప్పబడెను. కానియెట్టిదురభిప్రాయములు కలుగకుండుటకు కెమల్ పాషా 1927 లో నిట్లుచెప్పెను. "టర్కీ ముస్లిము ప్రభుత్వమని చట్టములో చేయబడిన సూత్ర మొక రాజీసూత్రము. మొట్టమొదటి యవకాశముదొరకుటతోడనే యది తుడిచివేయబడును." తరువాతి నతఁడీ సూచనప్రకార మాచరించెనని నేను విశ్వసించెదను. ఈజిప్టుకూడ మరింతయెక్కువ జాగ్రతతోనైనను, టర్కీననుసరించుచు తన రాజకీయములను మత సంబంధము లేకుండ నుంచెను. అట్లే, చాల వెనుకబడియున్న అరబు తప్ప, తక్కినయరబుదేశములుచేసెను. పరిశ్చాత్యతన వైజానిక ప్రబోధము కొరకు వెనుతిరిగి యిస్లాముయొక్క పూర్వపురోజులను కాంక్షించు చున్నది. ప్రతిచోట మతము వెనుకకుపోవుచున్నది. జాతీయత ముం దుకు వచ్చుచున్నది. జాతీయత వెనుక సాంఘిక, ఆర్థిక విషయములను గురించిచెప్పు యితర 'యిజములు' తత్వములువచ్చుచున్నవి. 'ముస్లిము జాతి" "ముస్లిమువిజ్ఞానము"సంగతి యేమయ్యెను! ఇక ముందది దయా సముద్రులగు బ్రిటిషు పరిపాలకులక్రింద యుత్తర హిందూదేశములోనే కాన్పించునా?

---

# 57

## ప్రతిష్టంభన

నా నిర్భంధము, శిక్ష తప్పదని నాకుండెను. దేశమంతయు ఆర్డినెన్సులచే పాలింపబడుచుండ, కాంగ్రెసే యక్రమసంఘముగనుండ నిది సందేహాస్పదమెట్లు కాగలదు! బ్రిటిషు ప్రభుత్వ తత్వమును బట్టియు నాకృతినిబట్టియు నన్నణచివేయుట విధాయకమని కాన్పించెను. ఈ నిత్య యవకాశముండుటచే నా పని కొంత చెడుచుండెను. నే నేమి చేయుటకు స్థిరపరచుకొనజాలకుంటిని. చేయగలిగినంత చేయుటకు నేను త్వరపడుచుంటిని.

నిర్బంధము ననవసరముగ దెచ్చిపెట్టుకొనుట నా కిష్టములేక దాని కావకాశమునిచ్చు కార్యములను చాలవరకు తగ్గించితిని. రాష్ట్రములోను, బయటసంచారముచేయవలసినదని నాహ్వానములు వచ్చుచుండెను. నే నందులకంగీకరింపలేదు. ఉపన్యాసములనిచ్చు దేశసంచారమైన నుద్రేకకరమైన దండయాత్రయగును. ఇది హఠాత్తుగ నాపివేయబడును. అప్పుడు నా కింకొక మధ్యమార్గములేదు. నే నే ప్రదేశమునకైనను మరియొక యుద్దేశ్యముతో వెళ్ళినపుడు – గాంధీజీతోను వర్కింగుకమిటీతోను సంప్రదించుటకు – నేను బహిరంగోపన్యాసముల నిచ్చుచు స్వేచ్ఛగా మాట్లాడెడివాడను. జబ్బలపురములో గొప్పసభ, బ్రహ్మాండమగు యుత్సవము జరిగెను. ఢిల్లీలోనే పెద్దసమావేశము జరిగెను. ఈ సభావిజయమే ప్రభుత్వమింక నిట్టివాటిని సహింపజాలదని తెలుపుచుండెను ఢిల్లీసభ ముగియుటతోడనే నా నిర్బంధవదంతులు చెలరేగెను. కాని నేను అలీఘరులో ముస్లిము విద్యార్థుల కుపన్యసించి యలహాబాదు చేరుకొంటిని. ప్రభుత్వము

రాజకీయములను నలిపివేయుటకు యత్నించుచుండ రాజకీయేతర వబ్లికుపనులలో పాల్గొనుట నా కిష్టము లేకుండెను. మన సంగ్రామముతో సంబంధములేని శుష్కకలాపములలో జోక్యము కల్పించుకొని దానినుండి తప్పించుకొనవలెననెడి స్వభావము కాంగ్రెసు వారిలో కాన్పించెను. ఇది సహజము; కాని దీనినప్పుడు ప్రోత్సహింపగూడదని నేను భావించితిని.

పరిస్థితులనవలోకించి భవిష్యత్కార్యములను నిర్ణయించుటకు 19౩౩ అక్టోబరులో యు.పి. కాంగ్రెసు వర్కరులసభ యలహాబాదులో జరిగెను. రాష్ట్రకాంగ్రెసుకమిటీ యక్రమసంఘము. కనుక మేమా కమిటీని పిలువలేము. కాని జయిలు వెలుపలనున్న కమిటీ సభ్యులను యితరవర్కరులను యిష్టాగోష్టిసభకు పిలిచితిమి. మాసభలు ప్రయివేటు సభలయినను వాటికి రహస్యములు లేవు ప్రభుత్వముజోక్యముకల్పించుకొనునో లేదో మాకు చివరవరకు తెలియదు ఈ సభలలో నార్థిక మాంద్యము, నాజీసిద్ధాంతము, కమ్యూనిజము మొదలగుప్రపంచపరిస్థితినిగురించి మేమెక్కువ శ్రద్ధతీసికొంటిమి. భారతపోరాటము నితర చోట్ల జరుగుసంభవములతో నన్వయించి చూడవలెనని మేము మా వర్కరులను కోరితిమి. చివర కాసభ మా లక్ష్యమును నిర్వచించుచు నొక సామ్యవాద తీర్మానము నామోదించెను. శాసనోల్లంఘన విరామము నది యాక్షేపించెను. సమష్టిశాసనోల్లంఘనమున కవకాశము లేదనియు వ్యక్తిగతశాసనోల్లంఘనముకూడ త్వరలోనే క్షీణించు ననియు లేక నతితక్కువవ్యాప్తి కలిగియుండుననియు నందరకు తెలియును. కాని ప్రభుత్వఆర్డినెన్సుచట్టములు, దాడి సాగుచుండుటచే విరమించుటవలన మనకు కలుగు వ్యత్యాసమేమియును లేదు. కనుక మేము మామూలు శాసనోల్లంఘనమునుసాగించుటకే తీర్మానించితిమి. కాని యరెస్టులను కోరుట కేమియు చేయవలదనియే మావర్కరులకు చెప్పితిమి. వారు తమ సామాన్యధర్మమును నెరవేర్చుచు నందులో వారికే నిర్బంధములు ప్రాప్తించుచో సంతోషముతో స్వీకరింతురు. ముఖ్యముగ గ్రామములలో తిరిగి సంబంధముకలిగించుకొనివ్యవసాయ

దారుల స్థితినికనుగొనవలసినదని మేము వారికి చెప్పితిమి పన్ను చెల్లింప రాదను యుద్యమ మప్పుడు లేనేలేదు. పూనా సభ యనంతర మిది తుదిసారి విరమింపబడెను. అప్పటి పరిస్థితులలో నదిపునరుద్ధరింపబడ జాలదని స్పష్టమగుచుండెను. ఈప్రోగ్రాముసాధువైనది, తీవ్రతలేనిది: ఇందులో న్యాయవిరుద్ధమైన దేదియులేదు. అయినను యిదియు కష్టములకు కారణమగునని మేము గ్రహించితిమి. మా వర్కరులు గ్రామముల లోనికి వెళ్ళుటతోడనే అరెస్టుచేయబడి పన్నులనిరాకరణమునుప్రోత్సహిం చిరని శిక్షింపబడిరి. నా సహచరులు నిర్బంధింపబడినతోడనే నేనా గ్రామప్రాంతములకు వెళ్ళవలెననుకొంటిని. కాని నా కితర పనులుం డుటచే పోజాలకపోతిని.

అఖిలభారత పరిస్థితి విచారించుట కానెలలో రెండు సార్లు వర్కింగుకమిటీసమావేశమయ్యెను గాంధీజీప్రోత్సాహము చేతపూనా కాన్ఫరెన్సుజరిగినతరువాతనన్ని కాంగ్రెసుకమిటీలు, ఆఫీసులు నిషేధింప బడుటచే పైకమిటీ పనిచేయుటయేలేదు. నాస్థితి చిత్రముగనుండెను. నేను జయిలునుంచివచ్చుటతోడనే యీ ఆత్మహత్యవంటి, ఆర్డినెన్సు కంగీకరింపనొల్లక కాంగ్రెసుయొక్కసామాన్యకార్యదర్శినని చెప్పుకొన గోరితిని. కాని నేను గాలిలో పనిచేసితిని. సరియైన ఆఫీసు, యుద్యోగులు, తాత్కాలికాధ్యక్షుడు లేరు. గాంధీజీ యాలోచనల కందు బాటులోనున్నను,అఖిల భారత సంచార కార్యక్రమములో నిమగ్నుడై యుండెను. సంచారములో మేమతనిని జబల్పురములోను ఢిల్లీలోను పట్టుకొంటిమి. వర్కింగుకమిటీసభ్యులతో మేముచ్చట లాలోచనలను చేసితిమి. వివిధసభ్యుల మధ్యగల భేదాభిప్రాయముల నతిచక్కగ విశదము చేయగలిగెను. ఒక ప్రతిష్టంభనయేర్పడెను అందరకు రుచించు తరుణోపాయమేదియు దొరకలేదు. శాసనోల్లంఘనమును విరమింప వలెననువారికి కూడదనువారికి మధ్య గాంధీజీ పరిష్కరింపవలసియుం డెను. అప్పుడతడు విరమించుటకేసుముఖుడు, కనుక వ్యవహారములు యథాప్రకారముగనే సాగింపబడెను.

కాంగ్రెసుతరఫున శాసనసభలకు పోవలెనను విషయ మప్పుడప్పుడు కాంగ్రెసుసభ్యులచే చర్చింపబడుచుండెను. కాని వర్కింగు కమిటీసభ్యు లీవిషయమై యంతశ్రద్ధతీసుకొనలేదు. ఆసమస్య నుంకను యుదయింపలేదు. అది యకాలవిషయము. 'సంస్కరణలు' అథమము మరి రెండుమూడు సంవత్సరములకుగాని రూపముదాల్చవు ఎన్నికలలో పోటిచేయుటకుసిద్ధాంతరీత్యా వ్యక్తిగతముగ నాకెట్టి యభ్యంతరములేదు. ఆ సమయమువచ్చినపుడు కాంగ్రెసు పోటీచేయవలసి యుండునని నేను నిశ్చయించుకొంటిని. కాని యప్పుడీసమస్య లేవదీయుట దృష్టిని పెడత్రోవకు త్రిప్పుటయేయగును పోరాటము సాగింపబడినచో మనలనెదుర్కొనిన సారాంశములు పరిష్కరింపబడునని, రాజీపద్ధతుల ప్రభావము తగ్గునని నే నాశించితిని.

ఈలోపల నేను పత్రికలకు వ్యాసములను, స్టేటుమెంటులను పంపించుచుంటిని. కొంతవరకు నా వ్రాతలలోని తీవ్రతను నేను తగ్గించవలసియుండెను. లేనిచో సెన్సారుప్రయోగము లెంతదూరమైనను సాగగలవు నేనెట్టి సాహసములకు సిద్ధపడినను ముద్రణాధికారులు, ప్రకాశకులు, సంపాదకులు దీనికి సంసిద్ధులుకారు. మొత్తముమీద వార్తాపత్రికలు నాయెడల సుముఖముగనేయుండెను కాని యవి యెల్లపుడు నట్లుండలేదు. ఒక్కొక్కప్పుడు స్టేటుమెంటులు, ప్రకరణములు నణచివేయబడుచుండెడివి. నేను కష్టపడివ్రాసిన పెద్ద వ్యాసమొకటి బుట్టదాఖలుచేయబడెను. నేను 1934 జనవరిలో కలకత్తాలోనున్నపుడొక ప్రధానదైనికపత్రికాధిపతి నన్ను దర్శింపవచ్చెను. అతడుకలకత్తా పత్రికల ప్రధానసంపాదకుని యభిప్రాయముకొరకు నాస్టేటుమెంటు పంపితిననియు నతడు దాని నంగీకరింపకపోవుటచే నది ప్రచురింపబడ లేదనియు చెప్పెను. ఈ "ప్రధానపత్రికాధిపతి" కలకత్తాలోప్రభుత్వ ముద్రణాలయ తణిఖీదారు.

నేను పత్రికలకుపంపిన కొన్నిస్టేటుమెంటులలోని ఘాటుతనమునకు కొంచె మాశ్చర్యపడితినని నా స్నేహితురాలువ్రాసెను. నేను కొంచెమించుమించు 'గర్విష్ఠి'నగుచుంటిని. ఇది నా యాశలన్నియు

వ్యర్థమగుటవలన కలిగినఫలితమా? ఇది కొంతవరకు సత్యము. జాతీయముగ మనమందరము విఫలతచే బాధపడుచున్నాము. వ్యక్తిగతముగకూడ నిది కొంతవరకు నిజమయియుండవలెను. అయినను నేనిట్టి భావముచే నెక్కువ బాధపడుటలేదు. ఏలనన నామట్టుకునాకువిఫలుడ నైతినను భావ మెన్నడు గలుగదాయెను! గాంధీజీ రాజకీయముగ నన్నాకర్షించినది మొదలు నేనతనియొద్ద నధమమొక్క పాఠమునుఫలితములకు భయపడి భావముల నణచివేసికొనకుండుట- నేర్చుకొంటిని. ఆ యాచారమును రాజకీయరంగములో ననుసరించుటవలన నాకెన్నియో కష్టములు సంభవించెను. కాని వాటితోపాటు నా కది యెక్కువ సంతుష్టినికూడ ప్రసాదించెను. దీనివలననే మనలో చాలమంది యదార్థ మనఃఖేదమును, అధమాధమ విఫలతను తప్పించుకొంటిమి. అసంఖ్యాకులగు ప్రజలు ప్రేమతో చూచుచున్నారను జ్ఞానముకూడ నధిక మనశ్శాంతి నిచ్చును. అదియోటమికి, విఫలతకు చింతామణివంటిది. ఇతరులచే విస్మరింపబడి యేకాకిగనుండు టతి భయంకరభావములలో నొకటియని నే నూహించెదను.

అయినప్పటికి నా దురదృష్టవిచిత్రప్రపంచములోవిఫలతయను భావమును మనమెట్లుతప్పించుకొనగలము? సమస్తము తాముమారగుచున్నట్లు మన మెంత తరుచుగ చూచుచుందుము? ప్రయత్నమును విడకపోయినను మనచుట్టుపట్ల నున్న మానవుల గుణగణములను చూచునపుడు సందేహములు మనలను ముట్టడించును వివిధ సంభవములపట్ల తరచు నాకు కోపము, తిరస్కారము కలుగుచుండును. అట్టి వ్యక్తులుబృందములుగురియగుచుండిరి. జీవితమును ప్రదర్శనశాలక్రింద చూచు దృష్టిపయి నాకంతకంతకుతిరస్కార మెక్కువగుచుండెను. ఇది ప్రధానసమస్యలనునిర్లక్ష్యముచేసి వానినుదహరించుట యనుచితమని భావించును. ఏలనన నవి వారి బాళ్కసమునకే నష్టము తెచ్చును. లేక వారి దురభిమానములను స్పృశించును. ఈ తిరస్కారము విఫలత. 'గర్విష్ఠి' తనము యెంతయున్నను నేను నాతప్పిదములను, యితరుల తప్పిదములనుకూడ చూచి పరిహసించుశక్తినింకను పోగొట్టుకొనలేదు.

దయామయుడగు విధియందు ప్రజలకుగల విశ్వాసమునకు నే నొక్కొక్కప్పు డాశ్చర్యపడుచుందును. ఆ విశ్వాసము దెబ్బలు తగిలిన కొలఁది తలయెత్తుచునే యుండును. దుఃఖములును, దయామయుడు కాఁడను ఋజువులునుకూడ నా విశ్వాస గంభీరతకు పరీక్షలని భావింపబడును.

అభివృద్ధియందు, ధర్మమునందు, లక్ష్యములయందు, మానవ శ్రేష్ఠత్వమునందు, మానవవిధియందు విశ్వాసముండునట! ఇదియొక విధియందలి నమ్మకమునకు సంబంధించినదికాదా? దీనిని తర్కహేతువులతో, సమర్థింపఁ ప్రయత్నించుచో వెంటనే మనకు కష్టములు సంభవించును. కాని మనలోనున్నదేదియో ఈ యాశను, విశ్వాసమును ఆశ్లేషించియుండును. ఇదిలేనిచో జీవితము పచ్చికబయళ్ళు లేని యెడారియగును!

నా సామ్యవాద ప్రచారఫలితము వర్కింగుకమిటీలోని కొంతమంది సహోద్యోగులను తారుమారుచేసెను. నే ననేకవత్సరములనుండి యీ ప్రచారముచేయుచుండినపుడు వారూరకొనినట్లే యిప్పుడును సహించియుండెడివారు. కాని నేనిపుడు దేశములో చెలామణియగుచున్న ప్రయోజనములను కొంతవరకు భయపెట్టుచున్నాను. నా ప్రయత్నమిక నిరుపద్రవకరమని పిలువబడజాలదు. నాతోడివారు కొందరు సామ్యవాదులుకారని నేనెరుగుదును. కాని కాంగ్రెసుకార్యనిర్వాహక సభ్యుడుగనుండి సామ్యవాదప్రచారము చేసికొనుటకు నాకు సంపూర్ణస్వేచ్ఛకలదని నేనెప్పుడును భావించుచుంటిని. నాకట్టి స్వేచ్ఛలేదని వర్కింగుకమిటీ సభ్యులు కొందరు భావించుచున్నారను సంగతి నాకాశ్చర్యము కలుగజేసెను. నేను వారినసత్యస్థితిలోనుంచుచుంటిని కనుక, వారు తిరస్కరించిరి. కాని నేనేమిచేయవలెను? నా ధర్మములలో నతిప్రధానమని భావించుదానిని నేనువిడిచిపెట్టజాలను ఈరెంటికి సంఘర్షణముండుచో నేనువర్కింగుకమిటీనుండి రాజీనామా యివ్వఁగోరెదను. కాని యీ కమిటీ యక్రమసంఘముగనుండి, సరిగా పనికూడ చేయుచుండనపుడు నే నెట్లు రాజీనామా యివ్వఁగలను?

గాంధీజీ మద్రాసునుండి వ్రాసినపుడుకూడ నాకీకష్టము తిరిగి తటస్థించెను. 'మద్రాసుమెయిలు' పత్రిక కతడిచ్చిన సందర్శనమును గురించిన విషయము నాకువంపబడెను ఈ సందర్శనమునుకోరినవారు నన్నుగురించి ప్రశ్నించెను. నా ప్రయత్నములను గురించి గాంధీజీ కొంచెమించుమించు తీవ్రమూర్పుణ చెప్పుచు నాయదార్థతయందతనికి నమ్మకముగలదని చెప్పెను. నేను కాంగ్రెసును ఈనూతనపద్ధతులకు బంధించువాడను కాను ఇట్లు నాకు తెలుపబడునని నేనూహింప లేదు. కాని గాంధీజీ తనసందర్శనములో పెద్దజమీందారీ పద్ధతినిసమ ర్థించుట నన్నెక్కువగ కలతపెట్టెను. ఇది గ్రామముయొక్కయు, జాతి యొక్కయు ఆర్థికశ్రేయస్సు కత్యావసరమయిన భాగమనియతడు భావించునట్లు కాన్పించును. ఇది నాకుచాలయాశ్చర్యముకలిగించెను. ఈరోజులలో నీపెద్దజమీందారులను తాలూకాదారులను, సమర్థించు వారతియరుదు. ప్రపంచమంతట నవిముక్కలుచేయబడెను. భారత దేశ ములోకూడ నవి చిరకాలముండజాలవని చాలమంది గుర్తించిరి. తాలూకాదార్లు, జమీందార్లుకూడ ఈ పద్ధతిపోవుట కంగీకరింతురు. ఈ పద్ధతి తననిజభారముచేతనే కృంగిపోవుచున్నది. అయినను గాంధీ జీకి దీనియందు సానుభూతికలదు. అతడు ధర్మకర్తృత్వమును గురించి మాట్లాడును. అతనిదృష్టికినాదృష్టికి నెంతబేధముకలదు? నేనికముందిత నితో నెంతవరకు సహకారముచేయగలను; అని ఆశ్చర్యపడితిని. నేను వర్కింగుకమిటీలో నికముందుకూడ నుండవలెనా? అప్పుడు మార్గ మేమియు లేకుండెను, కొద్దివారములైన తరువాత నేను తిరిగి జయి లుకు వెళ్లుటచే నీసమస్య యసంగతమయ్యెను.

నాస్వవిషయములు చాలకాలమును మ్రింగివేసెను. మాతల్లి యారోగ్యము బాగుపడుచుండెను. ఆమె యింకను మంచముపట్టి యుండినను అపాయము తప్పిపోయెను. చాలకాలమునుండి నిర్లక్ష్యము చేయబడుచుండిన నాయార్థికములను చక్కబెట్టుకొనగోరితిని. మేము చేయగలిగిన ఖర్చుకంటె నెక్కువఖర్చు చేయుచుంటిమి. మాఖర్చులను తగ్గించుమార్గమేదియు కాన్పించదు. శరీరయాత్రసాగించుటకునేనెంత

బాధపడుటలేదు. నావద్ద ధనమేమియు మిగలనిదినముకొరకు నేను దాచుచుంటిని. ఆధునిక ప్రపంచములో ధనము, ఆస్తులు చాలయవసరములు. కాని, దీర్ఘయాత్రలను చేయుగోరువారికవి తరుచు ప్రతిబంధకములు. సాహసకార్యములను చేయుటకు ద్రవ్యవంతులకు ప్రాణకంటకముగనుండును. తమవస్తువులను, వశ్యాదులను పోగొట్టుకొనుటకు వారెల్లపుడు భయపడుదురు. ప్రభుత్వమువారు తమ యిష్టమువచ్చినప్పుడు ద్రవ్యమును, ఆస్తిని, వశపరచుకొనగలిగినపుడు లేక సర్కారులో కలిపివేసికొనగలిగినపుడు దాని యుపయోగమేమి? కనుక నాకున్న స్వల్పమునుకూడ వదలించుకొనగోరితిని. మా యవసరములు చాలతక్కువ. మాకుచాలినంత సంపాదింపగలనను ధైర్యము నాకుండెను. మాతల్లి తనయవసానకాలములో ససుఖముల ననుభవింపరాదనియు జీవితప్రమాణములో నెక్కువన్యూనతను పొందరాదనియు నే నాతురపడుచుంటిని. నాకుమార్తె విద్య కాటంకముండకూడదనికూడ నే నాతురపడుచుంటిని. దీనికి, నాయుద్దేశ్యప్రకారము ఆమె యూరపులో నుండవలెననుకొంటిని ఇంతకు మినహా నాకు నా భార్యకు ద్రవ్యముకొరకు ప్రత్యేకావసరములు లేవు లేదా, యనార్ధద్రవ్యాభావమున కలవాటుపడకపోవుటచే మేమట్లు భావించితిమి ద్రవ్యము కొఱతపడుదినము వచ్చినప్పుడు మా కది సంతోషదాయకముగ నుండజాలదని నేను పూర్తిగా నెరుగుదును. నేను చివరవరకు మిగుల్చుకొనిన దొకదుబారఖర్చు:- నేను పుస్తకముల నెక్కువగ కొనుచుందును. అరికట్టిపెట్టుట నాకు కష్టముగనుండును.

మా ఆర్థికస్థితిని చక్కబెట్టుకొనుటకు నా భార్యనగల నమ్మివేయుటకు మేము నిశ్చయించితిమి. వానితోపాటు వెండిసామాగ్రి, మాయొద్దనున్న విలువగల యితరవస్తువులు, బండ్లు కొలదిగనున్న చిల్లరసామాగ్రి విక్రయింపదలచితిమి. కమల తన నగలను పన్నెండు సంవత్సరములనుండి ధరింపక బ్యాంకిలో పడవేసినను అమ్మివేయుట కంగీకరింపకుండెను. ఆమె వానిని మా కుమార్తెకిచ్చి వేయవలెనను కుతూహలములో నుండెను.

1934, జనవరిమాసము. అలహాబాదుజిల్లా గ్రామములలో నున్న మావర్కర్లు నిరపరాధముగ పనిచేయుచున్నను నిర్బంధింప బడుటచేత మేము గ్రామములకు వెళ్ళవలసియున్నట్లు కాన్పించెను. మా యు.పి. రాష్ట్ర కాం. కమిటీకార్యదర్శియైన రఫీఅహ్మదుకిద్వాయి కూడ నిర్బంధింపబడెను జనవరి 26వ తేదీ-స్వాతంత్ర్యదినము- వచ్చు చుండెను. దానిని మే మెట్లు నిర్లక్ష్యముచేయగలము? ఆర్డినెన్సులు నిషేధములు యెన్నియున్నను 1930 లగాయితు యిది విడువకుండ దేశమంతట సక్రమముగ జరుపబడుచుండెను. కాని, యిపుడు మార్గ మును చూపువారెవరు? చూపవలసినమార్గ మేది?సిద్ధాంతములో నైన నఖిలభారత కాంగ్రెసు అధికారిగ పనిచేయువారు నేనుతప్ప మరెవరు లేరు నేను కొంతమందిస్నేహితులతో నాలోచించితిని ఏదియో కొంత జరుగవలెనని యందరు నంగీకరించిరి. కాని జరుగవలసిన దానిని గురించి యంగీకారమేమియు కుదరలేదు. సమిష్టి నిర్బంధములకు దారితీయు కార్యములను తప్పించుకొనవలెననెడి సామాన్యస్వభావము నాకు కాన్పించెను. చివరకు స్వాతంత్ర్యదినము నుచితరీతిని జరుపవలె ననెడి యొక చిన్నసందేశమును పంపితిని. దానిని జరుపవలసినవిధము నాప్రాంతములవారికే విడచివేసితిమి. అలహాబాదు జిల్లాయందంత టట జరుపవలసిన కార్యక్రమము నేర్పరచితిమి.

ఈ స్వాతంత్ర్యోత్సవముల నేర్పాటుచేసినవా రాదినముననే నిర్బంధింపబడుదురని మేము భావించితిమి. నేనుతిరిగి జయిలుకు వెళ్ళు లోపల వంగదేశమును దర్శింపగోరితిని. అచ్చటనున్న పాతస్నేహితు లనుచూచుటకు, గత కొద్దిసంవత్సరములనుండియు నా దేశప్రజలు చేసిన యపారత్యాగములకు వారి నభినందించుటకు నేనీ యాత్ర నుద్దేశించితిని. వారికి సహాయముచేయుటకు నేనేమియు చేయజాలనని బాగుగ నెరుగుదును. సానుభూతి, సహచరభావము నుండిన సార్థక మేమి? అయినను వంగదేశము తనయవసరసమయమున యావద్భా రత దేశముచేతను విడువబడినట్లు భావించుచుండుటచే నివి యవశ్యము లయ్యెను. ఈ భావముండుట న్యాయము కాకపోయినను యుండెను.

కమల యారోగ్యమునుగురించి మావైద్యులతో నాలోచించుటకుకూడ నేనామెను తీసికొని కలకత్తా వెళ్ళవలసియుండెను. ఆమెకెంతమాత్రము నారోగ్యములేదు. కాని కొంతవరకు మే ముభయులము దీనిని నిర్లక్ష్యముచేసి చికిత్సకొరకు కలకత్తాలోనో మరొకచోటనో దీర్ఘకాలముండలేకపోతిమి. నేనుబయటనుండు కొద్దికాలము మేముభయులమూసాధ్యమయినంతవర కొక్కచోటనే యుండగోరితిమి. నేను తిరిగి జయిలుకు వెళ్ళినతరువాత చికిత్సచేయించుకొనుటకుడాక్టరులనుసంప్రదించుటకునామెకుకావలసినంత సావకాశముండును. ఇప్పుడు నిర్బంధ మాసన్నమగుటచే కలకత్తాలో నాసమక్షమున నీ పరీక్ష చేయించుటకు నిశ్చయించితిని; తరువాత తక్కినపనులు చూచుకొనవచ్చును.

కనుక కమల నేను జనవరి 15 వ తేదీని కలకత్తా వెళ్ళుటకు నిశ్చయించితిమి. మేము స్వాతంత్ర్యదినోత్సవములకు తగినంతముందుగనే తిరిగి రావలెననుకొంటిమి.

## భూకంపము

1934 జనవరి 15వ తేదీ మధ్యాహ్న కాలము. అలహాబాదులో నేను మాయింటివరండాలో నిలిచి కొంతమంది వ్యవసాయదారుల కుపన్యసించుచుంటిని. సాంవత్సరిక మాఘమేళ ప్రారంభమయ్యెను. దినమంతయు వందలకొలది ప్రేక్షకులు మమ్ముచూడవచ్చుచుండిరి. హఠాత్తుగ నేను నాకాళ్ళమీద నిలువజాలక ముందుకు జోగనారంభించి సమీపముననున్న యొక స్తంభమును కౌగిలించుకొంటిని. తలుపులు డబడబకొట్టుకొన నారంభించెను. సమీపముననున్న స్వరాజ్యభవనమునుండి హోరుమను శబ్దము వినవచ్చెను. ఇంటికప్పునుండి పెంకులు జలజల రాలుచుండెను. ఇదివరకుభూకంపము నెరుగకపోవుటచే నేమి జరుగుచున్నదియు నాకు మొదట తెలియకుండెను. కాని వెంటనే నేను గ్రహించితిని, ఈ నూతన యనుభవము నాకువినోదము శ్రద్ధ కలుగచేసెను. తిరిగి నేను వ్యవసాయదారులతో సంభాషింప నారంభించి వారికి భూకంపమునుగురించి చెప్పితిని. వృద్ధురాలగు మా పెత్తల్లి నన్ను ఇంటనుండి పారిపోవలసినదని దూరముననుండి కేకలు వేసెను. ఆ భావమునాకు విపరీతముగ కాన్పించెను. భూకంపమును నే నంతయెక్కువగ పాటింపలేదు ఎట్లయినను మేడమీద మంచము పట్టియున్న మాతల్లిని, ప్రయాణసన్నాహము చేయుచున్న నా భార్యను విడిచి నేను నా యొంటి ప్రాణమును దక్కించుకొనజాలను. ఆ తాకుడులు చాలసేపునిలచి ఆగిపోయెను. అవికొద్దినిముషముల సంభాషణకు కారణమయి వెంటనే విస్మరింపబడెను. ఆ రెండుమూడు నిముషములు బీహారులోను యితరచోట్ల లక్షలకొలది ప్రజల కెట్లు పరిణమించెనో

మాకప్పుడు తెలియలేదు. దానిని మేము గ్రహింపజాలకపోతిమి. ఆ సాయం
కాలమే కమల నేను కలకత్తా పయనమైతిమి. మాకు తెలియకుండ
మా రైలు ఆ రాత్రి మమ్ము భూకంప ప్రాంత దక్షిణ భాగము నుండి
తీసికొనిపోయెను. మరునాడీ విపత్తునుగురించి కలకత్తాలో వార్త
లేమియు లేకుండెను. ఆ మరునాడు వార్తాలేశములు రానారంభించెను.
మూడవరోజు విపత్తు యొక్క స్వభావము కొంత ద్యోతకమయ్యెను.

మేము మా కలకత్తా ప్రోగ్రాములో మునిగియుంటిమి. చాల
మంది వైద్యులనేకదఫాలు సందర్శించితిమి. చివరకొకటి రెండుమాసము
లయిన తరువాత చికిత్సకొరకు కమల తిరిగి రావలెనని నిశ్చయింప
బడెను. తరువాత చాలకాలమునుండియు కలుసుకొనని స్నేహితులను
కాంగ్రెసు సహోద్యోగులను మేము కలుసుకొనవలసి యుండెను. ఆ
కాలమంతయు నేను మనోభారముచే బాధపడితిని. కష్టములు కలుగునను
భయముచే నేమిచేయుటకు ప్రజలు భయపడుచున్నట్లు కాన్పించెను.
వారిదివరకు నెన్నియో యనుభవించిరి. ఇతర చోట్లకంటె నిచ్చట వార్తా
పత్రికలతిజాగ్రత్తగనుండెను. ఇతర చోట్లవలెనే యిచ్చటను భవిష్య
త్కార్యక్రమమునుగురించి సందేహము. విభ్రమము కలదు. నిశ్చయ
ముగ భయము కంటె సందేహమే రాజకీయకృషికభ్యంతరముగనుండెను.
ఫాసిజము, సామ్యవాదము, కమ్యూనిజము ఈ భావములు వాతావరణ
ములో నుండెను. కాని యివన్నియు నస్పష్టముగ నొకదానితోనొకటి
మిళితమయియుండెను. వీరిమధ్య ఖచ్చితమగు రేఖగీయుట లేక నిర్వ
చించుటకష్టము. ప్రభుత్వదృష్టినాకర్షించి వారిచే నెక్కువగ ప్రకటింప
బడుచున్న టెర్రరిష్టుయుద్యమమును గురించి యెక్కువగ తెలిసికొను
టకు నాకవకాశము కాలము లేకపోయెను. నాకు తెలిసినంతవరకు దాని
కెట్టి రాజకీయప్రాధాన్యత లేదు. టెర్రరిష్టు వర్గమువారి పాతసభ్యులకు
దానియందు నమ్మకము పోయెను. వారు వేరువిధముగ భావింపనారంభిం
చిరి. బెంగాల్ ప్రభుత్వ చర్యలవలన కలిగిన తిరస్కారభావముచేత నచ్చ
టచ్చట వ్యక్తులు చెలరేగి యొకవిధమగు జగడమునకు దిగిరి, ఇరుపక్ష
ముల కలహాభావము ప్రధానముగ నేయుండెను. వ్యక్తులగు టెర్రరిష్టుల

సందర్భములోనిది స్పష్టముగనేయుండెను. ప్రభుత్వముకూడ సంఘ విరుద్ధకార్యములను శాంతముగ చేబట్టుటకు బదులు దీని నొక కలహ దృష్టిలో చూచిరి. టెర్రరిష్టు చర్యలచే నెదుర్కొనబడిన యే ప్రభుత్వమైనను వానిని డీకొనియణచివేయుటకు ప్రయత్నింపక తప్పదు. కాని యపరాధుల యెడల నిరపరాధుల యెడల విచక్షణరహిత చర్యలను జరుపుటకంటె ప్రభుత్వము ప్రశాంతమార్గముల బూనుట యుక్తమైన కార్యము. టెర్రరిష్టుచర్య లంతకంతకు తగ్గిపోవుచున్నవి. కాని, యివి జరుగుట కెప్పుడును సావకాశముండెను. వీని నెదుర్కొనవలసినవారి శాంతి చెడగొట్టుట కివి చాలును. ఇట్టికార్యములు జాడ్యముకాక జాడ్యముకు కారణములనుసంగతి స్పష్టమగుచునేయున్నది. రోగముకుగాక దాని చిహ్నములకు చికిత్స జేయుట వ్యర్థము.

టెర్రరిష్టుల యువకులు, యువతులు–రహస్య కార్యములలో నున్న మోహముచేత నేనిజముగ నాకర్షింపబడుచున్నారని నేను విశ్వసించెదను రహస్యము, సాహసము సంతతోత్సాహములగు యువకుల నెప్పుడు నాకర్షించుచుండును. ఈ కేకలన్నియు దేనినిగురించి? ఈ తెర చాటునున్న మనుష్యులెవరు? వీనిని తెలుసుకొనవలెన నెడికోరిక జనించును. ఇదివరిశోధకకథలోని పిలుపువంటిది. వీరికేమియు చేయవలెనను యుద్దేశ్య ముండదు. సందేహింపబడు వారితో కలసి యున్నంతమాత్రమున పోలీసు దృష్టిలో వీరును సందేహింపదు వారేయగుదురు. త్వరలోనే వీరును డెటెన్యూల సంఖ్యలోనో లేక ప్రవాసితుల డేరాలలోనో జేర్చబడుదురు, న్యాయక్రమములు హిందూదేశములో బ్రిటిషుపాలనచే గర్వింపదగిన విజయములని చెప్పబడును. నా సహజస్వభావముచేత నేను వారికి సుముఖుడను. జీవితంలో శిక్షయుండవలెను; అరాజకము, అక్రమము, అసమర్థత యనిన నే నిష్టపడను; కాన, ప్రభుత్వములు, రాజ్యములు ప్రజలపై బలవంతముగ నంటగట్టు న్యాయ, క్రమముల ప్రయోజనము సందేహాస్పదమని నా విషాదపూరిత యనుభవము చాటుచున్నది. ఒక్కొక్కప్పుడువానిమూల్య మత్యధికముగనుండును; ఆ న్యాయము

అతికారము చేయువారి యిచ్ఛయు, అక్రమము సర్వత్రవ్యాపించి యుండు భయముయొక్క ప్రతిబింబము. భయముమీద నాధారపడు కార్యమేదియు నభిలషితము కాజాలదు. ప్రభుత్వముయొక్క నిర్బంధ పరికరములే పునాదిగగలిగి యివిలేనిచో నిలువజాలని 'క్రమము' నాగరిక పరిపాలనకాక సైనిక యాక్రమణ యగును. కల్హణ కవియొక్క వేయి యేండ్ల నాటి కాశ్మీర చారిత్రకపురాణమగు రాజతరంగిణిలో న్యాయ, క్రమముల యర్థములో ధర్మము, అభయము అనుపదములు పదేపదే యుపయోగింపబడినట్లు నేను వింటిని. పవిత్రత, భయము లేకుండుట! న్యాయము చట్టముకంటె గొప్పది; ప్రజల నిర్భయత్వమే క్రమము భయపడిపోయిన ప్రజలపై 'క్రమము'ను బలవంతము చేయుట కంటె నిర్భయత్వమును దోహదము చేయుట వాంఛనీయము.

మేము కలకత్తాలో మూడున్నరరోజు లుంటిమి ఈకాలములో నేను మూడు బహిరంగోపన్యాసములనిచ్చితిని. నేనిదివరకుకలకత్తాలో చేసినట్లే టెర్రరిస్టుచర్యలను గర్హించి యవినిరర్థకములని వాదించితిని. తరువాత ప్రభుత్వమువారు బెంగాలులో ననుసరించిన పద్ధతులను తీసికొంటిని. రాష్ట్రములో జరిగిన యుదంతములు నన్ను కదల్చివేయుట చేతనే నా వేశముతో మాట్లాడితిని. మొత్తముగా ప్రజలనందరనువిచక్షణ లేకుండా నణచివేసినమానవగౌరవమునే భంగపరచినరీతి నన్నెక్కువగ కలతబెట్టెను ఈమానవసమస్యముందర రాజకీయసమస్య రెండవది. తరువాత కలకత్తాలో నాపయిజరుపబడినవిచారణలో నీమూడుయుపన్యాసములు మూడు నేరములయ్యెను. వానిఫలితమే నా ప్రస్తుతశిక్ష.

కవిశేఖరుడగు రవీంద్రనాథటాగూరును దర్శించుటకు కలకత్తా నుండి మేము శాంతినికేతనము వెళ్ళితిమి. అతనిని దర్శించుట యెప్పుడునుముదావహముగనుండును. అంతదగ్గరకుపోయినతరువాత మేమీయవకాశము జారవిడువనొల్లకుంటిమి. నేనదివరలో శాంతినికేతనము రెండుసార్లు వెళ్ళితిని. కమల కదియే ప్రథమపర్యాయము మేము మా కుమార్తె నచ్చటకుబంప నూహించుచుంటిమి. కనుక నామె దానిని చూచుటకు ప్రత్యేకముగవచ్చెను. త్వరలోనే యిందిర మెట్రిక్యులేషను

పరీక్షకు వెళ్ళనై యుండెను. ఇక ముందామె నెచ్చట చదివింపవలెనను సమస్య మమ్ము బాధించుచుండెను. ఆమెను ప్రభుత్వ లేక అర్ధప్రభుత్వ విశ్వవిద్యాలయములలో చేర్పించుటకు నాకెంతమాత్రము నిష్టములేదు. అవి నాకు గిట్టవు. వానినావరించియుండు వాతావరణమంతయు నధికారపూరితము, ప్రభుత్వవాసనాయుతము, స్వేచ్ఛావిరహితము. అవి కొంతమంది చక్కని స్త్రీపురుషులనుతయారుచేసెననుటకుసందేహము లేదు. ఇకముందును చేయవచ్చును. కాని యీకొద్ది మినహాయింపులు విశ్వవిద్యాలయములు యువకుల సహజశక్తుల నణచివేయుచున్నవి. నాశముచేయుచున్నవను నేరమునుతీసివేయజాలవు. శాంతినికేతనము ఈ మృత హస్తమునుండి విముక్తినొందుటచే మేము దానిని స్థిరపరచితిమి.

మేము తిరిగి యింటికిపోవు మార్గములో రాజేంద్రబాబుతో భూకంపబాధితులనివారణసమస్యనుగురించిమాట్లాడుటకు పాట్నాలో దిగితిమి. అతడప్పుడే జయిలునుండి విడుదలబడి యనధికార నివారణ కార్యమునకు తప్పనిసరిగా నాయకత్వమును వహించెను. మా టెలిగ్రాములేవియు నందజేయబడకపోవుటచే మారాకసంగతి యెవరికి తెలియకుండెను. కమలసోదరునితో మేముండగోరిన భవనము నాశనమయ్యెను. అది పెద్దరెండస్థులమేడ కనుక చాలమంది యితరులవలె మేమారుబయటనే నివసించితిమి.

మరునాడు నేను ముజఫరుపురమును చూచితిని. అప్పటికి భూకంపముకలిగి సరిగా యేడురోజులయ్యెను. అయినను బాగు ప్రధానవీధులలోతప్ప చెత్తను తీసినవారులేరు. ఈ వీధులను కొన్ని చేసినపుడు శవములు బయటపడుచుండెను. అవికొన్ని పడిపోవుచున్న గోడనో లేక యింటికప్పునో ఆపుకొనుటకు ప్రయత్నించువానివలె నుండెను. ఈ శిథిలములు మరపునకురాక భయజనకములుగనుండెను. ఈ గండమునుండి బయటపడినవారు పూర్తిగ భయవిహ్వలులై నోటమాటరాక యుండిరి...

అలహాబాదు చేరుటతోడనే కాంగ్రెసులోనున్న మేము, తదితరులు డబ్బువసూలుచేయుట, వస్తుసామగ్రి పోగుచేయుట మొదలగు పనులలో నిమగ్నులమయితిమి. నాసహచరులునుకొందరు భూకంపము కలుగుటచే స్వాతంత్ర్యదినోత్సవము నాపివేయవలెననిరి. కాని, నేను భూకంపము మనప్రోగ్రాము కేల భంగముకలిగింపవలెనో చూడజాలకుంటిని. కనుక జనవరి 26వ తేదీని అలహాబాదుజిల్లాలోని వివిధ గ్రామములలోను పట్టణములలోను సభలు జరుపబడెను. మే మనుకొనినదానికంటె మా కెక్కువ విజయమే చేకూరెను. పోలీసువారి యాటంకములు, నిర్బంధములు జరుగునని మాలో చాలమంది భావించిరి. అక్కడ కొద్ది యాటంకములు కల్పింపబడెను. కాని మేమీ సభనుండి బయలుపడగలిగితిమి. మా గ్రామములలో కొన్నిచోట్లను, యితరపట్టణములలోను అరెస్టులు జరిగెను.

బీహారునుంచి తిరిగివచ్చుటతోడనే భూకంపమునుగురించి నేనొకస్టేటుమెంటుయిచ్చి ద్రవ్యసహాయము కావలెనను సందేశముతో ముగించితిని. బీహారుప్రభుత్వము భూకంపము కలిగిన మొదటి కొద్ది రోజులలో చురుకుగ పనిచేయలేదని నే నందులో విమర్శించితిని. భూకంపము కలిగిన ప్రాంతములోని యుద్యోగులను విమర్శించుట నా యుద్దేశ్యముకాదు. ఎంతటి ధైర్యస్థైర్యములు కలవారైనను పరీక్షించునట్టి యతి కఠిన పరిస్థితిని వారెదుర్కొనవలసి యుండెను. నామాటలలో కొన్ని యిట్టి యర్థమునకు నావకాశ మిచ్చుటచే నేను విచారపడితిని. కాని మొట్టమొదట బీహారుప్రభుత్వ ప్రధానకార్యాలయమువారెక్కువ సమర్థతచూపలేదని నేను రూఢిగా భావించితిని. ముఖ్యముగ చెత్తనంతను తీయించివేసినచో ననేకమంది ప్రాణములు దక్కియుండెడివి. ఒక్క మాంఘీరు పట్టణములోనే వేలకొలది చంపబడిరి. మూడువారము లయినతరువాత నే నచట అసలు ముట్టుకొనబడని చెత్తనెంతనో చూచితిని. అచ్చటకుకొద్దిమైళ్ళదూరములోనున్న జమలూపురలో వేలకొలది రైల్వేవర్కర్లుగలరు. ఈ విషాదము జరిగిన కొద్దిగంటలలోనే వీరినందరిని యుపయోగించుకొనవచ్చును.

భూకంపము జరిగిన పన్నెండురోజులయిన తరువాతకూడ ప్రాణము
లతో నున్న మనుష్యులు పైకితీయబడిరి. ఆస్తి రక్షించుటకు ప్రభు
త్వమువారు వెంటనే చర్యతీసికొనిరి. కాని భూమిలో పాతుకొని
పోయినవారిని రక్షించుటకు వారంత వేగిరపడలేదు. ఆ ప్రాంతము
లలో మునిసిపాలిటీలు పని చేయుటలేదు.

నా విమర్శ యుక్తమనియే నేను భావించెదను. భూకంపము
కలిగిన ప్రాంతములలో నధిక సంఖ్యాకులు నాతో ఏకీభవించిరని నేను
తరువాత తెలిసికొంటిని. కాని యుక్తమయినను, అయుక్తమయినను
అది ప్రభుత్వమునుత్వరపెట్టుటకే చేయబడెను. కాని, నిందింపవలెనను
యుద్దేశ్యముతో చేయబడలేదు. ఈ సందర్భములో బుద్ధిపూర్వకముగ
పాపమును చేసిరని వారి నెవరును నిందింపలేదు. అది యొక వింత
యైన యసామాన్య పరిస్థితి యగుటచే ప్రమాదములను మన్నింప
వచ్చును. భూకంపమువలన కలిగిననష్టమును కూడదీయుటకు బీహారు
ప్రభుత్వమువారు తరువాత నెక్కువ శక్తిసామర్థ్యములతో పనిచేసిరని
నేను వింటిని.

కాని నా విమర్శ తిరస్కరింపబడెను. వెంటనే బీహారులో
కొద్దిమంది ప్రభుత్వమువారి కొక ధృవపత్రమును ప్రసాదించిరి.
భూకంపము, తన్నివారణోపాయములు రెండవ విషయమయ్యెను.
ప్రభుత్వము విమర్శింపబడెను. కనుక రాజభక్తిపరాయణులు దానిని
సమర్థింపవలెను. ప్రభుత్వమును విమర్శింపరాదు. భారతదేశము ప్రభు
త్వమును విమర్శింపకూడదను నొక వింతసిద్ధాంతమున కిది యొక
యుదాహరణము పాశ్చాత్యదేశములలో నిది నిత్యకృత్యము. సైనిక
తత్వము విమర్శను సహింపజాలదు. 'రాజుగారివలె హిందూదేశము
లోని బ్రిటిషు ప్రభుత్వము. దాని పెద్దయధికారులు తప్పుచేయ
జాలరు.' అటువంటి దానిని సూచించుటకూడ రాజద్రోహము.

మరియొక వింత యేమనిననిరంకుశప్రభుత్వము, కఠినప్రభుత్వము
అను విమర్శకంటెనసమర్థప్రభుత్వమను విమర్శను వారెక్కువతిరస్క
రింతురు. మొదటి విమర్శకుజయిలుప్రసాదము రావచ్చును. కాని ప్రభు

త్వము నీసికలవాటుపడిపోవుటచే నిజముగ దీని నంతగ లక్ష్యము చేయదు. ఇంతకు నధికార తత్త్వముగల జాతి కిది యొకవిఘ్నము పొగడ్తయే! కాని, యసమర్థులు; ధైర్యసాహసములు లేనివారు అనుట వారికి శూలములవలె నుండును. ఇది వారి స్వాభిమాన మూలమునే కొట్టినట్లగును. ఇది భారతదేశములో దేవదూతలమని భావించుయింగ్లీషుఅధికారుల భ్రమలను తొలగద్రోయును. వారు క్రైస్తవ ప్రవర్తనకు విరుద్ధముగ ప్రవర్తించుచున్నాడను నేరమును నోరెత్తకుండ సహించుటకు సంసిద్ధతను చూపినను అసమర్థుడని, యవివేకియని పిలుచుచో సహింపజాలని ఆంగ్లికనుబిషపువంటివారు.

అలహాబాదులోని భూకంప సహాయకకమిటీవారు భూకంపము సంభవించిన ప్రాంతములనుచూచియచ్చట జరుగుచున్న యుపశమన పద్ధతులనుగురించి యొకనివేదికతయారుచేయవలసినదని నన్ను పంపిరి. నేనొక్కడను వెంటనే బయలుదేరి నాశనదేవతచే నల్లకల్లోలము గావింపబడిన ప్రాంతములలో పదిరోజులుతిరిగితిని కంటికి నిద్రయను నదిలేక యుదయము అయిదుగంటల లగాయతు నిశీథమువరకు నేను బీటలుతీసి వంకరటింకరలు తిరిగిపోయియున్న యా రోడ్లమీద మోటారులోను, వంతెనలు నాశనమయిరోడ్లు నీటిలో మునిగిపోయిన చోట్లచిన్నచిన్న పడవలమీదను ప్రయాణముచేసితిని. ఎచ్చటజూచి నను కూలిపోయినకొంపలు, చీల్చివేయబడి యొక పెద్దరాక్షసిచే మెలి పెట్టబడినట్లుకాన్పించినరోడ్లుకలపట్టణములు భయంకరముగ కాన్పించెను. ఈరోడ్డులలోకలిగిన పెద్దపెద్దపగుళ్ళనుండియిసుక నీటి ప్రవాహామువలె పైకి తన్నుకొనివచ్చి ప్రజలను, పశువులను తుడిచివేసెను. ఈపట్టణములకంటె నెక్కువగ నుత్తరబీహారు మైదానములు నాశన దేవత కాలవాలమయ్యెను. మైళ్ళకొలది యిసుక, పెద్దపెద్దపగుళ్ళు, చాలదూరము జలమయము, యిసుక, నీరు పైకి తన్నుకొనివచ్చిన చిన్నచిన్నబీటలు, బీహారు ఆరామమిట్లుండెను. ఈప్రాంతములమీద నుండి యెగిరివెళ్ళిన కొందరు బ్రిటిషుయుద్యోగు లివి యుద్ధకాలము నాటి యుత్తరఫ్రాన్సు సమరరంగములవలె కాన్పించెనని చెప్పిరి.

ఆ యనుభవ మతిభయంకరమైనది. భూకంపము మొట్టమొదట ప్రక్క యూపుతో ప్రారంభమయి నిలుచున్నవారిని పడద్రోసెను. తరువాత పైకిక్రిందకు యూపివేసెను. తరువాత మరఘిగంగులు ప్రేలినట్లు లేక నూరు వాయు విమానములుచేయు రణగొణధ్వని బయలువెడలెను. అనేకచోట్ల బొరియలనుండి, కలుగులనుండి పదిపన్నెండడుగుల యెత్తువరకు నీరు చిమ్ముచుండెను. ఇదియంతయు మూడు మూడున్నరనిమిషములుమాత్రమేజరిగి తరువాతయుపశమించెను. కాని యామూడునిమిషములే ప్రళయకాలమయ్యెను. దీనినంతయు కండ్లారచూచుచుండిన చాలమంది ప్రపంచమంతరించుచున్నదని యూహించుకొనుటలో నాశ్చర్యమేమియులేదు. పట్టణములలో భవనములు కూలిపోవు పెళపెళధ్వనులు, నీరు భూమిలోనుండి పైకిచిమ్ముట, వాతావరణమంతయు దుమ్ముతోనిండిపోవుట, కొద్దిగజముల దూరములోనున్న దానిని చూడజాలకపోవుట – మొదలగువిపరీతములు జరిగెను. పల్లెలలో దుమ్ములేకపోవుటచే నెక్కువదూరము చూడవచ్చును. కాని స్థిమితముగ చూచువారెవరునులేరు. బ్రతికియున్నవారు నేలమీద పడిపోయిరి, లేక భయవిహ్వలతచే నేలమీద దొర్లుచుండిరి. భూకంపము జరిగిన పదిరోజులకు పన్నెండేండ్ల బాలుడు భూమినుండి ప్రాణములతో పైకితీయబడెను. ఆత డాశ్చర్యచకితుడైపోయెను. పడగొట్టబడి మరియొక వస్తువుచే కప్పివేయబడినప్పు డతడు ప్రపంచమంతరించెననియు, తానొక్కడే జీవించియున్నాడనియు ననుకొనెనట. ముజఫరుప్పూరులో కొంపలు కూలిపోవుచు, చుట్టుప్రక్కల వందలకొలది జనులు చనిపోవుచుండ నొక యాడపిల్లపుట్టెను. అనుభవములేని యామాతాపితల కేమిచేయవలెనో తోచక దుఃఖాక్రాంతులైయుండిరి. చివరకు మాతాశిశువులుజీవించిసుఖముగవర్ధిల్లుచున్నారని నేను తరువాత వింటిని. భూకంపముపేరిట ఆపిల్లకు 'కంపాదేవి'యని పేరిడిరట.

మాసంచారములో మేముమాంఘీరును చిట్టచివరచూచితిమి. మేము చాలదూరము తిరిగితిరిగి నేపాలు సరిహద్దువరకు వెళ్ళి యనేక హృదయవిదారకములగుదృశ్యములను చూచితిమి. పాడుపడిన స్థలము

లను నాశనము గావింపబడిన పట్టణములను చూచుట కెంత యలజడి నను మంచి ధనవంతమైన మాంఘీరుపట్టణ విధ్వంసమును చూచుట తోడనే మా కడుపులు తరుగుకొనిపోయెను. ఆ భయంకర దృశ్యమును నే నెన్నడు మరువజాలను.

భూకంపము గలిగిన ప్రాంతములలో పట్టణములలోను పల్లెల లోనుగూడ నివసించువారిలో స్వయంసహాయము లేకపోవుట చాల విచారకరము. బహుశః యీ సందర్భములో పట్టణములోనున్న మధ్య తరగతులవారు చాల నేరస్థులు. వారందరు పయినుండి యెవరో వచ్చి తమకుసహాయముచేతురని వేచియుండిరి. సేవచేయుటకు వచ్చిన మరి కొందరు పనిచేయుట యనగా ప్రజల నాజ్ఞాపించుట యనుకొనిరి. ఈ యసహాయతకు కొంతవరకు భూకంపభయముచే గలిగిన నిర్వీర్యతయే కారణమనుటకు సంశయములేదు. అది నెమ్మదిగ తగ్గిపోయెను. కాని బీహారులోని యితరప్రాంతములనుండియు నితరరాష్ట్రములనుండియు కొల్లలుగా వచ్చిన యుపశమన సేవకుల శక్తిసామర్థ్యము లత్యద్భుత ములు. ఈయువకులయొక్కయు, యువతులయొక్కయు సేవాతత్వ పటుత్వము చూచుట కత్యద్భుతముగనుండెను. ఇందులో ప్రత్యేకమైన వివిధసంస్థలు పనిచేసినను వారిలో మంచి సహకారముండెను. గుట్ట లుగ పడియున్న చెత్తచెదారములను త్రవ్వి శుభ్రపరచు స్వయం సహాయోద్యమమునకు కొంత ప్రోత్సాహము నీయవలెనని నేనొక యత్నముచేసితిని. నేను కొంత సందేహించుచు చేసినను అది చాల జయప్రదమయ్యెను. ఉపశమనసంస్థలయొక్క నాయకులందరు పార లను, తట్టలను చేతబూని రోజంతయు కష్టపడి త్రవ్విరి. మేమొక చిన్న పిల్లయొక్క శవమును పైకితీసితిమి. నేనాదినముననే మాంఘీరు వీడి తిని. కాని ప్రజలు త్రవ్వుటనుసాగించుచు మంచిఫలితములను సాధించిరి.

అనధికార యుపశమన సంస్థలన్నింటిలోను కేంద్ర రిలీఫ్ కమిటీ యతి ప్రధానమైనది దీనికి రాజేంద్రబాబు నాయకుడు. ఇది కేవ లము కాంగ్రెసుసంస్థకాదు. ఇది వివిధబృందములకు, దాతలకు ప్రాతి నిధ్యము వహించిన యఖిలభారతసంస్థ. అయినను గ్రామములోని

కాంగ్రెసుసంస్థల సహాయము దీనికి గలదు. గుజరాతు, యు.పి. జిల్లాలలోతప్ప భారతదేశములో మరేరాష్ట్రములోను కాంగ్రెసువర్కరులకు వ్యవసాయదారులతో నింత సంబంధము లేదు. యదార్థమునకు వర్కరులందరు చాలవరకు వారినుండియే వచ్చిరి. బీహారు భారతదేశ మంతటిలోను ప్రధానముగ వ్యవసాయదారుల రాష్ట్రము. ఇచ్చట కాంగ్రెసు అతి నిరాడంబరమైనది. వ్యవసాయదారు లందరు దానికి గొప్పయండ. అ.భా. కాం. కమిటీలో కూడ బీహారుసభ్యులు యే విషయములోను తొందరపడు స్వభావము కలవారు కారు. అచ్చట నుండుట వారికి కొంచెమాశ్చర్యముగ నుండునట్లు కాన్పించెడిది. కాని రెండు శాసనోల్లంఘనోద్యమములలోను బీహారు అపమానముగ పనిచేసెను. తరువాత జరిగిన వ్యక్తి శాసనోలంఘనములో గూడ వది యఖండముగ పనిచేసెను.

రిలీఫ్ కమిటీవారు వ్యవసాయుదారులను జేర్చుకొనగలుగుట కీ చక్కని సంస్థ నుపయోగించుకొనిరి. గ్రామములలో మరే సంస్థయు నింత సహాయము చేయజాలదు. బీహారుకు నిర్వివాదనాయకమణియైన రాజేంద్రబాబు రిలీఫ్ కమిటీకికాంగ్రెసుసంస్థకుగూడ నధిపతియయ్యెను. బీహారుదేశ పుత్రరత్నమైన ఇతడు వ్యవసాయదారువలె కాన్పించును. సరళమైన దృష్టి, వాడియైననిష్కపటనేత్రములు గోచరించనంతవరకు మొదట చూపుల కతడంత దర్పముగ కాన్పించడు. అతని చూపులకు యా నేత్రములను యెవడును మరువజాలడు. వానిద్వారా సత్యదేవత మనలను వీక్షించును. వానిని శంకింపజాలము. రయితువలె బహుశః యతనిదృష్టికొంచెముపరిమితమైనది. ఆధునికప్రపంచదృష్ట్యాకొంచెము సాధువైనది; కాని, యతని యసామాన్యశక్తిసామర్థ్యములు, పరిపూర్ణ నిష్కపటస్వభావము, భారతస్వాతంత్ర్యముపట్ల భక్తివిశ్వాసములు మొదలగు గుణగణములచేనతడు తనరాష్ట్రములోనేగాక భారత దేశ మంతట నారాధింపబడుచున్నాడు. రాజేంద్రబాబుకు బీహారులోగల సర్వాంగీకృతనాయకస్థానముకంటిది భారతదేశములో మరేరాష్ట్రము లోను మరెవరికినిలేదు. గాంధీజీయొక్క నిజసందేశము నితనికంటె నెక్కువగ గ్రహించినవారు కొద్దిమందిమాత్రమేకలరని చెప్పవచ్చును.

బీహారురిలీఫ్‌పన్కు నాయకత్వము వహించుట కిట్టి పురుషుడు లభించుట యదృష్టము. అతనియందలి విశ్వాసమే భారతదేశమంతట నుండియు విశేషధనము నాకర్షింపగలిగెను. అనారోగ్యముచే నెంత దుర్బలుడుగ నున్నను అత డీపనిలోని కురికెను. అతడే యన్ని కార్యములకు కేంద్రమయ్యెను. అందరు నతనిసలహా యడుగుచుండుటచే నతడు విశ్రాంతియనునది లేకుండ పనిచేసెను.

నేనీ భూకంపప్రాంతములలో తిరుగుచున్న కాలములో నేఅస్పృశ్యతాదోషమునకు శిక్షగభూకంపమువిధింపబడెనని గాంధీజీయిచ్చిన వాఙ్మూలము నత్యాశ్చర్యముతో చదివితిని. ఈ విమర్శయెవని నైన నిర్ఘాంతపరచును. దీనికి రవీంద్రనాథటాగూరు యిచ్చిన సమాధానముతో నేను పూర్తిగా నేకీభవించితిని. శాస్త్రదృష్టి కింతకంటె విరుద్ధమైనది వేరొండు యూహింపబడజాలదు. పదార్థముమీద మానసిక సంభవములకు, భావప్రవృత్తులకు గల సంబంధమును గురించి బహుశః నేడు శాస్త్రముకూడ పరిపూర్ణ నిరంకుశత్వమును చూపదు. మనః క్లేశమువలన బాధపడువానికజీర్ణముపట్టుకొనవచ్చును. లేక నంతకంటె చెడ్డదే సంభవింపవచ్చును. కాని మానవదోషమునకు లేక నాచారమునకు భూచలనమును మార్చు శక్తి యుండుననుట వెర్రిమాట. పాపము, యీశ్వరాగ్రహము, ప్రపంచ వ్యవహారములలో మానవుని యల్పత్వము అను భావములు మనలను కొద్దివందల సంవత్సరములు వెనుకకు తీసికొనిపోవును.

భూకంపము పాపమునకు దైవముచే విధింపబడిన శిక్షయే యైనచో మన మేపాపమునకు శిక్షింపబడుచున్నారమో తెలిసికొనుటెట్లు? మన మనేక పాపముల కుత్తరవాదులమైయున్నారము. ఎవనికి వాడు తనకు ప్రీతికరమైన యర్థమునే చెప్పవచ్చును. మనము విదేశప్రభుత్వమునకు దాసులమైనందులకు లేక నన్యాయమైన సాంఘికపద్ధతిని సహించినందులకు శిక్షింపబడియుండవచ్చును. అసంఖ్యాకములగు ఎస్టేటులుగల దర్భాంగమహారాజు ఆర్థికముగభూకంపమువలన విపరీతనష్టము పొందెను. కనుక నిదిజమీందారీపద్ధతిమీదనొక తీర్పురాదా?

బీహారులోని నిరుపరాధులైన ప్రజలు దక్షిణహిందూదేశ ప్రజలలో నున్న యస్పృశ్యతాదోషమునకు శిక్షింపబడిరని సూచించుటకంటె నిది యెక్కువయుక్తము. భూకంపమస్పృశ్యతకాలవాలమైన దేశమునే యేల వీక్షింపలేదు? భూకంపము శాసనోల్లంఘనములకుతగినయీశ్వరాగ్రహమని నష్టపోయిన యుత్తరబీహారు స్వాతంత్ర్య సమరములో ప్రధానపాత్ర వహించెను.

ఈవిధముగ మన మంతములేనియూహాలను పెంచుకొనవచ్చును. విధికృత్యములతో మనమేలజోక్యముకల్పించుకొనవలెను? అనుప్రశ్న తరువాతబయలు వెడలును. దివ్యనిర్ణయముల ఫలితములనుతగ్గించుటకు మనమేలదయారసకార్యములనొనర్పవలెను? మనలనింతదోషభూయిష్ఠముగ పుట్టింపనేల? మనచుట్టు నిట్టియుచ్చులను, వాగురులనుకల్పింపనేల? దుఃఖమయము, క్రూరమునగు ప్రపంచమునుసృజింపనేల? పెద్దపులిని మేకపిల్లను కల్పింపనేల? ఇంతచేసి తరువాత మనలనుశిక్షించుటెందులకు? విధి మనపై నిట్టి నిర్దయాత్మక పరిహాసము నేల ప్రయోగింపవలెను?

రిలీఫువర్కుకొరకు వివిధరాష్ట్రములనుండి వచ్చిన స్నేహితులతో చర్చించుచు నేనుపాట్నాలో చివరరోజురాత్రిచాలకాలముమేల్కొంటిని. యు.పి. నుండి చాలమంది ప్రతినిధులు వచ్చిరి. మాలోముఖ్యులందరు నచ్చటనుండిరి. భూకంపయుపశమన కార్యములలో మేమెంతవరకు నిమగ్నులము కావలెనను సమస్య మమ్ము బాధించుచుండెను. దీనినిగురించి మేము చర్చించితిమి. ఇది తేలికయైనదికాదు దీనికిచాల కాలము పట్టును. అంతకాలము రాజకీయములనుండి విరమింపవలెను. దానివలన రాజకీయముగ మా రాష్ట్రములో నెక్కువ చెడుఫలితము కలుగును. కాంగ్రెసులో ననేకవేలమంది యున్నను ముఖ్యులెప్పుడు కొద్దిమందియే కలరు. వారిని విడిచిపెట్టుటకష్టసాధ్యము. అయినను భూకంపముయొక్క పిలుపు అనుల్లంఘనీయము. నామట్టుకు నాకు కేవలము రిలీఫువర్కుకే బంధింపబడవలెనను నుద్దేశ్యము లేదు. ఈపని

చేయువారికి కొరతయుండదని నే ననుకొంటిని. ఇంతకంటె నెక్కువ సాహసకార్యములను చేయగలవారు కొద్దిమంది యుండిరి.

నేను నాసంచారమును ముగించి యలసిసొలసి ఫిబ్రవరి 11వ తేదీని అలహాబాదుచేరుకొంటిని. పదిరోజులనిరంతరశ్రమవలన కలిగిన నా భయంకరాకారమును చూచి నా బంధుజను లాశ్చర్యపడిరి. అలహాబాదు రిలీఫ్కమిటీవారికి నా సంచారముయొక్క రిపోర్టు వ్రాయ నారంభించితిని. కాని నేను నిద్రాసక్తుడనై యిరువదినాల్గుగంటలలో నధమము పన్నెండుగంటల కెక్కువ నిద్రలో గడపితిని.

మరునాడు మధ్యాహ్నము కమలయునేనునుఆలస్యముగ తేనీరు త్రాగితిమి. పురుషోత్తమదాసుటాండను మమ్మప్పుడే కలుసుకొనెను. మేము వరండాలో నిలుచునియుండగ నొక మోటారు రంయిమని వచ్చెను. దానిలోనుండి యొకపోలీసుఆఫీసరు తటాలున నేలమీద కురికెను. నాకుపిలుపువచ్చెనని నేను వెంటనే గ్రహించితిని. నేనతని యొద్దకువెళ్ళి "నేను మీకొరకు చాలకాలమునుండి వేచియుంటిని" అని చెప్పితిని. అతడు కొంచెము సమాధానపురస్సరముగ మాట్లాడుచు నది యతనిదోషముకాదనెను. వారంటుకలకత్తానుండి వచ్చెను.

అయిదునెలల పదమూడురోజులు బయటవుండి నిప్పుడు తిరిగి యేకాంతవాసమునకు జేరుకొంటిని. కాని యథార్థభారము నాదికాదు. ఆ భారమంతయు నెప్పటివలెనే, వ్యాధిగ్రస్తురాలైన నాతల్లి, నాభార్య, నాసోదరి మొదలగు స్త్రీజనముమీద పడెను.

—)o(—

# 59

## అలీపూరు జయిలు

ఆరాత్రియే నన్ను కలకత్తాతీసికొనిపోయి లాల్‌బజారుపోలీసు స్టేషనులో నుంచిరి. ఇచ్చట నుత్తరహిందూదేశములో నెచ్చటలేనంత మంది యూరపియను సార్జెంటులును, ఇన్‌స్పెక్టరులుకలరు. కానిస్టేబు లందరు బీహారువారు లేక యు. పి. వారివలె కాన్పించిరి. ఖయిదీల లారీలో నేను కోర్టునుండి జయిలుకు, నొక జయిలునుండి మరియొక జయిలుకు చేసిన యనేక ప్రయాణములలో రక్షకభటులు నాకూడా ననేకమంది యుండెడివారు. వారుచేయుపనియందువారికి ప్రీతిలేక అతి విచారముగా కాన్పించెడివారు నాయందెక్కువ సానుభూతిగా నుండుటచే నొక్కొక్కప్పుడు వారి కండ్లనుండి కన్నీటిధారలు జల జల రాలుచుండెడివి.

మొదట నన్ను ప్రెసిడెన్సీజెయిలులోనుంచిరి. అచ్చటినుండి విచారణకొరకు ప్రధాన ప్రెసిడెన్సీ మేజస్ట్రేటుకోర్టుకు తీసికొనిపోవు చుండెడివారు. ఇది నాకొక నూతన యనుభవము కోర్టుగది, యా భవనము బహిరంగకోర్టువలెగాక ముట్టడింపబడిన కోటవలె కాన్పిం చెను. కొద్దిమంది పత్రికాప్రతినిధులను, మామూలు లాయర్లనుతప్ప నాచుట్టుప్రక్కల కెవరిని రానీయలేదు. పోలీసులుబందోబస్తుతో నుండిరి. ఈ యేర్పాటులు ప్రత్యేకము నాకొరకే చేయబడలేదు. అవి నిత్యకృత్యములు; నన్ను కోర్టు గదిలోనికి తీసికొనివెళ్ళునపుడు నేనొక మార్గముగుండ చాలదూరము నడువవలసియుండెను. ఆ మార్గము కిరుప్రక్కలను, నెత్తిమీదను చిక్కని యినుపతీగెలతో అల్లివేయబడెను అదియొకపంజరములో నడుచుచున్నట్లుండెను. నేర స్థులను నిలుపుస్థలము మేజస్ట్రేటుగారి స్థానమునకు దూరములో నుండును. కోర్టుగదిలో పోలీసువారు కాలాంబర కవచధారులు లాయరులు మూగిరి.

కోర్టు విచారణలు నాకు క్రొత్తలుకావు. నా వెనుకటివిచారణలనేకములుజయిలుఆవరణలోనే జరిగెను. కాని యచ్చటస్నేహితులు, బంధువులు, పరిచయులు నుండెడివారు. ఆ వాతావరణమంతయు కొంత సుఖప్రదముగ నుండెడిది. పోలీసులు సామాన్యముగ వెను, నుండెడివారు. ఈ పంజరములవంటి నిర్మాణములేవియు నుండెడివి కావు. ఇచ్చట నంతయు తారుమారు. నేను క్రొత్తవారిని యపరిచిత ముఖములను, మామధ్య నెట్టిసామ్యము లేనివారిని చూచితిని. ఆ మూక యాకర్షణీయముగ కాన్పించలేదు. కాలాంబర కవచధారులైన లాయర్ల సమూహముమీద చూచుట కంత యందముగనుండదు. ఇక పోలీసుకోర్టులాయరు లొకవిధముగు ప్రేమరహితదృక్కులు కలిగియున్నట్లు కాన్పింతురు. చిట్టచివర కా నల్లదుస్తులుకలవారిలోనే నొక పరిచయస్తుడగు లాయరును చూచితిని. కాని యతడా గుంపులో మాయమయ్యెను.

విచారణ జరుగుటకుపూర్వము బయట వసారాలో కూర్చున్నను నేనొంటరిగనున్నట్లు, యేకాకినైనట్లు భావించితిని. నా నాడి వేగిరపడుచుండెను. వెనుకటి విచారణకాలములలో నా కుండిన యాంతరంగిక శాంతి యిప్పుడు లేకుండెను. విచారణలకు, శిక్షలకు నలవడిన నేనే యిట్లున్నచో నెట్టి యనుభవములేని యువకుల కెంత తొట్రుపాటుగనుండునో నే నప్పుడు గ్రహించితిని. డాకులో నేను స్వస్థచిత్తుడనైతిని. నేను వాదింవలేదు. మరునాడు, ఫిబ్రవరి 16 వ తేదీని నాకు రెండుసంవత్సరములు శిక్ష విధించిరి; నా కేడవసారి ఖయిదు జీవితము ప్రారంభమయ్యెను.

నేనుబయటనున్న యయిదున్నరమాసములు యుక్తముగ గడిపితినని తృప్తిపొందితిని. నేనుకొన్ని యుపయుక్తకార్యములు నెరవేర్చుకొంటిని. నాతల్లి కారోగ్యము కలిగి యుపద్రవము తప్పిపోయెను. నా చిన్నచెల్లెలు కృష్ణ పరిణయమాడెను. నాకుమార్తె విద్యావ్యవస్థిరపరుపబడెను. నేను మాగృహచ్ఛిద్రములను, ఆర్థిక చిక్కులనుకొన్నింటిని చక్కబరచుకొంటిని. చిరకాలమునుండి నేనునిర్లక్ష్యముచేయుచు వచ్చిన యనేక స్వంతవ్యవహారములను పరిచూచుకొంటిని. ఇక ప్రజా

హితకార్యముల నారోజులలో నెవడును యెక్కువగ చేయజాలడని నే నెరుగుదును. కాంగ్రెసుదృక్పథమును గట్టిపరచుటకు నేను కొంచెము సాయపడితిని. దానిని సాంఘిక, యార్థికపంథవైపు కొంత వరకు త్రిప్పుటకు సాయపడితిని. గాంధీజితో నేను సలిపిన పూనాకరస్పాండెన్సు వలనను, తరువాత పత్రికలలోని వ్యాసముల వలనను కొంతపనిజరిగెను. కులసమస్యమీద నేను వ్రాసిన వ్యాసములుకూడ కొంత లాభము చేకూర్చెను. మరియు రెండుసంవత్సరములు దాటిన పిదప గాంధీజీని, యితరమిత్రులను తిరిగిసందర్శించి మరికొంత కాలమునకు చాలిన ధాటియైన చిత్తశక్తిని సంపాదించితిని.

కాని నాకు హృత్పరితాపము కలిగించునది యొకటి-కమల యనారోగ్యము మిగిలిపోయెను. ఆమె యెంత అస్వస్థతగ నుండెనో నా కప్పుడు తెలియకుండెను. ఏలనన నామె మంచము పట్టువరకు గట్టిగ పనిచేయుచుండుట కలవడెను కాని నేను ఖేదపడితిని. అయినను నేనిప్పుడు జయిలులోనుండుటచే నామె స్వేచ్ఛగ చికిత్సచేయించుకొనవచ్చునని యాశపడితిని. నేను బయటనున్న కాలములో నామె నన్ను చిరకాలము విడిచియుండుట కిష్టపడక పోవుటచే నిది యెక్కువ కష్టసాధ్యముగ నుండెను.

నాకు మరియొక విచారముండెను. నేను అలహాబాదు జిల్లాలోని గ్రామసీమల నొక్కసారియైన చూడనందులకు విచారపడితిని. మా సందేశములను నెరవేర్చినందుల కచ్చట ననేకమంది యువకులు నిర్బంధింపబడిరి. జిల్లాలో మేము వారి ననుసరింపక పోవుట వారియెడల నవిధేయతగ కాన్పించెను.

నన్ను ప్రెసిడెన్సీజయిలునుంచి ఆలిపూరుజయిలుకు మార్చిరి. నా కచ్చట పదియడుగుల పొడవు తొమ్మిది యడుగుల వెడల్పుగల యొక చిన్నగది యివ్వబడెను. దానిముందర నొకవసారా, చిన్న బహిరంగప్రదేశము కలవు. ఆ దొడ్డిగోడ యేడడుగుల యెత్తున నుండెను. దానిపైనుండి యొకవింతదృశ్యము కాన్పించుచుండెను. ఏక

అంతస్తు యిండ్లు, రెండస్తుల మేడలు, గుమ్మాని యిండ్లు, చతురపు టిండ్లు, చిత్రమగు కప్పులు - ఇట్లనేకవిధములగు వికారపుటిండ్లు కన్పట్టెను. ఉన్న కొద్దిస్థలమును వినియోగింపవలెనను యూహతో నవి యొకటి తరువాత నొకటి కట్టబడినట్లు కాన్పించును.

ఈ వికారపు కట్టడముల దృశ్యమునుండి తేరుకొనుటతోడనే నే నొక భయంకరదృశ్యము నెదుర్కొనవలసియుండెను. సరిగానాగదికిని, దొడ్డికిని యెదుట రెండు పొగగొట్టములు కాకుమేఘములవంటి దట్టమగు కాటుకపొగ గుప్పుగుప్పున విడువ నారంభించెను. ఒక్కొకప్పుడు దాని గాలి నా మీదకు పంపి నన్నుక్కిరిబిక్కిరి చేయుచుండెను. అవి జయిలు పాకశాలలోని పొగగొట్టములు!

ఇట్టి ప్రారంభము నాకింపుగ లేకుండెను. ఎట్టని, యిటుకగోడల కట్టడములతో గూడిన ఆలిపూరు జయిలుయొక్క పరివర్తన శూన్యమగుదృశ్యమును. దాని పాకశాల గొట్టములనుండి వచ్చుధూమము ననుభవింపవలసిన భవిష్యత్తు, నాకు ప్రీతికరముగ లేకుండెను. నా దొడ్డిలో చెట్లు పచ్చదనములేకుండెను అదియంతయు చవటాచేయబడి, శుభ్రముగ. 'పక్కా' నుంచబడెను. కాని, నిత్యము మసికప్ప క్రిందపడుచుండెను. ఆ బోడితనము నిరుత్సాహజనకముగ నుండెను. దూరమున నొకటి రెండు చెట్లుమాత్రము కాన్పించెను ఒక చెట్టు మీద నొక గ్రద్ద గూడుపెట్టెను. నేను దానిని శ్రద్ధతో పరికించెడివాడను. దాని పిల్లలు పెరిగి పెద్దవగుచు తమ వృత్తిరహస్యములను నేర్చుకొనుచుండెను. అవి యొక్కొక్కప్పుడు తటాలున నేలకు వ్రాలుచు నే ఖయిదీచేతినుండియో, నోటినుండియో రొట్టెముక్కలను తన్నుకొనిపోయెడివి.

సూర్యాస్తమయము మొదలు సూర్యోదయమువరకు మమ్ము మాగదులలో తాళము వేసెడివారు. శీతకాల దీర్ఘవాసరనిశలు మందమందముగ జరిగెడివి. నేను గంటలకొలది చదువుటతోను, వ్రాయుటతోను విసిగి ఆ చిన్నగదిలోనే నాలుగైదడుగులు ముందుకు వెనుకకు

వేయుచు పచారుచేయుచుండ జంతుప్రదర్శనశాలలో భల్లూకములు తమ పంజరములలో తిరుగాడుట నాకు జ్ఞప్తికివచ్చెడిది. ఒక్కొ-క్కప్పు డెక్కువ విసుగు జనించునపుడు నాకు ప్రీతికరమైన శీర్షాసన చికిత్సచేసెడివాడను.

రాత్రి తొలిజాముననంతయు ప్రశాంతముగనుండి ట్రాము బండ్లధ్వనులు, గ్రామఫోనుగానము, దూరముననుండివినవచ్చుగాత్ర పాట, మొదలగుపట్టణధ్వనులు మాత్రము వినిపించెడివి దూరము నుండి వచ్చు యీ సన్ననిపాట శ్రవణానందముగ నుండెడిది. కాని రాత్రులం దెక్కువ విశ్రాంతి యుండెడిదికాదు. పహ్యాటీమీదనుండు జయిలు సంరక్షకులు పెద్దధ్వనిచేయుచు నడుచుచుండెడివారు. గంట గంటకు నేదోయొక పరీక్ష. కొంతమంది ఆఫీసరులు నేమెవరము పారి పోలేదని ధృవపరచుకొనుటకు చేతిలాంతరులను పుచ్చుకొని వచ్చెడి వారు. ప్రతిరాత్రి మూడుగంటలకు పెద్దపెద్ద యరపులు, బొబ్బలు, గ్రుబుబ్రులు, రాచుట, తోముట, మొదలగునవి వినిపించును. అది పాకశాల కార్యప్రారంభ సూచన.

ఆలీపూరు, ప్రెసిడెన్సీజయిళ్ళలో ననేకమందివార్డర్లు, గార్డులు, గుమాస్తాలు, ఆఫీసరులు కలరు. ఈ రెండుజయిళ్ళలోను నైనీజయిలులో నున్నంతమంది ఖయిదీలు 2200 మొదలు 2300 వరకు గలరు. కాని యీ రెండు జయిళ్ళలోను ఒక్కొక్కదానిలో నైనీజయిలులోనున్న యుద్యోగులకంటె రెట్టింపుకు పైగ నున్నారు. ఇచ్చట చాలమంది యూరపియను వార్డరులు, పింఛను తీసికొను భారత సైనికోద్యోగులు కలరు. యు. పి. లో కంటె కలకత్తాలో బ్రిటిషుసామ్రాజ్యమెక్కువ ప్రవుకరముగను, నిశ్చయముతోను పనిచేసెననుట ధృవము. పెద్ద యుద్యోగస్తులు ఖయిదీల దగ్గరకు వచ్చునపుడు సామ్రాజ్యశక్తి నెల్లప్పుడు జ్ఞప్తికితెచ్చుచు దానిచిహ్నముగనుండుటకు ఖయిదీలందరును "సర్కార్ సలాం"అను కేక వేయవలెను. ఈ కేకతో నొకవిధమగు నవయువ సంచలనముకూడ జరుగవలెను. ఖయిదీలు వేయు ఈ కేక

రోజు కనేకసారులు, ముఖ్యముగ ప్రతిదినము సూపరింటెండెంటుదగ్గర నుండి వెళ్ళినపుడు, నా యావరణగోడలను దాటి నాకువినవచ్చెడిది. సూపరింటెండెంటు పోవునపుడు అతని నెత్తిమీద పట్టెడి రాజ్య ఛత్రము నా యేడడుగుల గోడపైనుండి కాన్పించెడిది.

'సర్కార్ సలాం' అను నీయసాధారణ కేకయు, దానితో నుండ వలసిన శరీరచేష్టలు ప్రాచీనయుగచిహ్నములా? యనినేనాశ్చర్యపడెడి వాడను. లేక నవి యీ వేశపరుడగు నే యాంగ్లాధికారిచేతనో కనిపెట్ట బడెనా? ఇది ఇంగ్లీషువానికల్పనయనియే నేను భావించెదను. ఇందులో నొకచిత్రమైన యర్ధాంగ్ల జాతి ధ్వని కలదు. అదృష్టవశమున నీ కేక యు. పి. జయిళ్ళలోలేదు. బెంగాలు అస్సాములలో తప్ప, బహుశః మరే రాష్ట్రములలో నుండదు.

అలిపూరులో చేయబడిన యొకమార్పు నాకు తృప్తికరముగ నుండెను. మామూలుఖయిదీలయాహారము యు. పి. ఖయిదీలయాహారము కంటె చాల యోగ్యముగనుండెను. జయిలు భోజనములో యు. పి. చాలరాష్ట్రములకు వెనుకబడి యుండును.

శీతకాలము త్వరలో గతించెను. వసంతకాలము వరుగెత్తెను. వేసవి ప్రారంభించెను. రోజురోజు యెండతీవ్రమగుచుండెను. కలకత్తా శీతోష్ణస్థితినాకెప్పుడు ప్రీతికరముకాదు. కొద్దిరోజుల యునికియైనను నాకచ్చట నిస్సారముగ నుండును. ఖయిదు పరిస్థితులు సహజముగ మరింత యధ్వాన్నముగ నుండును. వ్యాయామము చేసికొనుటకు తగినంతస్థలము లేకపోవుటచే నాశీతోష్ణస్థితిలో నెక్కువకాలముగదిలో తాళము వేయబడియుండుటచేత నా యరోగ్యము కొంత చెడెను. నా బరువు త్వరితముగ తగ్గనారంభించెను. నేను తాళములను, గొళ్ళెము లను, గడియలను, గోడలను ద్వేషింప నారంభించితిని.

ఒక నెలగడచినతరువాత నా దొడ్డి వెలుపల నన్ను వ్యాయా మము చేసికొననిచ్చిరి. ఈమార్పు నాకు సుఖముగనుండెను. ఉదయ

సాయంకాలములయందు నేను పెద్ద గోడక్రింద విహరించెడివాడను. క్రమముగ నేను ఆలిపూరు జయిలుకు, కలకత్తాకోర్టులకు నలవడి పోతిని. చివరకు పొగ, కీచుర్వనులతో కూడిన పాకశాలకూడ సహ్యమయ్యెను. ఇతరవిషయములు నా మనస్సును నింపుచుండెను. నేనితర బాధలతో నింపబడితిని. బయటనుండి వచ్చు వార్తలేవియు సుముఖముగ లేకుండెను.

# తూర్పు పశ్చిమములో ప్రజా ప్రభుత్వము

నేను శిక్షింపబడినతరువాత అలిపూరులో నాకే దినపత్రిక రాలేదు. విచారణజరుగుకాలములో కలకత్తాలోని డైలీ స్టేట్సుమన్ పత్రిక వచ్చెడిది. నేను శిక్షింపబడిన మరునాడే దీని నాపివేసిరి. యు. పి. లో 1932 లగాయతు ఎ క్లాసు ఖయిదీలకొక దినపత్రికను (ప్రభుత్వమువారి కిష్టమైనదానిని) రానిచ్చెడివారు. ఈపత్రికకు బదులు నాకు స్టేట్సుమన్ వారపత్రిక నిచ్చెడివారు. దినపత్రిక పించను పుచ్చుకొన్న ఆంగ్లోద్యోగులకొరకు, వర్తకులకొరకు నుద్దేశింపబడి వారికి కావలసిన భారతదేశ సంక్షిప్తవార్తలను కలిగియుండును. ఇందులో విదేశవార్తలేమియు నుండకపోవుటచే నేను చాల బాధపడెడివాడను. విదేశ వ్యవహారములను నేనతిశ్రద్ధగవీక్షించుచుండెడివాడను. అదృష్టవశమున నన్ను మాన్చెస్టరుగార్డియను వారపత్రిక తెప్పించుకొన నిచ్చుటచే నంతర్జాతీయ వ్యవహారములు నాకు తెలియుచుండెడివి.

నా విచారణకాలములోనే యూరపులో తిరిగి తీవ్రసంఘర్షణ బయలుదేరెను. ఫ్రాన్సులో నిహాంగు బయలుదేరి ఫాసిస్టుదౌర్జన్యాల క్రింద పరిణమించి 'జాతీయ' ప్రభుత్వమనునదియేర్పడెను. ఆస్ట్రియాలో ఛాన్సిలరు డాల్ఫసుపనివాండ్రనుకాల్చి వేయుచునచ్చటనున్న సాంఘిక ప్రజాప్రభుత్వమును నాశనముచేయుచుండెను. ఆస్ట్రియాలోని రక్తపాతము నన్ను కృంగదీసెను. ఈ ప్రపంచమెంత భయంకరమైనది! ఎంత రక్తపిపాసకలది. తన స్వప్రయోజనములను కాపాడుకొనునపుడు మానవుడెంత క్రూరుడుగ నుండును! యూరపుఅంతట నమెరికాలోను ఫాసిజము వృద్ధియగుచున్నట్లు కాన్పించెను. జర్మనీలోహిట్లరుఅధికారమునకు వచ్చినపుడచటనున్న ఆర్థికకష్టముల కతడెట్టి తరుణోపాయము చూపించలేదు. కనుక నతని పరిపాలన త్వరలోనే యంతరించునని

నేననుకొంటిని. అట్లేఫ్యాసిజము తక్కినచోట్ల ప్రాకినపుడు దానిగోతి నదియే త్రవ్వుకొనుచున్నదని నే నూరట చెందితిని; దాని తరువాత సంకెళ్ళన్నియు తెగకతప్పదు. కాని నాకోరికయే నట్టియాశను పుట్టించుటలేదా? యని నే నాశ్చర్యపడనారంభించితిని. ఈ ఫ్యాసిస్టుతరంగ మతిసులభముగ నంతత్వరగ నంతరించునా? ఫ్యాసిస్టు డిక్టేటరులు భరింపరాని పరిస్థితు లేర్పడినను లొంగక తమ దేశములను ఘోరసంగ్రామరంగముగ మార్చి వేయరా? అట్టిపోరాటముయొక్క ఫలితమేమగును?

ఇంతలో వివిధరూపములుగల ఫ్యాసిజము విస్తరించెను. 'నిజాయితీరిపబ్లిక్' అయిన నవీన స్పెయిను దేశములో గొప్ప తిరోగమనము వచ్చెను. పెద్దమనిషితరహాగల యాదేశ లిబరలునాయకుల లలితపదజాలమంతయు దేశపతనము నాపజాలకుండెను. లిబరలిజము ప్రతిచోట నాధునిక పరిస్థితుల నెదుర్కొనుట కసమర్థమైయుండెను. అదిశబ్దములకును, వాక్యములకును అంటిపెట్టుకొనియుండియు యవియే కార్యములగునని భావించెను.

ఆస్ట్రియావిషాదమునుగురించి మాన్చెస్టరుగార్డియను పత్రిక వ్రాసిన ప్రధానవ్యాసములను నేనతిశ్రద్ధగ చదివితిని. ఈ రక్తసిక్త పోరాటమునుండి యెట్టిఆస్ట్రియాబయల్పడును? యూరవులోనతి రియాక్షనరీలైన రొుక కూటము తుపాకులతోను, మరఫిరంగులతోను వరిపాలించునట్టి యాస్ట్రియాతయారగును" "కాని, యింగ్లండు స్వాతంత్ర్యముకొరకే నిలబడుచో దాని ప్రధానమంత్రి మహానముద్రవహించు నేలకో! డిక్టేటరుపదవులనుగురించిన యతని స్తోత్రముల ననేకములను వింటిమి. అవి 'జాతీయాత్మను జీవింపచేయును'; 'ఒక నూతనదృష్టిని, నూతన శక్తిని ప్రసాదించును' అని యతడు చెప్పగా మేమువింటిమి. కాని తరచు శరీరమును, నంతకంటె నాత్మను ఖూనిచేయు క్రౌర్యములను గురించి యింగ్లండు ప్రధానమంత్రి యేదో కొంత చెప్పియుండవలసినది." మాన్చెస్టరుగార్డియనుపత్రిక స్వేచ్ఛకొరకే నిలబడు నెడల భారతదేశములో స్వాతంత్ర్యము నలిపివేయబడుచున్నపు డిది యేల నోరెత్తిమాట్లాడదు? మేముకూడ శరీరబాధలనే గాక నంతకంటె నధ్వాన్నమగు నాత్మపరితాపములను గూడననుభవించితిమి.

"ఆస్ట్రియా ప్రజాప్రభుత్వము నాశముగావింపబడినను అది చివరవరకు పోరుచు శాశ్వతకీర్తిని సంపాదించి, యొక పౌరాణికగాథ సృజించుకొనెను. ఇది ముందెప్పుడో యొకప్పుడు యూరపులో కలుగు స్వాతంత్ర్యోత్సాహమును తిరిగి రగుల్కొలుపవచ్చును. "స్వాతంత్ర్యములేని యూరపు విగతప్రాణియయ్యెను సౌభాగ్యప్రదములగు ప్రాణచిహ్నము లేవియు నచ్చట స్ఫురింపవయ్యెను; క్రమముగ నూపిరితిరుగని యుక్కిరిబిక్కిరిస్థితి దానికి దాపురించెను గిజగిజ తన్నుకొనుట, లేక నాంతరంగికోద్రేకము, కడియెడములకు కొట్టుకొనుటమాత్రమే యిపుడు పైబడనున్న మానసిక విస్మృతిని తప్పింపగలవు. ...రైనులగాయతు యూరలుపర్వతములవరకు యూరపు పెద్ద జయిలుక్రింద తయారయ్యెను."

రాళ్ళను కరిగించు యీవాక్యములు నా హృదయమున ప్రతిధ్వనించెను కాని, హిందూదేశముగతి? మాన్చెస్టరుగార్డియనుపత్రిక, యింగ్లండులో స్వాతంత్ర్యప్రియులు మాదౌర్భాగ్యస్థితి నేల విస్మరింపవలెను? ఇతరచోట్ల వారంత తీవ్రముగ గర్హించుదానిని యిచ్చట చూడకుండ నెట్లుండగలరు? ఇరువదియేండ్లక్రిందట, నైరోపామహాసంగ్రామసమయమున, పందొమ్మిదవశతాబ్ద సాంప్రదాయములక్రింద శిక్షనొంది స్వభావముచే జాగరూకుడును, మితభాషియైన గొప్ప యింగ్లీషు లిబరలునాయకశిఖామణి యిట్లు చెప్పెను :_ "దౌర్జన్యము ధర్మముపై విషాదభరిత విజయము బడయుచుండ సాక్షీభూతుడనై యూరక చూచుటకుముందు నేను మనదేశము చారిత్రకపుటనుండి తుడిచివేయబడగోరెదను." అతిధైర్యమైన యీభావము వాగ్ఝరితో మేళవింపబడెను. దీనిని రుజువుపరచుటకు లక్షలకొలది సాహసికులైన యాంగ్లయువకులు ముందుకురికిరి. కాని అస్క్విత్తుగారి సెట్టిమెంటు వంటిదానినే భారతీయుడు చేసినచో వాని కెట్టిగతిపట్టును?

జాతీయచిత్తవృత్తి చిత్రమైనది. మనము సౌజన్యులమని నిష్పక్షపాతబుద్ధి గలవారమని యూహింతుము. ఇతరులే, యితరదేశమే యెల్లప్పుడు నన్యాయముగ ప్రవర్తించును. మన మితరులవంటి

వారము కామని మనహృదయాంతరాళములో నెచ్చటనో యొక నమ్మకముండును. పరదేశభాగ్యమును నియమించు ప్రభుత్వజాతికి చెందు నదృష్టమే మనకు పట్టెనా! యిక చెప్పవలసిన దేమున్నది? అత్యుత్తమమైన యీ ప్రపంచములో సమస్తము కళ్యాణముకొరకే యని విశ్వసింపకుండ మన మెట్లుండగలము? పరివర్తనము కావలెనని యాందోళనచేయువారందరు స్వార్థపరులు, లేక మనవలన పొందిన లాభములను మరచిన కృతఘ్నులు, వంచింపబడిన యవివేకులు.

బ్రిటిషుజాతి లంకసీమజాతి; చిరవిజయముచేతను, విభవాతిశయముచేతను వారితరులను హీనముగ చూచెదరు. పైతరహాకు చెందు బ్రిటిషువారిదృష్టిలో ప్రపంచ మీ విధముగ విభజింపబడును. (1) బ్రిటను–పెద్దకాళీ. తరువాత (2) బ్రిటిషువలసలు (తెల్లజనాభా మాత్రమే) మరియు అమెరికా (ఆంగ్లోసాక్సనులు మాత్రమే; డాగోలు: వాఫ్ జాతులు మొదలైనవారు కాదు) (3) పశ్చిమయూరపు (4) తక్కిన యూరపు (5) దక్షిణ అమెరికా (లాటిన్ జాతులు)–పెద్దకాళీ తరువాత (6) ఆసియా, ఆఫ్రికాలకు చెందిన యెరుపు, పసుపు, నలుపు రంగులుగల జాతులు–కొంచెమించుమించు యేకగుడి.

ఈతరగతులలో చిట్టచివరనున్న మనము మనపాలకులువసించు పీఠమున కెంతదూరములోనుంటిమి? వారు మనవైపు చూచునపుడు వారిదృష్టి మందగించుటలో నాశ్చర్యమేమున్నది? మనము ప్రజాప్రభుత్వమును గురించి, స్వేచ్ఛనుగురించి, మాట్లాడునపుడు వారికి కోపమును కలిగించెదమనుటలో నాశ్చర్యమేమున్నది? ఈ పదములు మన యుపయోగముకొరకు సృజింపబడలేదు భారతదేశములో ప్రజాస్వామికసంస్థలను భవిష్యత్తులోకూడ చాలకాలము వరకు నూహింపజాలనని చాటినది గొప్పలిబరలు రాజకీయధురంధరుడైన జాన్‌మార్లీ కాడా? కెనడాదేశమునకు బొచ్చుకోటు పనికిరానట్లు భారతదేశమునకు ప్రజాప్రభుత్వము భర్జింపదు. తరువాత సామ్యవాద ధ్వజవాహకులు, దీనరక్షణకంకణులు నగు బ్రిటిష్ లేబరుపార్టీ వారు వెల్లివిరియువిజయోత్సాహములో 1924 లోని బెంగాలు ఆర్డినెన్సులు

తిరిగిప్రసాదించిరి. వారి రెండవపరిపాలనాకాలములో మాస్థితి మరింత చెడిపోయెను. భాషచేత, సంస్కారముచేత భేదములుండుటచే నొక యాంగ్లేయుడు, ఫ్రెంచిదేశస్థుడు నొకేవిధముగ భావింపజాలరు; ఇక నాంగ్లేయునకు ఆసియావాసికి మధ్య నెంత విపరీతభేదముండును?

భారతసంస్కరణసమస్యనుగురించి యీమధ్యప్రభువులసభలో చర్చజరిగెను. ఉదారప్రభువు లనేక వన్నెచిన్నెల యుపన్యాసముల నిచ్చిరి. భారతదేశములో నొకరాష్ట్రమునకు గవర్నరుగనుండి కొంతకాలము వైస్రాయిగపనిచేసిన లిట్టన్ప్రభువువీరిలో నొకడు; ఇత డుదారత, సానుభూతిగల గవర్నరని పదే పదే చెప్పబడుచుండును. ఇతడిట్లు చెప్పెనట "హిందూదేశముకంతకు కాంగ్రెసుకంటె భారతప్రభుత్వమున కెక్కువ ప్రాతినిధ్యముగలదు. అధికారులు, సైన్యము, పోలీసు, సంస్థానాధిపతులు, పటాలములు, హిందువులు, ముస్లిములు—వీరు వారననేల యందరిపేరను ప్రభుత్వము మాట్లాడగలదు కాంగ్రెసు చివరకు దేశములోనున్న యొకపెద్ద సంఘము తరపునగూడ మాట్లాడజాలదు." అతడు తనయర్థమును స్పష్టముచేయుటకు "భారతదేశాభిప్రాయమని నేను చెప్పునపుడు నే నెవరిసహకారముమీద నాధారపడగలనో, ముందురాబోవు గవర్నరులు, వైస్రాయిలుకూడ నెవరిమీద నాధారపడవలయునో వారిని గురించియే తలచుచున్నాను."

ఇతనియుపన్యాసమునుండి రెండుప్రధానవిషయములు బయటపడుచున్నవి. భారతప్రభుత్వముకు సహాయముచేయువారే లెక్కింపదగిన భారతదేశము. ఇండియాలో బ్రిటిషుప్రభుత్వమే యెక్కువ ప్రాతినిధ్యము కలది కనుక ప్రజాప్రభుత్వము. ఈ వాదము 'పెద్దమనిషి తరహాగ' చేయబడుటనుబట్టిచూడగా సూయజుకాలువ దాటుటతోడనే యాంగ్లశబ్దములు తమయర్థమును మార్చివేయునట్లు కాన్పించును. చక్రవర్తిప్రతివానికిని ప్రాతినిధ్యమువహించును. కనుక నిరంకుశ ప్రభుత్వమేయెక్కువప్రాతినిధ్యముకలప్రజా ప్రభుత్వమనువాదముసహజముగదీనితరువాత పెట్టువలెకాన్పించును; పృథ్వీపతులు యీశ్వరాధికారముకలవారను పూర్వపు తత్త్వమునకు మనము చేరుకొనెదము.

ఐ. సి. యస్. శాఖాభూషణమైన సర్ మాల్కం హైలి 1934 నవంబరు 5 వ తేదీని యు. పి. గవర్నరుగ కాశీలో మాట్లాడుచు భారతసంస్థానములలో నిరంకుశత్వముండవలెనని సమర్థించెను. ఈసలహా యనవసరము. భారతదేశములోనే సంస్థానమును తనంతట తా స్వైచ్ఛికముగ నిరంకుశత్వమును విడిచిపెట్టదు. యూరపులో ప్రజాప్రభుత్వములు విఫలమగుచున్నవను సాకుతో నీ నిరంకుశత్వమునుకాపాడవలెనని చేయుప్రయత్నము గమనింపదగి యున్నది. మైసూరుదివాను సర్ మిర్జా ఇస్మాయిల్ ప్రతిచోట పార్లమెంటరీప్రజాప్రభుత్వము లంతరించుచుండ గొప్ప సంస్కరణములు కావలెనను సమర్థన కాశ్చర్యమును వెలిబుచ్చెను "మన ప్రస్తుత చట్టమన్నివిధముల తగినంత ప్రజాస్వామికముగ నున్నదని సంస్థానాత్మ భావించుచున్నట్లు నేను దృఢముగ చెప్పగలను" అని ఆయన చెప్పెను. మైసూరుయొక్క 'ఆత్మ' అనునది యా రాజు, దివానుగార్ల యాధ్యాత్మిక స్వరూపము కాబోలును! ప్రస్తుతము మైసూరులోనున్న ప్రజాప్రభుత్వమును నిరంకుశత్వమునుండి వేరు చేయజాలము.

హిందూదేశ కులకక్షలవలన మన ప్రజాప్రభుత్వ మభివృద్ధి కాజాలదని చెప్పెదరు. కాని యా కులకక్షలకు శాశ్వత దోహదము నిచ్చెదరు మనలో సంఘీభావము లేదనికూడ చెప్పెదరు. ఈజిప్టులో కులకక్షలు లేవు. అచ్చట పరిపూర్ణమైన రాజకీయమైక్యత కలదు. ఐక్యతే యచ్చట స్వాతంత్ర్యమునకు, ప్రజాప్రభుత్వమునకు నడ్డమువచ్చుచున్నది. నిజముగ ప్రజాప్రభుత్వమార్గము సూచీముఖ మార్గము పూర్వదేశములకు ప్రజాప్రభుత్వ మనగా వారిని పరిపాలించు అధికారులయాజ్ఞలను శిరసావహించుట; వారి ప్రయోజనములను వేటిని ముట్టరాదు ఈ షరతుకు అంగీకరించుచో ప్రజాప్రభుత్వ స్వేచ్ఛ యనర్గళముగా సాగగలదు.

# 61

## సంహారము

ఏప్రిల్ మాసము వచ్చెను. బయట ప్రపంచములో జరుగు సంగతులనుగురించి యసంతృప్తికరములగు వార్తలువచ్చుచుండెను. మా జయిలు సూపరింటెండెంటు గాంధీజీ శాసనోల్లంఘనము నాపి వేసెనని ప్రసంగవశమున చెప్పెను. నాకంతకంటె మరేమియు తెలియ లేదు. అనేకసంవత్సరములనుండి యెంతయో ఘనముగ భావింపబడిన దానిని యిట్లు విరమించుటకు నేను చాల విచారించితిని. ఎప్పుడో యొకప్పుడిది విరమింపబడవలెనని నేనెరుగుదును. గాంధీజీ దేశము యొక్కయు, కాంగ్రెసులో నత్యధికసంఖ్యాకుల యొక్కయు అభి ప్రాయములను సరిగ గ్రహించెననుటకు సందేహము లేదు. అసం తృప్తిగనున్నను నేనీనూతనపరిస్థితికి సమాధానపడ ప్రయత్నించితిని.

శాసనసభలలో ప్రవేశించుటకు వెనుకటి స్వరాజ్యపార్టీ తిరిగి తలయెత్తనున్నదనికూడ నేను వింటిని. అదికూడ తప్పనిసరిగతోచెను. కాంగ్రెసు ముందుయెన్నికలలో పాల్గొనకుండ నుండజాలదని నేను భావించుచుంటిని. నేను వెలుపలనున్న అయిదుమాసముల కాలములో నీదృష్టిని నిరుత్సాహపరచుటకు ప్రయత్నించితిని. నేను దీనికింకను సమయము రాలేదని, నిది ప్రత్యక్షకార్యమునుండి కాంగ్రెసువారిలో పొంగుచున్న నూతన సాంఘిక పరివర్తన భావములనుండియు దృష్టిని మరల్చునని భావించితిని. బిగువు యెక్కువకాలమున్నకొలది ప్రజల లోను, విద్యార్థులలోను యీ భావములు వ్యాప్తిచెందుననియు మన రాజకీయఆర్థికపరిస్థితి వెనుకనున్న యథార్థము బయటపడుననియు నేను భావించితిని ఈవిధానమువలన కాంగ్రెసు నిర్మలమైనయాలోచ నలు, నిశ్చయమైన పరమావధిగల యైక్యమును సంపాదించునని నేను భావించితిని. బహుశః అందులోనున్న కొంతమంది దుర్బలులు జారి పోవచ్చును. అదియొక నష్ట మెట్లగును? ప్రత్యక్షవిధానముయొక్క పటుత్వముకూడ విరమించిన చట్టసమ్మతము న్యాయబద్ధమునగు పద్ధతులను

తిరిగి యుపక్రమింపవలసివచ్చినపుడు మన పరమలక్ష్యమును మన స్సులోనుంచుకొని కాంగ్రెసులో ముందంజవేసి యెక్కువగ పనిచేసిన వట్టి యీ పద్ధతుల నుపయోగించుకాలమువచ్చెను. కాని, శాస నోల్లంఘనమునకు వెన్నెకముకవంటివారు, కాంగ్రెసులో సమగ్రముగ పనిచేసినవారు వెనుకకు పోవుచుండుట, అట్టిపాత్రలు వహింపని యిత రులు తగుదుమమ్మాయని సిద్ధమయి పెద్దపీటలమీద కూర్చొనుచుం డుట నాకు విచారమును కలిగించెను.

శాసనోల్లంఘనమును విరమించునపుడు గాంధీజీయిచ్చిన స్టేటు మెంటు నేను కొద్దిరోజులతరువాత చదివి యాశ్చర్యపడితిని. నాహృద యము క్రుంగెను. నేనుదానిని మరలమరలచదివితిని. గాంధీజీ యిట్లు వ్రాసెను—"ఈస్టేటుమెంటు సత్యాగ్రహాశ్రమవాసులతోను, తత్సంబం ధులతోను చేసిన సంభాషణఫలితము. . .నే నెక్కువగ గౌరవించినట్టి చిరకాలసహచరుడు, పూర్తి జయిలుపనిని చేయుట కిష్టపడక, తన ప్రత్యేకాధ్యయనమును చేయుచుండెననుట ప్రసంగవశమున తెలిసి కొనుట దీనికి మరింత ముఖ్యకారణము. నిస్సందేహముగ నిది సత్యా గ్రహసూత్రములకు విరుద్ధము. నేను ప్రేమించు స్నేహితుని దోషము కంటె నిది మరింతయెక్కువగ నాదోషమునే విశదము చేసెను. తన దుర్బలత్వము నాకు తెలియునని భావించితినని యా స్నేహితుడు చెప్పెను నేను గ్రుడ్డిగనుంటిని. నాయకునియంధత్వము క్షమార్హము కాదు. ఆచరణలో శాసనోల్లంఘనమునకు తాత్కాలికముగ నే నొక్కడనే ప్రతినిధిగ నుండవలెనని వెంటనే కనుగొంటిని"

ఆ 'స్నేహితుని తప్పు లేక లోపము అతిస్వల్ప విషయము. తఱచు నేనట్టి దోషము చేసితిని. కాని నేనందుల కెంతమాత్రమును పశ్చాత్తాపపడను. ఒకవేళ అది ముఖ్యమైన విషయమేయైనను ప్రత్య క్షముగ వేలకొలది ప్రజలకును, అప్రత్యక్షముగ లక్షలకును సంబంధించు గొప్ప జాతీయోద్యమమును ఒకవ్యక్తియొక్క దోషముకొరకు బలి వేయవలసినదేనా? ఇది నాకు విపరీతము, నీతిబాహ్యమునగు తీర్మాన ముగ కాన్పించెను. ఏది సత్యాగ్రహమో యేదికాదో నేను చెప్ప

సాహసించజాలను. కాని, నాస్వంతవిధమున నేనుకొన్ని ప్రమాణముల ననుసరించి ప్రవర్తింప ప్రయత్నించితిని. గాంధిజీ స్టేటుమెంటువలన నా ప్రమాణములన్నియు తారుమారయ్యెను, కూలిపోయెను. గాంధీజీ సాధారణముగ తన అంతఃకరణనుబట్టి ప్రవర్తించును. తఱచు అది యుక్తముగనే యుండును; ప్రజాహృదయమును గుర్తించి, మంచిపరిపక్వస్థితియందు కార్యరంగమున కురుకుటయందుగల యద్భుతశక్తిని అత డనేకసార్లు ప్రదర్శించెను. తన చర్యను సమర్థించుకొనుట కతడు తరువాతచూపు కారణములు కార్యానంతరము పుట్టుతలంపులు; అవి యెక్కువరసవంతములుగనుండవు. నాయకుడు లేక కర్మవీరుడు మంచి పట్టుసమయములో నెప్పుడు నప్రయత్నముగనాచరించి తరువాత దాని కారణములగురించి యోచించును. శాసనోల్లంఘనమునాపి వేయుటలో గాంధీజీ యుక్తముగనే ప్రవర్తించెననికూడ నేను తలంచితిని. కాని యతడు చూపిన కారణము బుద్ధికవమానమువలె నాకు కాన్పించెను. తనయాశ్రమవాసుల నతడు తనయిష్టమువచ్చినట్లు మందలించుట కధికారముకలదు; వారన్ని విధముల ప్రమాణములచేసి, యొక కట్టుబాటు కంగీకరించిరి. కాని కాంగ్రెసు అట్టిదేదియును చేయలేదు; నేనట్లుచేసి యుండలేదు. నా కెట్టిప్రయోజనమునులేని మానసిక,రహస్యకారణములకు మమ్మేల యిటునటు గుంజవలెను? ఇట్టి పునాదిమీద నెట్టి రాజకీయోద్యమమునైనను భావింపయోగ్యమగునా? సత్యాగ్రహ నైతిక భావమును నేను గ్రహించినంతవరకు బుద్ధిపూర్వకముగ నేఅంగీకరించితిని. ఆ ప్రధానభావము నాకు నచ్చెను అదిరాజకీయములను మరింత యున్నతము,ఉదారమునగుస్థాయికి గొంపోవునట్లుకాన్పించెను. లక్ష్యమన్ని విధములగు సాధనలను సమర్థింపజాలదని నెనొప్పుకొనెదను.

ఆ స్టేటుమెంటు నా కెక్కువ భయము దిగులు కలిగించెను. చివర నతడు కాంగ్రెసువారికి సలహా చెప్పెను. "వారు ఐచ్ఛిక దారిద్ర్యము,స్వార్థత్యాగముఅనుకళనునేర్చుకోవలెను వారు జాతిని నిర్మించుపనులలోనిమగ్నులు కావలెను; స్వయముగవడుకుచు, నేయుచు ఖద్దరునువ్యాప్తిచేయవలెను. వారినిత్యజీవితసంబంధములలో నన్నివిధముల ననింద్యమగు పరస్పర ప్రవర్తనలవలన హృదయ

పూర్వాకమగు కుల పంక్తిభావమును పెంపొందింపవలెను. తమలో నేరూపములోనున్నను అస్పృశ్యతను తరిమి వేయవలెను. మద్యపానము మొదలగు మత్తుపదార్థములను సేవించువారితో సంపర్కముకలిగించు కొని, స్వయముగ పవిత్రతనార్జించి త్రాగుడు పూర్తిగ మాన్పించ వలెను. ఈ సేవలవలన బీదవానితరహాకు సరిపడు భృతి యేర్పడగలదు. ఈ బీదప్రమాణము చాలనివారు యెక్కువలబ్ధినిచ్చు జాతీయప్రాము ఖ్యతగల చిన్నచిన్న పరిశ్రమలలో స్థానము నేర్పరచుకొనవలెను ”

ఇది మే మనుసరింపవలసిన రాజకీయ ప్రోగ్రాము. మా కిద్దర కును మధ్యచాలయంతరువున్నట్లు నాకు కాన్పించెను. సంవత్సరముల తరబడి యతనితో బంధించిన నా వినయ విధేయతంతువులొక్కసారి తెగిపోయినట్లు భావించితిని చాలకాలమునుండి నాలో నొక మాన సిక పోరాటము సాగుచుండెను గాంధీజీచేసినది నా కర్థముకాలేదు; నచ్చలేదు. అతని యుపవాసములు, శాసనోల్లంఘనము జరుగుచుండగ నితరసారాంశములపై దృష్టి కేంద్రీకరించుట, వ్యక్తిగతస్వయంకృతపాప ములు, వెనుకటి ప్రమాణమును భక్తిని, కృషిని మూలకు త్రోసిన యతని నూతనప్రమాణము, భక్తియివన్నియు నన్ను బాధించెను. నేను జయిలుబయటనున్న స్వల్పకాలములో నీ భేదములు మరికొన్ని వెనుకటికంటె నాకెక్కువ భారమయ్యెను. మామధ్య ప్రకృతిసిద్ధము లగు భేదములుకలవని గాంధీజీ చెప్పెను. అవి యంతకంటె నెక్కువే యగును అనేక విషయములలో నతనికి వ్యతిరేకములగు స్పష్టమైన, నిశ్చయభావములు కలిగియున్నానని నేను గుర్తించితిని. అయినను కాంగ్రెసు జాతీయ స్వాతంత్ర్యముకొరకు పోరాడుచుండెను. కనుక పెద్దయుద్యమముకొరకు నేను వీని నణచివేసితిని. నా నాయకునిపట్ల నా సహచరులపట్ల విధేయతగ, విశ్వాసముగ నుండవలెననియే నేను ప్రయత్నించితిని. నా యాధ్యాత్మిక నిర్మాణముధర్మముపట్ల, సహ చరులపట్ల విధేయత కున్నతస్థానము నిచ్చును. నా యాధ్యాత్మిక విశ్వాసమనెడి లంగరునుండి నేను లాగివేయబడుచున్నానని భావించి నపుడు నాలో అనేక సంరంభములుజరిగెను. కడకు నేను రాజీపడితిని.

బహుశః నేను తప్పుచేసితిని. ఈ లంగరును విడిచివేయుట యెవనికి యెప్పటికి యుక్తము కానేరదు. కాని, భావములలో సంఘర్షణకలిగి నపుడు నాసహచరులపట్ల నాకుండవలసిన విధేయతనే నేనారాధించితిని ముంచుకొనివచ్చుపరిస్థితులు, మన సంగ్రామాభివృద్ధి నాకష్టములను కరగించి నా స్నేహితులకు దరిచేర్చునని నేననుకొంటిని.

ఇప్పుడు అలిపూరుజైలుగదిలో నే నేకాకినై పోతినని హఠాత్తుగ భావించితిని. జీవితము నిరుత్సాహజనకముగ కాన్పించెను, నిర్మానుష్యమైన యెడారివలె కాన్పించెను. నేను నేర్చుకొనిన కఠినపాఠములలో నతికఠినమైనది, యతి బాధాకరమైనది నన్నిప్పుడెదుర్కొనెను. ఎట్టి ముఖ్యమైనవిషయములోను మన మెవనిమీదను ఆధారపడుట సాధ్యముకాదు. జీవితములో మన మొంటరిగనే ప్రయాణము చేయవలెను, ఇతరులమీద నాధారపడుట హృదయవిదారకతమే!

వేరుకొనియున్న నా కోపము కొంత మతముమీదకు, మతదృష్టిమీదకుతిరిగెను మతముస్థిరప్రయత్నమునకు, నిర్మలభావములకు నెంతటి శత్రువు! ఇది యుద్రేకముమీద, రాగముమీదఆధారపడుట లేదా? 'ఆధ్యాత్మికత' యనియహంకరించుచునిదినిజమైనయాధ్యాత్మికతకు,నాత్మవస్తువులకు నెంతదూరమునన్నది? పేరొక ప్రపంచమనుచునిది మానవుడు, సంఘము, సాంఘికన్యాయము అనువిషయములను భావింపదు. ముందుగనే కొన్ని భావములను కల్పించుకొని సత్యము వానికి విరుద్ధముగనుండునను భయముతో బుద్ధిపూర్వకముగ సత్యము పట్ల కండ్లుమూసికొనును దానికి సత్యము పునాది. అయినను దానిని గ్రహించిదానికొరకు పరిశోధనచేయదు. దానినిగురించి యితరులకు బోధించుటయే దాని జవాబుదారీ. అది శాంతినిగురించి మాట్లాడుచు దౌర్జన్యములేనిదే జీవింపజాలని సంస్థలను, పద్ధతులను బలపరచెను. అది రక్తపాతమును గర్హించెను. కాని నెమ్మదిగ శాంతియుత కవచములో వచ్చి మాడ్చి చంపివేయు దౌర్జన్యముసంగతియేమి? ఎట్టి బాహ్య శరీర గాయములను కలిగింపక మనస్సును భంగపరచి, యుత్సాహమును నులిమి, హృదయమునుముక్కలుచేయుదానిసంగతి!

... నాలో, నింతగందరగోళమును కలిగించిన వానినిగురించి

నేను సూచించితిని. ఇంతకు ప్రజలపైనయద్భుతము అప్రతిహతము నగు మంత్రశక్తి, యమోఘమగు నధికారము కలిగిన గాంధికి యెంతటి వింతమనిషి! అతనివ్రాతలు అతనిమాటలు వాని వెనుకనున్న వ్యక్తినిగురించి తగుభావమును కలిగించును! అవి సూచించుదానికంటె నతనిశక్తిచాలగొప్పది అతడు హిందూదేశమునకు చేసినసేవ యెంత దిగంతవిశ్రాంతమైనది; అతడామె ప్రజలకు ధైర్యము, పౌరుషము, శిక్ష, సహనము, ధర్మముకొరకు కత్యుత్సాహముతో త్యాగముచేయుశక్తి స్వాభిమానముకలిగించెను. శీలమునకు ధైర్యమొక్కటేనిశ్చయమైన పునాదియని యతడు చెప్పెను; అది లేనిదే నీతి. మతము, ప్రేమ యుండనేరవు. "భయమునకు దాసులమైనంతకాలము మనము సత్య ప్రేమలను అనుసరింపజాలము" దౌర్జన్యము నతడెంత యేవగించు కొనినను దౌర్జన్యముకంటెకూడ పిరికితనము మరింతయేహ్యమైనదని యతడు చెప్పెను. "మానవుడు వ్యవహారదక్షుడగుటకు శిక్షయే ప్రమాణము, శుచి, త్యాగము, శిక్ష, ఆత్మసంయమనములేనిదే మనకు ఆశ, మోక్షము లేవు. శిక్షలేని త్యాగము బూడిదలోపోసిన పన్నీరువలె నుండును"ఇవి కేవలము మాటలు, బహుశః విశ్వాసము గల మాటలు, నీతివాక్యములుకావచ్చును: కాని యామాటలవెనుక శక్తికలదు. ఈ'వామనుడు'మాటలను చేతలను జోడించు వ్యక్తియని భారతమెరుగును

అతడు భారత ప్రతినిధి. పీడింపబడిన యీ ప్రాచీనదేశ విజాత్మను వ్యక్తీకరించుట కతడువచ్చెను. రమారమి యతడే భారతము; అతని దోషములు భారతదేశ దోషములే, అతని నగౌరవపరచుట యతనికి చెందదు. అది జాతిని పరాభవించుట, ఇట్టినిర్లక్ష్యచేష్టలను చేసిన వైస్రాయి యిత్యాదులు వారెట్టి యుపద్రవసస్యమును చల్లుచుండిరో గుర్తింపజాలకపోయిరి. 1931 డిసెంబరులో రౌండుటేబిలు కాన్ఫరెన్సునుండి తిరిగివచ్చునపుడు (పోప్) మతగురువుఅతనికిసందర్శనము నీయనిరాకరించెనని నేను మొదట వినినపుడెంత బాధపడితినో! అదిహిందూదేశము నగౌరవపరచుటవలె నాకు కాన్పించెను ఆ నిరాకరణము బుద్ధిపూర్వకముగనే చేయబడెనమట కెట్టి సందేహమును

లేదు. క్యాథలిక్ చర్చి తన మతమునకు చెందని ఋషులను మహాత్ములను మెచ్చుకొనజాలదు. ఒక ప్రొటస్టెంటు చర్చి గాంధిజీని గొప్ప మత తత్పరుడు, నిజమైన క్రైస్తవుడు అని పిలిచెను. కనుక నీ పిచ్చి మతముతో తన కెంతమాత్రమును సంబంధము లేకుండ చేసికొనుట రోముపట్టణమునకు మరింత యవసరమయ్యెను.

ఆసమయమందే ఆలిపూరుజయిలులో 1934 ఏప్రిల్ లో నేను బెర్నార్డ్ షా వ్రాసిన క్రొత్తనాటకములను చదివితిని. 'పర్వతములమీద' అనుదానికి వ్రాయబడిన పీఠిక, జీసనుకు పైలేటుకు జరిగినచర్చ నన్నాకర్షించెను. మరియొక సామ్రాజ్యము మరియొక మతపురుషుని యెదుర్కొనవలసిన యీ కాలమున కది తగియున్నట్లు కాన్పించెను. ఈ పీఠికలో జీసను పైలెటుతో నిట్లుచెప్పెను "భయమును పారద్రోలుము రోముగొప్పతనమునుగురించి నా కిక నెట్టిబడాయిమాటలును చెప్పకుము. రోముగొప్పతనమని నీవు చెప్పునది భయముతప్ప మరొకటి కాదు. సర్వతభయము! భూతకాలమునుగురించి భయము, భవిష్యత్తునుగురించిభయము బీదవారిభయము, ధనవంతులభయము, పెద్దమతబోధకులభయము, చదువుకున్న గ్రీకులయొక్కయు, యూదులయొక్కయుభయము, మోటువారైన 'గాలులు', గాతులు, హూణులు మొదలగువారి భయము, వారిభయమునుండి మిమ్ము రక్షించుకొనుటకు మీరునాశనముచేసిన కార్థేజివలనభయము ఇప్పుడు వెనుకటికంటె నధ్వాన్నమైన భయము. సార్వభౌమికసిజరువలన భయము, పరిహసింపబడి, తన్నబడి, నిర్ధనుడనై, దేశద్రిమ్మరినైన నావలన భయము. భగవంతునిపాలనపట్లతప్ప ప్రతిదానియెడల భయము. రక్తపాతము, కత్తి, బంగారములందుతప్ప దేనియందు విశ్వాసములేకపోవుట. రోముకొరకు నిలుచునీవు పందవు, ఈశ్వరరాజ్యముకొరకు నిలుచు నేను ప్రతిదానినిధిక్కరించితిని, సమస్తమును పోగొట్టుకొంటిని. శాశ్వత సామ్రాజ్యపట్టభద్రుడనైతిని." కాని, గాంధిజీ గొప్పతనము, అతడు హిందూదేశమునకు చేసినసేవ. నేను స్వయముగ నతనికి తీర్చుకొనవలసిన యద్భుతఋణము—ఇవి శంకింపబడుటలేదు. ఇవన్నియునున్నను అనేకవిషయములలో నతడు శుద్ధతప్పులు చేసి

యుండవచ్చును. ఇంతకును అతనిలక్ష్యమేది? అనేకసంవత్సరముల సన్నిహిత సంపర్కమును కలిగియున్నను నా కతని లక్ష్యమునుగురించి నిర్మలభావము కలుగలేదు. అతనిమట్టుకతనికి నిర్మలభావములున్నవని నేననుకొనను. ఒకయడుగు ముందుకుపోయినచాలునని యతడనును. అతడు భవిష్యత్తును చూడప్రయత్నింపడు నిర్దుష్టమైన పరమావధి నుంచుకొనడు. పరికరములను చూచుకొనడు. ఫలితము దానంతటదియే జాగ్రతపడునని యతడు విసుగులేకుండ చెప్పుచుండును. మీ స్వవిషయములలో, మీవ్యక్తిజీవితములలో మంచితనముగనుండును. తక్కినదంతయు దాని ననుసరించును. ఇది రాజకీయ లేక శాస్త్రీయదృష్టికాదు. బహుశః యిది నీతిశాస్త్రసంబంధమైన దృష్టి కూడకాదు. ఇది సంకుచిత ధర్మబోధ. మంచితనమనగా నేమి? యను ప్రశ్న కది యేమియు నుత్తరమీయజాలదు. అది కేవలము వ్యక్తికి సంబంధించినదా లేక సాంఘికమా? గాంధిజీ మానసికశక్తుకు అభివృద్ధికి నేమియు ప్రాముఖ్యతనీయక శీలమునకే ప్రాశస్త్యము చూపును. శీలములేని చదువు యుపద్రవకరము కావచ్చును. కాని విద్యలేని శీలమనగా నేమి? నిశ్చయముగ శీల మెట్లభివృద్ధి చెందును? గాంధిజీని మధ్యయుగపు క్రైస్తవఋషులతో పోల్చుచుందురు. అతడు చెప్పునది చాలవరకు దీనికిసరిపడును. అది యాధునిక మానసికానుభవమునకు, పద్ధతికి యెంతమాత్రము సరిపడదు,

లక్ష్యముపట్ల నతడు పైకికన్పించునంతటి యస్పష్టముగ నుండడని నేనూహించెదను. అతడొక నిశ్చితమార్గమున నడచుట కుద్రేకముతో వాంఛించును. కాని, యిది యాధునిక భావములకు, పరిస్థితులకు పూర్తిగ విరుద్ధము. ఇంతవరకు నత డీ రెంటిని సమన్వయపరుపజాలకపోయెను. లేక తనలక్ష్యమునకుగొంపోవు మధ్యసోపానములను నిరూపింపలేకపోయెను. కనుక నస్పష్టత కాన్పించును. కాని యతడు దక్షిణాఫ్రికాలో పాతికసంవత్సరముల క్రిందట తన సిద్ధాంతమును ప్రారంభించిననాటినుండి యతని సామాన్యాభిరుచి సుబోధకముగనే యుండెను. అతని యప్పటిత్రవాత లిప్పటికిని యతని భావములను తెలుపునో లేదో నేనెరుగను. అవి పూర్తిగ నట్లుచేయునని యనుకొనను.

కాని, యతనిభావము వెనుకనున్న పునాదిని యర్థముచేసికొనుట కవి తోడ్పడును.

అతడు 1909 లో నిట్లు వ్రాసెను. "గత యేబదిసంవత్సరములనుండియు తాను చదివిన చదువు మఱచిపోవుటలోనే భారత మోక్షముకలదు. రైల్వేలు, టెలిగ్రాఫులు, ఆస్పత్రులు, లాయర్లు, డాక్టర్లు మొదలగునవన్నియు పోవలెను. పైతరగతు లనబడువారు సావధానపూర్వకముగ, భక్తిశ్రద్ధలతో నిరాడంబర వ్యవసాయజీవితమును నేర్చుకొనవలెను" మరియు "రైలు, మోటారులలో యెక్కినపుడెల్ల నేను యుక్తమని భావించుదాని కపచారము చేయుచున్నానని యెరుగుదును." "అత్యంత కృత్రిమములు శీఘ్రములునగు గమనశక్తి ద్వారా ప్రపంచమును సంస్కరింపబూనుట యసాధ్యమును సాధింపబూనుటవంటిది."

ఇదియంతయు నాకు కేవలముతప్పు ఉపద్రవకరము, సాధింపవలవికానిదియగు సిద్ధాంతమువలె కాన్పించును. గాంధిజీ దారిద్ర్యమును, బాధను, సన్యాసజీవితమును ప్రేమించును స్తోత్రముచేయును. అది దీనివెనుక కాన్పించును. అతనిదృష్టిలో కోరికలను పెంచుకొనుట జీవిత ప్రమాణముల హెచ్చుచేయుట నభివృద్ధి,నాగరికత కాజాలవు "కోరికలను బుద్ధిపూర్వకముగ నైచ్ఛికముగ తగ్గించుకొనవలెను. అది యథార్థమైన ఆనందమును, తృప్తిని పెంపొందించి, సేవచేయుశక్తి నధికముచేయును ఇదియే నాగరికత, యభివృద్ధి" ఈ ప్రాతిపదిక మాత్రము లోకసారి యంగీకరింపబడినచో గాంధిజీయొక్క తక్కిన భావము నర్థముచేసికొనుట సులభమగును అతని కార్యములుసుబోధకములు కాగలవు. మనలో చాలమందిమి వీని నంగీకరింపక నతని కార్యములు మనకు నచ్చనపుడు గోలచేయుదుము.

దారిద్ర్యమును, బాధను స్తోత్రముచేయుట నామట్టుకు నాకు గిట్టదు. అవి యవసరములని నేననుకొనను. అవితరిమివేయబడవలెను. సన్యాస జీవితము వ్యక్తులకు సరిపడినను సాంఘికాదర్శముగ నేనంగీకరింపజాలను. నిరాడంబరత, సమత్వము, ఆత్మసంయమము మెచ్చదగినవే. కాని శరీరమును మాడ్చుట నాకు గిట్టదు. వస్తాదుకు శరీర

శిక్షణ యవసరమైనట్లే మనస్సుకు నాచారములను శిక్షలోనుంచి వశపరచుకొనుట యవసరమని నేను విశ్వసించెదను. విశేషభోగలోలుడగువాడు సమయమువచ్చినప్పు డెక్కువబాధ సహించుననియు, నసామాన్యమగు నాత్మనిగ్రహము చూపుననియు, పీకునివలె ప్రవర్తించుననియు భావించుట వెర్రితనము. మంచి శరీరారోగ్యమున కెంతశిక్ష యవసరమో మంచి నైతికస్థితికి నంత శిక్ష యుండవలెను. కాని, యది నిశ్చయముగ సన్యాసము, శరీరమును శుష్కింపజేయుట కాజాలదు.

'నిరాడంబరమైన వ్యవసాయదారు జీవితము' నాదర్శముగ జేయుటకు నేనెంతమాత్రము నంగీకరింపజాలను. అయినను నాకు కంపరమెత్తును. నేను దానికి లొంగుటకుబదులు వ్యవసాయదారులను గూడ దానినుండి బయటకు లాగగోరెదను. అనగా వారిని పట్టణవాసులను జేయుటకాక, నచ్చటనుండు విజ్ఞానసౌకర్యములను గ్రామసీమలకు వ్యాపింపజేయవలయుననియే నాకోరిక. ఈజీవితము యథార్థమైనయానందము నీయకపోవుటయేగాక నాకు రమారమి జయిలువలె నుండును. "చేత పారనుబూను మనిషి" లో నాదర్శప్రాయముగ జేయవలసిన దేమిగలదు? అసంఖ్యాకములగు పురుషాంతరములనుండి నలిపివేయబడి, కొల్లగొట్టబడినరైతు తనతోడి పశువులకంటె నొక్కవాసి మెరుగు. "అతనికి సంతోషము, ఆశ లేకుండచేసిన దెవరు? విచారము వెలిబుచ్చక, మొద్దుబారిన ఎద్దువలె చేసినదెవరు?"

మానవసంస్కారమువీడి మనస్సుకు స్థానములేని యజ్ఞానపరిస్థితులకు పోవలెనను యీకోరిక నాకు కేవలమర్థశూన్యముగ కాన్పించును. మానవునకు కీర్తి, విజయము చేకూర్చువస్తువే దూషింపబడుచున్నది. నిరుత్సాహపరుపబడుచున్నది. మనస్సునణచివేసి దానియభివృద్ధి నరికట్టు భౌతికవాతావరణము వాంఛనీయమని భావింపబడుచున్నది. ప్రస్తుత నాగరికత దోషములతో నిండియున్నది. కాని, దానిలో గుణముకూడకలదు. దానిలోనున్న యాదోషమునుపోగొట్టుకొనగలశక్తి దానికిగలదు. దానిని సమూలనాశము చేయుటయనగా దానిలోనున్న యాశక్తిని తీసివేసి నిర్వీర్యము, నిరుత్సాహజనకము, దుఃఖప్రదము నగుస్థితికి పోవుట యగును. కాని యిది వాంఛనీయమే

యనియనుకొనినను యసంభవము. పరివర్తన ప్రవాహమును మన మాపజాలము. దానితో మనకెట్టిసంబంధము లేక నుండజాలము. 'ఈడెను' వనఫలము ననుభవించిన మన మా రుచిని మరచిపోయి, ఇక్ష్వాకుల కాలమునకు పోజాలము.

ఈ వాద మతికష్టమైనది. ఏలనన, యీ రెండుదృష్టులు కేవల విరుద్ధములు. గాంధీజీ యెప్పుడు వ్యక్తిమోక్షము, పాపము అను దృష్టిలో యోచించుచుండును మా యందరిమనస్సులలో సాంఘిక శ్రేయస్సు ప్రధానముగ నుండును. పాపమనుభావమును నేవరమువేసి కొనజాలను కనుకనే గాంధిజీయొక్క సామాన్యదృష్టి నాకు వచ్చుదు. సంఘమును సాంఘిక నిర్మాణమును మార్చుటకతడు యిష్టపడడు. అతడు వ్యక్తులపాపములను పారద్రోలుటకు యత్నించును. 'స్వదేశీని' అనుసరించువాడు ప్రపంచమును సంస్కరింపవలెనను నిరర్థక యత్నమున కెన్నడు పూనుకొనడు అది భగవంతునిచే నియమింపబడు సూత్రముల ననుసరించి కదలునని, కదలగలదని యతడు విశ్వసించును" అని యతడు వ్రాసెను. అయినను ప్రపంచమును సంస్కరించు ప్రయత్నములో నతడు తగినంత ముందంజ వేయును. కాని, యతని సంస్కారము వ్యక్తులకు సంబంధించినది. యింద్రియ భోగములను జయింపవలెను. అవి పాపభూయిష్టములు. ఒక రోమను క్యాథలికు రచయిత చేసినవిర్వచనము నత డంగీకరించునని నే ననుకొనెదను. "పాపబంధమునుండి తప్పించుకొనుటయే స్వేచ్ఛ." రెండువందల యేండ్లక్రిందట లండనుపట్టణబిషప్ చెప్పినమాటల నివి యెంత పోలియుండెను! క్రైస్తవమతము పాపబంధమునుండి సైతానునుండి మానవ మద, మాత్సర్యాదులనుండి, విపరీతకోరికలనుండి రక్షించును."

ఈదృష్టిని గుర్తించితిమేని కామమువల్ల గాంధీజీకిగల భావమును కొంచెమర్థముచేసికొనగలము. ఇది నేటి సామాన్యమానవుని కసాధారణవిషయము. "ఆతనిదృష్టిలో సంతానకోరిక లేనివారికలయిక నేరము" మరియు "కృత్రిమపద్ధతులు నపుంసకత్వమును, వరములవిస్మారతను కలిగింపకతప్పదు" మనకర్మలయొక్క ఫలితములనుండి తప్పించుకొనజూచుటతప్పు, అవినీతికరము. తన జిహ్వానుతృప్తిపరచుకొనుచు,

మందులను, బలవర్ధన లేహ్యములను సేవించుచు తత్ఫలితములనుండి తప్పించుకొనజూచుట చాలచెడ్డ తన పశువాంఛలను తీర్చుకొనుచు తత్ఫలితములనుండి తప్పించుకొనజూచుట మరింత యధమమైనదని."

నాకీ దృష్టి యసహజముగ, నాశ్చర్యకరముగ కాన్పించును. అతనిదృష్టినిక్కమైనచో నేను నపుంసకత్వమునకు, నరములసబద్ధత్వము నకు దరిజేరిన నేరస్తుడనగుచున్నాను రోమనుక్యాథలికు మతస్థులుకూడ జనన నిరోధమును తీవ్రముగ నెదిర్చిరి కాని, వారు గాంధీజీవలెయీ వాదమును చివరవరకు తీసికొనిపోలేదు. వారు మానవస్వభావమని భావించినదానితో రాజీపడిరి. గాంధీజీ యట్లుగాక సంతానముకొరకు తప్ప స్త్రీ పురుషుల కలయిక గుర్తింపడు. 'కామమును నేను పరిగ ణింపకపోవుట యసంభవమైన యాదర్శమని నాకు చెప్పుచుందురు. ఇచ్చట నుదహరింపబడిన కామము సహజమని నేనెంతమాత్రము నంగీకరింపజాలను. అది వినాశకరము. సోదరునకు సోదరికి, తల్లికిబిడ్డకు తండ్రికి కూతురునకుగల ప్రేమయే స్త్రీపురుషుల సహజసంబంధము. ఈ సహజప్రేమయే ప్రపంచమునకాధారభూతము' అనియతడుచెప్పెను. 'భార్యాభర్తల కామము కూడ సహజమని నేను చాటెదను' అని యతడు మరింతగట్టిగ చెప్పెను. దానినొక విశ్వాసముగ మన మంగీక రింపవలెను. లేదా తిరస్కరింపవలెను. దీనికి వేరొక మధ్యమార్గము లేదు. ఇది విశ్వాసమునకు సంబంధించినది. కాని హేతువుకుసంబంధించి నదికాదు. ఈ విషయములో గాంధీజీ పొరపడెననియే నేను భావించె దను. అతని సలహా కొంతమందికి భరింపవచ్చును కాని, యది జన సమూహముమీద నిరర్థకము. శరీరముకు నరములకు వ్యాధికారకము. ఇంద్రియనిగ్రహము వాంఛనీయమే. కాని గాంధీజీ సిద్ధాంతము దీనిని సాధింపగలదని నేను భావింపను. ఇది చాలయతివాదము. చాలమంది కిది శక్తికి మించినది. లేదా భార్యాభర్తలకు తగవుసంభవించును. జనన నిరోధపద్ధతులు విధాయకముగ ననాధారణవిషయులోలత యగునని గాంధీజీ స్పష్టముగ భావించును; కేవల కామము స్వైరవిహారమునకు దారియని యతడు భావించును. ఈ రెండు సారాంశములలో నేదియు

సమర్థింపబడనేరదు. ఈ కామవిషయములో గాంధీజీ కింత వైముఖ్య
మేల యుండవలెనో నా కర్థముకాకున్నది. అది యతనికి 'మసిబొగ్గు
లేక శుద్ధతెలుపు' సమస్య, ఈ రెండువర్ణముల మధ్య ఛాయ లేవియు
నుండవు. ఈ రెండు చివరలందు నత డసామాన్య యసహజ యతి
వాదస్థితిని తీసికొనుచున్నాడు. ఇది బహుశః యీ రోజులలోని
కామశాస్త్రపుస్తక ప్రవాహముమీద కలిగిన వైరభావమని యను
కొనెదను. నేను సామాన్య వ్యక్తిని. నా జీవితములో నింద్రియ
వాంఛ తన పాత్రను నిర్వహించెను. కాని, యది నన్ను నా యితర
కార్యములనుండి మరల్చలేదు. అది తక్కువస్థానమునే వహించెను.
అతని దృష్టి ముఖ్యముగ ప్రపంచమును ప్రపంచపద్ధతులను ధిక్క
రించు సన్యాసదృష్టి. జీవితమును తిరస్కరించి యది చెడ్డయని
భావించువానిదృష్టి. సన్యాసి కది సహజము. కాని యీ జీవితము
నంగీకరించి దాని లబ్ధిని పొందుటకు ప్రయత్నించుచున్న లౌకికుల
మీద దీనిని వర్తింపచేయుట దురవగాహము.

నే నితరవిషయముల వెంబడిబడి కొట్టుకొనిపోతిని. కాని,
ఆలిపూరుజయిలులోని యీదుర్దినములలో నీ భావములన్నియు నొక
సహేతుక క్రమము ననుసరింపక తక్కిడి బిక్కిడిగ నా మనస్సును
నింపుచు నన్ను కలవరపరచి బాధించుచుండెను. అన్నిటికిని పైన
ఒంటరితనమును, సంహారమును గురించిన భావముండెను. ప్రాణ
మును త్రుంచివేయు నా జయిలు వాతావరణము, బిక్కు బిక్కుమను
నా చిన్నగది దీనిని మరింతదోహదముచేసెను. నేను జయిలు వెలుపల
నున్నచో నీబాధతాత్కాలికముగనుండెడిది; నేను త్వరితముగ నూతన
పరిస్థితులకు సరిపెట్టుకొని యాత్మప్రకటనచేతను క్రియచేతను యుప
శాంతిని పొందెడివాడను. జయిలులో నాకట్టి శాంతి లేకపోవుటచే
కొన్నిదుర్దినములనుగడిపితిని. అదృష్టవశాత్తు నేనిట్టినిరాశనుండి వెంటనే
కోలుకొనుచుందును. నేను నామనఃఖేదమునపనయించుకొనుచున్న
సమయమున కమల నన్ను దర్శింపవచ్చెను. ఇది నా కపరిమితోత్సా
హముకలిగించెను; నా యొంటరితనము పలాయనమయ్యెను. ఏమిజరిగి
నను, ఏమిసంభవించినను మేముద్దరమున్నారమని నేను భావించితిని.

# 95

## విరుద్ధభావములు

గాంధీజీని స్వయముగ నెరుగకనతని వ్రాతలను మాత్రమే చదివినవా రతడు సనాతన మనిషియనియు ఛాందసుడనయు "ముల క్కాయమారాతి" కలవాడనియు సంతోష సంహారకుడనియు, "ఆపాద మస్తకము కాలాంబరములఁధరించి తమనిత్యవిధులను జరుపు మత బోధకుల" వంటివాడనియు భావింపవచ్చును. కాని, యతని వ్రాత లతని కన్యాయముచేయుచున్నవి. వానికంటె నతడు చాల గొప్ప వాడు. అతడు వ్రాసినదాని నుదహరించి విమర్శించుట యుక్తము కానేరదు. అతడు ఛాందసజాతికి కేవల వ్యతిరేకి. అతని చిరునవ్వు సంతోషదాయకముగ నుండును. అతనినవ్వు అందరను నవ్వింప జేయును. అత డుత్సాహమును వెదజల్లును. శిశువువలె నతనిలో మనలను మోహింపజేయున దేదియో కలదు.

అత డసాధారణుడు, విపరీత పురుషుడు మహాపురుషులందరు కొంతవరక ట్లేయుందురు. దీనులయెడల నతని కెంతటి యపార విచార ప్రేమలున్నను వారిని విధాయకముగ సృష్టించుచు, నలిపివేయుపద్ధతి నత డేల సమర్థించునాయను సమస్య నన్నానేక సంవత్సరములనుండి బాధించుచుండెను. దౌర్జన్యరాహిత్యమువట్ల నతని కెంతరాగమున్నను కేవలము దౌర్జన్యమువిూద నిర్బంధములవిూద నాధారపడు రాజ కీయ సాంఘికనిర్మాణము నత డేల యభిమానింపవలెను ? అత డట్టి పద్ధతి నభిమానించుననుట బహుశః యుక్తము కాకపోవచ్చును. అతడు శాస్త్రసమ్మతమైన యరాజకమును సమర్థించును. కాని, యాదర్శ పూర్వకమగు అరాజకప్రభుత్వ మింకను చాలదూరమున నుండుట చేత దాని నూహించుట నుకరము కాకపోవుటచేత నతడు ప్రస్తుత క్రమములు యంగీకరించును.

ఒక్కొక్కప్పు డతడు తాను సామ్యవాదినని చెప్పుకొనుచుండును. కాని, యతడాశబ్దమునుతనస్వంత భావములోనుపయోగించును. సాధారణముగ సామ్యవాదమని పిలువబడు శాస్త్రీయ నిర్మాణముతో దానికెట్టి సంబంధములేదు. అతని ననుసరించు విఖ్యాతకాంగ్రెసునాయకులు కొందరాపదము నొకవిధముగుపిచ్చి భూతదయాళుత్వమను భావములో నుపయోగింతురు. గాంధీజీ కీవిషయము తెలియునని నేనెరుగుదును. అతడార్థికవిషయములనుగురించి, సామ్యవాదము, మార్క్సిజములనుగురించికూడ చాలపుస్తకములను చదివి, యితరులతోచర్చించెను. కాని ప్రధానవిషయములలో మనసేదానంతటది మనలను ముందుకు తీసికొనిపోజాలదను నా విశ్వాసమంతకంత కభివృద్ధియగుచున్నది. "నీ హృదయము విశ్వసించుటకిష్టపడనిచో నీబుద్ధినిశ్చయముగనెన్నపుడు విశ్వసింపనీయదు" అని విలియంజేమ్సు చెప్పెను భావములు సాధారణ దృష్టిని పాలించుచు మనస్సును వశపరచుకొనును మన సంభాషణలు ఆర్థిక, రాజకీయ, మతవిషయములనుగురించినవి-యేవియైనను నిజముగ నుద్దేశము లేక స్వభావమునిూద నాధారపడును. "మానవుడు తాను సంకల్పించుదానినిచేయగలడు; కాని, యతడు తన యిచ్ఛానుసారము సంకల్పింపజాలడు" అనిస్కాఫెన్‌హోర్ చెప్పెను.

దక్షిణఆఫ్రికాలో గాంధీజీలో నొక యకాలపరివర్తనము కలిగెను. ఇది యతనిని పూర్తిగ కదల్చివేసి, యతనిజీవిత దృక్పథమును మార్చివేసెను. అప్పటినుంచి తనభావములకన్నిటికి నతడు స్థిర పునాదులను వేసికొనెను. అతని మనఃకవాటము బంధింపబడెను. నూతన సూచనలనుచేయువారి నతడత్యంతశ్రద్ధతో, ఓర్పుతోవినును; కాని మర్యాదపూర్వకమగు నీ శ్రద్ధ వెనుక కవాటము బంధింపబడినదను భావము ద్యోతకమగుచుండును. కొన్ని భావము లతనిలో స్థిరపడిపోవుటచే నతనికి తక్కినవన్నియు నప్రధానములు. ఇతరములు, ద్వితీయములు నగు విషయములనుగురించిపట్టుబట్టుట ప్రధానస్కీమునుండి దృష్టిని చెదరగొట్టుటయగును; దానిని భంగపరచుటయగును.

ఆ ప్రధానయాధారము వంటిపెట్టుకొని యుండుచో నీ యితరవిష యములును చక్కబడగలవు. పరికరములు సరియైన వైనచో ఫలితము యుక్తము కాక తప్పదు.

ఇదియే యతని భావము వెనుకనున్న ప్రధాన యాధారమని నే ననుకొనెదను. సామ్యవాదమును, ముఖ్యముగ మార్క్సిజమును [దానికి దౌర్జన్యముతో సంబంధముండుటచే] అతడుశంకించును. "తరగతులమధ్య పోరాటము" అనుపదముతే సంఘర్షనను, దౌర్జన్యమును స్ఫురింపజేయును. కనుక నతని చెవిని పడరాదు. ప్రజాసామాన్యము యొక్క జీవితప్రమాణమును (ఒక యతిసామాన్య పరిమితిని మించి) హెచ్చింపవలెనను కోరిక యతనికిలేదు. ఏలనన విశ్రాంతి, యున్నత జీవితప్రమాణముభోగలాలసను పాపమును దోహదముచేయవచ్చును. ఇప్పుడున్న కొద్దిమంది ధనికులే భోగలాలసులుగ నుండుట మంచిది కాదు ఈ సంఖ్య నభివృద్ధిచేయుట మరింత యనర్థము. అతడు 1926 లో వ్రాసిన యొక యుత్తరమునుండి యిట్టి సారాంశము తీయ వచ్చును. ఈ దృష్టి సామ్యవాదమునకు, క్యాపిటలిజమునకు కూడ చాల దూరము. నేడు శాస్త్రము, పారిశ్రామికవిద్య, స్వప్రయోజన పరుల యడ్డమే లేనిచో, ప్రతివానికి నన్నవస్త్రములును, యిండ్లను ప్రసాదించి జీవితప్రమాణము నెక్కువగ పెంచగలదని చెప్పుచో దాని యందతనికి విశ్వాసములేదు. కొంత మితిదాటినతరువాత నతడా ఫలిత ములను కోరడు. కనుక సామ్యవాద మతని నాకర్షింపదు. క్యాపిట లిజము కొంతవరకు మాత్రమే సహ్యము. అతడీ రెంటిని ప్రేమింపడు కాని, రెండవది యంత చెడ్డదికాదు. అమలులోనున్న దానిని గుర్తింప వలెను. కనుక ప్రస్తుతము దానిని సహించును.

ఈ భావముల నతని కాపాదించుటలో నేను పొరబడియుండ వచ్చును. కాని, యతని తలంపు లీవిధముగ నుండవచ్చునని నేను భావించుచున్నాను. ప్రజలధికసుఖములను, విశ్రాంతిని యాదర్శముగ జేసికొనవలెనని యతడుకోరడు. వారు నైతికజీవితము జీవింపవలెను. దురభ్యాసములను మానివేయవలెను. ఇంద్రియముల నంతకంతకరి

కట్టుచు వ్యక్తిగతముగ, నాధ్యాత్మికముగ వృద్ధిచెందవలెను, ప్రజలను సేవింపదలచినవారు వారి యైశ్వర్యము నెక్కువగ పెంపొందించుట కంటె తామే వారి స్థితికి దిగి వారితో సమానస్థాయిగకలసిపోవలెను. అట్లుచేయుటచే వారు విధాయకముగ వారి నుద్ధరించుటకు కొంత సాయపడగలరు. అతనిప్రకార మదియే ప్రజాప్రభుత్వము. 1934 సెప్టెంబరులో నతడొక స్టేటుమెంటులో నిట్లు చెప్పెను. "నాకెదురా డుటకు చాలమంది నిస్పృహచెందిరి. జన్మతః ప్రజాప్రభుత్వవాదినైన నా కిది యవమానకరవిషయము. మానవలోక దరిద్రులతో పూర్తిగ నైక్యభావమునొందుట, వారికంటె నధికముగ జీవింపవలెనను కోరిక లేకపోవుట, యట్టిస్థితికొంకు బుద్ధిపూర్వకముగ యథాశక్తి ప్రయత్నముచేయుట ప్రజాప్రభుత్వార్హమగునెడల నే నా యధికారమును కలిగియున్నాను."

ఆధునిక ప్రజాప్రభుత్వవాది, సామ్యవాది, లేక క్యాపిటలిస్టు, యీ వాదమును, యీదృష్టిని అంగీకరింపడు. కాని, ప్రాచీన మత దృష్టికలవాడు దీనిని కొంత యంగీకరింపవచ్చును. ఉభయులు భూత భావబద్ధులై గతకాలపక్కలోనే భావించుచుందురు? వర్తమానమెట్లు న్నది? ముందేమిరానున్నది ? అని యోచించుటకంటె వారెక్కువగ జరిగినదానిని గురించియే యోచించెదరు. ఈ రెండు మానసిక ప్రేరణలమధ్యను ప్రపంచములో నపారభేదముగలదు. పాతప్రపంచములో ప్రజాసామాన్యయైశ్వర్యము నభివృద్ధిచేయుట కష్టసాధ్యముగనుండెను. బీదలెప్పుడును మనతోనుండిరి. అప్పటికొద్దిమంది ధనికులు సాంఘిక వ్యవస్థలో ప్రధానభాగమయిరి: ఉత్పత్తిపద్ధతికి వారవసరమైరి. కనుక ధర్మబోధకుడు, సంస్కారప్రియుడు సూక్ష్మబుద్ధివీరినంగీకరించి బీదల యెడల వీరు చేయవలసిన ధర్మములను గుర్తింపచేయుటకు ప్రయత్నించిరి. వీరుబీదలకు ధర్మకర్తలుగ నుండవలెను; దయకలిగియుండవలెను. మతము దయ నొక పుణ్యకార్యముగ విధించెను. పెద్ద భూఖామందు, క్యాపిటలిస్టు, ఫ్యూడల్ ప్రభువు వీరందరు ధర్మకర్తలను భావమును గాంధీజీ యెప్పుడు పోషించుచుండును. అతడు మతప్రవక్తల చిరపరం

వక వనుసరించును. "ధనికులు సర్వేశ్వరుని సేవకులు. అతని యైశ్వర్య సంరక్షకులు; దానిని పంచిపెట్టుటకు నియమింపబడినవారు. ఏసను స్వయముగ బీదలనిధిని వారికి వప్పగించెను." అని పోప్ చాటెను. ప్రజాబాహుళ్య మెరిగిన హిందూమతము, ఇస్లాముకూడ ధనికులను దానధర్మములు చేయవలెనని యెప్పుడును బోధించుచున్నవి. వారు దేవాలయములను, మసీదులను, ధర్మశాలలను నిర్మించుచు తమ విభవమునుండి కొన్ని కానులను, రూకలను బీదల కిచ్చుచు పుణ్యాత్ములైనట్లు భావించుచుందురు.

ఈ మతదృష్టి పాతప్రపంచదృష్టి. అప్పటి దుఃఖమునుండితప్పించుకొనుటకు పరలోకమురానున్నదనునాశయొక్కటియేగత్యంతరము. కాని. పరిస్థితులుమారి మానవయైశ్వర్యము పూర్వమెన్నడు నూహింపబడనివిధమున నేడు పెరిగినను ఈ ప్రాతకాలపు పట్టువిడువదయ్యెను. ఇప్పు డనిశ్చితములు గణింప శక్యముకానివియగు కొన్నియాధ్యాత్మిక ప్రయోజనము లెక్కువగపేర్కొనబడుచుండును. క్యాథలిక్ మతస్థులు పన్నెండు, పదమూడు శతాబ్దములు క్రైస్తవమత కృతయుగమని భావింతురు. అప్పుడు ఋషులు వర్ధిల్లిరి. క్రైస్తవరాజులు ముస్లిముల మీఁద మతయుద్ధములను సల్పిరి. గాథిక్ దేవాలయములు విస్తరిల్లెను. వారి ప్రకారమది "మధ్యయుగపుగ్రామసంఘములయాజమాన్యమున యనుభవింపబడిన యదార్థక్రైస్తవ ప్రజాపాలనము. అంతకుమునుపు తరువాత నట్టిది యనుభవింపబడలేదు." ముస్లిములు మొదటిఖాలిఫుల నాటి "ఇస్లాం ప్రజాపరిపాలనము" వైపు విజయవంతములగు వారి యద్భుతజీవితములవైపు ఆతురతతో తిరిగిచూచుచుందురు. అట్లేహిందువులు వైదిక, పురాణయుగములవైపుచూచుచు "రామరాజ్యము"ను గురించి కలలను గనుచుందురు. అయినను ఆ రోజులలో ప్రజాసామాన్యమంతయు తిండిలేక, జీవితమునకు కావలసిన కనీసపు అవసరము లైనను లేక నల్లాడిరనిచరిత్రయంతయు మనకు తెలుపుచున్నది. పైనున్న యేకొద్దిమందియో తగిన విశ్రాంతి, యుపపత్తియు కలవారు, ఆధ్యాత్మిక జీవితమును గడిపియుండవచ్చును. తక్కినవారందరు కేవల

యుదరపోషణకొరకే బాధపడిరి. ఆకలి చిచ్చుతో బాధపడువానికి విజ్ఞానాభివృద్ధి, ఆధ్యాత్మికాభివృద్ధి యసంభవములు; అతని భావము లన్నియు నాహారమునుగూర్చియు దానిని సంపాదించు విధానమునుగూర్చియు కేంద్రీకరింపబడియుండెను.

పారిశ్రామికయుగము మనకండ్ల కధికముగ కాన్పించు ననేక, చెడుగులను తెచ్చిపెట్టెను కాని, ప్రపంచమునంతను సమగ్రముగ ముఖ్యముగ నెక్కువపరిశ్రమమయము గావింపబడిన దేశములను తీసికొనినచో నది యాధ్యాత్మిక, విజ్ఞానాభివృద్ధుల నెక్కువసంఖ్యాకులకు సుకరముచేయునట్టి యైశ్వర్యపునాదులను నిర్మించెననుసంగతి మనము మరచిపోలేము. ఇదిహిందూదేశములోను, ఇతర వలసదేశములలోను యెక్కువగ కాన్పించదు. ఏలనన మనము పరిశ్రమలవలననెక్కువలబ్ధి పొందలేము. వానివలన మనము కొల్లగొట్టబడితిమి; అనేక విధముల యైశ్వర్యములో నంతకంటె నెక్కువగ విజ్ఞానములోఆధ్యాత్మికముగ మరింత యధోగతికి పోతిమి. ఈదోషము పరిశ్రమలదికాదు; పరప్రభుత్వమే దీనికి కారణము. హిందూదేశములో పాశ్చాత్యవిజ్ఞాన మని పిలువబడునది, తాత్కాలికముగ, బానిసత్వమును బలపరచెను: అది మన సమస్యలను పరిష్కరించుటకు బదులువానినిమరింతపెద్దచేసెను.

అది మన దురదృష్టము. ఇది ప్రస్తుత ప్రపంచమును గురించిన మనదృష్టిని మలినముచేయగూడదు. ప్రస్తుతపరిస్థితులలో నుత్పత్తిపద్ధతికిలేక సంఘమునకంతకు ధనవంతుడవసరమైనవాడు, లేక వాంచనీయుడు కాడు. అతనికాలము చెల్లెను: అతడిప్పుడు నడ్డమువచ్చుచున్నాడు ధనికులను దయగలిగియుండవలసినదనియు, బీదలనుతమదుస్థితికికృతజ్ఞతను చూపుచు పొదుపుగలిగి సత్ప్రవర్తన గలిగి యుండవలెననియు బోధించు పాత పురోహితధర్మమున కికనర్థములేదు. మానవునిసంపద యద్భుతముగ పెరిగెను: అది ప్రపంచసమస్యల నెదుర్కొని పరిష్కరించుకొనగలదు. ధనవంతులలో చాలమంది యితరులను పీడించువారైరి. ఇట్టి జాతియొక్కయునికి కేవలమడ్డమేకాక మానవసంపద నమితముగ వ్యర్థముచేయుట యగును. ఈజాతివారిని ప్రత్యేకముగదోషదము

చేయుపద్ధతి కృషి, యుత్పత్తులను వారించి యిరువంకలను - యితరుల కృషిమీద జీవించువారిని పనిలేక మాడిపోవువారిని-కృషిలేనివారిని ప్రోత్సహించును. కొంతకాలముక్రిందట గాంధీజీయే యిట్లువ్రాసెను. 'పనిలేక మాడుచున్నట్టిప్రజలకు భగవంతుడు కృషిరూపమునను చేసిన పని కాహారరూపమునను చూపురూపమొక్కటియే యంగీకృత మగును - ఆహారముకొరకు కృషిచేయుటకే భగవంతుడు మానవుని సృజించి కృషిచేయకుండ మెక్కెడువారు దొంగలని చెప్పెను.'

గత సమస్యలులేని యిప్పుడు పురాణపద్ధతులను, సూత్రములను ప్రయోగించి, యప్రస్తుత పదజాలము నుపయోగించి యాధునిక ప్రపంచ క్లిష్టసమస్యల నర్థముచేసికొన ప్రయత్నించుట విఫలతకు, గందరగోళమునకు కారణము. స్వంతఆస్తి ప్రపంచముయొక్క ప్రధాన భావములలో నొకటియని కొంతమంది తలంపు. కాని, స్వంత ఆస్తి యనుభావమే యెప్పుడును మారుచుండెను. ఒకప్పుడు బానిసలు ఆస్తియైరి. అట్లే స్త్రీలను పిల్లలును, వధువు ప్రథమరాత్రిమీద ప్రభువుకు గలహక్కు, రోడ్డులు, దేవాలయములు, వంతెనలు, బల్లకట్టులు, గాలి, భూమి-స్వంత ఆస్తియయ్యెను. పశువులిప్పటికి ఆస్తి యగుచున్నవి. కాని, యనేకదేశములలో యజమానుల హక్కులు చట్టములచేనియమింపబడెను. యుద్ధకాలములో ఆస్తిహక్కులు తుడిచివేయబడును. నేడు ఆస్తియంతకంతకు వస్తురూపమును వీడుచున్నది. వాటాలు, పరపతిమొదలగునవి యాస్తియగుచున్నవి. ఆస్తినిగురించిన భావము మారినకొలది ప్రభుత్వముయొక్క పజోక్యము కల్పించుకొనును ప్రజాభిప్రాయముకోరుటచేచట్టము ఆస్తికల యజమానులయొక్క యరాజకమైన హక్కులను నిరోధించును. సర్కారుతో ఆస్తికలిపివేయుటవంటి స్వభావముగలయనేకవిధహెచ్చుపన్నులుప్రజాశ్రేయస్సుకొరకువ్యక్తిగతములగు స్వంతయాస్తియొక్క హక్కులను మ్రింగివేయును. ప్రజాశ్రేయస్సు పబ్లికునీతి కాధారమగును. తన స్వంత యాస్తిహక్కులను రక్షించుకొనుటకైనను మనమీప్రజాశ్రేయస్సుకు వ్యతిరేకముగనాచరింపరాదు. ఇంతకు వెనుకకాలములో ప్రజలలో నధికసంఖ్యాకులకు

ఆస్తినుంచుకొను హక్కులే లేవు. వారే ఇతరులచే పొందబడిన యాస్తి దైరి. నేడుకూడ కొద్దిమందికే యట్టిహక్కులు కలవు. స్వార్థప్రయోజనములను గురించి మనమెక్కువగ వినుదుము! నేడొక నూతన స్వార్థ ప్రయోజనము గుర్తింపబడుచున్నది. ప్రతిపురుషుడు, ప్రతి స్త్రీ జీవించుచు, కృషిచేసుకొనుచు తమకృషిఫలితముల ననుభవింపవలెను. మార్పుచెందునట్టి యీ భావములచేత ఆస్తి, పెట్టుబడి నశించిపోవు. అవి విస్తరింపచేయబడును; కేంద్రీకరింపబడుటచే నవి కొద్దిమందికి ప్రసాదించిన నధికార మిపుడు సంఘపరమగును.

గాంధీజీ వ్యక్తినాంతరంగికముగ, నైతికముగ నాధ్యాత్మికముగ నభివృద్ధిపరచి తద్వారా బాహ్యావాతావరణమును మార్చగోరును. ప్రజలు దురభ్యాసములను, విషయలోలతను మానిపవిత్రులు కావలెను. అతడు బ్రహ్మచర్యము కావలెనను; చుట్టలు, మత్తుపదార్థములు మద్యపానము మొదలగువానిని మానవలెను. ఈ దురభ్యాసములలో నేదియెక్కువ యుపద్రవకరమను విషయమున భేదాభిప్రాయములుండ వచ్చును. కాని, వ్యక్తిగతముగ చరించినను, అంతకంటె నెక్కువగ సాంఘికముగను, లోభము, స్వార్థముఆర్జించవలెననుకోరిక, స్వలాభము కొరకువ్యక్తులుభయంకరపోరాటములనుసలుపుట, తరగతులువర్గములు క్రూరముగ కొట్లాడుకొనుట, ఒకవర్గముమరియొకవర్గమును నిర్దయాత్మకముగనణచివేసి కొల్లగొనుట, జాతుల ఘోరసంగ్రామములనుచేయు చుండుట వీటికంటె నీ వ్యక్తిగతదోషములు తక్కువ యుపద్రవకరము లనుటకు సందేహముకలదా! బలవంతులు దుర్బలులను కొట్టుకొనితిన వలెనను చట్టమును వెనుకటివలెనే "శక్తికలవారు తీసికొనెదరు, సమర్థతగలవారు ఉంచుకొనెదరు" అను నాశయముతోగల ప్రస్తుత దురాశాగ్రస్తసంఘములో నివి సహజముగలేవా? నేటిస్వలాభాపేక్షవిధాయకముగ పోరాటము కలిగించుచు ఈ పద్ధతియంతయు మానవునిలో నున్న దోచుకొను స్వభావమున కన్ని యవకాశములను, రక్షణను ఇచ్చును ఇది కొన్ని చక్కని స్వభావములను ప్రోత్సహించుననుటకు సందేహములేదు; కాని, యంతకంటె నెక్కువగ మానవుని నీచస్వభా

వముల కాస్పదమయ్యెను. విజయమనగా నితరులనుకూల్చివేసి, యా కూలిన వారిపై స్వారిచేయుట. సంఘవిరాయుద్దేశ్యములను, కోరికలను ప్రోత్సహించుచు మనలోనున్న యుత్తములను పీనికాకర్షించు చోనిట్టి వాతావరణములో గాంధీజీ తన యాదర్శమును - నైతికమానవుని - సాధింపగలడని యోచించునా? అతడు సేవాతత్త్వము నభివృద్ధిచేయ గోరును.అతడు కొందరువ్యక్తుల సందర్భములో సఫలతనొందవచ్చును: కాని, సంఘము ఆర్జనచేయు సంఘములోనున్న విజేతల నాదర్శముగ చూపునంతకాలము, స్వలాభమును ప్రధానోద్దేశ్యముగ నుంచునంత కాల మధిక సంఖ్యాకులగు ప్రజ లీపద్ధతినే యనుసరింతురు.

కాని యిప్పటి సమస్య కేవల నైతికబోధకు, ధర్మబోధకు చెందినదికాదు. అది ఆచరణకు తేలవలసిన నేటి యత్యవసర సమస్య. ప్రపంచమంతయు నాశాశూన్యమగు గందరగోళములో మునిగియుండు టచే నేదో యొక తరుణోపాయము కనిపెట్టవలెను. అజగరమువలె మనమేదియో జరుగునని కనిపెట్టుకొని యుండజాలము మనము క్యాపిటలిజము, కమ్యూనిజ్జము, సామ్యవాదము మొదలగు వానిలోనున్న చెడ్డలను విమర్శించుచు ప్రాచీనములు, నవీనములునగు నన్నిపద్ధతు లలోని యుత్తమ లక్షణములను సమన్వయపరచు కళ్యాణప్రదమగు మధ్యమార్గముకొరకు వ్యర్థముగ నాశపడుచు కేవల 'నాస్తి' భావ ముతో జీవింపజాలము. వ్యాధినిబట్టి చికిత్సను ప్రయోగింపవలెను. జాతీయముగ, నంతర్జాతీయముగ కూడ మన మున్నచోటనే నిలిచి పోజాలమనుసంగతి ధృవము: అతి ధృవము. మనము వెనుకకు పోవు టకు ప్రయత్నింపవచ్చును లేక ముందుకు పోవచ్చును. వెనుకకు పోవుట యసాధ్యము కనుక ముందుకు పోకతప్పదు.

అయినను గాంధిజీయొక్క యనేకకార్యము లత డతిసంకుచితాధి కారముల సమర్థించుచున్నాడని భావించుట కవకాశమిచ్చును. అతడు స్వయంతృప్తి మీదనే యాధారపడు జాతినేగాక గ్రామమును కూడ సృష్టింపగోరును. ప్రాచీనసంఘములలో గ్రామముకొంచెమించుమించు తనపైననే యాధారపడి యన్న, వస్త్రములనిచ్చెను: ఇతరవిధముల

దాని యవసరములను చేకూర్చెను; అనగా విధాయకముగ నదిచాల తక్కువజీవితప్రమాణము. గాంధీజీ దీనిని శాశ్వతలక్ష్యముగ భావించు చున్నాడని నేననుకొనను; ఇది యసాధ్యలక్ష్యము. నేటివిశేష జనసంఖ్య కొన్ని దేశములలో జీవించుటకూడ దుర్ఘటమగును; వారి దుర్భిక్షము నకు, కాటకమునకు మరలుట కంగీకరింపరు: గ్రామపరిశ్రమల నభివృద్ధి చేయుటవలనహిందూదేశమువంటివ్యవసాయక దేశములో (మనప్రస్తుత ప్రమాణమతితక్కువగనున్నది) ప్రజాసామాన్యములో కొద్దిఅభివృద్ధి కలుగవచ్చును. కాని ప్రతి యితర దేశమువలెనే మనమును తదితర ప్రపంచముతో బంధింపబడితిమి. మనముదీనినిత్రెంచుకొనుటయసాధ్య మని నాకు తోచుచున్నది కనుక మనము ప్రపంచదృష్టితోనేభావింప వలెను. ఈ దృష్టిలో సంకుచితమైన యార్థిక నిరంకుశత్వమునకు తావు లేదు. వ్యక్తిగతముగ నా కిది వాంచనీయముగ కాన్పించదు

మనకు సాధ్యమగు నేకైక పరిష్కారమునే మనము విధాయక ముగ స్వీకరింపవలెను. సామ్యవాద క్రమమును స్థాపింపవలెను. దీనిని మొదట మనదేశ సరిహద్దులలోను తరువాత ప్రపంచమంతట స్థాపింప వలెను. ప్రజాశ్రేయస్సుకొరకు ఐశ్వర్యోత్పత్తిని పంపకమును నియ మింపవలెను. దీనినెట్లు సాధింపవలెననునది వేరువిషయము. కాని, ప్రస్తుతక్రమమువలన లబ్ధిపొందు కొందరియభ్యంతరములవలన జాతి, లేక మానవకళ్యాణము నాపుచేయరాదని స్పష్టమగుచున్నది. అట్టి పరివర్తనమునకు రాజకీయ, సాంఘిక సంస్థ లడ్డములగులుచో వానిని తొలగింపవలెను; వాంచనీయము, ఆచరణీయము నగు పై యాదర్శ మును బలివేసి వానితో రాజీపడుట నమ్మికస్వామిద్రోహము. అట్టి పరివర్తనము కొంతవరకు ప్రపంచ పరిస్థితులచే త్వరితముచేయబడ వచ్చును. బలవంతము చేయబడవచ్చును. కాని, ప్రజాసామాన్యము యొక్క మనఃపూర్వకాంగీకారము లేనిచో నది స్థాపింపబడజాలదు. కనుక వారిని దీనివైపు త్రిప్పుకొనవలెను; మార్చవలెను. కొద్దిమంది దౌర్జన్యయుతమగు కుట్రలవలన లాభములేదు. ప్రస్తుత పద్ధతివలన లాభములను పొందినవారిని మార్చుటకుకూడ సహజముగ ప్రయత్న ములను సలుపవలెను.

గాంధీజీ ప్రత్యేకముగా నభిమానించుఖాదీయుత్పత్తివిధానము వ్యక్తికి యతిశయము నిచ్చుచున్నది. కనుక నిదిపారిశ్రామికయుగము కంటె వెనుకకు తీసికొనిపోవును. ప్రస్తుతమేప్రధానసమస్యను పరిష్కరించుటకు నిది పనికిరాదు. ఇది యుచితమార్గమున నభివృద్ధి చెందుట కడ్డమువచ్చు బుద్ధిని కలిగించును. అయినను తాత్కాలిక సోపానముగ నిది యొకప్రయోజనమును నెరవేర్చునని నేను విశ్వసించెదను. ప్రభుత్వము దేశమునంతకు చెందు వ్యవసాయ, పారిశ్రామిక సమస్యలకు యుక్తపరిష్కారమును చేయువరకు నిది సహాయకారిగనే యుండవచ్చును. హిందూదేశములో భయంకరమైననిరుద్యోగసమస్యకలదు, అంతకంటె నెక్కువగ గ్రామములలో కొంతకాలము పనిలేకపోవుట కలదు. ఈ స్థితిని పోగొట్టుటకు ప్రభుత్వమెట్టిప్రయత్నము చేయలేదు. పూర్తిగ పనిలేనివారికి, కొంతవరకు పనిలేనివారికి, ఖాదీ అధికముగ కొద్దిసహాయము చేసెను. ఈయభివృద్ధి తమ స్వప్రయత్నములచే కలుగుటవలన నది వారి యాత్మగౌరవమును పెంచి, కొంతవిశ్వాసమును కలిగించెను. దీనివలన కలిగిన మానసికఫలిత మత్యద్భుతమైనది: ఖాదీ, గ్రామపట్టణముల మధ్యగల యంతరువును కొంతవిజయముతో నయముచేయ ప్రయత్నించెను. అది రైతాంగమును మధ్యతరగతి విద్యాధికుని దగ్గరకు తెచ్చెను. చూచువానిమీదను, ధరించువాని మీదను వస్త్రములకొక విశేష మానసిక ఫలితము కలదు. మధ్యతరగతులవారు నిరాడంబరమైన తెల్లని ఖద్దరుదుస్తులను ధరించుటవలన వారిలో సరళత కలిగెను: డాంబికము, పామరత్వము తగ్గిప్రజాసామాన్యముతో నైక్యభావము కలిగెను. మధ్యతరగతులలోని క్రిందితరహా వారు ధనవంతుల ననుకరించుట మానివేసిరి: తమ చౌకదుస్తుల కవమానపడుట మానివేసిరి. నిశ్చయముగ వారుగౌరవమునుపొందుటయే గాక నింకను చీనిచీనాంబరములను ధరించువారికంటె నధికులమని భావించిరి. అతిదరిద్రుడుకూడ నీ యాత్మగౌరవమును కొంత యనుభవించెను. ఖద్దరుధారులైన గొప్పసమూహములో దరిద్రునిధనవంతుని కనిపెట్టుట కష్టసాధ్యము: ఒక విధమగు సౌభ్రాతృత్వముకూడ వృద్ధి

పొందెను. నిస్సందేహముగ ఖాదీ ప్రజాసామాన్యమును చేరుటకు కాంగ్రెసుకు సహాయముచేసెను అది జాతీయస్వాతంత్ర్య చిహ్నమయ్యెను.

యంత్రయజమానులు తమవస్త్రముల ధరలను పెంచకుండ ఖాదీ వారింపగలిగెను విదేశపోటీ, ముఖ్యముగ లాంకషైరుపోటీ, లోగడ యీపనిచేసెడిది ఈపోటీ తగ్గుటతోడనే (ప్రపంచ యుద్ధసమయమున జరిగినట్లు) భారత దేశములో బట్టలధరలు విపరీతముగ పెరిగి మిల్లులు విశేషలాభములను పొందెడివి. స్వదేశీ యుద్యమము, విదేశవస్త్ర బహిష్కారము యీ మిల్లుల కెక్కువగ తోడ్పడెను, కాని ఖద్దరుయొక్క యునికివలన యదిలేనిచో ధరలు పెరుగునట్లు పెరుగుటకు వీలులేకపోయెను. మిల్లులు నిశ్చయముగ ముతకగుడ్డలను తయారుచేసి ప్రజలయొక్క ఖాదీయభిమానము కొల్లగొనెను. మరియొక యుద్ధము వంటి యత్యవసరస్థితి కలిగినచో భారతమిల్లు యజమానులు 1914 లగాయతు ప్రజలను కొల్లగొనినట్లిప్పుడు చేయుటకు వీలులేదు. ఖాదీ యుద్యమము దీనిని వారించును: కొద్దికాలపు నోటీసులో విస్తరింపగల శక్తి ఖాదీకిగలదు.

హిందూదేశములో ఖాదీకి ప్రస్తుత మిన్ని యవకాశములున్నను నది తాత్కాలిక వ్యవహారము. తరువాతకూడ నిది విశేష ఆర్థిక మార్పును సుకరముచేయు నుపవృత్తిగనుండవచ్చును. కాని, భవిష్యత్తులో ప్రస్తుత వ్యవసాయపద్ధతి యంతయు తారుమారు కావలెను: పరిశ్రమ లభివృద్ధికావలెను. భూమి సమస్యనుగురించి కళ్ళనీళ్ళుతుడుచు అతుకుల పనివలనను, లక్షలకొలది రూపాయలను వెచ్చించి చిన్న చిన్న పైపైమార్పులను సూచించు కమిషనువలనను లాభములేదు. ప్రస్తుత భూమిపద్ధతి మన కండ్లయెదుటనే కూలిపోవుచున్నది. అది యుత్పత్తికి, పంపకమునకు పెద్దయెత్తున జరగవలసిన సహేతుక కార్యముల కాటంకముగనున్నది. చిన్న చిన్న ఖండములను సేద్యముచేయుట యంతరింపవలెను. సాముదాయక సహకారవ్యవసాయపద్ధతి ప్రవేశపెట్టవలెను. ఈ విధముగ తక్కువ ప్రయత్నముతో విశేషోత్పత్తిచేయు గొప్ప మార్పుమాత్రమే యాధునిక పరిస్థితులకు పనికివచ్చును.

భూమియే పైన ప్రజలకందరకువృత్తినీయదు,యివ్వజాలదు. పెద్దయెత్తు మీాద జరుగు వ్యవసాయమువలన (గాంధీజీ భయపడునట్లు)వ్యవసాయ పనివాండ్ర యవసరము చాలవరకు తగ్గిపోవును. తక్కినవారు, కొంత వరకు,చిన్నయెత్తుమీాద జరుగు పరిశ్రమలను ప్రధానముగ పెద్దయెత్తు మీాద జరుగునట్టి సంఘమునకు చెందచేయబడు పరిశ్రమలను, సాంఘిక సేవలను చేబట్టవలెను.

ఖాదీ యనేక ప్రాంతములలో కొంతయువశాంతిచేకూర్చెను. కాని, ఈ విజయములోనే యుపద్రవబీజములున్నవి. అది నశించి పోవుచున్న రైతు భూమిపద్ధతికి సహాయపడుచు నంతవరకు శ్రేష్ఠమైన పద్ధతికి కావలసినమార్పుల నాలస్యముచేయుచున్నది ఈ ఫలితమంత గొప్పదికాకపోయినను దీనిస్వభావము పోలేదు. కౌలుదారుకు లేక తన కొద్దిస్వంతభూమిచేసుకొనువానికి మిగులున దశిస్వల్పము. అతని హీనజీవితమును గడుపుటకుకూడ నదిచాలదు ఆకొద్దిరాబడికితోడుగ నతడు మరిదేనినోయితరత్ర చూచుకొనవలెను లేదా పన్ను,శిస్తులను చెల్లించుట కతడు మరింతఋణముచేయవలెను. కనుక పైగావచ్చు ఈ యాదాయము ప్రభుత్వమునకో, భూఖామందుకో చెల్లిపోవును. ఇది లేనిచో వారిట్లుచేయజాలరు. పైగావచ్చు ఈ యాదయము కన్నె ఙ్కగా నుండునంతయున్నచో పన్ను హెచ్చింపబడిదానినికూడమ్రింగి వేయవచ్చును. ప్రస్తుత పద్ధతిలో కవులుదారుయొక్క తదితరపాటు, పౌదుపరితనము చివరకు భూఖామందుకే లాభముచేయును.

గాంధీజీ గ్రామపరిశ్రమల నుద్ధరించుటకు జేయు ప్రయత్నము ఖాదీ ప్రోగ్రామును మరింత విస్తరింపజేయుటయేయగును.అదివెంటనే సత్ఫలితము నిచ్చును ఇందులో కొంత శాశ్వతము, కొంతతాత్కా లికము కావచ్చును. తన ప్రస్తుత దుర్భరస్థితిలో నవి గ్రామస్తునకు సహాయముచేయును; చచ్చిపోవుటకు సిద్ధముగనున్న కొన్ని విజ్ఞాన, కళాధిక్యతలను పునరుద్ధరింపవచ్చును. కాని, యది యంత్రములమీాద యంత్రపరిశ్రమలమీాద తిరుగుబాటుగ నున్నంతవరకు జయింపజాలదు. గ్రామపరిశ్రమలనుగురించిహరిజనపత్రికలో నత డొకవ్యాసమున నిట్లు

వ్రాసెను. "కావలసిన పనిచేయుటకు తగినంతమంది జనం లేనపుడు యంత్రములు మంచివి. హిందూదేశములోవలె పనిచేయువారవసర ముకుమించి యున్నచోట నది చెడుగు పరిణమించును. మనగ్రామ ములలోని కోట్లకొలది జనముకు తీరికకలిగించుటెట్లు యనునది మన సమస్యకాదు. సంవత్సరములో నారుమాసములుపనిలేక యుండువారి కాలము నుపయోగించుటెట్లు? అనునదియేసమస్య. నిరుద్యోగమువలన బాధపడు నన్నిదేశములకు నీయభ్యంతరముండును దోషము పనిలేక పోవుటలో లేదు. ప్రస్తుత లాభసాటి పద్ధతిలో పనిచేయించుటవలన యజమానులకులాభములేదు. చేయవలసినపని కావలసినంతయున్నది. రోడ్లు,పంటకాలువలనుత్రవ్వుట, యిండ్లుకట్టుట పారిశుధ్యమును వైద్య సహాయమును, పరిశ్రమలను విద్యుత్తును, సాంఘిక, వైజ్ఞానిక సేవలను, విద్యను-వ్యాప్తిచేయవలెను. ప్రజల కిప్పుడులేని ముఖ్యావసరములగు యనేక వస్తువులనుసరఫరాచేయవలెను. లక్షలకొలదిప్రజలు రానున్న యేబదిసంవత్సరములవరకుకష్టపడి పనిచేయవచ్చును. కాని సంఘము దాని నందరిశ్రేయస్సుకొరకుసంఘటింపజేసి వ్యక్తిలాభముకాకసాంఘి కాభివృద్ధిని లక్ష్యముగ చేసినపుడుమాత్రమే యిది పనిచేయును. రష్యాలోని సోవియట్ యూనియనులో (ఇతరలోపములేవియున్నను) నిరుద్యోగము నశించెను. పనిలేకపోవుటచే మన ప్రజలు సోమరులుగ లేరు. పనిచేయుటకు, విజ్ఞానాభివృద్ధికి తగిన సౌకర్యములను కలి గించకపోవుటచే వారట్లున్నారు.

గాంధిజీరాట్నమును, ఖద్దరును అభివృద్ధిచేయుటకు, వాటియుత్పత్తి శక్తిని పెంపుచేయుటకు యత్నించి కొంత విజయము బడసెను. అది యంత్రమును, పరికరమును అభివృద్ధిచేయుట కొక ప్రయత్నము. ఈ యభివృద్ధి సాగుచో(గృహపరిశ్రమలనువిద్యుత్తుతోపనిచేయవచ్చును) స్వల్పలాభసమస్య తిరిగి తలయెత్తును; అది యవసర యుత్పత్తిని నిరు ద్యోగమును కలిగింపవచ్చును. ఏదోయొక యాధునిక పారిశ్రామిక శాస్త్రీమునకుసంబంధించినచో గ్రామపరిశ్రమలు నేడుమనకుముఖ్యా వసరములైన భౌతిక, వైజ్ఞానిక వస్తువులనుకూడ ప్రసాదింపజాలవు. అవి

యంత్రముతో పోటీచేయజాలవు. మన దేశములో పెద్దయెత్తు యంత్ర కృషి నాపివేయుట వాంఛనీయమా? అదిసాధ్యమగునా? కేవలయంత్రములకు తాను వ్యతిరేకి కాడని గాంధిజీ యనేకసార్లు చెప్పెను; అవి హిందూదేశములో నేడ ప్రస్తుతములని యతడు భావించునట్లు కాన్పించును. కాని, యినుము, ఉక్కు మొదలగు మూలపరిశ్రమలను, లేక నిదివరకే దేశములోనున్న తేలికపరిశ్రమలను మనముకట్టిపెట్టగలమా?

మనమట్లు చేయజాలమనుట స్పష్టము. రైల్వేలు, వంతెనలు, సామానుల రాకపోకల సౌకర్యములు మొదలగునవి మన కున్నప్పుడు మనమైనను వాని నుత్పత్తిచేయవలెను; లేదా యితరులపైనాధారపడవలెను. మన రక్షణకు పరికరములు కావలసినచో మనకు మూలపరిశ్రమ లేకాక చాల యభివృద్ధిచెందిన యంత్రపారిశ్రామిక పద్ధతికూడ కావలెను. నేడు యే దేశము పారిశ్రామికాభివృద్ధి లేనిచో యదార్థ స్వాతంత్ర్యము ననుభవింపజాలదు; ఇతరులదాడులనుండి రక్షించుకొనజాలదు. ఒక మూల పరిశ్రమను బలపరచుటకు, పూర్తిచేయుటకు, మరియొకటి యుండవలెను. చివరకు యంత్రములను తయారుచేయు పరిశ్రమయే యుండవలెను. ఈ మూలపరిశ్రమలన్నియు పనిచేయుచున్నప్పుడు తేలిక పరిశ్రమలు విధాయకముగ వ్యాప్తిచెందవలెను. ఈవిధాన మాగుటకు వీలులేదు. మన భౌతిక, వైజ్ఞానికాభివృద్ధియే గాక మన స్వేచ్ఛకూడ దీనితో బంధింపబడియున్నది. పెద్దపరిశ్రమలు వ్యాపించిన కొలది చిన్నయెత్తు గ్రామపరిశ్రమలు వాని పోటీకి తాళజాలవు. సామ్యవాదపద్ధతిలో వాటికి కొంత యవకాశముండవచ్చును; కాని పెట్టుబడిదారుల పద్ధతిలో నసలేయుండదు. సామ్యవాదపద్ధతిలో కూడ నవి పెద్దయెత్తున యుత్పత్తిచేయబడిన ప్రత్యేక వస్తువులను తయారుచేయు గృహపరిశ్రమలక్రింద మాత్రమే యుండగలవు.

యంత్ర పరిశ్రమలనుజూచి కొంతమంది కాంగ్రెసునాయకులు భయపడుదురు; వారు పారిశ్రామిక దేశములోనున్న ప్రస్తుత కష్టములన్నియు బాహుళ్యముమీద జరుగు యుత్పత్తివల్లనే కలుగుచున్నవని యూహింతురు. అది పరిస్థితిని విపరీతముగ నర్థముచేసికొనుటయగును.

ప్రజలకేదికావలెనో దానిని చాలినంత విరివిగ తయారుచేయుట దోషమా? విశేషోత్పత్తి చేయకుండ వారిని లేమిలో నుంచుటయే యుక్తమా? ఉత్పత్తిచేయుటలో దోష మేమియులేదు: దానిని పంచి పెట్టు విధానములో దోషము కలదు; అది సమర్థమైనది కాదు.

మన వ్యవసాయము ప్రపంచ పణ్యారంగముపై నాధారపడి యుండును. గ్రామపరిశ్రమల నభివృద్ధిచేయగోరువా రీకష్టము నెదుర్కొనవలెను. వ్యవసాయదారు వర్తకముకు కావలసిన పంటలను పండించి, ప్రపంచధరలపై నాధారపడవలెను. ఈ ధరలు మారుచుండ నతడు శిస్తు, లేక పన్ను రొక్కరూపములో చెల్లింపవలెను. అత డీ సొమ్ము నెట్లో యార్జించవలెను. కనుక మంచిధర వచ్చునని యతనికి తోచుపంటనే యతడు పండించును. ఆహారవిషయములోకూడ నతనికి నతని కుటుంబమునకు సరిపడుదాని నతడు పండింపజాలడు.

అపరదినుసులయొక్కయు, నితరవ్యవసాయవస్తువులయొక్కయు, ధరలు పడిపోవుటచే లక్షలకొలది వ్యవసాయదారులు, ముఖ్యముగ బీహారులోను, యు. పి. లోను హఠాత్తుగ చెఱకుపంట ప్రారంభించిరి. పంచదారమీద పన్ను వేయుటచే పంచదార ఫ్యాక్టరీలు కుక్కగొడుగులవలె తలయెత్తెను. చెఱకు విశేషముగ కావలసివచ్చెను. కాని, త్వరలోనే యవసరముకంటె సప్లయి యెక్కువయ్యెను. ఫ్యాక్టరీ యజమానులు వ్యవసాయదారులను నిర్దాక్షిణ్యముగ కొల్లగొనిరి. ధర పడిపోయెను.

ఈ కొద్ది భావములు మరి యనేకములు మన వ్యవసాయ, పారిశ్రామిక సమస్యల కెట్టి సంకుచితపరిష్కారము సాధ్యము, వాంఛనీయము కాదని నాకు తోచెను. నిశ్చయముగ నవి మన జాతీయ జీవితముయొక్క ప్రతిలభావమును మార్పుచేయును. మన మర్థరహితము, నుద్రేకజనకము నగు పదముల నాశ్రయింపక నీ యదార్థముల నెదుర్కొని వానికి సరిపెట్టుకొనవలెను. మన మసహాయము లైన చరిత్ర విషయములు గాక చరిత్రకారులము కావలెను.

విరుద్ధగాంధీజీ తిరిగి నా తలపుకువచ్చును. విశేష బుద్ధిబలము, పీడింపబడువారిని, అణగద్రొక్కబడువారినియుద్ధరింపవలెననురాగము గల యతడు నశించిపోవుపద్ధతిని, యీ దుఃఖమునకు దుర్న్యాయమునకు కారణమైనదాని నేల బలపరచును? అతడొక మార్గమును వెతుకు చున్నాడనుట సత్యము: కాని యీ భూతకాలమార్గము మాసివేయ బడలేదా? బిగింపబడలేదా? యీ లోపల నతడు ఫ్యూడల్ సంస్థానములు, పెద్ద జమీందారీలు, తాలూకుదారీలు, ప్రస్తుత క్యాపిటలిస్టు పద్ధతి అభివృద్ధికి భంగకరములగు నీ పాతక్రమమునకు చెందు చిహ్నముల నాశీర్వదించును. ధర్మకర్తృత్వమును సిద్ధాంతమునువిశ్వసించుట సహేతుకమేనా? అప్రతిహతమైన యధికారమును, ఐశ్వర్యమును ఒక వ్యక్తిచేతిచ్చి యతడు వానిని కేవలము ప్రజల శ్రేయస్సుకే వినియోగించు ననుకొనుట సహేతుకమేనా? ఈ విధముగ విశ్వసింప బడుటకు మనలోనుత్తమోత్తములుతగినంతపరిపూర్ణులుగ నున్నారా? ప్లేటో మహాశయుని వేదాంతులైన రాజులుకూడ నిట్టి భారమును యదార్థముగ వహింపజాలరు. ఈ దయామయులగు మానవాతీతులను కూడతమపై నుంచుకొనుట యితరులకు శ్రేయమేనా? కానిమానవాతీతులును లేరు, వేదాంతులైన రాజులును లేరు, తమ నిజలాభమును లేక తమ నిజోద్దేశ్యముల నభివృద్ధిచేయుటయే ప్రజాశ్రేయస్సు అని భావించు దుర్బల మానవులుమాత్రమేకలరు. పుట్టుక, పదవి, ఆర్థికాధికారము—అను గొడ్డుమోతుతనము శాశ్వతమయి అనేక విధ యుపద్రవఫలితముల నిచ్చును.

ఈ మార్పు తెచ్చుటెట్లు ? త్రోవలోనున్న యడ్డంకులను తీసివేయుటెట్లు? బలవంతముచేతనా, మార్పుచేతనా? దౌర్జన్యమా, దౌర్జన్యరాహిత్యమా? అను సమస్యను నేను ప్రస్తుతము యోచించుట లేదని తిరిగి చెప్పగోరుచున్నాను. దీనినిగురించి నేనుతరువాతచర్చించెదను. కాని, మార్చవలసినయవసరము గ్రహింపబడవలెనుస్పష్టముగ నుదహరింపబడవలెను. నాయకులు, యోచనపరులు దీనిని స్పష్టముగ యోచించి చెప్పకపోయినచో తమవలెనే యోచించున ట్లెవరి

నైనను మార్పుచేయగలరా? అవసరమైనలక్ష్యమును ప్రజలలో నభివృద్ధి చేయుగలరా? సంభవించు కార్యములే నిస్సందేహముగ జ్ఞానమును బోధింపగలశక్తులు. కాని, వాని ప్రాముఖ్యతను గుర్తించుటకు వానినుండి యోగ్యమగు ఫలితములను పొందుటకు వానిని సరిగ నర్థముచేసికొనవలెను.

నావాక్యముల కప్పుడప్పుడాగ్రహపడు స్నేహితులు, మంచివారు నుదారులునగురాజులు, దానధర్మములుచేయుభూఖామందులు, నుపకారము, సరసతగల పెట్టుబడిదారులు నీకు కాన్పించలేదా? యని తరుచు నన్నడుగుచుందురు. నిశ్చయముగ కన్పించిరి. నామట్టుకు నే నీ భూఖామందులతోను, యైశ్వర్యముకలవారితోనుకలసితిరుగుతరగతివాడను; నేనొకమాదిరి బూర్జువాను బూర్జువా వాతావరణములో పెరిగినవాడను. ఈ శిక్షణవలనకలుగు నన్ని దురభిమానములను కలవాడను. కమ్యూనిస్టులు నన్ను చిన్నబూర్జువా యనిరి. ఇదియెంతయు సత్యము. బహుశః నన్ను వారిపుడు "పశ్చాత్తప్తుడగుబూర్జువా"యని పిలువవచ్చును. కాని, నే నెవడనునది విషయముకాదు. జాతీయ,అంతర్జాతీయ, ఆర్థిక సాంఘికసమస్యలను వ్యక్తులపరముగ నాలోచించుట మూర్ఖత్వము. నన్ను ప్రశ్నించు స్నేహితులే మనపోరాటముపాపముతోకాని పాపులతోకాదని చెప్పుట కెప్పుడు పినుగు చెందరు. నేనంత దూరముకూడ పోను. నాపోరాటము పద్ధతితోకాని వ్యక్తులతోకాదు. ఒకపద్ధతినిశ్చయముగ చాలవరకు వ్యక్తులలోను,వర్గములలోనుమూర్తీభవించును. ఈవ్యక్తులనువర్గములనుమార్చవలెను. లేదా పోరవలెను. కాని యొకపద్ధతి, నిష్ప్రయోజనమై,గుదిబండయైనచో నదిపోవలెను. దానినంటిపెట్టుకొనియుండు తరగతులు, వర్గములుకూడ మార్పుచెందవలెను. ఈమార్పుసాధ్యమైనంతతక్కువబాధ కలిగింపవలెను. కాని, దురదృష్టవశాత్తు బాధ, స్థానభ్రష్టత్వము తప్పవు. అతిచిన్న చెడుగుకు భయపడి మనము గొప్పచెడుగును సహింపజాలము.

మానవసంబంధముయొక్క ప్రతిమాదిరికిరాజకీయ, సాంఘిక, ఆర్థికములకు వెనుక నేదోయొక శాస్త్రముకలదు. ఈ సంబంధములు

మారినపుడు యీ శాస్త్రసంబంధమైన పునాదికూడ మారవలెను. మామూలుగా యీ శాస్త్రము పరిస్థితులకు వెనుకబడియుండును. వెనుకటి యన్నికష్టములకు కారణముగు 19 వశతాబ్దములో ప్రజా ప్రభుత్వపద్ధతి క్యాపిటలిజముకలిసియే యభివృద్ధియయ్యెను: కాని,యవి వరస్పరవిరుద్ధములు. వాటికి సహజ వైరుధ్యముకలదు. ప్రజాస్వామికము, సార్వజనికాధికారము కావలెననును. క్యాపిటలిజముయధార్థాధికారమునుకొద్దిమందిచేతులలోనుంచును. ఈవిరుద్ధదాంపత్యమెట్లో కాలము వెళ్ళబుచ్చెను. ఏలనన రాజకీయమైన పార్లమెంటరీ ప్రజాస్వామికము స్వతః తక్కువపరిమితిగల ప్రజాస్వామికము. అది గుత్త పద్ధతిలోను, అధికార కేంద్రీకరణములోను జోక్యము తీసుకోవలేదు.

అయినవప్పటికి ప్రజాస్వామిక తత్త్వము వృద్ధిచెందినకొలది 'ఘటాశ్రాద్ధము'విధియయ్యెను. ఇప్పుడీసమయమువచ్చెను. నేడుపార్లమెంటరీ ప్రజాస్వామిక మవఖ్యాతిపాలయ్యెను. దానికి ప్రతీకారముగ ననేకవిధములగు కేక లాకసమును నింపుచున్నవి. దీనివలన హిందూదేశములోనున్న బ్రిటిషుప్రభుత్వము మరింతప్రతీకారమునుబూనుచు రాజకీయస్వాతంత్ర్య బాహ్యారూపములనుకూడ లాగివేయుటకు దీని నొక సాకు చేయుచున్నది. భారతసంస్థానాధిపతులు తమ నిరాటంక నిరంకుశ పరిపాలనను దీనిచే సమర్థించుకొనజూచుట వింతగనుండును. వారు తమ రాష్ట్రములలో ప్రపంచములో మరెచ్చటలేని మధ్యయుగ పరిస్థితులను నిలుపుదుమని ఘీంకరించుచున్నారు. కాని, పార్లమెంటరీ ప్రజాస్వామిక విఫలత యతివ్యాప్తిగాక నవ్యాప్తియే యని గుర్తింపవలెను. అది యార్థిక ప్రజాస్వామికము నేర్పరుపక పోవుటచే తగినంత సార్వజనికము కాజాలదు. దాని పద్ధతులు మందమై, జంఝాటయుతమై శీఘ్రపరివర్తన యుగమునకు తగియుండలేదు.

భారత సంస్థానములం నిరంకుశపాలనలని చెప్పవచ్చును. అవి, బ్రిటిషు ఆధిపత్యమునకు లొంగియుండును. కాని, బ్రిటిషుప్రభుత్వము తన ప్రయోజనముల నభివృద్ధిచేసుకొనుటకు, రక్షించుకొనుటకు మాత్రమే జోక్యము కల్పించుకొనును. ఈ పాత ప్రపంచపుఫ్యూడల్

సంస్థానములు మారక యిరువదియవ శతాబ్ద మధ్యభాగము వరకు నిలువగలుగుటాశ్చర్యకరము; అచ్చటిగాలి భారముగ, చలనరహితముగ నుండును నీరు మందముగ పారును. మార్పుకు కదలికకు వలవాటుపడి బహుశః వానితోకూడ పసుగుచెందిన శ్రోత్రవానికి నిద్రమత్తువచ్చును. కొద్ది రామణీయకత దొంగతనముగ నతని నావేశించును. కాలదేవత కదలక నిలుచునట్లు, మ రవి దృశ్యము కంటికి కాన్పించునట్లు నుండు చిత్రమువలె నదియంతయు నసత్యముగ కాన్పించును రమారమి యప్రయత్నముగ నతనికి భూతకాలచరిత్ర తన బాల్యమునాటి కలలు జ్ఞప్తికివచ్చును. పటకాలు, కవచములు ధరించిన యోధులయొక్కయు ధైర్యముగలసుందరకన్యకలయొక్కయు రూపములు నేత్రగోచరములగును. ఋజువులుగల కోటలు, శౌర్యము, గౌరవ, స్వాభిమానములను గురించిన పిచ్చియూహలు, అసమాన ధైర్యస్థైర్యములు, మృత్యుధిక్కారము తలపునకువచ్చును ముఖ్యముగ నతడు కల్పనాకథలకు, డాంబికములు, దుస్సాధ్యములు నగు కార్యములకు కాకరమగు రాజపుత్రస్థానములో నున్నచో నివి వచ్చును.

కాని,త్వరలోనే యీరూపములంతరించి బాధ, హింస పొడచూపును. గాలిపీల్చుకొనుట కష్టమగును, యుక్కిరి బిక్కిరియగును. చలనరహితమగు లేక మందగామియగు నీటిక్రిందదుర్గంధము,క్రుళ్ళు కలవు. మానసికముగ, శారీరకముగకూడ కట్టివేయబడినట్లు, బిగింపబడినట్లు, నొక్కివేయబడినట్లు భావింపబడును. సంస్థానాధీశ్వరునిభవ్య హర్మ్యములు దిక్కులేక నల్లాడు ప్రజల పరిపూర్ణాజ్ఞాన దుఃఖములు ద్యోతకమగును.సంస్థానాధీశ్వరుని స్వంతయవసరములకు, భోగములకు రాష్ట్రధన మెంత యపారముగ నా సౌధములోనికి పోవును! ఏసేవ రూపములోనైన నా ప్రజలకెంత స్వల్పము తిరిగివచ్చును! మనసంస్థానాధిపతుల యట్టహాసములకు విపరీత ధనవ్యయముచేయబడును. తమ కొరకుచేయు నిట్టి దుబారా ఖర్చుకు తిరిగి వారేమియిచ్చుచున్నారు?

ఈ సంస్థానముల నొక రహస్య తెర యావరించి యుండును. ఇచ్చట వార్తా పత్రికలు ప్రోత్సహింపబడవు అతి మెహార్బానీగా నొక సాహిత్య సంబంధమైన లేక వర్థ ప్రభుత్వ వారపత్రిక యుండవచ్చును తరచు పైనుండివచ్చు పత్రికలు నిషేధింపబడును. విద్య యతి తక్కువగ నుండును. ఆడంబరముతోను, పటాటోపము తోను వచ్చు వైస్రాయి రాక, పరస్పర పొగడ్తలు లేక నతి యట్ట హాసముతో చేయబడిన వివాహము, రాజుగారి జన్మదినోత్సవము లేక రైతుల తిరుగుబాటు—ఇవియే సంస్థానములనుండి వచ్చు ప్రధాన వార్తలు. వారిని విమర్శలనుండి (బ్రిటిషు యిండియాలో కూడ) ప్రత్యేక చట్టములు కాపాడును. వారి రాష్ట్రములలో నతి నిరపాయ మగు విమర్శకూడ తీవ్రముగ నణచివేయబడును. బహిరంగ సభలు రమారమి యసూహ్యమును, సాంఘిక ప్రయోజనముకొరకుజరుగు సభలు కూడ తరుచు నిషేధింపబడును. పైనుండివచ్చు ప్రధాన నాయకులు సంస్థానములలోనికి రాకుండ తరుచు నిరోధింపబడుదురు. చిత్తరంజనుదాసు చాల వ్యాధిగ్రస్తుడై యారోగ్యముకొరకు కాశ్మీరము వెళ్ళనిశ్చయించుకొనెను. అతడు రాజకీయ ప్రచారముకొరకు బయలుదేరలేదు. అతడు సరాసరి కాశ్మీర సరిహద్దు వరకు వెళ్ళినతరు వాత నచ్చట యాపివేయబడెను. జిన్నాగారినిగూడ హైదరాబాదు సంస్థానములోనికి రానీయలేదు. హైదరాబాదు పట్టణములోనే స్వగృహమున్న సరోజినీదేవిని చాలకాల మచ్చటకు రానీయలేదు.

సంస్థానములలో నిట్టి పరిస్థితులున్నప్పుడు కాంగ్రెసు ఆప్రజల ప్రాథమిక హక్కులకొరకు నిలిచి వారిని మొత్తముమీద నణచి వేయుట యుక్తముకాదని విమర్శించుట సహజమై యుండెడిది. కాని గాంధీజీ సంస్థానముల సందర్భమున కాంగ్రెసులో నొక నూతన నీతిని "సంస్థానముల యాంతరంగిక పరిపాలనలో జోక్యము కల్పించు కొనరాదు" అని సృష్టించెను. సంస్థానములలో నసామాన్యములు, బాధ కరములు నగు సంభవములు జరిగినను సంస్థానాధికారులు కాంగ్రెసుపై నకారణ వైరముబూనినను నతడీ "జోజో" నీతిని విడువడాయెను.

కాంగ్రెసుయొక్క విమర్శ వారికి కష్టము కలిగింపవచ్చునని యు నందుచే వారిని 'మార్చుట' కష్టమగునని యు భీతియున్నట్లు కాన్పించును. సంస్థానప్రజల కాన్ఫరెన్సు అధ్యక్షుడైన యన్. సి. కేల్కారుగారికి 1934 జూలైలో వ్రాయుచు గాంధీజీ జోక్యమును కలిగించుకొనకూడదను తన విశ్వాసమును పునశ్చరణచేసెను. "సంస్థానములు బ్రిటిషు చట్టముక్రింద స్వతంత్రసంస్థలు; బ్రిటిషు భారతముఅని నిర్వచింపబడు భాగము ఆఫ్ఘనిస్థానము లేక సింహళ నీతి నెట్లు నిరూపింపజాలదో యట్లే సంస్థానములనీతిని నిరూపింపజాలదు" అని అతడు వ్రాసెను. భారతసంస్థాన ప్రజాసభయు, లిబరలు పక్షమువారును నతని యభిప్రాయములను సలహాలను ఆక్షేపించుటలో నాశ్చర్యములేదు.

కాని, ఈఅభిప్రాయములు సంస్థానాధిపతుల కింపుగనుండెను. వారు వానివలన లాభము పొందిరి. ఒక మాసములోపల తిరువాన్కూరు సంస్థానము తమరాష్ట్రములో జాతీయ కాంగ్రెసునునిషేధించి, దానిసభల నాపి వేసి, సభ్యులను జేర్పించుటకూడదనికిరాదనెను. అట్లుచేయుటలో 'బాధ్యతగలనాయకులే' యీ సలహాచెప్పిరి. గాంధిజీ స్టేటుమెంటును సూచించుచు_యని చెప్పెను. బ్రిటిషు ఇండియాలో శాసనోల్లంఘనము (సంస్థానములలో నిదియెన్నడును ప్రవేశపెట్టబడలేదు) విరమింపబడిన తరువాతను, భారతప్రభుత్వము తిరిగి కాంగ్రెసును సక్రమసంఘమని ప్రకటించిన తరువాతను ఈ నిషేధము జరిగెనని గమనింపవలసియున్నది.

కాంగ్రెసునీతిని, గాంధిజీ సలహాను అనుసరించి తిరువాన్కూరు ప్రభుత్వము ప్రశాంతమగుదినములలో కాంగ్రెసుపైసలిపినయకారణ దాడినిగురించి బహిరంగములో నొక్కమాటయైనను చెప్పబడలేదు కొంతమంది లిబరలులుకూడ దీనిని తీవ్రముగనిరసించిరి. నిశ్చయముగ సంస్థానములకు సంబంధించినంతవరకు గాంధజీ లిబరలులకంటె చాల మితవాది; యెక్కువ నిరోధముకలవాడు. బహుశః నాయకులలో వివిధ సంస్థానాధిపతులతో సన్నిహితసంబంధముకల పండిత మదనమోహన మాలవ్యాయొక్కడే తత్తుల్యమైన నిరోధమునుచూపుచు వారికి కష్టము కలిగించుట కిష్టపడడు.

గాంధీజీ భారత సంస్థానాధిపతుల సందర్భములో నెల్లప్పుడు నిట్టి జాగరూకతతో నుండును. 1916 ఫిబ్రవరిలో హిందూవిశ్వవిద్యాలయ ప్రారంభోత్సవసందర్భమున యనేకమంది సంస్థానాధిపతులున్న సభలో నతడు కాశీలో మాట్లాడెను. అనాడొక సంస్థానాధిపతియధ్యక్షతవహించెను. అతడు దక్షిణాఫ్రికానుండి క్రొత్తగావచ్చెను; అఖిల భారత రాజకీయభారమింకను నతనిమీద పడలేదు అతడు ప్రాధేయపూర్వకముగను భవిష్యత్తు చెప్పవానివలెను యుపన్యసించివారినితమ తమపద్ధతులను మార్చుకొనవలసినదనియు, వ్యర్థమగు నాడంబరమును భోగములను మానవలసినదనియు చెప్పెను. 'సంస్థానాధిపతులారా! వెళ్ళిమీయలంకారగములను అమ్మివేయుడు' అని యతడనెను. వారు తమ నగల నమ్మివేయలేకపోయినను నిశ్చయముగ వెళ్ళిపోయిరి. వారు తల్లడపడి యొకరొకరుగ సభను వీడిరి. చివరకధ్యక్షుడుకూడ మెల్లగ జారెను. గాంధీజీ మాట్లాడుచునేయుండెను. అచ్చటనున్న అనిబిసెంటు సతికికూడ గాంధీజీ విమర్శవలన కష్టముకలిగి సభనుండి వెడలిపోయెను.

కేల్కారుకువ్రాసిన యుత్తరములోమరియు నతడిట్లు చెప్పెను. 'సంస్థానములు తమ ప్రజలకు స్వపరిపాలన నీయవలెనని నేను కోరెదను. తాము పరిపాలించు ప్రజలకు వారుధర్మకర్తలని భావించవలెననియు యుదారముగ కట్లుండవలెననియు నేను కోరెదను...'ఈధర్మకర్తృత్వమనుభావములో నేదేనియున్నచో భారతపరిపాలనకుతాము ధర్మకర్తలమని బ్రిటిషుప్రభుత్వముచేయు వాదనకు మనమేల యభ్యంతరపెట్టవలెను? వారు విదేశీయులను విషయము తప్ప నాకు భేదమేమియు కాన్పించదు హిందూదేశములోని వివిధప్రజలశరీరఛాయలోను, జాతులపుట్టుకలోను విజ్ఞానములోను రమారమి తత్తుల్యమైన భేదములే యున్నవి.

గత కొద్దివత్సరములనుండి బ్రిటిషుఅధికారులు భారతసంస్థానములలోనికి వేగముగ ప్రవేశించుచున్నారు. ఇష్టములేకపోయినను అసహాయుడుగనుండు రాజుపై వారు స్వారీచేతురు. భారతప్రభుత్వముపైనుండి సంస్థానములమీద నెల్లప్పుడు విశేషాధికారము చలాయించు

చుండును. ఇప్పుడుదీనికితోడు కొన్నిప్రధానసంస్థానములలో నాంత రంగికాధికారముకలదు. కనుక నీ సంస్థానములు మాట్లాడునపుడు తరచు భారతప్రభుత్వమే మరియొక కంఠముతో మాట్లాడును.

మతరీత్యా యితరత్ర తక్కువసంఖ్యాకులకు ప్రత్యేకనియోజక వర్గము లుండరాదని చాల విమర్శచేయబడెను. అవి ప్రజాపరిపాలనకు కేవల మసంబద్ధములని సూచింపబడెను. నియోజకవర్గమునేమాత్రము లెసగని మతముల అరలపెట్టెక్రింద విభజించినచో ప్రజాస్వామికము బాధ్యతాయుతములని పిలువబడు ప్రభుత్వము సంభవము కాజాలదు. కాని, ఈ విమర్శకులలో నతి శ్రద్ధావంతులు, పట్టుదలకలవారు నగు మాలవ్యా,హిందూమహాసభానాయకులు, సంస్థానపరిస్థితులనుగురించి యెంతమాత్రము మాట్లాడకుండిరి. వారు సంస్థాననిరంకుశపాలనలకు తక్కిన భారతదేశ ప్రజాపరిపాలనకు మధ్య నొక ఫెడరలుయూనియను యుండుట కంగీకరించిరి. ఇంతకంటె నసంబద్ధము, విపరీతము నగు యూనియనును మన మూహింపజాలము. కాని, జాతీయతకు, ప్రజా స్వామికమునకు కంకణము కట్టుకొనిన హిందూమహాసభా నాయకు లెట్టికష్టము లేకుండగనే దీనినిదిగమ్రింగిరి. మనముతర్కస్థైర్యములను గురించి మాట్లాడుచుందుము. కాని, మన ప్రధానప్రేరణ ల్యుద్రేకము మీదనే యాధారపడును.

కనుక నేను సంస్థానములు-కాంగ్రెసు అను విరుద్ధమునకుతిరిగి వచ్చెదను. థామస్‌పైను నూటయేబదియేండ్లక్రిందట బర్కునుగురించి చెప్పినపదము 'అతడు శృంగారముగనున్న తురాయినిచూచి విచార పడును. కాని చనిపోవుచున్న పక్షిని మరచిపోవును.' నాకుజ్ఞప్తికివచ్చు చున్నది. నిశ్చయముగ గాంధిజీ చనిపోవుచున్న పక్షి నెన్నడు మరచి పోడు. కాని తురాయినిగురించి యంత పట్టుబట్టనేల?

రమారమి యీ భావములే తాలూకుదారీ, పెద్దజమీందారీ పద్ధతులకును వర్తించును ఈ యర్థప్రభుత్వపద్ధతి యొక్క కాలము చెల్లెననియు, నిది యుత్పత్తికి సాధారణాభివృద్ధికి పెద్దయాటంకమనియు

వాదింప నవసరములేదు. ఇది వృద్ధిచెందుచున్న క్యాపిటలిజమునకు కూడ వసర్థకము. రమారమి ప్రపంచమంతట పెద్దపెద్ద యెస్టేటులు క్రమముగ నశించి వ్యవసాయ ప్రొప్రయిటరీలకు స్థానమిచ్చెను. హిందూదేశములో ప్రతిఫలము విషయము రావచ్చునని నేనెల్లప్పుడు నూహించితిని. కాని, గాంధీజీ తాలూకుదారీపద్ధతిని యున్నవిధముగ నామోదించి సాగింపగోరుననని గత వత్సరమున కనుగొనినేనాశ్చర్య పడితిని. 1934 జూలైలో కాన్పూరులో నతడిట్లు చెప్పెను; "ఇరుపక్షముల హృదయపరివర్తనమువలన భూఖామందులకు రయితులకుమధ్య మంచి సంబంధములేర్పడగలవు. అది జరిగినచో నుభయులు సామరస్యముగ, ప్రశాంతముగ జీవింపవచ్చును. అతడు తాలూకుదారీ జమీందారీపద్ధతిని రద్దుచేయుట నెప్పుడు నామోదించియుండలేదు. దానిని రద్దుచేయవలెనని భావించువారు తమ మనస్సులను తామే యెరుగరు." (ఈ చివరనేరము క్రూరమైనది.)

మరియు నతడిట్లు చెప్పెను; "ఆస్తులుగల తరగతులవారి యాస్తులను తగిన కారణము లేకుండ లాగివేయుటకు నేనొప్పుకొనను. మీ హృదయములను కరగించి మిమ్ము మార్చుటయే నా లక్ష్యము (అతడు పెద్దజమీందారుల సభలో మాట్లాడుచుండెను.) మీరు మీయాస్తినంతను మీకవులదారుల తరపున ధర్మకర్తలుగ నుంచుకొని దానిని ప్రధానముగ వారియుపయోగముకొరకే వినియోగింపవలెను. మీయాస్తినుండి మిమ్ము అక్రమముగ తరిమి వేయవలెనను ప్రయత్నము చేయబడునేని నేను మీతరపునపోరెదను...పాశ్చాత్య దేశములోని సామ్యవాదము, కమ్యూనిజము మనభావములతో ప్రధానముగ భేదించునట్టి కొన్ని భావములపై నాధారపడెను. మానవస్వభావము ముఖ్యముగ స్వార్థపూరిత మను వారి విశ్వాసమువానిలోనొకటి ...కనుక మన సామ్యవాదము, కమ్యూనిజము దౌర్జన్యరాహిత్యము మీదను, కూలివాడు, పెట్టుబడిదారు, భూఖామందు, రయితు—వీరి సామరస్యమైన సహకారము మీదను నిర్మింపబడవలెను."

ప్రాచ్య, పాశ్చాత్యముల మూలభావములలో నట్టిభేదములున్న సంగతి నాకు తెలియును. బహుశః యున్నవి. కాని, గత కొన్ని వత్సరములనుండి కలిగిన భేదమేమనిన భారతభూస్వామి, పెట్టుబడిదారులతో రైతులయొక్కయు, పనివాండ్రయొక్కయు ప్రయోజనములను పాశ్చాత్య పెట్టుబడిదారు భూస్వామికంటె నెక్కువ నిర్లక్ష్యముచేసిరి. భారతభూస్వామి రయితులక్షేమము కొరకెట్టి సాంఘిక సేవచేయుటకు యత్నము చేయలేదు. పాశ్చాత్య పరిశోధకుడైన బైల్సుఫర్డు యిట్లు విమర్శించెను. "భారతవడ్డీవ్యాపారస్తులు, భూస్వాములు యేసమకాలిక సాంఘిక పద్ధతిలోను లేనట్టి సర్వభక్షకులు." బహుశః తప్పు భారత భూస్వామిదికాదు అతనికిమించినపరిసితులేర్పడెను. క్రమముగ నతడు పతితుడయ్యెను. ఇప్పుడతడు తనను రక్షించుకొనజాలని కఠినస్థితిలో నున్నాడు. వడ్డీవ్యాపారస్తులు, చాలమంది భూస్వాముల భూములను లాగుకొనిరి; చిన్నచిన్న భూస్వాములు తమ భూములకే కవులుదారులైరి. పట్టణములోనుండు యీ వడ్డీవ్యాపారస్తులు తనఖాలమీద బాకీలనిచ్చి తనఖాకాలము మీరిపోవుటతోడనే జమీందారులైరి. గాంధిజీ సిద్ధాంతము ప్రకారము వీరిపుడు తమచేతనే భూములనుండి వెడలుగొట్టబడిన దురదృష్టప్రజలకు ధర్మకర్తలు; ప్రధానముగ రయితుల క్షేమముకొరకే తమ రాబడిని వినియోగింపవలసినవారు.

తాలూకుదారీపద్ధతి మంచిదేయైనచో దానిని హిందూదేశమంతట నేల ప్రవేశపెట్టరాదు? హిందూదేశములో విశాలప్రాంతములలో వ్యవసాయ ప్రొప్రయిటరులు కలరు. గుజరాతులో పెద్దజమీందారీలను, తాలూకుదారీలనుసృష్టించుటకు గాంధిజీయంగీకరించునా? అట్లుచేయునని నేనూహింపను. అయితే యు. పి కి బీహారుబెంగాలులకు నొకవిధమగు భూమిపద్ధతియు, గుజరాతు, పంజాబులకు మరియొకవిధమగు భూమి పద్ధతియు నుండనేల? భారతదేశముయొక్క పూర్వ, పశ్చిమ, యుత్తర, దక్షిణభాగములలోని ప్రజలలో బహుశః యెట్టి ప్రధాన భేదములు లేవనుకొనెదను; వారి మూలభావములన్నియునొకటియే! అర్థమేమన యున్నది సాగవలెను. ఉన్నస్థితిని రక్షింపవలెను.

ప్రజల కేది లాభదాయకమో, యేది వాంఛనీయమో యను నార్థిక పరిశోధన యుండకూడదు ప్రస్తుత పరిస్థితులను మార్చుటకు ప్రయత్నింపరాదు. ప్రజల హృదయములను మార్చుటొక్కటియే చేయవలసిన పని. ఇది జీవితమును, దాని సమస్యలను శుద్ధ మత దృష్టితో చూచుటయగును దీనికి రాజకీయములతోను, ఆర్థిక, సాంఘిక శాస్త్రములతోను సంబంధమేమియు లేదు. అయినను గాంధీజీ దీనిని దాటి రాజకీయ జాతీయ రంగములలో విహరించును.

నేడు భారతదేశము నిట్టి కొన్ని వైరుధ్యము లెదుర్కొనుచున్నవి. మనము మనలను కొన్ని ముదులక్రింజి బధించుకొంటిమి. వానిని విప్పివేసినగాని ముందడుగు వేయుట కష్టము. ఈ విడుదల యుద్రేకమువలన కలుగజాలదు. చాలకాలము క్రిందట స్పినోజా "జ్ఞానమువలనను, అవగాహన వలనను కలిగిన స్వేచ్ఛయా లేక నుద్రేకమువలన కలుగు బంధనమా? అందులో నేది శ్రేష్ఠము" అని ప్రశ్నించెను. అతడు మొదటిదానినే వరించెను.

# 63

## మార్పు లేక బలవంతము

పదునారేండ్లక్రితము గాంధీజీ తన దౌర్జన్యరాహిత్య సిద్ధాంతముతో భారతదేశమును మోహింపజేసెను. నాటినుండియది భారతాకాశము నాక్రమించెను. లక్షలకొలది ప్రజలు దానిని జపించిరి. ఆమోదించిరి కొంతమంది దానితో పెనుగులాడి తరువాత షరతులతోను షరతులు లేకుండగను స్వీకరించిరి. కొంతమంది దానినిబహిరంగముగ వెక్కిరించిరి.అదిమన రాజకీయ, సాంఘిక జీవితములో నెక్కువపాత్రను వహించెను. అది బాహ్యప్రపంచ దృష్టినికూడ చాలవరకాకర్షించెను. ఈసిద్ధాంతము నిశ్చయముగ రమారమి మానవభావముతో సమకాలికముగనేయుండెను. కాని, బహుశః గాంధీజీ దానిని జన బాహుళ్యము మీద రాజకీయ సాంఘికోద్యమములకు మొట్టమొదటవర్తింపజేసెను. వెనుక కది వ్యక్తికి సంబంధించియుండుటచే ముఖ్యముగ మతసంబంధమయ్యెను. వ్యక్తియాత్మనిరోధమునుచూపి పరిపూర్ణ యుదాసీనతను సాధింప యత్నముచేసి తద్వారా ప్రపంచ పోరాటముల కతీతుడయి యొక విధముగవ్యక్తిస్వాతంత్ర్యమును, మోక్షమును సాధింపబూనును. దానివెనుక విశాల సాంఘిక సమస్యలను చేపట్టి సాంఘికపరిస్థితులను మార్చవలెననుభావము లేదు. హెచ్చుతగ్గులతోను అన్యాయములతోను కూడుకొనిన వర్తమాన సాంఘికనిర్మాణమును రమారమిస్వీకరించును. ఈవ్యక్తిగతలక్ష్యమును గాంధీజీ సాంఘికలక్ష్యముగమార్చ ప్రయత్నించెను. అతడు సాంఘిక, రాజకీయపరిస్థితులను రెండింటిని మార్చగోరెను; బుద్ధిపూర్వకముగ నీలక్ష్యమును మనస్సులోనుంచుకొని యతడు దౌర్జన్యరాహిత్యపద్ధతికి కేవలము భిన్నమగు నీవిశాల రంగముమీద ప్రయోగించెను.

"మానవపరిస్థితులలోను, పరిసరములలోను గొప్ప మార్పులను కలుగచేయగోరువారు సంఘములో కల్లోలమును కలుగజేసిన గాని యట్లు చేయజాలరు. ఇట్లుచేయుటకు రెండేమార్గములు- దౌర్జన్యము, దౌర్జన్యరాహిత్యము కలవు. దౌర్జన్యయుతమగురొయి త్రిడి స్థూలశరీరమును నొప్పించును. అది బాధనొందువానిని ఖేదపెట్టునట్లే బాధించువానినికూడ పతితునిచేయును. కాని యాత్మ బాధద్వారా [ఉపవాసదినములు] చేయు దౌర్జన్యరహిత బలవంతము కేవలము భిన్నవిధమున పనిచేయును. అది యెవరిమీఁద ప్రయోగింపబడునో వారిస్థూలశరీరమునుగాక నైతికదాడిని స్పృశించిదానినిబలపరచును" అని యతడు వ్రాసెను.

ఈభావము కొంతవరకు భారతభావమునకు సరిపడెను. కనుక బాహ్యముగనైనను దేశముచే నుత్సాహముతో నంగీకరింపబడెను. దాని వెనుకనున్న విశేషాంతరార్థములను బహు కొద్దిమందిమాత్రమే గుర్తించిరి. ఆ కొద్దిమందికూడ విశ్వాసములోను, క్రియలోనుశరణు జొచ్చిరి. కాని, క్రియలోనున్న వేడి చల్లారుటతోడనే కొంతమంది మనస్సులలో ననేక ప్రశ్న లుదయించెను. వానికి ప్రత్యుత్తరములు దొరకుట దుర్ఘటమయ్యెను. ఈ ప్రశ్నలు సన్నిహిత రాజకీయగతిని మార్చలేదు. అవి యీ దౌర్జన్యరహిత పోరాటము వెనుకనున్న శాస్త్రమునుచర్చించెను. రాజకీయ.దృష్టిలో దౌర్జన్యరహితయుద్యమ మింకనుజయింపలేదు. ఏలనన భారతదేశమింకనుసామ్రాజ్యపిడికిలిలో పట్టుబడియున్నది. సాంఘికదృష్టిలో నది పెద్ద మార్పును దేనిని తలంపలేదు. అయినను యేమాత్రముబుద్ధితీక్షణత కలవాడైనను అది లక్షలకొలది ప్రజలలో గొప్పమార్పుకలిగించినసంగతి చూడగలడు. అది వారి శీలమును, శక్తిని, యాత్మవిశ్వాసమును ప్రసాదించెను. ఈయమూల్య వరములులేనిదే రాజకీయ, సాంఘికాభివృద్ధిని దేనిని సాధింపజాలము. లేదా నిలుపుకొనజాలము. గాంధిజీ యుదహరించిన 'సాంఘికకల్లోలము'ను లేవదీయుటకిది తోడ్పడి యమూల్యమయ్యెనని చెప్పుట కెట్టి సందేహమును లేదు. విప్లవకరమగు మార్పుకుముందు ప్రజలలోకలుగు చైతన్యవిధానము నిది తెచ్చిపెట్టెను.

స్పష్టముగ నది దానికనుకూల విషయం. కాని యది మాకు తృప్తినీయజాలదు. యదార్థమైన ప్రశ్నలకు సమాధానములు లేవు. దురదృష్టవశాత్తు గాంధీజీ యీసమస్యను పరిష్కరించుటలో మనకం తగా తోడ్పడు. ఈవిషయమునుగురించి యతడ నేకసార్లు మాట్లాడెను. అనేకసార్లు వ్రాసెను; కాని నాకు తెలిసినంతవర కత డెప్పుడు దాని యంతరార్థములను [శాస్త్రరీత్యా లేక జ్ఞానరీత్యా] బహిరంగముగ చర్చించియుండ లేదు. లక్ష్యముకంటె సాధనములు ముఖ్యమనియు, నిర్బంధముకంటె మార్పు మంచిదనియు నతడు పదేపదే చెప్పుచుం డును: దౌర్జన్యరాహిత్యమును సత్యముతోను, మంచితనముతోను కలుపుచుండును. అత డీ పదములను తరచు నామాంతరములైనట్లు వాడుచుండును. దీనితో నేకీభవింపనివారందరిని పంక్తిబాహ్యులుగను నైతికచట్టమున కపచారము చేసినవారివలె చూచు స్వభావమొకటి బయలుదేరెను. అతని కొంతమంది శిష్యులలో నిది విధాయకముగ నహంకారభావమును దాల్చెను.

ఈవిశ్వాసముకుదురుఅదృష్టముపట్టని మాబోంట్లనేకసందేహ ములు బాధించెను. ఈ సందేహము లంతిగా ప్రస్తుతావసరములకు గాక వ్యక్తిగతముగ నైతికము సాంఘికముగ శక్తివంతమునగునిరంతరాయ కర్మవేదాంతము కావలెననెడు మనోభీష్టమునకు చెందుచున్నవి. ఈ సందేహములు నన్నువీడలేదని నేనొప్పుకొనెదను. ఈసమస్యకు తృప్తి కరమగు పరిష్కారము నాకు దొరకలేదు. దౌర్జన్యమును నే నతితీవ్ర ముగ ద్వేషింతును. ఐనను నేను దౌర్జన్యపూరితుడనైయున్నాను. బుద్ధి పూర్వకముగనో యబుద్ధిపూర్వకముగనో యితరులను నిర్బధించుటకు నేను తరచుప్రయత్నించుచుందును. తన సన్నిహితశిష్యకోటిలోచాల మందిని,తనసహోద్యోగులనుమానసికమృత్పిండముగమార్చుగాంధిజీ యాధ్యాత్మిక నిర్బంధముకంటె గొప్ప నిర్బంధమేదికలదు ?

కాని, వ్యక్తిగతమైన యీ దౌర్జన్యరాహిత్య సిద్ధాంతమును సాంఘికజాతీయవర్గములు కావలసినంతవరకలవర్చుకొనగలవా? యను నదియేయదార్థప్రశ్న. ద్వేషమును, క్రౌర్యమును,స్వార్థమునుతరిమివేసి

మానవలోకము నీస్థాయికి తెచ్చు టొక్కటియే వాంఛనీయమైన పరమావధియనుట సత్యము. అది సాధ్యమా యసాధ్యమా యనునది చర్చనీయాంశము కావచ్చును; కాని, యదిలేకుండ జీవితము నాశించుట "యేయర్థము లేకుండ రణగొణధ్వనితోను, యావేశము తోను చెప్పు వివేకహీనుని కథవలెనుండును." ఈ లక్ష్యమును సాధించుట కడ్డముగ నుండుటయేగాక తద్వ్యతిరేక స్వభావములను కల్పించు నాటంకములను లెక్కపెట్టక మన మీ గుణములను బోధించుచు దానికొరకు తిన్నగా ప్రయత్నింపవలెనా? లేక మొదట మన మీయడ్డంకులను తీసివేసి ప్రేమ, సౌందర్యము, సుహృద్భావముపృద్ధి చెందుట కెక్కువయవకాశమగు వాతావరణమును సృష్టింపవలదా? లేక మన మీ రెండు విధానములను జోడింపవలెనా?

మరియుదౌర్జన్యమునకు, దౌర్జన్యరాహిత్యమునకు, బలవంతమునకు మార్పుకుమధ్యగలరేఖయంతస్పష్టముగానున్నదా? తరచు నైతికనిర్బంధముశరీరనిర్బంధముకంటె నెక్కువ భయంకరనిర్బంధమగుచుండును. దౌర్జన్యరాహిత్యము సత్యముకునామాంతరమా? సత్యమననేమి? యను నది పురాణసమస్య. దానికవేలకొలది ప్రత్యుత్తరములీయబడెను. అయి నను యీ ప్రశ్న మిగిలేయున్నది. కాని యదియేదియైనను, దౌర్జన్య రాహిత్యముతో పూర్తిగ నేకముకాజాలదు. దౌర్జన్యముస్వతః చెడ్డదె యైనను వస్తుతః యవినీతికరమని భావించుటకు వీలులేదు. ఇందులో ననేక తరహాలు, అనేకఛాయలు కలవు తరచు అంతకంటె చెడ్డయైన దానికంటె నిది మంచియే కావచ్చును. గాంధీజీయే పిరికితనముకంటె నిది మంచిదని చెప్పెను; భయము, దాస్యము, మొదలగుననేక చెడుగు లను దీనికి జేర్చవచ్చును. సామాన్యముగ దౌర్జన్యము ద్వేషముతో కూడియుండుననుట నిజము: కాని, సిద్ధాంతములోనైనను యిది యెల్ల ప్పుడు నీవిధముగ నుండనక్కరలేదు. దౌర్జన్యము ప్రేమమీదనాధార పడవచ్చునని యూహింపవచ్చును. (శస్త్రవైద్యుని యుదాహరణము లేదా?) ఇట్టి యాధారముకలదేదియు నెప్పుడును ప్రధానముగ నీతి బాహ్యము కాజాలదు. ఇంతకు ధర్మమునకు, నీతికి ప్రేమ, ద్వేషము

యంత్యపరీతులు. కనుక దౌర్జన్య మతితరచు నైతికముగ నన్యాయ
మేయై యాదృష్టిలో నుపద్రవకరమని భావింపబడినను అది యెల్ల
ప్పుడు నట్లుండ నవసరము లేదు.

జీవితము సంఘర్షణ, దౌర్జన్యములతో నిండియున్నది. దౌర్జ
న్యము దౌర్జన్యమునే వృద్ధిచేయునట్లు కాన్పించును. కనుక నది దానిని
జయించుమార్గము కానేరదు. అయినను దానిని కేవలముకూడదనుట
వలన జీవితముతో నెంతమాత్రము సంబంధములేని శుద్ధశూన్యదృష్టి
యేర్పడును. దౌర్జన్య మాధునిక రాజ్యాంగముయొక్కయు, సాంఘిక
పద్ధతియొక్కయు జీవగఱ్ఱ. రాజ్యాంగ నిర్బంధసామగ్రిలేనిదే పన్నులు
వసూలు కాబడనేరవు. భూస్వాములకు శిస్తులురావు. స్వాంతఆస్తి
మాయమగును. చట్టము, దాని సాయుధశక్తులతో స్వాంతఆస్తిని ఇత
రులనుండి కాపాడును జాతీయప్రభుత్వము తన్ను సంరక్షించుకొనుచు,
విజృంభించు దౌర్జన్యమువలన నిలిచియుండును.

గాంధీజీ దౌర్జన్యరాహిత్యము కేవల శూన్యవ్యాపారము
కాదు; ఎదురాడక లొంగిపోవుటకాదు. అది దౌర్జన్యరహిత తిరుగు
బాటు ఆచరణరూపమైన, సజీవ కార్యవిధానము. అది వర్తమాన
స్థితికి పిల్లివలె లొంగిపోవువారికొరకు కుద్దేశింపబడలేదు. అది సంఘ
ములో కల్లోలమును కలిగించుటకే సృష్టింపబడి తద్వారా వర్తమాన
పరిస్థితులను మార్చును. సంస్కారోద్దేశ్యము లేవియైనను ఆచరణలో
నది బలీయమైన సాధనము. గాంధీజీ తన మొదటి వ్రాతలలో 'బల
వంతపరచుట' యను పదము నుపయోగించెను. 1920 లో వైస్రాయి
(ఛెలమ్సుఫర్డు) పంజాబుసైనిక శాసన దురంతములను గురించి చేసిన
యుపన్యాసమును విమర్శించుచు నత డిట్లు వ్రాసెను. "కౌన్సిలును
ప్రారంభించునపుడు వైస్రాయి యుపన్యాసము అతనితోను, యతని
ప్రభుత్వముతోను ఆత్మగౌరవము కలవారు సంబంధము కలిగియుం
డుట కసాధ్యమగు మానసిక దృక్పథమును చూపుచున్నది.

పంజాబుమీద చేసిన విమర్శలు పరిహారమును నిర్మొగమాట
ముగ నిరాకరించినట్లు విశదముచేయుచున్నవి. సన్నిహిత'భవిష్యత్తు'కు

సంబంధించు సమస్యలమీద కేంద్రీకరింపుడు ! అని యీయన మనకు హితవొసగును. పంజాబు దురంతముల విషయమై పశ్చాత్తాపపడు నట్లు ప్రభుత్వము బలవంతపరచుటయే సన్నిహిత భవిష్యత్తు...

జాతితో జాతి, తరగతితో తరగతి పోరాడు ప్రస్తుతపరిస్థితు లలో దౌర్జన్యము, నసత్యము విధాయకములుగ కాన్పించుచున్నవి. తమ యధికారమునకు, హక్కులకు నంటిపెట్టుకొని యుండగోరుచు తాము అణచివేయు ప్రజల కభివృద్ధిచెందు యవకాశములను నిరాక రించుహక్కులుగల జాతులు, తరగతులు దౌర్జన్యము, బలవంతము, అసత్యములమీద నాధారపడవలెను ప్రజాభిప్రాయ మభివృద్ధియగుచు నీ సంఘర్షణలయొక్కయు, నవి చేయునట్టి యణచివేయుటలోనున్న యదార్థములు నంతకంతకు బహిర్గతమైనకొలది దౌర్జన్యము తగ్గుట సాధ్యముకావచ్చును. యదార్థమునకు నవీన యనుభవమంతయు తద్వ్యతిరేకమునే తెలుపుచున్నది. వర్తమాన సంస్థలపైనవాలు హెచ్చిన కొలది దౌర్జన్యము పెరుగుచున్నది. బాహ్యమగుదౌర్జన్యము తగ్గిన చోటకూడ నది మరింత యుపద్రవకరములైన సూక్ష్మరూపములను దాల్చుచున్నది. జ్ఞానాభివృద్ధి, మతదృష్టి, నీతి యే విధముగను యీ దౌర్జన్యస్వభావము నణచజాలకపోయెను. వ్యక్తు లభివృద్ధిచెంది యు నవప్రమాణములలో నుత్థితులైరి. బహుశః నేడు చరిత్రలోమున్న న్నడు లేనంతమంది యుత్తమజాతి పురుషులు (పురుషోత్తమ మాదిర తప్ప) కలరు। సంఘము మొత్తముమీద నభివృద్ధిచెంది పురాణయాట విక స్వభావమును నియమించుటకు బహుస్వల్పముగ ప్రయత్నింప నారంభించెను. కాని, వర్గములు, కులములు మొత్తముమీద నెక్కు వగ నభివృద్ధిచెందలేదు. వ్యక్తి తా నెక్కువ నాగరికుడగుచు తన యనేక యాదిమ రాగాదులను, చెడుగులను సంఘమునకు బదిలీ చేసెను. దౌర్జన్యమెప్పుడు నైతికముగ రెండవరకము వ్యక్తులనే యాకర్షించును. కనుక నీ సంఘములయొక్క నాయకు లరుదుగ యుత్తమ స్త్రీ పురుషు లగుదురు.

ప్రభుత్వమునుండి యధమాధమరూపములోనున్న దౌర్జన్యము క్రమముగ తగ్గింపబడునని యనుకొన్నను పరిపాలనకు, సాంఘిక జీవిత

ముకు కొంత నిర్బంధ మవసరమను సంగతిని నిర్లక్ష్యము చేయరాదు. సాంఘిక జీవితమున కేదో యొకవిధమగు ప్రభుత్వ ముండవలెను. ఈవిధముగ నధికారములో నుంచబడువారు సంఘమున కపకారము చేయునట్టియు, స్వతః స్వార్థపూరితమైనట్టియు వ్యక్తులయొక్కయు లేక వర్గములయొక్కయు స్వభావముల నన్నింటిని వారింపవలెను. సాధారణముగ వా రవసరమును మీారి వర్తించెదరు. ఏలనన యధికారము మనలను పతితులను, అవినీతిపరులను చేయును. పరిపాలకులు స్వేచ్ఛ నెంత ప్రేమించి, నిర్బంధము నెంత ద్వేషించినను ఆ ప్రభుత్వములో ప్రతిమానవుడును కేవలము స్వార్థహితుడై, ప్రజాసామాన్య శ్రేయస్సు నభిలషించు పరిపూర్ణుడగువరకు తిరుగుబాటుచేయు వ్యక్తులపై నిర్బంధము నుపయోగింపవలసియుండును. దండయాత్రలను చేయుచుండు బాహ్యజాతులపైనకూడ వారు నిర్బంధముచు ప్రయోగింపవలెను. అనగా దౌర్జన్యమును దౌర్జన్యముతో నెదుర్కొని యాత్మరక్షణ చేసికొనవలెను. ఏకైక ప్రపంచ ప్రభుత్వమున్నప్పుడు మాత్రమే దీని యవసరముండదు.

కనుక నీవిధముగనాంతరంగిక యైక్యములకు, బాహ్యసంరక్షణకు నిర్బంధ, దౌర్జన్యము లవసరమగునపుడు మన మెచ్చటగీతగీయవలెను? రాజకీయములకు మన మీావిధికృతమగు నైతికామోదము నొకసారి యిచ్చితిమా దౌర్జన్యరహిత నిర్బంధము, దౌర్జన్యసహిత నిర్బంధము లేక ప్రభుత్వనిర్బంధము, విప్లవకారులనిర్బంధము సంపూర్ణముగ వేరు చేయుట సాధ్యముకాదని రైనుహోల్డునీబరు సూచించుచున్నాడు.

లోపభూయిష్టమగు నీప్రపంచములో నేజాతీయప్రభుత్వమైనను స్వీయరక్షణకొరకు (పైవారిదాడులనుండి) దౌర్జన్యము నుపయోగింపవలసియుండునని గాంధీజీ యొప్పుకొనునని (ఇది నాకు నిశ్చయముగ తెలియదు) నేననుకొనెదను; ప్రభుత్వము నిశ్చయముగ తన యిరుగు పొరుగు ప్రభుత్వములపట్ల పరిపూర్ణమైన శాంతియుత మిత్రనీతి నవలంబింపవలెను. అయినప్పటికి దాడి సంభవింపనే సంభవింపదనుట మూర్ఖత్వము. అది నిర్బంధ స్వభావముగల కొన్ని చట్టములను కూడ

చేయవలెను. అనగా వివిధ తరగతులనుండి, వర్గములనుండి కొన్ని హక్కులను, అధికారములనుతీసికొనివానిస్వేచ్ఛాక్రియలనువిరోధించవలెను. చట్టము లన్నియు కొంతవరకునిర్బంధయుతములు. కాంగ్రెసు యొక్క కరాచీ తీర్మానము "ప్రజా దోపిడిని సమాప్తము చేయుటకు మాడుచున్న లక్షలకొలది ప్రజలయొక్క యదార్థ యార్థిక స్వేచ్ఛ కూడ రాజకీయ స్వేచ్ఛలో నిమిడి యుండవలెను" అని శాసించెను. వాంఛనీయమైన యీ భావమును సఫలము చేయుట కెక్కువ హక్కు లున్నవారు వానిని తక్కువహక్కులున్నవారికిచ్చివేయవలసి యుండును. మరియు పనివాండ్రకు జీవించుట కవసరమైన కూలియు ననేక యితర సౌకర్యములు నుండవలెను. ఆస్తిమీద ప్రత్యేకపన్నులు విధింపబడును. "ప్రభుత్వము ప్రధానపరిశ్రమలను. సేనలను, ఖనిజసంపత్తును, రైల్వేలను, నీటివసతులను, నావికాదిరవాణాసౌకర్యములను కలిగి యుండవలెను. లేదా నియమింపవలెను." మరియు "మత్తుపదార్థములు. పానీయములు సంపూర్ణముగ నిషేధింపబడవలెను." అని శాసించెను. అనేకమంది ప్రజలు దీనినంతనుఆక్షేపించవచ్చును; వారధికసంఖ్యాకుల యిచ్ఛకు లొంగవచ్చును: కాని యుల్లంఘనమువలన కలుగు ఫలితములకు భయపడియే వారిట్లుచేయుదురు. నిశ్చయముగ ప్రజాస్వామికమనగానల్పసంఖ్యాకులధికసంఖ్యాకులచేనిర్బంధింపబడుటయేయగును.

ఆస్తియొక్క హక్కులను మార్చునట్టి లేక చాలవరకు లాగి వేయునట్టి చట్టము నధికసంఖ్యాకు లామోదింతురు. అది నిర్బంధమను కారణముచే నాక్షేపించబడవలసినదేనా ? ఎన్నటికిని కాదు. అన్ని ప్రజాస్వామికచట్టములలోను యిదేపద్ధతి యవలంబింపబడును. కనుక నిర్బంధమను కారణముచే నాక్షేపించుటకు వీలులేదు అధికసంఖ్యాకు లవినీతిగను, అన్యాయముగను వర్తించుచున్నారని చెప్పవచ్చును. అధికసంఖ్యాకు లామోదించిన చట్టము నైతికసూత్రమును దేనినైన నతిక్రమించెనా? యనునదే విచారణీయాంశము. దీనినిశ్చయింపవలసినవారెవరు? వ్యక్తులును, వర్గములును తమనిజప్రయోజనముల ననుసరించి ధర్మసూత్రములను నిర్ణయించు నెడల ప్రజాస్వామిక

ముకు కొంత నిర్బంధ మవసరమను సంగతిని నిర్లక్ష్యము చేయరాదు. సాంఘిక జీవితమున కేదో యొకవిధమగు ప్రభుత్వ ముండవలెను. ఈవిధముగ నధికారములో నుంచబడువారు సంఘమున కపకారము చేయునట్టియు, స్వతః స్వార్థపూరితమైనట్టియు వ్యక్తులయొక్కయు లేక వర్గములయొక్కయు స్వభావముల నన్నింటిని వారింపవలెను. సాధారణముగ వా రవసరమును మీరి వర్తించెదరు. ఏలనన యధికారము వారలను పతితులను, అవినీతిపరులను చేయును. పరిపాలకులు స్వేచ్ఛ నెంత ప్రేమించి, నిర్బంధము నెంత ద్వేషించినను ఆ ప్రభుత్వములో ప్రతిమానవుడును కేవలము స్వార్థరహితుడై, ప్రజాసామాన్య శ్రేయస్సు నభిలషించు పరిపూర్ణుడగువరకు తిరుగుబాటుచేయు వ్యక్తులపై నిర్బంధము నుపయోగింపవలసియుండును. దండయాత్రలను చేయుచుండు బాహ్యజాతులపైనకూడ వారు నిర్బంధమును ప్రయోగింపవలెను. అనగా దౌర్జన్యమును దౌర్జన్యముతో నెదుర్కొని యాత్మరక్షణ చేసికొనవలెను. ఏకైక ప్రపంచ ప్రభుత్వమున్నప్పుడు మాత్రమే దీని యవసరముండదు.

కనుక నీవిధముగనాంతరంగికఐక్యములకు, బాహ్యసంరక్షణకు నిర్బంధ, దౌర్జన్యము లవసరమగునపుడు మన మెచ్చటగీతగీయవలెను? రాజకీయములకు మన మీవిధికృతమగు నైతకామోదము నొకసారి యిచ్చితిమా దౌర్జన్యరహిత నిర్బంధము, దౌర్జన్యసహిత నిర్బంధము లేక ప్రభుత్వనిర్బంధము, విప్లవకారులనిర్బంధము సంపూర్ణముగ వేరు చేయుట సాధ్యముకాదని రైనుహోల్డునీబరు సూచించుచున్నాడు.

లోపభూయిష్టమగు నీప్రపంచములో నేజాతీయప్రభుత్వమైనను స్వీయరక్షణకొరకు (పైవారిదాడులనుండి) దౌర్జన్యము నుపయోగింపవలసియుండునని గాంధీజీ యొప్పుకొనునని (ఇది నాకు నిశ్చయముగ తెలియదు) నేననుకొనెదను; ప్రభుత్వము నిశ్చయముగ తన యిరుగు పొరుగు ప్రభుత్వమువట్ల పరిపూర్ణమైన శాంతియుత మిత్రనీతి నవలంబింపవలెను. అయినప్పటికి దాడి సంభవింపనే సంభవింపదనుట మూర్ఖత్వము. అది నిర్బంధ స్వభావముగల కొన్ని చట్టములను కూడ

చేయవలెను. అనగా వివిధ తరగతులనుండి, వర్గములనుండి కొన్ని హక్కులను, అధికారములనుతీసికొనివానిస్వేచ్ఛాక్రియలనునిరోధించవలెను. చట్టము లన్నియు కొంతవరకునిర్బంధయుతములు. కాంగ్రెసు యొక్క కరాచీ తీర్మానము "ప్రజా దోపిడిని సమాప్తము చేయుటకు మాడుచున్న లక్షలకొలది ప్రజలయొక్క యదార్థ యార్థిక స్వేచ్ఛ కూడ రాజకీయ స్వేచ్ఛలో నిమిడి యుండవలెను" అని శాసించెను. వాంఛనీయమైన యీ భావమును సఫలము చేయుట కెక్కువ హక్కు లున్నవారు వానిని తక్కువహక్కులున్నవారికిచ్చివేయవలసి యుండును. మరియు పనివాండ్రకు జీవించుట కవసరమైన కూలియు ననేక యితర సౌకర్యములు నుండవలెను. ఆస్థిమీద ప్రత్యేకపన్నులు విధింపబడును. "ప్రభుత్వముప్రధానపరిశ్రమలను. సేనలను, ఖనిజసంపత్తును, రైల్వేలను, నీటివనరులను, నావికాదిరవాణాసౌకర్యములను కలిగి యుండవలెను. లేదా నియమింపవలెను." మరియు "మత్తుపదార్థములు. పానీయములు సంపూర్ణముగ నిషేధింపబడవలెను." అని శాసించెను. అనేకమంది ప్రజలు దీనినంతనుఆక్షేపించవచ్చును; వారధికసంఖ్యాకుల యిచ్ఛకు లొంగవచ్చును: కాని యుల్లంఘనమువలన కలుగు ఫలితములకు భయపడియే వారిట్లుచేయుదురు. నిశ్చయముగ ప్రజాస్వామికమనగానల్పసంఖ్యాకులధికసంఖ్యాకులచేనిర్బంధింపబడుటయేయగును.

ఆస్థియొక్క హక్కులను మార్చునట్టి లేక చాలవరకు లాగివేయునట్టి చట్టము నధికసంఖ్యాకు లామోదింతురు. అది నిర్బంధమను కారణముచే నాక్షేపించబడవలసినదేనా? ఎన్నటికిని కాదు. అన్ని ప్రజాస్వామికచట్టములలోను యిదేపద్ధతి యవలంబింపబడును. కనుక నిర్బంధమను కారణముచే నాక్షేపించుటకు వీలులేదు. అధికసంఖ్యాకు లవినీతిగను, అన్యాయముగను వర్తించుచున్నారని చెప్పవచ్చును. అధికసంఖ్యాకు లామోదించిన చట్టము నైతికసూత్రమును దేనినైన నతిక్రమించెనా? యనునదే విచారణీయాంశము. దీనినిశ్చయింపవలసినవారెవరు? వ్యక్తులును, వర్గములును తమనిజప్రయోజనముల ననుసరించి ధర్మసూక్ష్మములను నిర్ణయించు నెడల ప్రజాస్వామిక

పద్ధతి యనుసరించును. స్వంత ఆస్థి యుండుటవలన (అతి నియమిత భావములోతప్ప) వ్యక్తులకు సంఘమంతటిమీద నుపద్రవకరమైన యధి కారము కలుగునని నేను భావింతును. కనుక నది సంఘమునకు కత్యం తాపకారియగును. అది ద్రోహకరము కంటెకూడ నెక్కువ యవినీతికర మని నేను భావింతును.

దౌర్జన్యరాహిత్యమునందు విశ్వాసమకలదని చెప్పుకొను కొందరు యజమానుల సమ్మతిలేనిదే స్వంతయాస్థిని ప్రభుత్వవశము చేసుకొను యత్నము నిర్బంధమగుననియు, కనుక దౌర్జన్యరాహిత్య మునకు వ్యతిరేకమనియు నాతో చెప్పిరి. తమశిస్తులను బలవంతముగ వసూలుచేసికొనుటలో ప్రభుత్వసహాయమును పొందుట కెంత మాత్రము జంకని పెద్దజమీందారులు, తమభూములలో స్వాతంత్ర్య లేబరుసంఘము లుండుటకుగూడ ననుజ్ఞనీయని యనేక ఫ్యాక్టరీఖా మందులైన పెట్టుబడిదారులు యీ భావమును నాకు శ్రుతపరచిరి. ఫలి తము ననుభవించువారిలో నధికసంఖ్యాకులు మార్పు కోరుచున్నా రను విషయము చాలదట! దానివలన నష్టముపొందు వ్యక్తులనే మార్పుచేయవలెను. ఈ విధముగ స్వార్థములుగల కొద్దిమంది స్పష్ట ముగ కావలసినమార్పు నరికట్టవచ్చును.

ఆర్థికప్రయోజనములే తరగతుల యొక్కయు, వర్గముల యొక్కయు రాజకీయభావములను నిరూపించునని చరిత్ర తెలుపును. హేతువు, నైతికోద్దేశ్యములు ప్రయోజనముల నణచివేయజాలవు. వ్యక్తులు మారవచ్చును. వారు తమప్రత్యేకహక్కులను విడిచిపెట్ట వచ్చును; కాని, తరగతులు; వర్గములు నట్లుచేయవు. పరిపాలించు నట్టియు, హక్కులు కలిగినట్టియు తరగతినిమార్చు యత్న మింతవర కెల్లప్పుడు విఫలమయ్యెను: కనుకనది యికముందు జయింపగలదనుట కెట్టికారణములు కాన్పించవు.

ఒక తరగతిని లేక జాతిని మార్పుచేతుమనుటయు, సంఘర్షణను సహేతుకవాదముచేతను, న్యాయముచేయుమని ప్రార్థించుటచేతను నిర్మూలింపవచ్చుననుటయు నాత్మవంచనయగును. తగినంత వత్తిడి

లేనిదే పరిపాలనచేయు నధికారపూరిత ప్రభుత్వము దేశముమీద తన పరిపాలనను వదలుననుకొనుటయు, నొక తరగతి తన యున్నతస్థితిని హక్కులను విడిచిపెట్టు ననుకొనుటయు వట్టి భ్రమలు.

గాంధిజీస్పష్టముగ నా వత్తిడినే (అది బలవంతమని యతడు పిలువకపోయినను) ప్రయోగింపగోరును. అతని ప్రకార మాత్మబాధయే యతనివద్ధతి. దీనిలో మానసికస్వభావముండుటచేతను, కొలుచుటకు తూచుటకు, మరే స్థూలప్రమాణముచేతను గ్రహించుటకు వీలు లేకపోవుటచేతను, దీనిని భావించుట కొంత కఠినమైన విషయము. శత్రువు నిది కంగారుపరచుననుట కెట్టిసందేహము లేదు. ఇదివాని నైతిక మర్మములను బహిర్గత మొనరించును; వాని స్థైర్యమును చెదరగొట్టును. వానిలోనున్న సర్వోత్తమమైనదానిని స్పృశించును. సమాధానమునకు ద్వారమును తెరచియుంచును. ఆత్మబాధయు, ప్రేమమార్గమును శత్రువులోను, చూపరులలోనుకూడ శక్తివంతమైన మానసికశ, యాధ్యాత్మిక భావముల నుత్పన్నముచేయుననుట కెట్టి సందేహము లేదు. అడవిజంతువును సమీపించువిధములో చాలభేదముండునను విషయము వేటకాండ్రందరకు తెలియును. అదిదూరమునుండియే వేటకాని బింకమును గ్రహించి తదనుగుణ్యముగ వర్తించును. అతనిలో చీమకాలంత భయమున కాస్పదముండుచో (దానినతడే గుర్తింపకపోవచ్చును.) నది యెట్లో యామృగమునకుచేరి యతనిలో భయమును పుట్టించును. ఈసమయములోనది వానిపైకురుకును. సింహమునుమచ్చిక చేయువాని స్థైర్య మొక్కనిముషము చెదరెనా యతడు వెంటనేయెదురొక్కనబడును. ఏమాత్రము భయములేని మనిషి కడివిమృగముల వలన నపాయము కలుగజాలదు. కనుక మానవు లీ మానసిక ప్రేరేపణలకు లోబడుట సహజము. కాని, వ్యక్తులట్లులోబడినను, వర్గమను తరగతియు నట్లుచేయుట సందేహాస్పదము ఆతరగతికి (మొత్తము మీద) రెండవపక్షముతో సన్నిహితసంపర్కము, ప్రత్యేకసంబంధము నుండజాలదు. అది వినునట్టి నివేదికలకూడ నసంపూర్తిగను, వికారముగనుండును. ఏదిజరిగినను దానియధికారమును ధిక్కరించు నేవర్గము

మీదనైన ప్రయత్నముగ కలుగు కోప మత్యధిక మగుటచే నది చిల్లర భావములన్నింటిని మ్రింగివేయును. తనయుత్తమాధికారమును, హక్కులును సాంఘికశ్రేయస్సు కవసరమను భావమును చిరకాలము నుండి యలవడిపోవుటచే వ్యతిరేకాభిప్రాయము మతిభ్రష్టత వలె నుండును. న్యాయము, క్రమము, వర్తమానస్థితిని సంరక్షించుట ప్రధానగుణములగును. వానిని సవాలుచేయు ప్రయత్నములు గొప్ప పాపములగును.

కనుక వ్యతిరేకవర్గమునకు సంబంధించినంతవరకు పరివర్తనవిధానము మందముగనుండును. నిశ్చయముగనొక్కొక్కప్పుడువారితత్త్వపు యొక్క సాధుత్వము, పావనత (వారినితప్పుమార్గములోనికిదింపునట్లు కాన్పించును కనుక) వారికి మరింత కోపమును కలుగచేయును. తాను తప్పుచేసియుండవచ్చునని యొకవ్యక్తి సందేహింప నారంభించుచో నతని ధార్మికాగ్రహ మభివృద్ధియగును. అయినప్పటికిని దౌర్జన్య రాహిత్యశాస్త్రము మెదిరిపక్షములోని చెదురు వ్యక్తులను మార్చి తద్వారా ప్రతిపక్షదారుఢ్యమును తగ్గించును. ఇంతకంటె నెక్కువగ నది తటస్థుల సానుభూతి నాకర్షించును అది ప్రపంచాభిప్రాయమును మార్చు బలీయమైన యుపకరణము కాని. పరిపాలనచేయు వర్గము వార్తలను పైకిపోకుండ చేయవచ్చును. లేదా వికారపరచవచ్చును అది ప్రచురణచేయు యేజెన్సీలను నియమించును. కనుక యదార్థములను తెలియకుండ చేయగలదు దౌర్జన్యరాహిత్యపద్ధతి యవలంబింపబడు దేశములోనున్న యుదాసీనులగు నధికసంఖ్యాక ప్రజలమీదనే యీ శాస్త్ర మద్భుతముగ పనిచేయును. వారు నిశ్చయముగ మారుదురు. దానియెడల నత్యుత్సాహమును చూపుదురు. కాని, వారదివరకే యీలక్ష్యమును సాధారణముగనామోదించిరి. కనుక వారిలో విశేషమార్పు అవసరమే లేదు. మార్పునకు భయపడువారిలో నంత స్పష్టమగు ఫలితము కాన్పించదు. భారతదేశములో నసహాయోద్యమము, శాసనోల్లంఘనము శీఘ్రముగ వ్యాపించుటవలన దౌర్జన్య రహిత యుద్యమ మధికసంఖ్యాకులపై నెంత శక్తివంతముగ పని

చేయునో సందేహాస్పదుల నెట్లు మార్చివేయునో విశదముచేసెను. అది దానికి మొదటినుండి వ్యతిరేకులైనవారి నెక్కువ మార్పుచేయ లేదు. ఉద్యమ విజయము నిశ్చయముగ వారి భయములను వృద్ధిచేసి వారిని మరింత వైరులను చేసెను.

ప్రభుత్వము తనస్వేచ్ఛను రక్షించుకొనుటకు దౌర్జన్యము నుపయోగించుట న్యాయమని యొప్పుకొనబడినచో నాస్వేచ్ఛను సాధింప యత్నించుటలోగూడ నదేవిధమున నది యేలన్యాయముకాదో యర్థముకాకున్నది. దౌర్జన్యపద్ధతి వాంఛనీయముకాకపోవచ్చును, పొసగకపోవచ్చును. కాని,యది సుతరాము యక్రమము,నిషిద్ధము కాజాలదు. సాయుధసైన్యములన్నియు ప్రభుత్వములోనున్నవను విషయ మొక్కటియే దానినుపయోగించుటకు వారికెక్కువ హక్కు స్థిరపరుపజాలదు. దౌర్జన్యరహిత విప్లవము జయించి ప్రభుత్వమును వశపరచుకొనినచో దౌర్జన్యమును ప్రయోగించుటకు దాని కిదివరకులేనిహక్కు వెంటనే కలుగునా? దాని యధికారముమీద తిరుగుబాటు కలుగుచో నదిదాని నెట్లెదుర్కొనును; దౌర్జన్యపద్ధతుల నుపయోగించుట కది సహజముగ యిష్టపడదు. అది యున్ని శాంతియుత పద్ధతులచేతను పరిస్థితినిసాధింప యత్నించును కాని,యది దౌర్జన్యము నుపయోగించు హక్కును వీడజాలదు. మార్పుకిష్టపడని ప్రతికూలురు ప్రజలలో నిశ్చయముగ నుందురు. వారు పూర్వపుస్థితికి పోవలెనని యత్నింతురు. తమ దౌర్జన్యము నూతనప్రభుత్వ సాయుధబలముచే నణచివేయబడదని భావింపబడుచో వారు దానిని మరింతజోరుగ నుపయోగింతురు. కనుక దౌర్జన్యమునకు, దౌర్జన్యరాహిత్యమునకు మార్పుకు, బలవంతమునకుమధ్య నొక కచ్చితమైన గీతగీయుట యసాధ్యమని తోచుచున్నది. రాజకీయ మార్పుల సందర్భములోనే యదార్థమైన కష్టముకలదు హక్కులుకల తరగతికి కొల్లగొట్టపడు తరగతికి మధ్య నది మరింత కష్టతరమగును.

ఒకలక్ష్యముకొరకుబాధ పడుటెల్లప్పుడుమెప్పువడసెను. లొంగిపోకుండ నెదురుబాధింపకుండ నొకధర్మముకొరకు బాధపడుటలో నుదారత, గొప్పతనము కలవు అయినను దీనిని బాధకొరకే బాధపడు

సిద్ధాంతమునుండి వేరుచేయు రేఖ యతిసున్నితమైనది. ఈ రెండవరకపు యాత్మబాధ యొక్క వెర్రిక్రింద, కొంత వసువృతక్కువ వ్యాపారము క్రిందపరిణమింపవచ్చును. దౌర్జన్యము తరచు పాపిష్టిదగుచో దౌర్జన్యరాహిత్యము, (అధమము దాని వ్యతిరేకభావములోనైనను) మరియొక తప్పిదము చేయవచ్చును. పిరికితనమునకు, నిర్వ్యాపారత్వమునకు. వర్తమానస్థితిని నిల్పుకొనుటకు దౌర్జన్యరాహిత్యము నొక ముసుగా చేసికొను అవకాశముకూడ యెల్లప్పుడు కలదు.

గొప్ప సాంఘికమార్పులు కలుగవలెనను భావమునకు భారతదేశములో ప్రాధాన్యతవచ్చిననాటినుండియు నట్టిమార్పులకు విధాయకముగ దౌర్జన్య మవసరమనియు కనుక నవి పనికిరావనియు నొక వాదము బయలుదేరెను. తరగతుల మధ్య పోరాటములను (అవి యెంతయెక్కువగనున్నను) తలపెట్టరాదు; ఏదోయొక స్థితిలో దౌర్జన్యము లేనిదే సాంఘిక సమస్యాపరిష్కారము జరుగనేరదనుట సంభవమే కావచ్చును. హక్కులుగల తరగతులు తమ స్థితిని రక్షించుకొనుటకు దౌర్జన్యము నుపయోగించుటకు సందేహింపరనుట నిశ్చయము. దౌర్జన్యరాహిత్యశాస్త్రముద్వారా, సిద్ధాంతములో, గొప్ప రాజకీయమార్పును సాధింపగలుగుచో దానితోనే సాంఘికమార్పును కూడ నేల సాధింపజాలము? రాజకీయస్వేచ్ఛను, బ్రిటిషు సామ్రాజ్యమును తొలగించుటయు మనము దౌర్జన్యరహితముగ సాధింపగలిగినపుడు ఫ్యూడల్ సంస్థానములు, భూస్వాములు, తక్కిన సాంఘిక సమస్యలు మొదలగువానినికూడ నావిధముగనే యేల పరిష్కరింపజాలము; ఇదియంతయు దౌర్జన్యరాహిత్యముగ సాధ్యమగునా కాదా యనునది యెక్కువ సమస్యకాదు. ఈ రెండును దానిచే సాధింపబడవచ్చును లేనిచో రెండును సాధింపబడనేరవు. దౌర్జన్యరాహిత్యపద్ధతి విదేశపాలకులమీదనే వినియోగించునని చెప్పబడజాలదు. దానిని దేశములోని స్వజాతీయ స్వార్థప్రయోజనములమీదను, ప్రతీకారులమీదను వినియోగించుట యెక్కువ సుకరము; ఏలనన వారిమీద కలుగు మానసికఫలితము లితరులమీద కలుగుదానికంటె నధికముగ నుండును.

దౌర్జన్యరాహిత్యమునకువిరుద్ధములని యనుకొనబడినలక్ష్యములను,నీతులను భారతదేశములో గ్రహించు నవీనస్వభావము తలక్రిందులు పద్ధతిగ నాకు కాన్పించును. అతియోగ్యము, పటుతరమునగు విధమున మమ్ము మా లక్ష్యమునకు తీసికొనిపోవునని దౌర్జన్యరాహిత్య పద్ధతి వాగ్దానముచేయుటచేత మేము పదిహేనేండ్ల క్రితము దానినంగీకరించితిమి. అప్పుడు లక్ష్యము,దౌర్జన్యరాహిత్యము వేరు వేరుగనుండెను. లక్ష్యము కేవలము దాని తోకవలె లేక దాని ఫలితమువలెనుండ లేదు. స్వేచ్ఛ లేక స్వాతంత్ర్యము దౌర్జన్యరాహిత్యముచే సాధ్యమైన యెడలనే ప్రయత్నింపబడవలెనని యెవ్వడెవరును చెప్పియుండలేదు. కాని, యిప్పుడు మనలక్ష్యమే దౌర్జన్యరాహిత్యముచే పరీక్షింపబడుచున్నది. దానికి సరిపడనట్లు కాన్పించినయెడల త్రోసివేయబడుచున్నది. కనుక దౌర్జన్యరాహిత్యభావము బిర్రబిగిసిన ధర్మవన్నమగుచున్నది. దానిని సవాలుచేయరాదు! ఈకారణముచే బుద్ధినొప్పింపగల దాని యాధ్యాత్మికశక్తి తగ్గిపోవుచు నది మతము, విశ్వాసము అను గూళ్ళలో చేరిపోవుచున్నది. స్వార్థపరుల స్వార్థముల కది జీవగర్రకూడ నగుటు వర్తమానస్థితిని సంరక్షించుకొనుటకు దానిని కొల్లగొనుచున్నది.

ఇది చాల విచారకరము. దౌర్జన్యరాహిత్య విరోధభావములు, నట్టి సంగ్రామశాస్త్రము భారతదేశమునకు, తక్కిన ప్రపంచమునకు నమూల్యములని నేనుభావించెదను. వీనినిగురించియోచించునట్లాధునిక భావమును బలవంతపరచి గాంధీజీ గొప్పసేవచేసెను. వానికి గొప్ప భవిష్యత్తుకలదని నేనువిశ్వసించెదను. మానవలోకమువానినిపూర్తిగ నవలంబించుటకు తగినంతయభివృద్ధి చెందకపోవచ్చును. "గ్రుడ్డివానికి నీదృష్టియను కొవ్వొత్తి నిచ్చెదవు" "కాని, దాని నతడా కర్రక్రింద నువయోగించుటతప్ప మరెట్లు వినియోగింపగలడు!" ప్రస్తుతమీదృష్టి తగినంతయుండకపోవచ్చును. కాని, యన్నియుత్కృష్టభావములవలెనే దానిపలుకుబడియభివృద్ధిచెందియంతకంతకు మనకార్యములను మార్చివేయవచ్చును. అసహాయోద్యమము దుష్ప్రభుత్వమునుండి లేక సంఘమునుండి సహకారమును లాగివేయునట్టి యతిశక్తివంతమైన

సృజనశక్తి కల భావము. నైతికసంపదకలవారు కొద్దిమంది దాని నాచరించినను దానిఫలితము విస్తరించి దినదినాభివృద్ధి యగుచుండును. అధికసంఖ్యాకులలో బాహ్యఫలితము యెక్కువ విశదమగును. కాని, యితర కారణములు నైతికసారాంశమును మరుగుపరచవచ్చును. దాని విస్తృతి దానిగంభీరతను మార్చునట్లు కాన్పించును. సాముదాయక మానవుడు వ్యక్తిని వెనుకకు త్రోసివేయును.

అయినప్పటికి శుద్ధదౌర్జన్యరాహిత్యమునే రాపాడుటచే నది జీవితమునకు దూరము, బాహ్యము నగుచున్నది. ప్రజలు దానిని గ్రుడ్డిగ నొక మతమువలె నంగీకరింతురు. లేక పూర్తిగ నిరాకరింతురు. వివేచనస్వభావము మూలకు త్రోయబడెను. 1920లో భారతదేశ టెర్రరిస్టులపై నదిమంచిఫలితము కలుగజేసెను. అనేకమంది యా సంఘము నుండి విరమించిరి. మిగిలినవారు కూడ సందేహమనస్కులై దౌర్జన్య కృత్యములను మానివేసిరి. దానికిప్పుడు వారిమీద నట్టిపలుకుబడి లేదు. అసహకారోద్యమములోను, శాసనోల్లంఘనములలోను ప్రధానపాత్రలనుధరించి. దౌర్జన్యరాహిత్యపద్ధతియొక్క యంతరార్థములకనువగునట్లు జీవించుటకు మనఃపూర్వకముగ ప్రయత్నించిన యనేకమంది కాంగ్రెసు వారుకూడ కాంగ్రెసులోనుండవచ్చునుకాని కాంగ్రెసు భ్రష్టులవలెనే భావింపబడుచున్నారు. దౌర్జన్యరాహిత్యము నొక మతముగ, సిద్ధాంతముగ సంగీకరింపకజాలకపోవుట పోరాడతగిన యేకైక లక్ష్యమని వారు భావించిన సామ్యవాద ప్రభుత్వ లక్ష్యము—అందరకు సమాన న్యాయము, సమానావకాశములు; ప్రస్తుతమున్న స్వంతఆస్తి హక్కులను ప్రత్యేకాధికారములను చాలవరకు రద్దుచేసి యేర్పాటుచేయు సంఘము పీడకపోవుట వారు చేసిన పాపములు. గాంధీజీ మహాశక్తి సంపన్నుడు అతనిదౌర్జన్యరాహిత్యము శక్తివంతమైనది, చైతన్యముతో నుట్టిపడు స్వభావముకలది. అతడు దేశమును తిరిగి యెప్పుడుద్దీపితము చేయునో యెవరికిని తెలియదు. అతనిగొప్పతనము, అతనివిరుద్ధములు ప్రజలను కదల్చునతనిశక్తి యపారములు. అతడు మామూలుప్రమాణముల కతీతుడు. మన మితరులను కొలవేయునట్లుపరీక్షించు నట్లతనిని

కొలవేయజాలము; పరీక్షింపజాలము. కాని, యతని శిష్యులమని చెప్పు కొనువారు చాలమంది పసలేని స్వాప్తి వాచకులు: లేక టాల్‌స్టాయి మాదిరి సాత్త్వికులు, లేక జీవితముతోను, సత్యముతోను సంబంధము లేని యొక సంకుచిత సంఘ సభ్యులు. వారు ప్రస్తుతక్రమమును నిలుపు కొనజూచువారి ననేకమందిని (దీనికొరకు దౌర్జన్యరాహిత్యము క్రింద శరణుజొచ్చువారిని) తనచుట్టు జేరతీయుదురు. ఈ విధముగ స్వార్థము జొరబడి శత్రువునుమార్చువిధానము దౌర్జన్యరాహిత్యముకేంట నిజపరి వర్తనముగ పరిణమించి శత్రువుతో నేకీభవించునట్లు చేయును. ఉత్సాహముతగ్గి మనము దుర్బలులమైనపుడు కొంచెము వెనుకకుపోవలెనను స్వభావము, రాజీస్వభావము, ఎల్లప్పుడు నుండును. ఇది శత్రువును మార్చుకళయని పిలుచుట సుఖావహముగనుండును. ఒక్కొక్కప్పుడు పాత స్నేహితులను బలివేసి యీలబ్ధిని సంపాదింతుము. మన క్రొత్త స్నేహితులకు కోపము కలిగించునట్టివారి యధిక ప్రసంగములను వాక్యములను గ్రహించి వారు మన బలగములోని యైక్యమును భంగముచేయుచున్నారని దూషింతుము. సాంఘిక క్రమములో యదార్థ పరివర్తనము తెచ్చుటకు బదులు వర్తమాన పద్ధతిలోని యుదారతకు, దయకు ప్రాశస్త్యమిత్తుము. ఉన్న స్వార్థములు యథా ప్రకారముగనే యుండును.

సాధనయొక్క ప్రాముఖ్యతను యెక్కువ స్థాయిలో నుంచి గాంధీజీ మనకుగొప్ప సేవచేసెనని నేను విశ్వసించెదను. అయినప్పటికి తుదిమాట విధాయకముగ మన దృష్టిలోనున్న లక్ష్యమునుగురించియే యుండవలెను; మనము దానిని భావింపజాలనిచో స్పష్టమైన లక్ష్యము లేని ద్రిమ్మరుల మగుదుము. కాని పరికరములను నిర్లక్ష్యము చేయుటకు వీలులేదు. ఏలనన నైతిక విషయమటులుండ వానికి కార్యసాధక శక్తికూడ కలదు. దుష్టములు, నవినీతిక గములగు పరికరములు తరచు దృష్టిలోనున్న లక్ష్యమునే విఫలముచేయును. లేదా యనేక క్రొత్త సమస్యల నుత్పన్నముచేయును. ఇంతకు మన లక్ష్యముచేతగాక మన మవలంబించు పద్ధతులచేతనే యదార్థముగ పరీక్షింపబడుదుము.

అనవసర పోరాటములకు, ద్వేషములకు కారణమగు పరికరముల వలన మన లక్ష్యమును సాధించుట మరింత కష్టము, దూరము నగును; సాధనసాధ్యములు నిశ్చయముగ నతి విశేషసంబంధము కలిగియుండుటచే మనము వానిని వేరు చేయజాలము. గాంధీజీ నైతిక శిక్షణమును కఠినముగ శాసించుటకూడ చాల యవసరము. కాని, వ్యక్తులకు సంబంధించిన యతని శిక్షాప్రమాణములు చర్చనీయములు. అతడు సాంఘిక దోషములకంటె వ్యక్తి దోషములకు, లోపములకు విశేషప్రాముఖ్యత నిచ్చెను. దీని యావసరము స్పష్టముగనేయున్నది. ఏలనన యెడారిని వీడి ప్రత్యేకహక్కులుగల వర్గములతో నధికారస్థానములలో దూరవలెననెడు మోహ మనేకమంది కాంగ్రెసువారిని లాగివేసెను. ముఖ్యుడైన కాంగ్రెసువాని కా ద్వార మెవ్వడూ తెరువబడియే యుండును.

నేడు ప్రపంచమంతయు 'పంచాగ్నుల' నడుమ నున్నది. కాని వానిలో నాత్మవ్యాధి యతి విశేషముగ నున్నది. ఇది ముఖ్యముగ తూర్పు దేశములలో నున్నది. నవీనముగ నితరచోట్లకంటె ఆసియాలో నెక్కువ మార్పులు కలిగెను. వానికి సరిపెట్టుకొనవలసిన విధానము చాల బాధకరముగనున్నది. పరిస్థితులను పరిపాలించు రాజకీయసమస్య యన్నిటికంటె తక్కువ ప్రాముఖ్యతకలది. మన కది ప్రధానసమస్య. యదార్థమైన సమస్యలను చేబట్టుటకు పూర్వ మిది తృప్తికరముగ పరిష్కరింపబడవలెను. మనముయుగములనుండిమార్పు చెందుచుండని యొక మూల సాంఘికక్రమమున కలవడిపోతిమి. మనలో చాలమంది యది యొక్కటియే సాధ్యము, యుక్తము నగు సాంఘికపునాది యని యింకను విశ్వసించుచు మన నైతిక భావములను దానితో మేలవింపజేయుచున్నాము. కాని గతకాలమును వర్తమానముతో గుదిగుచ్చవలెనను మనయత్నములు విఫలమగును. "చివరకు గతిలేక ఆర్థికనీతులార్థికావసరములను కనిపెట్టుకొనియుండును" అని వెబ్లను చెప్పెను. నేటి యావసరములు వానిప్రకార మొక నూతననీతిని సృష్టించుకొనునట్లు మనలను బలవంతపరచును. మన మీ యాత్మవ్యాధినుండి బయటపడి

నేటియదార్థమైన యాధ్యాత్మిక విలువలను తెలిసికొనవలెననిన నేమతముయొక్క సిద్ధాంతములవెనుకను శరణు పొందక సారాంశములను నిర్మొగమాటముగ, ధైర్యముగ నెదుర్కొనవలెను మతము చెప్పునది మంచిదికావచ్చును చెడ్డదికావచ్చును. కాని యది దానిని చెప్పువిధమును దానిని మనము విశ్వసింపవలెననుటయు నేసమస్యను వివేచనతో యోచింపవలెననుదానిని దోహదముచేయదు. ఫ్రూడ్ చెప్పినట్లు మతసిద్ధాంతములు "మూడుకారణములచే విశ్వసనీయార్హములగుచున్నవి. మొదటిదానినిమనపితామహులిదివరకే విశ్వసించిరి; రెండవది యీప్రాచీనకాలమునుండియే మనకందజేయబడిన రుజువులు కలవు. వాని యదార్థ్యములను మనమెంతమాత్రము శంకింపరాదని నిషేధింపబడినారము"

దౌర్జన్యరాహిత్యమును, తత్సంబంధములను మనము మతదృష్టితోను సిద్ధాంతదృష్టితోను విచారింపవలసినయెడల వాదమునకు స్థానముండదు అదియొక తెగకు సంబంధించు సంకుచిత సిద్ధాంతముగ తయారగును. దానినిప్రజలంగీకరింపవచ్చును అంగీకరింపకపోవచ్చును. దానిశక్తియు, వర్తమానసమస్యల కన్వయము తగ్గిపోవును. కాని, ప్రస్తుతపరిస్థితులకు సంబంధించునట్లు మనము దానిని చర్చింప సంసిద్ధులమగుదుమేని యీప్రపంచమును పునఃసృష్టిచేయు మనయత్నములకది యెంతయో తోడ్పడగలదు. ఈ చర్చలో సాముదాయక మానవునియొక్క స్వభావము, దుర్బలత్వము మనము పరిగణింపవలెను బాహుళ్యముమీద జరుగుయేకార్యమైనను,ముఖ్యముగగొప్పమార్పులను విప్లవకరములగు మార్పులను కోరుయేకార్యమైనను, నాయకులు దానినిగురించి యోచించువిధమునగాక వర్తమాన పరిస్థితులనుబట్టియు నంతకంటె నెక్కువగ వారెవరితో పనిచేయుదురో యట్టి మానవలోకము దానిని భావించు విధమునుబట్టియు ఫలించును.

ప్రపంచ చరిత్రలో దౌర్జన్యము విశేషపాత్ర వహించెను. నేడది తత్తుల్యమైన ప్రాముఖ్యతనే వహించుచున్నది. బహుశఃచాల కాలమువరకది యట్లేచేయును. గతమార్పులు చాలవరకు దౌర్జన్యము

చేతను, బలవంతముచేతను చేయబడెను. డబ్ల్యూ, గ్లాడ్‌స్టను ఒకసారి యిట్లు చెప్పెను. "రాజకీయవిషమపరిస్థితులలో దేశప్రజలకు దౌర్జన్యమును ద్వేషింపుడు. క్రమమును ప్రేమింపుడు, ఓర్పు వహింపుడు, అనుసందేశములుతప్ప మరేవియు నీయబడనిచో దేశ స్వాతంత్ర్యము లెన్నటికి సాధింపబడియుండెడివి కావు."

అప్పుడు, యిప్పుడు దౌర్జన్యప్రాముఖ్యతను నిర్లక్ష్యముచేయుట సాధ్యముకాదు. అట్లుచేయుట జీవితమును నిర్లక్ష్యము చేయుటయే యగును. అయినను దౌర్జన్యము నిస్సందేహముగ చెడ్డది అది దాని వెనుక నంతములేని చెడుఫలితములను విడిచిపెట్టును. తరచు దౌర్జన్యముతోనుండు ద్వేషము, క్రౌర్యము, పగ, శిక్షించుట—యనుభావములు దౌర్జన్యముకంటెను చెడ్డవి. నిశ్చయముగ దౌర్జన్యము వస్తుతః చెడ్డది కాదు. దానితోనుండు యీ భావములచేతనే యది చెడ్డదియగుచున్నది. ఈ భావములులేని దౌర్జన్య ముండవచ్చును మంచి, చెడ్డకూడ దౌర్జన్యముండవచ్చును. కాని యీ భావములనుండి దౌర్జన్యమును వేరుచేయుట దుర్ఘటము. కనుక సాధ్యమైనంతవరకు దౌర్జన్యమును తప్పించుట వాంఛనీయము. అయినప్పటికి దానిని తప్పించుట కంత కంటె నెక్కువగ చెడుగులకు లొంగిపోవు శూన్య స్వభావమునుమన మంగీకరింపజాలము. దౌర్జన్యమునకు లొంగుట, లేక దౌర్జన్యము మీద నాధారపడిన యన్యాయ పరిపాలన నంగీకరించుట దౌర్జన్య రాహిత్యతత్త్వమునే వ్యతిరేకించుట యగును. దౌర్జన్యరాహిత్య పద్ధతి శక్తివంతముగనుండి యట్టిప్రభుత్వమును, సాంఘిక క్రమమును మార్చునట్టిశక్తి కలిగియుండవలెను.

అది యట్లుచేయగలదో లేదో నాకు తెలియదు. అదిమనలను చాలదూరము తీసికొని పోగలదని నేను భావించెదను—కాని, యదిమన లను తుదిలక్ష్యమునకుతీసికొనిపోగలదాయని నేను శకింతును. అదెట్లు జరిగినను యేదో యొకవిధముగు నిర్బంధము విధాయకమని తోచును. సంఘములోనున్న ప్రస్తుత పోరాటములు—జాతీయములు, తరగతుల మధ్య—నిర్బంధమువలనగాని యెన్నడు నిర్మూలింపబడనేరవు. నిశ్చయ

ముగ గొప్పమార్పు యుండితీరవలెను; ఏలనన విశేషజనము మారిన గాని సాంఘిక పరివర్తనోద్యమమునకు నిజమైనయాధారముండనేరదు. కాని, కొంతమందిమీాద నిర్బంధముండును. ఈ మూలవిరోధములను దాచిపెట్టి యవి లేవని చూప యత్నించుటయుక్తము కాదు. అది సత్యము నణచివేయుటయే గాక యదార్థములనుగురించి ప్రజలను తప్పుమార్గమున పెట్టి వర్తమానక్రమమును ప్రత్యక్షముగ సమర్థించుటయగును; తమ ప్రత్యేకహక్కులను సమర్థించుకొనజూచు పాలక తరగతులకు నైతికాధారము నిచ్చుట యగును ఒక యక్రమపద్ధతి నెదుర్కొనుట కది యే యసత్యసిద్ధాంతములపై నాధారపడెనో వానిని బయటపెట్టిసత్యమును విశదముచేయవలెను. అసహాయోద్యమములో నొక సుగుణమేమనిన నది యీ అసత్యసిద్ధాంతములనుబయల్పరచును.

తరగతులు లేని సంఘమును స్థాపించుట మన పరమలక్ష్యము. అందరకు సమానార్థికన్యాయము, సమానావకాశములు, మానవ లోకము నున్నతమైన యార్థిక వైజ్ఞానిక స్థాయికి తెచ్చుట కేర్పాటు చేయబడిన పునాదిమీాద స్థాపింపబడుసంఘము,ఆధ్యాత్మిక ప్రయోజనములను, సహకారమును, స్వార్థరాహిత్యమును, సేవాతత్త్వమును, న్యాయమునుచేయవలెనను కోరిక, సుహృద్భావము, ప్రేమ — ఈ యన్నింటిని దోహదముచేసి చివరకు ప్రపంచక్రమమును, కళ్యాణమును సాధించుసంఘము దీని కడ్డమువచ్చిన ప్రతిదానిని మెల్లగా తొలగింపవలెను. అవసరమైనచో బలవంతము నుపయోగింపవలెను. తరచు నిర్బంధ మవసరమగు ననుట కెట్టి సందేహము లేదు. కాని, బలవంతమును ద్వేష, క్రౌర్యములతో గాక నభ్యంతరమును తొలగింపవలెనను యుదారకోరికతో నుపయోగింపవలెను. అది కష్టమే యగును. అది సులభమైన పనికాదు. సుకరమైన మార్గమేదియును లేదు. అసంఖ్యాకములగు గోతులును కలవు. కాని, కష్టములు, గోతులు మనము వానిని చూడనిచో మాయము కాజాలవు. వాని నిజస్వభావమును గ్రహించి మనము వానిని ధైర్యముగ నెదుర్కొనవలెను. ఇదియంతయు గగనకుసుమమువలె, వాయుసౌధమువలె

కాన్పించవచ్చును. ఈ యుదారభావములచే ననేకమంది ప్రేరేపింప బడకపోవచ్చును. కాని, మనము దానిని దృష్టిలో నుంచుకొని బలపరచవచ్చును; క్రమముగ నవి రాగ, ద్వేషములను తగ్గింప వచ్చును.

మన వర్ధితులీ లక్ష్యమునకు తీసికొనిపోవలెను ఈభావములమీద నాధారపడవలెను. కాని, మానవస్వభావము (సమూహముమీద) దాని తత్వమునుబట్టి మన పినతులను, బోధలను యెల్లపుడు మన్నింపదనియు లేక నున్నత నైతిక సూత్రములను బట్టి యాచరింపదనియు గుర్తింపవలెను. మార్పుకుతోడు తరచు నిర్బంధముకూడ నుండవలెను. ఈ నిర్బంధమును నియమించి దాని చెడుగు తగ్గిపోవువిధమున నుపయోగించుటయే మనము చేయుగల యుత్తమ కార్యము.

# 64

## తిరిగి డేరా జయిలు

ఆలీపూరుజయిలులో నాస్వాస్థ్యము చెడి నా బరువు తగ్గుటచే నేను డెహారాడూనుజయిలుకు బదిలీచేయబడితిని. నా బదిలీకి నేను సంతోషించితిని. కాని, యీ సారి బాగుచేసి యమర్చబడిన పాత గొడ్లశాలలో నన్నుంచిరి. దానికొకవరండా, చిన్నదొడ్డి యుండెను. నా కది వెనుకటిదానికంటె బాగుగనున్నను యితరమార్పులు బాగుండలేదు. నే నచ్చట మూడు మాసములున్నను నాకీ సత్పర్వతదర్శనముకూడ లభింపలేదు. నా చుట్టున్నగోడ వెనుకటికంటె బాగుగ యెత్తుచేయబడెను. నన్ను జయిలు ద్వారముముందర తిరుగనీయలేదు. నా చిన్న దొడ్డియే నా వ్యాయామమునకు చాలినంత పెద్దదియని భావింపబడెను.

ఇవియు, మరికొన్ని నూతననిర్బంధములు నాకాశాభంగముగ నుండెను. నాకు కోపముకలిగెను నేను నిస్పృహుడనై నా కవకాశ మున్న యాకొద్దివ్యాయామమును తీసికొన నిచ్ఛగింపకుంటిని. నేను మున్నెన్నడు ప్రపంచసంబంధమంతయు తెగి యంత యేకాకిగనుండ లేదు. దీనివలన నా నరములు క్రుంగనారంభించి శరీర, మానసిక క్షైణ్యమునొందితిని. నా గోడకవతల కొన్ని యడుగుల దూరములో రమణీయత, పరిమళము, శార్వలసౌంధము కండ్లకింపుగూర్చు భూమి, దూరములోని వృక్షవాటికలు కలవని నే నెరుగుదును. కాని యవయన్నియు నాకందనిమాటలు. ఎల్లప్పుడు ఆగోడలనే చూచు చుండుటచే నాకండ్లలసిపోయిబరువెక్కెను నన్నుప్రత్యేకముగనుంచు టచే జయిలోనుండు మామూలు కదలికకూడ నాకులేకుండెను.

ఆరువారములైన తరువాత వర్షము లారంభించెను. ఉష్ణము తగ్గెను. వాతావరణముమారెను. నూతనజీవితముపొడసూపెను. నాశరీ రము చల్లబడి విశ్రాంతినొందెను. కాని, నా కండ్లకు మనస్సుకు విశ్రాంతిలేదు. ఒక్కొక్కప్పుడు నా దొడ్డి యినుపతలుపు తెరువబడు చుండెడిది. హఠాత్తుగ నాకు బహిఃప్రపంచము వర్ణములతో ప్రకాశిం చుచు ముత్యములవంటి వర్షబిందువులతో మెరయు పచ్చనిపొలములు

రెట్లు కాన్పించెడివి. ఒక్క క్షణికకాలము! ఇంతలో తలుపు దభాలున మూయబడెడిది. నేను దగ్గరనున్నచో మరింత జాగ్రత తీసికొనవలసినదని హుకుము! ఆ క్రొత్తదన, పచ్చదనముల యీషద్దర్శనము నాకు స్వదేశభ్రాంతి కొల్పెడిది. హృదయవేదన కలిగెడిది. తలుపు తెరువబడినను కూడ నే నవతలకు చూచుట మాని వేయగోరితిని.

కాని, యీ విచారమంతయు, జయిలుదోషము కాదు బయట విషయములేవియు బాగుండలేదు. కమల యనారోగ్యముగనుండెను. రాజకీయములు నాకు బాధకరముగనుండెను కమల పురాతనవ్యాధి ముదురుచుండెను. నే నామె కేమియు సేవ చేయజాలని యసహాయుడ నైతిని విచారించితిని. నేనామె ప్రక్కనున్నచో పరిస్థితులు వేరుగ నుండెడివి.

ఇచ్చట నాకు దినపత్రిక వచ్చెడిది. మూడు సంవత్సరములైన తరువాత పాట్నాలో అ. భా. కాం కమిటీ సమావేశమయ్యెనని తెలిసికొంటిని. పరిస్థితులనుగురించి పూర్తియైన చర్చలు జరగకపోవుట నాకాశ్చర్యముగనుండెను. గాంధీజీ యెప్పటివలెనే డిక్టేటరువలె కాన్పించెను. "మీరు నా నాయకత్వమునను సరింపగోరుచో నా షరతులనంగీకరింపవలెను" అని యతడు చెప్పెను. అతనికోరిక చాల సహజముగనే యుండెను. ఏలనన మనమతనిని కావలెననికోరుచు నతని దృఢవిశ్వాసములకు వ్యతిరేకముగ నడుపమని చెప్పజాలము. పరస్పర చర్చలు జరిపి యొకనీతి నంగీకరించుటకంటె పైబలవంతమెక్కువగ నున్నట్లు కాన్పించెను. గాంధీజీ భావరాజ్యముచేయుచు ప్రజలయసహాయతను గురించి ఫిర్యాదుచేయుట చిత్రము. బాహుళ్యముమీద నతనిపట్ల చూపబడిన భక్తి, వినయవిధేయతలు మరెవరిపట్ల చూపబడలేదని నే ననుకొనెదను ప్రజలు తనుకోరకతనిచే నియమింపబడిన యున్నత ప్రమాణమును చేరజాలకపోయిరని నిందించుట యుక్తముగ కాన్పించదు. హరిజనోద్యమప్రచారములోనుండుటచే నతడు పాట్నాలో సభ పూర్తియగువరకుకూడ నుండలేదు. అ. భా. కాం. కమిటీ వ్యవహార దక్షతను చూపవలెననియు వెంటనే వర్కింగుకమిటీవారి తీర్మానముల నమలుపరుపవలెననియు చెప్పి యతడు వెళ్ళిపోయెను.

దీక్షచర్చవలన విషయములు చక్కబడనేరవనుట నిజము. సభ్యులలో నిశ్చయభావములు లేకుండెను. విమర్శించువారే కాని నిర్మాణసూచనలను చేయువారులేరు శాసనోల్లంఘన మాపివేయు టకే నిశ్చయింపబడెను. తరువాత నేమిజరుగవలెను ? రెండు కక్షలు బయలుదేరెను. ఒకరు చట్టసమ్మతిమైన కార్యములను చేయ వలెననిరి. రెండవవారు అస్పష్టసామ్యవాదపద్ధతిని భావించుచుండిరి. సభ్యులలోని యధికసంఖ్య యిరుకక్షులకు చెందరు. వారు చట్టసమ్మత కార్యములకు మరలుట కిచ్చగింపరు. సామ్యవాదమునిన భయము. సృజనభావములు లేవు. వారికి గాంధీజీయే జీవగఱ్ఱ. వెనుకటివలెనే వారతని ననుసరించిరి. గాంధీజీబలమువలన మితవాదులకు కమిటీ లోను కాంగ్రెసులోను బలముకలిగెను.

ప్రభుత్వము కాంగ్రెసుపై నిషేధమును తొలగించుటచే నది క్రమసంఘమయ్యెను. కాని, దాని క్రిందిసంఘములు, తత్సంబంధ సంఘము—వాలంటీరుశాఖ, సేవాదళము, కిసానుసభలు, అనేక విద్యాసంస్థలు, యువజనసంఘములు, యివన్నియు నింకను బహిష్కారములోనే యుండెను. ప్రత్యేకము 'ఖుదాయిూఖిద్‌మత్‌గార్స్' లేక 'సరిహద్దుయెఱ్ఱచొక్కాలు' నిషేధములోనుండెను ఇది 1931 లో కాంగ్రెసులోజేరి యీ రాష్ట్రప్రాతినిధ్యము వహించెను. ఈవిధముగ కాంగ్రెసు ప్రత్యక్షకార్యవిధానమును మానుకొనినను ప్రభుత్వము శాసనోల్లంఘనము కొరకు కేర్పరచిన ప్రత్యేకశాసనముల నట్లే యుంచెను. లేబరుయూనియనులమీద, రయితుసంఘములమీద, ప్రత్యేకనిఘాయుంచి యుత్తమప్రభుత్వాధికారులు జమీందారులను భూస్వాములను యేకముకావలెనని ప్రోత్సహించుచుండిరి.

హిందూ, ముస్లిము కులతత్వముయెడల నేనెన్నడు పక్షపాతము వహింపలేదు. హిందూమహాసభ కార్యదర్శియొకడు "యెఱ్ఱ చొక్కాల" నిషేధము నామోదించుచు ప్రభుత్వభుజమును తట్టుటచే నా కాసభపై మంటపుట్టెను. ఒదుదుడుకు యుద్యమమేదియు లేనపు ప్రాతిపదిక నాగరికహక్కులను లాగివేయుటనా కాశ్చర్యముకలిగిం

చెను. ఈ సిద్ధాంతముసంగతి యట్లుండ యీసంగ్రామ సంవత్సరము లలో సరిహద్దు ప్రజ లత్యద్భుతముగ ప్రవర్తించిరనుట జగద్విదితము. వారి నాయకుడు ఖాన్‌అబ్దుల్‌గఫ్ఫూర్ఖాన్ యింకను విచారణలేకుండ ప్రభుత్వఖయిదీగ జయిలులోనుండెను. కులద్వేషము లింతకంటె ముందుకు పోజాలనట్లు నాకు కాన్పించెను. హిందూ మహాసభా ప్రధాన నాయకు లీభావమునంగీకరింపనట్లు వెంటనే ప్రకటింతురని నేనాశించి తిని. కాని, నాకు తెలిసినంతవరకు దీనినిగురించి వారెవరు వల్లెత్తు మాట రానీయలేదు. ఈ కార్యదర్శియొక్క స్టేటుమెంటు నన్ను తారుమారుచేసెను. ఆ మందు వేసవియుష్ణతచే నేనొక మధ్యాహ్నము వేళ కునికిపాట్లుపడితిని నాకొకచిత్రమైన కలవచ్చెను. అబ్దుల్ గఫ్ఫూర్ఖాను అన్నివైపులనుండియు ముట్టడింపబడుచుండెను. అతనిని రక్షించుటకు నేను పోరుచుంటిని. అలసియున్న స్థితిలో దుఃఖాక్రాంతుడ నగుచు నేను మేల్కాంచితిని. నా తలగడ కన్నీటిచే తడిసియుండెను. ఇది నాకాశ్చర్యముగ నుండెను. నా జాగ్రదవస్థలో నే నెన్నడు నట్టి భావప్రకోపము నెరుగను.

ఈ సమయముననే చేయబడిన కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానము 'స్వాంతయాస్తిని లాగుకొనుట, వర్గపోరాటములనుగురించి చేయబడు స్వైరసంభాషణనుబట్టి' చేయబడెను. కరాచీ తీర్మానము 'యుక్తకారణము, తగిన పరిహారము లేనిదే స్వాంతయాస్తిని వశపరచు కొనుటను, తరగతులమధ్య పోరాటమును, ప్రోత్సహింపదు. మరియు వర్కింగుకమిటీవారు వర్గపోరాటము, ఆస్తిని వశపరచుకొనుట కాంగ్రెసు సిద్ధాంతమైన దౌర్జన్యరాహిత్యమునకు వ్యతిరేకమని యభి ప్రాయపడుచున్నారు' నన్ను బాధించెను. ఇందులోని పదములు సరియైన యర్థములలో నుపయోగింపబడలేదు, నిశ్చయముగ నిది సామ్యవాదపక్షముపై గురిపెట్టబడెను. వర్గపోరాటమన నేమియో తీర్మానము తయారుచేసినవారికి తెలియదని యిది స్పష్టముచేయుచున్నది. బాధ్యతగల సామ్యవాదు లాస్తినివశపరచుకొనుటనుగురించి మాట్లాడి యుండలేదు. ప్రస్తుతపరిస్థితులలో వర్గపోరాటమున్నదని తరచుచెప్ప బడెను. ఇట్టి విశ్వాసముకలవా రెవరును కాంగ్రెసులో మామూలు

సభ్యులుగకూడ నుండరాదని వర్కింగుకమిటీ తీర్మానము సూచించు నట్లు కాన్పించును. సామ్యవాదము నామోదించెనని, స్వంతయాస్థికి వ్యతిరేకమని యెవరును కాంగ్రెసు నెన్నడును దూషించియుండలేదు. కొంతమంది సభ్యు లట్టిభావములను కలిగియుండిరి. కాని, సమస్తము నాలింగనముచేయు నీ జాతీయసంస్థలో సాధారణ సభ్యులుగ నుండు టకుగూడ వారి కివ్వ డాస్కారము లేనట్లు కాన్పించును.

రాజు లగాయతు గర్భదరిద్రునివరకు గూడ కాంగ్రెసు ప్రాతి నిధ్యము వహించునని తరచు చెప్పబడెను. తరచు జాతీయోద్యమము లిట్టియధికారము చాటుచుండును. అనగా నవి జాతిలోనున్న యధిక సంఖ్యాకులకు ప్రాతినిధ్యము వహించుననియు, వాని నీతి యందరి ప్రయోజనములను కోయుననియు భావము. కాని యీ యధికారము నిలుచునదికాదని దాని ముఖముమీదనే వ్రాయబడియున్నది. ఏ రాజ కీయ సంస్థయు భిన్నలక్షణములను తెలియజేయజాలవి, బింకములేని నిరర్థకమవ్వ కాకుండ పరస్పర విరుద్ధప్రయోజనములకు ప్రాతినిధ్యము వహింపజాలదు. కాంగ్రెసు రాజకీయాధికారమును సాధించునిశ్చయ మైన లక్ష్యమును, వేదాంతమును గలిగిదానిని జాతీయకళ్యాణమునకు వినియోగించు రాజకీయ కక్షయైనను కావలెను. లేదా యది స్వంత యభిప్రాయములు లేక నందరను నాశీర్వదించు కేవల భూతదయా శుత్త్వము గల సంస్థయైనను కావలెను. ఆ లక్ష్యమును, ఆ వేదాంత మును, సాధారణముగనంగీకరించువారికే యది ప్రాతినిధ్యమువహింప గలదు. దీనికి వ్యతిరేకులు జాతికిని, సంఘమునకును విరోధులనియు, నభివృద్ధిభంజకులనియు దానిచే భావింపబడుదురు. తన నిజవేదాంతము నమలుపరచుటకు వీరిప్రభను నిరోధింపవలెను. లేదా తొలగింప వలెను. జాతీయమైన సామ్రాజ్య వ్యతిరేకోద్యమము సాంఘిక పోరా టములజోలికి పోదుకనుక, నట్టి యంగీకారమున కెక్కువ యాధార ముగ నుండగలదనుట సత్యము. కనుక కాంగ్రెసు హిందూదేశప్రజల యొక్క యధికసంఖ్యాకులకు భిన్నవరుసలలో ప్రాతినిధ్యము వహిం చెను. అది సామ్రాజ్యవ్యతిరేక సమస్యమీద నంగీకారముగల పరస్పర

విరుద్ధవర్గములనుతనలో నిముడ్చుకొనెను. ఈప్రధాన సారాంశమునకు భిన్నాభిప్రాయములు కలవారు కాంగ్రెసులో జేరక ప్రభుత్వయండ జేరిరి. ఈవిధముగ కాంగ్రెసు ఒక విశ్వాసముచేతను, శక్తివంతుడగు గాంధీజీ ప్రభచేతను బంధింపబడిన యనేక వర్గములు గల శాశ్వత యఖిలపక్ష వర్గమయ్యెను.

తరువాత వర్కింగుకమిటీ వర్గపోరాటమును విశదముచేయ యత్నించెను. ఈతీర్మానములోని భాష యదిచేసిన నిశ్చయము ప్రధానములు కావు. అది కాంగ్రెసు పోకడలకు మరియొక సూచన రాబోవు అసెంబ్లీ యెన్నికలలో ధనవంతుల సహాయము పొందుటకు క్రొత్తపార్లమెంటరీపక్షమువారి ప్రోత్సాహముచే నీతీర్మానము పొసగెను. వారి ప్రోత్సాహముచే మితవాదులను, కన్సర్వేటివులను కలుపుకొనుటకు కాంగ్రెసు అంతకంతకు కుడివైపు చూచుచుండెను. కాంగ్రెసును ప్రతిఘటించి శాసనోల్లంఘనకాలమున ప్రభుత్వముతో జేరినవారియెడల బుజ్జగించువాక్యములు ప్రయోగింపబడుచుండెను. అడ్డగీటు పెట్టుచు, విమర్శించుచుండు యెడమపక్ష మీా 'మార్పు'కు, రాజవిధానమునకు వ్యతిరేకమని తలంపబడెను. ఎడమపక్షమువారి దోషారోపణమువలన కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారు తమ నూతనపద్ధతిని వీడజాలరని వర్కింగుకమిటీ తీర్మానము, వ్యక్తుల యుపన్యాసములు విశదముచేసెను. ఎడమపక్షమువారు యుక్తముగ ప్రవర్తింపనిచో కాంగ్రెసునుండి వెలివేయబడుదురు. కాంగ్రెసుపార్లమెంటరీబోర్డువారు జారీచేసిన ప్రకటన కాంగ్రెసు గత పదిహేను సంవత్సరములలో చేసిన ప్రకటనలకంటె జాగ్రతగను, మితముగను. నుండెను.

డేరాడూనుజైలులో కొంతవరకు నాభావములీవిధముగనుండెను బయటప్రపంచములో నాకు సంబంధము లేకపోవుటచే పరిస్థితులను గురించి నేను నిశ్చయాభిప్రాయముల నేర్పరచుకొనజాలకపోతిని. బాహ్యసంపర్కమున్నచో బహుశః నా భావములు కొంత మారి యుండవచ్చును.

వర్తమానముతో విసుగుచెంది నేను భూతకాలములో మునిగితిని. నేను ప్రజావ్యవహారములలో పాల్గొన నారంభించిన తరువాత భారతదేశములో రాజకీయముగ నేమిజరిగెను? మేము చేసిన దెంత యుక్తము? ఎంతయయుక్తము? నాభావములను లిఖితముచేసినచో నవి యెక్కువ క్రమయుక్తము సహాయకారిగనుండునని నాకు తట్టెను. ఇది నావిచారములనుండి నిరుత్సాహములనుండి నామనస్సును తప్పించును. కనుక 1934 జూన్ నెలలో నే నీ 'ఆత్మకథను' ఢేరాడూనుజయిలులో ప్రారంభించితిని. నాకు వ్రాయవలెనను బుద్ధిపుట్టినప్పుడెల్ల వ్రాయుచు నెనిమిదిమాసములు వ్రాసితిని. తరచు మధ్యమధ్య కాళీలువచ్చుచుండెను. మూడుసార్లు మూడునెలలు అట్టికాళీలువచ్చెను. కాని, నేను దీనిని సాగించుచు నిప్పుడీ వ్యక్తిగత ప్రస్తావముచివరకువచ్చితిని. ఇందులో చాలవరకు నిరుత్సాహముచేతను, భావ ప్రకోపముచేతను నేను బాధపడుపరిస్థితులలో వ్రాయబడెను. బహుశః యిది కొంత నేను వ్రాసినదానిలో ప్రతిబింబించియుండవచ్చును. కాని, యీ వ్రాతయే నా ప్రస్తుత విచారములనుండి నన్ను తప్పించుటకు చాలవరకు తోడ్పడెను. నేను వ్రాయునపుడు బాహ్యపాఠకులనుగురించి భావించుచుండుట లేదు. నన్ను నేనే సంబోధించుకొనుచుంటిని. నేనే ప్రశ్నలను వేసికొనుచు నాయుపయోగముకొరకు నేనే సమాధానముల నిచ్చుకొనుచుంటిని. ఒక్కొక్కప్పుడు దీనితో కొంత వినోదించెడివాడను. నేను సాధ్యమైనంతవరకు సరళముగ భావింపగోరితిని. గత చరిత్రకు సంబంధించిన యీ విమర్శ నా కందులకు తోడ్పడునని యూహించితిని.

జూలై మాసాంతమునకు కమలయారోగ్యము శీఘ్రముగ చెడిపోవుచు కొద్దిరోజులలో విషమపరిస్థితి యేర్పడెను. ఆగష్టు 11వ తేదీని నన్ను ఢేరా జయిలునుండి పోలీసులలహాబాదు తీసికొనివచ్చిరి. అచ్చట జిల్లామేజిస్ట్రేటు బాధపడుచున్న నాభార్యను చూచుటకునన్ను తాత్కాలికముగ విడిచిపెట్టుచున్నామని చెప్పెను. నా కప్పుడే జయిలులో నారుమాసములు నిండెను.

# 65

## పదకొండు రోజులు

"శక్తి శాశ్వతము; రోదన క్షీణించును; శరీరము నశించును, ఆత్మనశింపదు" బైరన్.

నా విడుదల తాత్కాలికము. కమల శల్యావశిష్టమయి, తనవ్యాధితో పోరాడుచు ఛాయవలె నుండెను. ఆమె నన్ను వీడవచ్చుననుభావను నాకుదుర్భరముగనుండెను మా వివాహమయి పదునెనిమిది సంవత్సరముల యూరుమాసములయ్యెను నా మనసొక్క సారి యాదినమును స్మరించెను. ఈ కాలము మే మనుభవించినసమస్త మును సంస్మరించెను నా కపుడిరువదారేండ్లు ఆమెకు పదిహేడు సుమారుగ నుండెను. ఆమెప్రపంచపోకడల నెరుగని కేవలయమాయక పశువు. మా వయోభేదము హెచ్చు. కాని మా మానసికదృష్టి భేదము మరింత హెచ్చు. ఆమెకంటె నేను చాల వృద్ధి చెందితిని. అయినప్పటికి నాలో నెంత ప్రపంచజ్ఞానము కాన్పించినను నేనుచాల కఠినతనముగ నుండెడివాడను. అభిమానరాశియైన యీ సుకుమార కన్య మనస్సు పుష్పమువలె నెమ్మదిగ వికసించుచున్నదనియు, దానికి సౌమ్యదోహద మవసరమనియు నేను గుర్తింపలేదు. మేమన్యో న్యానురాగము గలిగి సుఖముగనే జీవించెడివారము కాని, మా దృష్టులు వేరుగ నుండుటచే కొంత సరిపెట్టుకొనలేకపోయెడివారము. దీనివలన నప్పుడప్పుడు చిన్నచిన్న తగవులు – బాలబాలికల వ్యాపార ములవంటివి – స్వల్పవిషయములమీద కలుగుచు చిరకాల ముండక వెంటనే సమాధానము కలుగుచుండెడిది. ఉభయులము తొందర స్వభావము కలవారము; అభిమానవంతులము. మా గౌరవములను నిలబెట్టుకొనవలెననెడి కఠినతనపు భావము కలవారము. అయినప్ప టికి నెమ్మదినెమ్మదిగ సరిపెట్టుకొనుచు మా యనురాగము పెరిగెను. మా వివాహము జరిగిన యిరువదియొక్క మాసములకు మా యేకైక పుత్రిక యిందిర జనించెను.

మా వివాహము రాజకీయరంగ పరివర్తనలతో సమకాలిక మయ్యెను. నేను వానిలో మునుగుచుంటిని, అవి 'హోమురూలు' దిన

ములు వానివెంటనే పంజాబు సైనికశాసనము, అసహాయోద్యమము వచ్చెను. నేనంతకంతకు రాజకీయ ఝంఝామారుతములో నెక్కువగ తగుల్కొంటిని. వీనిపైనే నెక్కువగ కేంద్రీకరించుటచే బుద్ధిపూర్వకముగ నేనామెను నిర్లక్ష్యముచేసి యామెంగతికి విడిచివేసితిని. నిజముగ నప్పుడామెకు నా సంపూర్ణసహాయ మవసరముగ నుండెను. ఆమె యెడల నాప్రేమ యభివృద్ధిచెందుచుండెను. తన సాంత్వన వచనములతో నన్నోదార్చుట కామె యచ్చటనున్నదని తెలిసికొనుట నాకు సుఖావహముగనుండెను ఆమె నాకు పుష్టినిచ్చెను. కాని, తాను నిర్లక్ష్యము చేయబడినట్లు భావించి యామె బాధపడియుండవలెను.

తరువాత నామెను విడువని వ్యాధి, నేను చిరకాలము జయిళ్ళలో నుండుట! అప్పుడు, మేము జయిలుదర్శనములందు మాత్రమే కలుసుకొనుచుండెడివారము. శాసనోల్లంఘన మామెను మా సంగ్రాము ప్రథమశ్రేణిలోనికి లాగెను. జయిలుకు రాగలిగినందుల కామె యానందించెను. మేమంతకంతకు సన్నిహితుల మగుచుంటిమి. మా యపురూపసమ్మేళనములమూల్యములుగ నుండెడివి. మేము వాని కొరకెదురుచూచుచు రోజులను లెక్కించుకొను చుండెడివారము. మేమొకరితో నొకరము విసుగుచెందెడివారము కాము. మా కలయికలలలోను, స్వల్పకాలిక జీవితములోను క్రొత్తదనము. నూతనరుచి నవ్యశోభ యుండెడివి, ఒకరితో నొకరము నిరంతరము క్రొత్తవిషయము కనుగొనుచుంటిమి. ఒక్కొక్కప్పుడీ నూతన యావిష్కరణములు మాకు రుచించెడివికావు. మా వయసు మీరిన యనంగీకారములలోగూడ కొంత బాలబాలికా విచేష్టితముండెడిది.

పదునెనిమిదేండ్ల వైవాహికజీవితము గడపిన తరువాతగూడ నామె కన్యవలె, పడుచువలెనుండెను. ఆమె యెంతమాత్రము కుటుంబినివలె కాన్పించదు. ఆమె చాలకాలముక్రిందట మాయింటికి వచ్చిన వధువువలెనే యుండియుండవచ్చును. కాని, నేను చాలవరకు మారిపోతిని. నాలో నావయసుకుతగిన యర్హత, చురుకుదనము, లాఘవములున్నను—నాలో కొన్ని చిన్నతనపు లక్షణములుకూడ కలవని

చెప్పలేదుసు. నా ముఖవిలాసము నన్ను బయటపెట్టును. నేను కొంత బట్టతలవాడను; నా తల నెరిసెను; ముఖమున ముడతలుండెను. నా కండ్లచుట్టు శ్యామల ఛాయలుండెను కష్టములతోను, విచారములతోను కూడుకొనియున్న గతనాలుగేండ్లు నాపయి ననేక చిహ్నములను కలుగజేసెను ఈ చివర వత్సరములలో కమల నేను క్రొత్త ప్రదేశములకు పోయినపుడామెను నాకూతురని యనుకొనెడివారు. ఆమెయు, నిందిరయు నక్కచెల్లెండ్రవలె కాన్పించెడివారు.

పదునెనిమిదేండ్ల వివాహజీవితము! కాని, వానిలో నెన్ని దీర్ఘసంవత్సరములు నేను జయిళ్ళలోను, కమల యాస్పత్రులలోను, గడిపితిమి? ఇప్పుడు తిరిగి నేను జయిలులోనేయుండి కొద్దిదినములు బయటకువచ్చితిని. ఆమె వ్యాధిగ్రస్తురాలై, జీవితముకొరకు పోరాడుచుండెను. ఆరోగ్యమును సరిగ కాపాడుకొనలేదని నా కామెపై కొంచెము కోపము. అయినను నే నామె నెట్లు నిందింపగలను? జాతీయపోరాటములో తన సంపూర్ణ భాగమును వహింపజాలని యశక్తతకును, నిర్వ్యాపారత్వమునకు నామెయుత్సాహ మోర్పు వహింపజాలకుండెను. శరీరదుర్బలతచే నామె తగినంత చేయజాలక పోయెను. చికిత్సయు చేయించుకొనజాలకపోయెను. ఆమె యొంత రంగికాన్ని శరీరమును దహించివేసెను నే నెక్కువగ నభిలషించుచున్న యీసమయములో నామె నన్ను వీడిపోదు. మే మిప్పుడే యదార్థముగ నొకరినొకరము తెలిసికొని యర్థముచేసికొన ప్రారంభించితిమి. మాసంయుక్తజీవిత మిప్పుడే న్యాయముగ ప్రారంభమయ్యెను. మేమొకరిపై నొకర మంత యాధారపడితిమి. మేమిరువురము కలసి చేయవలసినదెంతయో యుండెను ఆమెను గంటగంటకు, దినదినము పరీక్షించుచు నేనిట్లు తలపోయుచుండెడివాడను. సహచరులు, స్నేహితులు నాదగ్గరకురాగా నేనవరితోను చర్చించుట కిష్టపడలేదు. నాకు పరిస్థితులు తిన్నగా తెలియవు. స్వయముగ వ్యక్తులతో సంపర్కమున్నగాని యేమి చెప్పుటకు నేమిచేయుటకు వీలులేదని నా చిరయనుభవము బోధించెను. ప్రభుత్వము నాభార్యను చూచు

టకు నా యెడల చూపిన సరసతను నేను రాజకీయ ప్రయోజనముల కుపయోగింపదలచుకొనలేదు. నేనట్టి పబ్లికు స్టేటుమెంటును చేయలేదు. ప్రయివేటులో కూడ నే నట్టిసీతిని నిశ్చయించుకొనలేదు

కమలస్థితినిగురించి నేను గాంధీజీకి తెలిపితిని. నా మానసిక స్థితినిగురించికూడ నీ సద్భావమును వెల్లడించితిని. ఇటీవల విషయములుకొన్ని నాకు బాధకరముగ, విచారకరముగ నుండెను. నా యుత్తరములో నిది కొంత ప్రతిబింబించెను. ఏమిచేయవలెను, ఏమి చేయకూడదు అను విషయమై నేనేమియు సూచింపలేదు జరిగిన దానినిగురించి నాభావములను వెల్లడించితిని ఆ యుత్తరము భావోద్రేకపూరితముగ నుండెను. అది గాంధీజీకి చాల బాధను కలిగించెనని నేను తరువాత తెలిసికొంటిని.

ప్రభుత్వపుపిలుపు వచ్చునని నేను దినదినము చూచుచుంటిని. అనేకవదంతులు బయలుదేరెను. బొంబాయి కాంగ్రెసు, నవంబరులోని అసెంబ్లీ యెన్నికలు లేనిచో నన్ను విడిచిపెట్టియుండెడివారట! ఇప్పుడే నన్ను విడిచివేసినను విడువవచ్చు ననిరి. నా విడుదలయైన పదకొండవదినము, ఆగష్టు 23 వ తేదీ వచ్చెను. పోలీసు మోటారు వచ్చెను. నేను నైనీజయిలుకు పోవలెనని ఆఫీసరు చెప్పెను. నేను నా స్వజనమువద్ద సెలవుతీసుకొంటిని. నేను మోటారుకు ఎక్కుచుండ వ్యాధిగ్రస్తురాలైన నా తల్లి చేతులు చాచుకొని నాయొద్దకు తిరిగి పరిగెత్తుకొనివచ్చెను. అప్పటి ఆమెవదనము నన్ను చాలాకాలము పీడకుండెను.

# 66

## తిరిగి జయిలుకు

నేను తిరిగి నైనీజయిలులో నుంటిని. నాకు క్రొత్త జయిలు ప్రారంభమైనట్లుండెను బయటనుండి లోపలకు, లోపలనుండి బయటకు నే నెట్టి రెక్కలచెండు నైతిని! ఇటు నటు యీ తిరుగుడువ్యాపారము నా శరీరస్థితిని భావోద్రేకముచే కదల్చివేయుచుండెను. నిరంతరము మార్పులకు సరిపెట్టుకొనుట సులభముకాదు. నన్ను నా వెనుకటి 6 నెం. కొట్టులో గాక మరియొక చోటుకు మార్చిరి. అందులో నిపుడొక విచారణ, శిక్ష లేని ఖయిదీ యుంచబడెను. అతనితో నన్ను కలుపుట భద్రము కాదని తలపబడెను.

రాత్రిందివములను నే నచ్చట గడుపుచుండినను నా మనమన్యత్రయుండెను, నా పునర్నిర్బంధమువలన కమలలో కలిగిన యభివృద్ధి చెడునని నేను భయపడితిని. అది అట్లే జరిగెను. కొన్ని రోజులు డాక్టరుల యభిప్రాయములను నాకు తెలియబరచిరి. రెండు వారములైన తరువాత నామె స్థితి క్రమముగ చెడుచున్నను వీని నాపివేసిరి. చెడువార్తలు, వానికొరకు వేచియుండుట దీనివలన రోజులు దీర్ఘములయ్యెను. రాత్రులొక్కొక్కప్పుడు మరింత యధ్వాన్నమయ్యెను. కాలము కదలనట్లుండెను. కదలినను కదలనంత మందముగ జరిగెను. ప్రతి గంట గండముగ, భయంకరముగ నుండెను. నన్ను తిరిగి నిర్బంధించి మాసముగడచిన తరువాత నొక పోలీసుఆఫీసరు కమలను చూచుటకు నన్ను దీసికొనివెళ్ళెను. నన్ను వారమునకు రెండుసారు లిట్లు తీసుకొనివచ్చుచుందు మని యతడు చెప్పి యీ కాలమునుకూడ స్థిరపరచెను. నేను నాల్గవరోజున వేచియుంటిని. నాకొరకెవరునురాలేదు. అయిదు, ఆరు, యేడురోజులిట్లు గతించెను. కనిపెట్టుకొనియుండుటకు నాకు విసుగుపుట్టెను. ఆమెస్థితి తిరిగి యుపద్రవకరమయ్యెను. ఆమెను చూచుటకు నన్ను వారమునకు రెండుసార్లు తీసికొనివెళ్ళెదమని చెప్పుట యెంతటిపరిహాసమో! అనినేను భావించితిని. చిట్టచివరకు సెప్టెంబరు గతించెను. ఆ ముప్పది దినములు నేనెన్నడు ననుభవించని దీర్ఘతమ దుర్దినములు.

నేను రాజకీయములలో దిగనని వాగ్దానముచేసినచో, యిష్టా గోష్ఠిగనైననుసరే, నేను విడిచివేయబడుదునని మధ్యవర్తులు సూచించిరి, అప్పుడు రాజకీయములు నాతలంపులో నేలేవు; నేను బయట నున్న పదకొండుదినములలోను చూచిన రాజకీయములు నాకసహ్యముగనుండెను. కాని వాగ్దానమునిచ్చుటయా ! నా ప్రమాణములకు, యుద్యమమునకు, నా సహచరులకు, నాకు ద్రోహముచేయుటయా ! అదియసంభవము. అట్లుచేయుట నాభావములకును, నేను పవిత్రమని తలంచు సమస్తమునకు మృత్యుఘాతము. కమల నా నాటికి క్షీణించుచున్నదని నే నామెప్రక్కనున్నచో సేదదేరునని చెప్పుచుండెడివారు. ఆమె కీ యవకాశము నిచ్చు నా కోరికకంటె నా స్వాభిమానము, గర్వము అధికమైనదా? ఇది నాకొక గొప్పదురవస్థ. కాని యదృష్ట వశమున నాకీసందిగ్ధదశ పట్టలేదు. నేనట్టివాగ్దానమునిచ్చుట కమలయే నిరాకరించునని నేనెరుగుదును.

అక్టోబరు మొదటిరోజులలో ఆమెనుచూచుటకు నన్ను తీసికొనివెళ్ళిరి. ఆమె జ్వరతీవ్రతతో నిశ్చేష్టయైయుండెను. నేనామెప్రక్కనుండగోరెను. కాని నేను తిరిగి జయిలుకు పోవుచుండుటచే నామె నన్ను చూచి ధైర్యముగ నవ్వునవ్వి నన్నుకొంచెము వంగవలసినదని సంజ్ఞచేసెను. నేను వంగితిని "ప్రభుత్వమునకు మీరు వాగ్దానము నియ్యవలెనను యీవదంతియేమిటి? అట్లు యివ్వవలదు!" అనియామె మెల్లగ చెప్పెను.

చివరకు కమలను భోవాలి తీసుకొనివెళ్ళుటకు నిశ్చయింపబడెను. ఆమె యచ్చటకు వెళ్ళుటకు పూర్వదినమున నన్నచ్చటకు తీసికొనిపోయిరి. నేనామెను తిరిగి యెప్పుడుచూతును? ఆమె నాకిక కాన్పించునా? ఆమె యానాడు సంతోషముగ, సుఖముగ కాన్పించెను. నాకిది చాలాకాలమునుండి లేని సంతోషమును కలిగించెను. తరువాత మూడువారములకు నన్ను ఆల్మోరాజిల్లా జయిలుకుమార్చిరి. భోవాలి మార్గములోనే యుండెను. నేను నా పోలీసుతోసహా కొద్ది

గంటలచ్చట గడిపితిని. కమలకు సుగుణముగ నున్నందులకు నేను సంతసించి యుత్సాహముతో ఆల్మోరా వెళ్ళితిని.

ఆల్మోరా జయిలొక శిఖరముమీద నిర్మింపబడెను. నాకు దర్జాయైనకొట్టు యివ్వబడెను. పెద్దహాలు 51 అడుగుల పొడవు, 17 అడుగుల వెడల్పు. నేల గతుకుగ 'కచ్చా'గను నుండెను చెదతిని వేసిన పైకప్పునుంచి ముక్కలు, తుక్కు నిరంతరము జలజల రాలుచుండెను. దానికి పదిహేను కిటికీలు, ఒక గుమ్మము కలవు. వీటికి తలుపులులేవు, నాకు శుభ్రమైనగాలికి కొదవలేకయుండెను. చలి యెక్కువయైనప్పుడు చాపలతో కొన్నికిటికీలు మూసివేయబడెడివి. ఈ విశాలప్రదేశములో నేనేకాంత ఘనత ననుభవించితిని. కాని నేను కేవల మొంటరిగ లేను. అధమము మూడున్నరడజనులపిచుకలు కూలుచున్న కప్పులో తమనివాసము నేర్పరచుకొనెను. ఒక్కొక్కప్పుడు సంచారముచేయు మేఘమొకటి నన్ను దర్శింపవచ్చి కిటికీలగుండ తన సహస్రచేతులను చాచి యాప్రదేశమును చల్లపరచి పోవును.

ఇచ్చట నన్ను ప్రతిదినము సాయంకాలమయిదు గంటలకు, తాళము వేసెడివారు. ఉదయము యేడుగంటలకు నా తలుపు తాళములు వీడును. పగలు నాగదిలోనో బయట వరండాలోనో కూర్చొనెదను. గోడలపైనుండి నాకొకపర్వతశిఖరము కాన్పించెడిది. ఆ పైన విశాలనీలాకాశము మేఘరాశితో నిండియుండెడిది ఈమేఘము లద్భుతములగురూపములను దాల్చెడివి. వానిని పరీక్షించుటకు నాకెప్పుడు విసుగుపుట్టెడిదికాదు. అవి యన్నిమృగములరూపములను దాల్చుటను చూచుచున్నట్లు నేను భావించితిని. ఒక్కొక్కప్పు డవి యన్నియుకలసి మహాసముద్రమువలె కాన్పించెడివి; లేక నవి సముద్ర తీరమువలెనుండును. దేవదారులనుండివీచు వాయువుయొక్క మర్మర ధ్వని దూరముననున్న సముద్రతరంగ ఘోషమువలె నుండును.

కమలస్థితికి నేను ఖేదపడుచుంటిని. చెడువార్త నన్ను తారుమారుచేసెడిది, కాని పర్వతవాయువు నన్ను శాంతింపజేసి యోదా

న్నుటచే నేను గాఢముగ నిద్రపోయెడివాడను. నేను నిద్రపోవుటకు ముందు—నిద్ర యెంతటి యద్భుత విషయము! యెంత రహస్యవిషయము! దానినుండి మనమేల మేల్కొనవలెను? నేనసలు మేల్కొనలేదనుకొనుడు? యని భావించెడివాడను.

అయినను బయటకు పోవలెననెడి కోరిక మునుపటికంటె గాఢముగ నుండెను. బొంబాయికాంగ్రెసు జరిగిపోయెను. నవంబరు గతించెను. అసెంబ్లీయెన్నికల యుద్రేకము చల్లారెను; నన్ను విడిచిపెట్టదరనుకొనుచుంటిని. కాని యింతలో అబ్దుల్‌గఫ్ఫార్‌ఖాను నిర్బంధము, శిక్ష వినవచ్చెను సుభాసుచంద్రబోసు భారతదేశమునకు తిరిగివచ్చినపుడు వేసిన అరెస్టు ఆశ్చర్యకరముగనుండెను. తన దేశస్థులలో నధిక సంఖ్యాకులచే ప్రేమింపబడువానిమీద నవి ప్రయోగింపబడెను. వ్యాధిగ్రస్తుడైయున్నను మృత్యుశయ్యమీదనున్న తండ్రిని చూచుటకతడు త్వరపడివచ్చెను. ప్రభుత్వదృక్పథ మీవిధముగ నున్నప్పుడు నా యకాల విడుదల యసంభవము. తరువాత ప్రభుత్వప్రకటనమట్లే వెలువడెను.

ఒకనెల యాల్మోరాలో నున్నతరువాత నన్ను కమలను చూచుటకు తీసుకొనివెళ్ళిరి. తరువాత నేనామెను మూడువారములకొకసారి చూచెడివాడను సర్ శామ్యూల్ హోర్ (భారతసెక్రటరి) నన్ను వారమునకొకటిరెండుసార్లు నాభార్యను చూడనిచ్చువట్లు పదేపదే చెప్పెను. ఆల్మోరాలోనున్న మూడున్నరమాసములలో నేనామె నయిదువర్యాయములే చూచితిని. నేను దీనినొక ఫిర్యాదు కొరకు చెప్పుటలేదు. ఈవిషయములో ప్రభుత్వమువారు నాపట్ల చాలయుక్తముగనుండి కమలనుచూచుటకు అసాధారణ సౌకర్యములను కలిగించిరి. దీనికి నేను వారికి కృతజ్ఞుడను. నాస్వల్పకాలసందర్శనము లామెకు నాకుకూడ నమూల్యములయ్యెను. నేనామెతో చాల కాలము సంభాషించెడివాడను. మే మొకరికొకరమతిప్రేమాస్పదులమైతిమి. ఆమెనువీడుట బాధకరముగనుండెడిది. మేము కలుసుకొని విడిపోయెడివారము.

నాతల్లి చికిత్సకొరకు బొంబాయి వెళ్ళెను. ఆమెకు గుణముగ నున్నట్లే కాన్పించెను. జనవరిమధ్యభాగమున నొకనాడు నాకొకతంతి వచ్చెను. ఆమెకు పక్షవాతము వచ్చెనని యది తెలిపెను. నన్ను బొంబాయి ఖయిదు కామెసమీపములో నుండుటకు మార్చెదరనిరి. ఆమెస్థితి చక్కబడుటచే నన్ను మార్చలేదు.

జనవరి తరలిపోయి ఫిబ్రవరివచ్చెను. వసంతకాలధ్వను లాకసమును నింపుచుండెను. పిగిలిపిట్ట, కోయిల యిత్యాదిపక్షులు మరల కాన్పించి గానముచేయ నారభించెను. లేతమొలకలు భూమినుండి యద్భుతముగ పైకిలేచుచు నీ వింతప్రపంచమును తిలకించుచుండెను. యఱ్ఱగన్నేరు పర్వతసీమలను రక్తకాంతితో నింపుచుండెను. బఠానీలు. తీగలు పుష్పించుచుండెను. రోజులు గడచుచుండ భోవాలీ సందర్శనమును గుఱించి యోచించుచు నేను వానిని లెక్కించుచుంటిని. జీవితములోని యమూల్యమైన ప్రసాదములు విఫలిత, క్రౌర్యము, యెడబాటు—వీని ననుసరించుననను లోకోక్తిలో నెంత సత్యమున్నది! యని నే నాశ్చర్యపడుచుందును. అట్లు కానియెడల బహుశః అవి గుర్తింపబడవు. నిర్దుష్టభావమునకు బహుశః బాధ యనవసరము. అది యధికమైనచో బుద్ధిని కప్పివేయవచ్చును. జయిలు ఆత్మపరీక్షను ప్రోత్సహించును. జయిలులోనున్న దీర్ఘసంవత్సరములు నన్నెంతకెంత కాత్మవిచారణ చేసికొనుటకు బలవంతపరచెను. స్వతః నేను అంతర్ముఖుడను కాను. కాని జయిలుజీవిత మాత్మపరీక్షకు మార్గము చూపును.

## 67

# ఇటీవల విషయములు

నాకు వచ్చు వార్తాపత్రికలవలన బొంబాయి కాంగ్రెసు సభా తీర్మానములను తెలిసికొంటిని. ఇరువది సంవత్సరములు సన్నిహిత సంపర్కముచే నా వ్యక్తిత్వము కాంగ్రెసుసంస్థలో మిళితమైపోయెను. నా పదవి, బాధ్యతవలన నాకుగల హక్కుకంటె నా సంస్థతోను, వేలకొలది నా పాతస్నేహితులతోను నన్ను బంధించిన యగోచర మైన పాశములు బలవత్తరముగ నుండెను. అయినను నే నా తీర్మా నములతో తృప్తినొందలేదు. కొన్ని ముఖ్యవిషయములు జరిగినను ఆ కాంగ్రెసుసభ యంతయు నిస్సారముగ నుండెను. నేను శ్రద్ధతీసు కొను విషయములేవియు చర్చింపబడలేదు. నే నచ్చట నుండుచో నేమిచేసెడివాడనో యని యాశ్చర్యపడితిని. నిశ్చయముగ నాకే తెలియదు. నే నప్పుడు చింతింపవలసిన యవసరముకూడ లేదు

ఆ సభలో రెండు ప్రధానలక్షణములు కాన్పించెను. గాంధీజీ యొక్క యసాధారణవ్యక్తిత్వము, మాలవ్యా, ఆనేలనాయకత్వము క్రింద ప్రదర్శింపబడిన యత్యంత నిస్సార కులతత్త్వ వ్యతిరేకత, భారత ప్రజాహృదయముయొక్కయు, మధ్యతరగతులవారియొక్కయునాంత రంగిక ప్రవృత్తులను గుర్తెరింగిన వారందరు గాంధీజీ భారతదేశములో నసాధారణపురుషుడనిన యాశ్చర్యపడరు. ప్రభుత్వాధికారులు, కొందరు ఘోషారాజకీయ వేత్తలు నతడు రాజకీయరంగములో దిగ్గ్రొక్కవేయ బడెనని తరచు యూహించుచుందురు. అతడు తన వెనుకటి శక్తితో, వలుకుబడితో తిరిగి విజృంభించినపుడు వారు నాలుకలుకరచుకొనుచు నీమార్పుకుగల నూతన కారణములను వెతుకుచుందురు. అతని యభిప్రాయముచేత నవి సాధారణముగ నంగీరింపబడుటచేత నతడు

కాంగ్రెసును, దేశమును పాలించుటలేదు. అతనియసాధారణవ్యక్తిత్వమే దీనికి కారణము. ప్రతిచోటను వ్యక్తిత్వమే పరిగణింపబడును. ఇతర చోట్లకంటె నది భారతదేశములో మరింత ప్రాధాన్యత వహించును. అతడు కాంగ్రెసునుండి విశ్రాంతితీసికొనెను. బాహ్యముగ నిది కాంగ్రెసుచరిత్రలోను, భారతచరిత్రలోను నొక మహాధ్యాయమును సమాప్తముచేసెను. కాని ప్రధానముగ దీనికెట్టి గొప్ప ప్రాముఖ్యతలేదు. తన యధికారమునుండి యతడు తప్పించుకొనజాలడు. అతని పదవి యుద్యోగమువలన, యితర స్థూలసంబంధమువలన యతనికిసంక్రమించలేదు. కాంగ్రెసు వెనుకటివలె యిప్పుడును అతని దృక్పథమునే ప్రతిబింబింపజేయును అది యతనిమార్గమునుండి తప్పిపోయినను గాంధీజీ దానిని, దేశమును చాలవరకు ప్రేరేపించుచునేయుండును. ఆబాధ్యత నుండియు, భారమునుండియు నతడు తప్పుకొనజాలడు. తాత్కాలికముగ నతడు కాంగ్రెసునుండి విరమించెను బహుశః యతడొక విధమగు వ్యక్తిగత ప్రత్యక్షవిధానమును యోచించుచుండవచ్చును. దానిని కాంగ్రెసు సమష్టిగ చేయుట కతడిష్టపడడు.

కాంగ్రెసు నియోజకవర్గ నియమితసభ యను భావము నవలంబించినందులకు నేను సంతోషించితిని. సమస్యను పరిష్కరించుటకు వేరుగిత్యంతరములేదు. ప్రభుత్వముకూడ దీనిని జరుగనీయదు; కాని యెప్పుడో యొకప్పుడిది జరుగక తప్పదు. ఈలోపుగ తగిన బలమును చేకూర్చుకొనవలెను. కొంతమంది దీనినొకవిధమగు అఖిలపక్షసభగ చేయగోరిరి. ఇది కేవలము వ్యర్థము. నియోజకవర్గ నియమితసభయనగా ప్రజలనుండి బలమును, ప్రేరేపణమునుపొందినవిశాల ప్రజాసంఘముచే నెన్నుకొనబడిన సభయనియర్థము. అట్టిసభ వెంటనే యదార్థసమస్యల నెదుర్కొనును. అది కులతత్వారోపులలో దిగబడదు. బొంబాయి కాంగ్రెసుజరిగిన వెంటనే అసెంబ్లీఎన్నికలుజరిగెను. ఎన్నికలలో నాకు ప్రీతిలేకపోయినను కాంగ్రెసు అభ్యర్థులు గెలువవలెనని నేనుకోరితిని. ప్రతిపక్షములవారు – ఇందులో నుద్యోగములకొరకు వేటాడువారు. కులతత్వవాదులు, నమ్మికస్వామిద్రోహులు నానాగోత్రములవారు.

ఓడిపోవలెనని కోరితిని. చివరకు కాంగ్రెసుకఖండవిజయముకలిగినందు లకు రాదగినవారు చాలమంది యోడినందులకు తృప్తినొందితిని.

కాంగ్రేసు సేషనలిస్టు లనబడువారిదృష్టి నాకువిచారకరముగ కాన్పించెను. వారు కమ్యూనల్ అవార్డును తీవ్రముగనెదిరింపవచ్చునుం కాని, వారు తమస్థితిని బలపరచుకొనుట కత్యంత కులతత్వవాదుల తోను సనాతనవాదులతోను కూడ కలిసిరి. బెంగాలులో తప్ప వారన్నివిధముల కాంగ్రెసుకు వ్యతిరేకులు. వీరే కాంగ్రెసుకు ప్రబల ప్రతికక్షులు-భూఖామందులు,లిబరలులు, నిశ్చయముగ నధికారులు. వీరింతమందియున్నను కాంగ్రెసు అభ్యర్థులు నెగ్గిరి.

కమ్యూనల్ అవార్డునుగురించిన కాంగ్రెసుదృష్టి యసాధారణమైనది. అయినను ప్రస్తుతపరిస్థితులలో నదియంతకంటె వేరేమియుచేయు జాలదు. ఇంతవరకు తటస్థభావము నీరసనీతి నవలంబించుటచేతనే ఈ స్థితి సంభవించెను. ఫలితములకు వెనువక బింకమైనమార్గము నవలబించి దాని ననుసరించుట యుక్తము, గౌరవప్రదమునై యుండెడిది. కాని, కాంగ్రెసు దాని నప్పుడంగీకరింపక పోవుటచే నిప్పటిపద్ధతికంటె వేరొకమార్గము లేదు. కమ్యూనల్ అవార్డు స్పష్టముగ నవ్యాకృతమైనది. అదియున్నంతకాల మెట్టి స్వాతంత్ర్యము సాధించుటకువీలులేదు. కనుక దానినంగీకరించుట యెన్నడుపొసగదు. అది ముస్లిములకెక్కువనిచ్చె నను కారణ మెంతమాత్రమును కాదు. వారు కోరినదాని నిచ్చుట బహుశః సాధ్యమేయగును. నిజమేమన బ్రిటిషు ప్రభుత్వము హిందూ దేశము ననేక పరస్పర విరుద్ధశాఖలక్రింద విభజించి యొకదానితో నొకటి తలపడునట్లుచేసి యనర్గళముగ పరిపాలనచేయుచున్నది. అది బ్రిటిషుప్రభుత్వముపై నాధారపడుటను విధాయకముగచేయుచున్నది.

అతి రియాక్షనరీ కులసంఘములైన హిందూమహాసభముస్లిము కాన్ఫరెన్సులకు వెనుకనున్న వారి నిజస్వరూపముల నసెంబ్లీఎన్నికలు విశదపరచెను. వారి యభ్యర్థుల అభిమానులు పెద్ద భూఖామందులు, వడ్డీవ్యాపారస్థులు.నవీన ఋణవిమోచనబిల్లులను తీవ్రముగ నెదిరించి హిందూమహాసభకూడ బ్యాంకర్లయెడల పక్షపాతము వెలిబుచ్చెను.

హిందూసాంఘిక తరగతులపై కొద్దిమంది "హిందూమహాసభ" యగు
చున్నది. అందులో నొకభాగము, వృత్తులలోనున్న కొంతమంది
కలసి లిబరలు లగుచున్నారు. వారికి హిందువులలో నెట్టి పలుకుబడి
లేదు. ఏలనన మధ్యతరగతిలోని క్రిందితరహావారు రాజకీయముగ
మేల్కాంచిరి. పారిశ్రామిక నాయకులుకూడ వీరికి దూరము వృద్ధి
చెందుచున్న పరిశ్రమలకు నర్థఫ్యూడల్ ప్రయోజనములకు కొంత
స్పర్థకలదు. ప్రత్యక్షకార్యక్రమములకు లేక సాహసకార్యములకు
భయపడు పారిశ్రామికులు ప్రభుత్వముతోను, జాతీయతతోనుకూడ
సఖ్యముగనుండగోరెదరు. వారు లిబరులు, కమ్యూనలువర్గములను లెక్క
చేయరు. పారిశ్రామికాభివృద్ధి, లాభాలు వారి ప్రధానాశయములు.

ముస్లిములలో నీమధ్యతరగతులలోని క్రిందితరహావారి ప్రబో
ధము, పారిశ్రామికాభివృద్ధికొరవడియుండెను. కనుక వారి కులసంస్థ
లను వచ్చి రియాక్షనరీలు, ఫ్యూడల్ ప్రభువులు, పింఛనుదారులు
వశపరచుకొనుటయేగాక సంఘముమీాదకూడ మంచి పలుకుబడి గలిగి
యున్నారు. ముస్లిముకాన్ఫరెన్సు 'సీర' బిరుదాంకితులు, పెద్దజమీాం
దారులు, పాతమంత్రులు గల యొక గొప్పప్రదర్శనము. అయినను,
ముస్లిము ప్రజాసామాన్యములో నెక్కువశక్తియున్నట్లు కాన్పిం
చును. బహుశః వారి సాంఘికస్వేచ్ఛయే దీనికి కారణము. ఒకసారి
కదలిక కలిగినచో వా రెక్కువ చురుకుగ సామ్యవాదముఖులు కావ
చ్చును. వర్తమానమున ముస్లిము విద్యాధికులు మనఃకాయముల
సబ్బులు. వారిలో నుత్సాహములేదు. వారు తమ పాతసంరక్షకులను
త్రోసివేయ సాహసింపరు.

రాజకీయాభివృద్ధినొందిన కాంగ్రెసు నాయకులుకూడ ప్రజాపరి
స్థితులు కోరనంతటి జాగ్రతను వహించిరి. వారు ప్రజలసహాయమును
కోరుదురు కాని వారి యభిప్రాయములను కనుగొనరు; వారిబాధలను
గురించి పరిశోధన చేయరు. ఎన్నికలకు ముందు వివిధ కాంగ్రెసేతర
మితవాదులను త్రిప్పుటకు వారుతమప్రోగ్రాముయొక్కజోరుతగ్గించిరి.
దేవాలయప్రవేశ బిల్లువంటిదానియెడలగూడ తమ దృష్టిని మార్చు

కొనిరి. చెన్నపట్టణ శ్రోత్రియులను శాంతిపరచుటకు వాగ్దానము లీయ బడెను. సరియైన తీవ్ర యెన్నికల ప్రచారము సాగించినచో నెక్కువ యుత్సాహము కలిగియుండెడిది; ఎక్కువ ప్రజాప్రబోధమునకు తోడ్పడెడిది ఇప్పుడు కాంగ్రెసు పార్లమెంటరీపద్ధతి నవలంబించెను. కనుక కొన్ని చిల్లరవోటులను సంపాదించు నుద్దేశ్యముతో సాంఘిక, రాజకీయాభి వృద్ధి భంజకులతో మరికొన్ని ఎక్కువ రాజీలు జరుగును; ప్రజలకు కాంగ్రెసు నాయకులకు మధ్య మరింతయెక్కువ యంతర మేర్పడును. ఉపన్యాసములకు లోటుండదు. ఉత్తమ పార్లమెంటరీ మర్యాద లవలంబింపబడును; అప్పుడప్పుడు ప్రభుత్వము పరాజయమునొందును. ప్రభుత్వ మిదివరకు చేయునట్లే వీనిని నెమ్మదిగ నిర్లక్ష్యము చేయును

కాంగ్రెసు శాసనసభలను బహిష్కరించిన వత్సరములలో నసెంబ్లీ, రాష్ట్రసభలు, ప్రజల యదార్థప్రతినిధిసభలనియు నవి ప్రజా భిప్రాయమునే వెల్లడిచేయుచున్నవనియు ప్రభుత్వకక్షి చెప్పుచుండె డిది. ఇప్పుడు ప్రభుత్వదృష్టి మారిపోవుట చోద్యముకదా! ఎన్నిక లలో కాంగ్రెసువిషయముల యుదాహరణ వచ్చినపుడెల్ల నియోజక వర్గము చాల చిన్నదని, ముప్పదియారుకోట్లలో మూడుకోట్లు మాత్రమేయని చెప్పుచుందురు. వోట్లులేనివారందరు బ్రిటిషుప్రభు త్వమువెనుక కోటవలె నున్నారని భావము. దీనిచికిత్స స్పష్టముగనే యున్నది. వయసువచ్చినవారికందరకు వోటుహక్కు యిచ్చినచో యదార్థము తెలియగలదు.

అసెంబ్లీ యెన్నికలు ముగిసినతోడనే భారతచట్టసంస్కరణలను గురించిన సంయుక్తపార్లమెంటరీ కమిటీ నివేదికవచ్చెను. ఇది యందరిచేత విమర్శింపబడెను. గర్హింపబడెను. ఈ వరప్రసాదము వలన మనకు స్వేచ్ఛయెట్టిదో యీదేశములోనున్న యతి మిత వాదులు రాజకీయముగ వెనుకబడినవారు నగు వర్గములవా రభి వృద్ధిభంగకరమని దీనిని గర్హించుటవలననే తెలియుచున్నది. లేబరు పార్టీ, లేబరుప్రభుత్వము యేదో చేయునని కొందరాశించిరి. సామ్రాజ్యనీతి సందర్భమున యింగ్లండులో లేబరు, టోరీపక్షముల మధ్య మనమేమియు నాశింప నవసరములేదు.

భారతరాజకీయరంగములో బాహ్యమైన మార్పులను గ్రహిం
చుటకు నేను ప్రయత్నించితిని. కాని, యివన్నియు నా కసత్యములుగ
కాన్పించెను. హిందూదేశ నిజపరిస్థితులు నన్ను బాధించుచుండెను.
అన్ని విధములగు స్వేచ్ఛలు నణచివేయబడెను. అమితమగుబాధ, విఫ
లత, సుహృద్భావమునుపాడు చేయుట, చెడుగును ప్రోత్సహించుట - ఈ
లక్షణములు కన్పట్టెను అనేకమంది యువకులుజయిళ్ళలో క్రుగ్గుచుండిరి
మామూలురోజులలో కూడ ననేక సంస్థలు బహిష్కరింపబడెను. ఎమ
ర్జెన్సీ అధికారములు 'శాంతిచట్టములు' ప్రభుత్వ ఆయుధశాలలో స్థాన
రము నేర్పరచుకొనెను. అనేకవందలపుస్తకములు, మేగజైనులు నిషే
ధింపబడెను, లేదా 'సముద్రసుంకముల చట్టముక్రింద' దేశములోనికి
రాకుండానాపివేయబడెను. 'ఉపద్రవకరమగు సాహిత్యము' నుంచు
కొనుటవలన దీర్ఘశిక్ష ప్రాప్తించెడిది. రవీంద్రనాథఠాగూరు రష్యాను
గురించి యొకవ్యాసమును 'మోడరన్‌రివ్యూ'లో వ్రాసినందుల
కాపత్రికాధిపతి మందలింపబడెను. రవీంద్రనాథఠాగూరు 'డబ్లినులోని
మిత్రసంఘమునకు' పంపిన యొకచిన్న సందేశమునుకూడ ప్రచురింప
రాదనిరి. ఠాగూరువంటి ఋషిసత్తముడు, విజ్ఞానపిపాసి రాజకీయము
లను బుద్ధిపూర్వకముగ విడినవాడు, భారతదేశములో పూజింపబడు
వాడు, ప్రపంచఖ్యాతిగాంచినవాడు యీవిధముగ నణచివేయబడుచో
నిక మామూలు మానవులగతి చెప్పవలెనా? ఇట్టిపరిస్థితులలో సరళ
ప్రతికారచన కాస్కారములేదు. చరిత్రను రాజకీయములను, ఆర్థిక
ములను వర్తమానవ్యవహారములను యధార్థముగ తర్కించుటకు,
బోధించుటకు వీలులేదు. సంస్కరణలను బాధ్యతాయుత పరిపాలనను
ప్రవేశపెట్టుట కిదియొక వింత పూర్వాధ్యాయము.

నేడు ప్రపంచ మొకవిధమగు మానసికసంక్షోభములో మునిగి
యున్నదని, ప్రస్తుతపరిస్థితులతో నసంతృప్తిచెందియున్నదని బుద్ధి
మంతులకు తెలియును. మనకండ్లయెదుటనే విపరీతమార్పులు జరుగు
చున్నవి. భవిష్యత్తు సమీపముననేయున్నది. అది ప్రతి వానిని
మంచికో చెడ్డకో తీసికొనిపోవును. కనుక ప్రతినాగరికుడు దాని

వెనుకనున్న వివిధశక్తులను తెలిసికొని తన కార్యవిధానము నేర్పరచు
కొనుట ధర్మము. ఒకప్రపంచము నశించి మరియొక నూతన ప్రపం
చము రానైయున్నది. ఒకసమస్యకు సమాధానము కనుగొనుటకు
పూర్వ మా సమస్య యేదియో తెలిసికొనవలెను.

ప్రపంచసంభవములను గురించిన మన రాజకీయవేత్తలయుదా
సీనత, యజ్ఞానము నాశ్చర్యకరములుగ నుండును. బ్రిటిషు అధికారు
లలో పైనున్నవారికి తప్ప క్రిందివారికివి యవసరములేదు. ప్రభుత్వము
ప్రపంచసంభవములను దృష్టిలోనుంచుకొనియే తమనీతి నేర్పరచు
కొనుచుండును. భారతదేశమును మ్రింగుట, దానిని సంరక్షించు
కొనుట బ్రిటిషు విదేశనీతిలక్షణము. జపానుయొక్క యధికారము,
సోవియెటు యూనియనుయొక్క దినదినాభివృద్ధి యగు శక్తి, సింకి
యాంగులో ఆంగ్లో రష్యా జపానులయొక్క పట్టులు, మధ్యఆసియా,
ఆఫ్ఘనిస్థానము, పర్షియాలోని సంభవములు, భారతరాజకీయములతో
సన్నిహితసంబంధము కలిగియున్నవని యెంతమంది భారతరాజకీయ
వేత్త లెరుంగుదురు? మధ్యఆసియా పరిస్థితి కాశ్మీరుస్థితిని మార్చి
దానిని బ్రిటిషు రాజనీతికి, రక్షణకు కీలకముచేయును.

ప్రపంచములో నతిశీఘ్రముగ జరుగుచున్న యార్థికమార్పులు
మరింత ప్రాముఖ్యములు. పందొమ్మిదవ శతాబ్దపు పద్ధతులు గతిం
చెను, అవి ప్రస్తుతమునకు వర్తింపవు. మన మొక యెద్దుబండిని ఇనుప
పట్టాలమీద పెట్టి యదియే రైలుబండి యనజాలము. అది తప్పి
కొనవలసినదే! పాతసరుకుక్రింద దానిని తీసివేయవలెను. రష్యాలోనే
కాక నమెరికాలోను, యింగ్లండులోను 'క్రొత్తపంపకములు,' గొప్ప
మార్పులు అనుమాటలను వినుచుందుము. భారతదేశములో కూడ
మన కనేక 'క్రొత్తపంపకములు' కావలెను. "గ్రహింప యోగ్యమైన
దంతయు నిదివరకే గ్రహింపబడెను. చేయ వ్యర్థమైనదంతయు, నిది
వరకే చేయబడెను," అను పాతపాటలన్నియు నిరర్థకములు ఉపద్రవ
కర ప్రలాపములు.

మనమనేక సమస్యల నతిధైర్యముతో నెదుర్కొనవలెను. ప్రజలపరిస్థితుల నెక్కువగ నభివృద్ధిచేయవలెనపుడు ప్రస్తుత సాంఘిక యార్థికపద్ధతి నిలిచియుండుట కవకాశమున్నదా? ఈ విశాలాభివృద్ధి నొకపద్ధతి యేదియైన చేయగలదా? కేవల రాజకీయమార్పు యెంత గొప్పయభివృద్ధి తీసికొనిరాగలదు? అతివాంఛనీయ పరివర్తనమునకు స్వార్థప్రయోజనము లడ్డముతగులుచో ప్రజాదుఃఖమును, దారిద్ర్యమును శాశ్వతమొనర్చుచో వానినింతుడుంప యత్నించుట యుక్తమా? అది నీతియా? నిశ్చయముగ స్వార్థప్రయోజనముల కపకారము చేయుట లక్ష్యముకాదు. అవి యితరుల కపకారము చేయకుండ చేయుటయే లక్ష్యము. వీనితో రాజీపడుటకు సాధ్యమగుచో నట్లు చేయుట యత్యంతము వాంఛనీయము. దీని యుక్తాయుక్తములను గురించి ప్రజలలో భేదాభిప్రాయములుండవచ్చును, కాని, యొక సమాధాన మవసరమను విషయము నెవడును శంకింపడు. ఒక స్వార్థప్రయోజనమునుతీసివేసి మరియొక దానిని సృష్టించుటవలన లాభము లేదు. స్వార్థప్రయోజనములట్టి రాజీకంగీకరింపవని చరిత్ర చాటుచున్నది. సంఘమునకు ప్రాణాధారపాత్రము వహింప మానివేసిన తరగతులు చిత్రముగ బుద్ధిహీనముగ నుండును. అవి సమస్తమును మ్రింగవలెనని యనుకొని చివరకు సమస్తమును పోగొట్టుకొనును.

ఆస్తిని కలుపుకొనుట మొదలగు "యథేచ్ఛా సంభాషణ" యెంతయో కలదు. అడ్డులేకుండ కొల్లగొను పునాదమీదనే ప్రస్తుత పద్ధతి యేర్పడెను. దీనిని నిర్మూలించుటకే సాంఘికమార్పులుద్దేశింపబడినవి. పనివానియొక్క పాటువలనవచ్చు ఫలితమునుండి నిత్యము కొంత లాగివేయబడుచున్నది. కిస్తు, పన్నులు చెల్లింపజాలనంతగ హెచ్చింపబడి చివరకు వ్యవసాయదారునిభూమి లాగివేయబడుచున్నది వ్యక్తులు సామాన్యభూములను లాగుకొని పెద్దజమీల నేర్పాటుచేసికొనిరి; ఈ విధముగనే వ్యవసాయప్రొప్రయిటర్లు తుడిచి వేయబడిరి.

దీనిని కొంతవరకు తగ్గించుటకే సంఘము ఆస్తిని తగ్గించు స్వభావముగల భారమైన పన్నులు, మరణకాలపు పన్నులు, ఋణ

విమోచన చట్టములు, నాణెములను పెంచుట మొదలగు వివిధ యుపాయములద్వారా ప్రయత్నించుటను సోవియటు యూనియను వారేకాక ప్రధాన క్యాపిటలిస్టు దేశములు కూడ నవీనముగ పెద్ద యెత్తున జాతీయఋణములను నిరాకరించిరి, బ్రిటిషువా రమెరికా కీయవలసిన ఋణమును నిరాకరించుట యొక గొప్ప యుదాహరణము! దీనిని భారతదేశమనుకరించు టెంత యుపద్రవకరము! కాని యివన్నియు కొంతవరకు మాత్రమే సహాయపడగలవు. ఇవి మూల కారణమును తీసివేయజాలవు. నూతనసృష్టిచేయుట కా మూల కారణమును తీసివేయవలెను.

ప్రస్తుతక్రమమును మార్పుపద్ధతినాలోచించునపుడు మనము దానికొరకై వెచ్చింపవలసిన యార్థిక, యాధ్యాత్మిక మూల్యమును పరిగణింపవలసియుండును. మనము దూరదృష్టి లేకుండ నుండజాలము. అది భౌతికముగ నాధ్యాత్మికముగ మానవాభివృద్ధికి మానవానందమునకు తోడ కెంతవరకు సహాయపడగలదో చూడవలెను. కాని, ప్రస్తుతక్రమమును మార్చకపోవుటవలన కలుగు విపరీతనష్టములు నిష్ఫలజీవితములు, వికలములైన జీవితములు, దుఃఖము, కడుపుబాధ నైతికయాధ్యాత్మికపతనము — వీనినెల్లప్పుడు దృష్టిలో నుంచుకొనవలెను. నిరంతరము వెల్లివిరియు ప్రవాహమువలె నీప్రస్తుత యార్థిక పద్ధతి యసంఖ్యాకములగు ప్రజాసందోహములను ముంచుచు వినాశమునకు తీసికొనిపోవుచున్నది. మనలో కొంతమంది చేదలతో నీళ్ళు తోడినంతమాత్రముచేత నీప్రవాహము నరికట్టజాలము. ఈ ప్రజలను రక్షింపజాలము. పెద్దయేటిగట్టుల నిర్మించి కాలువలనుత్రవ్వి ప్రవాహ విధ్వంసకశక్తిని మార్చి మానవశ్రేయస్సుకొరకు నుపయోగింపవలెను.

సామ్యవాదము కోరు గొప్ప మార్పులు కొద్ది శాసనములను చేసినంతమాత్రమున కలుగనేరవు. కాని యభివృద్ధిమార్గము చూపుటకు కట్టడముయొక్క పునాదులను వేయుటకు మూలశాసనములు, నధికారము నవసరములు. సామ్యవాదసంఘనిర్మాణము నదృష్టమునకు విడిచిపెట్టరాదు. కట్టినదానిని పడగొట్టుచు పడుచులేచుచు చేయు

పనియు పనికిరాదు. ప్రధాన యభ్యంతరములను తీసివేయవలెను. లక్ష్యము సృజించుటకాని నాశనముకాదు; ప్రస్తుతలేమిని భవిష్యత్ వృద్ధికిమార్చుట మన మార్గము మన యిష్టాయిష్టములమీద శుద్ధ న్యాయముమీదలేదు. అది యార్థికముగ దృఢముగ నభివృద్ధిప్రద ముగ మార్పుచెందు పరిస్థితుల కనుగుణ్యముగ మానవలోకములో నెక్కువమందికి కళ్యాణదాయకముగ నుండవలెను.

స్వార్థముతో పోరాటముతప్పదు: మరొకసంధిలేదు. మనలో ప్రతివాడు తనపక్షమును నిర్ణయించుకొనవలెను. నిర్ణయించుకొనుటకు పూర్వము జ్ఞానము, గ్రహణశక్తి యుండవలెను. సామ్యవాద భావ ప్రవేశనము చాలదు. దీనితోపాటు బుద్ధిహేతుబద్ధముకావలెను. పశ్చిమ దేశములలో నిట్టివిధమగుసాహిత్యమెంతయోకలదు. భారతదేశములో నిది చాలకొరవబడియున్నది. మంచి మంచి పుస్తకముల నిచ్చుటకు దానియదు. కాని, యితరదేశములనుండివచ్చు పుస్తకముల చదివి నంతమాత్రముగ చాలదు. సామ్యవాదమునె హిందూదేశములో నిర్మింపవలెనన్న నది హిందూదేశ పరిస్థితులనుండియే యుత్పన్నము గావలెను. ఈ పరిస్థితులను శ్రద్ధతో పరీక్షించుట అవసరము.

సామ్యవాదమును తెచ్చుటకు మానసిక పునాది యున్నంత మాత్రమున చాలదు. ఇతరశక్తులు కావలెను. కాని, యీపునాదిలేనిదే మనము విషయమును సరిగా చేపట్టజాలము. శక్తివంతమైన యుద్య మమును లేవదీయజాలము. భారతదేశములో ప్రస్తుతము వ్యావసాయ కోద్యమము చాల ప్రధానమైనది; అదియెప్పుడునట్లే యుండవచ్చును. కాని, పరిశ్రమలుకూడ తక్కువ ప్రధానములుగావు. అవి యభివృద్ధి యగును. మనలక్ష్యమేది? వ్యవసాయప్రభుత్వమా లేక పారిశ్రామి కమా? మన కెక్కువగ కృషీవలులముగ నుండకతప్పదు కాని, మనము పరిశ్రమలను వృద్ధిచేయగలము.

మన పరిశ్రమల యజమానులు తమభావములలో చాల వెనుక బడియున్నారు. వారు నేటికి తగిన క్యాపిటలిస్టులుకూడకారు. ప్రజలు చాల బీదవారగుటచే కొనుగోలుశక్తి లేనివారని వారు భావింతురు.

కూలిని హెచ్చించుటను, పనిచేయుకాలమును తగ్గించుటకు వారొప్పు కొనరు. పనిచేయు కాలపరిమితిని పదిగంటలనుండి తొమ్మిదిగంటలకు తగ్గించిరి. దీనివలన అహమదాబాదు మిల్లుయజమానులు జీవితమును తగ్గించిరి. దీనివలన పనివారి యాదాయము తగ్గిపోయెను. పనివాని జీవితప్రమాణముక్షీణించెను. అవకాశమున్నప్పుడు వారు పెద్దలాభము లనుపొందుదురు:కూలి వారు:మామూలుగ నేయుందురు. వారివి మేడలు, దివ్యభవనములు, వీరివి మట్టిగుడిసెలు. వారివి భోగములు, వీరివిరోగ ములు. వారివి కేళీవిలాసములు, వీరివికడుపుమంటలు. వారికి ప్రభుత్వ రక్షణ. వీరిది దిక్కుమాలిన దీనస్థితి. కాని, మనమీావ్యత్యాసములు తప్పనిసరి యనుకొని చలింపక బాధపడకుండ త్రోసివేయుదుము.

పారిశ్రామికకూలీస్థితికంటెను (ఆర్థికముగ) వ్యవసాయకూలీ స్థితి మరెంత నీడుగు. వ్యవసాయదారు కొక సదుపాయము కలదు. అతడు శుభ్రమైన గాలిలో జీవించును. కనుకకూలివాండ్ర క్రుబ్బుకొంపు అతనికిలేదు కాని, యతడు చాల యజ్ఞానములో మునిగియుండుటచే తరచు బహిరంగ వాయుప్రసారముగల తన గ్రామమునుగూడ గాంధీజీ చెప్పినట్లు 'పేడకుప్పగ' చేయును. సంఘక్షేమముకొరకు సహకారము లేక సంయుక్తప్రయత్నభావ మతనిలోలేదు. దీని కతనని గ్రహించుట సుకరమే! కాని, ప్రతివాడు నతనిమీాద చేయి యెత్తువాడే యగుటచే జీవిత మతనికొక నిరంతరవ్యక్తిగతసంగ్రామము; అసలతడెట్లుజీవించు చున్నాడా? యనునది యవిశ్వసనీయమై యాశ్చర్యముగ నుండును. 1928_29లో పంజాబు వ్యవసాయదాదు సగటు నిత్యాదాయము తలకు తొమ్మిదణాలని కనుగొనబడెను. ఇది 1930_31 లో తలకు తొమ్మిదిపైసలకు పడిపోయెను! యు. పి., బీహారు, బెంగాలుల లోని వ్యవసాయదారులకంటె పంజాబురయితు చాలయదృష్టవంతు డని చెప్పబడును. యు. పి. లో కొన్ని తూర్పుజిల్లాలలో (గోరక్పూరు మొదలైనవి) మంచిరోజులలో. నార్థికమాంద్యమునకు పూర్వము, పొలములో పనిచేయు నిత్యకూలి తలకు రెండణాలు.

ఈ పంకిలమునుండి మనము బయటపడుటెట్లు? మనముపా యములను పన్నవచ్చును. కాని యంత యథోగతిలోనున్న ప్రజలను లేవదీయుట కష్టసాధ్యము. కాని, మార్పువలదనుస్వ ప్రయోజక వర్గములనుండియే యదార్థమైన కష్టము కలుగును, సామ్రాజ్యపరి పాలన క్రింద యీ మార్పుకాస్కారము లేనట్లు కాన్పించును. రానున్న వత్సరములలో హిందూదేశమేవైపు చూచును? కమ్యూనిజము, ఫాసిజములు—యీ యుగ ప్రధానలక్ష్యములుగ కాన్పించును సర్ మాల్కాం హైలీ భారతదేశము జాతీయ సామ్యవాదమును స్వీకరించునని జోస్యము చెప్పెను; అనగా నొక విధమగు ఫాసిజము. బహుశః సన్నిహితభవిష్యత్తుకు సంబంధించినంతవర కతడు చెప్పినది యుక్తమే కావచ్చును. హిందూదేశములోని యువకులలోను, యువతులలోను ఫాసిస్టుభావము లిదివరకే కాన్పించుచున్నవి. కాంగ్రెసు వీటిని ప్రతిబింబింప ప్రారంభము చేయుచున్నది. ఫాసిజమునకు దౌర్జన్య పద్ధతులతో సన్నిహిత సంపర్కముండుటచే దౌర్జన్యరాహిత్యము నాశ్రేషించిన కాంగ్రెసు పెద్దలకు దీనియెడల సహజభయము కలదు. కాని స్వంతయాస్తులను రక్షించుచు స్వార్థప్రయోజనములను (నిర్మూలింపక) వారించు సామాజికప్రభుత్వము—ఫాసిజముయొక్క వేదాంతసంబంధమైన పునాది యనబడునది—వారికి నచ్చవచ్చును. పైకిది ప్రాతదాని నిలుపుకొనుచు క్రొత్తదాని నవలంబించు నుత్తమ పద్ధతిగ కాన్పించును. ఒక మూల రొట్టెను తినుచు దానినుంచు కొనుటకూడ సాధ్యమా యనునది వేరువిషయము.

కాని, మధ్యతరగతి యువకులు ఫాసిజమువైపు పరుగిడుదురు. ప్రస్తుతము భారతదేశములో సాక్షాత్తు మధ్యతరగతులలో నొక భాగము విప్లవకరముగ నున్నది; కూలీలు, వ్యవసాయదారులు [పారిశ్రామికకూలీలు మరింత శక్తివంతముగనున్నను] అంతముందుకు రాలేదు. ఫాసిస్టుభావములు విస్తరించుటకే జాతీయమధ్యతరగతియను వైనరంగముగనున్నది. కాని విదేశప్రభుత్వమున్నంతకాలముయూరపియను ఫాసిజమిచ్చట విస్తరింపజాలదు. భారతఫాసిజమువిధాయకముగ భారతస్వాతంత్ర్యము కొరకు నిలువవలెను. కనుక నది బ్రిటిసామ్రాజ్య

తత్త్వముతో నేకము కాజాలదు. అది ప్రజలసహాయము పొందవలెను బ్రిటిషు అధికారము పూర్తిగ తీసివేయబడినచో ఫాసిజము యెక్కువ వేగముగ నభివృద్ధిచెందును.

కాని, బ్రిటిషు అధికారము త్వరగ పోవు సూచనలు లేవు. ఈలోపల ప్రభుత్వ మెంత కఠిన నిర్బంధము నుపయోగించుచున్నను కమ్యూనిస్టు, సామ్యవాద భావములుకూడ విస్తరించుచున్నవి. భారత దేశములో కమ్యూనిస్టుపార్టీ యక్రమసంఘము; ఆ పదమునకు యథేచ్ఛావ్యాఖ్యానము చేయబడుచుండుటచే నభిమానులు, ముందడుగు వేయు లేబరుయూనియనులు నందులో జేర్చబడుచున్నవి.

ఫాసిజము కమ్యూనిజములమధ్య నా యభిమానము పూర్తిగ కమ్యూనిజమువైపుననే యుండును. కాని నేనెంతమాత్రము కమ్యూనిస్టునుకాను. నామూలములింకను బహుశః కొంతవరకు 19 వ శతాబ్దములోనే యున్నవి; 'మానవయుదారత'నుండి నేను పూర్తిగ తప్పించుకొనజాలకపోతిని. ఈబూర్జువాస్వభావము నన్ననుసరించుచుండుటచే చాలమంది కమ్యూనిస్టుల సహజకోపమునకిది కారణమగుచున్నది. ధర్మవన్నములు నాకు గిట్టవు. కారల్ మార్క్సు వ్రాతలు, మరే యితర పుస్తకములు శంకింపరానివని భావించుట, ఆధునిక కమ్యూనిస్టులక్షణముగ కాన్పించు వర్గవిభాగము, వ్యతిరేకులను వేటాడుట నాకు గిట్టవు. రష్యాలో జరిగినదానిని, ముఖ్యముగ శాంతముగ నున్నదినములలో నుపయోగించిన మితిమీరిన దౌర్జన్యమును, నే నంగీకరింపజాలను. అయినను నే నంతకంతకు కమ్యూనిస్టు శాస్త్రమువైపు మొగ్గుచుందును.

మార్క్సు స్టేటుమెంటులుకొన్ని తప్పులు కావచ్చును దీనిని విమర్శించుటకు నే నశక్తుడను. కాని, సాంఘికోత్పాతములను గురించి యతని కసాధారణదృష్టి కలదు. అతడవలంబించిన శాస్త్రపద్ధతియే దీనికికారణము. ఈ పద్ధతిని గతచరిత్రకు ప్రస్తుతవిషయములుకూడ వర్తింపచేసినపుడు మన కివి మరి యేపద్ధతివలన నర్థముకానట్లుస్పష్టపడ గలవు. కనుక నే నేడు ప్రపంచములో జరుగుచున్న మార్పులలోనిరహస్యమును బయటపెట్టు పరిశీలన మార్క్సు శిష్యవర్గమువారి వ్రాతల

మండియే వచ్చుచున్నది. మార్క్సు తరువాత బయలుదేరిన కొన్ని స్వభావములను [మధ్యతరగతిలోని విప్లవ స్వభావమువంటివి] నిర్లక్ష్యముచేసెనని చెప్పుట సులభము. కాని మార్క్సిజములో పిడివాదము లేదు. అదియొక దృష్టిని, విషయమును చేపట్టును. ఆ దృష్టి మన సాంఘిక మార్పుల నర్థముచేసికొనుటకు తోడ్పడి కార్యవిధానమును సూచించును.

ఆ కారణవిధానముకూడ, మార్పుచెందక కరడుకట్టినదికాదు. అది పరిస్థితుల కనుగుణ్యముగ నుండును. అదియే లెనినుదృష్టి. అతడు తన కార్యమును మార్పుచెందు పరిస్థితులకు తగినట్లవలంబించెను. "సంగ్రామకాలము సంయుక్తపరిస్థితుల వివరములు పరీక్షింపకుండ పోరాట సాధనను గురించిన ప్రశ్నకు అవునని కాదని చెప్పసాహసించుట మార్క్సుసందేశమును పూర్తిగ విడిచిపెట్టుట" యని యతడు చెప్పెను.

ఈవిశాలదృష్టి, యదార్థజ్ఞానముగల కమ్యూనిస్టు కొంతవరకు సాంఘిక జీవిత చైతన్యస్వభావమును గుర్తించును. అతనికి రాజకీయములు చీకటిలో తడవుకొనుటవలె, కేవలము సమయముకొరకు కాచుకొనియుండు చరిత్రవలె కాన్పించవు. అతను మనఃపూర్వకముగ నెదుర్కొను పోరాటము, చేయు త్యాగము నతని లక్ష్యములను, ఆశయములను సార్థకముచేయును. మానవ విధిని సాధించుటకు ముందువోవుచున్న మహాసైన్యములో తానొక భాగమని యతడు గ్రహించును. చరిత్రతో క్రమక్రమముగ నడుచుచున్నట్లతనికి ద్యోతకమగును. బహుశః యనేకమంది కమ్యూనిస్టులిట్లు భావింపరు. లెనినుమాత్రమే యతని కార్యవిధానమునంత పటుత్వముగనొనరించిన జీవితమంతయు నొక్కటియను భావము కలిగియుండును కాని యతనియద్వైత వేదాంతము నర్థముచేసికొనిన ప్రతికమ్యూనిస్టు కొంత వరకు దీనిని గ్రహించియుండును. కొంతమంది కమ్యూనిస్టులతో నొప్పువహించుట కష్టము. వారితరులకు కోపము తెప్పించు చిత్రమైన పద్ధతి కనిపెట్టిరి. కాని, వారనేక కఠినపరీక్షలపాలైరి. సోవియటు

యూనియను వెలుపలవారగు సంఖ్యాకములగు కష్టముల నెదుర్కొనవలసెను. నే నెల్లప్పుడు వారి యమిత ధైర్యమును, త్యాగశక్తిని మెచ్చుకొంటిని. అసంఖ్యాక ప్రజ లనేకవిధముల బాధపడునట్లు వారును బాధపడుదురు. కాని, సర్వశక్తివంతము, క్రూరము నగు విధిముందర వారట్లు గ్రుడ్డిగ ననుభవింపరు. వారు మానవులవలె బాధపడుదురు. అట్టి బాధలో నొకవిషాదకరమగు నుదారత కలదు.

రష్యాలోని సాంఘిక ప్రయత్నముల జయాపజయములు మార్క్సు సిద్ధాంతబలమును ప్రత్యక్షముగ బాధింపజాలవు. అనేక విషమపరిస్థితులేకమయి, లేక ననేకప్రభుత్వములేకమయియా ప్రయత్నములను తారుమారు చేయవచ్చును. కాని, శక్తివంతములగు నా సాంఘిక ప్రబోధములు చిరస్థాయిగ నుండును. అచ్చటజరిగిన యనేక విషయములను నేను సహజముగ ప్రేమింపజాలకపోయినను ఆ సిద్ధాంతము ప్రపంచమునకు తారకమంత్రమని నేను భావింతును. వారి కార్యములు నాకు పూర్తిగ తెలియవు; నేనువానిని విమర్శించుటకు తగిన స్థితిలో లేను. నా ప్రధాన భయమేమనిన నమితమగు దౌర్జన్యము, నిర్బంధములు చెడుకు దారితీయవచ్చును. దీనిని తీసివేయుట కష్టము కావచ్చును. కాని, రష్యాను నడుపు ప్రస్తుతనాయకుల సుగుణమేమనిన వారు తమ తప్పిదములనుండి పాఠములను నేర్చుకొనుటకు భయపడరు. వారు తమయడుగులను వెనుకకువేసి పునఃసృష్టి చేసికొన గలరు. వారెల్లప్పుడు తమలక్ష్యమును తమయెదుట నుంచుకొనెదరు. కమ్యూనిస్టు యింటర్నేషనల్ ద్వారా వారితర దేశములలో చేసిన ప్రయత్నములు విచిత్రముగ విఫలమయ్యెను. ఇప్పుడవి చాల తగ్గింపబడినట్లు కాన్పించును.

హిందూదేశమునకుతిరిగివత్తము. బాహ్యపరిస్థితులిచ్చటిగమనమును త్వరితముచేసిన నే తప్ప సామ్యవాద,కమ్యూనిజములుదూరవిషయములుగ కాన్పించును. మేము కమ్యూనిజముతో కాక కులతత్త్వములతో వ్యవహరింపవలెను. కులములరీత్యాహిందూదేశ మంధకార యుగములోనున్నది. రాజకీయ వ్యక్తులు స్వల్ప విషయములతోను,

కుట్రలతోను, పన్నాగములతోను తమశక్తులను వ్యర్థము చేయుచున్నారు వీనిలో నొకరినొకరు మించవలెనని చూచుచున్నారు. ప్రపంచమును మరింత కళ్యాణప్రదముగ నానందదాయకముగ చేయుటకు వారెవరును ప్రయత్నింపరు. బహుశః యిదియొక తాత్కాలిక స్థితి, త్వరలోనే యిది పోవచ్చును.

కాంగ్రెసు చాలవర కీకుల యజ్ఞానమునుండి దూరముగ నుండెను. కాని దానిదృష్టి పిల్లబూర్జువాదృష్టి. కనుక నా దృష్టితోనే చికిత్స చేయగోరుదును. ఈపద్ధతివలన నది జయముపొందజాలదు. నేడది మధ్యతరగతిలోని క్రిందితరహావారికి ప్రాతినిధ్యము వహించును. కాని యది పైకికాన్పించునంత శక్తివంతముగ లేదు. దానిని రెండు ప్రక్కలనుండి రెండుశక్తులు నొక్కుచున్నవి. ఒకటి యన్ని బందోబస్తులు కలిగియున్నది. రెండవది దుర్బలముగ నున్నను త్వరితముగ వృద్ధిచెందుచున్నది. భవిష్యత్తు చెప్పుట కష్టసాధ్యము. అది దాని చారిత్రిక ధర్మమైన జాతీయస్వాతంత్ర్యమును పొందుటకు పూర్వము బందోబస్తులతోనున్న రెండవ పక్షమువైపు పోజాలదు, కాని దానికా విజయము చేకూరులోపల నితరశక్తులు బలపత్తరములై దానిని తమవైపు త్రిప్పుకొనవచ్చును; లేదా క్రమముగ దాని కుద్వాసము చెప్పవచ్చును. జాతీయస్వాతంత్ర్యము సాధింపబడువరకు కాంగ్రెసు హిందూదేశములో ప్రధానపాత్ర వహించును.

# ఉపసంహారము

కర్మచేయుట మనవిధి, ధర్మము కాని మనకర్మ పూర్తిచేయుట మనచేతులలో లేదు.

—టాల్ మడ్.

నే నీ కథచివరకు వచ్చితిని. నా జీవిత వృత్తాంతమును (ఉన్న విధమున) నేటివరకు (1935 ఫిబ్రవరి 14, అల్మోరాజిల్లాజయిలు) తెచ్చితిని. నేటికి మూడు నెలలక్రితమీజయిలులో నే నా నలుబదియైదవ జన్మదినము జరిపితిని. నే నింకను చాలవత్సరములు జీవించవలసియున్నదని నేననుకొనెదను. ఒక్కొక్కప్పుడు వయోభారము, అలసట నన్నటునటబెట్టును. ఇతరకాలములో నపరిమితోత్సాహశక్తులతో తులతూగుచుందును. నా శరీర మాటుపాటుల కాగగలదు. నా మనస్సు ప్రహారణములనుండి సుకరముగ కోల్కొన గలదు. కనుక హఠాత్తుగ నన్నొక విఘ్నమింగనిచో నే నింకను చాలకాలము జీవింపగలనని భావించెదను.

బహుశః యీసాహసములు చాల యుద్రేకజనములుగ నుండకపోవచ్చును. చిరకాలము జయిలులోనుండుటను సాహసమని యనజాలము. ఇందులో నసామాన్యత లేదు. నే నీవత్సరములను లక్షలకొలది నా దేశ స్త్రీపురుషులతో కూడ ననుభవించితిని. మారుచుండు భావములు, ఉత్సాహానుత్సాహములు, తీవ్ర కార్యకలాపము, బలాత్కార యేకాంతము యివి మా సామాన్యచరిత్ర. నేను ప్రజలలో నొకడను. నేను దానితో కదలుచు నొక్కొక్కప్పుడు దానిని నడుపుచు దానిచే పాలింపబడుచుంటిని. అయినను నేనొకవ్యక్తిగ నుండి ప్రజాసమూహములలో ప్రత్యేకజీవితమును జీవించెడివాడను.

ఈసంవత్సరము లితరవిషయములతోపాటు నాకొక యమూల్య వరమును ప్రసాదించెను. జీవితము నా కంతకంతకు తన్మయత్వము నొందించు సాహసకార్యమువలె కాన్పించును. అచ్చట మనము నేర్చుకొనవలసిన దెంతయో కలదు, చేయవలసిన దెంతయో కలదు. నే నభివృద్ధిపొందుచున్నట్లొక నిరంతర భావముండెడిది. నా కింకను ఆ భావమే కలదు. అది నా యత్నములకు, గ్రంథపఠనమునకు నూతనోత్సాహము నిచ్చును. సాధారణముగ జీవితమును సార్థకము చేయును.

ఈ కథవ్రాయుటలో నేడు నా భావములను, మనఃప్రవృత్తులను, తెలుప యత్నించితిని. నా భావములను చిత్రింపగోరితిని. భూతభావమును తిరిగి గ్రహించుట సులభముకాదు. సంభవమగు సంభవములను మరచిపోవుటయు సులభముకాదు; కనుక తరువాత కలిగిన భావములు నా మొదటిరోజులలోని చరిత్రకు కొంత మెరుగు పెట్టి యుండవచ్చును. కాని, నా మానసికాభివృద్ధిని, ప్రధానముగ నాలాభముకొరకు చిత్రించుటయే నాయుద్దేశ్యము. నేను వ్రాసిన దంతయు నా యుండినవిధమును గాక నే నొకప్పు డెట్లుండగోరితినో లేక యుంటినని భావించితినో దానిని తెలుపు చరిత్ర.

కొన్ని నెలలక్రిందట సర్ సి.పి. రామస్వామయ్యరు నేను ప్రజా సామాన్యభావములకు ప్రతినిధిని కానని నాత్యాగములచేతను, ఆదర్శ ములచేతను, నావిశ్వాసములోనున్న యావేశముచేతను, నేనుమరింత యుపద్రవకరుడనని చెప్పెను. ఈస్వవిషయములలో నేనతనితో జగడము పెట్టుకొన నిచ్ఛగింపను మేము నేక వత్సరములనుండికలుసుకొన లేదు. కాని, చిరకాలము క్రిందట మేమిరువురము హోమురూలుసంఘమునకు సంయుక్త కార్యదర్శులము. తరువాత అనేక సంభవములు జరిగెను. సర్ సి. పి. పైకిపోవుచు తలతిరుగునంతటి యున్నతస్థితికి వెళ్ళెను. నేను భూమిమీదనే భూమికిసంబంధించి యుంటిని. ఇప్పుడు మా కిరువురకు సామ్యమేదియు [సామాన్య జాతితప్ప] లేదు నేడతడు హిందూదేశ ములో బ్రిటిషుప్రభుత్వమును సమర్థించు జగజెట్టి హిందూదేశము లోను, యితరచోట్లను నిరంకుశత్వమును శ్లాఘించువాడు. స్వాయముగ

వతడొక భారతసంస్థానములో వెలుగొందు నిరంకుశత్వ భావ ణము. మేము చాల విషయములలో భేదింతుము. కాని యొక విషయములో-నేను ప్రజాభావమునకు ప్రతినిధినిగాదను విషయములలో నేకీభవింతుము.

నే నెవరికేని ప్రతినిధినా? యనియాశ్చర్యపడుచుందును. చాల మందికి నాయెడ మిత్రభావము, దయయున్నను నేనెవరికిని ప్రతినిధిని కాననియే భావింతురు. నే నొకవింతయైన ప్రాచ్య, పాశ్చాత్య 'చౌచౌ' నైతిని. ప్రతిచోట చోటులేనివాడను. ఎచ్చట నాశ్రయములేని వాడను. బహుశః నా భావములు, జీవితమును గ్రహించు విధము ప్రాచ్యమునకు గాక పాశ్చాత్యమనబడుదానికే యెక్కువగ సంబంధించియుండును. కాని, హిందూదేశమునన్నంటిపెట్టుకొనియుండును. నా వెనుక, నెక్కడనో మినుకుమినుకుమను స్మృతిలో శతపురుషాంతములనాటి బ్రాహ్మణజాతిస్మృతి కలదు. నేనాభూతకాల వంశపారంపర్యమును నా నవీనస్వార్జితమును పోగొట్టుకొనజాలను. అవి రెండును, నా భాగములు. అవి నాకు తూర్పు, పశ్చిమములు. నేను పడమర దేశములలో క్రొత్తవాడను, విదేశీయుడను. నేను వానికి చెందను. కాని, నా నిజదేశములోకూడ నొక్కొక్కప్పుడు, పరదేశీయునివలె భావింతును

దూరపు కొండలు నునుపుగను, యెక్కుటకు సులభముగను కాన్పించును, శిఖరమా! ఆహ్వానింపచుచుండును. కాని, యెక్కినకొలది కష్టములు కాన్పించును. పైకి వెళ్ళినకొలది ప్రస్థానము మరింత శ్రమ జనకముగ నుండును. శిఖరము మేఘమండలములోనికి పోవుచుండును. అయినను. ఆ యారోహణము ప్రయత్నార్హము అదియొక ప్రత్యేకానందమును, తృప్తిని యిచ్చును. బహుశః సంగ్రామమే జీవితమునకు విలువనిచ్చును. కాని, యది తుదిపర్యవసానముకాదు, ఏది యుక్త మార్గమో తెలిసికొనుట తరుచు కష్టము. ఒకొక్కప్పుడయుక్తమైనది, సులభముగ తెలియును దానిని మానివేయుట కొంత మెరుగు. సోక్రటీసు ఇట్లు చెప్పెను: "మృత్యువనగానేదియో నాకు తెలియదు- అది మంచిదేకావచ్చును. నేను దానికి వెరువను. కాని మన భూత

కాలమును పీడుట చెడ్డవిషయమని నేనెరుగుదును. చెడ్డదని నాకు తెలిసినదానికంటె మంచిదే యగుట కవకాశమున్నదానిని నేను వరింతును.”

నేను జయిలులో గడిపిన వత్సరములు! నా భావములలో మునిగి యేకాకినై కూర్చొనుట! ఒకదానివెనుక నొకటి విస్మృతిలోనికి పోయిన యెన్ని ఋతువులను నేను చూచితిని! శుక్ల, కృష్ణపక్ష చంద్రుల నెందరను చూచితిని! నిర్లక్ష్యముగ, సగర్వముగ నడచి పోవు నక్షత్రరాశి నెన్నిసార్లు చూచితిని! నా యౌవన 'గతరాత్రు' లెన్ని యిచ్చట మణగిపోయినవి! ఒక్కొక్కప్పుడు మృతిచెందిన ఈ గత దివసప్రేతములు లేచుచు "ఇది ప్రయోజకారియా? "యని ప్రశ్నించును. సమాధానము నిశ్చందేహము. నా ప్రస్తుతజ్ఞానము, యనుభవము కలిగి తిరిగి జీవించుటకు నా కవకాశమిచ్చుచో నేను నా జీవితములో ననేకమార్పులను చేయుటకు యత్నించెదను. నా గతచరిత్ర ననేకవిధముల నభివృద్ధిచేయ యత్నించెదను. కాని, ప్రజాకార్యములలోని నా ప్రధాన నిశ్చయములట్లే యుండెను. నేను వానిని మార్పుచేయలేను. అవి నాకంటె బలవత్తరములు. నా వశములో లేని యొక శక్తి నన్ను వానివైపు తరిమెను.

నా నిర్బంధముజరిగి సరిగ సంవత్సరమయ్యెను. నా రెండేండ్ల శిక్షలో నొక సంవత్సరము గతించెను. మరియొక నిండుసంవత్సరము కలదు. ఈసారి విడిఖయిదు కనుక రిమిషనులులేవు. నేను ఆగస్టులో బయటనున్న పదకొండురోజులు నా శిక్షాకాలములోచేర్చిరి. ఈ సంవత్సరముకూడ గడచిపోవును. నేను బయటపడుదును. తరువాత? నాకు తెలియదు. కాని నా జీవితములో నొకయధ్యాయము ముగిసెననియు, మరియొకటి ప్రారంభమగుననియు నేను భావించితిని. అదేదియో నేను స్పష్టముగ నూహింపజాలను. జీవితగ్రంథములోని పుటలు మూయబడి యుండును.

సమాప్తము.

## ప్రా పి వ త దు వ రి

బేడెన్‌వీలరుపాల్వర్జువాల్డు,
అక్టోబరు 25, 1935.

గత మే మాసములో నా భార్య భోవాలీవీడి మరికొంతచికిత్స కొరకు యూరపు వెళ్ళెను. ఆమె వెళ్ళినతరువాత నేను భోవాలీ వెళ్ళలేదు. క్వెట్టా భూకంపమునుగురించి వార్తలు వచ్చెను. కొంత కాలము తక్కినదంతయు మరువబడెను. కాని యెంతకాలమో కాదు. భారతప్రభుత్వము తనను,తనవిధములను మరచిపోనీయదు. కాంగ్రెసు ప్రెసిడెంటు—భారతదేశ భూకంపమునుగురించి మరేవ్యక్తికంటెను యెక్కువ తెలిసినవాడు నయిన రాజేంద్రబాబును క్వెట్టాకు పోనీయ లేదు. గాంధీజీని మరేప్రజానాయకునినిహాడ వెళ్ళనీయ లేదు క్వెట్టాను గూర్చి వ్రాసినందులకనేక భారతపత్రికలుధరావతులనుకోల్పోయెను.

ప్రతిచోట సైనిక భావమే! పోలీసుదృష్టియే:— అసెంబ్లీలోను, నాగరికప్రభుత్వములోను, సరిహద్దులలోను బొంబుప్రేలతలలోను — అదేదృష్టి. ఇండియాలోను, బ్రిటిషుప్రభుత్వము ప్రజలలోని యనేక శాఖలతో శాశ్వతముగ పోరాడుచున్నట్లు కాన్పించును.

పోలీసుశాఖ యుపయోగకరము. అవసరమునగు శాఖ. కాని పోలీసుమయమయి పోలీసులాఠీలతో నిండిన ప్రపంచము వాసయోగ్యము కానేరదు. దౌర్జన్యమును నిరోధములేకుండ నుపయోగించుటచే దానికి గురియైనవాడవమానమును, మానవత్వనిపొందు నట్లే దాని నుపయోగించువాడును అవమానమునొందునని తరచు చెప్పబడును. ఉన్నతసేవలలోని, ముఖ్యముగ ఐ. సి. యస్. శాఖ లోని, క్రమాభివృద్ధిచెందు మానసిక, నైతికపతనముకంటె నాశ్చర్య కరమైనది, నేడు భారతదేశములో మరియొకటి కాన్పించదు. ఇది పెద్దయధికారములలో చాల స్పష్టముగ కాన్పించును. కాని, యిది న్యూనతమువలె నన్ని సేవలలోను కలదు, పై పదవిలోనికి పోవుటకవ

కాలము వచ్చినపు డీ నూతనతత్త్వము నెవ డెక్కువగ ప్రదర్శించునో వాడు విధాయకముగ పైకి పోవును.

సెప్టెంబరు నాల్గవ తేదీని నన్ను హఠాత్తుగ ఆల్మోరా జయిలు నుండి విడిచిపెట్టిరి. నా భార్యస్థితి విషమించెనని వార్తలువచ్చెను. ఆమె జర్మనీలో ష్వార్జువాల్డులోని బేడెన్‌వీలరులో చికిత్సనొందు చుండెను. నా శిక్ష రద్దుచేయబడెనని చెప్పి నన్ను విడచివేసిరి. నేను విమానములో యూరపు పరుగిడితిని.

యూరపు అల్లరిగనుండెను. యుద్ధభయ మావరించుచుం డెను. ఆర్థికదుస్థితి యెదురుచూచుచుండెను. అబిసీనియా ముట్టడింప బడెను. ఆమె ప్రజలు బాంబులతో మాడ్చివేయబడిరి. వివిధ సామ్రాజ్యోద్ధతులు తలవడుచు నొకదానినొకటి భయపెట్టుచుం డెను. ఇంపీరియల్ ప్రభుత్వములలో నతిపెద్దదియైన యింగ్లండు తనక్రిందనున్న ప్రజలపై బాంబులను వేయుచు క్రూరముగ నణచి వేయుచు శాంతికొరకు,లీగుసమ్మతికొరకుచూచును కాని యిచ్చట 'నల్లయడవి'లో నంతయు నెమ్మదిగను ప్రశాంతముగను నున్నది. పొగమంచు లోయలనావరించి దూరములోనున్న ఫ్రాన్సు సరిహద్దు లను కప్పివేయుచుండ నేను నిరీక్షించుచు వానివెనుక నేమి యున్నదా యని యాశ్చర్యపడుచుందును